# పిఠాపుర సంస్థానము కవిపండిత పోషణ

ఉస్మానియా విశ్వవిద్యాలయమువారి
పిహెచ్. డి. పట్టపరీక్షకు సమర్పింపబడిన
సి ద్ధాం త వ్యా స ము
1 9 7 3



ర చ యి త్రి
సి. కమలా అనార్కలి,
ఎమ్. ఎ., పిహెచ్. డి.

సర్వహక్కులు
గ్రంథకర్త్రివి

రుధిరోద్గారి, ఫాల్గుణము

ప్రతులు 1000.

మూల్యము :
60 రూ॥లు

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ
ఆర్థికసహాయము పొందినది.

ప్రతులకు :
సి. కమలా అనార్కలి, ఎమ్. ఎ., పిహెచ్. డి.,
ఆంధ్రభాషోపన్యాసకులు,
పి. వి. ఆర్. ట్రస్ట్ డిగ్రీ కాలేజి,
కాకినాడ.

ముద్రణ :
వసంతప్రింటరుస్, కాకినాడ,
శ్రీపతిప్రెస్, కాకినాడ.

# నివేదిక

సాహిత్యపోషణముచేసిన ఆంధ్రసంస్థానములలో పిఠాపురము సంస్థానము ప్రథమస్థానము వహించినదనుట అతిశయోక్తి కాదు. నేను డాక్టరేటుపట్టమునిమిత్తమై సాహిత్యరంగమున పరిశోధన చేయవలయునని యోచించు సమయమున, మా కుటుంబమున కాప్తులు, శ్రేయోభిలాషులునగు పూజ్య శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు పిఠాపుర సంస్థానమున (వర్థిల్లిన) సాహిత్యముపై పరిశోధనచేసిన బాగుగా నుండునని నాకు సలహా నిచ్చుచు, నన్ను ప్రోత్సహించిరి. చారిత్రకముగా తీర్థయాత్రాస్థలముగా, సాహిత్యపరముగా పిఠాపురమునకుగల ప్రశస్తి నేను బాల్యమునుండియు వినుచున్నందునను, పిఠాపురము నా జన్మస్థల మగుటవలనను, వారుచేసిన సూచన నా కాహ్లాదము కలిగించినది. ఈ యంశము పరిశోధనచేయుటకు యోగ్యమైనదని ఉస్మానియా విశ్వవిద్యాలయ ఆంధ్రశాఖాధ్యక్షులగు డా॥ దివాకర్ల వెంకటావధానిగా రామోదించి, అందుగూర్చి పరిశోధనచేయుటకు నా కనుజ్ఞ నిచ్చిరి.

ఆంధ్రప్రదేశ్ స్టేట్ ఆర్కైవ్స్ (A. P. State Archives) వారీ విషయముపై తమయొద్దగల సామగ్రి నుపయోగించుకొనుటకు నా కనుమతి యొసంగుటయేగాక, పరిశోధన కొనసాగించుటకు 'ఫెలోషిప్' (Fellowship) నిచ్చి ఆర్థికముగా రెండున్నర సంవత్సరములు సహాయపడిరి.

ఇక పదునేడవ శతాబ్ది పరమార్థమునుండి యీనాటివరకును పిఠాపురము సంస్థానమున జరిగిన సాహిత్యవ్యాసంగము విస్తారమైనది. కనుక దీనికి సంబంధించిన విషయసేకరణ మిగుల శ్రమకరమైనది. అయినను పెక్కు గ్రంథాలయములయొక్కయు, పలువుర కవిపండి

తుల యొక్కయు, స్థానికులయొక్కయు సహాయమున నేను సాధ్య మైనంత విపులముగా విషయసేకరణ చేయగలిగితిని. అట్లు శ్రమపడి నేను సేకరించిన సామగ్రిని నా పరిశోధనవ్యాసమున ప్రదర్శించు టలో నీక్రింది ప్రణాళిక నేర్పరచుకొంటిని.

1. సంస్థానాధిపతుల రచనలు
2. సంస్థానాధిపతులకు అంకితముచేయబడిన రచనలు
3. ఆస్థానకవుల రచనలు
4. (సాహితీసృష్టి) ఆశ్రితుల రచనలు
5. ఆస్థానముతో సంబంధములేకున్నను, సంస్థానములో నివ సించినవారి రచనలు

(వీనిలో) గ్రంథపరిశీలనమున, పైనచూపబడిన తరగతులలో ఉత్తరోత్తరము ప్రాధాన్యము తగ్గించుట జరిగినది. నవీన రచనల కన్నను, ప్రాచీనరచనల కెక్కువ ప్రాముఖ్య మీయబడినది. అధ్యాయవిభాగము కాలక్రమము ననుసరించి చేయబడినది.

ఆధునికయుగమందలిసాహిత్యములో, సంస్థానముతో ప్రత్యక్ష సంబంధమున్నవారి రచనలకుమాత్రము ప్రాధాన్య మీయబడినది. శ్రీ పానుగంటివారిపై నొక పరిశోధక వ్యాసము ప్రచురింపబడెను. శ్రీ చిలకమర్తివారిపై పరిశోధన జరుగుచున్నది. కనుక వీరి రచనల పరిశీలనము దిఙ్మాత్రముగా చేయబడినది. ప్రత్యేకసిద్ధాంత వ్యాస ములు వ్రాయదగినవారి రచనలుకూడా సంస్థానముతో సాక్షాత్సం బంధమున్న వరకే పరిశోధనచేయుట జరిగినది. నవీనయుగమున వెలు వడిన సాహిత్యము పరిమాణమునందు, వైవిధ్యమునను అతి విస్తృత మగుటవలన, దానినిగూర్చి సమగ్ర పరిశీలనము చేసినచో మరియొక సిద్ధాంతవ్యాసమగు నవకాశ ముండుటవలనను, దానినికూడ నేను కొంతకొంత స్పృశించి విడిచితిని.

ఇక నీపరిశోధనావ్యాసమునకు తొలుతగా ఆచార్య దివాకర్ల వెంకటావధానిగారు ప్రణాళిక వేసియిచ్చుటయేగాక ఏ సమయము నందైనను ఉచితమగు సలహాలనిచ్చుచు వచ్చిరి. పిమ్మట విశ్వ విద్యాలయమున నేను పిహెచ్. డి. కి పేరు నమోదు చేయించు కొనినది మొదలు, సుమారు ఒక సంవత్సరకాలము నాకు గురుత్వము వహించి, అన్ని విధముల మార్గదర్శకులైనవారు డా॥ కేతవరపు వేంకట రామకోటిశాస్త్రిగారు. ఈ పండితులకు నాకృతజ్ఞతా పూర్వకమగు నమస్సులు.

'టెక్నికల్'గా ఎటువంటి సందేహము కలిగినను, వెనువెంటనే తీర్చుచు నాపై వాత్సల్యముచూపిన డా॥ శరణ్ గారు ('ఆనరరీ ప్రొఫెసర్-ఉస్మానియా యూనివర్సిటి) శాస్త్రగ్రంథ పరిశీలనము నందు, సంస్కృత కావ్యపఠనమునందు సంస్థానమునందలి విశేష ములను తెలుపుటయందు అధికముగా తోడ్పడిన కొమానపల్లి వాస్తవ్యులు బ్రహ్మశ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు, వైష్ణవ సాంప్రదాయాది విశేషాంశములను తెలిసికొనుటలో సహాయ పడిన శ్రీ శ్రీభాష్యం అప్పలాచార్యులుగారు (సంస్కృత శాఖా ధ్యక్షులు- పి. ఆర్. గవర్నమెంటు కాలేజి, కాకినాడ), తమ సంస్థా నమును గురించి, రచనలనుగురించి తెలుపుటలో ఇతోధికముగా సహాయమొనరించిన పిఠాపుర యువరాజాగారు – శ్రీ వేంకట మహీ పతి గంగాధర రామారావుగారు, పుస్తకసేకరణకు, ఇతర గ్రంథా లయములలోని పుస్తకముల వివరములను తెలుపుటకు సహకరించిన శ్రీ నిడదవోలు సుందరేశ్వరరావుగారు–ఈ పెద్దలకు నాకృతజ్ఞతలు.

తమ గ్రంథాలయములలోని ముద్రితాముద్రితగ్రంథములను పరిశీలించుట కనుమతించిన – తిరుపతి ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స లైబ్రరీ, మదరాసు–కానెమెరాలైబ్రరీ, కాకినాడ–ఆంధ్ర సాహిత్య

పరిషత్తు గ్రంథాలయము వీని అధికారులకు, అనుబంధమున పేర్కొనిన ఇతర గ్రంథాలయాధికారులకు నాకృతజ్ఞతలు.

ఈ పరిశోధన చేయుటకు నాకవకాశము కల్పించిన ఉస్మానియా విశ్వవిద్యాలయాధికారులకు, పరిశోధన కొనసాగించుటకు ఆర్కైవ్స్ సహాయమందచేసిన ఆంధ్రప్రదేశ్ స్టేట్ ఆర్కైవ్స్ అధికారులకు నా కృతజ్ఞతలు.

నాకు అమూల్యమైన అముద్రిత గ్రంథములనిచ్చిన శ్రీ కనకదండి గోపాలకృష్ణశాస్త్రిగారు, శ్రీ ప్రతివాది భయంకరాచార్యులుగారు, శ్రీ చిత్రాడ శ్రీరామారావుగారు, డాక్టరు తణికెళ్ళ సత్యనారాయణగారు, కీ. శే. కోకా శివనాథశాస్త్రిగారు- వీరికి నా హృదయపూర్వకమైన నమోవాకములు.

నా పరిశోధనవ్యాసమును శ్రమకోర్చి, సకాలములో నాకందించిన తెలుగు టైపిస్టు శ్రీ జె. శ్రీరామమూర్తిగారికి నాకృతజ్ఞతలు. ఈ తెలుగు 'టైపురైటరు' మా పిఠాపురము రాజకుమారులగు కీ. శే. వేంకట మహీపతి సూర్యారావుగారిచేత కనుగొనబడిన "చిన్న మాంబాంధ్ర ముద్రాలేఖిని" యగుట ముదావహము.

ముఖ్యముగా నాపరిశోధనావ్యాసంగమునకు పర్యవేక్షకులుగా నుండి, నావ్యాసము విషయమై అత్యధికముగా శ్రమించి, కాలాకాలముల భేదములేకుండా, ఏ సమయమునందైనను నావ్యాసమును చూచుటకు సిద్ధపడి, అమూల్యములగు సలహాలనొసగి నాపరిశోధక వ్యాసమునకు పటిష్ఠతను చేకూర్చినవారు గురుపాదులు, పితృసమానులునగు డా. పాటిబండ మాధవశర్మగారు, నేను ఆజన్మాంతము కృతజ్ఞత చూపవలసినతీరున నామ్రోయమునుతీర్చిదిద్దినసహృదయులు.



# ఉపోద్ఘాతము

"నిరాశ్రయా న శోభన్తే పండితా వనితా లతాః"— అను నానుడిలోకవిదితము. ప్రభువుల దోహదము లేనిదే సాహిత్యోద్యాన వనమున కావ్యపుష్పములు సర్వాంగసుందరముగా వికసింపనేరవు. ప్రాచీనకాలమునుండియు సాహిత్యము ప్రభుపోషణమునందే విస్తారముగా వర్ధిల్లినది.

తెలుగుభాషలో తొలికృతిగా భావింపబడుచున్న మహాభారతము ననువదించిన కవిత్రయములో ప్రథముడగు నన్నయ భట్టారకుడు రాజనరేంద్రు నాస్థానకవి. రాజరాజు భారతమును తెనిగింపుమని కోరగా, ప్రభువు కోరికపై, నన్నయ్య నారాయణభట్టు సహాయమున భారతాంధ్రీకరణమునకు పూనుకొనెను. ఈ ఆంధ్రీకరణము అరణ్యపర్వము - చతుర్థాశ్వాసముతో ముగిసెను. నన్నయ్య-

"ఉ. పాయక పాకశాసనికి భారతఘోరరణంబునందు నా
రాయణునట్లు వాసిగ ధరామరవంశవిభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయధురంధరుఁడుం దనకిష్టుడున్ సహా
ధ్యాయుఁడునైన వాడభిమతస్థితిఁదోడయి నిర్వహింపఁగాన్."

(ఆది. ప. ప్ర. 25)

అని నారాయణభట్టు తనకు తోడైనట్లు లిపెను. ఈ నారాయణభట్టు రాజరాజు ఆస్థానమందు విద్వాంసుడు. ఇట్లు రాజాశ్రయమున కవులు సాహిత్యసృష్టి చేయుచు వచ్చుట పరిపాటియైనది.

రాజులే కాక వారి సామంతులును సాహిత్యము నందాసక్తి కలిగియుండిరి. కవులను పోషించుటయే కాక స్వయముగా కావ్య నిర్మాణము చేసినవారును కలరు. అట్టివారిలో శివకవియగు నన్నెచోడదేవు డొకడు. ఇతడు కుమారసంభవమను కావ్యమును రచించి జంగమ మల్లికార్జునున కంకితము చేసెను.

నన్నెచోడునివలె కవియై ఖ్యాతిగాంచిన మరియొక సామంత రాజు గోన బుద్ధారెడ్డి. ఇతడు రంగనాథరామాయణమను ద్విపద కావ్యమును సృజించెను. ఉత్తరరామాయణము నతని పుత్రులగు కాపవిడల భూపతులు రచించిరి.

ఇక కవిత్రయములో ద్వితీయుడగు తిక్కన సోమయాజి తెలుగు చోడరాజగు మనుమసిద్ధి కడ నమాత్యుడుగ నుండి కవితారచన చేసెను. తిక్కన నిర్వచనోత్తర రామాయణమును రచించి మనుమ సిద్ధి కంకితము చేసెను. తిక్కన కృతమగు ఆంధ్రమహాభారతము పదునేను పర్వములును హరిహరనాథునకు కృతి యీయబడెను. కేతలదండి 'దశకుమార చరిత్రము' నాంధ్రీకరించి తిక్కన కంకితము చేసెను.

అటుపిమ్మట కవులు ప్రభువులకడనున్న ఉన్నతోద్యోగులకు కావ్యముల నంకితమిచ్చుటయు కానవగును. రెండవ ప్రతాపరుద్రుని యశ్వసాహిణియగు సాహిణి మారనకు 'భాస్కరరామాయణ' మంకిత మీయబడెను. కవు లీ రీతిగా వారిని మెప్పించి రాజాశ్ర యము సంపాదించియుందురు.

కవిత్రయములో కడపటివా డగు నెఱ్ఱాప్రగడ రెడ్డిరాజ్య స్థాపకుడగు ప్రోలయ వేమారెడ్డిచేత నాదరింపబడెను. ఎఱ్ఱన భార తారణ్యపర్వ శేషము నన్నయ పేరిటనే తెనిగించి రాజరాజునకే అంకిత మిచ్చెను. హరివంశము తన్నాదరించిన ప్రోలయ వేమన కంకితము చేసెను. ఇట్లు కవిత్రయమువారు మువ్వురును ప్రభుపోషణమందే కవితావ్యాసంగ మొనరించిరి.

రాజమహేంద్రప్రభువగు చాళుక్య విశ్వేశ్వరరాజునకు విన్న కోట పెద్దన కృతమగు 'కావ్యాలంకారచూడామణి' అంకిత మొసగ బడెను.

విజయనగర సంస్థాపకులలో నొకడగు బుక్కరాయల యాశ్రితుడు ఉత్తర హరివంశకర్తయగు నాచనసోముడు.

తదుపరి ఎందరో ప్రభువులను, ఉన్నతోద్యోగులను ఆశ్రయించి సాహిత్యోద్యానవనమున సుమలతల వెలయించి పుష్పింపచేసిన మహాకవి - కవిసార్వభౌమ బిరుదాంకితుడగు శ్రీనాథుడు. బహుకావ్యములను ప్రతిభావంతముగా సృజించిన శ్రీనాథునిపేరిటనే 'శ్రీనాథయుగము' వెలసినది. శ్రీనాథుని రచనలలో - మరుత్తరాట్చరిత్ర, శాలివాహన సప్తశతి, పండితారాధ్య చరిత్రములు అలభ్యములు. వీనిలో పండితారాధ్యచరిత్రము మామిడి ప్రెగ్గడయ్యకంకితము చేయబడినట్లు తెలియుచున్నది. శ్రీనాథుడు 'శృంగార నైషధము' పెదకోమటి వేముని మంత్రియగు మామిడి సింగనార్యునకు, 'హరవిలాసము' కొండవీటి ప్రభువులకు సుగంధద్రవ్యములు సమకూర్చెడి అవచి తిప్పయసెట్టికి, 'భీమేశ్వరపురాణము' బెండపూడి అన్నయ్యమంత్రికి, 'కాశీఖండము' వీరభద్రారెడ్డికి, 'శివరాత్రి మాహాత్మ్యము' ముమ్మిడి శాంతయ్యకు అంకితములు చేసెను. పల్నాటి వీరచరిత్ర, క్రీడాభిరామము లీతని యితరకృతులు. అవసాన దశయందు శ్రీనాథుడు రాజాశ్రయము లేక పలుబాధలకు లోనై మరణించెను.

శ్రీనాథుడాశ్రయించిన ప్రభువులలో పెదకోమటి వేమారెడ్డి గొప్ప విద్వాంసుడు. ఈతని యాస్థానమందే శ్రీనాథుడు విద్యాధికారిగా నుండెను. పెదకోమటి వేముడు సంస్కృతమున 'అమరుకము' నకు వ్యాఖ్యానమును, సప్తశతీసారటీకము, సాహిత్య చింతామణి యను నలంకారశాస్త్రమును వ్రాసెను.

శ్రీనాథు నాదరించిన కొండవీటిప్రభువు కుమారగిరిరెడ్డి 'వసంతరాజీయము'ను నాట్యశాస్త్రగ్రంథమును రచించెను. ఈతని

బావమరదియు, రాజమహేంద్రవరపురప్రభువునగు కాటయ వేమా రెడ్డి పండితుఁడు - కాళిదాస నాటకత్రయమునకు వ్యాఖ్యానములు వ్రాసెను.

శ్రీనాథుఁడు దర్శించిన మఱియొక ప్రభువు రావు సర్వజ్ఞసింగమ భూపాలుఁడు.

"సీ. దీనారటంకాలఁ దీర్థమాడించితి
దక్షిణాధీశు ముత్యాలశాలఁ
బలుకుఁ దోడై తాంధ్రభాషా మహాకావ్య
నైషధగ్రంథ సందర్భమునను
బగులగొట్టించితి నుద్భట వివాదప్రౌఢి
గౌడడిండిమభట్టు కంచుఢక్కఁ
జంద్రచూడక్రియాశక్తి రాయలయొద్దఁ
బాదుకొల్పితి సార్వభౌమ బిరుద

తే. మెటులమెప్పించెదో నన్ను నింకమీఁద
రావు సింగమహీపాలు ధీవిశాలు
నిండుకొలువున నెలకొనియుండి నీవు
సరససద్గుణనికురంబ శారదాంబ."

అను శ్రీనాథునిచాటువున పేర్కొనబడిన సర్వజ్ఞసింగమహీపాలుఁడీతఁడే. ఈ ప్రభువు పిఠాపురము జమీందారులకు పూర్వీకుఁడు. ఇతఁడు సంస్కృతమున మహాశాస్త్రవేత్తయు, మహాకవియునని తద్రచితములగు 'రసార్ణవసుధాకరము,' 'రత్నపాంచాలికా' అను సంస్కృత కృతులవలన తెలియుచున్నది. 'రసార్ణవసుధాకరము' అలంకారశాస్త్రము. లక్షణలక్ష్యములు రెండును సర్వజ్ఞసింగమ భూపతియే రచించెను. ఇది యాలంకారిక గ్రంథములలో నవీన మతమునకు చెందినది. 'రత్నపాంచాలికా' అలంకారిక మతము ప్రకారము

ఉపరూపకములలోని 'నాటిక' యగుచున్నది. ఈ రెండు గ్రంథములు సర్వజ్ఞసింగమ భూపాలుని యపారమగు పాండిత్యమును, అమేయమగు ప్రతిభను తెలుపుచున్నవి. పిఠాపురము సంస్థానాధిపతులలో తొలుతగా సాహిత్యపోషణము చేసినట్లు పరిగణింపబడుచున్న రావు పెదమాధవరావుగారీ ప్రభువునకు ఎనిమిదవతరమువారు.

జక్కన 'విక్రమార్క దేవ చరిత్రము'ను రచించి విజయనగర ప్రభువులకడ గణకుడగు సిద్ధనామాత్యు[illegible]లము నందే మడికి సింగన 'పద్మపురాణోత్తర[illegible]ను రచించి వెలిగందలకందనమంత్రి కంకితమిచ్చెను. వాసిష్ఠరా[illegible] ద్విపద భాగవత దశమస్కంధము లీతని యితరకృతులు. అటుపిమ్మట దగ్గుపల్లిదుగ్గన తన 'నాచికేతూపాఖ్యానము'ను ఉదయగిరి ప్రభువుల ప్రధానామాత్యుడగు గంగయ కంకితముచేసెను. నంది మల్లయ, ఘంట సింగనలు రచించిన 'ప్రబోధచంద్రోదయ' మీ గంగనకే కృతిసీయబడెను. ఈ జంటకవులు తమ 'వరాహపురాణము' తుమప నరసరాజున కంకితమిచ్చిరి. దూబగుంట నారాయణకవి తన 'పంచతంత్రకావ్యము'ను బసవ భూపాలున కంకితము చేసెను.

పిల్లలమఱ్ఱి పినవీరన విజయనగర ప్రభువగు సాళువగుండ నరసింహరాయల నాశ్రయించి 'జైమిని భారతము'నంకితము చేసెను. 'శృంగారశాకుంతలము'ను చిల్లర వెన్నయామాత్యున కంకితమిచ్చెను.

వెన్నెలకంటి సూరన 'విష్ణుపురాణము' నాంధ్రీకరించినెల్లూరు సీమలోని గుడ్లూరునకధిపతియగు రాఘవరెడ్డి కంకిత మొనరించెను.

తరువాత కృష్ణదేవరాయలకాలము సాహిత్యమునకు స్వర్ణయుగమై భాసించెను. శ్రీకృష్ణదేవరాయలును స్వయముగా కవి, పండితుడును. ఆముక్తమాల్యదయను పేరుగల 'విష్ణుచిత్తీయము'ను రచించెను. ఇది ప్రౌఢకావ్యము. 'స్వారోచిష మనుసంభవ' కర్త

అల్లసాని పెద్దన, 'పారిజాతాపహరణము'ను రచించిన ముక్కుతిమ్మన, 'రాజశేఖర చరిత్ర' కారుడు మాదయగారి మల్లన, 'కాళహస్తీశ్వర మాహాత్మ్యము'ను వ్రాసిన ధూర్జటి, 'రామాభ్యుదయ' కృతికర్త అయ్యలరాజు రామభద్రుడు, 'ప్రభావతీ ప్రద్యుమ్న', 'గరుడ పురాణ', 'రాఘవ పాండవీయ', 'కళాపూర్ణోదయా'ది కళాఖండము లను రచించిన పింగళి సూరన, 'పాండురంగ మాహాత్మ్యము'ను వెల యించిన తెనాలి రామకృష్ణుడు, 'హరిశ్చంద్ర నలోపాఖ్యాన', 'కావ్యాలంకార సంగ్రహ', 'వసుచరిత్రా'దులను రచించిన రామ రాజభూషణుడును రాయల యాస్థానమున కవులై అష్టదిగ్గజములని పేరుగాంచిరి. ఇందు 'మనుచరిత్ర', 'పారిజాతాపహరణము' లు మాత్రము రాయల కంకితములు.

ఇక గోల్కొండను కుతుబ్ షాహీ వంశీయులు పాలించుచు, వారు మహమ్మదీయులై యుండియు తెలుగుసారస్వతము నాదరిం చిరి. వీరిలో మల్కిభ రాముడని పేరుగాంచిన ఇబ్రహీంషా అద్దంకి గంగాధరకవి కృతమగు 'తపతీసంవరణోపాఖ్యానము'నకు కృతిభర్త. ఈతడు కందుకూరి రుద్రకవి, మరింగంటి సింగనాచార్యులను సన్మా నించెను. ఖితాబ్ ఖాన్ మంత్రియగు ఎనుమలపల్లి పెద్దనామాత్యుడు పరిగొండ ధర్మన్న రచించిన 'చిత్రభారతము' నంకితమొందెను. పొన్నిగంటి తెలగన్న 'యయాతిచరిత్ర'మను అచ్చతెనుగు కావ్య మును వ్రాసి ఇబ్రహీంషాకు సామంతుడగు అమీన్ ఖాన్ కు కృతి నిచ్చెను.

తంజావూరు నాయకరాజులలో రఘునాథరాయలు సాహి త్యమునం దెక్కువ యాదరము కలవాడు. ఇతడు స్వయముగా కవి. రఘునాథరామాయణము, వాల్మీకి చరిత్ర, పారిజాతాపహరణము, గజేంద్రమోక్షము, అచ్యుతాభ్యుదయము– మున్నుగా ననేక కృతు

లను వ్రాసెను. చేమకూర వేంకటకవి కృతమగు 'విజయవిలాస' కావ్యము రఘునాథుని కంకితము చేయబడెను. రఘునాథుని యాస్థానమున మధురవాణి, రామభద్రాంబ యను కవయిత్రు లుండిరి. మధురవాణి 'రఘునాథరామాయణము'ను సంస్కృతీకరించెను. రామభద్రాంబ 'రఘునాథాభ్యుదయము'ను సంస్కృత కావ్యమును రచించెను.

రఘునాథనాయకుని పుత్రుడు విజయరాఘవనాయకుని యాస్థానమున రంగాజమ్మ యను కవయిత్రి కలదు. ఈమె 'మన్నారుదాస విలాసము'ను యక్షగానమును, ఉషాపరిణయ ప్రబంధమును వ్రాసి, విజయరాఘవుని చేత కనకాభిషేకము చేయించుకొనెను. విజయరాఘవునితో తంజాపురరాజ్య మంతరించినది.

తంజాపురముతరువాత మధురనాయకరాజులు సాహిత్యపోషణము చేసిరి. మధుర చొక్కనాథనాయకుని యనుజుడగు ముద్దళగిరి కామేశ్వరకవి కృతమగు 'సత్యభామాసాంత్వనము' నకు కృతిభర్త.

విజయరంగ చొక్కనాథుని కాలమున శేషము వేంకటపతి 'శశాంక విజయము' అను కావ్యమును వ్రాసి వంగల సీనయామాత్యున కంకిత మిచ్చెను. ఈ కాలమునందే వెలిదేండ్ల వేంకటపతి 'రాధామాధవసంవాదము', ఎదపాటి ఎఱ్ఱయ 'మల్హణచరిత్ర'మును రచించిరి, ఇవి శృంగార ప్రబంధములు. సముఖం వేంకటకృష్ణప్ప నాయకుడు 'అహల్యాసంక్రందనము'ను పద్యకృతిని, జైమినీభారతము, సారంగధర చరిత్ర అను వచనకావ్యములను వ్రాసెను. ఇట్లీ యుగమున నాయకప్రభువులపోషణమున నెన్నియో ప్రబంధములు వెలసినవి.

దేశ మరాజకముగానున్న సమయమున పాశ్చాత్యులు ప్రవేశించి, రాజులు నవాబుల కలహములు లాభకరముగా వారిని చీలదీసిరి. క్రమముగా దేశము బ్రిటిషువారి హస్తగతమైనది. ఈ పరిస్థితిలో సంస్థానములు (జమీందారీలు) వెలసినవి. ఆంధ్రదేశములో సంస్థానములు (జమీందారీలు) కొన్ని సాహిత్యపోషణమున ఘనత గాంచినవి. రాజులు, రాజ్యములు నశించినను ఈ సంస్థానాధీశులు సాహితీలతకు దోహదము చేసిరి. ఇట్లు సాహిత్యము నాదరించిన ముఖ్య సంస్థానములు విజయనగరము, గద్వాల, ఆత్మకూరు, వెంకటగిరి, నూజివీడు, మూడుగుల, బొబ్బిలి, పిఠాపురము సంస్థానములు ప్రఖ్యాతి గాంచినవి.

విజయనగర సంస్థానమున జరిగిన సాహిత్యపోషణమునకు ఆనందగజపతి కాలము స్వర్ణయుగము. భాగవతుల హరిశాస్త్రి, మైసూరు భీమాచార్యులు, ముడుంబై నరసింహాచార్యస్వామి మున్నగువారు ఆనందగజపతి గురువులు. ఆనందగజపతి యాస్థానమున ముడుంబై నరసింహాచార్యస్వామి, మండ లక్ష్మీ కామేశ్వర శాస్త్రి, పేరి కాశీనాథశాస్త్రి, మండ చిట్టికామశాస్త్రి, భీమాచార్యులు, భాగవతుల లక్ష్మీనారాయణశాస్త్రి, నేమాని కోదండ రామయజ్వ వంటి ప్రసిద్ధపండితులు గలరు. కన్యాశుల్క కర్త గురుజాడ అప్పారాయకవి, కవిజీవితకారుడు గురుజాడ శ్రీరామమూర్తి, ప్రౌఢవ్యాకరణకారుడు బహుజనపల్లి సీతారామానుజాచార్యుడు, గాయక పారిజాతకర్త తమ్మాచారి సింగరాచార్య, చిన సింగరాచార్యులును దమ తమ కావ్యములను ఆనందగజపతి కంకితమిచ్చిరి. విజయనగర సంస్థానమున ప్రతివత్సరము 'శ్రావణ పూర్ణిమ'కు విద్వత్పరీక్షలు జరిగెడివి.

గద్వాల సంస్థానము విద్వత్పోషణమున పేరెన్నికగనినది. 'విద్వద్గద్వాల' యని ప్రశస్తిగాంచిన తెలంగాణా సంస్థాన మది. ఈ సంస్థానాధిపతులు కార్తీకమాఘమాసములలో కవి గాయకులకు సన్మానములు చేసెడివారు. ఈ వార్షికోత్సవములను సోమభూపాలుడు నెలకొల్పెను. ఈయన యాస్థానమున హరిభట్టు, కాణాదము పెద్దన, కొటికలపూడి వీరరాఘవకవి మున్నగు నుద్దండ పండితు లుండెడివారు.

సోమభూపాలుడు స్వయముగా కవి. రతిశాస్త్రము, అష్టపదు లను వెలయించెను. కాణాదము పెద్దన రామాయణము బాలకాండ, ముకుందవిలాస ప్రబంధములను వ్రాసెను.

పెద్దన తరువాత నీ రామాయణమును కొత్తపల్లి రామచంద్రా చార్యులు (అయోధ్యకాండ), గార్గ్యపురం సుబ్బశాస్త్రి (అరణ్య కాండ), కామసముద్రం అప్పలాచార్యులు (సుందరకాండ), బోర వెల్లి శేషాచార్యులు (యుద్ధకాండ) క్రమముగా పూరించిరి. శ్రీధర్మ వరం రామకృష్ణమాచార్యులవారికి ఆంధ్రనాటక పితామహ బిరు దమునొసగి సన్మానించినది గద్వాల సంస్థానాధిపులే. వీరి యాస్థాన మున నింకను నెందరో విద్వత్కవు లుండెడివారు.

ఈ యాస్థానమున సాహిత్యపోషణము చేసిన శ్రీ గద్వాల రాణి ఆదిలక్ష్మీదేవమ్మగారు. ఈమె విద్యాసంస్థలకు, గ్రంథప్రచు రణసంస్థలకు భూరివిరాళము లొసగెను. వీరి భర్తగారగు సీతారామ భూపాల బహద్దరువారు శిరోమణి సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారు రచించిన 'తత్సమచంద్రిక'కు కృతిపతులు.

ఆత్మకూరు అధిపతులు విద్వత్ప్రభువులు, సంస్కృతాంధ్ర సాహిత్యములను సమముగా పోషించిరి. ఏటేట ఫాల్గునశుక్లపక్ష మున సాహితీసభలు, శాస్త్రగోష్ఠులు, కవిగాయక సమ్మేళనములు,

నృత్యనాటకములు జరుపుట పరిపాటి. ఆత్మకూరు సంస్థానాధిపతులగు రాజా సోమభూపాలునికి సురపురము కేశవయ్య కృతమగు 'నిరోష్ఠ్య రామాయణము' అంకితము చేయబడెను.

గుణరత్నాకర, పద్మినీచంపువులను వ్రాసిన తిరుమల బుక్కపట్టణం రంగాచార్యులు, తత్పుత్రులు బాలసరస్వతీ బిరుదాంచితులునగు తి. బు. శ్రీనివాసాచార్యులు తదాస్థాన విద్వత్కవులు. శ్రీనివాసాచార్యులు 'జాంబవతీ పరిణయము', 'రాజశేఖరచరిత్రము', 'దుర్మనిర్మథనము' మొదలగు కావ్యములు రచించిరి. ఇంకను దీక్షితుల నరసింహశాస్త్రి, హారతి దీక్షాచార్యులు, అరిశాణపాలెము వెంకటాధ్వరి, తిరుమల వేంకటాచార్యులు, దీక్షితుల పాపాశాస్త్రి, ముదిగొండ నాగలింగశాస్త్రి, తి. బు. బుచ్చి వేంకటాచార్యులు ఆత్మకూరుసంస్థానమున కవిపండితులు.

ఆత్మకూరుప్రభువగు ముక్కర సీతారామభూపాలునికి శ్రీ తిరుపతి వేంకటకవుల 'శ్రీనివాస కల్యాణ' కావ్య మంకితమొనరింపబడెను. సీతారామభూపాలుని పట్టపురాణి భాగ్యలక్ష్మమ్మగారును సాహిత్యపోషణము చేసిరి.

వెంకటగిరిసంస్థానమున జరిగిన సాహిత్యపోషణ విషయకముగా నొక పరిశోధనగ్రంథ మిటీవల వెలసినది. ఈ సంస్థానమున 'భానుమతీ పరిణయము'ను వ్రాసిన వేమూరి రంగరాజకవి 'రుక్మవతీపరిణయ' కర్త అనఘుము కోదండరామకవి 'చతుష్షష్టి విద్యాసంగ్రహము'ను సంస్కృతగ్రంథమును వ్రాసిన పురుషోత్తమకవి ఆస్థాన కవులు. రోసనూరి వేంకటపతి తన 'విష్ణుమాయావిలాసము' రెండవ బంగారు యాచేంద్రుని కంకిత మిచ్చెను. ముడుంబి అప్పయ్యదీక్షితులు, సరుకూరి నారాయణప్ప, ధూర్జటి లింగరాజకవి మున్నగు కవు లీ యాస్థానమున నుండిరి. సర్వజ్ఞకుమారయాచేంద్రుడు మహా

పండితుడు, కవి. గీతార్థసారసంగ్రహము, నాస్తిక ధ్వాంతభాస్కరము, నిర్గుణవాద నిరాకరణము, మనస్సాక్ష్యము, రత్నషట్కాంగు ళీయకము లీప్రభుని కృతులు.

గోపీనాధము వేంకటకవి ఈ సంస్థానమున ముఖ్యకవి. గోపీనాధరామాయణము ప్రసిద్ధివహించిన కావ్యము. ఈ సంస్థానమున నింకను పలువురు కవి పండితులు పోషింపబడిరి.

తరువాత నూజివీటి సంస్థానాధిపతులు సాహిత్యపోషణము నందభిరుచికలవారు. వీరు చేసిన సాహిత్యసేవ అగణ్యము. వీరు కృతి భర్తలు, కృతికర్తలును.

కుమారధూర్జటి, ఆణివిళ్ళ వేంకటశాస్త్రి, దిట్టకవిరామయోగి, రామచంద్రకవులు, మాడభూషి నరసింహాచార్యులు – ఆస్థానపండితులు. బుక్కపట్టణం రాఘవాచార్యులు, చర్ల భాష్యకారశాస్త్రి, గోపాల కృష్ణమాచార్యులు, తిరుపతి వేంకటకవులు, కార్యమపూడి రాజమన్నారు, కాశీ కృష్ణమాచార్యులు, మల్లాది సూర్యనారాయణ శాస్త్రి, చిలకమర్తి లక్ష్మీనరసింహకవి – ఈ సంస్థానాధిపతులచేత సత్కారము లందినవారు.

నూజివీటిప్రభువులలో శ్రీ మేకా వేంకటాద్రి అప్పారావు గారు, 'రామదాసు,' 'జ్యోతిర్లీల,' 'గోవర్ధనోద్ధరణము' అను నాటకములు, 'ఆంధ్ర గీతగోవిందము,' 'శోభనాచలమాహాత్మ్యము' అను కావ్యములు రచించిరి. నూజివీటి సంస్థానములలో నంతర్భాగమగు ముసునూరునకు ప్రభువగు రామచంద్ర అప్పారావుగారు సంస్కృతాంధ్ర పారశీకభాషలలో పండితులు. శ్రీ విశ్వనాధవారి 'అనార్కలి' వీరికి కృతినీయబడెను.

ఉయ్యూరు సంస్థానప్రభువు శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు గారి పుత్రులు శ్రీ ఎమ్. ఆర్. అప్పారావుగారికి సాహిత్యమున

నభిరుచి నొందు. విద్యాభిమానులగు వీరనేకకృతుల నంకితమొందిరి. శ్రీ దుసేటి వేంకట రామాచార్యకృతమగు 'అనార్కలి' పద్య కావ్యము, శ్రీ యర్రగోజు మాధవాచార్యుల 'మానవజయము' వీరి కంకితము చేయబడినవి. పి. యస్. ఆర్. అప్పారావుగారాంగ్లీకరించిన 'భరతనాట్యశాస్త్రము,' సి. వి. యస్. నారాయణదాసు వ్రాసిన నాటికలు 'ప్రేమబలం' కూడ వీరి కంకితమీయబడినవి. 'పానశాల'యను పద్యకావ్యమును ఈ ప్రభువు రచించిరి. గ్రీకునాటక కర్త సాఫొకిల్సు వ్రాసిన నాటకము 'ఆంటిగాన్'ను వీ రాంధ్రీక రచించిరి.

మాడుగుల సంస్థానమున కృష్ణభూపతికాలమున సాహిత్య పోషణము జరిగినది. ఈతడు సంస్కృతాంధ్రములయందుఁ బండితుడు. అభినవకృష్ణరాయ బిరుదాంకితుడు. అడిదము బాలభాస్కర కవి, శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి, అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి, ఇంద్రగంటి గోపాలశాస్త్రి, పేరి సర్వేశ్వరశాస్త్రి, మంత్రిప్రెగడ సూర్యప్రకాశకవి మాడుగుల సంస్థానాస్థానకవులు. శ్రీ పురాణం సూర్యనారాయణతీర్థులు, భమిడిపాటి యజ్ఞనారాయణశాస్త్రి, త్యాడి వెంకటశాస్త్రి, త్యాడి పట్టాభిశాస్త్రి ప్రభృతులీప్రభువుల మన్నల నందుకొనిరి.

ఈ రీతిగా నెన్నియో సంస్థానములు సాహిత్యసేవ యొనరించినవి. అట్లు అపారమగు సేవచేసిన సంస్థానము పిఠాపుర సంస్థానము. ఈ సంస్థానపు సాహిత్యసేవనుగూర్చి మున్ముందు ప్రసంగింపబడును.



# విషయ సూచిక





కళాప్రపూర్ణ, విద్వత్కవిశేఖర, కవితాభూషణ
వెంపరాల సూర్యనారాయణశాస్త్రి

రామారావుపేట,
కాకినాడ - 533 004.

## ఆశీర్వచనము

చిరంజీవిని సౌభాగ్యవతి డా. సి. కమలాఅనార్కలి ఎమ్. ఎ. పిహెచ్. డి., రచియించిన పిఠాపుర సంస్థానము — కవి పండిత పోషణ — అనెడి పరిశోధన వ్యాసము చదివితిని. ఆనందించితిని. పిఠాపురము యొక్క పుట్టు పూర్వోత్తరములు పురాణము లందును, శాసనము లందును, కవుల రచనల యందును, నామ రూపములలో ఎట్టెట్టి మార్పులు పొందుచువచ్చినవో తెలుపబడెను. అవియన్నియు వ్యావహారికాంధ్రమునకు చేరువగా సరళ గ్రాంథికమున నివేదిక 4 పుటలు, ఉపోద్ఘాతము 11 పుటలూ గాక పిఠాపురము - నాడు-నేడు అను శీర్షిక మొదలుకొని ఆరువిభాగములీ వ్యాసమున గలవు. తెలుగు రాయణింగారితో తలయెత్తిన ఈ పిఠాపుర సంస్థానము సాహిత్య చక్రవర్తి డా. రావు వెంకట కుమార మహీపతి సూర్యారావు బహద్దరు డి. లిట్. వారి పరిపాలనమున షోడశ కళాపరిపూర్ణ చంద్రబింబమై ఆంధ్రభూమండల మంతటను వెదజల్లి, జమీందారీలు రద్దయిన మహావిప్లవకాలమున అస్తమించిపోయిన హృదయ విదారక విషయముతో నామావశిష్టమైనను, ఈ వ్యాసము మాత్రము ఆ రావు వంశాంకురముగా మిగిలిన శ్రీ సూర్యారాయబహద్దరు వారి జ్యేష్ఠపుత్రులగు శ్రీ గంగాధర రామారాయ ప్రభువు చేసిన బహుముఖ సారస్వతసేవ విపులీకరింపబడి, ఆధునికాంధ్ర వసుంధరకు ఒక ఓదార్పు చేకూర్చినది. పిఠాపురము కోటలక్ష్మీ సరస్వతులు విహరించిన పూలతోట, రత్నాలమూట అని ప్రస్ఫుటమగుచున్నది. ప్రభువుల రాజ్య పరిపాలనా విషయముల కంటె, సాహిత్యపరిపాలనా విషయమున చూపబడిన శ్రద్ధ నాసికా త్ర్యంబకము వద్ద పిల్ల కాలువ వలె బయలుదేరిన గౌతమీగంగ రాను రాను యిట్లు విస్తృతి నొంది సప్తశాఖలై గోదావరి మండలము నంతను క్రమ్మి సర్వ సస్యాఢ్య నొనర్చి నట్లే ఆంధ్రమాతకొక నూత్న తేజస్సు ఘటించినది.

రావు పెదమాధవరావు ప్రభువు కాలమున వక్కలంకవారి వాసవదత్తాపరిణయ రూపముతో బయలుదేరిన ఆంధ్రకవితాలతిక వరుసగా ఆయా ప్రభువుల దోహదముచే వృద్ధినంది మహారాజా సూర్యారావు బహద్దూరువారి పోషణమున చక్కగా వర్ధిల్లి పూచి కాచి ఫలించి అక్షరరూపమున దశదిశలందు శాశ్వతామోదము జగత్తునకు సార్వకాలికముగా అందించుచున్నది. ఇట్టి పరిశోధన వ్యాసములోని వేదశాస్త్రాదిప్రాచీన విద్యావిలాసములుగాని, కవితా విహారమును స్ఫురించు ఏ భావమునుగాని స్పృశించుచు మాటలాడినను వ్రాసినను చర్వితచర్వణమగునని అది సహృదయులకు వదలి ఈ వ్యాస రచయిత్రి శ్రీ కమలాఅనార్కలి యి ం క నూ ఆంధ్ర శారదా దేవికి పరిచర్యసేయుచు నూత్నవిషయములచే ఆంధ్రవసుంధర నారాధింపగలదని నమ్ముచున్నాను. ఆయురారోగ్యాది భాగ్యమున సమానులందు ఉత్తమత్వమందుగాక అని ఆశీర్వదించుచున్నాను.



కళాప్రపూర్ణ
దివాకర్ల వేంకటావధాని
ఎం. ఎ (ఆనర్సు) పిహెచ్ డి.

హైదరాబాదు – 27

చి. కమలాఅనార్కలి ఆంధ్రవిశ్వవిద్యాలయమున విద్యాభ్యాసము కావించినను అమె చాలదినము లిచ్చటనుండి ఏ. పి. స్టేట్ ఆర్కైవ్సువారి ఆర్థికసాహాయ్యముతో మా విశ్వవిద్యాలయమునందే పిహెచ్. డి. పట్టమునకు పరిశ్రమించుటనే మా విద్యార్థినిగనే కని పించుచు. పెద్దలయెడను గురువులయెడను ఆమె ప్రదర్శించిన భక్తి వినయ విశ్వాసము లట్టివి.

ఆమె పిఠాపుర నివాసిని. అభిజనాభిమానము చేతను, ఆ సంస్థానము వారు కావించిన కవి పండిత సాహిత్య పోషణ మనన్యాదృశమగుటచేతను 'పిఠాపుర సంస్థానము – కవిపండితపోషణ' అను విషయమును గ్రహించి ఎన్నో అపూర్వ విషయములను సేకరించి అమూల్యమైన సిద్ధాంతవ్యాసము రచించి పిహెచ్. డి. పట్టము పొందినది. పిఠాపుర వాస్తవ్యురాలగుట చేతను, ఆ ప్రాంతమునందలి కవిపండిత కుటుంబములతో సన్నిహిత పరిచయము కలదగుట చేతను శ్రమపడి ఆమె ఇతరులకు సాధ్యముకాని గ్రంథములను విషయములను సంగ్రహింపజాలినది.

ఆంధ్రవాఙ్మయ మారంభము నుండి మొన్న మొన్నటి వఱకును రాజులయు, మంత్రులయు. సంస్థానాధీశులయు, సాహిత్యాభిమానులైన సంపన్నులయు పోషణము చేతనే అభివృద్ధి పొందినది. వారు లేఖకులచే వ్రాయించి తాళపత్ర ప్రతులను భద్రపఱచుట చేతనే ఎన్నో పూర్వకవి రచిత గ్రంథములను మనమిప్పుడు చదివి యానందింప గలుగుచున్నాము. బ్రిటీషువారి పరిపాలనము సాగిన తరువాత కూడ సంస్థానాధీశులు కళా సాహిత్యము లందెంతో అభిమానము వహించి, పలువురు కవులను పోషించి యెన్నో మహాకావ్యముల ఆవిర్భావమునకు కారణభూతులైరి. అట్టి సంస్థానములలో పిఠా

పుర సంస్థానము అగ్రగణ్యమైనది. శ్రీ. శే. రావు సూర్యారావు బహద్దరు వారు సాహిత్యమునకు చేసినసేవ శ్లాఘాలంఘన జాంఘికమైనట్టిది. వారిపేర వెలయు సూర్యరాయాంధ్ర నిఘంటువాత్రిలింగ భాషామాంధ్ర కవి పండితులకు చిరస్మరణీయమై యుండుటలో నతిశయోక్తి లేదు. సర్వజ్ఞ సింగభూపాలుని తరువాత కొందఱు రాజులు కావించిన సాహిత్యసేవ లభ్యమగుట లేదు. కాగా శ్రీ రావు పెద మాధవరావు గారి కాలమునుండి జరిగిన కృషియే యిందు వివరింపబడినది.

చి. అనార్కలిగారి సిద్ధాంత వ్యాసమందలి మొదటి రెండధ్యాయములును చరిత్రకు సంబంధించినవి అందామె యుటంకించిన విషయములు చరిత్ర పరిశోధకులకు కూడ నచ్చెరువు కలిగించును ఆమె ఈ వ్యాసమును విభజించిన తీరు కూడ ప్రశంసా పాత్రముగా నున్నది. సంస్థానాధీశుల రచనలను, వారంకితము పొందిన రచనలను ఆస్థాన కవులయు, ఆశ్రితులయు రచనలను, సంస్థానములో నివసించిన వారి రచనలను ఆమె కూలంకషముగా పరిశీలించి సమీక్షించినది ముద్రితాముద్రిత గ్రంథములన్నియు నామె పరిశోధనలో చోటు చేసుకొన్నవి. శ్రీ సూర్యారావు బహద్దరు వారును వారి కుమారులును చేసినసేవను ప్రత్యేకముగా నుగ్గడించినది. వలసిన చోట్ల గ్రంథములనుండి పద్యభాగముల నుద్ధరించి తన సిద్ధాంత వ్యాసమునకు వన్నె చేకూర్చినది. ప్రత్యేక సిద్ధాంత వ్యాసములు వెలసినవారి రచనలనుగూర్చి దిఙ్మాత్రముగా సూచించుట సముచితమే. కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణ సారసంగ్రహమును గూర్చియు [illegible] రచనలను గూర్చియు ఆమె వ్రాసిన విషయములు ప్రత్యేకముగా చదివి యానందించితిని. ఆమె శైలి సరళమై, నిర్దుష్టమై, విశదమై సర్వసుబోధమై అలరారుచున్నది. ఈమె యింకను సర్వోత్తమములైన పద్య గద్య గ్రంథములు రచించి ఆంధ్ర వాఙ్మయమున కభినవాలంకృతుల నలవరించు గాక.

# సమీక్ష

సాహిత్య విద్యా ప్రవీణ, భాషాప్రవీణ, రాష్ట్రభాషాప్రవీణ,
**పన్నాల భట్టశర్మ.**
ఎం. ఎ., పి. ఒ. ఎల్., బి. యిడి.

"గుణాః పూజాస్థానం గుణిషు నచలింగం నచవయః"
ఇది భవభూతి మహాకవుల సూక్తి. కుశలవుల విద్యాప్రశంస చేయు సందర్భమున గుణవంతులలో వయోభేదమును, స్త్రీ పురుష భేదమును పాటింపరాదని కవి ప్రవచనము. ఈ సుభాషితము చిరంజీవిని కమలా అనార్కలి యందు సార్థకము. బాల్యము నుండియు పిఠాపురమందు గల ఆసక్తికి దోడుగా శ్రీ దివాకర్ల వెంకటావధాని గారు, శ్రీ పాటిబండ మాధవశర్మ గారు, శ్రీ వెంపరాల సూర్యనారాయణ శాస్త్రి గారును, మార్గదర్శకులుగా, గురు గౌరవముతో ఆంధ్ర సాహితీవైభవమున మెలకువల మేలిమినెన్నుకొని పరిశోధనాభిలాషతో "పిఠాపుర సంస్థానము – కవి పండిత పోషణ" అను పరిశోధిత వ్యాసమును ఈ మధ్య పుస్తకరూపమున ప్రకటించెను. పరిశోధన ప్రణాళికా బద్ధముగా సాగినది. నవీనరచనల కంటె ప్రాచీనరచనలకు ఆధిక్యమొసగినట్లు ఉపోద్ఘాతము నందే పేర్కొనిరి. కావుననే ఈ శతాబ్దములో వచ్చిన రచనలలో పెక్కు విశిష్ట గ్రంథములున్నను వాని విమర్శకు ఈ గ్రంథమున కేటాయింపు తగ్గినది.

"పిఠాపురము నాడు – నేడు" అను శీర్షికలో పిఠాపురమునకు ప్రాచీనకాలము నుండియు గల నామభేదములను; ఆ పట్టణమును పరిపాలించిన మహారాజులను, వారి వంశ వివరణములను శాసనబద్ధముగ, సప్రమాణముగ నిరూపించిరి. శాసన ప్రమాణములు చూపుటయే కాక శ్రీనాథుడు, తెనాలి రామకృష్ణుడు, ధూర్జటి మున్నగు మహాకవుల ప్రబంధముల నుండియు పిఠాపుర ప్రాచీనతకు నిదర్శనముల నొసంగిరి. ఇంకను పిఠాపురప్రశస్తిని పౌరాణికముగా

ప్రసిద్ధములయిన పెక్కుగాధలను చేర్చి నాటి పిఠాపురము కన్నులకు గట్టునట్లు చేసిరి

మెతుకు, కైలాసకోటలందు నివాసమున్న అనపోతమనీని వంశస్థుల యిన మాధవనీని తెనుగురావుగారు పిఠాపుర సంస్థానమును ప్రతిష్ఠించుటమున్నగు చారిత్రక విషయములను సుగమముగా, కాలక్రమముగా "పిఠాపుర జమీందారుల వంశక్రమము" అను శీర్షికలో విపులీకరించిరి. డాక్టరు మహారాజా రావు వేంకట కుమార మహీపతి సూర్యరావు బహద్దరు వారి పుత్ర పౌత్ర వంశక్రమమును దెలిపి; జమీందారుల రద్దుతో పిఠాపురసంస్థానము అస్తమించువరకు గల చారిత్రకవిశేషములను పెక్కింటిని సప్రమాణముగా పొందుపరచిరి. ఈ అధ్యాయము చివర 'నేడు మిగిలినది శిథిలమైన పిఠాపురము కోట' అనెడి ముగింపువాక్యము పిఠాపుర పౌరులయిన పాఠకుల కన్నులను చెమ్మగిలజేయక మానదు.

'కవి పండిత పోషణ –' అను మహా శీర్షికను ప్రారంభించి, అందు పిఠాపుర సంస్థానాధిపతులను కాలక్రమమున ప్రత్యేకముగ విభజించి ఒక్కొక్కరి కాలమున ఉద్భవించిన సాహిత్యమును సరసముగా పరిశీలించిరి. వెనుకటి అధ్యాయములలో తెల్పిన చారిత్రకవిషయాల పరిశీలన ఒకయెత్తు. పిఠాపురము జమీందార్ల ఆశ్రయములో వెలసిన సాహితీసంపదను చక్కగా లింగడించి సమీక్షించుట ఒకయెత్తు ననవలె. ఏమన – ఈ పనికి సాహిత్య శాస్త్రములో పరిణత ప్రజ్ఞ చాల అవసరము. అందునను ప్రత్యేకించి రావు మాధవరాయణింగారి అస్థానమున వక్కలంక వీరభద్రకవి రచించిన "వాసవదత్తా పరిణయము" అను ప్రబంధమును, మఱియొక కవిసార్వభౌముడుగా ప్రఖ్యాతి పొందిన కూచిమంచి తిమ్మకవి రచనల తీరుతెన్నులను ప్రత్యేకపద్ధతిలో పండితామోదము పొందగల ఫణితిలో నడిపించిన

రచయిత్రి వైదుష్యము శ్లాఘ్యము.

కవితావిశేషములు, అలంకారములు; వ్యాకరణ పరిశీలన అను చిన్న చిన్న ఉపశీర్షికలతో సాగించిన విమర్శనము విపులముగా నున్నది. వక్కలంక కవి కవితా విశేషములు పేర్కొనుచు రీతి లక్షణములలో దండివామనుల మతభేదములను ఉదహరించుట, రస నిర్వచనము రచయిత్రి సాహిత్యశాస్త్రమున చేసిన కృషిని వెల్లడించును. పూర్వకావ్యానుసరణలో వక్కలంకకవి శాకుంతలమందలి నాందీ శ్లోకమును వ్యర్థపదము ప్రయోగింపక అనువదించినట్లు తెల్పుచు; అనూదిత పద్యమున వృషధ్వజుడను పదమే - వాయువు - అను అర్థమునందు వర్తించి - అష్టమూర్తుల పరిగణనకు సరిపోవును. కాని ముద్రాపకులు పొరపాటుగా ముద్రించిన 'వృషధ్వజ' డను పదము శివార్థకమైనందున అష్టమూర్తుల లెక్కకు తక్కువగునని సూచించుట రచయిత్రి సూక్ష్మ పరిశీలనకు దృష్టాంతము.

వ్యాకరణాంశములను పరిశీలించినతీరు ప్రాచీన ఫక్కికగ సాగిపోవుచు, అడుగడుగునను; శ్రీ వెంపరాల సూర్యనారాయణ శాస్త్రుల వార కరతలామలకములయిన వ్యాకరణ బోధనలను గుర్తునకు తెచ్చును.

వక్కలంక కవి ప్రయోగసమీక్ష :—

1) విచ్వస్ అనునట్టి ప్రయోగము వక్కలంక కవి తన వాసవదత్తా పరిణయప్రబంధమందు చేసియుండెను. విచ్ఛధాతువు లోని చకారము ద్విరుక్తము. వకారముగా మారుట వ్యాకరణ విరుద్ధము కదా ! అని రచయిత్రి యెత్తిచూపెను.

2) "సన్నగించు" - ఈ ధాతువునకు 'సన్నగిల్లు' అను రూపమే సాధువు. అట్లనినచో క్రమభంగము కదా! ఇంచుక్కతోడి ప్రయోగము నిఘంటువున శూన్యమని వ్రాయుట రచయిత్రి నిర్భీకతకు నిదర్శనము.

3 ) చెల్కత్తియ —: "ఇకారలోపముతో చెల్కత్తె కేవల సూర్యోచరిత్రము నందు మాత్రమే" అనిన శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువునుదాహరించుట రచయిత్రి నిఘంటు పరిజ్ఞానమున కద్దము పట్టును.

4 ) నీలముంచుట —: నీరు బహువచన రూపము 'నీలు' గ్రామ్యమని పేర్కొనుట రచయిత్రి ప్రయోగ విజ్ఞానమునకు సాక్ష్యము.

5 ) సిసృక్షు; రిరంస మున్నగు సన్నంత ప్రయోగములు వక్కలంకవారి వ్యాకరణ ప్రావీణ్యమని ప్రశంసించుట రచయిత్రి వైదగ్ధ్యమును ఎత్తిచూపును.

6 ) నేత్రాంచలాంచల ప్రతిభలు —: ఇందలి ప్రతిభా శబ్దమునకు కాంతి అర్థమను విశేషాంశము నెరింగించుటయు, హజారము మున్నగు ఉర్దూ పదముల గుర్తించుటయు రచయిత్రికి గల భాషా విజ్ఞానమును వెల్లడించును.

రావు వేంకట కృష్ణారావుగారి సంస్థానములో చినమాధవ రాయణింగారి అభిమాన పాత్రుడయిన కూచిమంచి తిమ్మకవి కావ్య రచనాక్రమమును చర్చించుచు రుక్మిణీ పరిణయమే కవి మొదటి రచన అనియు; రాజశేఖర విలాసము కవి రచనలలో రెండవదనియు దెల్పిన కందుకూరి వీరేశలింగముగారి మతమును ప్రత్యాఖ్యానమొనర్చుచు రచయిత్రి తెల్పిన ఉపపత్తులు అప్రతిహతములు

రుక్మిణీ పరిణయ శైలికంటె రాజశేఖర విలాస శైలి అపరిపక్వత సూచించునని, రేఫ శకట రేఫల ప్రాస సాంకర్యము రాజశేఖర విలాసమందు తప్ప కవి యితర కృతులందు కానరాదు కావున ప్రారంభ రచన రాజశేఖర విలాసమే యనుట ఉపపత్తి సహముగా నున్నది.

రుక్మిణీ పరిణయ పరిశీలనలో పోతన రచనతో సరిపోల్చుట రమ్యము. సింహాచల మాహాత్మ్యము పరిశీలించినపుడు ఎఱ్ఱాప్రగడ నృసింహ పురాణముతో సామ్య వైషమ్యములను రచయిత్రి నిరూపించుట హృద్యము. నీలాసుందరీ పరిణయమునందలి తెలుగు జాతీయములను, తెలుగుదనము తేటతెల్లముచేయు పెండ్లి వేడుకలును ఎత్తి చూపుట ఎన్నతగినది. అచ్చ తెనుగు రామాయణములో సీతారాములకు పుడమికాన్పు; పుడమితల్లి యల్లుడు వెందలగు అచ్చ తెనుగు పేర్లను కల్పించుటలో దూరాన్వయ శ్లేషమున్నను చమత్కృతి కలదనుట అచ్చ తెనుగు కావ్యములందు గల ఆదరమునకు సూచకము.

తిమ్మకవి వ్యాకరణ పాటవమును సమీక్షించు పట్టున, క్త్వార్థకేకార సంధిచర్చయు, యాంత ధాతువుల చకారమునకు తకారాదేశము చేసిన ప్రయోగముల నిరాసమును విశేషాంశములు. 'మరది మరది' అను ప్రయోగము శ్రీనాథుని 'తల్లికాన' వంటిదని ఉపపత్తిని చూపుట మెచ్చదగినది. సర్వలక్షణ సార సంగ్రహమందలి విశేషములను పెక్కింటిని చర్చించి తిమ్మకవి ఆంధ్రవ్యాకరణ విశేషములన్నింటిని ఆకళించుకొన్న మహా పండితుడని రచయిత్రి కవిసార్వభౌముని ఘనతను కీర్తించెను.

సారంగధర చరిత్రమున తిమ్మకవి కంటె చేమకూర వేంకట కవి ఔచిత్యము నెక్కువ పాటించెననుచు రెండు గ్రంథముల పరిశీలనను చేసిన విధము ప్రశస్త్యము. కాని కథ జరిగినకాపు తిమ్మకవి వ్రాసినట్లు రాజమహేంద్రవరము కాదనియు; రాజరాజనరేంద్రుడు భారత కృతిపతి కాడనియు చారిత్రకాధారములతో రచయిత్రి సమీక్షించిన మిక్కిలి యుచితముగా నుండెడిది. రసికజన మనోభిరామ సమీక్షలో పిల్ల వసుచరిత్రలందు అది మిన్నయనుట యుక్తమే. సర్పపుర మాహాత్మ్యము నందలి పీఠికాపురవర్ణనకు శ్రీనాథుని రచన ఆదర్శమనుట సమంజసము. కవి స్వీయప్రతిభ నెంచుట మేల్తరము.

గంగాధర రామారావు గారి ఆస్థానములో జరిగిన కవి పండితపోషణను; ప్రత్యేకించి దేవులపల్లి సోదరుల కవితావైభవమును రచయిత్రి మిక్కిలి శ్రమపడి సేకరించిరి. నయనోల్లాస; యతిరాజ విజయ రావువంశముక్తావళుల సమీక్ష సముచితము. పిఠాపురము మహారాజా శ్రీ సూర్యరాయ బహద్దరు వారి సాహిత్యసేవను కవి పండిత పోషణను సమగ్రముగా వివరించిన రచయిత్రి తమ గ్రంథము నకు సార్థకత చేకూర్చిరి. శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటు నిర్మాణ ములో పాల్గొన్న పండితుల నామపట్టికను కూడ నిచ్చియున్నారు. కాని యింకను ఆ పట్టికలో ముగ్గురు నలుగురు పండితులపేర్లు చేర్చ వలసి యున్నది. ముఖ్యముగా ప్రారంభమందలి వారిలో సుప్రసిద్ధులు మహామహోపాధ్యాయులునగు శ్రీ వేదము వేంకట రాయశాస్త్రి గారి పేరు తప్పక చేర్చవలసియున్నది. ఇంకను శ్రీ పేరి పేరయ్య శాస్త్రి గారి పేరు పొరపాటున పాపయ్య శాస్త్రిగారని ముద్రితమైనది.

మహారాజావారి ఆస్థానకవులయిన వేంకట రామకృష్ణ కవులు, పానుగంటివారును చేసిన సేవను కవితా సమీక్షా రూపమున ప్రస్తు తించుట బాగుగానున్నది. శ్రీ పానుగంటివారు రాజావారిని ప్రస్తు తించుచు ప్రశ్నోత్తరరూపమున రచించిన సీసపద్యము సంగీతమందు వీణావాద్యమందును శ్రీ పానుగంటి వారికి గల అభినివేశమును పట్టి యిచ్చుచున్నది.

శ్రీ యుతులు వోలేటి భాస్కర రామమూర్తి ; మధునా పంతుల ; దేవులపల్లి కృష్ణశాస్త్రి ; పురాణపండ మల్లయ్య శాస్త్రి; నడకుదుటి వీరరాజు ; దాసరి లక్ష్మణకవి ; కురిమెళ్ళ వెంకటరావు మొదలుగాగలవారి రచనల పరిశీలన చూచినపుడు ఆయా కవి పండిత ప్రకాండులను మరల ఎదుట చూడగల్గినంత ఆనందము కలుగుచున్నది. కవి రాజహంసలు యువరాజావారికే తమ కావ్యములను అధికముగా అంకితమిచ్చియున్నారు కావున యువరాజావారి సాహిత్య పోషణ మున కవి రాజహంసల కవితా సమీక్ష చేర్చియున్నారని రచయిత్రి

సమర్ధన అంత సమంజసముగా తోచదు. వయోభేదమును; కవితా ప్రాగల్భ్యమును పాటించి కవి రాజహంసలను కాలానుగుణముగా మహారాజావారి సాహిత్య సేవా ప్రసంగమందే చేర్చుట లెస్సగా నుండుననుకొందును. ప్రక్రమభంగము పరిహరించుటకై కవిరాజ హంసల కావ్య సమీక్ష తరువాతనే శ్రీ కృష్ణశాస్త్రిగారి భావకవితా సమీక్షనిచ్చుట యుక్తము. "ఏకాంతసేవ" భావకవితాయుగమునకే నాందియయ్యెనని రచయిత్రి భావమేకదా !

యువరాజా వారి రచనలను ఆధునిక కవితారీతులలో విశ దీకరించుట యుక్తాయుక్తము. కవిరాజహంసల రామాయణములో పాయసచర్చయు, అహల్యాచరిత్రము మొదలగు ఘట్టములను రచ యిత్రి సునిశితముగ వ్యాఖ్యానించెను. ఇట్లు డాక్టర్ సి కమలా అనార్కలి పరిశోధన రచన "పిఠాపుర సంస్థానము – కవి పండిత పోషణ" అను మహాగ్రంథము మొదటినుండి చివరివరకు నిష్పక్షపాత దృష్టితో గ్రంథితమై నేటి సమకాలిక పరిశోధన గ్రంథములకు తల మానికమై: నేటి ఆంధ్రసాహిత్య సరస్వతికి ఒక మణిహారమై యొప్పా చున్నది.



# అభినందన

వెలమకన్ని సుబ్రహ్మణ్యశర్మ. కాకినాడ,
B. A., B. L.
అడ్వొకేట్,

ఈ పరిశోధనా గ్రంథ పత్రికకి ఉస్మానియా విశ్వవిద్యాలయం వారయితే ఒక డాక్టరేటు పట్టాన్ని కుమారి అనార్కలికి బహూకరించేరు గాని ఆంధ్ర సాహిత్య లోకం ఏమిచ్చి అయినా ఆమె ఋణం తీర్చుకోలేదు. ఒక డిగ్రీ కోసం అయితే మరేదయినా విషయాన్ని ఎంచుకోవడం సులభమైన పని అవుతుందేమోకాని, యీ విద్వత్కృషికి ప్రధానముగా సారస్వత ప్రేమ ప్రతిఫలం అన్నట్లుంది.

ఆంధ్ర సాహిత్య చరిత్రలో స్మృతి పథంలో కాస్త మరుగున పడిన సాహిత్యయుగంలోని ఘనతని అందరికీ గుర్తుచేసే పరిశ్రమ యిది. పెద్దలకి కూడా అన్ని తెలిసిన విషయములు కావుయివి. అందరికీ తెలిసినవి అసలేకావు. అజ్ఞాతంలోనుంచి ప్రయాణం ప్రారంభిస్తూ రమారమి మూడు శతాబ్దాల సాహిత్య చరిత్రను త్రవ్వి పోసారు. అంతేనా ఆ సముద్రంలోకి మునకలేసి గుప్పెడు, దోసెడు చొప్పున మట్టిని పెకలించి అడుగున బడిన రాళ్ళని కెలికి తీసుకువచ్చి అందులో రత్నాలని ఏరి రమ్యమైన హారాన్ని కూర్చేరు. దుస్సాధ్యమయిన పని మా పిఠాపురంమీద, ఆ సంస్థానముమీద, ఆ సారస్వతముమీద ఆ పాండిత్య ప్రతిభమీద ఎంతమమకారమో ఈ అనార్కలికి. నిజానికి సారస్వత సేవ అంటే వారిదేమరి. ఇప్పటికాలం కాదుకదా. ఈ రోజుల్లో మన ప్రభుత్వానికి ఎన్ని హంగులున్నాయో ఈ హంగులు లేకపోయినా.

ఈ సంస్థానంవారు సాగించిన సారస్వతసేవ అవిరళమైనదీ, అపారమైనదీ, అమూల్యమైనదీను. ముప్పదేడు సంవత్సరాల కాలంలో మన స్వతంత్ర దేశంలో మన ప్రభుత్వము వారుగాని, యితర విద్యాం

సులుగాని సమగ్రతను తెలుగు నిఘంటువని చేయు సేలేకపోతేరు. కదా. పిఠాపురం రాజావారి పుణ్యం సూర్యరాయ ఆంధ్ర నిఘంటువు. ఆ సంస్థానమే ఒక ఆంధ్ర సాహిత్య పరిషత్తు.

కుమారి ఆచార్యులి కాన ఆ విషయసూచులూ, వివరములూ సేకరించి పుటలునింపిన పుస్తకం కాదిది. అయినా ఇది అనేక పరిశోధనలనీ, విమర్శ గ్రంథాలనీ, ముడిసరుకునీ బోలెడంత అందించగల గ్రంథము ఇది. ఆంధ్ర రాజ్యంలో, ఈ ప్రాంతంలో ఒక్కొక్క యుగంలోని కవులనీ, పండితులనీ తీసుకొని ముద్రితాలు, అముద్రితాలు, అలభ్యాలు అయిన ఆ గ్రంథాలని సంపాదించి వాటిపై విమర్శలను చూచి, చారిత్రకాంశాలని ఏరుకొని, వాటిని యథాతథంగా పట్టికలో నికి ఎక్కించడం కాకుండా, తిరిగీ ఆయా అభిప్రాయములు ఎంతవరకు ఆమోద యోగ్యమైనవో, కావో పరిచూచి, బేరీజు వేసి నాణ్యతకట్టి, నిర్ధారణ చేస్తూ వచ్చిన పరిశీలనా గ్రంథం ఇది. అంతేకాకుండా ఒక్కొక్క కవినీ, వారి వివిధ గ్రంథాలనీ ఒక్కొక్క రమ్యమైన క్రమములో చూపిస్తూ, శబ్దప్రయోగ చమత్కృతులూ, అలంకార రమ్యతలూ, అర్థవిన్యాస పరిష్కారములూ, కథా సంవిధాన విశేషాలూ, మొదళ్ళ దగ్గరనుండి చిగుళ్ళవరకూ చెప్పుకుపోతూవుంటే ఒక రాగ ప్రస్తారం లాగ నడుస్తుంది. అందులోనే మా పీఠికాపుర ప్రభువుల రసజ్ఞత, విజ్ఞత, పాండిత్య ప్రకర్ష, కవితాపటిమ, ఔన్నత్య లక్షణాలు, ఔదార్య విశేషాలు, వివరిస్తూంటే ఒక స్వర్ణయుగాన్ని మన ఎదుట ప్రదర్శిస్తూన్నట్లే. ఇది నేటి పాలకులకీ, సాహిత్యప్రియులకీ, అందరకూ తెలియవలసినదీ, కావలసినదీని. కవి పండిత పోషణ అంటే మస్తూరీగా ఉండకూడదుకదా. గంగాధర రామా రావు గారి వద్దకు సన్మానాన్ని అందుకోవటానికి రాకపోతే ఆ విద్వత్ప్రభువే వారి వద్దకు వెళ్ళి సత్కరించి తమ భక్తిని సమర్పించుకున్నారట. మరొకరికి అర్థ సింహాసనాన్ని ఇచ్చేరట. వింజామర వేసారట. మాన్యతతో

పూన్యానిస్తే దేవమానంలో కొలిపించుకోవచ్చుననుకున్న బ్రాహ్మణ పండితుడు భూమి దేవులమని సమర్థించుకున్న చమత్కారానికి ముగ్ధులయ్యారట. కవి పండిత పోషణ అంటే ఎలాగుంటుందో అని అనుకున్నాను. జీవనభృతి పడేయడం కాబోలు అనుకున్నాను. కవి పండిత సేవ అంటే సరస్వతీ సేవ. అది ఒక ఆ రా ధ న అన్నమాట.

చాలా ఆవశ్యకమైన ఈ గ్రంథాన్ని వెలికి తీసుకువచ్చినందుకు కుమారి అనార్కలికి సాహిత్య ప్రియులు, సహృదయులూ, అందరూ కృతజ్ఞులు. పిఠాపురం వాడిని నేను మరీ ఋణపడిఉన్నాను. ఈ పరిశ్రమ విలువ అందరికీ తెలిసేదికాదు. విద్వత్కృషి విద్వాంసులకే గాని నాబోటి వాడికేం తెలుస్తుంది. ఈ పుస్తకం అంతా చదివిన తరువాత నేననుకునేది మాత్రం ఏమిటంటే అసలు అనార్కలి అచ్చమైన పరిశోధనాశీలి.

**Bacon** అన్నట్లు

**The Desire to seek**
**The patience to donate**
**Fondness to Meditate**
**Slowness to assert**
**Readiness to reconsider**
**Carefulness to dispose and set in order**
**and hating every kind of inposture.**

మొత్తంమీద ఈ గ్రంథ రచనలో అడుగడుగున ఈ సలక్షణాన్నీ అగపడుతున్నాయి.

**Research Students** కి విద్వదౌషధమూ,
ఆంధ్ర సరస్వతికి అమూల్యాలంకారమున్నూ.

ఇది ప్రశంసకాదు. రచయిత్రి విద్వత్పరిశ్రమకి అంచనా కట్టడమూకాదు. కేవలం కృతజ్ఞతాభినందన మాత్రమే.

# విన్నపము

నా "పిఠాపుర సంస్థానము - కవి పండిత పోషణ" అను సిద్ధాంత వ్యాసము ప్రకటింప బడుటకు కారణము ప్రప్రథమముగా నా తండ్రిగారు శ్రీ సి. వి. ఎస్. నారాయణదాసు, నా అన్న శ్రీ సి. మదనమోహన్ గారలు. వీరిరువురు ప్రత్యేకమైన శ్రద్ధవహించి ముద్రణ చేపట్టకపోయిన యెడల ఈ వ్యాసము సహృదయుల ఆదరాభిమానముల నందుకొనుట కలలోని మాటయని నేను హృదయపూర్వకముగా వక్కాణించుచున్నాను. ఇక దీని ముద్రణకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము పక్షమున సాంస్కృతిక శాఖ వారు 5000/- రూప్యముల నొసగి తమ సాహిత్యాభిమానమును ప్రకటించినందులకు, కృతజ్ఞురాలను. ఈ వ్యాసము చదివి సుప్రసిద్ధ పండితులు, సాహితీ బంధువులు, ఆత్మీయులునగు బ్రహ్మశ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రి, శ్రీ దివాకర్ల వేంకటావధాని, శ్రీ పన్నాల భట్టశర్మ, శ్రీ వెలమకన్ని సుబ్రహ్మణ్యశర్మ గారలు మిక్కిలి వాత్సల్యముతో నన్నాశీర్వదించుచు, అభినందించినందులకు వినయపూర్వకాంజలినై కృతజ్ఞతలు తెల్పుకొనుచున్నాను. ముద్రింపబడిన వెంటనే పిఠాపుర మహారాజా వారి కళాశాల శతవార్షిక జయంత్యుత్సవములలో 11-3-84 వ తేదీన ఆవిష్కరణ మహోత్సవమును జరిపించిన భ్రాతృతుల్యులు, కళాశాల ప్రధానోపాధ్యాయులునగు శ్రీ చక్రధరరావుగారికి, ముఖపత్ర చిత్రమును మేము కోరిన విధముగా కళాత్మకముగా తీర్చి దిద్ది సకాలమునకు అందించిన చిత్రకారుడు, శ్రీ వీరసాయిగార్కి, శ్రీపతి ప్రెస్, వసంత ప్రింటర్సువారికి, నా కృతజ్ఞతలు.

ఈ గ్రంథము ప్రణాళికా బద్ధముగను, పరిశోధన పరిధికి పరిమితమగుటవలనను, నేను సేకరించిన విషయమంతను ప్రదర్శించుటకు అవకాశము లేకపోవుటవలనను, పీఠికాపురాధీశులాదరించిన సాహిత్య సంపదను సంపూర్ణముగా సహృదయుల కందించలేకపోయితిని.

అట్లే విధముగా శ్రీ గంగాధర రామారాయుని "వరవర్ణిని స్తోత్రము", మహారాజావారి "పీఠికలు" కూడా ముద్రించవలెనని యున్నను ముద్రింపలేదు.

భాషావిషయికముగా రెండు మాటలు: కొంతవరకు సంధులు కలిపియు, మరికొంత విడదీసియు వ్రాయుట జరిగెను. ఇది ఆధునికులైన విద్యార్థులు, సాహితీ పిపాసుల కోర్కెపై జరిగెను. సాధ్యమైనంతవరకు ముద్రణ దోషములు లేకుండుటకై యత్నించినను, ఉత్పలమాలకు చంపకమాల, చం. కు ఉ. ఇత్యాది దోషములు దొరలినవి. సాహితీ వేత్తలీతప్పులను మన్నించి, సవరించుకొని చదువవలసినదిగా విజ్ఞప్తి చేయుచున్నాను. ఈ గ్రంథ రచన యాంత్రికముగా ప్రారంభించినను క్రమక్రమముగా, ఈ పిఠాపుర సంస్థానం నాది, ఇందలి కవులు పండితులు నా ఆప్తులు అను ఆత్మీయతా భావము నా హృదయమున పరిపూర్ణముగా నిండినది. క్షీరనీరములను వేరు చేయు రాయంచల వలె సద్విమర్శకులిందలి విశిష్ట విషయములను గుర్తింతురని ఆశించుచు సర్వులకు నా వినయాంజలి ఘటించుచున్నాను.

పరిశోధనకాలములో నాకు బహువిధముల ప్రోత్సాహము కలిగించుచు వచ్చిన నా మాతృదేవత శ్రీమతి చిట్నేని లక్ష్మీదేవియు, వ్యాసరచనలో అమూల్యములైన సలహాల నొసంగిన గురుదేవులు డా. పాటిబండ మాధవశర్మగారును బహుకాలము క్రిందటనే స్వర్లోకగతులగుట నాకు తీరనిలోటుగా నున్నను వారచ్చటనుండి నన్నాశీర్వదించుచున్నారను అనుభూతితో వారి నీ సందర్భమున సంస్మరించుకొనుచున్నాను.



శ్రీః

# పిఠాపురము: నాడు - నేడు

పిఠాపురమునకు భిన్న కాలములందు భిన్న నామములున్నట్లు ప్రమాణములు కనబడుచున్నవి. ఈ పట్టణము పిష్ఠపురమనియు, పీఠపురమనియు, పీఠాపురమనియు, శ్రీపీఠమనియు శాసనములందు పేర్కొనబడినది. గ్రంథములందు పీఠికాపురము, పురుహూతికాపురము అను నామాంతరములు కనబడుచున్నవి. క్రీ॥శ॥ మూడవశతాబ్దినాటి కొండవలి శాసనము మొదలు పృథ్వీ మహారాజు తాండివాడ శాసనము వఱకును గల శాసనములందెల్ల పిష్ఠపురమనియు, తదుపరి శాసనములలో పీఠాపురమనియు ఈ పట్టణము పేర్కొనబడినది.

పిష్ఠపురము యొక్క పూర్వరూపము పిట్టపురమనియు, అది పిష్ఠపురముగా పరిణతి చెందినదనియు నొక వాదము కలదు. [1]పూర్వమీ ప్రాంతమున బౌద్ధమతము వ్యాపించి యుండుటవలన బౌద్ధ జాతక కథలలోని కుక్కుట జాతక కథలకును పిఠాపురమందలి కుక్కుటేశ్వరునకును సంబంధము కలదనియు, తత్కారణమున ఈ పట్టణమునకు పిట్టపురమని పేరు వచ్చెననియు శ్రీ భావరాజు వేంకట కృష్ణారావుగారు అభిప్రాయపడుచున్నారు.[2] కాని వారు పేర్కొనిన కుక్కుట జాతక కథలకును పిష్ఠపురమునకు ఎట్టి సంబంధము లేదు వారు కుక్కుటేశ్వర మహాదేవుడు అచ్చట వెలసియుండుటచేత పిష్ఠపురమని పేరు వచ్చినట్లు స్థలమహాత్మ్యమున గలదనియు, కాని బౌద్ధారామమునే హిందువులు కుక్కుటేశ్వరాలయముగా మార్చుకొనిరనియు చెప్పుచున్నారు. ఇది కేవలము ఊహామాత్రమే యగును. [2]ఏల యనగా కుక్కుటేశ్వరాలయ నిర్మాణము మధ్య యుగమందలి చాళుక్య పల్లవ నిర్మాణమును పోలియున్నది. చాళుక్య-పల్లవ దేవాలయ నిర్మాణమునందు

గర్భాలయమునకు ముందుగా మంటపము, ప్రదక్షిణ మార్గమందలి ద్వారబంధము మీద ప్రలంబపాదగజలక్ష్మి చిహ్నము మలచబడి యుండును. ఈ లక్షణములన్నియు కుక్కుటేశ్వరాలయ నిర్మాణమున గలవు. [3]మఱియు, బౌద్ధజాతక కథలకు సంబంధించిన కుక్కుటసంఘారామమొకటి పాటలీపుత్రమున ఉన్నట్లుచారిత్రకాధారము కలదు. ఆలయములోని లింగము కుక్కుటాకారముతో నుండుట వలన 'కుక్కుటేశ్వరుడు' అని పేరు వచ్చినది. కాని బౌద్ధ జాతక కథల తో దీనికి సంబంధము లేదు. బౌద్ధ జాతక కథలయందలి కుక్కుట జాతక కథలు రెండింటి యందును పిఠాపురము ప్రసక్తి లేదు. [4]ఈ కుక్కుట జాతక కథలు మగధ, కౌశాంబీలలో జరిగినట్లు చెప్పబడినది. అట్టి యెడ కుక్కుట నామ సామ్యముచేతను, అందు బౌద్ధమతము వ్యాపించి యుండుట కారణముగాను, ఈ ప్రాంతమునకు జాతక కథలతో ముడి పెట్టుట పొసగదు.

[5]పృథ్వీశ్వరుని పిఠాపురపు శాసనమున, కుంతి తన కోర్కెలు తీర్చిన హరికి శ్రీ పీఠమునందు ఆస్థాన మంటపమును గట్టించినట్లు కలదు.[7] శ్రీ పీఠమనగా నిచట పిఠాపురము. కుంతి కోర్కెలు తీర్చిన హరి అందు వెలసియున్న కుంతీమాధవస్వామి.

ఈ పిఠాపురము అష్టాదశ శక్తి పీఠములలో నొకటియగు పురుహూతికాంబకు నిలయమగుటచేత పురుహూతికాపురమని పిలువబడుచుండెనని ఐతిహ్యము. పురుహూతికా శక్తియే పీఠాంబికయని పిలువబడుచుండెననియు, కావుననే యిది పీఠాపురమైనదనియు మఱికొందరందురు.

శ్రీనాథుడు తన భీమేశ్వర పురాణమున ఈ పట్టణమును పీఠికాపురము, పీఠాపురము, పిఠాపట్టణమనని మూడు విధములుగా పేర్కొనెను. అచటి యుపవనములను వర్ణించుచు _

సీ. త్రపుస పుష్పలతామ తల్లీ పటోలికా
కారవేల్ల కుడుంగకముల తోడఁ
గూష్మాండ వృంతాక కోలక చించికా
కాయమాన కదంబకములతోడఁ
శాకినీ మూలకచ్ఛత్రాక సారణీ
ధాన్యాక మేఘనాదములతోడ
చిప్పల్యుపోదకీ పీతపలాండుక
వాస్తు శాఖాకోటి వాటి తోడ
తే. గీ. రాజనలతోడ శృంగ బేరములతో డఁ
జిఱుగిడపు జొంపలము తోడఁ జేమతోడ
నొప్ప నాలుగు పొలములందుపవనములు
భువన సారము పీఠికాపురవరమున

అని పీఠికాపురముగా పేర్కొనెను

సీ ఏ పట్టణము ప్రోలనేలేఱు ప్రవహించు
బృథివికి ముత్యాలపేరునోలె
మునిగ్రాల పాఱువది మూర్తి సేవములతో
విహరించు నేపీట వేల్పు పిండు
పీఠాంబ చెలి యోగిపీఠ హుంకృతి దుర్గ
ననిచి కాపుండు నేనగరికెలనఁ
గుంతీ మహాదేవి కూర్మి మేనల్లుఁడు
మాధవుండేపీట మరగినాడు.
తే. గీ. పెద్దగవఁక్షులనే పుట భేదనమున
నెలకు నిలుచుండు వ్రీడావిహీన జఘనుఁ
డట్టి పీఠాపురము ఁజేర నరుగుదెంచెఁ
బరమ శైవుండు శ్రీ పరాశర సుతుండు.

–ఇచ్చట పీఠాపురముగాను, "కుంతీమాధవ దేవునకు విశ్రాంతి ప్రదేశంబును ......... ప్రాకార వప్రహట్టకుట్టిమంబగు పిఠాపట్టనంబుఁ బ్రవేశించిరంత" అను వచనమున పిఠాపట్టణముగాను పేర్కొనబడినది.

నేఁడు పిఠాపురమని పిలువబడుచున్న ఈ పట్టణము క్రీస్తుశకా

రంభమునుండియు రాజధానిగ ప్రసిద్ధివహించినది. [6]క్రీ॥ శ॥ 210 వ సంవత్సరము నందలి కొడవలి శాసనమున తొలుతగా పిఠాపురము యొక్క ప్రసక్తి కలదు ఈ శాసనము ఒక రాతి నూతి పై బ్రాహ్మీ లిపిలో వ్రాయబడి యున్నది ఇది శాతవాహన రాజగు ఆంధ్రవాసి ష్ఠీపుత్రస్వామి సిరిచండస్వాతి వేయించిన శాసనము. ఈ శాసనము వలన పిఠాపురము క్రీ॥ శ॥ 210 వ సం॥ లో ఆంధ్రరాజులయిన శాతవాహనుల పాలనమందుండెనని తెలియుచున్నది.

కొ డ వ లి శా స న ము :

1 సిద్ధం ... ... రణో ... ... వాసిఠి
2 పుతస ... ... సామి సిరి
3 చండ సాతిస ... ... రజ ... ... వచ్ఛ్చరె
4 మహి...స...ది ... ... ఖడ్లవలి
5 అనుచ సమి ... ... ఖసధమ
6 సాసిత

[8]ఈ శాసనమును పేర్కొనుచు, (శ్రీ) వడ్డాది రామచంద్రమూర్తి గారు తమ వ్యాసమున, పిఠాపురమునకు సమీపమునగల కొడవలి గ్రామము చెంత ఆంధ్ర రాజగు చందసాతిరాజు రెండవ రాజ్యసంవత్సరమున ఆతని మంత్రి శక అనతి బౌద్ధస్థూపములకు కొన్ని రాతి నూతులను గట్టించినట్లు శాసనాధారములు కలవని వ్రాసిరి.

[7]క్రీ॥ శ॥ 330 నుండి 375 వరకు గుప్తసామ్రాజ్యమును పాలించిన సముద్రగుప్తుడు, దక్షిణ దేశమునంతను జయించెనని ఆతని మరణానంతరము వేయబడిన గయా శాసనమున గలదు [9]అందు ఆతడు జయించిన రాజులను గూర్చి చెప్పుచు " ... ... పైష్టపురక మహేంద్ర " అని యుండుట వలన నాడు పిష్టపురము మహేంద్రుడను రాజు ఏలుబడి నందున్నట్లు తెలియుచున్నది. [8]ఈ గయా శాసనము క్రీ॥ శ॥

నాల్గవ శతాబ్ది నాల్గవ భాగమున లిఖింపబడి యుండునని శ్రీ కుందూరు ఈశ్వరదత్తుగారభిప్రాయపడిరి. దీనినిబట్టి నాలుగవ శతాబ్ద్యంతమున పిఠాపురము మహేంద్రుని పాలనములో నుండెనని చెప్పవచ్చును.

[9]క్రీ॥శ॥ 400–430 ప్రాంతమున కళింగ రాజగు ఉమవర్మన్ ఈ ప్రాంతము నేలినట్లు కొక్కులి తామ్ర శాసనము వలన తెలియుచున్నది. కొక్కులి గ్రామము పిఠాపుర వాసియగు కేశవ దేవునకు దానమీయ బడుట ఈ శాసనమందలి విషయము.

[10]తరువాత పిఠాపురము మాఠర కులజులచేత పాలింపబడినట్లు, వాసిష్ఠీపుత్ర మాఠరకుల వర్మాభిధానుడగు శక్తివర్మ రాగోలు శాసనమువలన తెలియుచున్నది. రాగోలు శాసనమున శక్తివర్మ
" స్వస్తి శ్రీ విజయ పిష్ఠ పురాత్కళింగాధిపతిర్మాఠరకులాలంకరిష్ణు ".
— అని తాను విజయ పిష్ఠపురము నుండి కుమార శర్మయను బ్రాహ్మణునికి రాగోలు గ్రామమును దానమిచ్చినట్లు వ్రాయించెను.

రాగోలు శాసనము తరువాత మాఠర కులజులు వేయించిన మరియొక శాసనము కిందొప్ప శాసనము. ఈశాసనకర్త దేవరాష్ట్రాధిపతి, వాసిష్ఠీకులచంద్రుడునగు మహారాజ గుణవర్మ పౌత్రుడు, ప్రభంజన వర్మ పుత్రుడు, కళింగాధిపుడునయిన అనంతవర్మ.

రాగోలు, కిందొప్ప శాసన కర్తలగు శక్తివర్మ, అనంతవర్మలు సముద్రగుప్తుని గయా శాసనకాలమునాటికి చిన్న రాజ్యములను స్థాపించుకొని, సముద్రగుప్తుని మరణానంతరము పిఠాపురము నేలిన మాఠర కులజులు. కనుక వీరి రాజ్యకాలము క్రీ॥ శ॥ ఆరవ శతాబ్దము.

[11A] క్రీ॥ శ॥ 611 నుండి 625 వరకుగల రెండవ పులకేశి ఐహోలు శాసనమున పులకేశి దిగ్విజయయాత్రలో పిష్ఠపురదుర్గమును, వేంగీనగరమును జయించినట్లు కలదు.

[11B] " పిష్టం పిష్టపురమ్ యేనజాతమ్ దుర్గమదుర్గమమ్।
చిత్రం యస్యకలేర్వృత్తమ్ దుర్గం దుర్గమదుర్గమమ్॥ "

[12] ఈ శాసన కాలము క్రీ॥ శ॥ 634 అని తెలియుచున్నది.

రెండవ పులకేశి వేయించిన మారుటూరు శాసనమునందును పిష్టపురము ప్రసక్తి కలదు " ... ... [13] ప్రవర్ధమాన రాజ్యవిజయ శ్రీవర్షేష్టమే పిష్టపురకాదాన గ్రహణానన్తర్యేణః " (Foot-Note లో read as " పిష్టపురకాదాన గ్రహణా నన్తర్యేణ " అని కలదు.) ఈ శాసన కాలము క్రీ॥ శ॥ 616.

పులకేశి సోదరుడగు కుబ్జవిష్ణువర్ధనుని ( క్రీ॥ శ॥ 624–41 ) [14] తిమ్మాపుర శాసనమున – " శ్రీమత్పిష్టపుర వాసకాత్ " అని పిఠాపురము పేర్కొన బడెను.

[15] తరువాత వేంగీదేశమును విష్ణుకుండినులు పాలించుచుండగా, వారి సామంత రాజు పృధ్వీమహారాజు పిఠాపురము రాజధానిగా తూర్పు గోదావరిజిల్లాను పాలించెడివాడని పృధ్వీమహారాజు తాండివాడ శాసనమును బట్టి తెలియుచున్నది. " శ్రీమత్పిష్టపురాత్సకల జగదవన ... ... శ్రీపృధ్వీమహారాజః " – అను నీ శాసనము వలన పృధ్వీమహారాజు పిఠాపురము నుండి భవశర్మ యను బ్రాహ్మణునికి తాండివాడ గ్రామమును దానము చేసినట్లు తెలియుచున్నది.

[16] అటుపిమ్మట నీ పిఠాపురమును చిక్కోర వంశజులు పాలించినట్లు సారనాథ్ శాసనమువలన తెలియుచున్నది. ఈ శాసనమును గన్యాకుబ్జ రాజగు గోవింద చంద్రుని దేవేరి–కుమారదేవి వేయించినది. ఈ శాసనమున పేర్కొనబడిన దేవరక్షితుడు వీరచోడుని కాలమున పీఠికాపుర దుర్గాధిపతియనియు, ఏతచ్ఛాసన కర్త్రియగు కుమారదేవి తాతడు జననీడనియు నీ శాసనము వలన విదితమగుచున్నది.

వీరచోడుడు క్రీ॥ శ॥ 1089 నుండి 1094 వరకును జీవించి యుండుట వలన దేవరక్షితుడును ఆకాలమునాటి వాడే అని పరిశోధకుల అభిప్రాయము.

" వంశే తస్య నమస్య పౌరుషజుషి ప్రస్ఫార కీర్తిత్విషి
ద్రాక్షా శౌచేన సూరాపగా మదముషి ప్రత్యర్థి లక్ష్మీరుషి
వీరో వల్లభరాజనామ విదితో మాన్యస్సభూమీభుజాం
జేతాసీత్పృథు పీఠికాపతరతిప్రౌఢ ప్రతాపోదయః
చిక్కోరవంశ కౌముదోదయ పూర్ణచంద్రః
శ్రీ దేవరక్షిత ఇతి ప్రథితః పృథివ్యామ్
పీఠీపతిర్గజపతేరపి రాజ్యలక్ష్మ్యాః
లక్ష్మ్యా జగాయ జగదేక మనోహరశ్రీః
కన్యా మహాణ దేవస్య తస్య కన్యేవ భూభృతః।
నా పీఠపః నానోఢా తేన నోఢా స్వయంభువా॥

— ఈశాసనము వలన పిఠాపురము రాజగు దేవరక్షితునికి, మహాణ దేవుని పుత్రియగు శంకరదేవికని జన్మించిన కుమారదేవియే కన్యాకుబ్జరాజైన గోవిందచంద్రుని పత్నియు, సారనాథ్ శాసనకర్త్రియు నని తెలియుచున్నది.

[17] క్రీ॥ శ॥ 1338 వ సం॥న వేయించబడిన దోనేపూడి శాసనమువలన పిఠాపురమును కొప్పుల వంశజులగు సామంతులు పరిపాలించినట్లు విదితమగుచున్నది ఈ శాసనకర్త కొప్పుల నామయనాయుడు. ఇందు కొప్పులవారి వంశవృక్షము కలదు. మరియు నీ శాసనము నామయనాయుడు గణపతియను విద్వాంసునకు దోనేపూడియను గ్రామము నిచ్చినట్లు తెలుపుచున్నది. ఈ శాసనమున పిఠాపురము యొక్క వర్ణన కలదు. ఆ శ్లోకమిందుదహరింపబడుచున్నది.

" పీఠాపురీ జయతి తత్ర సమస్త దేవ
సత్ప్రయత్న పరికల్పిత తోరణశ్రీః ।
యస్యాస్సునిర్మల నభోము కురాంతరాలే
ధత్తే సురేంద్ర నగరీ ప్రతిబింబ లీలమ్ ॥ "

[18] ఇక కుంతీమాధవస్వామి దేవాలయము నందలి స్తంభముల పైగల శాసనములవలన క్రీ॥ శ॥ 1186 వ సం॥ న మూడవ గొంకరాజు భార్య పీఠాపురములోని శ్రీ కుక్కుటేశ్వరస్వామికి నవఖండవాడ యను గ్రామమునిచ్చినట్లును, క్రీ॥ శ॥ 1195 లో కోన మండలాధిపతు లగు మల్లిదేవ, మనుమసత్యరాజులు శ్రీ కుంతీమాధవ దేవునికి ఒడియూరను గ్రామమొసగినట్లును ( నేడు ద్రాక్షారామ సమీపమున గల ఓదూరు), క్రీ॥ శ॥ 1202 లో మూడవ విజయాదిత్యుని కుమారుడు మల్లవిష్ణువర్ధనుడు కుంతీమాధవునికి గుడివాడ గ్రామము నిచ్చినట్లును, క్రీ॥శ॥ 1391 లో వేమారెడ్డి కుంతీమాధవస్వామి దేవాలయమునకు శిలాప్రాకారములు నిర్మించినట్లును దెలియుచున్నది.

పిఠాపురమునందలి మసీదు స్తంభములపై గల మరికొన్ని శాసనములు, క్రీ॥ శ। 1433 లో వాసిరెడ్డి పోతినీడు కుంతీమాధవుని దేవాలయమునకు మంటపము కట్టించినట్లును, తాటితోట వేయించినట్లును, దేవాలయమునకు సున్నము చేయించి శ్రీ లక్ష్మీదేవిని ప్రతిష్ఠించినట్లును, కుక్కుటేశ్వరాలయమున ఐదు ప్రతిష్ఠలు చేయించినట్లును, దెలుపుచున్నవి వాసిరెడ్డి పోతినీడు వేమ, వీరభద్రారెడ్ల సామంతుడు

ఇక గ్రంథములందును పీఠికాపురము యొక్క ప్రసక్తి కలదు. క్రీ॥ శ॥ 1056 సం॥ ప్రాంతము వాడగు పావులూరి మల్లన ( గణిత శాస్త్రవేత్త ) కు రాజరాజు నవఖండవాడ యను గ్రామమునొసగినట్లు

మల్లన తన గ్రంథమున తెలిపెను. ఆ సందర్భమునందాతడు పిఠాపుర మును పేర్కొనెను.

" ఉ॥ శ్రీలలనేశుఁ డంధ్రనృపశేఖరుఁడై చను రాజరాజ భూ
పాలకుచేతఁ బీఠపుర పార్శ్వమునన్న వఖండవాడ యన్
ప్రోలు విభూతితోఁబడసె భూరి జనస్తుత్యుఁడైన సత్కళా
శీలుఁడు రాజపూజితుఁడు శివ్వనపుత్రుఁడు మల్లఁడున్నతిన్. "

మల్లనకు తరువాత, కవి సార్వభౌముడు శ్రీనాథుడు తనభీమఖండమున పిఠాపురమును ఎనిమిది పద్యములలో అభివర్ణించెను.

ధూర్జటి రచించిన శ్రీకాళహస్తి మాహాత్మ్యము తృతీయా శ్వాసమున 68 వ వచనమున నత్కీరుడను కవి తీర్థములను సేవించుచు, " కుక్కుటేశ్వర పీఠము అను పీఠికాపురంబును " దర్శించినట్లు వర్ణింప బడెను.

19 తరువాత తెలాలి రామకృష్ణ కవి పాండురంగ మహాత్మ్యమున " కళింగ దేశ కంఠాభరణంబగు పీఠికాపురంబధిష్ఠించి " అని పిఠాపురము ను కళింగమునకు కంఠాభరణముగా పేర్కొనెను.

ఇట్లు ప్రాచీన గ్రంధములందేగాక పిఠాపురము యొక్క ప్రశస్తి " ఐతరేయ బ్రాహ్మణము " నందును గలదని పండితులు చెప్పుచున్నారు.

ఇట్లు ప్రాచీన శాసనముల వల్లను, గ్రంథములవలనను, పిఠాపురము రాజధానిగా బలువురు రాజులు కళింగదేశమును పాలించినట్లు తెలియుచున్నది. ఇవి పిఠాపురము యొక్క ప్రాచీనతకు నిదర్శనములు.

పిఠాపురమునందలి మసీదులోని స్తంభములపైగల శిలాశాసన ములు, పిఠాపురమును మహమ్మదీయు లాక్రమించుకొనిరని తెల్పు

చున్నవి. ఈ స్తంభములు శ్రీ కుంతీ మాధవస్వామి దేవాలయము నుండి తీసికొనిరాబడి, మసీదు నిర్మాణమున నుపయోగింపబడెనని ఆ శిలాశాసనముల మూలకముగా స్పష్టమగుచున్నది.

ఈ పిఠాపుర మెచ్చట నున్నదో ఆ పురము నేడెట్టిస్థితి యందు గలదో తెలిసికొనుట యావశ్యకము.

పిఠాపురము తీరాంధ్రదేశమున గోదావరి 'జిల్లా'కు ఉత్తర భాగమునగలదు. గోదావరిజిల్లాలోని కాకినాడ పట్టణమునకు పదునొకండు మైళ్ళ దూరమున పిఠాపురము కలకత్తా - మద్రాసు రైలు మార్గమందున్నది. పిఠాపురమునకు తూర్పున బంగాళాఖాతము, పశ్చిమమున పెద్దాపురము తాలూకా, ప్రత్తిపాడు తాలూకాలలోని కొంతభాగము, ఉత్తరమున తుని తాలూకా, దక్షిణమున కాకినాడ తాలూకాలు భౌతికమగు సరిహద్దులు.

1961 జనాభా లెక్కల ప్రకారమిది తాలూకా కేంద్రము. ఇట్టి పిఠాపురము రాజధానిగా నేర్పడిన పిఠాపుర సంస్థానము 138 చ॥మై విస్తారమును, 1,67,337 జనాభాయును కల్గియున్నది. ఈ సంస్థానము నేటికి 168 గ్రామములు, సుమారు మూడులక్షల జనాభా యును కల్గియున్నది. ఏలేరు, గోదావరి ఖండ నదీజలములతో నిచట కొన్ని వేల యకరముల భూమి సాగగుచున్నది. ఇందు వరి, చెఱకు, మిరప పంటలు, పలురకములగు మామిడిపండ్లు, కాయగూరలు విరివిగా ఫలించును. పిఠాపురమునందు పంచదార, ధాన్యపు మిల్లులు గలవు. చేనేత, మత్స్యసేకరణ లిచటి ప్రధాన వృత్తులు. నేడీ పిఠాపురము మంచి వ్యాపార కేంద్రము.

ప్రాచీన కాలము నుండియూ పిఠాపుర మొక గొప్ప యాత్రా స్థలము. ఆ యా కాలములందిది హిందువులకు, బౌద్ధులకు, జైనుల కు, మహమ్మదీయులకు నునికిపట్టు. ఈ ప్రదేశమున రెండు బౌద్ధ స్థానములున్నట్లు పరిశోధకులు కనుగొనిరి. పిఠాపురము మెయిన్

రోడ్డునందుగల 'సన్యాసి రాళ్ళను' పరిశోధకులు బౌద్ధవిగ్రహములుగా భావించుచుండిరి. కాని ఇవి జైనవిగ్రహములు. ఏల యనగా నివి దిగంబరములు. జైనమతమునందే శ్వేతంబరులు, దిగంబరులు అని రెండు తెగలు గలవు ఈ విభాగము బౌద్ధమున లేదు. సుప్రసిద్ధ చారిత్రక శిల్ప పరిశోధకులగు శ్రీ శ్రీపాద గోపాలకృష్ణ మూర్తిగారు వీనిని జైనవిగ్రహములనియే జెప్పిరి. వారీ విగ్రహములలో నొక దానిని కొనిపోయి కాకినాడలో మహారాజా వారి కళాశాలయందు భద్రపరచిరి.

ఇచట కుక్కుటేశ్వరస్వామి, కుంతీ మాధవస్వామి, వేణుగోపాల స్వామి, పురుహూతికాశక్తి నెలకొనియుండుటేగాక, పవిత్రమగు పాదగయాక్షేత్రమును వెలయుటచేత నిది హిందువులకు పుణ్యస్థలమై విలసిల్లినది. [20] స్థలపురాణమున –

" పంచమాధవ ప్రాముఖ్య కుంతీ మాధవరాజితః
కుక్కుటేశ క్రియాపరః పాణిన్యాచార్య జన్మభూః "

– అని యుండుటచేత నిది పాణిని జన్మభూమియని తలంచుటకవకాశము న్నది. పంచమాధవములలో – పిఠాపురమున కుంతీమాధవుడు, కాశికాపురిని బిందు మాధవుడు, ప్రయాగయందు వేణు మాధవుడు, రామ తీర్థమున లీలా మాధవుడు, రామేశ్వరమున సేతు మాధవుడు వెలసిరి. కుంతీ మాధవుడనగా కుంతిచేత ప్రతిష్ఠింపబడిన మాధవుడని కొందరందురు. కుంతాయుధము హస్తమునందు కలదు కావున కుంతీ మాధవుడయ్యెనని మరికొందరి భావము. కుంతీ మాధవుని విగ్రహమున హస్తమందు కుంతమును ధరించి యున్నట్లు కన్పట్టుచున్నది.

శ్రీనాథుడు తన భీమఖండమున పిఠాపురమును వర్ణించుచు " కుంతీ మాధవ దేవునకు విశ్రాంతి ప్రదేశంబును, హుంకారిణీ మహా దేవికి సంకేత భవనంబును, బీఠాంబికాలక్ష్మికాటకుటంబును, హేలా

నాటికి హాలాహల గోష్ఠీమంటపమ్మునకనంపగి భూతభేతాళ ఢాకినీ, ప్రేత రంకభైరవ వ్రాత నిర్మిత ప్రాకార వప్ర హట్ట కట్టిమంబగు పిఠాపట్టణంబు" అని పిఠాపురము భూతాదుల చేత నిర్మింపబడిన ప్రాకారము కలదిగా వర్ణించెను

పిఠాపురము నందలి దేవతాపీఠములలోని పీఠాంబిక విగ్రహము కుమారస్వామి దేవాలయములో కలదు ఈ పీఠాంబిక పూజాపురస్కారాదికములు లేక యుపేక్షింపబడి యున్నది ఈ శక్తి పేరటనే పిఠాపట్టణము, పీఠికాపురము అని పురనామము ఏర్పడినట్లు చెప్పుదురు.

ఇక హుంకారిణీశక్తి ఎచటనున్నదియో కానరాదు కాని కుక్కుటేశ్వరాలయమునందు గర్భగుడిలో నొక గోడలో 'ఓంకారిణీదేవి' అని పేరు చెక్కబడిన దేవతావిగ్రహ మొకటి కలదు. ఓంకారిణియు హుంకారిణియు నొక్కటేయని నా భావము. వ్యాస విరచిత భీమ ఖండమునను, శ్రీనాథుని భీమఖండాంధ్రీకరణమునందును పిఠాపురము నందు పీఠాంబచెలియగు దుర్గయు, హేలాశక్తియున్నట్లుకలదు. ఇందు హేలాశక్తి విగ్రహము కానరాదు దుర్గాశక్తి విగ్రహమును ప్రత్యేకముగా లేదు. కాని వ్యాసుడు "పీఠాంబికా సఖం దుర్గాం" అని చెప్పగా, శ్రీనాథుడు — "పీఠాంబ చెలి యోగపీఠి హుంకృతి దుర్గా, ననిచి కాపుండు నే నగిరి కెలన" అని హుంకృతి దుర్గగా పేర్కొనెను. ఈ హుంకృతి దుర్గయు, తొలుత పేర్కొనిన హుంకారిణీ దేవియు నొక్కటేకావచ్చు ననియు తోచుచున్నది. హుంకారిణియు పురుహూతికాశక్తియు నొక్కటియని కొందరి యూహ. ఈ పురుహూతికాశక్తి అష్టాదశ శక్తపీఠములలో నొకటి.

"శ్లో॥ లంకాయాం శాంకరీదేవి, కామాక్షీ కాంచికాపురే,
ప్రద్యుమ్నే శృంఖలాదేవీ, చాముండా క్రౌంచపట్టణే,
అలంపురే జోగులాంబా, శ్రీశైలే భ్రమరాంబికా,
కొల్హాపురే మహాలక్ష్మీ, మాహూరే ఏకవీరికా,

ఉజ్జయిన్యాం మహాకాళీ, పీఠాయాం పురుహూతికా,
ఓఢ్యాణే గిరిజాదేవీ, మాణిక్యాం దక్షవాటికే,
హరిక్షేత్రే కామరూపీ, ప్రయాగే మాధవేశ్వరీ,
జ్వాలాయాం వైష్ణవీదేవీ, గయాయాం మాంగళ్యగౌరికా,
వారణాస్యాం విశాలాక్షీ, కాశ్మీరేతు సరస్వతీ. ”

– ఇవి భారతదేశమందలి అష్టాదశ శక్తిపీఠములు ఈ శక్తులు పార్వతీదేవి అంశలుగా భావింపబడుచున్నవి. పార్వతీదేవి ఇట్లు వెలసెననుట కాధారముగా నొక కధ చెప్పబడుచున్నది.

దక్షయజ్ఞమునకు అనాహూతగా వెడలిన సతీదేవి, జనకునిచేత పరమశివుడు నిందింపబడుట సహింపలేక, స్వయముగా దహించుకొని పోయినది. పరమేశ్వరుడీ వార్త విని, రౌద్రముగా దక్షవాటికకు పోయి, సతి కళేబరమును దీసికొని, ప్రపంచమంతటను ఉగ్రతాండవము చేయుచుండెను. ఈ శివతాండవము ప్రళయమునకు దారితీయునని తలంచి, మహావిష్ణువు రుద్రుని రౌద్రమును శాంతింపజేయుటకై సుదర్శనచక్రమును ప్రయోగించెను ఆ సుదర్శనము సతి దేహమును పదునెనిమిది భాగములుగా ఖండించెను. ఆ పదునెనిమిది భాగములు పతనమైన ప్రదేశములు భారతదేశమున అష్టాదశ శక్తిపీఠములుగా వెలసినవి

పిఠాపురమున వెలసిన పురుహూతికాశక్తి, ప్రాచీనపండితులు ఐదువేల సంవత్సరముల క్రిందటి కాలమున వెలసియుండునని పురాణ కాలనిర్ణయమును బట్టి యూహించుచున్నారు. శ్రీ వెలమకన్ని శ్రీరామమూర్తిగారు తమ “ పీఠికాపుర క్షేత్రము ” అను గ్రంథమున ( 51వ పుట ) “ పాశ్చాత్య పండితుల అభిప్రాయం ప్రకారం క్రీ॥ శ॥ 10వ శతాబ్దం స్కాంద పురాణ రచనా కాలంగా నిర్ణయింప వలసి ఉంటుంది. పాశ్చాత్య పండితుల సిద్ధాంతాన్ననుసరించి, పురుహూతికా శక్తి వేయి సంవత్సరాలకు పూర్వము నాటిదని చెప్ప వచ్చును.

మొత్తముమీద నీ శక్తి చాల ప్రాచీన కాలము నాటిదని మనమంగీకరింపవచ్చును" అని తెల్పిరి.

ఈ పీఠములు గాక పిఠాపురమున 'కోటశక్తి' యను పిరనొక శక్తి పిఠాపురదుర్గమును కాపాడుచుండెననియు, నా శక్తి విగ్రహ పునః ప్రతిష్ఠలో జరిగిన పొరపాటు మూలకముగా శక్తి కోట విడిచి పోయెననియు నొక గాథ వినవచ్చుచున్నది. మరియా కోటశక్తి పోయిననాటి నుండియు రాజ్యము క్షీణదశకు వచ్చెనని ప్రాజ్ఞులందురు

ఈ దివ్యక్షేత్రమున వెలసిన కుక్కుటేశ్వర మహాదేవునికి సంబంధించిన కథలు కొన్ని గ్రంథములందు గానవచ్చుచున్నవి.

శ్రీ కుక్కుటేశ్వరస్వామి పిఠాపురమున వెలయుటకు కారణముగా నొక గాథ వాయుపురాణమునను, ఓఢ్రభాషయందు రత్నాకర భట్టో మహాకవి రచించిన రామాయణము నందు గలదు. అదియే గయాసుర వృత్తాంతము. క్రీ॥ శ॥ 1886 సం॥న శ్రీ రాజా రావు వేంకట మహీపతి గంగాధర రామారావు గారు మల్లవరము సమీపమున నొక తటాకమును త్రవ్వింపగా నందొక తామ్ర శాసనము లభించినది. ఈ శాసనవిషయము గయాసుర వృత్తాంతము. శాసనస్థ భాష పాళీ, లిపి దేవనాగరి. ఈ కథయు నోఢ్ర రామాయణము నందలి గయాసురుని కథయు నించుమించుగా సమానములు ఈ గాథ జనవ్యవహారమునందును గలదు. ఓఢ్ర రామాయణమునందిది ఉండుటచేత పిఠాపురము ఓఢ్రులకు ప్రధానమగు పుణ్యక్షేత్రమయ్యెను నేటికిని ఓఢ్ర దేశమునుండి యాత్రికులు వచ్చి కుక్కుటేశ్వరుని దర్శించి, పాద గయా తీర్థమునస్నానమాడుట కానవగుచున్నది

పిఠాపురమును గయాసురుడు పరిపాలించుచుండెను. ఆ యసురుని బాధలు భరింపలేక ఇంద్రాది దేవతలు శివునికి నివేదించుకొనిరి.

అంతట బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ముచ్చురును గయాసురునిలో లోపము చూచి శిక్షింపవలెనని పన్నుగడ పన్ని, వృద్ధ బ్రాహ్మణ వేషములు ధరించిరి. అట్లా త్రిమూర్తులు గయాసురుని చేరనరగి తాము చేయ సంకల్పించుకొనిన యాగమునకు పవిత్రమగు స్థలము కావలయునని కోరిరి. గయాసురుడు అమితానందముతో, తన వక్షము పవిత్రమైనది గనక నందు యాగమొనరింపుడని ప్రార్థించెను. ఆ బ్రాహ్మణులు ఏడహోరాత్రములు యాగము పరిసమాప్తియగువరకు నెట్టియంతరాయము కలుగరాదనియు, అందులకు విరుద్ధముగా జరిగిన యెడల గయాసురుని శిక్షింతుమనియు తెలిపిరి. గయాసురుడందుల కామోదించెను.

త్రిమూర్తులు గయాసురుని వక్షమున హోమగుండమును బ్రజ్వలింపచేసి యాగమారంభించిరి. అట్లు యాగము ఆరుదినములు నిరాటంకముగా సాగి, ఏడవదినము పూర్తి అగుటకు రెండు యామము ల కాలముమాత్రమున్నది జనుసనిలో కదలిక లేదు. త్రిమూర్తు లకాతని శిక్షించుటకు లోపము కనుపింప లేదు. శ్రీమన్నారాయణు డు కపటోపాయము పన్ని, శివుని కుక్కుటరూపము ధరించి, నాల్గవ యామమందు కుక్కుటధ్వని చేయుమనగా నాతడట్లొనరించెను. కుక్కు టరావమును విని గయాసురుడు ఏడు దినములు పూర్తి అయ్యెనని భ్రమించి లేచుటకు పక్రమింపగా, త్రిమూర్తులు యాగభంగమయ్యె ననుచు శపింప నుద్యుక్తులైరి అంతట గయాసురుడు వీరిని త్రిమూ ర్తులుగా గ్రహించి, వారినిధ్యానించి, పూజించి, యాహరిహరబ్రహ్మ లు తనవక్షమునందాక్రమించిన స్థానమునందు నివసింపుడని ప్రార్థిం చెను. మరియు నా త్రిగయలలో పిండప్రదానము చేసినయెడల జీవులకుత్తమగతి ప్రాప్తించునట్లు వరమడిగెను.

శ్రీహరి వానికా వరము ప్రసాదించి వాని శరీరమును మూడుభాగములుగా ఖండించెను. వాని శిరము పడిన ప్రదేశము

శిరోగయ (గయ) అనియు, మధ్యభాగము పతనమైన చోటు నాభిపురము (జాజిపురము) అనియు, పాదములు పడిన పీఠపురము పాదగయ అనియు చెప్పబడుచున్నవి ఆ పాదగయా క్షేత్రమందే శివుడు కుక్కుటలింగాకారము ధరించి గయాసురునికి ముక్తిని ప్రసాదించెను.

ఇదిగాక కుక్కుటేశ్వరుని గూర్చి మరియొక గాథ గలదు. కిమ్మీరసీమ యని ప్రసిద్ధివహించిన వేంగీదేశమునకు, పిఠాపురమున వెలసిన కుక్కుటేశ్వరునికి, అచట ప్రవహించెడి ఏలానదికి కలిపి ఈ కథ ముడిపెట్టబడెను.

వేంగి దండకారణ్యములలో కిమ్మీరాసురుడు శివుని గూర్చి ఘోరమగు తపమొనరించి, తాను నివసించుచున్నప్రదేశము తన పేరిట ప్రసిద్ధి పొంద వలెననియు, అచట సస్యసమృద్ధికి ఒక ఉత్తమ నదిని ప్రవహింప జేయవలెననియు, ఆ నదికి సాగర సంగమత్వము ఉండ రాదనియు వరమును పొందెను. మహాదేవుడు వానికా వరమొసగి, తత్సాఫల్యార్థము ఏలాముని నుపయోగించుకొనెను.

నారదుని ప్రేరణచేత పతి శిరస్సునుండి గంగను తొలగింప సమకట్టిన పార్వతీదేవి తన చెలికత్తెల నిరువురను గోరూపమున గౌతమాశ్రమమునకు పంపెను. ఆ గోవులు రెండును ఆశ్రమమునందలి నీవార ధాన్యమును భక్షించి సస్యమునల్లకల్లోలము చేయగా, గౌతముడు వానిని తనచేత నున్న దర్భాగ్రములతో నదలించెను. ఆ స్వల్ప కారణమునకే ఒక ఆవు అచటనే మరణించెను. రెండవది తత్సమీపమునగల ఏలాముని ఆశ్రమమునకేగి యచట తనువు విడిచెను. గౌతముడీ గోహత్యా పాతక నివారణార్థము గంగను భువికి తెచ్చుటకై బ్రహ్మనగమున తపమొనరించెను. ఇంద్రుడు ఊర్వశిని పంపినను గౌతముడు చలింపక నిర్విఘ్నముగా తపముచేసి పరమేశ్వరుని సాక్షాత్కరింప జేసికొని సిద్ధతటిని పొందెను.

ఆ గంగానదిని గౌతముడు తన ఆశ్రమము మీదుగా ప్రవహింపజేసి, సాగరాధీనము గావించి గోహత్యా పాతకమునుండి విముక్తుడయ్యెను.

**ఏలాముని కథ :** ఏలా మునియు, తన ఆశ్రమమున ఆవు మరణించుట వలన, ఆ పాతకమును నివారించుకొనుటకు వింధ్య పర్వతమున తపము జేయనారంభించెను. కాని ఇంద్రుని పనుపున వచ్చిన తిలోత్తమను జూచి మోహితుడై కొంతకాలమామెతో గడపెను. తిలోత్తమ తిరిగి స్వర్గమునకు వెడలిపోగా ఆమెకై దుఃఖించు ఏలా మునిని, గోహత్యాపాతకము వలన పాండురోగమావహించెను ఏలా ముని అంతట, గౌతముడు గంగను సాధించుట విని, తన పాప నివారణార్థమొక శాఖను బ్రసాదింపుమని యాతనిని కోరెను. గౌతమునకు గంగను సాగరాధీనము చేసియుండుటచేత ఏలాముని కోర్కె తీర్చ లేకపోయెను. మార్గాంతరము లేని ఏలాముని కఠోరముగా తపస్సు జేసి శివుని వలన గంగానదిని పొందెను. ఏలాముని ఆశ్రమము గల ఏలేశ్వరము ద్వారా ఆనదిని తీసికొనిపోయి, తజ్జలమున నేలేశ్వరునభిషేకించి తదుపరి కిమ్మీరసీమనుండి పిఠాపురమున ప్రవహింపజేసి సాగరాధీనము కావింపుమని శివుడు ఏలామునికి తెలిపెను మరియు నేలాముని వెనుదిరిగిచూడక పోవుచుండవలెననియు, సూర్యోదయాత్పూర్వమే సాగరాధీనము జేయుమనియు, మునిని అనుసరించి వచ్చెడి నది, ముని వెనుదిరిగిన అచటనే యాగిపోవునని శివుడు తెల్పెను.

శంకరు డాదేశించిన ప్రకారము ఏలాముని గంగాజలముతో ఏలేశ్వరునభిషేకించి, నదిని పిఠాపురము వరకూ తీసికొనిపోయెను. శివుడచట కుక్కుటరావము చేయగా ఏలాముని తెల్లవారెనాయని కలతపడి వెనుదిరిగెను. వెనువెంటవచ్చు గంగానది మరి సాగక నిలిచిపోయెను. నదిని సాగరమున సంగమింపజేయకుండా ఆటంక పరచిన కుక్కుటముపైనలిగి ఏలాముని శపింప నుద్యుక్తుడయ్యెను. అంతలో శివుడు ప్రత్యక్షమై తాను కిమ్మీరాసురునికి ప్రసాదించిన వరము

ఫలింపజేయుటకు కుక్కుటధ్వని జేసితినని జెప్పెను. ఆ నదిని పాదగయా క్షేత్రమున కలుపుమని యాదేశించి, పాదగయలోగాని, ఏలానదిలో గాని స్నానమొనరించి, అచ్చట కుక్కుటలింగ రూపముననున్న తన్ను భజించిన వారికి ముక్తినిత్తునని చెప్పి మహేశ్వరు డంతర్ధానమయ్యెను. మహేశ్వరుడే కుక్కుటేశ్వరుడు. ఏలామునిచేత తీసుకురాబడిన గంగానది యే ఏలానది. కిమ్మీరాసురుని రాజ్యమే కిమ్మీరసీమ

ఇట్లు ఇంకను కుక్కుటేశ్వరుని గూర్చిన కథలు పెక్కులు గలవు. పౌరాణికముగా ప్రసిద్ధికెక్కిన పిఠాపురము నేటికిని గొప్పయాత్రా స్థలమై పలువురు యాత్రికులనాకర్షించుచున్నది. ఈనాటికినీ ఏడాదికొకసారి కుక్కుటేశ్వరస్వామి కల్యాణము, కుంతీమాధవస్వామి కల్యాణము, రథోత్సవములు జరుగుట పరిపాటి. శివరాత్రినాడు కుక్కుటేశ్వరస్వామి దర్శనార్థము, పాదగయాక్షేత్రమున స్నానముజేయుటకు లెక్కకుమించిన యాత్రికులు వచ్చుచుందురు. శివరాత్రికి ప్రభల నూరేగించుట ఒకవిశేషము.



# సూచికలు


1 A History of the Early Dynasties of Andhra Desa C. 200-625 A. D., Chapter II - The Andhra Kings of Kandarapura - C. 290-630 A. D. Page 334 - By B. V. Krishna Rao.

2 పీఠికాపుర క్షేత్రము – శ్రీకుక్కుటేశ్వరుని చారిత్రికత – 81వ పుట – వెలమకన్ని శ్రీరామమూర్తి.

3 2500 years of Budhism - Govt. Publication (1956) - page 99.

4 Jatakas Vol. III page 78. — Jatakas Vol. IV page 168 Kukkuta Jataka Stories — Cowel Editions.

5 ఎపిగ్రాఫియా ఇండికా – 4వ సంపుటి – 52వ పుట.

6 పిష్టపుర ప్రాచీన చరిత్ర – 212వ పుట – వడ్డాది రామచంద్రమూర్తి – ఆంధ్ర సాహిత్యపరిషత్తు రజతోత్సవ సంపుటి– ఎపిగ్రాఫియా ఇండికా XVIII 316పుట.

7 Godavari District Gazetteer - page 233.

8 పిఠాపుర ప్రాచీన చరిత్ర – 63వ పుట – ఆంధ్ర సాహిత్య పరిషత్ప్రోక్త – మహారాజావారి స్మారక సంచిక.

9 తెక్కలి తామ్రశాసనం – ఎపిగ్రాఫియా ఇండికా – Vol. 18.

10 Epigraphia Indica - Vol. 9 - page 3 19.

11A Godavari District Gazetteer - page 233.

11B Epigraphia Indica - Vol. 6 - page 11.

12 Indian Antiquary - Vol. VIII - page 237.

13 Andhra Pradesh Govt Archaelogical Series No. 8 — Copper Plate Inscriptions of Andhra Pradesh Govt. Museum Hyderabad. — Vol. 1 — page 37.

14 Epigraphia Indica - Vol. 9 - page 319.

15 భారతి – యువనామ సం॥ భాద్రపదమాస సంచిక – 495–501 పుటలు.

16 Epigraphia Indica - Vol. 9 - pages 319-328.

17 Epigraphia Indica - Vol. 4 - pages 4-51.

18 స్మారక సంచిక – పిఠాపుర ప్రాచీన చరిత్ర – 77, 78 పుటలు
Epigraphia Indica - Vol. 4 - 4, 10, 33, 47 pages.

19 పాండురంగ మాహాత్మ్యము – తృతీయాశ్వాసము – నిగమశర్మోపాఖ్యానము – 129వ పుట.

20 శ్రీ పీఠికాపుర క్షేత్రమాహాత్మ్యమ్ ( స్థలపురాణము ) – 8వ శ్లో॥ ఆంధ్ర సాహిత్య పరిషత్తు, కాకినాడ.

# పిఠాపురము : జమీందారుల వంశక్రమము

ఆంధ్ర సంస్థానములలో సాహిత్య పోషణమందేమి, సంగీత నాట్యాది కళా పోషణమందేమి పేరెన్నికగనినది పిఠాపుర సంస్థానము. ఈ సంస్థానాధిపతులు తొలుత క్షత్రియులనియు, పరశురాముని ధాటికి ఆగజాలక శూద్రత్వమును బూనిరనియూ, వీరు నేడు వెలమవారని పిలువబడుచుండిరనియు – ఇతిహాసములు, భవిష్యోత్తరాది పురాణములు, సంహితాదులును దెలుపుచున్నవి.

ప్రాచీన శాసనములలో క్రీ॥ శ॥ 1444 వరకును వేమారెడ్డి, వీరభద్రారెడ్ల శాసనములు కానవచ్చుచున్నవి. వీరితరువాత నీప్రాంతమును గజపతులు వశపరచుకొనిరి. పిఠాపురమునకనతి దూరమున గల పెద్దాపురము తాలూకాలోని తిరుపతి శ్రీ రంగరాయదేవాలయమునందలి శాసనము వలన క్రీ॥ శ॥ 1458వ సం॥న కపిలేశ్వర గజపతి సామంతుడగు రఘుదేవనరేంద్రుడు రాజమహేంద్రవరమును పాలించినట్లు తెలియుచున్నది. దీని వలన పదునైదవ శతాబ్దము వరకును ప్రోల్నాడు గజపతుల పాలనముననున్నట్లు తెలియుచున్నది. తదుపరి పదునారవ శతాబ్దమున నీప్రాంతము గోల్కొండ నవాబులగు కులీ కుతుబ్ షాహి వంశజులాక్రమించుకొనిరి.

కులీ కుతుబ్ షాహీ క్రీ॥ శ॥ 1512 వ సం॥న తెలుగు దేశమును జయించెను ఈతని తృతీయ పుత్రుడగు ఇబ్రహీం కుతుబ్ షాహి క్రీ॥ శ॥ 1550లో రాజ్యమునకు వచ్చు నాటికె పిఠాపుర సంస్థానాధిపతుల పూర్వీకులు కొందరు కోసలదేశమునుండి దక్షిణ దేశమునకరుదెంచి తెలుగు దేశములోని మెతుకు, కైలాస కోటల నాక్రమించుకొని తురుష్క ప్రభువులతో చెలిమి చేయుచుండిరి. వీరిది రావు వంశము. ఇబ్రహీంషా కాలమున నీ రావు వంశీయులకు గోల్కొండలో జాగీర్లు లభించెను.

కుతుబ్ షాహీలు గోల్కొండ పరిపాలనమునకు వచ్చునాటికి దేశ మరాజకముగా నుండెను. [2]అందు నిమిత్తము వారు ప్రోల్నాడు, కాకినాడ పరగణాలను 'చిట్నివీడు' వారు అను వెలమవారికొసంగిరి. చిట్నివీడు వారిలో ప్రసిద్ధులైన ధర్మారాయణింగారు, రావు తెనుగు రావుగారి (పిఠాపుర సంస్థానమును సంపాదించినవారు) మేనమామయగు చిట్నివీడు రామారాయణింగారికి నాలుగు తరముల వెనుకవారు. ఈ చిట్నివీడు రామారాయణింగారు పుత్రసంతతిలేక తమ మేనల్లుడగు తెనుగురావు గారిని చెంతనుంచుకొనిరి. [3]రామారాయణిం గారు ఇబ్రహీంషా కుమారుడగు సుల్తాన్ అబ్దుల్ కుతుబుల్ముల్క్‌కు బాకీ యుండుటవలన మేనల్లుని నవాబులకు జామీనిచ్చినట్లు తెలియుచున్నది. [4]తెనుగురావుగారు గోల్కొండ యందుండగా తదనుజులగు గుర్వారావు, నరసింహారావు, రంగశాయి ననువారు మువ్వురును సామర్లకోటలో మేనమామయగు రామారాయణింగారి సంరక్షణమున నుండిరి.

[5]అట్టి యెడ గోల్కొండ బాదుషా నొక ముష్కరుడు కోటిల కీతిని వెన్నుపోటు పొడుచుటకు యత్నింపగా నది గమనించి తెనుగు రావుగారు వెంటనే పరాక్రమోపేతులై తమ ఖడ్గమున వానిని సంహ రించిరి. (ఈ ఖడ్గము పిఠాపురము కోటయందు 'పెద్దఫిరంగి' యను పేర గలదు) అంతట నవాబు మూదమంది అనపత్యులగు రామా రాయణింగారి యనంతరము తద్రాజ్యమునకు తెనుగురాయణింగారి నధిపతిగాచేసి, పీఠికాపురము రాజధానిగా నాప్రాంతమును బాలింప వలయునని ఆజ్ఞాపించిరి. ఇట్లు తెనుగురావుగారి కాలమందు పిఠాపుర సంస్థానమేర్పడెను.

నాటి నుండియు పిఠాపురము సంస్థానము నేలిన ఈ రావు వంశీ యులకు మూలపురుషుడు అనపోతమనీడు ఈ ప్రభువు కాలమునాటికే వీరు మెతుకు, కైలాసకోటలందు నివసించుచుండిరి. అనపోతమనీనికి మాధవరాయలు, సర్వజ్ఞసింగమనీడు నను నిరువురు తనయులు కలిగిరి.

మాధవరాయునికి తిరుమల మాధవరాయలని నామాంతరము గలదు. ఈతడు విష్ణుభక్తుడు. మాధవరాయలు శ్రీరంగమున శైవ, వైష్ణవ వివాదమున పాల్గొని శైవుల జయించి అమరపురికేగెను. [6]మాధవ రాయని పుత్రులలో కొందరు వెలుగోటివారను పేరుతో వెంకటగిరి ప్రభువులైరి. మరి కొందరు బొబ్బిలి సంస్థానాధిపతులైరి. ఇంకను కొందరు జటప్రోలు పురాధీశ్వరులును, మైలవర సంస్థానాధిపులునైరి. మాధవరాయని కొమరులలో రంగరాయలు పరాక్రమశాలి. రంగ రాయని తనయుడు ధర్మారాయడు. ధర్మారాయనికి లచ్చారావని సుతుడుదయించెను. లచ్చారాయని బాల్యమున తన రాజ్యము యవ నాధిపతిచేత నాక్రమింపబడెను తదుపరి లచ్చారావు గోల్కొండ నవాబుల వద్ద సర్దారుడై యుండెను. లచ్చారాయునికి ధర్మారాయ, మాధవరాయ, వేమారాయలను ముగ్గురు పుత్రులు కల్గిరి. వీరిలో మాధవరాయునికి గుర్వారావు, తెనుగురావు, నరసింహారావు, రంగ శాయి అను నల్గురు కొమరులుదయించిరి. వీరిలో మాధవరాయని తెనుగురావే పిఠాపుర సంస్థాన ప్రతిష్ఠాపకులు.

తెనుగురాయణింగారికి మాధవరావు, వెంకటపతిరావు, చిన్నా రావు, రామచంద్రారావు, జగ్గారావు, కృష్ణారావు, రంగశాయిరావు అను నేడుగురు తనయులు కలిగిరి తెనుగురాయణింగారు నవాబును ముష్కరుని బారినుండి రక్షించి పిఠాపుర సంస్థానము పొందిన తరువాత కొంతకాలమునకు జగన్నాథక్షేత్రమునకు వెడలి, అచ్చట తనువు చాలించిరి. పిమ్మట వారి పుత్రులలో జగ్గారావు, కృష్ణారావుగార్లు నవాబు కడ సరదారులుగాను, రంగశాయి దర్బారులో చతురంగ ఖేలకునిగాను ఉండిరి. కృష్ణారావుగారు గోల్కొండయందు రెండువేల సైన్యమునకధిపతులు. వేంకటపతి, చిన్నారాయ, రామచంద్రులు చామర్లకోటయందు చిట్నివీసు రామారాయణింగారి చెంత నుండిరి. తెనుగురావుగారి కాలమందే పిఠాపుర సంస్థానమేర్పడినను. తొలుత తద్రాజ్యాసనమునకాధిపత్యము వహించిన వారు రామచంద్రారావుగారు.

# రామచంద్రారావు
( క్రీ॥ శ॥ 1647_71 )

తెనుగురాయణింగారి ఏడుగురు పుత్రులలో మధ్యములగు రామచంద్రారాయణింగారికి పీఠికాపురాధిపత్యము లభించుటకు కారణము గలదు. గోల్కొండయందు చతురంగ ఖేలకుడగు రంగశాయిరావు గారితో నొకనాడు నవాబు అబ్దుల్లా కుతుబుల్ ముల్క్ చదరంగమాడుచు, తామోడిపోవు తరుణమున అసహనముతో రంగశాయిని నిందించెను. ఆ అవమానము సహింపలేక రంగశాయి ఖడ్గముతో పొడుచుకొని మరణించెను. ఈవిపరీతమునూహింపని పాదుషా విచారించి రంగశాయి సోదరుడగు కృష్ణారావును పిలిచి ఊరడించెను. మరియూ తత్పరిహారార్థము కృష్ణారాయనికి సైన్యాధిపత్యమొసగెను. పిదప తదీయ మాతులుండగు చిట్టిఖాను రామారాయణింగారు మరణింపగా, నవాబు తద్రాజ్యమును కృష్ణారాయునికివ్వదలంచెను. కృష్ణారాయణింగారంతట నారాజ్యమును తమయన్నగారగు రామచంద్రారావుగారికిమ్మని పాదుషాను ప్రార్థించి క్రీ॥ శ॥ 1647లో రామచంద్రుని పేరిట 'ఫర్మానా' ను తీసికొనిపోయిరి. నవాబాతని నిస్వార్థతకెంతయో సంతసించెను. రామచంద్రారాయణింగారు ఆ పత్రమును స్వీకరించి రాజ్యపీఠమధిష్ఠించిరి. ఆ పత్రమున ఐదు నిబంధనలు గలవు. అవి :

1. కాకినాడ, సెలపాక, ప్రోలునాడు – అను నీ మూడు పరగణాలును రామచంద్రారావుగారి ' జమిందారీ ' యందుంచుకొని, ఏటేటా పన్ను కట్టవలయును.
2. ఖర్చుల నిమిత్తము సామర్లకోట, గోవిందరాజులపాలెం, వేంకటరాయనగరం, కాపవరం, గొల్లమందలపాడు గ్రామములనను భవింపవలయును.
3. యుద్ధసమయములందు నాలుగువేల సైన్యముతో వచ్చి నవాబునకు సరదారుగా పనిచేయవలెను.

4. ఏలేటి వరద నీరు కిమ్మూరసీమకు ఆరురోజులును, ప్రోలునాడు పరగణాలకు పదివారములును ప్రవహింపజేయవలెను.

5 పిఠాపురమునందలి కోట నివాసయోగ్యమొనరించుకొని అందు నివసింపవలయును.

ఇక సంస్థానపు 'రికార్డు' లదును, వానినాధారముగా జేసికొని వ్రాసిన 'రావు వంశ ముక్తావళి' యందును, తెనుగురాయణింగారి యనంతరము వారి చతుర్థపుత్రులగు రామచంద్రారావుగారే రాజ్యమునేలినట్లు కలదు అంతేకాని తెనుగురాయని జ్యేష్ఠపుత్రులగు మాధవరావుగారు రాజ్యపాలన మొనరించినట్లు లేదు. 'రావు వంశ ముక్తావళి' యందు ఈ మాధవరాయని కిరువురు పుత్రులు కలిగినట్లు మాత్రము కలదు. ఇది ఇట్లుండగా, '(శ్రీ) పీఠికాపుర సంస్థాన చరిత్రము' వందు తెనుగురావుగారి యనంతరము పిఠాపురమును వారి జ్యేష్ఠపుత్రులగు మాధవరావుగారు పాలించినట్లుగలదు. అటు పిమ్మట కృష్ణారావుగారిచే సంపాదింపబడిన సంస్థానమును రామచంద్రారావుగారు పాలించి నట్లును గలదు. ఈ రెండును పరస్పర విరుద్ధములు. ఏలయనగా 'మాధవరావు రాజ్యమేలుచుండగా నద్దానిని నవాబేల తిరిగి రామచంద్రరాయల కొసగును' అను సందేహము కలుగును. కనుక నీ మాధవరాయలు, తెనుగురావుగారికి పీఠికాపురాధిపత్యము లభించుటకు మునుపో లేక తెనుగురావుగారు మరణించుటకు ముందో, మరణించియుండును. రికార్డునందు పేర్కొనబడిన విధముగా తెనుగురాయణింగారి అనంతరము కాకినాడ, సెలపాక, ప్రోలునాడులు చిట్టి వీడు రామారాయణింగారి అధీనములోనుండి, తదుపరి పాదుషావారిచేత తెనుగురాయణింగారి చతుర్థపుత్రులగు రామచంద్రారాయణింగారికొసగబడియుండును. నాటి నుండియు నీ పిఠాపుర సంస్థానము రామచంద్రారావుగారి యాధిపత్యములోనికి వచ్చెనని చెప్పుట సమంజసము. కావున తొలుతగా పిఠాపుర సంస్థానమునకు ప్రభువై రాజ్యపాలనము చేసిన వారు (శ్రీ) రావు రామచంద్రారావుగారు.

రామచంద్రారావు లక్ష్మీసంపన్నుడు, సుజ్ఞాని అని కవులు వర్ణించిరి. 'వాసవదత్తా పరిణయము' వలన, వీరి కాలమునుండియు నీ సంస్థానము కవి పండితులకాలవాలమని తెలియుచున్నది. ఈ ప్రభుప్రావు వంశ ముక్తావళి యందు "సకల పండితమండల రక్షణైక తత్పరుడ" నియు "సుకవి వర్ణితాఖిల సుగుణ శాలి" యనియు "విద్యాభోజ భూజాని" యనియూ కీర్తింపబడెను. రామచంద్రరాయలు పిఠాపురమునకనతి దూరమున గల (శ్రీ) సర్పవరక్షేత్రమున కొంత భూమిని జగన్నాథదేశికునకొసగినట్లు తెలియుచున్నది. ఇది వీరి వితరణ శీలమునకుదాహృతి. (కాని ఈ జగన్నాథదేశికుని గుర్తించుటకు సాధనములు లభింపవయ్యె) మరియూ నీప్రభువు సర్పవరమున వెలసియున్న (శ్రీ) భావనారాయణ స్వామివారి దివ్యమందిరమున కెదురుగా నొక యగ్రహారము కట్టించెను. రామచంద్రారావు భార్య తిమ్మాంబ. వీరికి పెద మాధవరావు, నరసింహారావు నను నిరువురు తనయులు కలిగిరి. ప్రథమముగా పీఠికాపుర సంస్థానము నేలి, పీఠికాపురాధినేతలగు రావు వంశీయులకు మూలపురుషుడైన రామచంద్రారావు క్రీ. శ. 1647_71 వరకు, ఇరువదినాలుగేండ్లు రాజ్యమేలెను.

## పెదమాధవరావు

( క్రీ. శ. 1679_1704 )

రామచంద్రారావుగారి మరణకాలమునకు వారి ప్రథమ పుత్రులగు రావు పెదమాధవరావు బాలుడగుటవలన పిఠాపురము సంస్థానమును పెదమాధవరావుగారి పినతండ్రియగు జగ్గారావుగారు కొంత కాలమును, తదనంతరము కృష్ణారావుగారు కొంతకాలమును పాలించిరి. కృష్ణారాయణింగారి యనంతరము క్రీ. శ. 1679 లో పెదమాధవరాయణింగారు రాజ్యపీఠమధిష్ఠించిరి. మాధవరావుగారు

చారిత్రకముగా ప్రసిద్ధినొందిరి. ఈ ప్రభువు అనేకములగు సత్కార్యములు చేసెను; చామర్లకోటచెంత పరభీకరమగు కోట కట్టించెను; పిఠాపుర దుర్గమునకు కుడ్యములు కట్టించెను; విప్రులకు వృత్తులు కల్పించి యగ్రహారములొసగెను; యవన ప్రభువులచేత కానుకలందెను; పాదుషావారిచేత బిరుదులను బడసెను.

మాధవరావుగారు జూపల్లి నరసింహారావుగారి కుమార్తె రమణమాంబగారిని పరిణయమాడిరి. జూపల్లి నరసింహారావుగారు తమ కుమార్తెకు కానుకగా నొసగిన భీమవరము పిఠాపురము సంస్థానమునకు కలసెను. తదుపరి బెండపూడి, చెల్లూరు, చల్లపల్లి ముత్తాలను వాని పాలకులు సక్రమముగా పాలింపకుండుటచేత ఆ ముత్తాలపై నధికారమును మాధనరాయణింగారి హస్తగతమయ్యెను.

వత్సవాయి తిమ్మరాజు కురిమెళ్ళ కులజుడగు నొక రాజుతో వాహ్యాళికేగి యాతని నీటదోసి వధించి తదీయమగు 'దుళ్ళ' రాజ్యము నాక్రమించెను. ఈ వార్త విని మాధవరాయలా తిమ్మరాయునిపై దండెత్తిపోగా, నాతడు భీతిచెంది మాధవరాయనికి దుళ్ళరాజ్యము నగమిచ్చి సంధి చేసికొనెను. అంతట మాధవరాయలు తిమ్మరాజునకు అనపర్తి గ్రామమునిచ్చి యాతనినుండి భీమవరమును గ్రహించినట్లు రావువంశ ముక్తావళి తెలుపుచున్నది. అటుపిమ్మట నాతడు కాకతన్న పాలుసనుండి బెండపూడి గ్రామమును గ్రహించెను.

ఇట్లు మాధవరాయణింగారు రణశూరులై విజయోపేతులై యుండుటగాక కవి పండిత పోషకులునై ఖ్యాతిగాంచిరి. వక్కలంక వీరభద్రకవి కృతమగు వాసవదత్తా పరిణయమునకు కృతిభర్తలైరి. వాసవదత్తా పరిణయమున వీరు "ప్రఖ్యాతోభయ భాషా వ్యాఖ్యాన శ్రవణ వైభవ స్ఫుట వివిధోపాఖ్యాన, బోధ బంధుర

లేఖ్యాముఖ్యునకు నిస సమాభిఖ్యునకున్ " అని కీర్తింపబడిరి. మరియూ కవి, వీరిని అర్థి జన మందారునిగా, ధర్మమార్గ విహారునిగా, వివిధ బుధ జనోద్ధారునిగా వర్ణించెను. మాధవరాయనికి సంతతి లేకపోవుట వలన తన్మరణానంతరము తదనుజుడగు నరసింహారావు పీఠపుర రాజ్యభారము వహించెను.

## నరసింహారావు

( క్రీ॥శ॥ 1704_1721 )

పెదమాధవరావుగారు ఇరువదిఐదు సంవత్సరములు రాజ్యపాలన మొనరించి దివికేగిరి తదుపరి నరసింహారావుగారు క్రీ॥శ॥ 1704 లో రాజ్యపీఠమెక్కి, క్రీ॥ శ॥ 1721 వరకు పదునేడేండ్లు రాజ్యపాలన మొనరించిరి. నరసింహారావు కళలను అభ్యసించెను, సుకవులచేత స్తుతింపబడెను. వీరు వేదశాస్త్ర పారంగతులగు దర్భావారి కుటుంబమును సన్మానించి చామర్లకోట సమీపమునగల హుసేను పురాగ్రహారమును నరసింహరాయ పురాగ్రహారముగా నొనరించి వారికర్పించిరట. నరసింహారావుగారి పాలనమున జనులు శాంతిసుఖములు పొందిరి. నరసింహారావుగారికి వేంకటరావు అను కుమారుడు కల్గెను. నరసింహారావు 1721 లో మరణించెను.

## రావు వేంకటరావు

( క్రీ॥ శ॥ 1721_1728 )

వేంకటరావు 1721 లో రాజ్యమునకు వచ్చి, ఏడేండ్లు రాజ్య పాలనమొనరించి 1728 లో తనువు చాలించెను. ఈ ప్రభువు కాలమందు విశేషములేవియు కానరావు.

# రావు వేంకటకృష్ణారావు

( క్రీ॥ శ॥ 1728-1759 )

వేంకటరావు అపుత్రకుడై మరణించుటచేత నాతని పితామహు డగు రామచంద్రరాయణింగారి అగ్రజుడు, మాధవరాయుని పౌత్రుడు ( అనగా జనార్ధనుని పుత్రుడు ) వేంకటకృష్ణారావు క్రీ॥శ॥ 1728 లో రాజ్యభారము వహించెను.

వేంకట కృష్ణరాయడు తన పేరిట వేంకటకృష్ణరాయపురము ను నిర్మించెను. వేంకట కృష్ణరాయపురము కాకినాడ-చామర్లకోట మార్గమున కలదు. ఈ ప్రభువు రాజ్యకాలమున రెండు యుద్ధములు జరిగినట్లు తెలియుచున్నది. వేంకట కృష్ణారావుగారు తమ పూర్వులగు తెనుగురావు ప్రభుతులవలె నవాబునకు 'పేష్కషు' చెల్లింపకుండా యథేచ్ఛగా రాజ్యమనుభవింపదొడంగిరి. అంతట నవాబుయొక్క సల్లష్కరుడగు 'హాజీహసన్' దండెత్తిరాగా, పెద్దాపురము సమీపమున నొకమారును, చేబ్రోలుచెంత మఱియొకమారును కృష్ణారావు గారాతని నెదుర్కొని తీవ్రమగు రణముచేసిరి. చేబ్రోలు యుద్ధమున కృష్ణారావుగారి ఆప్తబంధువైన బుచ్చన్నయనునాతడును, మఱి కొందరు రాజబంధువులును మరణించిరి.

యవనులచేత కృష్ణారావుగారిని కొనియాడుచు వ్రాయబడిన పట్టికలు పిఠాపురము కోటయందు గలవు. ఇట్లు మహావైభవోపేతంగా క్రీ॥ శ॥ 1759 వఱకును ముప్పదియొక్క సంవత్సరములు పిఠాపురము సంస్థానమును కృష్ణారావుగారు పాలించి కీర్తిశరీరులైరి.

## రావు చినమాధవరావు
( క్రీ॥ శ॥ 1759_62 )

వేంకట కృష్ణారావుగారి యనంతరము, పిఠాపురము సంస్థాన స్థాపకులగు తెనుగురావుగారి యనుజుడగు నరసింహుని ప్రపౌత్రుడగు చినమాధవరావునకు రాజ్యాధికారము సంక్రమించెను కూచిమంచి తిమ్మకవికి 'కవిసార్వభౌమ' బిరుదునిచ్చి సత్కరించిన మాధవ రాయలీతడే. చినమాధవరాయణింగారు క్రీ. శ. 1762 వరకును రాజ్య పాలనము గావించి దివంగతులైరి.

## రావు పెదమహీపతిరావు
( క్రీ॥ శ॥ 1762_1765 )

చినమాధవరాయణింగారి తరువాత నతని కుమారుడు పెద మహీపతి రాజ్యమధిష్ఠించెను. పెదమహీపతి పితామహుని సోదరుడగు నరసన్న కొమరుడగు నీలాద్రిరావు పెదమహీపతికడ మంత్రిగానుండి రాజ్యాధికారముచేయుచుండెను.

మహీపతిరావు పిఠాపురము దుర్గమునువీడి చామర్లకోట దుర్గ మున నివసించుచు నచటినుండి రాజ్యపాలన మొనరించుచుండెను. ఈ ప్రభువు కొమరగిరిచెంత సస్యఫలార్థమొక తటాకము త్రవ్వించెను.

పెదమహీపతి చామర్లకోటయందుండి రాజ్యపాలనము చేయు చుండగా, విజయనగర ప్రభువగు ఆనందగజపతి మహారాజు చామర్ల కోటపై దండెత్తివచ్చెను. ఆసమయమున నాంగ్లేయులు, ఫ్రెంచివారు, డచ్చివారు అను విదేశీయులు భారతదేశమున తమతమ అధికారము లను బలపరచుకొనుటకై యత్నించుచుండిరి. ఆనందగజపతి ఆంగ్లేయు లకు చామర్లకోట దుర్గము నిత్తునని వాగ్దానము చేసియుండెను. ఆంగ్లే

యులకు ప్రత్యర్థులుగ, కాకినాడయందు నివసించియున్న డచ్చివారి సహాయమును నీలాద్రి, పెదమహీపతులు కోరిరి. దుర్గము ఆనంద గజపతికి లభించకపోయినను ఆంగ్లేయుల తొందరపాటువలన, బలవంత ముగా వారి పతాకము చామర్లకోట దుర్గముపై నెగుర వేయబడెను. తరువాత ఆనందగజపతి పెద్దాపుర ప్రభువైన జగపతిపై యుద్ధమునకు వెడలెను. అచట జగపతి ఆనందగజపతి మూలమున పెద్దాపుర రాజ్యమును, కుమారుని విడిచిపోవలసివచ్చెను. ఆనందగజపతి అట నుండి రాజమహేంద్రవరము పోయెను.

ఆంగ్లేయుల పతాకము చామర్లకోట దుర్గముపై నెగురుట చూచిన పెదమహీపతి, నీలాద్రులు ఫ్రెంచివారి సహాయమున దానిని తొలగించి ఆ స్థానమున ఫ్రెంచి పతాకమెగుర వేసిరి. ఆ సమయమున రాజమహేంద్రవరమందున్న ఆనందగజపతి ఈవార్తవిని వెంటనే ఫ్రెంచి వారిని ఎదుర్కొనుటకై కాకినాడకు ప్రయాణమయ్యెను. అయ్యవసర మున జగపతియు తగిన బలము కూర్చుకొని నీలాద్రిరాయనికి సహాయ ముగా వెడలెను. నీలాద్రి జగపతులిరువురును ఆనందగజపతిని ఉండూరుచెంత నెదుర్కొనిరి. ఆ యుద్ధమున జగపతి మరణించెను. ఈ యుద్ధము నీలాద్రిరాయణంగారి రాజ్యకాలమందు జరిగినట్లు రావు వంశ ముక్తావళి చెప్పుచున్నది. కాని చారిత్రకముగా చూచిన ఇది మహీపతి కాలమునందే జరిగెను. ఈ విషయము **F. M. R. P.** మరియూ పీఠికాపుర చరిత్రలు నిరూపించినవి. నీలాద్రిరాయడు సకుటుంబముగా జూపల్లి రాజ్యములోనిదగు రాఘవపురమునకు వెడ లెను. నీలాద్రి చామర్లకోటను విడిచిపెట్టుటచూచి ఫ్రెంచివారును కాకినాడకు వెడలిపోయిరి. ఆనందగజపతి మహారాజు రాజమహేంద్ర వరమునకరిగి యచట మశూచివలన మరణించెను. ఈ వార్తవిని పెదమహీపతి నీలాద్రులిరువురును పిఠాపుర దుర్గమునకు మరలివచ్చిరి.

బెంగాల్ నుండి ఏతెంచు 'జనరల్ కూట్' దొరగారి సహాయార్థము కొంత సైన్యమును బంపవలసినదిగా పెదమహీపతిరావుగారి పేర నొకయాజ్ఞాపత్రము కలదు పెదమహీపతి వెయ్యిమంది సైనికులను వెంటకోటకు పంపినందులకు తమ కృతజ్ఞతను దెలుపుచు 'కూట్' దొర వ్రాసిన జాబు కలదు.

ఇట్లు పెదమహీపతి నీలాద్రులు పరస్పర మన్యోన్యముగా నుండి రాజ్యపాలనము చేయుట సహింపలేక కొందరు బంధువులు వారిరువురకు మనఃకలహములు ఘటిల్లచేసిరి. నీలాద్రిరాయుడంతట పెదమహీపతిని వదలి, జూపల్లి రాజ్యములోని కాపవర దుర్గమున కరగెను. అచట నుండి యాతడు రాజ్యమున కొంతభాగమునిమ్మని మహీపతికి వర్తమానము పంపెను. పెదమహీపతి ప్రత్యుత్తర మొసగలేదు. అంతట నీలాద్రి కోపించి, చిత్రాడ వాస్తవ్యులగు సూరయ్య, పాపయ్య, నరసయ్య యను వీరులను బలసమేతముగా కొన్నిగ్రామము లాక్రమించుటకై పిఠాపుర సంస్థానమునకు పంపెను

వారట్లుచేయగా మహీపతి సాలకుడగు చితంభట్ల గంగాధరము వారిని దోమాడయను గ్రామముకడ నెదుర్కొనెను అట నిరు పక్షములవారికిని ఘోరమగు సంగ్రామము జరిగెను. ఇది ప్రసిద్ధికెక్కిన దోమాడ యుద్ధము ఈయుద్ధము నభివర్ణించుచు దోమాడ యుద్ధమను నూరుపుటల నవలను సోమరాజు రామానుజరావుగారు వ్రాసిరి. దోమాడ యుద్ధము క్రీ శ. 1763 వ సంవత్సరమున, అనగా బొబ్బిలి యుద్ధమునకు తర్వాత జరిగెను. ఈ యుద్ధమున పాపయ్య, సూరయ్య నరసయ్యలు వీరస్వర్గములంకరించిరి పాపయ్యగారి పేరిట చిత్రాడ గ్రామములో "పాపయ్యగారి తోట, పాపయ్యగారి చెరువు" కలవట. నీలాద్రిరావు పాపయ్య ప్రభృతుల మరణవార్తవిని రాఘవపురమునకు వెడలిపోయెను. తరువాత రెండేండ్లపాటు పెదమహీపతిరావుగారు

పిఠాపురము సంస్థానమును శాంతియుతముగా పరిపాలించి క్రీ.శ. 1765 సంవత్సరమున మరణించెను.

## రావు నీలాద్రిరావు
( క్రీ. శ. 1765–1770 )

పెదమహీపతి యనపత్యుడగుటవలన, తదనంతరము రాఘవ పురము నుండి మరలివచ్చి, నీలాద్రిరావు పిఠాపురము సింహాసన మధిష్ఠించెను.

నీలాద్రిరాయణింగారి ధర్మపత్ని జగ్గమాంబ. ఈమె తనపేరిట భీమవరము చెంతనొక గ్రామమును నెలకొల్పెను. వీరిరువురకును పెద వేంకటరావు, మెట్టి వేంకటరావు, బుచ్చి వేంకటరావు, ముద్దు వేంకటరావు, నను నల్గురు తనయులు కల్గిరి. నీలాద్రిరావుగారికి స్వప్నమున వేంకటేశ్వరస్వామి సాక్షాత్కరించి, వారిసంతతికి తన నామమిడమని యాదేశించుటవలన తత్పుత్రులందరికిని ( నామాదిని ) వేంకట శబ్దము పెట్టబడినది. నాటినుండియు రావు వంశమువారికందరకును దొలుత వేంకట శబ్దము వచ్చుట యాచారమైనది. నీలాద్రిరావుగారు ఐదేండ్లు రాజ్యపాలనము గావించి క్రీ. శ. 1770 వ సంవత్సరమున స్వర్గస్థులైరి.

## రావు పెదవేంకటరావు
( క్రీ. శ. 1770–1776 )

నీలాద్రిరాయణింగారి మరణానంతరము వారి జ్యేష్ఠ పుత్రులగు పెద వేంకటరావుగారు క్రీ. శ. 1770 సంవత్సరమున పీఠపుర రాజ్య మధిష్ఠించిరి. పెదవేంకటరావు ఆరేండ్లు రాజ్యమును పాలించి 'జమాబంది' నిమిత్తము సోదరుడగు మెట్టి వేంకటరావుతో కలసి

మచిలీపట్టణమునకు ప్రయాణమయ్యెను. మార్గమధ్యమున రాజును హేంద్రవరమున వారిరువురును మసూచి తగులుటవలన క్రీ॥ శ॥ 1776 లో మరణించిరి. కవులీ పెద వేంకటరాయని శమదమసంపన్నుడని కీర్తింతురు.

పెద వేంకటరాయ వెంగమాంబలకుదయించిన కుమారమహీపతి రావు జనకుని మరణసమయమున బాలుడై యుండెను. తత్కారణముగా పెద్దాపురము వాస్తవ్యులగు వత్సవాయి తిమ్మరాజు పిఠాపురసంస్థానమును స్వాధీనము చేసికొని స్వీయసంస్థానముకన్నను అధికముగ జాగరూకతతో పాలించుచుండెను. తదుపరి పెద వేంకటరావు సోదరుడగు బుచ్చి వేంకటరావు పరిపాలనా భారము స్వీకరించెను.

## రావు బుచ్చి వేంకటరావు

( క్రీ॥ శ॥ 1776–1786 )

బుచ్చి వేంకటరావు శాంతియుతముగా రాజ్యపాలనము చేయుచుండగా, తదనుజుడగు ముద్దు వేంకటరావు రాజ్యమున భాగమిమ్మని సోదరునితో కలహించి, న్యాయస్థానమునకు వెళ్ళి తుదకోడిపోయెను. చేయునది లేక ముద్దు వేంకటరావు పెద మహీపతి కుమారుడగు కుమారమహీపతిని వెంటనిడుకొని పిఠాపురమును విడిచిపోయెను

బుచ్చి వేంకటరావు 'శౌర్యకిరీటి', 'సత్కళా భోజుడు', 'సత్య హరిశ్చంద్రుడు', 'నిరుపమాన వచోధోరణీ ఫణీంద్రుడు' అని కీర్తింపబడెను.

బుచ్చి వేంకటరాయనికి నీలాద్రిరాయుడుద్భవించెను. తదుపరి క్రీ॥ శ॥ 1786 లో బుచ్చి వేంకటరావు దివంగతుడయ్యెను. 'రావు

వంశతిలక ' మాత్రము బుచ్చి వేంకటరావు 1787 లో మరణించినట్లు తెల్పుచున్నవి. ఈతని మరణానంతరము తదగ్రజుని తనయుడగు కుమార మహీపతిరావు మరలివచ్చి రాజ్యమును స్వీకరించెను.

# రావు వేంకటకుమార మహీపతిరావు

( క్రీ॥ శ॥ 1786–1793 )

క్రీ॥ శ॥ 1786 లో రాజ్యాధికారము చేబట్టిన కుమారమహీపతి శాంతియుతముగా రాజ్యపాలనము చేయుచు నవాబునకు ' పేష్కషు ' చెల్లింపకుండెను.

ఈ ప్రభువు శ్రీ కుంతీమాధవస్వామి ఆలయమున స్వామిసమీపమున చూడుకడ్డ నాంచారమ్మను బ్రతిష్ఠించి భూషణాదు లనేకము లొసగెను తదుపరి స్వామికి నవఖండవాడ యను గ్రామమును సమర్పించెను. విబుధావళిక మాన్యములిచ్చెను.

కుమారమహీపతి కవి పండిత పోషకుడు. దేవులపల్లి బాపనార్య కృతమగు ' తారావళి ' ని కృతినొంది, కవికి ఫక్రుద్దీన్‌పాలెమను గ్రామమున విస్తారమగు సుక్షేత్రమునొసగెను ( మహేంద్ర విజయమున బ్రహ్మన్నశాస్త్రి అనిగలదు ) ' తారావళి ' అనునది ఇరువదియేడు పద్యములుగల కృతి. నాటి నుండియూ దేవులపల్లివారు రావువంశీయుల యాస్థానకవులుగ నుండి వారియాదరణ పొందుచుండెరి

మహీపతి రాజ్యకాలమున కరవు వచ్చి పంటలు లేక ప్రజలు కటకట పడుచుండగా, మహీపతి తన ఖజానానుండి సొమ్ముదీసి వారి కొరకు వ్యయపరచెను. తత్కారణముగా నవాబునకు పేష్కషు చెల్లించుట మానివేయగా, నవాబు పేష్కషు చెల్లింపకుండుటకు కార

ణమరయనెంచి మహీపతిని రమ్మని వార్తనంపెను. కుమారమహీపతి యంతట మేనమామయగు చింతపట్ల మాధవరాయని తోడను, దివాన్ ఆమంచ వెంకటరాయుడుగారి తోడను గలసి సపరివారముగా మచిలీపట్టణమునకు పయనమయ్యెను. మార్గమధ్యమున నవాబు తన్ను వమాన పరచునేమోయని సందేహించి 'రంప' మీదుగా పాలవలస (పాలవంచ) కొండలకు మరలిపోయెను. అచ్చటనే కుమారమహీపతి, దివాన్లు జ్వరపీడితులై మరణించిరి. అంతలో అవసరాల పద్మరాజు, దామెర సీతారామస్వామి గారలు మచిలీపట్టణమునకు వెడలి రాజ్యమునందలి స్థితిగతులు వివరించి, కరవు కారణంగా తమప్రభువు పేష్కషు చెల్లింపలేదని నవాబుకు విన్నవించిరి నవాబంతట నైదేండ్ల కప్పము ను రద్దుపరచినట్లాజ్ఞాపత్రమునిచ్చెను. అటుపిమ్మట క్రీ॥ శ॥ 1793 లో వేంకట కుమార మహీపతి మరణించినట్లు తెలియవచ్చెను. అంతట బుచ్చి వేంకటరాయని పుత్రుడు నీలాద్రిరావు రాజ్యమును స్వీకరించెను. చింతపల్ల మాధవరావు తన మేనల్లుడగు నీలాద్రిరావునకు రాజ్యాధికారము సంక్రమింప వలయునను దుర్బుద్ధితో కుమారమహీపతికి విష ప్రయోగము చేయించినట్లు జనశ్రుతియు గలదు.

## రావు వేంకట నీలాద్రిరావు

(క్రీ॥ శ॥ 1793_1828)

వేంకట కుమార మహీపతి యనంతరము క్రీ॥ శ॥ 1793 లో పిఠాపుర రాజ్యపీఠమధిష్ఠించిన వేంకట నీలాద్రి రావు గారి జననమును గూర్చి ఇంచుక వివాదములుకలవు. శ్రీ రావు వంశ ముక్తావళియందు, నీలాద్రిరాయణింగారు క్రీ॥ శ॥ 1782వ సంవత్సరమున జన్మించి 1793 లో రాజ్యమునకు వచ్చినట్లుకలదు. అనగా నీ ప్రభువు పదునొకేండ్ల

కే రాజ్యపాలనము చేయనారంభించెను. అంత పసివయస్సున రాజ్యా ర్హత ఎట్లు కలుగును? 'ది ఫేమిలి హిస్టరీ ఆఫ్ ది ఆనరబుల్ రాజా ఆఫ్ పిఠాపురమ్' అను నాంగ్లగ్రంథమున నీ ప్రభువు క్రీ॥ శ॥ 1775 వ సంవత్సరమున జన్మించినట్లు కలదు. అనగా రాజ్యపీఠమధిష్ఠించు నాటికి పదునెనిమిదేండ్లప్రాయము. ఇది యుక్తముగా నున్నది. పైన చెప్పబడిన యాంగ్లగ్రంథము సంస్థానమందలి రికార్డులను పరిశీలించి వ్రాయబడెను. రావు వంశముక్తావళియందెట్టే వ్రాయబడినను, నీలా ద్రిరావుగారి జననమును గూర్చి వ్రాయుటలో నించుక పొరపాటు దొరలియుండునోపు. కావున నీలాద్రిరాయణింగారు క్రీ॥ శ॥ 1775 వ సంవత్సరమున జన్మించిరనుటయే సమంజసము.

శ్రీ నీలాద్రిరాయణింగారు దైవభక్తి గలవారు. గోరసపుర మునందలి దేవాలయమునకు ఎత్తగు గోపురమును గట్టించిరి. రాజ్య మందెచ్చటను కరువు కాటకములు లేకుండా ప్రజలను కన్నబిడ్డల వలె కాపాడిరి వీరు గాయ గోవాళ, ప్రతి గండ భైరవ, రేచర్లసన్గోత్ర జలధి పూర్ణ శశాంక, ఖడ్గ నారాయణాంక, కరవాల భైరవరాయ, వేశ్యా భుజంగాది బిరుదములతో కీర్తింపబడిరి. నీలాద్రిరావుగారు పిఠాపురము నందును, శ్రీకాశికాది దివ్యక్షేత్రములందును, యాత్రి కుల సౌకర్యార్థము సత్రములు కట్టించిరి. ఈ రాజు ఆశ్రితజన పక్ష పాతియై తన్నాశ్రయించిన బంధువులకు కొన్ని ముఠాలనొసగిరి. వీరి ముఠాలను పెద్దాపురపు సంస్థానము క్షీణదశలో నమ్మివేయుచుండగా కొన్ని తిను యాత్రికుల కొసగిరి. నీలాద్రిరావుగారు కవి పండిత పోషకులై వక్కలంక వీరభద్రకవి రచించిన వాసవదత్తాపరిణయము నందలి తమ వంశ వర్ణనమును పెద మాధవరావుగారి నుండి తమ వరకును వక్కలంక పినవీరన్న చేత పూర్తిచేయించిరి. ఈ యన నారాయణాష్టాక్షరీ మంత్రపారాయణులు; భక్తి సుజ్ఞాన వైరాగ్యము



శ్రీ రావు నీలాద్రి రాయణిం గారు
క్రీ॥ శ॥ 1775-1828

లచేత ప్రఖ్యాతి గాంచిరి. మరియూ నీ ప్రభువు కృతికర్తయునని రావు వంశ ముక్తావళి చెప్పుచున్నది. కాని వీరి కృతులెవ్వియును కాన రావు. వీరు ఇనుగంటి చిన్నారాయణింగారి కుమార్తె రమణమాంబ గారిని పెండ్లాడిరి. సంతానము లేకపోవుటచేత మరదలి సుతుని దత్తు చేసికొని, అబ్బాలుడు మరణింప మరల వారి సోదరుని స్వీకరించిరి. తదుపరి బొబ్బిలివారి యాడపడుచును, చెలికాని రామారాయణింగారి పుత్రికయగు భావయమ్మగారి నుద్వాహమాడిరి. ఆమెయందు నీలాద్రి రావుగారికి క్రీ॥ శ॥ 1824వ సంవత్సరమున వేంకట సూర్యారావు, క్రీ॥ శ॥ 1825వ సంవత్సరమున కుమార మహీపతిరావు అను పుత్రులు కలిగిరి వీరికి ముందు క్రీ॥ శ॥ 1822లో లక్ష్మి వెంకయమ్మగారను పుత్రికయు కల్గెను (శ్రీ) నీలాద్రిరాయణిం గారు ముప్పదినాలు గేండ్లు వైభవోపేతముగా రాజ్యపాలన మొనరించి, క్రీ॥ శ॥ 1828లో ఫాల్గుణ శుద్ధ ఏకాదశినాడు (5-3-1828) వైకుంఠమునకరిగిరి. నీలాద్రిరాయణిం గారి పరిపాలనము చాల సమృద్ధివంతముగా సాగెను వీరికాలమునందే బ్రిటిషు ప్రభుత్వము సంస్థానములను స్థిరపరచినది.

క్రీ॥ శ॥ 1821లో జన్మించిన (శ్రీ) వేంకట సూర్యారావుగారు తండ్రిగారి మరణ సమయమునకు నాలుగేండ్లవారగుటచేత, నాటినుండి యూ రాజ్యము పదమూడేండ్లు **Court of Wards** వారి యధీనమున నందుండెను. ఆసమయమున కోర్టువారిచ్చేత నియమితులైన యధికా రుల వలన సంస్థానమునకు ధనవ్యయము అధికమై ఋణము మిగిలెను. అందువలన సూర్యారావుగారికి రాజ్యార్హమగు వయస్సు వచ్చినను వెంటనే రాజ్యాధికారము సంక్రమింపలేదు. మరి మూడేండ్లపాటు (1841-1844) మేనేజిమెంటు పద్ధతిలో రాజ్యపాలనము జరిగెను. మొద టి సంవత్సరము వచ్చిన లక్షకు పైబడిన రాబడిలో తొంబది ఎనిమిది వేలు ఋణము తీర్చివేయబడెను. కాని వేంకట సూర్యారావుగారికి

రాజ్యాధికారము సంక్రమింపలేదు. తుదకు ఉత్తర సర్కారులకు ప్రత్యేకముగా కమిషనరుగా నియమింపబడిన సర్ సి. మాంట్‌గొమెరీ చార్ట్స్ దొరగారి సహాయమున సూర్యారావుగారికి క్రీ॥ శ॥ 1844 లో పిఠాపుర సంస్థానము హస్తగతమయ్యెను. అదే సంవత్సరమున వారు సింహాసనాసీనులైరి.

## రావు వేంకటసూర్యారావు
### ( క్రీ॥ శ॥ 1844-1850 )

శ్రీ సూర్యారావు తమ రాజ్యకాలమున జేగురుపాడు చెంత 'సూర్యారావుపేట' యని తమ పేర నొక గ్రామమును నిర్మింపజేసిరి. కాకినాడయందు కొన్ని గృహములు కట్టించిరి. మాధవపురమున నొక విశాలమగు చెఱువును త్రవ్వించి తత్సమీపమున నొక మామిడితోపు వేయించిరి. అందొక భవనమును నిర్మింపజేసిరి. తమ యనుజుడగు కుమారమహీపతిరాయనికి కోలంక ముఠానొసగిరి. సూర్యారావుగారు చింతపట్ల గంగాధరరావుగారి పుత్రికయగు వెంకమాంబను బరిణయమాడి, తొలుత నామెయందు నీలాద్రిరావను తనయుని, చినభావయమాంబ యను కుమార్తెను బడసిరి. అటుపిమ్మట వారికి నిరంతర రామాయణ పఠన ఫలితముగా క్రీ॥ శ॥ 1842 శోభకృన్నామ పౌషవలక్షపక్ష చతుర్థీ సోమవారము నాడు శ్రీ రాజా రావు వేంకటమహీపతి గంగాధర రామారావు బహద్దరు వారుదయించిరి. తదుపరి సూర్యనారాయణ ప్రకాశరావు, వేంకటరావు నను నిరువురు కుమారులు కలిగిరి.

పిఠాపుర సంస్థానమునుండి తమకు రావలసిన ధనమును ప్రభుత్వమువారు స్వీకరించియూ లేదని చెప్పి సంస్థానములోని ఏడు ముఠాలను తమస్వాధీనము నందుంచుకొని, సూర్యారావు గారికి రాజ్యమిచ్చిరి.

శ్రీ సూర్యారావుగారు తమ ఏడుముతాలను హస్తగతము చేసికొనుటకు సంకల్పించి రాజమండ్రిలోనున్న సర్ వాల్టర్ ఇలియట్ అను స్పెషల్ కమిషనర్ చెంతకు ప్రయాణమయిరి. మార్గమధ్యమున నల్లచెఱువు కడ వారికి జ్వరముతగిలి వెనుదిరిగివచ్చి క్రీ॥ శ॥ 1850 నవంబరు ఏడవ తేదీన మరణించిరి. ఆ ప్రభువు మరణకాలము నాటికి సంస్థానమునకు నలుబది వేలకు పైన సొమ్ము నిలువ యుంచిరి. శ్రీ సూర్యారావుగారు రాజ్యపాలన చేసిన యా రేండ్లును నెంతయో సమర్థవంతముగా కార్యములు నిర్వహించిరి. ప్రజలను కన్నబిడ్డలవలె చూచిరి. తాము రాజ్యము చేపట్టునాటికి అస్తవ్యస్తముగానున్న వ్యవహారములను చక్క దిద్దిరి. వారు రాజకీయవేత్తయు, న్యాయిక వేత్తయునని పేరుగాంచిరి సాధువు, సన్మార్గగామి, ప్రతాపవంతుడు, విద్వాంసులచేత వర్ణింపబడిన వాడును, పుణ్యకార్యాసక్తి పరుడనగు నీ దానకర్ణుడు "నిఖిలజనులకును బాంధవుడై ... లోక బాంధవుడై" సార్థక నామధేయుడయ్యెను.

సూర్యారావు గారి మరణానంతరము వారి జ్యేష్ఠ పుత్రుడగు నీలాద్రిరావు పదమూడు సంవత్సరముల బాలుడగుటచేత, సంస్థానము తిరిగి Court of Wards వారి అధికారములోనికి వచ్చెను. క్రీ॥శ॥ 1855 లో పదునెనిమిది వత్సరముల ప్రాయమున నీలాద్రిరావు మరణించెను. ఆ నాటికి సూర్యారావుగారి ద్వితీయ పుత్రుడు శ్రీ గంగాధర రామారావుగారు పదమూడు వత్సరముల వాడగుట చేత సంస్థానము Court of Wards వారి పాలనమందే యుండెను. శ్రీ గంగాధర రామారావు గారి యనుజుడగు వేంకటరావు గారును Court of Wards లో నుండి కాకినాడ యందు విద్యాభ్యాస మొనరించిరి. సూర్యారావుగారి తృతీయ కుమారుడు సూర్యనారాయణ ప్రకాశరావు బొబ్బిలివారికి దత్తుడయ్యెను.

# శ్రీ రాజా రావు వేంకట మహీపతి గంగాధర రామా రావు బహద్దర్

( క్రీ॥ శ॥ 1862-1890 )

శ్రీ రాజా గంగాధర రామారావు గారు ఇరువది ఏండ్ల ప్రాయమున (1862 లో) పిఠాపుర రాజ్యపీఠ మధిష్ఠించిరి. అపుడు కాకినాడ కలెక్టరు ఆర్థర్ పర్విన్ ఎస్క్వైర్ ప్రభుత్వమువారి పక్షమున పిఠాపుర రాజ్యమును గంగాధర రామారావుగారి హస్తగతము గావించిరి.

రాజావారు కవి పండిత పోషణమందే గాక దాతృత్వమందును విఖ్యాతి చెందిరి. వీరు క్షత్రియులకు కొన్ని జాగీర్ల నొసగిరి. తమ తల్లిగారి పేరిట 'వెంకయ్య తోట' యను నొక తోటను వేయించిరి. అట్లే అనేక స్థలములందు తోటల నెలకొల్పిరి. ఇందు 'ఖాసు తోట' ప్రసిద్ధి కెక్కినది. ఇంకనూ కాల్వలను త్రవ్వించుట, రాచబాటలు వేయించుట మున్నగు సత్కార్యము లనేకములు చేసిరి. విరాళము లిచ్చిరి. తమ రాజ్యమునందంతటను సత్రములను కట్టించిరి. దేవాలయములకు, పెక్కుసంస్థలకు నుదారముగా విరాళములొసగిరి. విద్యావిషయికముగా వారు చేసినసేవ యగణ్యము. కాకినాడయందు బాలికా పాఠశాలను నెలకొల్పి బాలికల కుచిత విద్య చెప్పించుట కేర్పాటు చేసిరి. ఇంకను సంస్కృతి భాషాభివృద్ధి నిమిత్తము పలుతావుల వేదపాఠశాలల నెలకొల్పిరి. తమ రాజధాని యగు పిఠాపురమున సంస్థానం ఉన్నతపాఠశాల నెలకొల్పిరి. ఇట్లు రాజాగారు నెలకొల్పిన పాఠశాలలు,విరాళములిచ్చిన ఇతరపాఠశాలలు-అన్నియుకలసి ఇరువదిరెండు పాఠశాలలు గలవు. ఇట్లే కొన్ని వైద్యశాలలకు విరాళము లిచ్చిరి. వీరు తోటపలి సంస్థానమును కొని పిఠాపుర సంస్థానమున కలిపిరి. అత్తగారగు వెల్లంకి లక్ష్మి వెంకయమ్మ గారొసగిన పలివెల సంస్థానము పిఠాపురమున కలసినది.

శ్రీ సూర్యారావుగారు తమ ఏడుముతాలను హస్తగతము చేసికొనుటకు సంకల్పించి రాజమండ్రిలోనున్న సర్ వాల్టర్ ఇలియట్ అను స్పెషల్ కమిషనర్ చెంతకు ప్రయాణమైరి. మార్గమధ్యమున నల్లచెఱువు కడ వారికి జ్వరముతగిలి వెనుదిరిగివచ్చి క్రీ॥ శ॥ 1850 నవంబరు ఏడవ తేదీన మరణించిరి. ఆ ప్రభువు మరణకాలము నాటికి సంస్థానమునకు నలుబదివేలకు పైన సొమ్ము నిలువ యుంచిరి. శ్రీ సూర్యారావుగారు రాజ్యపాలన చేసిన యారేండ్లును నెంతయో సమర్ధవంతముగా కార్య ముల నిర్వహించిరి. ప్రజలను కన్నబిడ్డలవలె చూచిరి. తాము రాజ్యము చేపట్టునాటికి అస్తవ్యస్తముగానున్న వ్యవహారములను చక్క దిద్దిరి. వారు రాజకీయవేత్తయు, నార్థికవేత్తయునని పేరుగాంచిరి సాధువు, సన్మార్గగామి, ప్రతాపవంతుడు, విద్వాంసులచేత వర్ణింపబడిన వాడును, పుణ్యకార్యాసక్తి పరుడనగు నీ దానకర్ణుడు "నిఖిలజనులకును బాంధవుడై ... లోక బాంధవుడై" సార్ధక నామధేయుడయ్యెను.

సూర్యారావు గారి మరణానంతరము వారి జ్యేష్ఠ పుత్రుడగు నీలాద్రిరావు పదమూడు సంవత్సరముల బాలుడగుటచేత, సంస్థానము తిరిగి **Court of Wards** వారి అధికారములోనికి వచ్చెను. క్రీ॥శ॥ 1855 లో పదునెనిమిది వత్సరముల ప్రాయమున నీలాద్రి రావు మరణించెను. ఆ నాటికి సూర్యారావుగారి ద్వితీయ పుత్రుడు శ్రీ గంగాధర రామారావుగారు పదమూడు వత్సరముల వాడగుట చేత సంస్థానము **Court of Wards** వారి పాలనమందే యుండెను. శ్రీ గంగాధర రామారావు గారి యనుజుడగు వేంకటరావు గారును **Court of Wards** లో నుండి కాకినాడ యందు విద్యాభ్యాస మొనరించిరి. సూర్యారావుగారి తృతీయ కుమారుడు సూర్యనారాయణ ప్రకాశరావు బొబ్బిలివారికి దత్తుడయ్యెను.

# శ్రీ రాజా రావు వేంకటమహీపతి గంగాధర రామా రావు బహద్దర్

( క్రీ॥ శ॥ 1862-1890 )

శ్రీ రాజా గంగాధర రామారావు గారు ఇరువది ఏండ్ల ప్రాయమున (1862 లో) పిఠాపుర రాజ్యపీఠ మధిష్ఠించిరి. అపుడు కాకినాడ కలెక్టరు ఆర్థర్ పర్విన్ ఎస్క్వైర్ ప్రభుత్వమువారి పక్షమున పిఠాపుర రాజ్యమును గంగాధర రామారావుగారి హస్తగతము గావించిరి.

రాజావారు కవి పండిత పోషణమందే గాక దాతృత్వమందును విఖ్యాతి చెందిరి. వీరు క్షత్రియులకు కొన్ని జాగీర్ల నొసగిరి. తమ తల్లిగారి పేరిట 'వెంకయ్య తోట' యను నొక తోటను వేయించిరి. అట్లే అనేక స్థలములందు తోటల నెలకొల్పిరి. ఇందు 'ఖాసు తోట' ప్రసిద్ధి కెక్కినది. ఇంకనూ కాల్వలను త్రవ్వించుట, రాచబాటలు వేయించుట మున్నగు సత్కార్యము లనేకములు చేసిరి. విరాళము లిచ్చిరి. తమ రాజ్యమునందంతటను సత్రములను గట్టించిరి. దేవాలయములకు, పెక్కు సంస్థలకు నుదారముగా విరాళములొసగిరి. విద్యా విషయికముగా వారు చేసినసేవ యగణ్యము. కాకినాడయందు బాలికా పాఠశాలను నెలకొల్పి బాలికల కుచిత విద్య చెప్పించుట కేర్పాటు చేసిరి. ఇంకను సంస్కృతి భాషాభివృద్ధి నిమిత్తము పలుతావుల వేదపాఠశాలల నెలకొల్పిరి. తమ రాజధాని యగు పిఠాపురమున సంస్థానం ఉన్నతపాఠశాల నెలకొల్పిరి. ఇట్లు రాజాగారు నెలకొల్పిన పాఠశాలలు,విరాళములిచ్చిన ఇతరపాఠశాలలు-అన్నియుకలసి ఇరువదిరెండు పాఠశాలలు గలవు. ఇట్లే కొన్ని వైద్యశాలలకు విరాళము లిచ్చిరి. వీరు తోటపలి సంస్థానమును కొని పిఠాపుర సంస్థానమున కలిపిరి. అత్తగారగు వెల్లంకి లక్ష్మీ వెంకయమ్మ గారొసగిన పలివెల సంస్థానము పిఠాపురమున కలసినది.

(శ్రీ) రాజా గంగాధర రామారావు బహద్దరువారికి బంగారు కిరీటమును వజ్రముతో పొదిగిన భుజకీర్తులు నుండెడివట. వారి కోటలో కైలాసమహల్, అన్నపూర్ణ మహల్, పురుహూతికా మహాలు ననుమందిరములుండెడివట. కాకినాడ, రాజమండ్రి, కడియం లలో పెక్కు భవంతులు కల్గియుండిరి

రాజాగారు క్రీ. శ. 1873 వరకు సంతానము లేకపోవుటవలన, వెంకటగిరివారి రెండవ కుమారుని దత్తునిగా స్వీకరించి రాజా వేంకట సూర్య మహీపతి రామకృష్ణారావు బహద్దరుగారని నామకరణమొన రించిరి. ఈకుమారునికి గంగాధర రామారావను పుత్రుడుదయించెను. అటుపిమ్మట చిరతపః ఫలితముగా రాజాగారికి క్రీ. శ. 1885 సం॥న (శ్రీ)రావు వేంకట కుమార మహీపతి సూర్యారావు బహద్దరుగారు దయించిరి. వీరు వరివరముని అంశమున జన్మించిరని ప్రజలకు నమ్మక ముండెడిది

# శ్రీ రాజా రావు వేంకట కుమార మహీపతి సూర్యారావు బహద్దర్

( క్రీ॥ శ॥ 1906–1948 )

(శ్రీ) రాజా గంగాధర రామారావు గారికి క్రీ॥ శ॥ 1885 వ సం॥ అక్టోబరు 5వ తేదీన పట్టపురాణియగు మంగయమ్మగారివలన పుత్రోద యమయ్యెను. ఈ పుత్రులే సాహిత్య చక్రవర్తి యగు డా॥ రావు వేంకట కుమార మహీపతి సూర్యారావు బహద్దర్ వారు. వీరికి బాల్యము నుండియు విద్యావ్యసనముగలదు. మూడేండ్ల వయస్సునందే పద్యములు చెప్పెడివారని వారినెరిగిన వృద్ధులు నేటికిని చెప్పుచుందురు. వీరు ఐదు సంవత్సరముల బాలుడై యుండగా 1890 సం॥న గంగాధర రామారావుగారుదివికేగిరి. నాటి నుండియు వారి దత్త పుత్రుడు

ఈ బాలుఁడౌరసుఁడు కాఁడనియు, రాజ్యాధికారము తమదేయనియు నీ బాలునిపై నభియోగము తెచ్చిరి. ఆయభియోగము పెక్కు దినములు జరిగి, తుదకీ సూర్యరాయని విజయలక్ష్మి వరించెను. అంతదనుక నీ యాస్థానము 'కోర్ట్ ఆఫ్ వార్డ్స్' వారి పాలనమందుండెను.

ఈ కాలమంతను, మైనారిటీ తీరువరకు, వీరు తండ్రిగారి యాజ్ఞానుసారము 'న్యూయింగ్టన్' కళాశాలయందుండి విద్యాభ్యాస మొనరించిరి ఆ కాలమందే సంస్కృతాంధ్రములను, కన్నడ, తమి ళాంగ్ల భాషలను జక్కఁగ నేర్చుకొని, ఆయైదు భాషలయందును బ్రమాణము లైన ఉత్తమ గ్రంథములను సవిమర్శముగాచదివిరి. మఱియు నాంధ్రాం గ్ల భాషలయందు కవిత్వము చెప్పగలుగు నేర్పు సంపాదించిరి. తదు పరి నూజివీటి సంస్థానాధిపతులలో నొకరగు శ్రీ రాజా వేంకటరంగయ్యా ప్పారావు బహద్దర్ వారి ప్రథమ పుత్రికయగు చిన్నమాంబా దేవిని పరిణయమాడిరి.

పట్టాభిషేకానంతరము, తండ్రిగారిచే స్థాపింపబడిన పిఠాపురము హైస్కూలు, కాకినాడ కాలేజీల నమిత ధనము వెచ్చించి యభివృద్ధి చేసి దక్షిణాంధ్రమున అంతటి పాఠశాలలు లేవనిపించిరి. కాకినాడ కళాశాలను ఫస్టుగ్రేడుగా నుద్ధరించి, ఎన్నియో భవనములు కట్టించిరి. కళాశాలయందు విద్యాభ్యాసమొనరించు స్త్రీలకు పేదవిద్యార్థుల కుచిత విద్యా దానము చేయించిరి. అంతేగాక పట్టభద్రులై విదేశముల కేగి యున్నతవిద్య బడయగోరువారికి సంపూర్ణ ధనసహాయ మొనరించిరి. వారొనరించిన యుపకారవేతనము లెన్నియో చెప్పనలవికాదు. పిఠా పురము హైస్కూలులో చదువుకొను హరిజన బాలబాలికలకు 'వసతి గృహములు' నెలకొల్పి వాటికగు వ్యయమంతయు తామే భరించిరి. వారికి 'ప్రైవేటు టీచర్ల'ను సహితమేర్పరచి అనేకమందిని పోషించి వృద్ధిలోనికి తెచ్చిరి. రాజమహేంద్రవరము ( రాజమండ్రి )

నందలి వీరేశలింగోన్నతపాఠశాల పరిపోషణతోనే నడచెడిది. బ్రహ్మశ్రీ రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు వీరికి గురువులై వీరిని బ్రహ్మమతాభిమానులను చేసిరి. వారి ప్రేరణముననే రాజాగారు కాకినాడలో బ్రహ్మసమాజ ప్రార్థనా మందిరమును, అనాథశరణాలయమును నెలకొల్పిరి.

మహారాణీవారి కోరికపై కాకినాడ 'లేడీస్ క్లబ్' నకు నలుబది యకరముల స్థలమిచ్చిరి రాణీగారి యధ్వర్యమున పిఠాపురములో ఘోషా స్కూలు నడుపబడినది.

సుమారు క్రీ॥ శ॥ 1920 ప్రాంతమున విశ్వకవి రవీంద్రనాథ ఠాగూరు పిఠాపురము వచ్చినపుడు, వారి శాంతినికేతనమునకు రాజావారు దాదాపు లక్ష రూపాయలు పారితోషకముగా నిచ్చిరని వినికిడి. ఇట్లు ప్రాచ్య, పాశ్చాత్య విద్యలను సమదృష్టితో గౌరవించి, వాని యభివృద్ధికై యనన్యముగా ధన సహాయమొనరించి, శాశ్వత కీర్తి నార్జించుకొనిరి శ్రీ సూర్య ప్రభువులు. ది. 29-1-1929 న మద్రాసు రాష్ట్రగవర్నరు గారగు వెల్లింగ్టన్ ప్రభువు సూర్యరాయనికి మహారాజా సన్నదు నిచ్చిరి. వారి సకల భాషావిజ్ఞానమును, ప్రజలకు చేసిన విద్యాదానములను ఎఱిగి, ఆంధ్ర విశ్వవిద్యాలయము వారు శ్రీ సూర్యారావుగారికి 'డి. లిట్.' బిరుదమునొసగిరి. వారి పాండిత్య ప్రకర్షకలరి 'కళాప్రపూర్ణ' బిరుదమును సహితమిచ్చి గౌరవించిరి.

1910వ సంవత్సరమున మహారాజావారికి, దేపేరి చిన్నమాంబాదేవియందు పుత్రోదయమయ్యెను ఆ పుత్రునకు సూర్యారావుగారు జనకుని నామమిడిరి. ఆ గంగాధరరామరాయని యౌవరాజ్యమున కభిషిక్తు నొనరించిరి.

తదుపరి వారికి సూర్యారావను పుత్రుడు, మంగయమ్మ, భావయమ్మ, సీతాదేవి, కమలాదేవి యను పుత్రికలుదయించిరి. మహారాణి చిన్నమాంబా దేవి మరణానంతరము మహారాజావారు

సావిత్రీ దేవి గారిని వివాహమాడి, యామెయందు రామరత్నారావు అను పుత్రుని బడసిరి.

తదుపరి, సుమారు 79 ఏండ్ల ప్రాయమున, ఈ సాహిత్యచక్రవర్తి 6-3-1964 లో పిఠాపురమునందలి తమకోటయందస్తమయమొందిరి.

తదనంతరము వారి ప్రథమ పుత్రులగు శ్రీ గంగాధర రామారావుగారు రాజా బిరుదము నొందిరి. వీరు తమ రాణీగారగు శ్రీ వేదవతీ దేవియందు మువ్వురుతనయుల బడసిరి. వారిలో జ్యేష్ఠ పుత్రులగు సూర్యారావుగారు యువరాజయ్యెను. పిఠాపుర సంస్థానము, జమీందారీలు రద్దగుట వలన, డా॥ మహారాజా రావు వేంకట కుమార మహీపతి సూర్యారావు బహద్దర్ గారితోడనే సమసించినది.

నేడు మిగిలినది శిథిలమైన పిఠాపురము కోట.

---

## సూచికలు


1 ఎ. రావు వంశ ముక్తావళి - 1ఆ 83-89.

1 బి. Godavary Gazetteer-Page 34.

2 శ్రీ పీఠికాపుర సంస్థాన చరిత్రము - శ్రీరాం వీరబ్రహ్మకవి.

3 పిఠాపురం కైఫీయత్తు

4 రావు వంశ ముక్తావళి - 3ఆ-72.

5 రావు వంశ ముక్తావళి - 3ఆ 77.

6 పిఠాపురం కైఫీయత్తు.

7 **An Historical account of the Rajah of Pithapuram in the East Godavary District - Page 16 and** రావు వంశ ముక్తావళి.

8 Godavary Gazetteers-1907.

9 రావు వంశ ముక్తావళి - 3భా-104-ఫరమానాసీకమాలిక,
**Historical account of the Honourable Rajah of Pithapuram**
పీఠికాపుర సంస్థాన చరిత్రము

10 వాసవదత్తా పరిణయము - 1భా 107ప-వక్కలంక వీరభద్రకవి

11 రావు వంశ ముక్తావళి - 4భా-37.

12 రావు వంశ ముక్తావళి - 4భా-10, 4.

13 చిత్రా పరిణయము - 1భా-52-అల్లగరాజు సుబ్రహ్మణ్యకవి

14 **H A of H. R. P. - Page - 16.**

15 రావు వంశ ముక్తావళి - 4భా-21.

16 రావు వంశ ముక్తావళి - 4భా-22.

17 రావు వంశ ముక్తావళి - 4భా 29.

18 వాసవదత్తా పరిణయము - 1భా-145-148.

19 రావు వంశ ముక్తావళి - 4భా-3 [illegible]

20 ఆంధ్ర సంస్థానములు - సాహిత్యపోషణ - 247-తూ. దొణప్ప

21 చిత్రా పరిణయము - 1భా-64

22 రావు వంశ ముక్తావళి 4భా 39-48 **& H A. R. P.-19 Pages&46, 47, 48.**

23 రావు వంశ ముక్తావళి 4భా 47, 48.

24 రావు వంశ ముక్తావళి - 48, 50, 51.

25 రావు వంశ ముక్తావళి - 4భా.54, 55.

26 **The History of the family of the Honourable Rajah of Pithapuram - 29 Page.**

27, 28 ” **Page 30.**

29 శ్రీ రాణీ రావు జగ్గమాంబ చరిత్ర.

30 దోమూడ యుద్ధము.

31 **H. F. H. R. P. - 31 Page**
రావు వంశ ముక్తావళి - 4భా-70. 71.

32 రావు వంశ చరిత్ర తిలక - 52 పుట

33 ” ” ”

34 పీఠికాపుర సంస్థాన చరిత్ర - 245 పుట.

35 పిఠాపురము సంస్థానపు దావా రికార్డు సంగ్రహము.

# కవి పండిత పోషణ :
# శ్రీ రావు పెదమాధవరావు

( క్రీ॥ శ॥ 1679–1704 )

పిఠాపుర సంస్థానమునకు ఆధిపత్యము వహించిన వారిలో తొలుదొల్త సాహిత్య పోషణము చేసి, కృతినందినవారు శ్రీ రావు పెదమాధవరావుగారు. వీరు ఎందరో సంస్కృతాంధ్ర కవులను ధనకనకాది బహుమానములతో సన్మానించి, తమయాస్థానకవియగు శ్రీ వక్కలంక వీరభద్రకవి చేత సుబంధు కవికృతమగు 'వాసవదత్త' యను సంస్కృత గద్య కావ్యమును పద్యకావ్యముగా అనువదింపజేసి, కృతినందిన రసజ్ఞులు. వీరికిని, వీరికి ఎనిమిది తరముల పైవారగు సర్వజ్ఞసింగ భూపాలునికిని నడుమగల ప్రభువుల పాండిత్యము గాని, వారి పండిత పోషణముగాని తెలియరాకుండుటచేత వారి ప్రతిభావ్యుత్పత్తులిట్టివని భావింపనలవికాకున్నది

మాధవరాయణింగారి రాజ్యకాలమున జన్మించి (క్రీ॥ శ॥ 1680) 1700 నాటికి కావ్యనిర్మాణము ప్రారంభించిన శ్రీ కూచిమంచి తిమ్మకవి, ఆ ప్రభుని సారస్వత సేవయు, వైభవమును గనులారగాంచి యుండుటవలన క్రీ॥ శ॥ 1715లో – అనగా మాధవరావుగారి మరణానంతరము–తాను రచించిన 'రుక్మిణీ పరిణయ కావ్యము'న '...... విద్వత్కవిశ్రేష్ఠ భట నటామాత్య విస్ఫారితంబు ...... రావుమాధవ నృప పరిరక్షితము భోగకరంబు పీఠికాపురవరంబు' అని కీర్తించెను. ( రుక్మిణీ పరిణయము – 1ఆ – 24ప ).

ఇక నీ మాధవరాయణింగారి యాస్థాన కవిగా నుండి, ప్రౌఢతరమగు వాసవదత్తాపరిణయ కావ్యము వ్రాసి, ప్రభువున కంకిత మిచ్చిన శ్రీ వక్కలంక వీరభద్ర కవిని గూర్చియు, ఆ కావ్యమును గూర్చియు ప్రస్తావింపబడును.

# వక్కలంక వీరభద్రకవి

వక్కలంక వీరభద్రకవి పిఠాపుర సంస్థానమున ప్రప్రథమముగా నాస్థానకవి పదవి నలంకరించినవాడు. ఇతఁడు భారద్వాజసగోత్రుఁడు; ఆరువేలనియోగి బ్రాహ్మణుడు. తండ్రి భాస్కరమంత్రి, తల్లిజగ్గాంబ. కవి తన 'వాసవదత్తాపరిణయము'న తండ్రి పితామహుడు కొండసత్కవి యనియు, తండ్రి తండ్రి చంద్రశేఖరుడు 'వివిధశాస్త్రరహస్యవేది' యనియు (1–13), తనమాతామహుడగు విశ్వనాథుడు 'సుకవి' యనియు, తండ్రి భాస్కరుడు 'చాటుగాథాతత ప్రబంధకల్పనశాలి' యనియు, మేనమామ సుకవియగు వేంకటాద్రికవి యనియు (1–27) చెప్పియుండుటచే నితని వంశమునను, మాతామహుల వంశమునను పాండిత్యము, కవిత్వము అనుగతముగా నున్నట్లు తెలియుచున్నది. వీరభద్రుని పినతండ్రియగు లింగకవి 'సమస్తజగతీ నిరవర్య సభాంతరంబులను' తన 'మధుర ప్రబంధ కవితాలసమక్తి సుధారసంబు సజ్జనులకు వీనుల విందుసల్పగ ప్రస్తుతిగన్న ధన్యుడ' ని ప్రత్యేకముగా చెప్పుటచేత, ఆ లింగకవి యేగ్రంథములు వ్రాసెనో తెలియదుగాని, పేరెన్నికగనిన సరసకవియని మాత్రము తెలియుచున్నది.

'వాసవదత్తాపరిణయము'ను 1897లో ముద్రించి, ప్రకటించిన వక్కలంక భీమశంకరముగారు వాసవదత్తాపరిణయ పీఠికలో "... ఈయన జ్యేష్ఠకుమారులగు బాపకవిగారు 'వేంకటేశ్వరశతకము'ను రచించి ... వాసిష్ఠరామాయణమును దెనిగించిరి. పౌత్రులైన వీరభద్రకవిగారు పెద్దాపురము సంస్థానములో ఆస్థానకవులుగానుండి, యాశుకవిత్వము నందును సమర్థులై, అనేక సమస్యాపూరణములు చేసి సుప్రసిద్ధులైరి. వీరు పిండిప్రోలు లక్ష్మణకవిగారితోను, శిష్టు కృష్ణమూర్తికవిగారితోను సమకాలీనులైయుండి ..... 'సర్వకామదా

పరిణయము ' ను సభలో చదువునపుడు రాజాస్థానముననుండిరి ". అని వ్రాయుటచేత నీ కవి పుత్రుడు, పౌత్రుడు కూడ కవులైనట్లు తెలియుచున్నది. నేడు వక్కలంకవారి కుటుంబములు కోనసీమయందలి ముమ్మిడివరమునను, పుల్లేటికుఱ్ఱునందును గలవు. వీరికిగల భూములన్నియు పెద్దాపురమువారి వలన వీరభద్రకవి పొందినట్లు చెప్పుదురు. అనగా నితడు చిన వీరభద్రకవియే. ఇక పెద వీరభద్రకవి మాన్యములు సంపాదించెనో లేదో తెలియదుగాని, " హాటతుల్యుండగు రావుమాధవ నృపాలాగ్రేసరుం గావ్యచాతురి మెప్పించి తిడీయసత్కృప సిరుల్బోరంబుగా బొంది " నట్లితని నెచ్చెలియగు భవానిశంకర కవి తన ధర్మఖండమున ( 10–32 ) చెప్పియుండుటచేత, మాధవరాయ ణింగారివలన ధనకనక వస్తువాహనములు సమృద్ధిగా పొంది " బంధుర తేజుండై ' నట్లు తెలియుచున్నది. చిన వీరభద్రకవి యాశుకవియగుట యేగాక, మరి యేశాస్త్రములం జదివెనో తెలియదుగాని, వేద పాఠములు చెప్పెడివాడని ప్రతీతి.

వీరభద్రకవికి సమకాలికుడును, బంధువునగు ఏనుగు లక్ష్మణకవి తన ' జాహ్నవి మాహాత్మ్యము ' న వ్రాసిన –

సీ॥ మత్పితామహుని మేనమామ, వెణ్తురుబల్లి విశ్వనాథ కవీంద్రు విపులయశుని
నతని తపఃఫలంబనంగ, జన్మించిన విద్యావిశారదు వేంకటాద్రి
నతని మేనల్లునిఁగృతికర్త, వక్కలంకాన్వయ వీరభద్రార్యవర్యు
వత్సవాధ్యాయు సత్తనశీలు నిందులపలి భవానీపతి ప్రౌఢకవిని.

అను పద్యము వలన, వీరభద్రకవి మేనమామ వెణ్తురుబల్లి వేంకటాద్రియని తెలియుచున్నది. కాని ధర్మఖండ పీఠికలో శ్రీ నడకుదుటి వీరరాజు పంతులుగారు, " వెణుతురుబల్లి విశ్వనాథుని పుత్రుడు దిట్టకవి వేంకటాద్రి " యని వ్రాసిరి. కనుక నీ వేంకటాద్రి దిట్టకవివారికి దత్తుడేమో యని యూహించుట కవకాశమున్నది. లక్ష్మణకవియే తన ' రామవిలాసము ' న

గీ॥ దిట్టకవి విశ్వనాథుఁ బ్రార్థించి కొలుతు, నతని నందనుఁడగు వేంకటాద్రి కవికి.
వాక్యపూజలు గావింతు వక్కలంక వీరభద్రుని భావింతు గౌరవమున.

అని పేర్కొనిన దిట్టకవి విశ్వనాథుడు, వేణుతురుబల్లి విశ్వనాథుడు నొక్కరేయగుదురో కాదో తెలియకున్నది. వీరభద్రకవి వాసవదత్తా పరిణయమున మాత్రము ఇంటిపేరు చెప్పకయే, విశ్వనాథసుకవి, వేంకటాద్రి సుకవియని చెప్పెను. ఏనుగు లక్ష్మణకవి ' జాహ్నవీ మాహాత్మ్యము ' ను బట్టి వీరభద్రుని మేనమామ వేణుతురుబల్లి వేంకటాద్రి యనుట నిశ్చయము. భవానీశకవి పర్వతవర్ధన కవికృత ' శృంగార మంజరీ ' యను గావ్యమును దెనుగు చేయుచు నందు వీరభద్రుని పేర్కొనినాడు.

వీరభద్రకవియు, సీదరపల్లి భవానీశ కవియు సహాధ్యాయులైనట్లు లక్ష్మణకవి " మత్పితామహు ...... " అను పద్యము వలనను, " హారితుల్యుండగు ... ... నెచ్చెలిన్ " అను భవానీశకవి పద్యము వలనను తెలియుచున్నది. వీరభద్రకవి లింగనారాధ్యుని, గురుస్తుతిలో పేర్కొనుటచేత, ఈ కవి ఆ గురువు వలన నేదియో గురూపదేశము పొందినట్లుభావింప వచ్చును. వడకదుటి వీరరాజుపంతులుగారు ధర్మఖండ పీఠికలో, వీరికి మంత్రోపదేశముచేసిన గురువు లింగనారాధ్యులనిరి. ఇఁక వేంకటాద్రి విద్యాగురువై యుండును ( అతని చెంతనే వీరభద్రకవి యుభయభాషా సాహిత్యజ్ఞానమును బొందియుండును ). ఈ వేంకటాద్రి కడనే వీరిరువురును సహాధ్యాయులై యుందురు. వీరభద్రకవి – మేనమామ వేంకటాద్రి సుకవియనెనేగాని గురువని చెప్పలేదు. ఇందువలన వీరభద్రకవి వాసవదత్తాపరిణయమున కృతిభర్తృముఖమున చెప్పినట్లు " చదువకే శ్రీసతీశ ప్రసాద గరిమ నుభయభాషాపాండిత్యము " ను గడించెనని తెలియుచున్నది.

**వీరభద్రకవి కాలము :**

ఇక నీ కవితల్లజుని కాలమునుగూర్చి నిర్ణయింపవలసియున్నది. ఆంధ్రకవుల చరిత్రయందు వక్కలంక వీరభద్రకవియు, కూచిమంచి తిమ్మకవి, జగ్గకవియు సమకాలికులని, వీరు క్రీ॥ శ॥ 1750 వరకును జీవించియుందురని చెప్పబడెను. తిమ్మకవి 1690 ప్రాంతమున జన్మించినట్లును నిందు గలదు. వాసవదత్తాపరిణయమును ముద్రించిన శ్రీ వక్కలంక భీమశంకరముగారును 'ఆంధ్రకవుల చరిత్ర' తో నేకీభవించిరి. ఇక నడకుదుటి వీరరాజుపంతులుగారు వీరభద్రకవిని బట్టి తత్సహాధ్యాయియగు భవానీశకవి కాలము క్రీ॥శ॥ 1660 అని నిర్ణయించిరి. వీరభద్రకవి కాలమును వెణుతురుబల్లి విశ్వనాథకవి కాలమును బట్టి నిర్ణయించిరి. ఈ భవానీశకవియు, వక్కలంక వీరభద్రకవియు సహాధ్యాయులు, సమవయస్కులును అగుదురు. ఏనుగు లక్ష్మణకవి తిమ్మకవితో సమవయస్కుడై, తనకు కొంచెము పూర్వుడైన వక్కలంక వీరభద్రకవిని గౌరవపూర్వకముగా స్మరించి, వర్తమాన కవీశ్వరుడైన తిమ్మకవిని గూడ తలచితినని యెను. అంతేకాని ఆంధ్రకవుల చరిత్ర తృతీయ భాగమున చెప్పినట్లు ఈ నలువురును సుమారు క్రీ॥ శ॥ 1680–90 ప్రాంతమున జన్మించి, 1750 వరకు జీవించియుందురనుట సరికాదు. వీరభద్రకవి 1680 లో జన్మించినచో మాధవరాయణింగారి రాజ్యకాలమున తుది సంవత్సరములో, అనగా 1704 లో కావ్యము అంకితమిచ్చినను సుమారు 24 వత్సరముల ప్రాయమువాడగును. ఆ ప్రాయముననే ప్రౌఢతరమగు సుబంధుని కావ్యమును అనువదించెననుట సందేహాస్పదము. ఇంతికంటే నడకుదుటివారి కాలనిర్ణయము సహేతుకముగానున్నది. వీరభద్రకవి మాతామహుని కాలమును బట్టి, కవి జనన కాలము 1660 అని నిర్ణయించిరి. ఈ నిర్ణయము ప్రకారము ఈతడు సుమారు 40–45 సంవత్సరముల ప్రాయమున వాసవదత్తాపరిణయము వ్రాసి రాజునకంకితమిచ్చియుండును.

వీరభద్రకవి కాలనిర్ణయమున కింకొక సులభమైన మార్గము కలదు కావ్యమునకు పీఠిక వ్రాసిన వక్కలంక భీమశంకరముగారు తమ వంశ వృక్షము నాధారముగాచేసికొని వీరభద్రకవి తమకు ఐదవ పురుషుడని తెల్పిరి. భీమశంకరముగారు క్రీ॥ శ॥ 1915 లో మరణించిరనియు, నాటికివారు డెబ్బదేండ్లవారనియు భీమశంకరముగారిని తెలిసిన బ్రహ్మశ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారును, వక్కలంక వారి వంశస్థులును తెలిపిరి. దీనిబట్టి భీమశంకరముగారి జననకాలము 1845 ప్రాంతమగును 1845 నుండి తరమునకు 40 ఏండ్లచొప్పున లెక్కంచుచు ఐదుతరములు వెనుకకు పోయినచో 1845—200=1645. అనగా వీరభద్రకవి జననకాలము క్రీ॥ శ॥ 1645 అనినిర్ణయించవచ్చును. కనుక వీరభద్రకవి సుమారు 1685–90 ప్రాంతములోగాని లేదా అటుపిమ్మటగాని రావు మాధవ నృపతికి వ్రాసి కావ్యమగు వాసవదత్తాపరిణయము అంకితము చేసియుండు ననుటలో విప్రతిపత్తి లేదు.

" వాసవదత్తా పరిణయము " న కృతిపతి ప్రశంసను బట్టి వీరభద్రకవి ఉభయ భాషలలో ధారాళముగా కవిత్వము చెప్పగలడనియు (1ఆ–26ప), బాల్యమున కాళిదాస ' కుమారసంభవము ' తెనిగించినట్లు (1ఆ–27ప) తెలియుచున్నది. కవి ' సేతుఖండము ' అను కావ్యమును కూడ అనువదించినట్లు సూర్యరాయాంధ్ర నిఘంటువును బట్టి తెలియుచున్నది. కాని ఈ రెండును నేడుఅలభ్యములు. ఆంధ్ర కవుల చరిత్రయందు మాత్రము శ్రీ వీరేశలింగంగారు ' కుమార సంభవము ' నుండి నాల్గు పద్యముల నుదహరించిరి. ఈ పద్యములను బట్టి ఇది నాలుగాశ్వాసముల కావ్యమనియు, వీరభద్రకవి శైలి ధారాళము కమనీయమునని తెలియుచున్నది.

## వాసవదత్తా పరిణయము

వాసవదత్తా పరిణయమును 1897 లో కవి వంశస్థులైన శ్రీ వక్కలంక భీమశంకరంగారు రాజమండ్రి వివేకవర్ధని ముద్రణాలయమున ముద్రించి, ప్రకటించిరి. ఐదాశ్వాసముల ఈ కావ్యము 1679 నుండి 1704 వరకు పీఠికాపుర సంస్థానము నేలిన రావు పెదమాధవ రాయణింగారు కృతినందిరి.

వాసవదత్తా పరిణయమనగానే భాస మహాకవి విరచిత స్వప్న వాసవదత్త నాటకములోని వాసవదత్త పరిణయ వృత్తాంతమని తలచు నవకాశము కలదు. కాని ఈ కావ్యమందలి వాసవదత్తయు, కథయు భిన్నములు. సుబంధు కవికృత ‘వాసవదత్తా’ నామక సంస్కృత గద్య కావ్యమునకిది పద్యరూపమగు స్వేచ్ఛానువాదము.

**కథాసారము :**

చింతామణి అను రాజు యొక్క కుమారుడు కందర్పకేతుడు పాటలీపుత్రమునకధిపతి. అతడు స్వప్నమున సాక్షాత్కరించిన యొక సుందరిని వలచి, విరహతప్తుడై రాచకార్యములను విడిచి, సఖుడైన మకరందునితో కలసి వింధ్యాటవికి వెడలెను. అచ్చట రేవానది సమీపమున నొక శమీవృక్షముకడ విశ్రమించియుండగా వారికి శుక శారికల సంభాషణ వినిపించెను. అచట ఒక శుకము రెండు శారికలు గలవు శుకము తాను చూచివచ్చిన వింతలను ఒక శారికకు తెల్పుచు, కుసుమపురగాథ నీక్రింది విధముగా వివరించెను.

శృంగారశేఖరుడను రాజు కుసుమపురమునకేలిక. అతని సతి రాజ్యలక్ష్మి. వాసవుని వరప్రసాదమున వారికి కుమార్తె కలుగగా

శృంగారశేఖరుడామెకు ' వా స వ ద త్త ' యని నామకరణముచేసెను. యౌవనవతియైన వాసవదత్తకు రాజు స్వయంవర మేర్పాటుచేసెను గాని ఆమె ఎవ్వరిని వరించలేదు. వాసవదత్తకు కలలో పాటలీపుత్రాధిపతి యగు కందర్పకేతుడు కనిపించగా, ఆమె అతనియందే వలపునిలిపి విరహతాపము ననుభవించుచుండెను శిశిరోపచారములకు వాసవదత్త విరహము తొలగిపోవుటలేదు. ఆ సమయమున ' తమాలిక ' అను శారిక వాసవదత్త నూరడించి, తాను కందర్పకేతునికడకు వెడలెదనని పలికెను. వాసవదత్త మహదానందమున నొక ప్రణయలేఖ వ్రాసి ' తమాలిక ' కొసగెను. ఆ ' తమాలిక ' యే తనతో వచ్చిన శారిక యని శుకము మొదటి శారికకు తెలిపెను.

' తమాలిక ' యను పేరుగల రెండవ శారిక కందర్పకేతుని గుర్తించి, అతని కడకు వచ్చి వాసవదత్త ప్రణయలేఖనొసగెను. తరువాత నా శారిక వాసవదత్త విరహము నభివర్ణించెను. కందర్పకేతు డానందమంది మకరంద, శారికా సహితుడై వాసవదత్త అంతఃపురమున ప్రవేశించి, వాసవదత్తను తన స్వప్నసుందరిగా గుర్తించెను. పరస్పర అనురాగవీక్షణముల బరపించుకొనుచు వాసవదత్తా కందర్పకేతులు మూర్ఛిల్లిరి. వాసవదత్తను పుష్పకేతుడను విద్యాధరపతి కొసగి వివాహము చేయబోవుచున్నారను వార్త విని కందర్పకేతుడు వాసవదత్తా సమేతుడై పాటలీపుత్రమునకు వెడలుచు రేయి వింధ్యాటవిలో నిదురించెను. మరునాటి ఉదయమున కందర్పకేతుడు మేల్కాంచునసరికి వాసవదత్త కనిపించలేదు. అతిడెంతయో దుఃఖించుచు, వెదకి వెదకి సముద్రమున ప్రాణత్యాగ మొనరింపబోవ " అచిరకాలమున వాసవదత్తను కలసికొందువ " ని అశరీరవాణి పలికెను. కందర్పకేతుడు తీర్థాటనముచేసి చివరకు వింధ్యాటవియందు శిలావిగ్రహ రూపముననున్న వాసవదత్తను గాంచి, ని వ్వె ర పా టు న చేతితో తాకగా,

విగ్రహము సజీవ వాసవదత్తయయ్యెను. కందర్పకేతునకు వాసవదత్త క్రింది విధముగా తనకథ తెలిపెను.

వింధ్యాటవిలో కందర్పకేతుడు శయనించియుండగా మేల్కొనిన వాసవదత్త పతికి ఫలములు సమార్జన నిమిత్తము వెడలి, రెండు కిరాతసేనల నడుమ చిక్కువడెను. ఆ యొక ముని ఆశ్రమము. వాసవదత్తను స్వాధీనము చేసికొనుటకై రెండు సేనలు అచట యుద్ధముచేసి ఆశ్రమ స్థలిని బీభత్సము కావించెను. ముని వచ్చి చూచి ఆ మారణహోమమునకు కారణమైన వాసవదత్త శిలాత్వమొందు నట్లు శపించియు జాలిపడి భర్త హస్తస్పర్శను శాపవిమోచనమగునని పలికెను. కనుక కందర్పకేతునివలన వాసవదత్త యథాపూర్వము నందెను.

ఈకథ యిట్లుండ, కుసుమపురమున శృంగారశేఖరుడు వాసవదత్త నిమిత్తము చారులను పంపి విషయము తెలిసికొని, వారిరువురను పిలిపించి కందర్పకేతునకు వాసవదత్త నొసగి పరిణయము గావించెను.

**మార్పులు :** సుబంధునికథలో వాసవదత్త శాపవిమోచనమైన పిదప కందర్పకేతునితో కలసి పాటలీపుత్రమునకు వెడలిపోవుటతో కావ్యము ముగిసెను. వాసవదత్తాపరిణయములో పంచమాశ్వాస కథను వీరభద్రకవి కల్పించెను. సంస్కృత కావ్యముకంటె భిన్నమైన మార్పులు, కూర్పులు కొన్ని తెనుగున కానవచ్చుచున్నవి. ప్రథమాశ్వాసమున పాటలీపుత్రి వర్ణనము మూలమున లేదు. వీరభద్రకవి 15 పద్యములలో పురవర్ణనకావించి, సంస్కృతకావ్యమున చింతామణి రాజవర్ణన విపులముగానుండగా, అనువాదమున నది సంక్షేపించబడెను. మూలమునగల చింతామణిని గూర్చి చేసిన వర్ణనలు కొన్ని, అనువాదమున చింతామణి పుత్రుడు కందర్పకేతుని వర్ణనములో నుపయోగింపబడెను. కందర్పకేతుడు కలలో చూచిన వాసవదత్తను గూర్చి

చెలికాడైన మకరందునికి చెప్పిన సందర్భములో వాసవదత్త వర్ణనము అనువాదములో చాలభాగము స్వతంత్రముగానున్నది మూలమున మకరందుడు ఖలజన నింద చేసినట్లుండగా, అనువాదమున నది విడువ బడెను.

అరణ్య వర్ణనమున, భల్లూకమునుగూర్చి స్వతంత్రముగా వర్ణింపబడెను. వింధ్యాటవిలో శుక శారికల సంవాదమున మూలమున "మిథః కలహాయమానయోః శుక శారిక యోః" అను వాక్యమును గ్రహించి, ఆంధ్రీకర్త శుక శారికల కలహమును మూడు పద్యముల లో వర్ణించెను. మూలమున శారిక స్నేహమును గూర్చి విపులము గా కలదు. అది ఈ కావ్యమున సంగ్రహింపబడెను. మూలమున కుసుమపుర వర్ణనము విపులముగానుండగా, ఆంధ్రీకరణమున సంక్షేపింప బడెను. సూతికాగృహ, బాలింత వర్ణనములు మూలమున లేవు.

వాసవదత్తా స్వయంవర సందర్భమున వాసవదత్తను చూచిన రాజకుమారుల వికారపు చేష్టలు, వారి ఆలోచనలు రెండు పద్యముల లో వర్ణింబడినవి. పిదప, కళావతి వాసవదత్తకు రాజకుమారుల కుల గోత్రములను, శౌర్యాది గుణములను ఏడు పద్యములలో వర్ణించి చెప్పెను. ఈ ఘట్టము మూలమున లేదు. ఇది రఘువంశములోని ఇందుమతీ స్వయంవర ఘట్టమునకును, నైషధములోని దమయంతీ స్వయంవర ఘట్టమునకును ప్రతిబింబాకారము కాదుగాని అనుకరణ మని చెప్పవచ్చును. కనుక నిది ఆంధ్రీకర్త యొక్క భావనా సృష్టి యనవలయును.

మూలమునందు, వాసవదత్తకు కలయందు కనిపించిన యువకు డు కందర్పకేతుడని వినిపించెనని, చెప్పబడెను. వీరభద్రకవి, స్వప్న మున చెలికత్తెలు "ఈతడు కందర్పకేతుడు" అని వాసవదత్తకు చెప్పి

నట్లు మార్చెను. వీరభద్రకవి మఱికొంచెము స్వతంత్రించి, ప్రభావ తీప్రద్యుమ్నము నందు శుచిముఖి వలె, తమాలికయు, నాయిక చేతి యందలి చిత్రపటమును జూచి యాతని కందర్పకేతునిగా గుర్తించెనని చెప్పిన సొగసుగా నుండెడిది. కాని కావ్యమున చిత్రపటముయొక్క ప్రసక్తియే లేదు.

వాసవదత్త విరహావస్థను గూర్చి చెప్పుచు సుబంధుడు, వాసవదత్త తనకు శిశిరోపచారములను చేయుడని చెలికత్తెలను పేరుపేరునా బిలిచినట్లును, మలయానిలముతో తనను రక్షింపుడని మొరపెట్టుకొని మూర్ఛిల్లినట్లును వర్ణించెను. తదుపరి ఆమె చెలికత్తెలు శిశిరోపచారములు చేయగా మేల్కొని, మన్మథావస్థలను బొందినట్లు వర్ణించెను. ఆంధ్రీకరణమున సూర్యాస్తమయము, చీకటి, వెన్నెల, చంద్రోదయము, చంద్రికావిహారము, మధుపానములను వర్ణించిన పిదప, ఆ చంద్రాతపమును భరింపలేక నాయిక చెలుల కనుగప్పిపోగా, చెలులామెను వెదకిపట్టి బ్రతిమలాడుచుండ మూర్ఛిల్లినట్లు చెప్పబడెను. తరువాత చెలులు శిశిరోపచారములు చేయుట, నాయిక మందానిలాద్యుపాలంభనము వర్ణింపబడెను.

సంస్కృతకావ్యమున తమాలిక అను శారిక కందర్పకేతుని కడకు దూతగానేగి, అతనికి లేఖనిచ్చి తోడ్కొని వచ్చునపుడు సూర్యాస్తమయాదులు వర్ణింపబడెను. కాని వాసవదత్తాపరిణయమున చంద్రోదయవర్ణనాదికములు వాసవదత్తయొక్క మన్మథావస్థలు విజృంభించుటకు హేతువులుగా మొదటనే వర్ణింపబడినవి. ఇచ్చట నీ మార్పు ఉచితముగానున్నది.

తరువాత రాజు, తమాలికా మకరందులతో గలసి వాసవదత్తను జూచుటకై బయలుదేరును. మూలమున నిచట తొలుత పురవర్ణనము,

వాసవదత్తాభవన వర్ణనము, భవనమున ప్రవేశించిన పిమ్మట వాసవదత్త సఖులాడుకొను నర్మోక్తులుండగా, వీరభద్రకవి వానిని విడిచి, యా సఖుల సంభాషణమున తుదినున్న యమక సహితమగు సంస్కృత వాక్యములను కొలది మార్పుతో సీసపద్యమున వ్రాసెను. కందర్ప కేతుడు తొలుత వాసవదత్తను జూచినప్పటి రూపము, శ్లేషమూలక మగు నుపమోత్ప్రేక్షలతో మూలముననుండగా, అనువాదకర్త ఆ వర్ణనను విడిచి, వసుచరిత్ర, శృంగారశాకుంతలాది కావ్యములందు నాయికను నాయకుడు ప్రథమముగా చూచినప్పుడు వర్ణింపబడినట్లే వాసవదత్తను కందర్పకేతుడు చూచినట్లు ఒక పద్యమున వర్ణించెను.

మూలమున, వాసవదత్తా కందర్పకేతులధిరోహించిన యశ్వము అనేక విశేషణములతో వర్ణింపబడెను. మూలమునందలి "హంసేన మానసగతినా, భుజంగేనేవ సదాగత్యాభిముఖేన" అను రెండు విశేషణ ముల మాత్రము గ్రహించి వీరభద్రకవి రెండు సీసపద్యపాదములుగా చేసెను. మనోజవమను నీయశ్వమును వీరభద్రకవి ఐరావతముగా, సూర్యుడుగా ఉత్ప్రేక్షించెను.

వింధ్యాటవిలో ఫలసంగ్రహణార్థము వాసవదత్త బయలుదేరుటాదిగా కిరాతసేనల యుద్ధము, మునిశాపములను సుబంధుడు రెండుమార్లు వర్ణించగా, వీరభద్రకవి పునరుక్తియగునను ఉద్దేశ్యముతో, వాసవదత్త జరిగిన వృత్తాంతము కందర్పకేతునకు చెప్పినపుడు మాత్రమే ఆ కథను తెలిపెను. సూర్యోదయానంతరము రాజు నిదురలేచి వాసవదత్తకై తపించుట, ప్రాణత్యాగము ఇత్యాదిగా అంశములు వియోగము వలన ప్రణయముద్దీపితమగుటను తెల్పుచున్నవి. మరియు వాసవదత్త ఏమ య్యెనోయను ఉత్కంఠ పాఠకునికి కల్గించును. కందర్పకేతుడు తీర్థాట నము చేయుట మూలమున లేదు. దేవతా దర్శనమున రాజు

వాసవదత్తను మరల పొందగలిగెననుట సమంజసమగునేమోయని ఆంధ్రీకర్త నాయకునిచేత తీర్థాటనము చేయించెను. నాయికా నాయకుల పునస్సమాగమము తరువాత పాటలీపుత్రమునకు వెడలినట్లు సుబంధుడు వర్ణించి, అంతటితో కావ్యము ముగించెను. వీరభద్రకవి, వాసవదత్తా కందర్పకేతుల కలయిక జరిగిన పిదప కుసుమపురమున వివాహమైనట్లు పెంచి, వివాహానంతరము పాటలీపుత్రమునకేగి గృహ ప్రవేశమొనరించి అపూర్వ సుఖముల ననుభవించుటతో కావ్యమును ముగించెను. వాసవదత్తా కందర్పకేతుల వివాహము వసుచరిత్రాది ప్రబంధములందు వలెనే విపులముగా వర్ణింపబడెను. పరిణయ వర్ణన మూలమునందు లేదు కాని వీరభద్రకవి ప్రబంధోచితముగా ఎదుర్కోలు, ఊరేగింపు, మంగళ స్నానములు, సూత్రధారణ, తలంబ్రాలు, లాజ హోమము, అరుంధతీ దర్శనము, నాగవల్లి ఇత్యాది సాంఘిక ఆచార వ్యవహారములను ఈ కావ్యమున వర్ణించెను.

వక్కలంక వీరభద్రకవి ఈ విధముగా మూలముననుసరించియు, మూలాతిక్రమణము చేసియు, మూలమును కుంచించియు వాసవదత్తా పరిణయము నొక రసవంతమైన కావ్యముగా తీర్చిదిద్దెను. ఇక నీ కావ్యమున వర్ణనాదులను బరిశీలింతము ప్రబంధమున అష్టాదశ వర్ణనములుండుట పరిపాటి. దండి 'కావ్యాదర్శము' న

"నగరార్ణవ శైలర్తు చంద్రార్కోదయ వర్ణనమ్
ఉద్యాన సలిలక్రీడా మధుపాన రతోత్సవాః
విప్రలంభో వివాహశ్చ కుమారోదయ వర్ణనమ్
మంత్ర ద్యూత ప్రయాణాజి నాయకాభ్యుదయానిచ
ఏతాని యత్ర వర్ణ్యంతే తన్మహాకావ్యమిష్యతే."

అని పదునెనిమిది వర్ణనలను పేర్కొనెను. వాసవదత్తా పరిణయమున

నీ పదునెనిమిది వర్ణనములు మాత్రముకాక అధికమైన వర్ణనలు కలవు. మొదటను అష్టాదశ వర్ణనలను గూర్చి విచారింతము.

| | | | | |
|---|---|---|---|---|
| 1 | పాటలీపుత్ర నగర వర్ణన | | - 1ఆ-15ప | |
| | కుసుమపుర నగర | ,, | - 2ఆ-6ప | |
| 2 | లవణ సముద్ర | ,, | - 4 ఆ | |
| 3 | వింధ్యశైల | ,, | - 2ఆ 3, 4, 5 ప | |
| | | | 4ఆ 18-21 ప | |
| 4 | వసంత ఋతు | ,, | - 2ఆ-67-72ప | |
| | గ్రీష్మ | ,, | - 3ఆ-4-8ప | |
| | వర్ష | ,, | - 4ఆ-59-66ప | |
| 5 | చంద్రోదయ | ,, | - 2ఆ-22ప | |
| 6 | సూర్యోదయ | ,, | - 4ఆ-22-31ప | |
| 7 | ఉద్యానవన | ,, | - 2ఆ-73-82ప | |
| 8 | జలక్రీడ | ,, | - 3ఆ-11-19ప | |
| 9 | మధుపాన | ,, | - 3ఆ-73-76ప | |
| 10 | రతోత్సవ | ,, | - 5ఆ-103-110ప | |
| 11 | విప్రలంబ | ,, | - 1ఆ-188-227ప | |
| | | | 3ఆ-78-101ప | |
| | | | 4ఆ-32-49ప | |
| 12 | వివాహ | ,, | - 5ఆ-27-73ప | |
| 13 | కుమారోదయ | ,, | - 2ఆ-52,56<br>1ఆ-74ప | నాయికా నాయకులు జన్మించుట |
| 14 | మంత్రాలోచన | ,, | - 4ఆ-14-16ప | |
| 15 | దూత్యతి | ,, | - ఇచట దూత్యము అను పాఠాంతరము కలదు. కనుక వీరభద్రకవి దూత్యమునే గ్రహించెను. | |
| 16 | ప్రయాణ | ,, | - 4ఆ-17-21, 57, 67-80ప | |
| 17 | యుద్ధ | ,, | - 4ఆ 90-94ప | |
| 18 | నాయకాభ్యుదయ | ,, | - 1ఆ-175-178ప | |
| | | | 5ఆ-112ప. | |

ఈ యష్టాదశ వర్ణనము లేకాక, అప్పకవి చెప్పిన యిరువదిరెండు వర్ణనములలోఁగల (1) కన్యాంగ సౌందర్య కథనము (1ఆ-207-226), దౌహృదమును గలవు. మఱియు "అలంకార శేఖరము" లోఁ పేర్కొనబడిన ముప్పదిరెండు వర్ణనములలో రాజ, రాజ్ఞీ, నదీ, సరోవర, వనీ, హయ, స్వయంవర, పుష్పాపచయాది వర్ణనములు నిందుగలవు. ఇవిగాక సూతికాగృహ, బాలెంత, మన్మథపూజ, పుష్పదోహదములు కూడ వర్ణింపబడెను. సూతికాగృహ, బాలెంత వర్ణనములకు కాదంబరియు, మన్మథపూజ, పుష్పదోహదములకు వసుచరిత్రము నాదర్శములని చెప్పవచ్చును.

ఇక నీ కావ్యమందలి కవితా విశేషములు కొన్ని పరికింతము. "స్తవనీయంబగు ......... తత్కవి నవ్యోక్తులు గొన్ని నీ కవితకుం గైదండ గావింపగన్" (1ఆ-30) అని మాధవరాయణింగారు ఆజ్ఞాపించగా, వీరభద్రకవి సుబంధుని వాసవదత్తలోఁగల పద ప్రయోగ చమత్కారముల నెక్కువగా గ్రహించి 'వాసవదత్తా పరిణయము' రచించెను. సుబంధుని కావ్యమును గూర్చి "ప్రతి పద శ్లేష గద్య ప్రబంధ మత్యుదారగతి జెప్పె వాసవదత్త యనగ" అని వాసవదత్తా పరిణయ కృతి భర్త ప్రశంసించెను. అటువంటి గద్య ప్రబంధమును "ఆంధ్ర కావ్యముగ వైదర్భిగతిన్ గూర్పుము" అని మాధవరాయణింగారు కోరగా, వీరభద్రకవి అదేవిధముగా వైదర్భీరీతిలో, కమనీయమగు శయ్యతో, చక్కని పాకముతో, అర్థవంతము, మనోహరమగు అలంకారములతో చక్కని పద్యకావ్యమును రచించెను. ఈ కావ్యమందలి విశేషములిప్పుడు పరిశీలింతము.

రీతి: వాసవదత్తాపరిణయమునందలి 'రీతి' వైదర్భియని 1వ ఆశ్వాసమునందలి 30వ పద్యమున వీరభద్రకవి ప్రత్యేకముగా తెలిపెను.

వామనుడు, ' విశిష్టపదరచనమే రీతి ' అనియు, అట్టి 'రీతి' యే కావ్యాత్మ యని తెలిపెను. ఈ 'రీతి', 'గుణము' లు శబ్దాశ్రయములు. గుణవృత్తి రసాలంకార వ్యంగ్యములకు పరుష, మృదు పద సంఘటనా విశేషమే కారణము. ఆ పద సంఘటనమే రీతి. కావున రీతి శబ్దాశ్రయమనుట సత్యము. దండి 'రీతిని' 'మార్గము' అనెను. వాక్కుల యొక్క మార్గములు పెక్కు గలవు. అవి పరస్పరము సూక్ష్మ భేదములు గలవి. వానిలో భేదము స్పష్టముగా తెలియునవి 'వైదర్భి' 'గౌడి' రీతులనియు, తక్కినవాని భేదము నిరూపించుటకు శక్యముకాదనియు దండి ప్రవచించెను. పిదప వామనుడు పై 'రీతి' ని చెప్పెను. దీనివలన గుణాశ్రయమైన శబ్దముల రచనయే ' రీతి ' యను దండి మతమును వామనుడు వ్యాఖ్యానించి చెప్పెనని తెలియుచున్నది. వామనుడు దండిచెప్పిన వైదర్భి, గౌడీ రీతులకు మరియొక ' రీతి ' ని చేర్చి. దానికి ' పాంచాలి ' యని పేరు పెట్టెను. వామనుడు చెప్పిన మూడు రీతులకు రుద్రటుడు నాల్గవ రీతిని చేర్చి ' లాటీ రీతి ' యని పేరు పెట్టెను. భోజుడు ' మాగధీ ' ' అవంతీ ' రీతులను కలిపి ఆరు రీతులనెను. ఈ రీతులను బరిశీలింపగా, దేశభేదముచే గలిగిన కవితా భేదములే ' రీతు ' లని స్పష్టమగుచున్నది. లాక్షణికులందరు రీతులలో వైదర్భి రీతి ఉత్తమమైనదని చెప్పిరి. వారిలో వామనుడు, " దోష లేశము లేక పరిపూర్ణమగు ఓజఃప్రసాద మాధుర్యాది గుణయుతమై వీణారవానుకారియైయుండునది 'వైదర్భి' రీతి అనెను. అతడు " దేనియందు పదలేశము కూడ నాస్వాద్యమై గొప్పదిగా కనబడునో, చెవి సోకినంతనే పండితులకానందము కలిగించుచు హృదయమున అమృతవర్షమువలె ప్రకాశించునో, అట్టిపదానుపూర్వియే వైదర్భి " అని మిగుల ప్రశంసించెను. ఈ భావముననుసరించి కావ్యపరిశీలనము చేయగా నిందలి పదములయొక్క యానుపూర్వి చెవులకింపై హృదయమునకు వికాసము కలిగించునదిగా కనబడుచున్నది.

ఉ॥ కన్నులఁ గట్టినట్లు పొడకట్టెదుఁ గన్నియ చిన్నె లెల్ల నా
కన్నియు నేమనందగు హృదంతర తాపము దీఱఁ గూర్మితో
నన్నలినాయతాక్షి మధురాధర బింబ సుధారసంబు నా
కెన్నటికైనఁ గల్గునొకో యీ జననంబున కుప్పలంబుగన్ ( 1అ-2:7 )

"ప్రసిద్ధ పదంబుల నలఘూక్తి ప్రసాదమయ్యె" అను లక్షణము ననుసరించి యీ పద్యమునందలి గుణము ప్రసాదమని స్పష్టమగుచున్నది. లలితమగు పదములతో నింపి, చదివినంతనే భావము హృదయమునకు స్ఫురించుచున్నది. కనుక అర్థము చేతను శబ్దము చేతను సుగమముగా నుండుటచేత నీయది వైదర్భీరీతియు, ప్రసాద గుణమును గలిగి, శృంగారరస సంబంధి యగుటవలన కైశికీ వృత్తి కలదియు నగుచున్నది. ప్రసాద గుణమునకు ప్రసిద్ధ పదములు ఉపజీవకములని పైన చెప్పబడెనుగద. ఈ పద్యమున, 'కన్నుల గట్టినట్లు' 'ఎన్నటికైన గలుగునొకో యీ జననంబున కుప్పలంబుగన్' అనునవి నిత్యవ్యవహార సిద్ధములగునట్టివై, సుందరభావ నిబద్ధములై యుండుట వలన ప్రసాద గుణము స్పష్టము. ఈ ప్రసాద గుణముచే నిబిడమైన రీతి పఠితులకు హృదయ వికాసము కలిగించును గాన వైదర్భి యనుట నిశ్చితము. ఇందలి యలంకారము లోకోక్తి.

శయ్య :- "కదిసి పదంబులు ముందరి పదములతోఁ బరమ మైత్రిఁ బరగి పరపదాస్పదమనకుండిన గీతులందది శయ్య" (ఏ పదము వెంట నేపదము గూర్చిన సొంపు కలుగునో అదియే పదముల పొత్తు) ఈ శయ్యనే "పరవృత్త్యసహిష్ణుత" అందురు. అనగా నొక వాక్యమందలి ఒక పదము తొలగించి, దానికి సమానార్థకమగు వేరొక పదమును గూర్చినచో సొగసు చెడిపోవును. కనుక ఆ పదమట్లేయుండవలెను. కావుననే 'శయ్య' విషయమున కవులు ఎక్కువ జాగరూకులై యుండవలెనని భామహుడు ఇట్లు తెలిపెను. "పూవులనుమాలగా

కూర్చువాడు ఏ పువ్వు తరువాత నేపువ్వు కూర్చిన బాగుగానుండునో చక్కగా తెలిసి కట్టినట్లు కవియు అవధానముతో ఏ పదముతో నేపద మును గూర్చిన సొగసుగనుండునో తెలిసికొని రచంపవలెను. " పింగళి సూరనయు " పొసగ ముత్తెపు సరుల్ పోహళించిన రీతి దమలోన దొరయు శబ్దములగూర్చి " అని ఈ యభిప్రాయమునే తెలిపెను. మీది పద్యమున " కన్నుల గట్టినట్లు " అను చోట ' కన్ను ' అను పదమునకు బదులు నేత్రమనిగాని, చక్షువనిగాని పదప్రయోగము చేసి నను, ' కట్టినట్లు ' అనుటకుమారు బంధించినట్లు అనిగాని కూర్చినచో వైరస్యము కలుగక మానదుకదా ! అట్టివైరస్యము పొడమకుండ ప్రసిద్ధములగు పదములచేనేర్పడు ప్రసాదగుణయుక్తమగు పదానుపూర్వి సో శయ్య.

రసము : కావ్యమునకు గుణములు ప్రధానమని దండి, రీతి ప్రాణమని వామనుడు, అలంకారములు ప్రాణమని భామహుడు మొదలైనవారు వివిధములైన అభిప్రాయములను ' కావ్యాత్మ ' విషయమున వెలిబుచ్చిరి. తుదకు ఆనందవర్ధనుడు ధ్వనియే కావ్యా త్మ యనెను. అదియే ఆలంకారిక మతమున తుది తీర్పుగా నిలచి యుండగా, జగన్నాథపండితుడు రసము వ్యంగ్యముగా స్ఫురించవలెనని, అట్టి రసధ్వనియే ( వాచ్యము కానట్టి రసము ) కావ్యాత్మ యనియు ఆనందవర్ధనుడు చెప్పిన ధ్వనిని, పూర్వులు చెప్పిన రసము – రెండిటిని జోడించి చిట్టచివరి తీర్పుగా నిర్ణయించెను. దీనిపై నింతవరకు మరి యొక మతము బయలుదేరలేదు. ఇక నీ వాసవదత్తాపరిణయమున వ్యజ్యమానమగు రసమేదియో విచారింపవలయును. ఈ కావ్యమున అంగిరసము శృంగారము. వీర, రౌద్ర, భయానకాదులు అంగరసము లు. " విభావానుభావ వ్యభిచారిభావ సంయోగాద్రస నిష్పత్తిః "

అను భరతుని సూత్రముననుసరించి చూచినచో ఈ కావ్యమున అంగి రసమగు శృంగారమునకు నాయికానాయకులు ఆలంబన విభావములు. వారిరువురు స్వప్నముల పరస్పర వీక్షణము నాటినుండి వారిలో కలుగు చు వచ్చిన మార్పు, చంద్ర, మలయానిలాదుల వలన వారి అనురాగ ముద్దీపితమై సహింపరాని బాధ కలిగించుటవలన చంద్ర, మలయానిలా దులు ఉద్దీపన విభావములైనవి. వాసవదత్తా కందర్పకేతులు అను క్షణము ఒకరినొకరు పొందుటకై చేసిన యత్నములలో అనుభావము లు, వ్యభిచార భావములు ఇందు చక్కగా వర్ణింపబడుటవలన వీని సంయోగమువలన శృంగార రసోత్పత్తి జరిగినట్లు స్పష్టమగుచున్నది. కాని అనుభావ సంచారీభావాదులు రేఖామాత్రముగానే గాని ఇతర కావ్యములలోవలె విపులముగా నిందు కానరావు. అంకురిత, పల్లవిత, కోరకితమగు శృంగారావస్థలు స్వప్నమునందే ఘటిల్లినట్లు కన్పట్టుచు న్నది. సంభోగ శృంగారము కంటె, విప్రలంభ శృంగారమే మిక్కిలి అధికముగానున్నది. మూలమున సంభోగ శృంగారమున్నదా యని సంశయము కలుగును. అనువాదమునమాత్రమిది పటిష్ఠముగానున్నది. దీర్ఘమైన విప్రలంభము వలన రసము దృఢత్వమొందునని అభిజ్ఞుల అభిప్రాయము. నాయికానాయకుల విప్రలంభమున మన్మథావస్థలు పదియు క్రమరహితముగనైనను బూర్తిగా వర్ణింపబడినవి. ఉభయుల స్వప్నములందును బరస్పర దర్శనము (చూచుట), అనురక్తులగుట (మనస్సంగమము), మెలకువ వచ్చినతరువాత ఒండొరులను గలసికొన వలెనని నిశ్చయము (సంకల్పము), కందర్పకేతునకు నిదుర రాకుండుట (జాగరము), ఆహారము మాని నీరసించుట (కృశత్వము), చెలులు పలుకరించగా నాయిక అలుగుట (అరతి), సిగ్గు విడిచి తన కోర్కె చెలులకు తెల్పుట (హ్రీత్యాగము), మదన చంద్రానిలాద్యుపాలంభ నము (ఉన్మాదము), ప్రాణములను విడుచుటకై వాసవదత్త

మలయానిల భృంగాదుల కెదురేగుట (మరణవ్యవసాయము), పరస్పర దర్శనమున మూర్ఛ (మూర్ఛ) – ఈ దశవిధ మన్మథావస్థలు నిందు వర్ణింపబడెను. ఈ మన్మథావస్థలను వర్ణించునపుడు అంతిమావస్థయగు మరణము వర్ణింపరాదనియు, అందువలన ఆలంబన విచ్ఛేదమున అమంగళమగుననియు ఆలంకారికుల సిద్ధాంతము కనుక నిందు మరణ ప్రయత్నమే వర్ణింపబడెను (౬౫–౭౫ప). ఇట్లు విప్రలంభముచేత నాయికానాయకుల మనస్సులందు దృఢతరమైన యనురాగము స్థాయిత్వమును స్ఫురింపజేయుచున్నది.

కాని అటుపిమ్మట కందర్పకేతుడు వాసవదత్తా భవనమున కేగి ఆమెతోఁగలసి కాంచనమంచమున కూర్చుండినపుడు– "ముసిముసినగవులు మురిపముఁదెలుపం, బ్రసవశరుడు తన రసికత నెఱపన్, బిసరుహముఖి మరిఁబెనగొను తమి స్నిగ్ధసఁగఁగ విభుసిదెస సిటునటు మెలగెన్." – అని కవి సంచారిభావములను రేఖామాత్రముగా సూచించెను. ఇక నిరువురొకే మంచమున కూర్చుండుటవలన మనస్సు చలించగా, నిరువురు మూర్ఛాప్రాయమగు నవస్థనొందిరనియు, చెలుల శైత్యోపచారమున మేల్కాంచిరనియు మాత్రమే వర్ణింపబడెను. ప్రథమ దర్శనమున కలిగెడి అనుభావ సంచారిభావము లిందు వివరింపబడక పోవుట ప్రబంధ సాంప్రదాయమున కించుక దూరముగానున్నది. 'ముసిముసి నగవులు' – మొదలైనవి రేఖామాత్రములని తృప్తి చెందుటకైనను, అనావశ్యకములగు ఇతర వర్ణనములు, శ్లేష, విరోధాభాస, ఉపమ, ఉత్ప్రేక్షలను గావ్యమంతటను గుప్పించిన కవి, కథకవసరమైన ఈ పట్టున వర్ణనము సంకుచితమొనర్చుటకు కారణము కావ్యము మూలానుసరణమగుటయే. సుబంధుడును ఈ ఘట్టము సంకుచితము చేయుట పెద్దలోపముగనే స్ఫురించును. మొత్తముమీద నీవృత్తము రసభంజకమేగాని రసరంజకము కాజాలదు. ఏలయన నాయికానాయకులు

తెప్పరిల్లునరికి, కళావతి యను చెలికత్తె వచ్చి నాయికనొక గంధర్వ కుమారునికిచ్చి పరిణయమొనరించుటకై జనకుడు నిర్ణయించెనని చెప్పి వారి మనస్సులు కలతపెట్టుటచేత నిచట శృంగారమునకు విరోధియగు భయానకము పుట్టెను. ఆ భయముతో నాయకుడు నాయికను అశ్వముపై నెక్కించుకొని పట్టణమునుండి వెడలుట ఉత్సాహస్థాయిక మగు వీరరసముగా పరిణమించెను వారు వింధ్యాటవిలో పయనించు సమయమున గాని, లతానికుంజమున నిదురించి రనుటలోగాని శృంగార రసస్పర్శమైనను గన్పట్టదు. అటుపిమ్మట కందర్పకేతుడు మేల్కాంచి వాసవదత్త కానరాక వెదకి వెదకి విలపించుటలోగాని, మరణప్రియత్నము చేయుటలోగాని శృంగారము కానరాక కరుణమే కన్పట్టును. నాయకునకు నాయికను వెదకుటలో ఆమె లభించునను ప్రత్యాశ యుండినచో నది కరుణ రసముగాక విప్రలంభాంతర్గత కరుణగా భావింప వచ్చును. ఇచట అశరీరవాణి చెప్పు వరకు నాయకునకు నాయిక విషయమైన ప్రత్యాశ లేదు అశరీరవాణి ప్రబోధించిన పిమ్మట వర్ణింపబడిన కరుణను విప్రలంభాంతర్గత కరుణగా భావింపనగును. మరణోద్యోగము మాని కందర్పకేతుడు తీర్థయాత్రలు చేయుట నవ రసపక్షమున శాంతముగను " ఉజ్వల నీలమణి " ( రూపగోస్వామి) పక్షమున భక్తిరసముగను స్వీకరింప వచ్చును.

శృంగార రసమున కుదాహృతి :

చ॥ కొప్పుఘనంబు చూడనలక్రొమ్ముడికన్న సమున్నత ప్రభ
నివ్వగుఁగన్నుదోయి కచవిభ్రమ లోచన రోచికెక్కుడై
యొప్పగుఁజన్నులున్నతి సముజ్వలకైశిక దృక్కుచ ప్రభ
ల్దప్పఁబంధుత్వ వైభవముఁగాంచి ... ... ... ... ...

ఉ॥ కన్నులు చుట్టుకైమవులకై వడిఁ ద్రిప్పుచు గొప్ప కప్రపుం
దిన్నెలఁజిన్నిపాదములఁ దీవెనవాడుచు సన్న సన్నగా
బన్నసరంబులూగ వెడపాటల పాడుచునుండ నొక్కకాం
తన్నరుఁడొక్కరుండు ప్రమదంబున గౌగిటఁ జేర్చె నత్తఱిన్ (3ఆ–76)

**అలంకారములు :** సంస్కృతమున భట్టబాణుడు, దండి-మున్నగు గద్యకవులవలెనే సుబంధుడును బరిసంఖ్య, శ్లేష, వ్యతిరేక, ఉత్ప్రేక్ష, ఉపమాలంకారములను బురస్కరించుకొని శబ్దకోలాహల మెక్కువగా చేసినాడని "వాసవదత్తా" భూమికయందు కలదు. దాని కనువాదమగు "వాసవదత్తా పరిణయము" నందును అట్లే ఆయలంకారములు కొన్ని విడిచినను అధికముగా నవియే అనుసరింపబడెను.

**పరిసంఖ్యాలంకారము :** ఒకటి యనేక స్థలముల సంబంధించుచుండగా తక్కిన తావుల లేనట్లును, ఒక్క తావునందే యున్నట్లును జెప్పుట పరిసంఖ్యాలంకారము. మూలముననుసరించి వ్రాయబడిన పరిసంఖ్యాలంకారమున కుదాహరణ :

> "ఛలజాతి నిగ్రహయోగో వాదేషు నాస్తికతా చార్వాకేషు
> కంటకయోగో యోగేషు పరీవాదో వీణాసు। ఖలయోగః శాలిషు
> ... ... ... రాజ విరుద్ధతా పంకజానామ్ ... ... ...
> అగ్నితులా శుద్ధిః స్వర్ణానామ్ దుశ్శాసన దర్శనమ్ మహాభారతా "

అని మూలమున పెక్కు పరిసంఖ్యములుండగా వానిలో కొన్నిటిని మాత్రము గ్రహించి వీరభద్రకవి ఒక సీసమున పొదిగెను.

సీ॥ ఛలజాతి నిగ్రహములు వాదముల యంద, ఖిల యుక్తికలన భూతములంద
రాజవిరోధంబు రాజీవములయంద, యగ్నితులా శుద్ధి హైమమంద
వితత దుశ్శాసనోద్ధతి భారతమునంద, కంటకబుద్ధి యోగములయంద
నిరత పరీవాదసరణి వీణలయంద, ప్రచురనాస్తికత చార్వాకులంద
తే॥ కాననగు గాని యిట్టియోగములు ప్రజల, యెడలఁ బొడచూపవయ్యె నల్లడల నీతి
శాస్త్రనిగదిత కార్యవిచార సరణి నమ్మహీజాని ధరయేలు నవసరమున

( (1ఆ-176ప )

**ఉత్ప్రేక్ష :** ఉపమానము యొక్క గుణక్రియాదుల సంబంధముచేత నాపమేయము నుపమానముగానే తర్కించిన నది యుత్ప్రేక్ష యగును. వర్షకాల వర్ణనమున కవి -

మ॥ శరనిధిన్నీరము గ్రోలుచో నతి తృషన్ శంఖంబులుం గ్రోలి వా
ర్ధర సంఘాతము వానకాలమునఁ దత్తచ్ఛంఖ సంఘంబు దు
ర్భరమై సన్వమనం బొనర్చెనన నభ్రశ్రేణికిం జేరువం
గర మొప్పం జరియించె నయ్యెడ బలాకల్గర్భముల్దాల్చుచున్. (4అ-61ప)

అని బెగ్గురులను శంఖములుగా నుత్ప్రేక్షించెను. కాని ఆకాశమున శంఖములెట్లు వచ్చునను సంశయము కలుగును. కనుక సముద్రమందలి నీరముతో బాటు శంఖములను ద్రావిన మేఘములు వర్షకాలమున ఆ శంఖములను భరింపజాలక వమనమొనర్చుకొన్నట్లుగా బెగ్గురుపక్షులు ఆకాశమున విహరించుచుండెనని కవి ఊహించినాడు. వర్షసమయమున బెగ్గురుపక్షులు ఆకాశమున విహరించును. ఆ సమయమున నవి గర్భములు ధరించును. ఈ యథార్థమును కవి మనోహరముగా వర్ణించెను. "అతితృష్ణా వేగపీత జలనిధి శంఖ మాలాన్ బలాకాచ్ఛలాత్ ఉద్వమన్నివ అదృశ్యత జలధర నికరః" – అని మూలమునగల 'బలాకాచ్ఛలాత్' అను కైతవాపహ్నుతిని విడచి 'ఉద్వమన్నివ' అను క్రియోత్ప్రేక్షను వస్తూత్ప్రేక్షగా మార్చి బలాకములను మేఘములు వెడలగ్రక్కుచున్న శంఖములుగా ఉత్ప్రేక్షించుట హృదయంగమముగానున్నది.

శ్లేషాలంకారము : ప్రతి పదమునకు భిన్నార్థములుండును. ఆ భిన్నార్థములు స్ఫురించునటుల పద్యమును వ్రాసిన శ్లేషాలంకారమగును. ఇది అభంగశ్లేష, సభంగశ్లేష యని రెండువిధములు. ఈ కావ్యమున మూలమందలి శ్లేషలే చాలవరకుపయోగింపబడెను. కొన్ని బలవంతముగా కొనితేబడెను. అవిగాక, కవి స్వతంత్రముగా అలంకరించిన శ్లేషలు ఆ కవి ప్రతిభను విశదము చేయును. కవి స్వతంత్రముగా వేసిన శ్లేష :

చ॥ శ్రుతి హిత వాక్స్వభావములఁ జొక్కియు నీహరితత్త్వవైఖరుల్
వతిని దలంచియున్ ద్విజసమాఖ్య గణించియు నాగమాంత సం
తత భజనంబు మెంచియును దావక సఖ్యము గోరుచెల్ల నో
పతగవతంస సత్కుల విభావన తధ్యమొనర్చుటం జుమీ. ( 2ఆ-28ప )

— ఇది పక్షి పరముగాను, బ్రాహ్మణ పరముగాను రెండర్థములు గల పద్యము. శ్రుతిహిత వాక్స్వభావములన్, హరితత్త్వవైఖరుల్, ద్విజ సమాఖ్య — మున్నగునవి అభంగశ్లేషలు. శ్రుతియనగా వేదములని యు, కర్ణములనియు నర్థము. అట్లే హరితత్త్వవైఖరుల్ — విష్ణు మూర్తియొక్క యథార్థ స్వభావము నెఱిగియుండుట, పచ్చదనము కలిగియుండుట. ద్విజసమాఖ్య — బ్రాహ్మణత్వము, పక్షియను పేరు గణించియు — అని శ్లేషించినాడు కవి. ఇక ఆగమాంత అనగా వేదాంతము అనియు, అగమ+అంత=చెట్ల కొనలు అనియు నర్థము. ఈ పద్యము కవి ప్రతిభను దేటపరచుచున్నది.

మూలమున ననుసరించి వ్రాయబడిన శ్లేషాలంకారము :

"... ... కాముక చిత్తవృత్తియుంబోలె కాంతారోష రసానుగతంబై ... ..."
( 2వ ఆశ్వాసము - 5వ వచనము )

— ఇచట నించుకయైన భేదము లేకుండ మూలమందలి సమాసము తుదను తెనుఁగు విభక్తిప్రత్యయము మాత్రము చేర్చి యథాతథము గా తెనుఁగులోకి తెచ్చుటయే విశేషమనిపించును కాని ఇది కేవల ము సభంగశ్లేషస్థలమగుట వలన జతుకాష్ఠము వలె ఎచ్చటకచ్చట విరిచి వేరర్థము చెప్పవలసియున్నది. ఇట్టి స్థలములలో యితర భాష లలోనికను వాదము కుదురదుకనుక మూలమునంతను తుదిప్రత్యయము లు తప్ప తెలుగులోనికి తెచ్చినాడు కవి. మూలమున " కామీవ కాన్తారోష రసానుగతః " ( వా. 100 పుట ). అనగా కాన్తార—ఊషర — సానుగతః — అని ఒక యర్థమునను, కాన్తా—రోష—రస— అనుగతః — అని మరియొక అర్థమునను బ్రయోగింపబడెను ఇట్టి కూర్పు తెలుగు

పదములతో ఘటిల్ల నేరదు. కావున మూలమునందు వలెనే తెనిగింప వలసి వచ్చెను. ఇది శ్లేషోత్థాపిత ఉపమాలంకారము.

ఉ ప మా లం కా ర ము : 1వ ఆ - 172 పద్యమున కవి మూలమునుండి గ్రహించిన ఉపమానమును నిక్షేపించెను.

గీ॥ వరుణునకు సాటి యీ ధరావరుఁడుఁ దెలియ
సంతతాశాంత రక్షోదంత లీలఁ
గుంభజునిఁ బోలు నాధరా జంభవైరి
దక్షిణాశా ప్రసాధ కోదయ నిరూఢి.

ఇట - రాజునకు వరుణునితో, కుంభజునితో పోలిక చెప్పబడెను.

సూ క్ష్మా లం కా ర ము :

సీ॥ హల్లకాగ్రంబుపై మొల్లమొగ్గలఁ జేర్చి పల్లవోష్ఠము దంతపంక్తిఁ జూచి
పంకేరుహముల నుత్పలముల జతలుంచి మొగమును గనుదోయి సొగసుఁజూచి
కనకకోరకము చెంగట మల్లెవిరియుంచి నాసయుఁ దద్భూషణంబుఁ జూచి
చిగురుటాకుల చెంత మొగలిరేకులుగూర్చి కరతలంబులు నఖాగ్రములుఁ జూచి
విరులుగొనవచ్చి యువజనుల్మరుబారిఁ జనుటగని జాణతనమునఁ గొనుదుపూల
బంతులని కేలు వక్షముపై ఘటించి విలువఁదెమ్మందుఱ్రి పుష్పలావికలు పురిని
(1ఆ-165ప)

పుష్పములను గొనవచ్చిన యువజనులు కనకకోరకము చెంగట మల్లె విరినుంచి, పుష్పలావికల యొక్క నాసయు, భూషణమును జూడగా వారి హృదయము నిపుణులైన పుష్పలావికలకేగాని ఒరులకు తెలి యదు ఇట్లు సూక్ష్మమైన యర్థము తమకు కావలసిన వారికి మాత్ర మే స్ఫురించునట్లు హావభావములచేత తెల్పుటను సూక్ష్మాలంకార మందురు. ఇచ్చట యువజనుల భావము గ్రహించిన పుష్పలావికలు ను వారికి తగినట్లు తమచేష్టల వలన సూక్ష్మార్థమును భాసింపజేసిరి.

సందేహాలంకారము :

క॥ వనమా యిది చైత్రుని జీ
వనమా పికనికర సుకర వనమా స్మర భా
వనమా నవయువజన పా
వనమా రతిభాగ్య భాగవనమా యనుచున్. (2ఆ-74ప)

— ఉపమానోపమేయములు రెండింటను సంశయము సమానముగా వర్ణింపబడుట వలన ఇచట సందేహాలంకారమును 'వ న మా' అను శబ్దము అర్థభేదముతో ఆవృత్తమగుటవలన యమకాలంకారమును గలవు. ఇది వసుచరిత్రిలోని పద్యమున కనుకరణము.

పూర్వకవుల ననుకరించుట :

ఈ కావ్య రచనలో వీరభద్రకవి పూర్వకవుల ననుసరించిన జాడలు గలవు.

చ॥ తరుణి యొకర్తు 'తేని తమిఁదప్పక జూచి తదీయ రూపమో
వరిని లిఖించి తన్నచట వ్రాయఁగఁ దద్విభుఁ డండజేర న
గ్గురుకుచ నేర్పుతో నృపునకున్సుమచాపము చేత వ్రాసె న
ద్దిర యది యెంత ప్రౌఢసుదతీమణియో పరికించి చూడగన్.(5ఆ-32ప)

— పుర ప్రవేశము చేయుచున్న కందర్పకేతుని గాంచిన కాంతల చేష్టలను వర్ణించుటలో చేయబడిన వర్ణనమిది. "కువలయానందము" అను అలంకార శాస్త్రగ్రంథమున యుక్త్యలంకారమున కీయబడిన యుదాహరణము ననుసరించి కవి యీ పద్యము వ్రాసెను.

యుక్తిః పరాతిసంధానమ్ క్రియయా మర్మగుప్తయే
త్వామాలిఖన్తీ దృష్ట్వాన్యమ్ ధనుః పౌష్పమ్కరే లిఖత్ ॥.

— 'పుష్పాస్త్రుని చిత్రించుట యను వ్యాపారముచేత నేను మన్మథుని చిత్రించుచున్నాను.' అనెడి భ్రాంతి యితరునికి కలిగించుట వలన స్వానురాగ రూపమైన రహస్యము గుప్తముగా నుంచబడుటచేత నిది

యుక్త్యలంకారము. అట్లే వాసవదత్తా పరిణయమున కందర్పకేతుని జూచిన యతివ మోహావేశముతో నతని చిత్రము లిఖించి యా రసను దనను లిఖించుకొనఁగా కాంతుఁడు చూచుచుండఁగా నామె తనమోహము కప్పిపుచ్చుటకై యుక్తిగా నా చిత్రపటమున కందర్పకేతుని హస్తమున సుమచాపము వ్రాసి, మన్మథుఁడని భ్రాంతిని భర్తకు కలిగించెను. కువలయానందముకంటె నధికముగా నిందు కవి, ఆ కాంత నాయకుని ప్రక్క తన చిత్రము లిఖించినట్లు చెప్పెను.

కావ్యాదిని దేవతాస్తోత్రమునఁగల

చ॥ అజనిజ సృష్టికాదియయి, హవ్యముఁ గైకొని సోమయోగ్యమై
గజిబిజి రేయునుం బగలుఁ గల్పనచేయుచు శబ్దహేతువై
త్రిజగదణుత్వసిద్ధి ప్రకృతిత్వము గైకొని దాల్చు నా వృష
ధ్వజుఁడణుఁ డష్టమూర్తి ప్రమదం బొసఁగున్ గృతికర్తకీయెడన్. 1ఆ-3ప

అను పద్యము కాళిదాస అభిజ్ఞాన శాకుంతలము నందలి నాందీ శ్లోకము నకనుకృతి.

శ్లో॥ యా సృష్టిః స్రష్టురాద్యావహతి విధిహుతం యా హవిర్యాచ హోత్రీ
యే ద్వేకాలం విధత్తః శ్రుతివిషయగుణా యా స్థితా వ్యాప్య విశ్వం
యామాహుః సర్వబీజ ప్రకృతిరితి యయా ప్రాణినః ప్రాణవన్తః
ప్రత్యక్షాభిః ప్రపన్నస్తనుభిరవతు వస్తాభిరష్టాభిరీశః ॥

— అజుని సృష్టికాదియైనదియు, యజ్ఞములందు హోమము చేయబడిన హవిస్సును గొనిపోవునదియు, ఎవడు యజ్ఞముచేయునో తద్రూపమును రేయింబవళ్ళను గలిగించునట్టి చంద్రసూర్యరూపములగు రెండుమూర్తులను, శబ్దగుణకమగు నాకాశమొకటియు, సకలభూతములకును బరమాణురూపముగా ప్రకృతియైన భూమియు, ప్రాణముగల చరాచరములకెల్ల ప్రాణము కలిగించునట్టిదగు వాయువును — మొత్తమాయెనిమిదియు శివునియొక్క శరీరములు. అట్లు ప్రత్యక్ష శరీరములతో కనవచ్చుచున్న అష్టమూర్తియగు శివుడు మిమ్ములను రక్షించుగాక — అని

తాత్పర్యము ఈ శ్లోకమును సరిగా నద్దములో ప్రతిబింబము వలె వ్యర్థపదములు లేకుండా అనువదించుటలో కవి ప్రతిభ వ్యక్తమగుచున్నది. ఎనిమిదవ శరీరమగు వాయువునకు పర్యాయ పదముగా కవి 'పృషధ్వజుడు' అను శబ్దమును ప్రయోగించెను. ఇది శివస్తుతియగుటవలన ముద్రాపకులీశబ్దమును 'వృషధ్వజుడు' అని భ్రాంతిపడి 'పృ' అనునక్షరమును 'వృ' గా సవరించి ముద్రింపించిరి. కాని 'పృషత్' అనగా లేడి అని అర్థము. పృషద్ధ్వజుడనగా లేడి లాంఛనముగాగలిగిన వాయువు అని అర్థము. కనుక నిచట వృషధ్వజుడను శబ్దమనుచితము. వృషధ్వజుడని ప్రయోగించినచో శ్లోకములో చెప్పబడిన అష్టమమూర్తియగు వాయువు ఇట లోపించును.

శ్లేషలలో చాల భాగము మూలానుసరణములును, కొన్ని స్వయంకల్పితములునై యున్నవి పీఠపద్యములు కొన్ని వసుచరిత్రకనుకరణములుగ. అట నట కొన్ని ఉత్తరహరివంశము ననుసరించినవిగ కన్పట్టుచున్నవి. వసుచరిత్రములో గల

తన భవ్యధామంబుఁ దన భవ్యధామంబు కరణి
మిత్రోన్మేషకరముఁగాగ ... ... ... ...

అను పద్యమునకు ఛాయగా వాసవదత్తాపరిణయము ప్రథమాశ్వాసమునందలి

తన వంశధర్మంబుఁ దన వంశధర్మంబురీతి
యుద్యద్గుణ ఖ్యాతి నలర ... ... ...

అను పద్యమును కవి రచించెను. శబ్ద శిల్పముతో కూడిన పద్యములిట్టివెన్నియో అర్థచ్ఛాయతో గూడ ఇందుగలవు. మనుచరిత్రయందు గల "అటజని కాంచె భూమిసురుఁడ" అను పద్యపుఛాయలో "కనుగొనియెం బురస్ఫురదగస్త్యమహాముని" అను పద్యము గలదు. ఇట్టి పద్యములిందనేకముగలవు. వీరభద్రకవి శ్రీనాథు ననుసరించిన

పట్టులును గలవు కాశీఖండమున -

సీ॥ "ఉండు నేవీట మార్కండేయ మునినాథ సజ్జలింగ మనంగశాసనుండు
ప్రవహించు నేవీట పశ్చిమప్రాకారమెరసి గంగమ్మ సాగరము కొ
... ... ... ... ..."

అను పద్యమువలె

సీ॥ "నివసించె నేవీట నిజ పదాబ్జా ... ... ...
... ... ... శంభు సారూప్య ముక్తి నిస్సంశయముగ"

అను పద్యమును కవి నిర్మించెను. ఇట్లు ప్రాచీనాంధ్ర కవులయెడ గౌరవముతో వీరభద్రకవి పూర్వ కవులననుసరించి కృతకృత్యుడయ్యెను.

కన్నులగట్టినట్లు, కన్నెఱజేసి, పెన్నిధానంబుఁ బొడగన్న పేద కరణి, పోతుటీగయిన జేరనోపదటంచు - మున్నగు తెలుగు జాతీయము లను సందర్భానుసారముగా కవి ప్రయోగించెను.

**వ్యా క ర ణ ము :**

వి చ్చ న్ : విచ్చుధాతువు తుమర్థకరూపము. కవి ప్రథ మాశ్వాసమున 128వ పద్యమున యతిస్థానములో 'విచ్చన్' అని ప్రయోగించెను. కాళహస్తీమహాత్మ్యమున 2-180 లో

"చెవ్వం దీశ్వరు ... ... నీశ్వరేశ్వరుని గాంచెన్ భీషణాభీలతత
ద్రవ్వన్ ... ... ... ... ... విధాహవ్యధల్
వివ్వన్ ... ... ... ... ... " -

అని ప్రాసస్థానమున 'విచ్చన్' అని కలదు. "ఆగమాన్య చకారంబు లకద్విరుక్తంబులకు ముత్తు పరంబగునపుడు వ, వ లగు" - అని బాల వ్యాకరణము, క్రియాపరిచ్ఛేదమున 88వ సూత్రము. ఈసూత్రముచేత సిద్ధ చ కారమునకు వ కారము రావలసి యున్నది. కాని సూత్రమున అద్విరుక్తమనుటచే గ్రుచ్చు, ద్రవచ్చు, విచ్చు-మున్నగు ద్విరుక్త

చ కారములున్న వానికి 'వ' కారము రానట్లు కనబడుచున్నది. అయినను ద్విరుక్తములలో కొన్నిటికి 'వ' కారద్వయాదేశము కనబడుచున్నది. పైనచెప్పిన ధాతువులన్నియు నిట్టివే. వానికి వికల్పవిధి యెచ్చటను గానరాదు. కావున నిచట యతిస్థానముననున్న 'విచ్చన్' అను రూపముగాని కాళహస్తి మహాత్మ్యమందలి 'వివ్వన్' అను రూపముగాని ప్రమాద పతితములై యుండును.

రాయనంటుల నీడకు : మధ్యమపురుష మువర్ణకము నకచ్చు పరమైనను మువర్ణకలోపమిట విశేషము. 'రమ్మనంటుల నీడకు' అని యుండవలెను. కాని యిట

"వేయునేటికి విరులకై ... ... ... ... ...
రాయనంటుల నీడలకు వలరాయనికి తెరువియ్యగావలె"

– అని యుండుటచే ప్రాసము, యమకము – రెండిటియనురోధమునను 'రాయ' నిశేగాని 'రమ్ము' నుట పీలుపడదు ఇట్టిదే భారతమున 'చుమ్ము' అను బ్రయోగము కలదు. 'చుమ్ము' అనుదానికి మువర్ణలోపమున చూచు ధాతుసంబంధమైన దీర్ఘమువచ్చి చూము, చూవే మున్నగు రూపములు మధ్యమపురుషముననే సిద్ధించును. అప్పుడు వానికి అచ్చుపరమైనపుడు మువర్ణలోపము లేకున్నను, "క॥ ... ... మత్సాయకముల నిన్ను గూల్చెద జూ ......" (భీష్మ. 3ఆ క24ప). అని కలదు. కొందరిమతమున నిది అవ్యయమని సాధింపబడెను. అట్లే 'రా' యనునదికూడ అవ్యయమే యన్నచో నిరాక్షేపము.

సన్నగించు. ఈ ధాతువు సన్నగిల్లె, సన్నగిల్లు అని ప్రసిద్ధము. కాని యిచట 'సన్నగించు' అనకున్న క్రమభంగముకలిగి అనుప్రాసము చెడును. కవి యుద్దేశ్యమున నిది 'సన్నగించు' అనియే. ఈ ప్రయోగమెచటనైన కలదేమోకాని నిఘంటువున శూన్యము.

జంఘాలము : "జంఘాలమై కీలుజడ నటించ", "జంఘాలోతి జవస్తుల్యః" అను అమరమును బట్టియు ఇతర నిఘంటులం బట్టియు వేగముకలది అనునర్థమే కాని వేరర్థము కానరాదు. కాని వీరభద్రకవి యిట పిక్కలదాక వ్యాపించినట్టి కీల్జడ అనునర్థమున నీపదము వాడెను. కీల్జడకును, అరిజవమునకు సంబంధము లేదు. "అలభూషణ పర్యాప్తి వారణేషు" అనునర్థమున 'అల' ధాతువుతోడి కృదంతముగా నీకవి విశేషించి చెప్పెను. 'జంఘాం అలతీతి జంఘాలః' (జంఘల పర్యంతము వ్యాపించునది జంఘాలము) అను భావమున చెప్పుటచే కవికి వ్యాకరణ మర్మజ్ఞత తెలియును.

చెల్కత్తియ : 'చెలికత్తియ' అనియుండగా నిందలి 'చెలి' శబ్దములోని 'ఇ' కారమునకు లోపము క్రొత్తగనున్నది. అచ్చు పరమగునపుడు (మగని+ఆలు) సంధులున్నను హల్లు పరమైనపుడు 'ఇ' కారలోపము ప్రచురముగా లేదు. 'కువలయాశ్వ చరిత్రము' న "గీ॥ కట్టిక మిటారి మొకరి చెల్కత్తెగములు" అని 'ఇ' కారలోపము కనబడుచున్నది. "ఈ ప్రయోగ మొకటిమాత్రమే 'చెల్కత్తె' అని సంశ్లిష్టరూపమున గనబడుచున్నది" అను సూచనతో (శ్రీ) సూర్యరాయాంధ్ర నిఘంటువున కలదు.

నీలముంచి : నీరు శబ్దమునకు బహువచనమున నీర్లు, నీళులు, నీళ్ళులు అనియే ప్రాచీన ప్రబంధములలో కనబడుచుండగా మన కవి "కేల నీలించి తేలించి నీలముంచి నెలత లంభోవిహారంబు సలిపి" అని 'నిలు' శబ్దము ప్రయోగించెను. కేలు, నీలు, తెల్లనిలు, మున్నగు ప్రయోగములు గ్రామ్యమున నేగాని గ్రాంథికమున కానరావు.

ఇందు కవి ప్రయోగించిన 'సిసృక్షు' 'రిరంగు' మున్నగు సన్నంత ప్రత్యయముల వలన అతడు సంస్కృత వ్యాకరణ రహస్యముల

నెఱిగినవాడని తెలియుచున్నది. 'ప్రతిభ' **అను** పదము ప్రసిద్ధి, కాంతి—**అను** నర్థములో కవి ప్రయోగించెను.
ఉదా :— నేత్రాంచలాచంచల ప్రతిభలు. ఇంకను 'హజారము' వంటి ఉరుదూ పదములు నిందు గలవు.

ఇట్లు శ్లేషభూయిష్ఠమై దురవగాహమగు సుబంధు కవికృతమగు '**వాసవదత్త**' నవగాహనము చేసికొని, ఆతని పోకడలకు న్యూనత రాకుండా ఆంధ్రమున పద్యకావ్యముగా ధారాళమగు శయ్యలో రచించిన వక్కలంక పెద వీరభద్రకవి ఉభయభాషా మర్మజ్ఞుడని యెల్ల రంగీకరింపవలసిన విషయము. అట్టి మహాకవిని పిఠాపుర సంస్థానమున తొలి ఆస్థాన కవిని గావించిన ఖ్యాతి రావు వంశీయులలో శ్రీ పెదమాధవరాయణింగారికే లభించెను. సప్త సంతానములలో ఖిలముగాకుండిన కృతిని రచియింపజేసి అంకితమొందిన రసజ్ఞునిగా సాహిత్యచరిత్రలో పెదమాధవరాయణింగారి పేరు శాశ్వతముగా లిఖింపబడెను.



# కవి పండితపోషణ
# శ్రీ రావు వేంకటకృష్ణారావు
( క్రీ॥ శ॥ 1728_1759 )

పిఠాపురము జమిందారులలో ప్రథమముగా సాహిత్య పోష ణముచేసి, కృతినందిన శ్రీరావు పెదమాధవరావుగారి యనంతరము సాహిత్య సేవయందాసక్తి కలిగి, కవులను సన్మానించిన ప్రభువు శ్రీరావు చినమాధవరావుగారు. వీరు క్రీ॥ శ. 1759_1762 కాలమున రాజ్యపాలన మొనరించిరి. వీరివలన కవిసార్వభౌమ బిరుదము నొందిన కవి కూచిమంచి తిమ్మన. కాని శ్రీ చినమాధవరావుగారు రాజ్య పాలనమునకు వచ్చుటకు ముందే తిమ్మకవిని సన్మానించినట్లాతని గ్రంథ ములవలన తెలియుచున్నది తిమ్మకవి, పెదమాధవరావుగారు రాజ్య మేలుచున్న కాలమున కలము చేపట్టెను. ఈ యిరువురు మాధవరా యణింగారలకు నడుమ శ్రీ రావు నరసింహారావు, శ్రీ రావు వేంకట రావు, శ్రీ రావు వేంకటకృష్ణా రావు ననువారు పిఠాపుర సంస్థానము ను పాలించిరి. తిమ్మకవి తాను జీవితకాలములో చూచిన యీ యై దుగురు పాలకులలో, పెదమాధవరావుగారిని 'రుక్మిణీ పరిణయము' న, వేంకటకృష్ణా రావుగారిని 'సారంగధర చరిత్ర' యందు, చినమాధవ రావుగారిని 'రసికజన మనోభిరామము' న పేర్కొనెను. కనుక నీ ముప్వురిలో నొకరి పేరీయధ్యాయమునకు పెట్టవలయును.

పెదమాధవరావుగారు క్రీ॥ శ॥ 1704 లో మరణించిరి. నాటికి తిమ్మన సుమారు పదునాల్గు వత్సరముల ప్రాయము కలిగి, ఒకటి రెండు శతకములు, దండకములు మాత్రము రచించియుండును. ఇక చినమాధవరావుగారు రాజ్యమునకు వచ్చిన పిమ్మట తిమ్మన సాహిత్య

సృష్టి చేసినట్టుకాన్పింపదు. కనుక నీ యిరువురి పేరను యీ యధ్యాయముండుట సరికాదు

తిమ్మన పేర్కొనిన మరియొక ప్రభువు క్రీ॥ శ॥ 1728 నుండి 1759 వరకు ( ముప్పదియొక్క వత్సరములు ) పిఠాపురమును పాలించి, రాజకీయముగా, సాంఘికముగా ఖ్యాతినొందిన శ్రీ రావు వేంకటకృష్ణారావు గారు. కృష్ణారావుగారి రాజ్యకాలముననే తిమ్మకవి అచ్చతెనుగు రామాయణము, సారంగధరచరిత్ర, సప్తార్ణవసంగ మాహాత్మ్యము, సర్వలక్షణ సారసంగ్రహము, రసికజన మనోభిరామము, సర్పపురీ మాహాత్మ్యము, శివలీలావిలాసముఅను కావ్యములను, భర్గశతకమును రచించెను. మరియు నీ కృష్ణారావుగారి కాలమందే, తిమ్మకవి చినమాధవ రాయణింగారిచేత కవి సార్వభౌమ బిరుదమునొందెను. వీరికి ముందు పిఠాపురమునేలిన నరసింహారావు, వేంకటరావు గార్లు రాజకీయముగా కాని, సాంఘికముగా కాని, సాహితీపోషణమున కాని అంతగా పేరు ప్రతిష్ఠలు కలవారు కాదు తిమ్మకవి కృష్ణారావుగారిని తన ' సారంగధర చరిత్ర ' లో నిట్లు పేర్కొనెను.

> " రావు వేంకట కృష్ణరాయ విశ్వంభ
> రా వరాపర పరిగుప్త రాజమహేంద్ర
> వర దేశ భాగ భాస్వద్దివ్య పీఠ
> పుర మహారాజ్య విభూషాయమాన. "

తిమ్మన యీ రీతిగా కృష్ణారావుగారిని తన కావ్యమున తలచుటవలన, నీతడును సాహిత్యపోషణము చేసియుండుననని భావించుటకవకాశము కలదు. ఏలయన, నీ కవి తన జీవితకాలములో చూచిన ఐదుగురిలో నిరువురను ( పెదమాధవ, చినమాధవ రాయణింగార్లు ) సాహిత్యపోషణాసక్తులనే పేర్కొనెను. ఇక మూడవ ప్రభువు (కృష్ణారావు) నట్టివాడు కానిచో పేర్కొనునా ? కనుక ఈ ప్రభువుయొక్క సాహిత్యపోషణ

మునుగూర్చిన వివరము లేవియు తెలియకున్నను సాహిత్యపోషణాసక్తు జేయుచును. పై కారణమువలన నీ యధ్యాయమునకు కృష్ణారావు గారి పేర శీర్షిక పెట్టబడెను.

## కూచిమంచి తిమ్మకవి

తిమ్మకవి ఆరువేలనియోగి బ్రాహ్మణుడు, కౌండిన్యస గోత్రుడు, లక్ష్మమ్మ, గంగనామాత్యుల పుత్రుడు. కవిసార్వభౌమ, అభినవ వాగనుశాసన బిరుదములు కలవాడు. రసికజన మనోభిరామము న తిమ్మకవి తనకు పీఠపుర ప్రభువులు కవిసార్వభౌమ బిరుదమును నిచ్చినట్లు తెల్పెను ( రసిక 1ఆ. 24. ). తిమ్మకవి అనుజుడగు కూచిమంచి జగ్గకవి తన 'చంద్రరేఖా విలాప' కావ్య గద్యయందు "ఇది శ్రీమజ్జగన్నాథదేవ కరుణా కటాక్ష వీక్షణాను సంలబ్ధ సరస కవితా విచిత్ర ......... కూచిమంచి కుల పవిత్ర గంగనామాత్య పుత్ర మానితా నూనసమాన నానావిధ రంగ త్రిలింగ దేశ భాషావిశేష కవితావిలాస భాసురాఖర్వ సర్వలక్షణసార సంగ్రహోద్దామ, శుద్ధాంధ్ర రామాయణ ప్రముఖ బహుళ ప్రబంధ నిబంధన బంధుర విధాన నవీన శబ్దశాసన బిరుదాభిరామ తిమ్మకవిసార్వభౌమ సహోదరుడు" అని చెప్పెను ఇందు తిమ్మకవి శబ్దశాసన బిరుదము పేర్కొనబడెను.

తిమ్మకవి అనుదినము కందరాడనుండి పిఠాపురము వచ్చి, శ్రీ కుక్కుటేశ్వరుని సేవించెడి వాడనియు, సహస్రమాస జీవియనియు స్థానికులు చెప్పుదురు. ఈ కవి చివరి దశయందు భార్యా వియోగము సంభవించుట చేత సన్యసించి శేష జీవితమును పిఠాపురములోని శ్రీ కుక్కుటేశ్వరాలయమునందే గడిపి సిద్ధిపొందెనని జనశ్రుతి.

కవి ఈక్రింది కావ్యములందు తాను దెందులూరి లింగనారాధుని శిష్యుడనని చెప్పెను.

**నీలాసుందరీ పరిణయము:**

ఎడఁగుదురను భక్తిని
ల్చెద బలు పుట్టువుల గూరిచిన దోసంబుల్
జెడుమంగా వేడుక పె
ల్లిడ మొదవెదు దెందులూరి లింగణాగురునిన్. ( 1ఆ 10౮ )

**అచ్చతెనుఁగు రామాయణము:**

సీ. ఏమేటియెడుగు గెందామర
బల్లాపురపు చెల్లకేని కప్రంపుఁబెప్పు
యేబల్లిదుండు చెవినిడు నక్కారములు
చెల్వపుముత్తి మేడకు వరుసమెట్టు
లే పున్నియములగని యొఱింగించు మేత్రెవ్వి
కల్వ జగంబు చీకటికి దివ్వె,
యేదంట యొసఁగునూబ్బది దోసపుఁదూల్వ
గాడ్పు దిండులకు వాకట్టుమందు
తనరనే పెద్ద పుట్టువులను కడింది
తెవులునకు వెజ్జుఁడట్టి దెందులూరి
కొలపు పాలేటి నిండు జాబిలి యనంగ
దనరు లింగనగురుని దెలవమువఁదలఁతు ( 1ఆ 01౫)

**సారంగధర చరిత్ర:**

అలఘు తేజోనిధియగు దెందులూరి
కుల లింగనారాధ్యగురుని నుతించి

**రసికజనమనోభిరామము**

చిరభక్తి ప్రతిభా విభాసితుఁడనై చింతింతు నశ్రాంతముం
బరవాది ప్రమద ద్విపేంద్ర పటలీ పంచానన శ్రేష్ఠు బం
ధుర తేజోనిధి దెందులూరి కులపాథోరాశి రాకానిశా
కరున్లింగయ-సద్గురూత్తముని సాత్త్వచ్చంద్ర చూడాకృతిన్. ( 1ఆ 8 )

సర్పపురీ మాహాత్మ్యము :

చ. ముదమునఁ గేలుదామరలు మోడ్చి నమస్కృతులాచరింతు ని
ల్లిభుఁడగు దెందులూరి కుల లింగయ సద్గురునాథ మౌళికిన్
సదమలశీలికిం త్రిపురసంహర పాదసరోరుహాళికిన్
మదపరవాది మండల తమఃప్రముదాంశు మయూఖ మౌళికిన్ (1ఆ-8ప)

శివలీలా విలాసము:

ఉ. శ్రీరమణీ రమేశ్వరులఁ జిత్తమునం గదియించి భారతీ
సారసగర్భుల న్మిగుల సంస్తుతిఁజేసి మతంగజాననున్
సారెకుఁగొల్చి దెందులూరి సత్కులపావను లింగనార్యు నిం
పారఁదలంచి మున్నటి మహాకవులన్భజియించి వేడుకన్ (1ఆ 3ప)

ఈ కావ్యములందు మాత్రమేకాక, భర్గ, చిరవిభవ శతకము లందును తిమ్మకవి దెందులూరి లింగనార్యుని తలఁచెను. ఈ రెండు శతకములందలి గురుస్తోత్రి పద్యములు అల్ప భేదముతో రసికజన మనోభిరామమునందలి పద్యములతో సరియగుచున్నవి. ఈ దెందులూరి లింగనారాధ్యుడే వక్కలంక వీరభద్రకవికిని మాహేశ్వర దీక్ష నొసగిన గురువగుటచేత నీవక్కలంక వీరభద్రకవియు, కూచిమంచి తిమ్మకవియు సమకాలికులనియు, పెదమాధవరావుగారే తిమ్మకవిని సన్మానించిరనియు శ్రీ చెలికాని లచ్చారావుగారభిప్రాయపడిరి. లింగనారాధ్యుని తొలి దశయందు వక్కలంక వీరనయు, మలిదశలో కూచిమంచి తిమ్మనయు శిష్యులనియు భావించుట తగును.

తిమ్మకవి తన కావ్యములలో, తనకు శివుడు సాక్షాత్కరించి కావ్యమంకితమిమ్మని కోరినట్లు కొన్నిటను, భావనారాయణస్వామి సాక్షాత్కరించి కావ్యమంకిత మడిగినట్లు సర్పపురీ మాహాత్మ్యమునను వ్రాసెను.

నీలాసుందరీ పరిణయము ( 1ఆ-16 ), అచ్చ తెనుఁగు రామాయణము (బాలకాండ-13) రసికజనమనోభిరామము (1ఆ-20),

సర్వపురీ మాహాత్మ్యము(1ఆ-14ప) లలో నీస్వప్న వృత్తాంతము కలదు. తిమ్మకవి శైవుడయ్యును రాజశేఖర విలాసము, శివలీలా విలాసము మరికొన్ని శతకములుతప్ప, మిగిలిన కృతులన్నిటిని విష్ణు సంబంధక మగు కథలతోడనే వ్రాసెను. అంతేకాదు, ఈ స్వప్న వృత్తాంతము లలో సర్వపుర మాహాత్మ్యమున భావనారాయణస్వామి కావ్యమంకిత మిమ్మనుటయే కాక,

క. శివునకు నాకును భేదము
యువ మాత్రము లేదు నేనెయతఁ డాతఁడ నే ?''. ( 1ఆ-16ప )

అనినట్లు కలదు. దీనినిబట్టి తిమ్మన హరిహరాభేద తత్త్వము కలవాడని తెలియుచున్నది

ఇట్లు తిమ్మన బహుకావ్యము లలో స్వప్న వృత్తాంతము చెప్పుట వలన " తిమ్మకవికి ప్రతి కావ్యమందును స్వప్నము కలుగు " నను అపవాదు లోకమున నిలిచిపోయినది కాని పరిశీలించిచూడగా నీ స్వప్నము కొన్ని కావ్యములందు మాత్రమే యుండుటవలన, శివ భక్తుడగు నీకవికి వచ్చిన స్వప్నములు సత్యములేయని తోచును.

తిమ్మకవి ఆశ్వాసాంత గద్యములన్నియు నొక్క రీతిగా కన్పట్టుట లేదు సింహాచల మాహాత్మ్యము, నీలాసుందరీ పరిణయము, అచ్చ తెనుగు రామాయణములలో " ఇది శ్రీమదుమారమణ కరుణాకటాక్ష వీక్షణ సంలబ్ధ సరస కవితా సామ్రాజ్య ధురంధర ఘన యశోబంధుర కౌండిన్యస గోత్ర పవిత్ర కూచిమంచి గంగనామాత్య పుత్రి బుధ జన విధేయ తిమ్మయ నామధేయ ప్రణీతంబైన " అని కలదు. ఇక రాజశేఖర విలాసము, రుక్మిణీ పరిణయము, సర్వలక్షణసార సంగ్ర హము లందు " ఇది శ్రీమత్కుక్కుటేశ్వర వరప్రసాద లబ్ధ కవితా సామ్రాజ్య ధురంధర" అని తదుపరి అంతయు సింహాచల మాహాత్మ్యాదు లందువలెనే కలదు. రసికజన మనోభిరామ, సర్వపురీ మాహాత్మ్య

శివలీలావిలాసములందు "శ్రీమత్కుక్కుటేశ్వర" అని ప్రారంభించి "గంగనామాత్య పుత్ర" నుండి "సకల సంస్కృతాంధ్ర లక్షణ కౌశలాభిరామ తిమ్మకవి సార్వభౌమ ప్రణీతంబైన" యని చెప్పెను. అనగా నాటికి తిమ్మన లక్షణసార సంగ్రహము వ్రాయుటయు, మాధవరాయణింగారిచేత కవిసార్వభౌమ బిరుదమందుటయు జరిగి యుండును. కనుకనే తిమ్మన యారెండు బిరుదముల నీకావ్యములలో పేర్కొనెను. తిమ్మకవికి "అభినవవాగనుశాసనుడ" ను బిరుదము లక్షణసారసంగ్రహ రచనానంతరమే వచ్చియుండును. కనుకనే తిమ్మకవి యనుజుడు జగ్గకవి తన చంద్రరేఖా విలాపకావ్య గద్యమున తాను తిమ్మన సోదరుడనని చెప్పునపుడు "ఇది శ్రీమజ్జగన్నాథదేవ కరుణా కటాక్షవీక్షణాను సంలబ్ధ సరసకవితా విచిత్ర ... ...

కూచిమంచి కులపవిత్ర గంగనామాత్య పుత్రమానితా
నూన సమాన నానావిధ రంగ త్రిలింగదేశ భాషా
విశేష కవితావిలాస భాసురాఖర్వ సర్వలక్షణసార
సంగ్రహోద్దామ, శుద్ధాంధ్రరామాయణ ప్రముఖ బహుళ
ప్రబంధ నిబంధన బంధుర విధాన నవీన శబ్దశాసన
బిరుదాభిరామ తిమ్మకవి సార్వభౌమ ... ...

యని తిమ్మకవిని స్మరించి యాతని 'నవీన శబ్దశాసన', 'కవి సార్వభౌమ' బిరుదములనుజెప్పెను. ఇంతకును తిమ్మన తనకు బిరుదము లభించిన పిమ్మట వ్రాసిన కావ్యములలో గద్యములో భేదము ఉండుట యేగాక మొదటి కావ్యములలో "శ్రీమత్కుక్కుటేశ్వర" అనియు, తరువాత మూడు కావ్యములలో "శ్రీమదుమాహారమణ" యనుటలో నాతని భావము తెలియుటలేదు.

**తిమ్మకవి కాలము:** తిమ్మకవి రచించిన కావ్యములను బట్టి కాల నిర్ణయము చేయుట సుకరము. ఆంధ్రకవుల చరిత్రయందు బ్రహ్మశ్రీ వీరేశలింగం పంతులుగారు 'రుక్మిణీ పరిణయము' ను

రచించునాటికి కవి యిరువదియైదేండ్లవాడనియు, నాతడు క్రీ॥శ॥ 1690 ప్రాంతమున బుట్టియుండుననియు చెప్పిరి. తిమ్మకవి "సహస్రమాసజీవి" యను మాటకు, నీ కాలనిర్ణయమునకు సరిపోవు చున్నది ఇరువదియైదేండ్ల ప్రాయమున తిమ్మకవి ప్రౌఢుడై రుక్మిణీ పరిణయమును వ్రాసియుండును. 1756 లో శివలీలా విలాస రచనా నంతరము సన్యసించి, మరి యే కావ్యమును రచింపక (కుక్కుటేశ్వర శతకమును మాత్రము వ్రాసెను). సహస్రమాసములు అనగా సుమారు 83 సం॥లు. క్రీ॥ శ॥ 1773 వరకు జీవించియుండును.

**తిమ్మకవి గ్రంథముల పౌర్వాపర్యము:** తిమ్మకవి తన కావ్యము లలో కొన్నిటి రచనాకాలముల నిచ్చెను. కొన్ని కావ్యములలో తానంతకుముందు సృజించిన కావ్యనామములను తెలిపెను. ఆయా ఆధారములను బట్టి యాతని గ్రంథముల పౌర్వాపర్యము నిర్ణయింప వీలగును.

బ్రహ్మశ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారు తమ ఆంధ్ర కవుల చరిత్రలో తిమ్మకవిని గూర్చి వ్రాయుచు సింహాచల మాహాత్మ్యములోని

గీ॥ "ప్రతిభ మీఱంగ రుక్మిణీ పరిణయంబుఁ
గలుషహరమగు రాజశేఖర విలాస
మును మఱియుఁజాల దండకములు శత
కములను రచియించి శంభునకునిడితి" (1ఆ 42 ప)

అను పద్యమును పేర్కొని "అచ్చతెనుగు రామాయణములో ముందు రాజశేఖర విలాసమే చెప్పబడినను రుక్మిణీ పరిణయమే తొలి కావ్యమనిరి. వారు లక్షణసార సంగ్రహము, రసికజన మనోభిరామము మొదలైన గ్రంథములన్నిటిలోను కూడ కవి మొట్టమొదట రుక్మిణీ పరిణయమునే పేర్కొనియున్నాడు". అనిచెప్పి, ఎక్కువ కావ్యము లలో తొలుత రుక్మిణీ పరిణయము చెప్పబడి యుండుటవలన నదియే

తొలి కావ్యమనియు, రాజశేఖర విలాసము ద్వితీయమనియు తెల్పిరి. అందులకు పెక్కు నిదర్శనములు కలవనిరి. కాని వారు వానిని చూపలేదు. మరియు రుక్మిణీ పరిణయము న కవికృతమగు నితర కావ్యము లెవ్వియు చెప్పబడనందున నదియే తిమ్మకవి తొలి కావ్యమని శ్రీ పంతులుగారభిప్రాయపడిరి. కాని 'రాజశేఖర విలాసము' నందును కవి తాను రచించిన యితర కృతులను పేర్కొనలేదు. కనుక దీనివలన నీ రెండు కావ్యముల పౌర్వాపర్యము తేలదు

ఇక అచ్చతెనుగు రామాయణమున శ్రీ పంతులుగారనినట్లు తొలుత భల్లాణ చరిత్రయే పేర్కొనబడెను.

గీ॥ మునుపు మాకీవె భల్లాణుఁడనెడి ఱేని
కతయు రుక్మిణి పెండిలి కతయు బొబ్బ
మెకపు గుబ్బలి కతయు మేల్మిఁ బసీల
పెండ్లి కతియును గబ్బముల్ జేర్చి గూర్చి (అ. రా. పీఠిక. 16ప)

వారన్నట్లు సర్వలక్షణసారము, రసికజన మనోభిరామము లందేకాక, సర్పపుర మాహాత్మ్యము, శివలీలా విలాసములందు కూడ రుక్మిణీ పరిణయ కావ్యమే ముందు పేర్కొనబడెను. ఆ కావ్యముల యందలి నాలుగు సీస పద్యములు :

సీ॥ కౌండిన్యస గోత్ర విఖ్యాతుఁడ కూచిమంచ్యన్వయాంభోధి నీహారకరుఁడ,
గంగ మంత్రి శేఖరునకుఁ బరమపావని యగు లచ్చమాంబకును సుతుఁడ,
వెరవొప్ప రుక్మిణీ పరిణయంబును, సింహశైల మాహాత్మ్యంబు, నీల పెండ్లి
కథయును, రాజశేఖర విలాసము నచ్చతెనుఁగు రామాయణంబును మొదలగు

గీ॥ కృతులు రచియించి పార్వతీపతికి భక్తి
తోడ నొప్పన మొనఁగిన వాఁడఁ గంద
రాడపుర సంస్థితుఁడఁ గడుఁ బ్రోడ నేను
దిమ్మకవిచంద్రుడను జగద్వినుతయశుడ. (సర్వ. ల. సా. 1అ-7ప)

సీ॥ ప్రతిభమై రుక్మిణీ పరిణయంబును, సింహశైల మాహాత్మ్యంబు, నీల పెండ్లి
కథయును రాజశేఖర విలాసంబును, నచ్చ తెనుంగు రామాయణంబు
సారంగధరనృప చరితంబు, సాగరసంగ మాహాత్మ్యంబు రంగుమీఱు
సకల లక్షణ సార సంగ్రహంబు గూర్చి, కృతులు మాపేర నంకింతిమొనర్చిన ట్టి
ప్రోడవు.
... ... ... ... ... ... ... ... ... ... (రసిక. జ. మ. 1ఆ 21ప)

సీ॥ ప్రౌఢిమై రుక్మిణీ పరిణయంబును, సింహశైల మాహాత్మ్యంబు, నీల పెండ్లి
కథయును రాజశేఖర విలాసంబును, నచ్చ తెనుఁగు రామాయణంబు
సారంగధర నరేశ్వర చరిత్రంబు, సప్తార్ణవసంగ మహాత్మ్యకంబు
రసికజన మనోభిరామంబు, లక్షణసార సంగ్రహము నింపార గూర్చి
... ... ... ... ... ... ... ... ... ... (సర్ప. మ 1ఆ 15ప)

సీ॥ ప్రౌఢిమై రుక్మిణీ పరిణయంబును, సింహశైల మాహాత్మ్యంబు, నీల పెండ్లి
కథయును రాజశేఖర విలాసంబును, నచ్చ తెనుంగు రామాయణంబు,
సారంగధర నరేశ్వర చరిత్రంబు, సప్తార్ణవసంగ మాహాత్మ్యకంబు,
రసికజన మనోభిరామంబు, లక్షణసార సంగ్రహమును, సర్పపుర స

సీ॥ మంచిత క్షేత్ర గధనమును మరియుఁ జెక్కు
శతక దండక సత్కృతుల్ ప్రతిభ గూర్చి
యుల్లమలరారఁ బార్వతీవల్లభునకు
భక్తి నర్పణఁజేసిన భవ్యమతిని. (శివ. వి. 1ఆ 5ప)

పై నాలుగు సీసములు నాలుగు కావ్యములందు నించుమించుగ స్వల్ప భేదముతో అవృత్తినైనవి. కనుక సీనాలుగు నొక్కటియే. పైగానిందు శ్రీ పంతులుగారు చెప్పినట్లు రుక్మిణీపరిణయమే తొలుత పేర్కొనబడిన ను, రాజశేఖరవిలాసము మాత్రము ద్వితీయముకాదు; చతుర్థస్థానమున కలదు. కనుక వారి వాదము నిరాధారము. మరియు నీ రాజశేఖరవిలాస ము, మూడవకావ్యముగు సింహాచలమాహాత్మ్యము నందే తొలుత పేర్కొనబడుటచేత నిది నాల్గవ కావ్యమనుటయు పొసగదు. కనుక నిది మొదటిదో రెండవదియో కావలయును. ఇందు మూలకముగా గీతపద్య ములలోని క్రమము సరియైనది కాదని చెప్పవచ్చును. 'సర్వలక్షణసార సంగ్రహము' యొక్క స్థానమును 'సర్పపురీమాహాత్మ్య', 'శివలీలావిలా

నము' లందు సక్రమముగా లేదు. ఈ క్రమము ఛందము ననుసరించి నడచినది. కాని, కావ్య రచనా కాలక్రమమును బట్టి కాదు. కనుక నీవరుస ననుసరించి గ్రంథముల పౌర్వాపర్యము నిర్ణయింప వీలుకాదు.

రుక్మిణీ పరిణయ, రాజశేఖర విలాస కావ్యములను విడచిన (ఈ రెండింటిలో నేకావ్యము పేర్కొనబడలేదు), ఈరెండును పేర్కొన బడియుండుటవలన సింహాచలమాహాత్మ్యము మూడవ కావ్యముగను, అచ్చ తెనుగు రామాయణమున పై మూడు కావ్యములతో బాటు నీలాసుందరీ పరిణయము పేర్కొనబడుటవలన నదినాలవ కావ్యముగను, అచ్చ తెనుగు రామాయణ మైదవదిగను, సర్వలక్షణసారసంగ్రహమున నీరైదును పేర్కొనబడుట చేత నిది యాఱవదియు, 1750లో రచింప బడిన రసికజన మనోభిరామమున నీయాఱును, తదుపరి సారంగధర చరిత్ర, సప్తార్ణవసంగ మాహాత్మ్యము లుండుటచేత నవి ఏడు, ఎనిమిది సంఖ్యలుగను, తొమ్మిదవది రసికజన మనోభిరామమును, అటుపిమ్మట సర్పపురీ క్షేత్రమున ని తొమ్మిది నామములుండుటచేత నది పదియవది గను, ఇక తుదను రచింపబడిన శివలీలా విలాస కావ్యమున నీ పది యునుండుటచేత నిది పదునొకండవదిగను నిర్ధారింపవచ్చును. సింహా చల మాహాత్మ్యమున, రుక్మిణీపరిణయ, రాజశేఖర చరిత్రములతో బాటు శతక దండకాదులును పేర్కొనబడుటచేత నదియా రెండు కావ్య ములకు నడుమనో తొలుతనో రచింపబడి యుండును.

ఇక పంతులుగారి వాదము నిరాధారమైనందున నీ రుక్మిణీపరిణ య, రాజశేఖరవిలాస కావ్యముల ముందు వెనుకలు విచారించి చూడ వలయును. ఈ క్రింది యాధారములబట్టి రాజశేఖరవిలాసమే తిమ్మన తొలి కావ్యమని నిరూపించుట కవకాశము కలదు. అవి—

1. తిమ్మకవి రాజశేఖర విలాసమునందు తప్ప మరియే యితర కావ్యమునందు నూ బలుమారు తన తప్పులు క్షమింపుడని వేడుకొనలేదు.

గీ॥ ... ... ... ... ... ... ... మత్ప్రబంధ
మరసి దుర్దోష రహితమానట్లుగాను
జిర కృపాస్ఫూర్తి బరిపూర్తిఁజేయుఁగాత. ( పీఠిక 6ప )

క॥ ఛందమునుం గావ్యాదుల
చందము నింతైన నెఱుఁగ సతతము విద్వ
త్బృందంబుల కృపఁగవితా
సందర్భంబొగి నొనర్తు సాహసవృత్తిన్ ( పీఠిక 3ప )

చ॥ "గసుగొని తప్పులెన్నక తగం గరుణింపుడు సత్కవీశ్వరుల్" ( పీఠిక-14ప )

అని రాజశేఖర విలాస పీఠికయందును,

" ... ... ... ... తప్పులు క్షమచేసి దయ దలిర్ప
నిమ్మహా కావ్యమెప్పుడు నిద్ధరిత్రి
నేర్పుతో విస్తరిల్ల బుధేంద్రులెల్లఁ
బొగడి ... ... ... ... ... ..." ( 3ఆ-203 ప )

అని కావ్యాంతమునను వేడెను. రాజశేఖర విలాసము "మహా కావ్యము" అయినను, తొలుత రచించిన దగుటచేత తప్పులు దొరలు నేమోయని భయపడుచు వినయముగా పండితుల క్షమనర్థించినాడు తిమ్మకవి. ఈ స్థితి మిగుల పరిపక్వ దశయందు సహితము కలుగునని యనుటకవకాశమున్నది. కాని చిట్టచివరి దశయందు వ్రాసిన శివలీలా విలాసమున ఈ వేడికోళ్లు కానరావు

2 తిమ్మకవి తన గురువు దెందులూరి లింగనయని చెప్పెను. లింగన చివరిదశయందే తిమ్మన అతనినుండి మాహేశ్వర దీక్ష గ్రహించి, శివమహిమ తెలుపు రాజశేఖర విలాసమును రచించుటతో కావ్యరచన ప్రారంభించియుండును.

3 తిమ్మన చివరి కావ్యము శివలీలావిలాసము. తొలి కావ్యము శివతారమ్య బోధకము. ఈ నడుమ శతకములు తప్ప ఇంచుమించు అన్నియు వైష్ణవ గాథలే.

4 రుక్మిణీ పరిణయము ప్రౌఢ కావ్యము. తిమ్మన దీనిని తన ఇరువదిమైదవపట రచించెను. కనుకనే పలుతావుల సీతండీకావ్యమును గూర్చి "ప్రతిభ మీఱంగ" "ప్రౌఢిమై" అని తాను ఆ కావ్యము ప్రౌఢత్వముతో వెలయించినట్లు చెప్పియుండెను. ఇట్లు ప్రౌఢిమతో రచించిన కావ్యము గనుకనే కవి రుక్మిణీ పరిణయము ముందు పేర్కొనెను. ఆతీరున ముందు చెప్పుటకు కారణము తిమ్మనకు ఆ కావ్యముపై గల అభిమానాతిశయమే.

5 రుక్మిణీ పరిణయముతో పోల్చిచూడగా రాజశేఖర విలాసము అపక్వముగానున్నట్లు కన్పట్టుచున్నది (తిమ్మకవి యితర కావ్యములలో లేని రేఫ, శకటరేఫల ప్రాస రాజశేఖర విలాసమున కలదు.)

పై కారణములవలన రాజశేఖర విలాసమే తిమ్మన తొలి కావ్యమనియు, రుక్మిణీ పరిణయము రెండవ కావ్యమనియు చెప్పవచ్చును. ఈ రెండు కావ్యముల రచనకుమధ్య పదివత్సరముల అంతరమున్నది. మధ్య కాలమున తిమ్మన శతకములు, దండకములు వ్రాసియుండును. అంతే కాని పంతులుగారు చెప్పినట్లు తిమ్మకవి ఏడాదికొక ఆశ్వాసము చొప్పున కావ్యరచన చేసియుండడు. ఈవాదము యుక్తియుక్తముగా లేదు

తిమ్మకవి "శివలీలా విలాసము" ను ముప్పదియొక్క దినములలో రచియించితినని చెప్పెను.

క॥ వినుడీ కృతి ముప్పదియొక
దినమునకుం జెప్పినాఁడ దేవుని యానన్
జనులెన్నఁ గుక్కుటేశ్వరు
ఘన కరుణాదృష్టి వలనఁ గవివరులారా!

రెండాశ్వాసముల గ్రంథము ముప్పదియొక్క దినమునకు వ్రాయగలిగిన కవి ఏడాదికొక్క యాశ్వాసము వ్రాసెననుట సరికాదు. మఱియు

క్రీ॥శ॥ 1719 లో విరచితమైన సింహాచల మాహాత్మ్యమునకు, క్రీ॥శ॥ 1740 లో వ్రాయబడిన సర్వలక్షణ సార సంగ్రహామునకు నడుమ నీలాసుందరీ పరిణయము, భర్గశతకము, అచ్చ తెనుఁగు రామాయణము లను మాత్రమే తిమ్మన వ్రాసినట్లు కనిపించుచున్నది. ఇరువదియొక్క సంవత్సరముల వ్యవధిలో నీరైదు కృతులను మాత్రమే తిమ్మన సృజించెననుట శ్రీ వీరేశలింగంపంతులు గారి ప్రణాళికననుసరించి సంగతము కాదు. కనుక పంతులుగారు చెప్పినంత యాంత్రికముగా తిమ్మన కవిత్వము చెప్పి యుండడు. శివభక్తుడగుటచేత నీశ్వరప్రేరణము కలిగినపుడెల్ల తిమ్మన కావ్యరచన చేసియుండుననుట ఉచితము.

ఇంతకు తిమ్మన యొసగిన గ్రంథరచనాకాలము, ఇందు నిరూపింపబడిన ఇతర కావ్యముల కాలములనుబట్టి ఆతని కావ్యరచనాక్రమ మీ క్రింది విధముగానున్నది.

1 క్రీ॥ శ॥ 1705 – రాజశేఖరవిలాసము.
2 క్రీ॥ శ॥ 1715 – రుక్మిణీపరిణయము.
3 క్రీ॥ శ॥ 1719 – సింహాచలమాహాత్మ్యము.
4 నీలాసుందరీపరిణయము ( అచ్చ తెనుఁగు రామాయణమున పేర్కొనబడెను ).
5 అచ్చ తెనుఁగు రామాయణము ( సర్వలక్షణసార సంగ్రహమున పేర్కొనబడెను ).
6 క్రీ॥ శ॥ 1729 – భర్గశతకము.
7 క్రీ॥ శ॥ 1740 – సర్వలక్షణసార సంగ్రహము.
8 సారంగధర చరిత్ర.
9 సప్తార్ణవసంగ మాహాత్మ్యము.
10 క్రీ॥ శ॥ 1750 – రసికజన మనోభిరామము.
11 క్రీ॥ శ॥ 1754 – సర్పపురీ మాహాత్మ్యము.

12 క్రీ॥ శ॥ 1756 - శివలీలా విలాసము.

లభించిన శతకములలో ' చిరవిభవశతకము ' కావ్యముల మధ్య నెప్పుడో రచింపబడియుండును. కుక్కుటేశ్వర శతకములోని పద్యరచనా విధానమును బట్టి కవి దీనిని వృద్ధాప్యమున రచించెనని తోచుచున్నది. తిమ్మన మరి యెన్నియో శతక, దండకాదులను వ్రాసినట్లు చెప్పెను. కాని ఇందు పేర్కొనిన మూడు శతకములు తప్ప ఇతరములు లభింప లేదు. కావ్యములలో సప్తార్ణవసంగ మాహాత్మ్యము లభించ లేదు.

## రా జ శే ఖ ర వి లా స ము

మూడాశ్వాసముల ఈ చిన్ని కావ్యము శ్రీ పంచాగ్నుల దక్షిణామూర్తి శాస్త్రిగారిచేత పరిష్కరింపబడి క్రీ॥ శ॥ 1912లో వావిళ్ళ వారి ముద్రణాలయమున ముద్రితమై ప్రకటింపబడెను. ఇందు 541 పద్యములు గలవు.

కథ : సింధుకటకపురము నేలు భల్లాణుడు అను ప్రభువు శివపూజాతత్పరుడు, శరణాగతవత్సలుడు, సత్యవాక్ప్రియుడునై యుండెను. అతని సతులు చల్లాంబికా, మల్లాంబికలు మహా పతివ్రతలు. తన ఐశ్వర్యమునకు కారకుడైన శివుని ఒకవ్రతముచేత మెప్పించ సంకల్పించిన భల్లాణుడు ఒకనాడు గురుదర్శనముచేసి వ్రతదీక్షనిమ్మని కోరెను. శివభక్తులగు జంగమస్వాములకు కామితార్థములిచ్చి, పరమేశ్వరానుగ్రహము పొందుట ఆ వ్రతముయొక్క ఉద్దేశ్యము. ఆ వ్రతము మిగుల కష్టమైనదనియు, జంగమస్వాములడిగినచో సుతనైన, సతినైన, సుతులనైన, కాయము కోసియైన నీయవలసియుండుననియు గురువు భల్లాణునకు తెలిపెను. భల్లాణుడు ఆ వ్రతమెంత కఠినమైనను చేయుదునని చెప్పి ఆశీర్వదింప గురుని వేడెను. ఆతడా రాజునాశీర్వదించి విభూతినొసగి పంపెను.

భల్లాణుడు రాజధానిచేరి శివపూజయొనరించి శంకరునికి ప్రీతి కలుగునట్లు జంగమస్వామ లేయేపదార్థము లడిగినను లేదనక యిచ్చె దనని శపథముచేసి దేశదేశముల చాటింపించెను. భల్లాణుని ప్రకటన విని జంగమస్వాములు కోటానుకోట్లుగావచ్చి కామితార్థముల బడయు చుండిరి. రాజు ధర్మమార్గమున సత్యవర్తనముతో జంగమారాధన చేయుచుండెను. భల్లాణుని వ్రతదీక్షను నారదుని వలన వినిన పార్వతీ దేవి వెఱగంది, ఆ భక్తుని పరీక్షింపవలెనని శివుని కోరెను. పరమ శివుడును భక్తుని పరీక్షించు వేడుకతో సింధుకటకము నందలి వేశ్యా వాటికకుచేరి, వారందరకు కోరిన ధనమునిచ్చి విటులనేర్పరచెను. తదు పరి జంగమవేషధారియైన శివుడు భల్లాణుని చెంతకరిగి యథావిధి పూజితుండై, వేశ్య లేనిదే భుజింప జాలనని పట్టుపట్టెను. భల్లాణుడు చేయునదిలేక వెలయాలిని దెప్పించుటకై యత్నింపగా ఆ దినమున మహేశుని మాయచేత ఒక్కతెయు లభించలేదు. వ్రతభంగమగు నను భయమున భల్లాణుడు భార్య చల్లాంబికను తరుణోపాయమడిగెను. ఆమె చిరుతొండనంబి మొదలైన భక్తులను మహేశ్వరుడు పరీక్షించిన విధము జ్ఞప్తికితెచ్చి పతి ఆనతి శిరోధార్యమని పలికెను. భల్లాణుడు ఆవేదనపడి తుదకు చల్లాంబికనే వెలయాలిగా జంగమవిటుని కడకు ఏగుమనికోరెను. చల్లాంబిక పతియాజ్ఞ శిరసావహించి జంగమవిటుని సమీపించెను. చల్లాంబిక అతనితో మాటలాడ ప్రయత్నించినను అతడు స్థాణువువలె నుండెను. చల్లాంబ ఆశ్చర్యపడియు పాన్పునందలి జంగమ విటుని ఆలింగనము చేసికొనబోగా విటుడామె చేతులలో నెల దినముల బాలుడయ్యెను. ఆ బాలుని పరమేశ్వరునిగా రాజశేఖరుడైన భల్లాణుడు గ్రహించెను. అంతట మహేశుడు భల్లాణునకు సాక్షాత్కరించి, పార్వతీదేవి అంగీకారముతో చల్లాంబికా, మల్లాంబికా సమేతముగా భల్లాణుని కైలాసమునకు కొనిపోయి ప్రమథగణములలో ప్రథమునిగా నిలిపెను.

దండి "కావ్యాదర్శము" లో తెల్పిన అష్టాదశ వర్ణనలలో సింధుకటకపుర, సాగర, కైలాస పర్వత, చంద్రోదయ, సూర్యోదయ, షడృతు, ద్యూత వర్ణనలు ఏడు మాత్రము ఈ కావ్యమున కలవు. ఇక అలంకారశేఖరమున పేర్కొనబడిన ముప్పదిరెండు వర్ణనలలో ఏడు వర్ణనలిందు గలవు. గజవర్ణన, అశ్వవర్ణన, రాజవర్ణన, రాజ్ఞీవర్ణన, అరణ్యవర్ణన, కళా చిత్రలేఖన వర్ణన, కాసారవర్ణన. మన్మథ, జంగమ, కుహనాజంగమ, జాలరికాంతా వర్ణనలు, శివపూజావిధాన వర్ణన, సభా, వారవనితా, వేశ్యమాతా, రాజనింద, రాణి పతి భక్తి వర్ణనలు మొదలైనవి కూడ కలవు.

## వర్ణనలు – అలంకారములు

రాజశేఖర విలాసము తిమ్మకవి తొలి కావ్యమయ్యు నిందలి వర్ణనలు కమనీయముగా నున్నవి.

చ॥ మరకత రత్న సంఘటితమానిత కుడ్య కదంబజాలా కాం
తరములనుండి వేవెడలు తద్ఘనసారపు ధూప ధూమముల్
పరువడిఁ జూచి నీలఘన పంక్తులటంచు వటించు నెంతయున్
గురుతుగ మేదినీస్థలిని గోర్కులచే శిఖినీసమూహముల్. (1ఆ-45ప)

సింధుకటకపుర మందిరములలో పరిమళార్ధము ధూపము వేయగా, అందుండి వెడలు దట్టమైన ధూమమును మేఘసముదాయమని భ్రాంతిపడిన మయూరములు నృత్యముచేయునను నీ వర్ణన మనోజ్ఞమై అలరారుచున్నది.

చ॥ అరయఁగ నప్పురిం గనకహర్మ్యతలంబులఁ గేళిసల్పు సుం
దరుల యొయ్యారముల్ గని ముదంబున నచ్చరలెల్ల మెచ్చి భా
సురగతిఁ గాన్కలంపిన ప్రసూనపు దండలనంగ నెల్లెడల
దలుచుగ రత్నతోరణ కదంబములందముమీఱు నెప్పుడున్ (1ఆ-42ప)

హర్మ్యతలముల కేళియొనర్చు కాంతల యొయారమును మెచ్చి అచ్చరలేములు కానుకగా పంపిన ప్రసూనపు దండలుగా రత్నతోరణ మాలికలను కవి ఉత్ప్రేక్షించుట కమనీయము. మఱియొక చక్కని ఉత్ప్రేక్ష సాగరవర్ణన,

చ॥ సకల జగంబులన్మనుచు స్వామికి నీకు విసంబొసంగెనే
ప్రకటిత లీలననుచు నల పాల్కడలిన్నిరశించి లేం బురాం
తకునకుఁ గాన్కలియ్యగ ముదంబునఁ బట్టు సుధాసముత్కరం
బొకొయన నొప్పు ఫేనతతి బాగుగ నజ్జలరాశి నెంతయున్ (2ఆ.-84ప)

పాలసముద్రము పరమేశునకు విషమిచ్చెనని ఈసడించుచు లవణ సముద్రము తాను అమృతమును కానుకగా నొసగుచున్నదా యనునట్లు సముద్రముపైనున్న నురుగు ఒప్పుచున్నదనుట కవి ఊహా శక్తికి నిదర్శనము

పాత్రలను కనులకు గట్టించుటలో తిమ్మన సిద్ధహస్తుడు. భల్లాణుని వ్రతదీక్షను విని వచ్చుచుండిన జంగమస్వాముల వేషధారణము మూడు పద్యములలో తిమ్మన వర్ణించెను.

సీ॥ కక్షపాలు పైఁడికట్ల బెత్తంబులు శంఖసంఖ్యల మించు శంఖములును
పిడిగంటలును గేకిపింఛపుఁగుంచెలు ఛత్రముల్ బలితోళ్ళ చామరములు
యోగదండంబులు యోగపట్టెడలును గండపెండేరములు కుండలములు
తనువుల భూతి పూఁతలు కావి వస్త్రము ల్మేలైన రుద్రాక్షమాలికలును

గీ॥ శ్వేతకేతనములు రుద్రవీణియలును
పాత్రమగునట్టి రజితంపుఁ బాత్రికలును
గేలుఁదామరఁ బలుపైన శూలములును
మొలక బంగరు గిలుకు పావలును గలిగి (1 ఆ 167 ప)

ఈ పద్యమును బట్టి తిమ్మకవి కాలములో జంగమస్వాములు యోగపట్టెడలు, గండపెండేరములు, కుండలములు మొదలైన ఆభరణ విశేషములను ధరింతురని తెలియుచున్నది. ఇవిగాక వారు

రజితపాత్రలు, బంగారు గిలుకు పావలును గలిగియుండిరట. సన్యాసులు రజిత బంగారములను గలిగియుండిరనుట అనౌచిత్యమనిపించును. నిరంతరము పంచాక్షరీ మంత్రము జపించు జంగమ దేవరలు రాజాధిరాజునైనను లెక్కసేయక "ఏరా భూవర!" అనుటయుగలదు. ఆనాడు వీరశైవమత ప్రభావమంతటిది.

జంగమస్వామి కోరిక ననుసరించి భల్లాణుడు వేశ్య నిమిత్తము వెదకి కానరాక, తనమాట తప్పకుండుటకై తన సతినే వేశ్యగా అర్పించుటకై తీసికొని వచ్చెను. అప్పుడా కహానా జంగము ఆలస్యమైనందులకు భల్లాణునిపై కోపించుచు పలికిన సందర్భమున ఒక చక్కనైన శ్లేషాలంకారము.

సీ॥ కామాంధకారినై కడకతో నీరాకఁ గాంచుచుండఁగ మూఁడు కన్నులయ్యెఁ
దలయేఱు బరువయ్యెఁ దగమేను సగమయ్యె గళమూలమునఁ గందు నిలుకడయ్యె
నవల నొప్పము పట్టి వగఁదప్పె వలపున విరిగెను నడురేయి సరవినయ్యె
నాకేటికీవేశ్య నీకేల నిజభక్తి బూటకంబులచేతఁ బ్రొద్దుగడిపి

గీ॥ నాడ వింటియ కాక భూనాథఁ లెచట
వ్రతములెచ్చట ఘనశైవ మతములెచట
నెందుఁగోరగాని పొలతుక నిటులఁదెచ్చి
యందు కొమ్మను వారెందునైన గలరె (౪ఆ 155 ప)

మూడు కన్నులుగల కామాంధకారి అనియు, గంగాధరుడనియు, సాంబుడనియు, గరళకంఠుడనియు కవి పార్థానికి శబ్దశక్తి మూలమున స్ఫురింపజేయుచు ప్రతిభచూపెను.

**అంగిరసము :** ఈ కావ్యమందలి నాయకుడు వీరశైవుడు. భల్లాణుడు ఉదాత్తనాయకుడు కనుక అడిగినవారికి లేదనక ఇచ్చుటకై ప్రతిన పట్టెను. ధీరోదాత్త నాయకుడు పట్టిన పట్టు విడువడు. ప్రతిజ్ఞ చేయుటలో నాయకునియందు వీరరససంబంధమగు ఆవేశము కలదు

అడిగిన వారికెల్ల నిచ్చుట వలన ఇచట దానవీరము రసముగా నున్నది. ఈ దానమునకు మూలకారణము శివభక్తి. కనుక నిచట భక్తివీరము కలదు. కథావస్తువునకు గల కార్యకారణ సంబంధమును బట్టి దీనిని భక్తివీరమనుటయే సహేతుకము. భల్లాణుడు తన ప్రతిజ్ఞా నిర్వహణార్థము పత్నియగు చల్లమాంబను వెలయాలిగా జంగమస్వామి కర్పించుటచేత నిది ధర్మవీరమని చెప్పనొప్పును. వీరరసమునకు అద్భుత రసము పర్యవసాయి. నాయకుడు ధర్మవీరుడై నాయికను శివయోగి కర్పించినంతట, అతడు ఆమె ఒడిలో బాలుడుగా మారుటతో అద్భుత రసము వెల్లివిరిసెను. తదుపరి శివుడు ప్రత్యక్షమగుట యను మరియొక అద్భుతకార్యముతో ఆ కథ ముగిసెను. ఇట్లీకావ్యమున దాన, భక్తి, ధర్మవీరములు ప్రధానముగాను, అద్భుతము అంగముగాను వర్ణిత మయ్యెను.

ఈ కావ్యమున రాజశేఖరుడు హరుడు. భక్తులను పరీక్షించుట హరుని విలాసము. భల్లాణరాజు భక్తిని హరుడు పరీక్షించుటచే నిది "రాజశేఖరవిలాసము" అయ్యెను.

## రుక్మిణీ పరిణయము

తిమ్మకవి కావ్యములలో రుక్మిణీ పరిణయము రెండవది. 1923 లో వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్ వారిచేత చెన్నపురి వావిళ్ల ముద్రణాలయమున ముద్రితమై ప్రకటింపబడిన 713 పద్యములు గల ఐదాశ్వాసముల కావ్యమిది.

కథ : కుండినపుర రాజు భీష్మకునికి పట్టపురాణి యందు రుక్మి, రుక్మరథుడు, రుక్మబాహుడు, రుక్మకేశుడు, రుక్మనేత్రుడు, అను ఐదుగురు పుత్రులు, రుక్మిణి అను పుత్రికయు జన్మించిరి. యౌవనవతి యైన రుక్మిణి నిత్యము జనకుని చెంతకువచ్చు బుధజనుల వలన దేవకీ నందనుని రూపయౌవనముల గూర్చియు, పరాక్రమమును గూర్చియు

వినుచు, ఆతని యందే మనస్సు లగ్నము చేసికొనెను. భీష్మకుడొక
గ్గడు నిండు కొలువున తన సుతకు అనురూప వరుడెవ్వరో తెల్పుడని
తుల నడుగ వారును శ్రీకృష్ణుని గుణాదులభివర్ణించి, ఆతడే రుక్మిణికి
గిన వరుడని పల్కిరి. కాని రుక్మి వారిని నిందించి, తన చెలియని
శుపాలున కొసగెదనని భీష్మించెను. భీష్మకుడు తనయునికి ఎదురు
చెప్పలేక రుక్మిణి నిచ్చి పరిణయ మొనరింతునని శిశుపాలునకు వార్త
ంపెను. చేదిరాజు శిశుపాలు డానందభరితుడై సపరివారముగా
ండినగరమునకరుదెంచెను. తన కిష్టము లేని వివాహము ను
గూర్చి చింతించి, చెలికత్తె ఆలోచనపై రుక్మిణి పురోహితపుత్రుని
ముఖమున శ్రీకృష్ణునకు తన హృదయమును తెల్పెను. పురోహిత
పుత్రుడు ద్వారక కేగి రుక్మిణి సౌందర్యమును శ్రీకృష్ణునికి తెలిపి,
ఆమె అనురాగము నెఱింగించి శిశుపాలాదుల జయించి రుక్మిణిని
స్వీకరింపమని పలికెను. శ్రీకృష్ణుడును రుక్మిణిని గూర్చి వినియుం
డుట వలన విప్రుని పలుకులకామోదించి బలరామ సహితుడై
విప్రుని వెంట కుండినపురికి ప్రయాణమయ్యెను. ఇది యిట్లుండ రుక్మిణి
కృష్ణుడు తనమాట మన్నించునో లేదో యనుచు విరహార్తయై
యుండెను.

వివాహమునకు శిశుపాలునితో పాటు పౌండ్రక, జరాసంధ
సాల్వ, విదూరథులు వచ్చిరి. రుక్మిణీదేవి గౌరీపూజకై విప్రస్త్రీజన
పరివేష్టితయై భటులు వెన్నంటిరాగా గౌరీదేవి ఆలయమునకు వెడలి
శ్రీకృష్ణుని పతిగా ననుగ్రహింపుమని గౌరిని ప్రార్థించెను. ఆలయము
నుండి వెలుపలికి వచ్చిన ఆమె సౌందర్యమును జూచి నృపులందరు
నచ్చెరువందుచుండ, శ్రీకృష్ణుడచట కేతెంచి ఆమెను పరిగ్రహించి
రథముపై నిడుకొని శంఖము పూరించి, వేగముగా ద్వారకా నగరా
భిముఖుడయ్యెను. నృపులందరు సహింపలేక కృష్ణునితో తలపడిరి
శ్రీ కృష్ణుడును బలరామాది సమేతుడై వారి నెదుర్కొని ఘో

రణమున జయించి, రుక్మి ని విరూపి నొనరించి ద్వారక కేతెంచి, రుక్మిణీదేవిని పరిణయమాడి సుఖముగా నుండెను.

పోతన్న భాగవతమునగల రుక్మిణీ పరిణయ ఘట్టము నోటికి రానివారు సిన్న మొన్నటి వరకును అరుదు. తిమ్మన కథారంభమున చెప్పిన పద్యమును బట్టి, భాగవతము నుండియే ఇతివృత్తము స్వీకరించె నని భావించవచ్చును. భాగవతము దశమస్కంధమునగల 105 పద్యముల రుక్మిణీపరిణయ గాథను గ్రహించి (భా. 1679-1764ప.) తిమ్మన 713 పద్యముల ఐదాశ్వాసముల ప్రబంధముగా తీర్చిదిద్దెను. ప్రబంధోచితమైన వర్ణనలతో మనోజ్ఞమగు కావ్యముగా "రుక్మిణీపరిణయము" మలచబడెను. అచ్చటచ్చట కథాభాగము పెంపు చేయబడెను. ( 1 ) పోతన రుక్మిణి జననము ఒక పద్యమున, బాల్యమును ఒక పద్యమున వర్ణించగా, తిమ్మన రుక్మిణి జన్మించుట ఆదిగా లాలిపాటలు, ఆటలు వివరముగా నాటి సామాజిక వ్యవస్థను పదియారు పద్యములలో ( 1ఆ 71-87ప ) వర్ణించెను. (2) రుక్మిణీ యౌవనావిర్భావము భాగవతమున ఒక్క పద్యమున (భా. 1689ప) వర్ణింపబడగా, తిమ్మకవి ఐదు పద్యములలో వర్ణించెను. (3) బంధువులెల్లరు రుక్మిణిని శ్రీకృష్ణునకిచ్చెదమనగా, రుక్మి శిశుపాలునకే ఇచ్చెదననుట భాగవతమున ఒక్క పద్యమున (భా. 1694ప) కలదు. ఈవివాదమును గూర్చి తిమ్మన ఇరువదిమూడు పద్యములలో ( 1ఆ. 115-138ప ) సంపూర్ణముగా నొక ఘట్టము చిత్రించెను.

**భేదములు :** భాగవతమునకు ఈ కావ్యమునకు కొన్ని భేదములు కలవు.

1 భాగవతమున రుక్మిణి అన్న తలపెరింగి, తనంతతాను బ్రాహ్మణుని పిలిచి శ్రీకృష్ణునికి తన పరిస్థితి చెప్పి తోడ్కొనిరమ్మని సందేశమంపినట్టు కలదు. తండ్రి భీష్మకుడు పుత్రుని కాదని యేపని చేయజాలడనికూడ విప్రునికి తెల్పుటవలన రుక్మిణి జనకుని పుత్రవాత్సల్యమును

సమర్థించుటవలన లోకజ్ఞానమునెఱిగిన ప్రౌఢవలె తోచును. తిమ్మన ఇచట చిన్న మార్పు చేసెను రుక్మిణి తన వివాహ ప్రయత్నములు జరుగుట చూచి " ఎవ్వరి వేడుకొందు ...... " ( 2ఆ 38ప ) అనుచు వాపోవునేగాని చెలికత్తె వచ్చి పురోహితపుత్రుని కృష్ణుని కడకు రాయబారిగా పంపుమని చెప్పువరకు తిరుణోపాయ మెరుగని బేల. సందేశము పంపిన తిరువాత రుక్మిణి

క|| వినయ విహీనుండగుచును
దన యానతి మీఱి తిరుగు తనయానుమతిం
బని యొనరింపఁగ దొరకొనె
జనకుండును వేఁగురగుచుఁ జంచల బుద్ధిన్. ( 1ఆ 32ప )

అని సోదరునితో బాటు జనకునికూడ ' చంచలబుద్ధి ' అని నిందించును.

2 భాగవతమునందలి రుక్మిణీదేవి ప్రణయమున భక్తిమిళితమై కన్పట్టును. రుక్మిణీపరిణయమున రుక్మిణియందు ప్రబంధనాయికకుండెడి అనురాగము మాత్రమే తోచును. తన కావ్యమునకు ప్రబంధత్వము కలిగించుటకై తిమ్మకవి చేసిన మార్పిది.

3 భాగవతమున లేని మరియొక విశేషమిందుగలదు. అది శ్రీకృష్ణుడు మీసములు దువ్వుట ! ఏ చిత్రపటములందుగాని, కథలందుగాని కృష్ణునికి మీసములున్నట్లు చిత్రించుటగాని, వర్ణించుటగాని లేదు. తిమ్మన మంత్రిము కిండినపురిక మరలివచ్చిన విప్రుడు

క|| నీ సుగుణ రూప యౌవన
భాసుర సుకుమారతిలకుఁ బలుమఱు మది ను
ల్లాసము నొంది ముకుందుఁడు
మీసంబులు దువ్వె రిపులమీదం దరుణీ ! ( 5ఆ 13ప )

అని రుక్మిణీతో చెప్పినట్లు వర్ణించెను. మీసములు దువ్వుట శౌర్యోచితమైన చేష్ట. కనుక తిమ్మన కృష్ణుని శౌర్యమును దెలుపుటకై ఈ ప్రయోగము చేసియుండును.

4 భాగవతమున కృష్ణుడు " వ. బావా ! రమ్మని చిరుఱునగవు

నగుచు, వానిం బట్టి బంధించి, గడ్డంబును, మీసంబునుం, దలయు (నొక కత్తివాతయమ్మున) రెవులు వాఱ గొఱిగి విరూపిం జేసె" (భా. 1767 వ) అని రుక్మిని విరూపిని చేసెనని మాత్రము కలదు. (రు. ప. 5ఆ 101ప)

5 భాగవతమున లేని శివస్తుతి యొకటి ఇందుగలదు. ద్వారకా నగరమునకు వెడలుచున్న విప్రసుతుడు మార్గమధ్యమున ఒక శివాలయము చూచి, అందుగల శివునిపై ఒక దండకముచెప్పి (4ఆ 33ప), ఎనిమిది పద్యములలో శివుని స్తుతించి నట్లు రుక్మిణీపరిణయమున కలదు. తిమ్మకవి శివభక్తుడగుట వలన సందర్భము కల్పించి శివస్తోత్రము చేసి యుండును.

తిమ్మన పద్యరచనా విధానమున పోతన్న ననుసరించిన తావులును గలవు. భాగవతము – దశమస్కంధమున "సీ॥ వేర్వేర బొమ్మల పెండ్లిండ్లు సేయుచు .. ... (భా. 1687 వ) అను సుప్రసిద్ధమగు పద్యమునకు ఛాయా సదృశ్యముగ వర్ణన తిమ్మన చేసెను.

సీ॥ బలు ముత్తియంపు మేడలఁ గ్రీడసేయుచు, నాపక పసిఁడి యుయ్యేలలూఁగుఁ
గమ్మపుప్పొడి మేనఁగ్రిమ్మ లీలావన తరువులఁ, బరువంపు విరులుఁగోయు
బొమ్మ పెండ్లిండ్లొనర్చును గుజ్జెనఁగూటి యామెతల్ రాకన్నియలకు నొసఁగు
సారంపుఁగెంపు పంజరములలోనిడి, సుకుమార కీర శారికలఁ బెనుచుఁ

తే॥గీ॥ దవిలి నిచ్చల గౌరీవ్రతములు నోఁచు
నలఘుమతి నింపులగు పాటలభ్యసించుఁ
జెలఁగి భూసురవరసువాసినులఁ గొలుచు
దాది గాదన్నపనియె పంతమునఁ జేయు.

పోతన్న గారి రుక్మిణి శారికాకీరపంక్తికి చదువు చెప్పును. బర్హిసంఘములకు మురిపెములు గరపును. మదమరాళములకు మందగతులు నేర్పును. ఈపనులు చేయుటలో ఆమె చిలుకపలుకులు, నాట్యవిలాసము, మందగమనములు సూచింపబడెను. తిమ్మన చాల పద్యములలో ఆమె ఆటపాటసోయగములను వర్ణించుటవలన కీర శారికల

పలుకులు, మరాళగమనాదులను విడిచి, తన కాలము నాటి సామాజిక వ్యవస్థలో గల కన్నె పడుచుల గౌరీవ్రతములు, సంగీతాభ్యాసము, విప్రసువాసినీ పూజ మొదలైన విశేషములు రుక్మిణీ పరముగా వర్ణించెను రుక్మిణి బాల్యమున గౌరీవ్రతములు చేయుట, సువాసినీ పూజల వర్ణించుట ముమ్ముందు వివాహసమయమున రుక్మిణి గౌరీపూజ, భూసుర సువాసినులను కొలుచుటలకు నాందిగా నున్నది. పోతన్న " పువ్వు తీగెలకు ప్రోదిసేయు " నని కూడ వర్ణింపగా, తిమ్మన ప్రోది చేసినచో చిన్నారి రుక్మిణి లేత అరచేతులు కందునేమోయని కాబోలును ఆమెచేత విరులను మాత్రము కోయించెను. ఇంకను తిమ్మన బొంగరములయాట, అచ్చనగాయలు, వామనగుంటలు, కందుకములు మొదలైన ఆటలను రుక్మిణి ఆడినట్లు వర్ణించెను. ఇవి వాస్తవిక జీవితమునకు సంబంధించినవి.

భాగవతము నందలి రుక్మిణి కృష్ణుని యెడల వలపుగొనియు "ఉ॥ చెప్పదు తల్లికిందలపు .....”( భా 1727 ప ) చ॥ తుడువదు కన్నులన్ వెడలు తోయకణంబులు......"(భా 1728 ప) అను పద్యముల ననుసరించి తిమ్మకవి రుక్మిణీ విరహాఘట్టమున ఆమె సకల నిత్య కృత్యములందును అనాసక్తయై యుండుటను వర్ణించెను (2ఆ 81ప). పట్టువస్త్రములు, ఆభరణములు, వీణ, రాయంచలు, నెచ్చెలులతో క్రీడలు, భోజనము మున్నగు వానియెడల రుక్మిణికి అనాదరము కల్గెను. ఇది ‘అరతి’ అను శృంగారావస్థ

తిమ్మన పోతన పద్యముల ననుకరించియు. కొన్ని మార్పు చేయుటయే గాక, ఒక్కొకపరి పోతన ఉపమానమునే గ్రహించి దానికించుక మెఱుగు పెట్టుచు మరియొక మెట్టు ముందునకు పోవుటయు కాననగును. భాగవతమున మాగధాదులు తాము ఘనసింహముల మనియు, గోపాలురు ఉన్మత్తములగు నీచ మృగంబులనియు భావించి నట్లు కలదు ( భా 1749 ప ). తిమ్మన ఈ పట్టున

ఉ॥ అత్తరి మాగధాదులు మురారి జయంబు సహింపలేక యు
న్మత్త కరీంద్రముల్ హరిన్ మార్కొను జందముఁ దోప నందఱున్
మొత్తములై హయద్విప చమూరథ కోటులఁగూడి యెంతయున్
దత్తఱమొంది నందసుతుఁడా హరి రాకను డాక సేయుచున్ (5ఆ 74ప)

అని మాగధాదులను ఉన్మత్తకరీంద్రముల తోడను, హరిని సింహము తోడను ఉపమించుట ఔచితీపోషకముగా నున్నది.

ద్వారకకు రుక్మిణి పనుపున దూతిగా వెడలి మరలివచ్చిన పురోహిత సుతుడు రుక్మిణీదేవి ఆతృతతో ప్రశ్నింపగా శ్రీకృష్ణుడు వచ్చినట్లు తెలుపక, నవ్వుచు సావధానముగా ద్వారకను, శ్రీకృష్ణుని వర్ణించి తుదకు కృష్ణుని రాకను దెలిపెను. విరహార్తయైయున్న రుక్మిణితో 'వచ్చియున్న వాడు కృష్ణుడు' అనుటకు మారుగా ఈ వర్ణనలేమి అనిపించును. మీదుమిక్కిలి భాగవతమున "మెచ్చె భవద్గుణోన్నతి" అని విప్రుడు వచ్చిన వేంటనే అనుకూల్యమును దెల్పెను. వాల్మీకమున హనుమంతుడు సీతాదేవిఁజూచి వచ్చుచునే, ఆలస్యమైనచో రాముకు ప్రాణములు బాయునేమోయని త్వరపడి "దృష్ట్వామయా సీతా" అని చెప్పెను. మరి ఈ రుక్మిణీపరిణయమున ఈ బ్రాహ్మణుడేమి యిట్లు వర్ణనకు కడంగినాడు? కాని ఇచట తిమ్మన కార్యసాఫల్యమును విప్రుని యుసి మోమునందే కనపరచినాడు. మనస్సునకు ముఖము దర్పణము కదా! రుక్మిణీదేవి ప్రశ్నించినంతనే ఆతడు "నవ్వి పల్కె" నని కవి తెల్పెను. ఆ నవ్వు కార్యసాఫల్యమునకు సూచన. కనుక ఇచట అనౌచిత్యము లేదు.

ఈ కావ్యమున ప్రబంధోచితములైన అష్టాదశవర్ణనలు గలవు. కుండినపుర, సాగర, రైవతకాద్రి, వసంతఋతు, చంద్రోదయ, సూర్యోదయ, ఉద్యానవన, సలిలక్రీడ, మధుపాన, రతోత్సవ, విప్రలంభ, రుక్మిణీజనన, రుక్మిణీపరిణయ, మంత్రి, దూత్య, ప్రయాణ, యుద్ధ, నాయకాభ్యుదయ వర్ణనములు పదునెనిమిది గలవు. ఇవిగాక ఇతరాలంకారికులు చెప్పిన రాజ, రాజ్ఞీ, దౌహృద, కళా, కన్యాంగసౌందర్య,

పుష్పాపచయాది వర్ణనములును గలవు. ఇవిగాక పుష్పలావికా వర్ణనము, పుష్పదోహద క్రీడలు, మన్మథపూజ మున్నగునవి వసుచరిత్రాదులనుండి అనుకరింపబడెను.

చ॥ నగరి విశాల దేవభవనంబులపై విలసిల్లు నెల్లెడం
జిగిబిగి కుందనంపుఁ బనిచేసిన రత్నపుఁ గీలుబొమ్మలా
గగనమునందునుండి పురిఁగల్గు విలాసముఁ జూడఁగోరి వ
న్నెగ నరుదెంచి పాయకటునిల్చిన యచ్చరకన్నెలో యనన్. ( 1ఆ 42ప )

ఇది కుండిననగరమందలి దేవాలయ వర్ణనము. దేవాలయశిఖరాగ్రమునగల కుందనపుపని చేయబడిన కీలుబొమ్మలను, పురియందలి విలాసముల చూడ నేతెంచి గగనమున నిల్చిపోయిన అచ్చర కన్నెలా అనునట్లు గలవని కవి ఉత్ప్రేక్షించెను.

పుష్పలావికా వర్ణనమున నిగూఢముగా వారి సరససల్లాపములు వర్ణింపబడెను

ఉ॥ తమ్ములు మొల్లలుం దొగలు దాసనముల్ విరిపొన్నలున్ శిరీ
షమ్ములు హల్లకంబులును జంపకజాలము లిప్పమొగ్గలున్
సమ్మతి నమ్మజూపి తమ చారుతిరావయవద్యుతి ప్రకా
శమ్మెటిఁగింతు రెంతయును జాణలకప్పురి పుష్పలావికల్. ( 1ఆ 53ప )

ఇట ఉపమానములను మాత్రము చెప్పి, ఉపమానములైన యా పుష్పముల నమ్మజూపి, తమ "చారుతిరావయవ ద్యుతి" ని పుష్పలావికలు జాణలకెఱింగింతు రనినాడు తిమ్మన. తమ్ములు - హస్తములకు, మొల్లమొగ్గలు - పలువరుసకు, తొగలు - కనురెప్పలకు, దాసనములు - చెక్కిళ్ళకు, విరిపొన్నలు - పొక్కిలికి, శిరీషములు - శరీరలావణ్యమునకు, హల్లకములు - పెదవులకు, చంపకములు - నాసికకు నుపమానములుగా చెప్పుట కవి సమయము. ఇక ఇప్ప మొగ్గలను మోవికి వాడి యుండునని తోచుచున్నది. ఈ ఇప్పమొగ్గ రసభరితము. ఇప్పమొగ్గ వలె మోవియు రసభరితమని చెప్పుటకై కవి దీనిని ఉపయోగించి యుండును. కాని యీ 'ఇప్పమొగ్గలు' మోవికుపమానముగా గ్రహించుట కవి సమయము కాదు. పుష్పలావికా వర్ణనమేగాక, పండ్లను

విక్రయించు పడతులయు, విటులయు మర్మోక్తులు వర్ణించుట ఇందలి విశేషము.

సీ|| ఈ మంజులికుచంబు లీచానయన, నిది కొనఁగోర నొక్కింతఁ గొనబొనర్చు
నంటిఫలంబు గైకొంట నీయడఁదగునన, నటె కానిమ్ము వెనుకరమ్ము
నెలత మాకందంబు నిర్గోరుటనఁగ, బలుమాఱు కేలికి నలరియుండు
మోవిపంటను గంటుఁగావించి చూతునాయనఁ, బండుగని యిటులాడదగునె
తే|| యనుచు ఫలములఁ గొనఁబూనినటుల విటుల
మొనసి సరసోక్తులాడుచు నెనసి తిరుగు
విటుల కింపుగ మఱుమాట వెసనొసఁగుచు
ఫలములమ్మెడి చెలులుండురెలమి నందు. ( 1ఆ 55ప )

రుక్మిణీదేవి దూతగా ద్వారకకు వెడలుచున్న బ్రాహ్మణుడు మధ్యే మార్గమున సముద్రమును జూచినపుడు చేసిన వర్ణనములో విరోధమునకు అభాసము కలదు. ఈ పద్యమునకు రాజుపరముగాను, సాగరపరముగాను రెండర్థములు వచ్చును.

సీ|| బహుతర వాహినీ పరివృతుండయ్యును, గడు నబ్బురముగ భంగము నొందె
ఘనులకు జీవనంబొనఁగూర్చుచుండియు, సతతంబును గలుషత్వమూనెఁ
దవిలిన మర్యాద దాటకయుండియు, పరిపరి విధముల భ్రమవహించె
ద్విజసమూహములకధీనమైయుండియు, బాడబార్తిఁ గృశింపఁ బాలువడియె
తే|| గటకటా ! దైవ మెటువంటి ఘనులనైన
గట్టిఁడితనంబుచే వెతఁబెట్టుచుండు
నంచు రత్నాకరుని విధంబెంచె నపుడు
పండిత శ్రేష్ఠుఁడైన యాబ్రాహ్మణుండు.

సముద్రపరముగా. 1వ పాదము. వాహినీపరివృతుండు= నదుల చేత పరివేష్టింపబడిన వాడైనను, భంగంబునొందెను. అనగా కెరట ములయొక్క భంగము కలిగియుండెనని భావము. ఇట విరోధము పరి హరింపబడెను. 2వ పాదము. ఘనులకు= మేఘములకు. జీవనంబు= జలము, ఒనగూర్చియు, కలుషత్వము= కల్మషము, ఊనె= వహించె ను. రాజుపరముగా : 1వ పాదము. వాహినీపరివృతుడు=

సేనాసమేతుడు, ఐనను, భంగమునొందెను=ఓడిపోయెను. 2వ పాదము. ఘనులకు=పండితులకు; జీవనంబు=జీవనాధారము; ఒనగూర్చియు, కలుషత్వమూని = కపటత్వమువహించెను. ఇట్లే మిగిలిన పాదములును. ఈ సాగర వర్ణనచేసిన వాడు 'పండిత శ్రేష్ఠుడైన బ్రాహ్మణుడు' కనుకనే అలంకారప్రౌఢమైన వర్ణన చేయుట ఔచితీ పోషకముగా నున్నది

మేఘముల జూచి హంసలు బెదరును. చంద్రుని చూచి చక్రవాకములు విరహమునొందును. పద్మములు కరులచేత హరింపబడును. తుమ్మెదలు చంపకముల గాలి సోకిన మూర్ఛిల్లును. ఈ విషయములను దృష్టియందిడుకొని తిమ్మన వనవిహార వర్ణనమున ఆయావిషయములకనుకూలముగా అంబుదవేణి ( మేఘమువంటి కురులు గలది ) యైన చెలికత్తె మరాళములను బెదరించెననియు, చంద్రసన్నిభముఖి చక్రవాకములను వెతల పాల్జేసెననియు, ఉన్మదద్విరదగామిని పద్మములను హరించెననియు, చంపక ప్రసవగంధి తేంట్లను మథించెననియు చమత్కరించెను. కలహంసలు, పద్మములు, చంద్రుడు, తేంట్లు - ఇవి నాయిక యగు రుక్మిణికి విరహోద్దీపకములు కవి విశేష్యములకు దగిన విశేషణములను వాడుట చేత సరియగు పరికరము సమకూర్చబడెను.

రుక్మిణీదేవి దూతగా కృష్ణుని కడకు వెడలు విప్రుడు రామకార్యము నిమిత్తము సీతాదేవి చెంతకు ఏగిన ఆంజనేయునితో పోల్చబడెను

తే॥ రామకార్యంబు మదిఁబూని రభసవృత్తిఁ
దనర నరిగిన యా మరుత్తనయు పోల్కి
రామకార్యంబు మదిఁబూని రభసవృత్తిఁ
దనర నరిగె భూమరుత్తనయుడంత. ( 2అ 66ప )

రామ, మరుచ్ఛబ్దములిచట శ్లేషింపబడెను.

మొదటి పాదము : రామకార్యము=శ్రీరామచంద్రుని నిమిత్తమైన పని, మరుత్తనయుడు=వాయుతనయుడైన హనుమంతుడు అనిఅర్థము.

రెండవ పాదము : రామ=వనిత ఐన రుక్మిణీదేవి; భూ=భూమియం దలి; మరుత్ = వేల్పుయొక్క; తనయుడు = పుత్రుడు ( పురోహిత పుత్రుడని చెప్పుట ). రామ మరుచ్ఛబ్దములు శ్లేషించుటకే కవి ఈ ఉపమానము వేసినట్లు కనిపించును. మరియు చూచినంతనే శబ్దాలంకార వైభవమే కానవచ్చును. హనుమంతుడు వెడలిన కార్యము వీరరస సంబంధియనియు, భూసురుడు వెడలిన కార్యము శృంగార రస సంబంధియనియు భావించుటకవకాశము కలదు. ఇంచుక పరిశీలించినచో ఈ యుపమానమెంత ఔచితీ శోభితమై రాణించునో స్పష్టమగును. భూసురుడు రుక్మిణీ కృష్ణుల సమాగమమునకై ఏగినట్లే హనుమంతుడును సీతా రాముల సమాగమమునకై ఏగెను. పాదము పూర్తిగా ఆవృత్తమగుటవలన పాదయమకము అను శబ్దాలంకారము కూడ కలదు.

యమకము అనగా అర్థముతో నిమిత్తములేకయే, ఒక పదము పలుమారులావృత్తియగుట.

చ|| డంబు గదే పిఱుందు పగ డంబు గదే జిగి మోవి చంద్ర ఖం
డంబు గదే కపోలము జ డంబు గదే నడ మన్మథాగ్ర కాం
డంబు గదే కటాక్షము గు డంబు గదే నుడి మేటి తేఁటి తం
డంబు గదే కరంబు ని బి డంబు గదే మెయి కాంతి యింతికిన్.
( 4ఆ 90ప )

'డంబు' అను శబ్దము నాల్గుపాదముల మొదటను, మధ్యను కూడ ఆవృత్తియగుటచేత ఇది పాదాది-పాదమధ్య యమకభేదము.

**రసము :** రుక్మిణీపరిణయము అను కావ్యనామమే ఇందు శృంగారము అంగిరసము అని తెల్పుచుండెను. వీరము అంగరసము. రుక్మిణిని కొనిపోవుచు శిశుపాలాదులతో కృష్ణుడు యుద్ధముచేయుటలో ఉత్సాహస్థాయికమగు వీర రసముద్భవించెను. రుక్మిణీదేవిని కృష్ణుని పేరుతో కలిపి వర్ణించుటలో కవిచూపిన నేర్పు శృంగారరస పోషకముగానున్నది.

సీ॥ విశ్వంభరాకృతి వెసఁబూనె జఘనంబు హరివిలాసస్ఫూర్తి నలరెఁ గౌను
కనకాంశుక ఖ్యాతిఁ గరమొప్పె మెయిఛాయ, విధుమనోహరస్ఫూర్తి వెలసె మోము
శ్రీవరాకారంబుఁ జెందెఁ గర్ణయుగంబుఁ గృష్ణశోభారూఢిఁ గేరెఁదురుము
చక్రి లావణ్యంబు సరవిఁ గైకొనె నారు దరభవ్యకరలీలఁ దనరె గళము

తే॥ సరసిజాక్షికి సకలాంగ సౌష్టవంబు
ప్రణుతిఁ బొనరింప నీరీతి బరగునపుడు
మానసంబునఁ దుదిలేని మమత మీర
గుధశధర నిన్ను వరియింపఁ గోరుటరుదె ( 4ఆ 36ప )

ఇందు కృష్ణుని పేరుతో శ్లేషించి అర్థము సాధించుటయేగాక, లక్ష్మీదేవి అంశమగు రుక్మిణి పరమైన అర్థము కూడ తత్సమీపావయవమునకు చేర్చుట విశేషము. "శ్రీవరాకారంబుఁ జెందెఁ గర్ణయుగఁబు" అనుటలో లక్ష్మీదేవి నామము, "కృష్ణ శోభారూఢిఁ గేరెఁదురుము" అనుటలో కృష్ణుని నామము కలవు. ఇట్లే మిగిలినవియును. ఇక వివిధ దశలయందు రుక్మిణియొక్క దశవిధ శృంగారావస్థలు విపులముగా వర్ణింపబడెను ఈ తీరున చక్కని వర్ణనలతో, సాలంకారముగ, రస భరితముగ నీ రుక్మిణీపరిణయ కావ్యము అలరారుచున్నది.

## సింహశైల మాహాత్మ్యము
( సింహాచల మాహాత్మ్యము )

తిమ్మకవి కృతమగు ఈ సింహశైల మాహాత్మ్యము తిరుపతి ఓరియంటల్ లైబ్రరీలో కాగితపు వ్రాతప్రతిరూపమున కలదు ఈ కావ్యము ముద్రితమై ప్రకటింపబడినట్లు వినికిడి. కాని ఆంధ్ర దేశమున ఒక్క ముద్రిత ప్రతియైన లేకుండుట శోచనీయము. 287 పుటల ఈ కావ్యము ఐదాశ్వాసములలో 931 పద్యములు కలిగియున్నది. పుస్తకము అచ్చటచ్చట శిథిలమయ్యెను. పుటకొక్కటికి సుమారు ముప్పది వరుసలు కలవు. ప్రథమాశ్వాసమున సుమారు నలుబది పద్యముల వరకును

అచ్చటచ్చట పదములు పాదములు లుప్తమయ్యెను. పంచమాశ్వాస మున పదిహేను పద్యములలో ఇట్టి లోపములు కలవు. కొన్ని లేఖక ప్రమాదములు కలవు.

తిమ్మకవి తన ఇతర కావ్యములందు కంటె నీకావ్యమున వంశ వర్ణనము విపులీకరించెను. ఇతర గ్రంథములలో ఒక్క పద్యమున మాత్రము వంశవర్ణనము కలదు. సింహాచల మాహాత్మ్యమున నలుబది పద్యములలో ( 1ఆ. 12-52ప ) తిమ్మకవి వంశవర్ణనము కావించెను. ఈ వర్ణనమునుబట్టి కూచిమంచివారు పండితులు, ధీమంతులు, అమాత్యులు, శివభక్తులు, సప్తసంతాన పోషకులు, దయాపరులు, కవులు, కవి సార్వభౌములునై విఖ్యాతయశులైనట్లు తెలియుచున్నది.

సింహాచల మాహాత్మ్యము ఒక క్షేత్ర మాహాత్మ్యమగుట వలన ధారావాహికముగా కథ సాగదు. నృసింహుని మహిమల దెల్పు వివిధ ములగు గాథలు కలవు. ఒక్కొక్కపరి ఒకే విషయము చర్వితచర్వ ణమగుచుండును. అట్టి పునరుక్తులు తొలగించి, కథాసారమును క్రోడీకరించిన కథ ఖండములుగా నిట ఆవిష్కరింపబడును.

**కథాసారము :** జైమిని మహాముని నరసింహుని అవతార విశేషములను మునులకు తెల్పుటతో నిది ఆరంభమగును. తొలుత నృసింహావతార మహిమము, నృసింహుని స్థానములు చెప్పబడెను.

ఈ భువిపై నరహరికి నాల్గువందల స్థానములు గలవు. వాని లో ప్రఖ్యాతమైనవి అహోబలము, కృతశౌచము, హరింపానము, సింహాచలములు. హిరణ్యకశిపుని సంహరించుటకై నరసింహస్వామి ఉగ్రరూపముతో అహోబలక్షేత్రమున ఉద్భవించెను. హరింపావమున బిడాలనృసింహుడు, కృతశౌచమున యోగానందమయుడగు నరహరి యునై శ్రీహరి వెలసెను. హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని అబ్ధిలో త్రోయ గా ఆబాలుని రక్షించుటకై వైకుంఠమునుండి వేంచేసిన నారాయణ

మూర్తి శాంతరూపమున సింహాకారముతో సింహాచలమున వెలసెను. అందుచేతనే ఆపర్వతమునకు సింహాచలము అని పేరు వచ్చెను. సింహాచలమున అవతరించిన నృసింహుడు అహోబలమున హిరణ్యుని చంపి ఆ రుధిరము కృతశౌచమున కడిగి హరింపావమున నివసించెను. ఈ నాల్గుక్షేత్రములలో సింహశైలమునకు ప్రదక్షిణము చేసినచో భూప్రదక్షిణము చేసిన ఫలము కలుగును.

హిరణ్యాక్షుని కథ: కృతయుగమున హిరణ్యకశిపుడు అను రాక్షసరాజు, అతని సోదరుడగు హిరణ్యాక్షుడును కలరు. వీరు పూర్వము విష్ణుదేవుని ప్రతీహారులైన జయ, విజయులుగా ఉండగా సనకసనందనాదులు శ్రీమన్నారాయణుని దర్శనార్థము వైకుంఠమునకు వచ్చిరి. జయవిజయులు ఆమునులను అంతఃపురములోనికి రానీయక ఆటంకపరచిరి. విషయము తెలిసిన శ్రీహరి ప్రతీహారులయెడకోపించి వారిరువురను దుష్టమనస్తత్వముగల అసురులై జన్మించమని శపించెను. ఆవిధముగా మూడు జన్మలనెత్తిన పిమ్మట జయవిజయులు వైకుంఠమును చేరగలరనియు విష్ణువు శాపాంతమును అనుగ్రహించెను అంతట జయవిజయులు దితికశ్యపులకు హిరణ్యకశిపు, హిరణ్యాక్షులై జన్మించిరి. హిరణ్యాక్షుడు గదచేత భూమిని మోదుచు దేవతలను, మానవులను క్రూరముగా హింసించుచుండెను. దేవేంద్రాదులు అతని ధాటికి ఆగలేక స్వర్గమును విడిచి మహేంద్రగిరికి అరిగిరి. వారు బ్రహ్మకు హిరణ్యాక్షుని ఆగడములు తెల్పిరి. వాణిపతి శ్రీమహావిష్ణువును ధ్యానించగా అతని మనస్సులో అంగుళి ప్రమాణమున ఉన్న విష్ణువు బ్రహ్మ నాసికనుండి సూకర రూపమున అవతరించెను. అంతట బ్రహ్మ హిరణ్యాక్షుని దురితములు విష్ణువునకు వినిపించెను. శ్రీహరి సూకరాకృతిని వృద్ధిపొంది తన కొమ్ముతో హిరణ్యాక్షుని చీల్చివైచి జలమున మునిగిన భూదేవిని తన కొమ్మున ధరించెను.

హిరణ్యకశిపుని కథ: సోదరుని మరణవార్త విని

హిరణ్యకశిపుడు చింతించి విష్ణుమూర్తియెడ బద్ధవైరము వహించి బ్రహ్మనుగూర్చి ఘోరతపమొనరించెను. వాణీశుడు ఆతని ఉగ్రతపమునకు మెచ్చి వరము కోరుమనగా హిరణ్యకశిపుడు బ్రహ్మసృష్టియందుగల సకల భూతములచేతను, శస్త్రాస్త్రములచేతను, శైలాదులవలనను, ముల్లోకములందు తనకు మరణములేకుండునట్లు వరముపొందెను. ఆ వరదర్పమున ఆతడు దేవతలను ఎదిరించి ఇంద్రునిఓడించి, స్వర్గమునాక్రమించి ఇంద్రాదుల హవిర్భాగములను తానే స్వీకరించుచుండెను. దేవతలు ఈ అవమానము సహింపలేక బ్రహ్మతోకలసి వైకుంఠమునకు వెడలగా సుముఖుడు అను ప్రతీహారి కర్తాధికారములేని కారణముగా దేవతలను నిలిపివేసెను. తదుపరి విష్ణువుకు తెలుపగా అతడు ఏతెంచి దేవతలకు అభయమొసంగి శరణార్తులను ఆటంక పరచినందున సుముఖునిపై కోపించి హిరణ్యకశిపుని తనయునిగా జన్మించునట్లు శపించెను. సుముఖుడుదైన్యతచూప కమలాకాంతుడు నవ్వి ఆతనిని కారణజన్మునిగా తెలిపెను. సుముఖుడు హిరణ్యకశిపుని సుతుడై పుట్టి ప్రహ్లాదుడుగా నిరంతరము హరిసేవయందే ఆసక్తి కలిగియుండెను. విద్యాభ్యాస సమయమందును గురువులైన చండామార్కుల మాటవినక నారాయణమంత్రము జపించుచుండెను. తరువాత హరిభక్తి కారణముగా ప్రహ్లాదుడు జనకునిచేత పలువిధముల హింసింపబడి చివరికి శ్రీహరి ప్రత్యక్షమగుటతో రక్షితుడయ్యెను. ఆ నాటి శాంతరూపముతోడనే శ్రీమహావిష్ణువు సింహాచలమున వెలసెను. అటుపిమ్మట ఉగ్రనరసింహామూర్తియై స్తంభమునుండిఆవిర్భవించి తననఖముల చేత హిరణ్యకశిపుని చీల్చి సంహరించెను. అనంతరము నారసింహుడు ప్రహ్లాదుని అసురరాజ్యమునకు అభిషిక్తునిచేసి దేవతలను పూజింపవలసినదిగా ఆజ్ఞాపించెను. ప్రహ్లాదుడు అట్లే దేవతలను పూజించుచు రాజ్యము నిష్కంటకముగా ఏలెను. అతడు గంధర్వ నాగకన్యలను పరిణయమాడి పుత్రులనుగాంచెను. కొంతకాలము సుఖముగా రాజ్యపాలన చేసి, విరోచనుడు అను పుత్రుని రాజ్యాభిషిక్తుని చేసి, సింహాచలము

నకు వెడలెను. అచ్చట నృత్తగీతవాద్యసహితముగా నృసింహుని సేవించి ఉత్సవము కావించి ప్రహ్లాదుడు కాలక్రమమున ముక్తిపొంది వైకుంఠము చేరుకొనెను. అటుపిమ్మట కొన్నియుగములకు చంద్రవంశజుడగు పురూరవుడు చక్రవర్తిగానుండి ఒకనాడు సింహాచలమున విహరించుచు ఊర్వశిని చూచెను. ఊర్వశీపురూరవులు అన్యోన్యానురాగబద్ధులైరి. ఊర్వశి ప్రహ్లాదుని కథ పురూరవునికి చెప్పి ఆ నరకేసరిని పూజింపవలెసినదిగా అతనిని కోరెను. పురూరవుడు సింహాచలేశునికై అన్వేషించి, చివరకు కలలో ఆదేవుని కాంచగల్గెను. కలలో స్వామిచెప్పినట్లు వల్మీకమందుగల నృసింహుని కనుగొని క్షీరముతో వల్మీకమును అభిషేకించి ఊర్వశీసమేతుడైనపురూరవుడు షోడశోపచారములతో అర్చించి, దేవుని అభిషేకించి చందనముతో అలది నైవేద్యము సమర్పించెను. ఆతీరున పురూరవుడు కొంతకాలము నృసింహుని సేవించి దివికేగెను.

శ్రీమన్నారాయణుడు నృసింహావతారము ధరించినకథ ఆంధ్రమహాభాగవతమున ప్రహ్లాద చరిత్రగా ప్రసిద్ధము. పోతనకంటె ముందు ఎఱ్ఱాప్రెగ్గడ "నృసింహ పురాణము" అనుపేరుతో ఈ కథను వెలయించెను. నరసింహావతారమునకు కారకుడైన హిరణ్యకశిపుడు, సోదరుడు హిరణ్యాక్షుడు పూర్వజన్మమున వైకుంఠములో శ్రీహరి మందిరద్వారపాలకులుగానుండి శాపవశమున అసురులైరి. ప్రస్తుత కావ్యమందలి కథకును నృసింహపురాణ, భాగవతములకును భేదము కలదు.

నృసింహపురాణమున సనకుడు, సనందనుడు, సనత్కుమారుడు, సనత్సుజాతుడు అనుమునులు ముకుందుని దర్శనార్థము వైకుంఠమునకు రాగా, జయవిజయులు అను ద్వారపాలకులు శ్రీహరి అప్పుడే మేల్కాంచెననియు, తాళుడనియు పలుకగా

చ॥ అనుటయు నాదిదేవుఁ బరమాత్ముఁ గనుంగొన నెమ్మనంబులన్
మొనయు కుతూహలాంకురము మోడ్పడఁ గోపము జిచ్చు తాకువన్
ఘనతరబోధ పల్లవముఁ గందంగ నైరణ యన్మహా వ్రతం
బునకు విఘాతమొంద మునిపుంగవులొక్కట నుగ్రమూర్తులై.
( నృ. పు. 1ఆ 87ప )

తే॥ అఖిల లోకగమ్యుఁడగు పరమేశ్వరుఁ
జూడఁ గొల్వ నబ్బు సుకృతమునకు
నంతరాయమైతి రట్టి యిద్దురితంబు
ఫలము ననుభవింప వలయు మీరు.    ( నృ. పు. 1ఆ 88ప )

ఉ॥ కావున ధర్మవిద్విషులు కల్మషకారులనంగ దుష్ట మో
హావిషుల బుద్ధితో నసురులై జనియింపుడు సతతంబు అ
త్మీవిభుమీది మచ్చరము కిన్కయుఁ గాజెయఁజెట్టుగాతఁ మీ
భావములివ్వ డేపగిది పాములు పెక్కగు నిక్కమెంతయున్.
( నృ. పు. 1ఆ 89ప )

అని ఘోరముగా శపించిరి. ఆ జయవిజయులే హిరణ్యాక్షు, హిర ణ్యకశిపులైరి. ఈ యంశమున నృసింహ పురాణమునకు, భాగవతము నకు చిన్నభేదము కలదు. నృసింహ పురాణమున బ్రహ్మమానసపుత్రు లు వచ్చిరనిమాత్రము కలదు. భాగవతమున బ్రహ్మమాన సపుత్రులు ఐదారేండ్ల ప్రాయపు దిగంబర బాలకులై హరి మందిరము నకు రాగా జయవిజయులు

డింభకుల ననర్గళ వి
స్రంభకుల రమాధినాథ సల్లాప సుఖా
రంభకుల ముక్త మానస
దంభకులం దొరగనీక తటిమిరధీశా !.

అంతట ఆ మునులు కోపించి " నారాయణ చరణమూలంబు విడిచి రజస్తమోగుణులై రాక్షస యోనిం బుట్టుడు " అని శపించి మరల " మూడు జన్మల వైరమున భగవత్సాన్నిధ్యము చేరగలరు " అని కరుణతో శాపాంతము తెలిపినట్లు కలదు. ఇందువలన బాలకులైయు న్న మునులను గుర్తించక మందిరమున ప్రవేశించనీయకుండుటలో ప్రతీహారుల దోషము లేదనిపించును.

సింహాచలమాహాత్మ్యము : జయవిజయులు సనకాదులను ద్వారము చెంత నిలిపివేయఁగా వారు కోపాయత్తచిత్తులైరి. ఆ సమయమున విష్ణుమూర్తి, అచ్చటికి వచ్చి మునులను తీసికొని అంతఃపురమున ప్రవేశించి ద్వారపాలకులను

కII జగదికను ముక్తిసేవిత
మగు మునిలోకమున న్యాయాధిక్యంబుల్
దిగఁద్రోచి సంచరింపుచు
మిగుల మదోద్రేకులైన మీరుండుటఁగున్.

గీII అధిక దుష్టచిత్తులగు మీరసురయోనిఁ
బుట్టుఁడవల మూఁడు పుట్టువులను
మతల నబ్బగలదు మన్మందిర ద్వార
పాలకత్వ మిరువులు పడగఁబోరు. ( 1ఆ 152ప )

అని శపించినట్లు కలదు.

నృసింహపురాణమున కాని భాగవతమున కాని నారదీయ పురాణమున కాని లేని మరియొక విశేషము సింహాచలమాహాత్మ్యమున కలదు. అది ప్రహ్లాదుని పూర్వజన్మవృత్తాంతము. దేవతలు హిరణ్యకశిపునిచేత పీడింపబడి, తుదకు యజ్ఞ భాగములను సహితము ఆ రాక్షసుడు హరించగా నిరాహారులైయుండి బ్రహ్మతో కలసి వైకుంఠమున కరిగిరి. కాని అచట సుముఖుడు అను ప్రతీహారి

గీII వినుఁడు కర్మాధికారులై వెలసి ముక్త
వాసనులు గాక యుండెడువారు మీరు
చేరఁదగదు యోగగమ్యమై పరగు దివ్య
సుందరంబగు శ్రీహరి మందిరంబు. ( 2ఆ 153ప )

అని దేవతలను వారించెను. మరల ఆ సుముఖుడే వారియెడ సుముఖుడై స్వామికి తెలుపగా శౌరి వెంటనే వెలుపలికి వచ్చి బ్రహ్మాదులకు దర్శనమొసగెను. బ్రహ్మాదులు విష్ణువునుస్తుతించి తాము ప్రతీహారుని చేత ఆటంకపరచబడితిమని తెల్పిరి. శ్రీహరి " మిమ్మడ్డగించినవాడే ఆ దైత్యవధకు కారకుడగును " అని పలికి, సుముఖునితో

క॥ కరము పొరయిడుచు వచ్చిన
శరణార్థుల గాంచివట్టి జడుడవు నీవా
సురరిపునకుఁ దనయుండవై
సరగున జనియింపుమింక జగతిన్ గుమతీ! ( 2ఆ 179ప )

అని తీవ్రముగా శపించి బ్రహ్మాదిదేవతల మహాత్వమును వానికి తెలిపెను. సుముఖుడు దీనుడై శాపాంతమును అనుగ్రహింపుమని వేడగా కేశవుడు దేవకార్యార్థము కారణజన్ముడవగుచున్నావని ఊరడించెను. ఆ సుముఖుడే ప్రహ్లాదుడై జన్మించి హిరణ్యకశిపుని అంతమునకు కారకుడయ్యెను. ఈ కథకు మూలము కానరాకున్నది.

హిరణ్యకశిపుడు తపస్సు చేయుట తెలిసి ఇంద్రుడు ఆ తపమునకు భంగము కలిగించుటకై అప్సరసలను పంపినట్లు నృసింహ పురాణమున కలదు ఇందు వసంతసమయమందలి అప్సరసల నాట్యగానములు ఇరువదిఎనిమిది పద్యములలో వర్ణింపబడెను సింహాచలమాహాత్మ్యమున ఇంద్రుడు తిలోత్తమ, చంద్రరేఖ, రంభ, హేమ, వరూథిని, రత్నమంజరి, చిత్రలేఖ మున్నగు అప్సరసలతో బాటు ( 2ఆ 48ప ), " వ. ... ... ... మనోజ పవన వసంతులను గనుంగొని " అని తిమ్మన అప్సరసల పేర్లు తెల్పుటయేగాక వసంతాదులనుకూడ పంపినట్లు వర్ణించెను ( 2ఆ 50 ). ఇందు నాట్యగానములు క్లుప్తముగా తొమ్మిది పద్యములలో వర్ణించెను ( 2ఆ 57-65ప ).

హిరణ్యకశిపుడు బ్రహ్మను వరమడుగుట నృసింహ పురాణ, భాగవతములలో ఈ క్రింది రీతిగా కలదు.

సీ॥ దేవకులంబుచే దేవయోనులచేతఁ బితృకోటిచే దైత్యవితతిచేత
గ్రహములచేఁ దారకములచే మునులచే నసల సమీర తోయములచేత
నరులచే గిరులచేఁ దరులచేఁ బశుమృగ పక్షి దంశక కీటకపంక్తిచేత
నగ కుంత శర పరిఘాద్యాయుధములచేఁ గాష్ఠ పాషాణ సంఘముల చేత
గీ॥ నవని నంతరిక్షంబున దివంబునందు
వాసరంబులయందుఁ శర్వరులయందు
నా కపాయంబు లేకుండ లోకవంద్య!
యిమ్ము మతియెవ్వియును నొల్లనింత నిజము. ( 2ఆ 96ప )

భాగవతము సప్తమస్కంధమున ఈ సందర్భమున పోతన్న వ్రాసిన శార్దూలవృత్తమునందును నృసింహపురాణమందలి పద్యభాగమంతయు కలదు. సింహాచలమాహాత్మ్యమున తిమ్మకవి హిరణ్యకశిపుడు బ్రహ్మను వరమడుగుటను మూడు పద్యములలో వర్ణించెను.

గీ॥ దేవదేవ నీవు తిరముగ వరమిచ్చె
దేని నీదు సృష్టిలోన గలుగు భూత
తతులచేతఁ బొలయకుండెడునటుల్
గోరినాఁడ కరుణమీర నిమ్ము. ( సిం. మా. 2ఆ 84ప ).

ఇందు " నీదు సృష్టిలో గలుగు భూతతతుల చేత " అనుటలో ఎఱ్ఱాప్రెగడ పోతన్నల సీస, శార్దూల పద్యములలోని విశేషములన్నియు వచ్చినవి. ఇట తిమ్మన్నయొక్క " అల్పాక్షరములలో అనల్పార్థ రచన" చేయు నేర్పు కన్పట్టును. తరువాతి పద్యమున తిమ్మన్న, " శస్త్రాస్త్రములచేతకాని శైలాదులచేతకాని స్వర్గ మర్త్య పాతాళ లోకములలోగాని మరణము లేకుండునట్లు " రాక్షసుడు వరమడిగెనని చెప్పెను. ఇక మూడవ పద్యమున నృసింహపురాణమునగాని, భాగవతమునగాని లేని విశేషములు రెండు గలవు.

గీ॥ పుడమి నెవరికి నాతోడఁ బోరి పోరఁ
దరముఁ గాకుండునటులను వరమొసంగి
ఋషివరేణ్యుల శాపమొకించుకైనఁ
జెందకుండెడునట్లుగాఁ జేయుమీశ ! ( సిం. మా 2ఆ 84ప )

తనతో యుద్ధముచేయు శక్తి ఎవ్వరికిని లేకుండునట్లును, ఋషులశాపము కొంచమైనను తనకు తగులకుండునట్లును వరమడిగినాడు అసురుడు. సృష్టిలో సర్వశక్తులకంటెను ఋషి శాపము బలవత్తరమైనదని హిరణ్యకశిపునకు అంతరాంతరములో తెలిసియుండెను. అందుచేతనే మునుల శాపము లేకుండునట్లు అతడు వరమడిగెను. అదియు నెట్లడిగెను? ' ఋషివరేణ్యుల చేత ' అనుటలో హిరణ్యకశిపునికి ఋషులయెడ గల గౌరవభావము, భీతియు వ్యక్తమగుచున్నది. ఈ రీతిగా తిమ్మన ఇచ్చట చేసిన కల్పన ఉచితముగానున్నది.

నృసింహపురాణమున దైత్యబాలకులకు ప్రహ్లాదుడు విష్ణుభక్తి నుపదేశించినట్లు ఇరువదినాలుగు పద్యములలో వర్ణింపబడెను (4ఆ 60_84 ప). సింహాచలమాహాత్మ్యమందును దైత్యార్భకులకు ప్రహ్లాదుడు పరమార్థము బోధించినట్లు ముప్పది పద్యములలో వర్ణింపబడెను (3ఆ 3_60ప). భాగవతమునను ఈ పరమార్థబోధనము కలదు. ఆ బోధచేసిన సమయమున అసురబాలకులు ప్రహ్లాదుని "నీ కింతటి భక్తి యెట్లు కలిగెను" అని అడుగగా నతడు, తాను తల్లి గర్భమున నుండగా ఆమెను దేవేంద్రుడు అపహరించుకొని పోవుచుండెననియు, నారదుడా సమయమున ఇంద్రుని అంగీకరింపజేసి, తన తల్లి లీలావతికి ఆశ్రయమిచ్చి పరమార్థ విషయముల తెలుప మాతృగర్భమునగల తనకు అవియెల్ల అవగతమయ్యెననియు చెప్పెను. (భా. సప్తమస్కం. 223_236ప). తిమ్మకవి ఈ వృత్తాంతమును గ్రహించలేదు. నృసింహపురాణమున లీలావతికి స్వప్నమున శ్రీహరి కనుపించి సంతానఫలమొసగి, ఆమెకంఠమునందలి హారమును తన నఖములచేత త్రెంచిపోయినట్లు కలదు (3. ఆ. 123ప). ఈ భాగమును తిమ్మకవి విడిచిపెట్టెను.

కృత్తిక వృత్తాంతము : నృసింహపురాణమున హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని బాధించుటలో 'కృత్తిక' నుత్పాదించినట్లుకలదు. ప్రహ్లాదుండను దురాత్మునిం బొరిగొను కృత్తిక నుత్పాదించవలసినదిగా హిరణ్యకశిపుడు పురోహితులకు ఆజ్ఞాపింపగా వారు తొలుత ఆ బాలుని అనునయించి, అతడు వినకపోవుటచేత కృత్తికనుత్పాదించినట్లు ఈ కావ్యమున కలదు (నృ పు. 4ఆ 90ప). "వ. అసురపతి పురోహితులును దక్షిణంబ యగ్నిముఖంబుఁ జేసి వేల్చి, కృత్యనుత్పాదించి ప్రహ్లాదు పయింబనిచిన ... ..." (నృ. పు. 4ఆ 112ప) ఈ కృత్య ప్రహ్లాదుని బాధింపయత్నించుటయు వర్ణింపబడెను (నృ. పు. 4ఆ 113_116ప). తుదకు కృత్య ప్రహ్లాదు నేమియు చేయజాలక పురోహితులను బాధించుచుండగా, ప్రహ్లాదుడు పరమేశ్వరుని ప్రార్థించి

వారిని రక్షించినట్లు కలదు ( 4ఆ 111-122ప ).

భాగవతమున హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని పలువిధముల బాధించి నట్లు వర్ణించుటలో అభిచారహోమము చేయించినట్లు కూడ కలదు. ( భా. 7స్కం. 199ప ). అభిచారహోమము చేయుటవలన కృత్తి జన్మించి ప్రహ్లాదుని బాధించును. నారదీయపురాణమందు అభిచార హోమముచేత హుతాశనుని తృప్తిపొందించగా అతడు కృత్యను నిర్మించునని కలదు. అది యిట్లు వర్ణింపబడెను.

శా॥ క్రోధగ్రస్తవివేకులై ద్విజులు దుష్కర్మాత్ములై మంత్రగ
ర్వాధిక్యంబునఁ బొంగుచున్ హవనముద్యద్భక్తి ( గావింపదు )
స్వాధస్ఫారతరస్ఫులింగములలో సక్రోధమై కృత్య సం
బాధాలోపముతోడ నార్చుచు వడిన్ బ్రహ్లాదు దట్టింపుచున్ ( 206 )

వ. అప్పుడు సకల భువనంబులు గ్రక్కదల నార్చుచు శూలంబు ద్రిప్పి ప్రహ్లాదుని నాటించినఁ దజ్జ్వాలానుస్ఫూర్తి హరిభక్తిరసాంబుధియైన యతనివలన శమియించె. ( 207వ )

ఇట్లు నారదీయ నృసింహపురాణములందు కృత్తికథనము విపులముగా నుండ, భాగవత కర్తవలె తిమ్మకవియు " హిరణ్యకశిపుడు ... ... విప్రభిత్తిపురస్సరులైన మంత్రిసదులనెల్ల రావించి వారలతో నిట్లనియె " ( సిం మా 3ఆ 123వ ) అనిమాత్రము పేర్కొని వదలివైచెను.

ప్రహ్లాదుని శివనింద: భాగవతము, నృసింహ, నారదీయ పురాణములందు లేని ప్రహ్లాదుని శివనింద సింహాచలమాహాత్మ్యమున ఉండుట విశేషము హిరణ్యకశిపుడు

శా॥ రమ్మా బాలక! నీలకంఠుడెపుడున్ రక్షోవశశ్రేణికిన్
నెమ్మిం గోర్కులొసంగుదైవ మతనిన్ నిందించి దైత్యాహితున్
సమ్మోదంబునఁ బ్రస్తుతించెదు కులాచారంబు వోనాడిన నీ
కిమ్మార్గంబుచితంబుఁగాదు వినుమా హృద్వ్యాధిఁజింతింపుమా.
( సిం. మా. 3ఆ 17ప )

అని తనయుని లాలించినప్పుడు ప్రహ్లాదుడు శివనింద చేసినట్లు

ఆరోపించెను. కాని కావ్యమందెచటను ఆతడు శివనింద చేసినట్లులేదు. హిరణ్యకశిపుడు శైవకథలు చెప్పెడివారినే ఆదరించునని గురువులు ప్రహ్లాదునికి చెప్పగా ఆ బాలుడు

సీ॥ పంచాక్షరీ జపపరులు పంచత్వంబుఁబొంది యష్టైశ్వర్యములను గూడి
కీర్తింపఁ దార్క్ష్యమూర్తులౌదురుగాని యరయ నారాయణ యనంగఁ బరఁగు
పలుకు చతుర్వర్గఫలదంబు నాల్గువేదంబుల సారభూతమటంచు
వినబడె నాచేత నొనరఁజతుర్థ్యంతిమై నమః ప్రణవంబులాదిగలిగి

గీ॥ తనరు నారాయణ పదంబుఁదవిలి జపము
సేయుచుండు నరుండు నారాయణుండె
యగును సచరాచరంబును నట్టి విశ్వ
మంతయును సంభవంబయ్యె నతనివలన. ( సిం. పు. 3ఆ 63ప )

అని తాను హరిభక్తుడగుటకుకారణము సహేతుకముగా నిరూపించెను. ఇచట ప్రహ్లాదుడు శివనింద చేయకపోయినను పంచాక్షరి కంటె నారాయణాక్షరి ఎక్కువ అనుటవలన అతడు శివనింద చేసినట్లు జనకుడు భావించియుండును. మరియు తొలుత గురువులు 'నమశ్శివాయ' అని వ్రాయుమన ఈ బాలుడు 'నమో నారాయణాయ' అని లిఖించెనట ( 3ఆ 48, 49ప ). ఇంకను.

సీ॥ ఏ ప్రభునామ మేప్రొద్దు పార్వతీసహితుడై పఠియించు చంద్రమౌళి
... ... ... ... ... ( 3ఆ 156ప )

అని హరుడే హరిని కీర్తించినటుల ప్రహ్లాదుడు చెప్పెను. ఏ కావ్యమందు లేని శివనింద కాని, పంచాక్షరీమంత్ర నిరసనముకాని ప్రహ్లాద ముఖమున శివభక్తుడగు తిమ్మకవి చేయుట ఆశ్చర్యకరమగు విషయమే. మీదుమిక్కిలి శివుడు విష్ణువును పూజించునని వ్రాయుటనుబట్టి తిమ్మకవి హరిహరాభేదమును నమ్మువాడని తోచును.

భాగవతమున, ప్రహ్లాదుని రాక్షసులు సముద్రములో పడవేయగా, ఆతడు వెలుపలికి వచ్చెనని మాత్రముకలదు (భా.7స్కం. 201ప). నృసింహపురాణమున ప్రహ్లాదుని నాగపాశములచే బంధించి రాక్షసులు సాగరమున త్రోయగా, శ్రీ హ రి ని ప్రార్థించుటవలన ప్రహ్లాదుని

పాశములు వీడి, వాడని మేనితో ఈవలకు వచ్చెనని కలదు ( నృ. పు. 4ఆ 175, 176ప ). సింహాచల మాహాత్మ్యమున, ప్రహ్లాదుడు సముద్రమున త్రోయబడగా అందుండి ఆబాలుడు శౌరినికీర్తించెననియు, అంతట ఆదేవదేవుడు వచ్చి తాను నృసింహరూపమున హిరణ్యకశిపుని సంహరింతునని చెప్పెననియు కలదు. ఈ విశేషమును తిమ్మకవి నారదీయపురాణమునుండి గ్రహించెను. ( నార. 8స్కం. 230-247ప )

నారదీయపురాణమున, హరి ప్రేరణచేత గరుడుడు ప్రహ్లాదుని నాగపాశములనుండి విడిపించగా, సాగరుడు ఆబాలునికి కానుకలనొసగెననియు, అటుపిమ్మట విష్ణువు ప్రత్యక్షముకాగా ప్రహ్లాదుడు మూర్ఛిల్లెననియు, హరి ప్రహ్లాదుని ధరపై జేర్చి, అంకమునవిడుకొని జనని వలె లాలించెననియు వ్రాయబడెను. మరియు నాపరమేశ్వరుడు వరము వేడుమనగా ప్రహ్లాదుడు తనను గరుడాదులలో చేర్చుమని వేడెను. శ్రీహరి అనుగ్రహించి తాను హిరణ్యకశిపుని మూడుదినములలో చంపుదునని చెప్పెను. ఈ భాగమున తిమ్మన కొంచెము మార్పుచేసెను. గరుడ, సాగరుల కథ విడిచి తిమ్మకవి, ప్రహ్లాదుడు స్తోత్రముచేయగా శ్రీమహావిష్ణువు వచ్చి

గీ॥ ఏపుతోఁ బ్రచండరూపంబు ధరియించి
కేవు నిశ్చలప్రతాపుడైన నీదు
జనకుఁ దున్మింతు నిక్కంబు నీవవు
డాత్మలోన భీతియందవలదు. ( సిం. మా. 4ఆ 45ప )

అని ప్రహ్లాదునకు అభయమిచ్చినట్లు వర్ణించెను. ఇట విష్ణువు తన శత్రువైన హిరణ్యకశిపుని 'నిశ్చల ప్రతాపుడు' అనెను. ప్రతివీరుని ప్రతాపము మెచ్చుట ఉత్తమవీరుని లక్షణము. ఇట్లు కథావిషయికముగా తిమ్మన కొన్ని అంశములను నృసింహపురాణమునుండి, కొన్ని భాగవతమునుండి, మరికొన్ని స్వతంత్రముగా వర్చికూర్చియు కావ్య రచన చేసెను.

**వర్ణనలు — అలంకారములు :**

ఈ గ్రంథమున 1 ) హేమవతీపుర వర్ణన ( 2ఆ 92_110ప ), 2 ) వైకుంఠపుర వర్ణన ( 2ఆ 135_150ప ), 3 ) సింహాశైల వర్ణన ( 1ఆ89_133ప ), 4 ) ఋతు వర్ణన ( 2ఆ 4_44ప_2పుటలు శిథిలము కాగా మిగిలినవి ), 5 ) వన వర్ణన ( 1ఆ 120ప ), 6 ) యుద్ధ వర్ణన ( 2ఆ 113_126ప ), 7 ) దౌహృద వర్ణన ( 3ఆ 6_10ప ), 8 ) చంద్రోదయ వర్ణన ( 4ఆ 3_9ప ), 9 ) సూర్యోదయ వర్ణన ( 4ఆ 58_62ప ), 10 ) కన్యాంగసౌందర్య వర్ణన ( 5ఆ 94_102ప ), 11 ) గజ, ( 2ఆ 101ప ), 12 ) అశ్వ ( 2ఆ 102ప ) వర్ణనలును, మరికొన్ని వర్ణనములును గలవు కొన్ని ప్రహ్లాదుని బాల్యము, హరిభక్తి, వేదాంతవిజ్ఞానములను తెలుపు వర్ణనలు, ఎక్కువగా నృసింహామహిమను తెలుపు వర్ణనలు కలవు. సుమారు తొమ్మిదిపద్యములలో మన్మథ వర్ణనము ( 2ఆ 58_65ప ), నాల్గుపద్యములలో మన్మథ స్తుతియు కూడ నిందు గలవు.

పూర్వకవి అనుసరణము : తిమ్మకవి కథాంశములను ఇతర కావ్యములనుండి గ్రహించినట్లే, వర్ణనాంశములుకూడ నృసింహ భాగవత పురాణముల ననుసరించియు, కొన్ని స్వతంత్రముగను రచించెను. తిమ్మన ఎఱ్ఱాప్రెగ్గడ ననుసరించి ప్రహ్లాదుని శైశవమును వర్ణించెను.

సీ॥ పసిపాపఁడై తాను బవడించు కాలంబు వటపత్రశయను భావంబుఁదలఁచుఁ
జెలువొందగా బోరగిల శయ్యఁదడవెడుతఱిఁ గూర్మమూర్తిఁ జిత్తమునిలుపు
రెండుమూడడుఁగులొండొండ తట్టాడునప్పుడు త్రివిక్రమలీలఁ బట్టిచూచు
లోలత వెన్నలుఁ బాలుఁ గ్రోలెడునాఁడు గోపాల సంస్మృతిగూర్చు నాత్మఁ

గీ॥ పరమపురుష భూతి భావిక భవ్యావ
తార బోధమహిమఁ దగ నెటింగి
యొండెఱుంగఁ డంబుజనాభ ధ్యాన
తత్పరత యొకటికాని బాలకుండు. ( నృ. పు. 3ఆ 147ప )

విష్ణుమూర్తి అవతారములను తలచి ప్రహ్లాదుడు ధ్యానించుచున్నట్లు

పుత్రుని సముద్రమున త్రోయించుట చేత రాక్షసరాజునకు కలిగిన అపకీర్తివలె చీకటి వ్యాపించెను. కీర్తి తెల్లనిదని, అపకీర్తి నల్లనిదని భావించుట కవి సమయము.

భావ్యర్థ సూచనముతో తిమ్మకవి స్వతంత్రముగా రచియించినది ఈ క్రింది పద్యము.

గీ॥ బాలకుని మీద దైతేయభటులు వైచు
శస్త్రజాతంబు భగ్నమై జగతిరాలె
సురపతికిఁబై తిలలు భావ్యపరకర్మ
ములను బ్రహ్లాదుఁడిడునని తెలుపుగతిని. ( సిం. మా. 3ఆ. 112ప )

జనకుని మరణానంతరము కుమారుడు కర్మచేయుచు తిలలను విడుచును. ఇచట దైత్యభటులు ప్రహ్లాదునిపై వైచిన ఆయుధములు పొడిగామారి రాక్షసేంద్రునికి ప్రహ్లాదుడు రాల్చెడి తిలలవలె నుండెనని తిమ్మకవి చేసిన కావ్యార్థ సూచనము సమంజసముగా నున్నది. ఇటువంటి ప్రతిభావంతములైన పద్యములు ఈ కావ్యమున ఎన్నియో గలవు.

**అలంకారములు :** ఈ కావ్యమున చక్కని అర్థాలంకారములు, శబ్దాలంకారములు విరివిగా గలవు. మచ్చునకు అరుదైన వడగళ్ళ వర్ణనము

అసురవల్లభు తపమున కలరి ఖచర
బాలికలు ముత్తియంపు సేసఁబ్రాలు చల్లి
రనఁగ వడగళ్ళు రాలె నయ్యలరుఁబోండ్ల
మేనుల మెఱుంగులనఁగ మింట మెఱపు లెసంగెన్. ( 2ఆ 25ప )

వడగళ్ళు ఖేచర బాలికలు జల్లిన ముత్తియపు తలంబ్రాలా అనునట్లు గలవని కవి ఉత్ప్రేక్షించుట మనోజ్ఞముగానున్నది.

శబ్దాలంకారములలో చక్కని యమకము లిందుగలవు.

శా॥ నాగేంద్రంబులు కిన్నరీ మధురగాన ప్రీతిఁ జెన్నొందగా
నాగేంద్రంబులుఁ బల్కొలంకుల నితాంతక్రీడలం దేలగా
నాగేంద్రంబులుదగ్రవైఖరి ననంత ... ... ... నయ్యాహీ
నాగేంద్రంబు వెలుంగునెప్పుడును నీహారాద్రితుల్యమై సిం. మా. 5ఆ 8ప

పాదాది యమక భేదమగు నీపద్యమున శ్లేషాలంకారమును గలదు. ప్రతిపాదము 'నాగేంద్రంబు' అను శబ్దముతో ప్రారంభమగుటచే పాదాదియమకము. నాగేంద్రము అను పదము శ్లేషింపబడెను.

సర్వతః ప్రాసము పద్యమునకొకవిధమైన అందమును తెచ్చి పెట్టును. 'త్ర' ప్రాసము అరుదైనది. అట్టి 'త్ర' ప్రాసముతో తిమ్మకవి ఒక చక్కని సీసపద్యమును సర్వతః 'త్ర' ప్రాసముతో అలంకరించెను.

సీ॥ దినకరశశినేత్ర! దిగ్వలయస్తోత్ర! పరమపవిత్ర! సువర్ణపత్ర!
నీల నీరద గాత్ర! నిరత సంభృతగోత్ర! భవలతోగ్రలవిత్ర! ప్రధనజైత్ర!
సుజనోపవన చైత్ర! కుజసదృశకరపత్ర! బుధజనావన సూత్ర! భువనమిత్ర!
నిర్జిత దితిపుత్ర! నిలయిత సుక్షేత్ర! మహితచారిత్ర! రమాకళత్ర!

గీ॥ చరణరుచిజిత శతపత్ర సకల ఘోర
కలుషతృణ వీతిహోత్ర! నిర్మల నఖ ప్ర
భాతిరస్కృత నక్షత్ర! ప్రకటముగను
జూచితిమి నిన్ను యోగి సంస్తోత్రపాత్ర (సిం. మా. 1ఆ 149ప)

ఇక చివరగా నరసింహస్వామి విజృంభించి రాక్షసులను సంహరించు ఘట్టము పరిశీలింతము.

ఉ॥ అప్పుడు నారసింహుడు యుగాంతకృశానుని లీల గన్నుల
న్నిప్పులు రాల డెందమున నిర్భర రోషరసంబు చిందగా
కుప్పలుగాగ రాత్రిచరకోటులఁ గూల్చె దవాగ్ని పెల్లుగా
గప్పి తృణోత్కరంబులఁ గాల్చు విధంబునఁ జిత్రవైఖరిన్.
(సిం. మా. 4ఆ 111ప)

ఇట నృసింహస్వామిని యుగాంతమందలి కృశానుని తోడను, తృణమును గాల్చెడి దావాగ్నితోడను ఉపమించినాడు తిమ్మకవి. నృసింహుని విజృంభణమునకు సరిపడునట్లు రాత్రించరకోటులను తృణముతో పోల్చుటయు జరిగెను.

ఈ కావ్యము క్షేత్రమాహాత్మ్యముగుటచేత నిందలి అంగిరసము ప్రత్యేకించి చెప్పుటకు వీలులేదు. కాని 'ఉజ్వలనీలమణి' ప్రకారము

భక్తిని రసముగా అంగీకరించిన ఇందలి అంగిరసము భక్తిరసమని చెప్పవలెను. దేవదానవ యుద్ధము, నరహరి హిరణ్యకశిపుల యుద్ధము లలో వీరరసమును, ఊర్వశీపురూరవ ఘట్టమున శృంగారరసమును అంగములుగా నిందు పోషింపబడెను.

## నీలాసుందరీపరిణయము

మూడాశ్వాసముల అచ్చతెనుగు కావ్యమిది. ఇది వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచేత 'ఇండియా ప్రింటింగ్ వర్క్సు' నందు 1910లో ముద్రింపబడెను. ఇందు 359 పద్యములు గలవు. తిమ్మకవి అచ్చతెనుగు కావ్యములలో ఇది మొదటిది.

**కథ :** మిథిలాపురమును ధర్ముడను రాజు పాలించుచుండెను. ఆపురమునందు కుంభకుడను గొల్లదొరయు, అతని ధర్మపత్ని ధర్మద యు గలరు. కుంభకుని గోసంతతి అగణితము. అతడు విప్రులకు గో దానములు చేసెడివాడు. ధర్మదాకుంభకులకు సిరిదాముడను కుమారు డు, నీలయనుకుమార్తె కలరు. కుంభకుడు నందుని బావమఱది. నందు డు కుంభకుని యోగక్షేమములరయుటకై ఒకనాడొక బ్రాహ్మణుని మిథిలానగరికి పంపెను. అతడు బృందావనిలోనున్న యశోదానందుల కుశలవార్తను కుంభకునికి తెల్పి శ్రీకృష్ణుని లీలలనభివర్ణించెను. కుంభ కుడు నందాదుల కుశలవార్తయు కృష్ణలీలలను విని ఆనందించెను. అతడు సౌందర్యరాశియగు తన పుత్రి నీలచే భూసురునికి మ్రొక్కించి, ఆమెకు తగినవరుని తెల్పుమని వేడెను. అంత నావిప్రోత్తముడు శ్రీ కృష్ణుడే నీలకు తగినవరుడని పలుకగా, కుంభకుడు యశోదానందులకు, కృష్ణునకు తన సుతను గూర్చి తెలియజేయుమని కోరి, ఆ ధరణీసురునికి కానుకలిచ్చి వీడ్కొలిపెను. బ్రాహ్మణుడు బృందావనికి వెడలి ధర్మదకుంభకుల కుశలవార్తను దెలిపి నీలను గురించి కుంభకుని సందేశ మును ఎఱింగించెను. నందుడానందముతో తన ఆమోదమును

వెలిబుచ్చెను. తదుపరి యా విప్రుడు నీలాసౌందర్యమును వర్ణించి కృష్ణునికి ఆమెపై వలపు జనింపజేసెను.

అది యట్లుండగా కుంభకునింట కాలనేమియను రక్కసునిపుత్రి యేడుగురు ఆంబోతులై పుట్టి ప్రజలను పీడించనారంభించిరి. ప్రజలాయుపద్రవమునుగూర్చి మిధిలాధిపతియగు ధర్మునికి విన్నవించుకొనిరి. ధర్ముడు కుంభకుని పిలిపించి ఆంబోతులను బంధింపుమని ఆజ్ఞాపించెను. కుంభకుడు బంధువులను రావించి రాజాజ్ఞ తెల్పగానందరును ఆంబోతులను బంధింప యత్నించి విఫలులైరి. మార్గాంతరములేక కుంభకుడు ఆంబోతులను పట్టినవానికి నీలనిచ్చి వివాహము చేయుదునని చాటించెను. కృష్ణునియెడల మరులుకొనియున్న నీల ఆవార్త విని విచారించి విరహార్తయైయుండెను. నీల చెలికత్తెలు ఆంబోతులను కృష్ణుడే చంపి ఆమెను పెండ్లాడునని ఊరడించిరి.

ఆంబోతులను పట్టుటకై పలువురు బలశాలురు మిధిలానగరికి ఏతెంచిరి. యశోదానందులు, బలరామకృష్ణులుకూడ మిధిలకు వచ్చిరి. ఘోషవంతుడను బలశాలి ఆంబోతులను బంధింప సమకట్టి వాటినెదుర్కొని వాటి ధాటికి ఆగలేక సొమ్మసిల్లెను. కాలనేమి పుత్రులు మరింత విజృంభించి అచటనున్న ప్రజలను కొమ్ముల గ్రుమ్ముచు, గిట్టలతో తన్నుచు బాధింపనారంభించిరి. పూర్వము తనచేత మడిసిన కాలనేమి పుత్రులే ఆంబోతులని గ్రహించిన కృష్ణుడు బలరామునికి చెప్పి ఆంబోతుల నెదుర్కొనెను. అవి ఆయవతారమూర్తితో యుద్ధము చేసిచేసి తుదకాతని చేతులలో మరణించెను. కుంభకుడానందమున నీలను కృష్ణునికిచ్చి మహావైభవముగా పరిణయము కావించెను. నీలాకృష్ణులు నందాదులతో వ్రేపల్లెకేగి సుఖముగా నుండిరి.

హరివంశము పూర్వభాగమున నీలపెండ్లి కథ ప్రసక్తమయ్యెను. ఇందు నీల పెండ్లి కథను ఎఱ్ఱాప్రెగ్గడ ఏబది పద్యములలో చెప్పెను. ధర్మదాకుంభకులకు శ్రీధాముడను పుత్రుడును, నీలయను పుత్రికయు

ఆక్రమించిరనియు, వారి గృహమున కాలనేమి పుత్రులేడుగురును ఆం బోతులై పుట్టగా శ్రీకృష్ణుడు ఆ రాక్షసులను సంహరించి నీలను వివాహమాడెననియు హరివంశమున కలదు.

వెన్నెలకంటి సూరన్న కృతియగు 'విష్ణుమాయా విలాసము' న శ్రీకృష్ణునకు అష్టమహిషులతో జరిగిన కల్యాణగాథలు కలవు. ఇందలి నాగ్నజితీ పరిణయమునకు నీలాసుందరీ పరిణయమునకు పోలికలు గలవు. నగ్నజిత్తు ఆలమందలో కాలనేమి పుత్రులు ఆంబోతులుగానుండ వాసుదేవుడా యాంబోతులను సంహరించి అతని తనయ యగు నాగ్నజితిని పరిణయమాడెను. కథాంశమొక్కటియేకాని నామములు భిన్నములు. అదేవిధముగా తాళ్ళపాకవారి 'అష్టమహిషీ కల్యాణము' న షష్ఠమ రాజ్ఞి నగ్నజిత్తుతనయ యగు సత్యకీర్తిదేవి అనియు, యశోదాతనయుడు కాలనేమి పుత్రులను చంపి ఆమెను పరిణయమాడెననియు కలదు.

తిమ్మకవి హరివంశమునుండియే ఈ కథను గ్రహించి, అచ్చతెనుగులో వ్రాయుటవలన శ్రీధాముడు అను పేరు సిరిదాముడుగా మార్చెను. ప్రబంధోచితములగు కొన్నికొన్ని వర్ణనలతో ఎఱ్ఱాప్రెగ్గడ వ్రాసిన ఏబది పద్యముల కథను మూడువందల నేబది తొమ్మిది పద్యములుగల మూడాశ్వాసముల ముద్దుప్రబంధముగా తిమ్మకవి తీర్చిదిద్దెను. నీలకు నందతనయునిగూర్చియు, నందతనయునికి నీలనుగూర్చియు తెలిపి దౌత్యము నడిపిన విప్రుడు తిమ్మకవి సృష్టి. రుక్మిణీ పరిణయమునందలి పురోహితుని దృష్టియందిడుకొని తిమ్మన ఈ విప్రుని సృజించెను. రుక్మిణీదేవి దూతగా వెడలిన విప్రుడు కార్యము సానుకూలము చేసికొని దేవకీపుత్రుని తోడ్తెచ్చెను. మనప్రబంధమున విప్రుడు నీలాకృష్ణులకు ఒకరిపైనొకరికి అనురాగము కలిగించునంతవరకే ఉపయోగపడెను. కనుక నితడు పూర్తిగా రుక్మిణీ పరిణయమునందలి బ్రాహ్మణునకు ప్రతిరూపమని భావించనక్కరలేదు.

ఈ ప్రబంధమున అష్టాదశ వర్ణనలలో మిథిలాపుర

( 1ఆ 26_40ప ), చంద్రోదయ ( 3ఆ 8_10ప ), సూర్యోదయ ( 3ఆ 44_46ప), విప్రలంభ ( 2ఆ 71_85ప, 3ఆ 12_30ప ), యుద్ధ (3ఆ 74_76ప), వివాహ ( 3ఆ 79_88ప ), రతోత్సవ (3ఆ 103_109ప), నాయకాభ్యుదయ ( 3ఆ 112ప ), వర్ణనలు ఎనిమిది గలవు. రాజ, కన్యాంగసౌందర్య, గజ, అశ్వ, మన్మథపూజ వర్ణనలు, ఆంబోతుల వర్ణనమును గలవు. తిమ్మకవి ఈ కావ్యమున కథయే ప్రధానముగా భావించుటవలన వర్ణనలు మిగుల తక్కువగా నుండెను.

ఉ॥ పున్నమచందురుం డెగడు పొంకపుమోముల రాచకన్నియల్
గ్రొన్నెలతాల మేలిపని కప్రపుమేడల నాటలాడ నా
యన్నుల కుల్కులేనగవులచ్ఛవు వెన్నెలంచుఁ ద్రిమ్మరున్
వెన్నెల పుల్గు మొత్తములు వేడుక నబ్బలుపీట మాటికిన్.

మిథిలాపురమందలి రాచకన్నియల లేతనగవు చూచి వెన్నెలయని చకోరములు భ్రాంతి చెందినవని కవి భావము. చక్కని భ్రాంతి మదలంకారము.

క. మినుఁగొలఁకునఁ బూచిన చ
క్కని చెందొవ యనఁగఁ దనరెడుఁ గలకలదొరలోఁ
గననయ్యెఁగప్పు మదిక
త్తిన వేడుకనుండు గండుతేటి యనంగన్.

ఆకాశమను కొలనులో పూచిన ఎఱ్ఱని కలువ యనునట్లు చందమామ యును, ఆ కలువపై వేడుకగల గండుతుమ్మెదయనునట్లు చందురుని లోని మచ్చయు కలవట. ఇది చక్కని రూపకాలంకారము. మఱి యొక కందములో అందమైన అతిశయోక్త్యలంకారము,

క॥ పన్నుగ నందలి యేనుఁగు
గున్నలపై మావటీంద్రులు కోరికలదరన్
మిన్నేటి పసిఁడితామర
క్రొన్నలను వస్నిమీఱఁ గోయుదురెపుడున్.

ఆపురమందలి ఏనుగులు అత్యున్నతములనుటకు తిమ్మన, ఏనుగులపై నున్న మావటివారు ఆకాశగంగలోని బంగారు తామర మొగ్గలను

కోయుచుందురని వర్ణించెను. తన కావ్యములలో వివిధ వ్యక్తుల వేష భాషలను కన్నులకు గట్టించుచు వర్ణించుట తిమ్మన ప్రత్యేకత.

నీల వర్ణనమున సర్వతఃప్రాసమును రమ్యముగ వేసినాడు తిమ్మకవి.

తే॥ గీ॥ కమ్మవిల్కాని చేతి పూఁగొమ్మ ముద్దు
గుమ్మ నిద్దంపు జాళువా బొమ్మ వలపు
గ్రమ్మ నిమ్మగువ కపురంపు దిమ్మె సుమ్మ
కొమ్మ నెమ్మిఁ దలిర్పఁ గైకొమ్మ తెమ్మ!

తేటగీతియైనను ప్రాసనియమము పాటించుచు సర్వతః ప్రాసముచే పీనుల విందొనగూర్చినాఁడు తిమ్మన

కావ్యమంతటను సులభగ్రాహ్యములగు అచ్చతెనుఁగు పదములనే కూర్చినను అచ్చటచ్చట సోఁకమూఁకలఁగొంగ, ఇరులఁగొంగ, విరిబోఁడి వగకాఁడు వంటి క్లిష్టమైన పదములును గలవు. అచ్చతెనుఁగు రామాయణము మాత్రము కఠినమైన అచ్చతెనుఁగు పదములతో వ్యక్తి నామములు కూడ తెనుఁగీకరింపబడి, అన్వయ కాఠిన్యము కలిగి యుండును.

శృంగారము ప్రధానరసముగా గల ఈ కావ్యమున నీలయొక్క దశవిధ శృంగారావస్థలు వర్ణితమయ్యెను. ఆకసిందు, పిండి చల్లిన తెఱంగు, నిప్పుకలువయిన్నేయి చల్లువోలిక, నీపూస్క బుగ్గిగాను, నీ బ్రతుకు బయల్గాను, నీ యిల్లు కూలిపోను, నీత్రుళ్ళు పెద్ద త్రుప్పలఁ బట్టన్, నీవచ్చిన మోకాలడ్డంబిడియెదు-మొదలగు తెలుగు జాతీయములెన్నియో గలవు.

నీల పెండ్లి సమయమున కాళ్ళుగోళ్ళుదీయుట పెండ్లి కుమార్తెకు పెండ్లికుమారునికి చమురురాచి నలుగులిడి స్నానము చేయించుట, తెరయడ్డము పెట్టి, ఉభయులచేత ఒకరి పాదములొకరిచే ద్రొక్కించుట, చీఁ చెఱఁగులు ముడివైచుట, అరంజ్యోతిసి చూపించుట మున్నగు తెలుఁగువారి ఆచార వ్యవహారము లిందు వర్ణింపబడెను. ప్రముక్క-

లిడు నాచారము నిందుకలదు. నందనందనుతో పరిణయమగుటకు నీల దేవతలందఱకు మ్రొక్కుచు, వినాయకునికి ఉండ్రాళ్ళ నిత్తునని, గంగా నమ్మకు చింబోతుసత్తునని నీల మ్రొక్కెను.

తే॥ గీ॥ పాలమున్నీటి గారాబుఁబట్టి మగఁడు
వేడుకలు మీఱ నేను బెండ్లియాడెదేని
గొప్ప చింబోఁతు కదుపులఁగూర్చి నీకుఁ
గాపువెట్టింతుఁ జుమ్మి యోగంగానమ్మ.

తెలుగునాట గంగానమ్మకు కోళ్ళు, మేకలు మొదలైన జంతుబలులపై ప్రీతియని నాటి ప్రజలలోగల నమ్మికచే నీలచేత కూడ గంగానమ్మకు మ్రొక్కించెను.

## అచ్చతెనుఁగు రామాయణము

క్రీ॥శ॥ 1912 లో చెన్నపట్టణమున వావిళ్ళ ముద్రణాలయమున ముద్రితమై బ్రహ్మశ్రీ శతావధాని పురాణం సూర్యనారాయణ తీర్థులచే పరిష్కరింపబడిన తిమ్మకవి అచ్చతెనుఁగు రామాయణములో 1338 పద్యములు గలవు. ఇందు బాల, అయోధ్య, అరణ్య, కిష్కింధ, సుందర, యుద్ధకాండములున్నవి.

ఆంధ్ర కవులు సంస్కృతాంధ్ర మిళితమైన తత్సమభాషలో కావ్యము నిర్మించుట పరిపాటియైనది. రుచిభేదము ననుసరించి కొందఱు సంస్కృత పదములు హెచ్చుగా, కొందఱు తద్భవదేశ్యములు హెచ్చుగా కావ్యరచన చేయుచు వచ్చిరి. "శృంగార కరుణరసాదులందు సంస్కృత సమాసఘటితముకాని తద్భవదేశ్యముల రచన సొగసుగా నుండును. వీర, అద్భుత, రౌద్ర రసములందు సంస్కృత సమాసఘటితముగా గౌడీరీతిని కవనము చెప్పిన రసవంతముగా నుండును" అని సిద్ధాంతము. దీనికి అవ్యాప్తి, అతివ్యాప్తులు లేకపోలేదు రసానుగుణమగు పద ప్రయోగము సహృదయునికి రసానుభూతి కలిగించును.

కొందఱు తెనుఁగు కవులు సంస్కృత ప్రాకృతాది భాషలతో సంబంధ ములేని కేవల అచ్చ తెనుఁగు పదములతో (తద్భవ దేశ్యములను మాత్రము గ్రహించి) తన ప్రధానమగు కావ్యములను నిర్మింపదలఁచిరి. పాల్కురికి సోమనాథుని "వృషాధిపశతకము" న పూర్తిగా అచ్చ తెనుఁగుతో వ్రాయబడిన పద్యమొకటి కలదు.

చ॥ బలుపొడతోలు సీరయును బాఁపసరుల్ గిలుపారు కన్ను వె
న్నెలతల సేఁగుత్తుకయు నుండిన వేలుపుఱేఁడు మల్లు ఱ్రా
కలుఁ గలఁడని తెంకవని జానుఁ దెనుంగువ చిన్నవించెడన్
వలపు మదిన్ దలిర్ప బసవా! బసవా! బసవా! వృషాధిపా!

ఇట్టి పద్యముల చూచి కావ్యమంతయు నిదేరీతిగా వ్రాయవలయునను సంకల్పము కొందఱు కవులకు కలిగెను. అట్టివారిలో మొదటగా అచ్చ తెనుఁగులో కావ్యరచన చేసిన కవి పొన్నిగంటి తెలగన్న. "యయాతి చరిత్రము" ఈతని అచ్చ తెనుఁగు కావ్యము. అచ్చ తెనుఁగు కవులెవ్వరు సంస్కృత కావ్యరచనా సంప్రదాయములగాని, సమాస రచనా విశేషములగాని విడువలేదు. వ్యక్తివాచక పదములకు అచ్చ తెనుగు పదములు కల్పించినచో సులభ గ్రాహ్యము కాదని తలంచి ఈ కవులు మహాదమహాన్మహాతీ సంజ్ఞావాచకములను యథా తథముగా గ్రహించిరి; అయా పదములకు తద్భవరూపములున్నచో స్వీకరించిరి (శల్యుడు - సెల్లుడు); మరికొన్నిటిని కల్పించుకొనిరి. (సీత-చాలుం పేరిటివనజోడి) కూచిమంచి తిమ్మకవి ఈ వ్యక్తి వాచక పదములకు అచ్చ తెనుఁగు పదములను విరివిగా కల్పించెను. పాఠకుల సౌకర్యార్థము తొలుత తత్సమపదములను తెలిపి తదుపరి అచ్చ తెనుఁగున చెప్పుట ఈ కావ్యమందు కానవచ్చును. "దశరథుడు" అని మొదట చెప్పి తరువాతనుండి 'బాల్పుతేర్లదొర, పది తేరులదొర' అనును. ఇట్లే

తోమపాదుడు - వెన్ద్రుక యడుగుల దొర
ఋష్యశృంగుడు - మనుబోతుకొమ్ముతపిసి

పరశురాముడు – గండ్రగొడ్డలి తాల్పు
రాముడు – పుడమితల్లి యల్లుడు
సీత – పుడమి కాన్పు.

రా వ ణు ని సై ని కు ల పే ర్లు :

శార్దూలముఖుడు – బెబ్బులిమోము రేద్రిమ్మరి
అశ్మవక్షుడు – రాబోర రక్కసుడు
పింగాక్షుడు – పచ్చకన్నుల వేల్పువాడు
వక్రనాసుడు – వంకముక్కు తొలివేల్పు
దీర్ఘజిహ్వుడు – సిలునాల్క పలుదిండి
రావణుడు (దశకంఠుడు) – బంతిమొగంబుల రక్కసుడు
శూర్పణఖ – చేటగోళ్ళబోటి.

శూర్పణఖకు లోకమున వ్యవహారములోనున్న 'చుప్పనాతి' పదముతో బాటు 'చుప్పనక, చుప్పనాక' అను తద్భవ రూపములు కూడ వాడ బడెను. ఈరీతిగా తిమ్మన ప్రతిపేరుకు అనేక రీతుల అచ్చతెనుఁగు పద ములు కల్పించెను ఇందువలన ఆయాపదములకు తత్సమములకంటె దూరత రాన్వయము ఉండుటవలన అర్థముచేసికొనుటకు ఇంచుక క్లేశము కలుగును కాని కొంచెము శ్రమపడి ఓపికతో చదివిన మనసునకొక విధమగు చమత్కృతి స్ఫురించి ఆనందము కలుగును. అచ్చతెనుఁగు కావ్యకర్తలువారికి తెలిసినంతలో వ్యాకరణ బద్ధమైన భాషనేవాడిరి. కాని గ్రామ్య భాషా ప్రయోగములను చేయలేదు. పొన్నిగంటి తెలగన్న, కూచిమంచి జగ్గకవి కూడ, తిమ్మన వంటి కవులతో సహా ఎల్లప్పుడు ఆచ్ఛిక భాషా కవులున్నను, అభినవవాగనుశాసన, కవి సార్వభౌమ బిరుదులందిన తిమ్మన ఎన్నియో ప్రబంధములు, శతకములు, దండకములు రచించియు తనివి తీరక నీలాసుందరీపరిణయము, అచ్చతెనుఁగు రామాయణము అను రెండు అచ్చతెనుఁగు కావ్యములను సృజించి ప్రాజ్ఞలోకమునకొక నిరవధికమగు ఆనందము కలిగించెను.

తెలుగులో కావ్యరచన చేసిన పుణ్యమురాదని తన కాలములో కొందరనుటచే కాబోలు తిమ్మకవి ఈక్రింది విధముగా ఫలశ్రుతి చెప్పెను.

తే. అనుచుఁ దెలుగంటి తపసి రామాయణంబు
నీశ్వరాయని గాదిలినిసుగుతోఁ
దెలిపె నిది విన్న వ్రాసిన లలిఁ జదివిన
సిరులుఁ గోర్కులుఁ బున్నెంబుఁ జెందుఁ బజల ( యుద్ధ-592ప )

తే॥ తెనుఁగు చదువునఁ బున్నియం బెనయ దనుచుఁ
గొందఱాడుదు రాడినఁ గొఱతయేమి
మును మరా యంచు నాఁడివిన చెనటిబోయ
నెఱి నిరాచారి యగుటయే గుఱుతుగాదె. ( యుద్ధ-593ప )

వాల్మీకి రామాయణము ఆదికావ్యము. ఆలంకారికులు చెప్పిన ప్రబంధ లక్షణములన్నియు ఇందు సమగ్రముగానున్నవి. అట్లే తిక్కనయు 'నిర్వచనోత్తర రామాయణము' ను ప్రబంధ లక్షణములతో విరచించుట చూచి అయ్యలరాజు రామభద్రుడు పూర్వరామాయణ కథ గ్రహించి శృంగార రసప్రధానమైన 'రామాభ్యుదయము' అను ప్రబంధమును సృజించెను. ఆమార్గముననే తిమ్మకవియు 'అచ్చ తెనుఁగు రామాయణము' ను వర్ణనావిధానముగా ప్రబంధలక్షణములతో తీర్చి దిద్దెను. పెక్కుతావుల కథ నిమిత్తమాత్రము, వర్ణన ప్రధానము గాను కానవచ్చును. కాని కథలో ఏయంశమును విడువక రేఖా మాత్రముగనైన తిమ్మకవి చూపించెను.

ఇతివృత్తము : రామకథ లోక ప్రసిద్ధము. ఇందు, రామజననము నుండి రామ పట్టాభిషేకము వరకుగల పూర్వ రామాయణగాథ వర్ణింపబడెను వాల్మీకి రామాయణమునకు సంగ్రహరూపమైన బాల రామాయణము అను ప్రథమసర్గలోవలెనే రేఖామాత్రముగా అచ్చ తెనుఁగు రామాయణ ఇతివృత్తము కలదు. వర్ణనలు, సంభాషణలు మూలానుసారముగాలేవు. అవాంతర కథలు మాత్రము మూలమునకు ఛాయాసదృశముగానున్నను కొన్నితావుల మూలాతిక్రమణము కలదు.

ఉదాహరణ: హనుమంతుడు సువేలాద్రినుండి లంకలో ప్రవేశించుచుండగా పట్టణ అధిష్ఠాన దేవత లంకిణి అడ్డుపడగా హనుమంతుడు దానితో యుద్ధము చేసి ఒక్క గ్రుద్దు గ్రుద్దెనని, అంత భీతిచెందిన లంకిణి ఏనాడు ఒకడు తనను మూర్ఛిల్లునట్లు ప్రహరించునో ఆనాటితో లంకానగరము నశించునని బ్రహ్మ తనకు వరమిచ్చెనని చెప్పినట్లు వాల్మీకమున సుందర కాండలో గలదు. అచ్చ తెనుఁగు రామాయణములో దీనికి భిన్నముగా లంకా ప్రవేశ సమయమున హనుమంతుడు లంకిణిని చూచి, ఇప్పుడు దీనిని చంపిన తను వెదకు పనికి ఆటంకముగా రక్కసులు వత్తురని, మరలి పోవునప్పుడు చంపవచ్చునని హనుమంతుడు భావించి, అట్లే వెడలి పోవునపుడు త్రోవ కడ్డమువచ్చిన లంకిణిని ఒక్క గ్రుద్దున చంపెననియు కలదు. ఇట్టిమార్పు మొల్లరామాయణమున కలదు. హనుమంతుడు మరలిపోవునపుడు లంకిణి కనిపించి

క. పోయెదు వాయుజ యెక్కడఁ
బోయెదు నాచేతినసువుఁ బోసిక వడిన్
డాయఁగ వచ్చిన లంకిణి
కాయము వగులంగఁ బొడిచెఁ గడువడిఁ గినుకన్ (మొల్ల. సుం 223ప)

ఈ మార్పునే తిమ్మకవి స్వీకరించి ఇంచుక మెరుగు దిద్దెను. లంకిణిని

ఆ. వె. కాంచి దీని నిపుడు ద్రుంచినఁ బ్రోలి వా
రెఱిఁగి చేరవచ్చిరేని కర్జ
మెల్లఁదప్పు మరలనేఁగుచోఁ దునిమెద
నని తలంచి సరగ నవలికరిగె (అచ్చ. తె. సుం. 4ప)

ఈమార్పు ఔచితీపోషకముగా నున్నది.

లక్ష్మణుని మూర్ఛ ఘట్టమున తిమ్మకవి ఒకమార్పు చేసెను. సుషేణుని ఆజ్ఞననుసరించి ఆంజనేయుడు ద్రోణపర్వతమును తీసికొని వచ్చి లక్ష్మణుని బ్రతికించెనని వాల్మీకి రామాయణము ఉత్తరదేశపు ప్రతులలో కలదు. కాని దక్షిణదేశపు ప్రతులలో ఈ సందర్భమున కాలనేమి వృత్తాంతము కూడ చెప్పబడెను. సుషేణుని ఆజ్ఞపై

హనుమంతుడు ద్రోణ పర్వతము కొఱకు వెడలుచు త్రోవలో దప్పిగొనెను. రావణ ప్రేరితుడైన కాలనేమి మార్గమధ్యమున ఒక ఆశ్రమము కల్పించుకొని మునివేషధారియై జపము చేయుచుండెను. హనుమంతుడు ఆమునిని జలమిమ్మని కోరగా, అతడు నీట విషము గలిపి ఇవ్వబోయెను. హనుమంతుడు అల్ప జలము చాలదనగ- వాడు మొసలియున్న చెరువు చూపెను. చెరువులో ప్రవేశించిన హనుమంతుని మొసలి ఈడ్చుకొనిపోవుచుండగా అతడు సూక్ష్మ శరీరముతో మొసలి గర్భమున ప్రవేశించి శరీరము పెంచి దాని పొట్ట చీల్చుకొని బయటకువచ్చెను. ఆ మొసలి ఒక అప్సరసయై, తనకు నిజరూపమిచ్చి నందులకు కృతజ్ఞతగా హనుమకు కాలనేమి నిజరూపము నెఱింగించెను. మరణింపక తిరిగివచ్చు మారుతితో కాలనేమి యుద్ధమునకు తలపడగా అతడా రాక్షసుని చంపి దాహము తీర్చుకొని సూటిగ సంజీవ పర్వతమును సమీపించి ఓషధిని గుర్తింపలేక పర్వతమునే తీసికొని రాబోడగెను. అంతట పర్వతరక్షకులైన గంధర్వులు అడ్డుపడగా వాయుపుత్రుడు వారందరిని జయించెను. మార్గమునందు అతడు భరతుని చూచి రాముడని భ్రాంతిచెంది క్రిందకుదిగి భరతుని పరిచయము గావించుకొని, రామలక్ష్మణుల కుశలవార్తనతనికి తెలిపి కొండతో యుద్ధభూమిని చేరబోవుచుండెను. పర్వతమందలి ఓషధీకాంతిని చూచి రాముడు సూర్యోదయమని భావించి, సూర్యోదయమైనయెడల లక్ష్మణుడు జీవింపడుకావున సూర్యుని ఉదయింపనీయక బాణము వేయుటకు సిద్ధపడెను. అప్పుడు సుషేణుడు యథార్థము తెలుపగా రాముడు శాంతించెను. హనుమంతుడు తెచ్చిన పర్వతమునుండి సుషేణుడు సంజీవకరణి, విశల్యకరణి అను ఓషధులనుదీసి లక్ష్మణుని జీవింపజేసెను. ఈ కథ దక్షిణదేశపు ప్రతులందు, భాస్కర రామాయణము నందు కలదు. ఈ వృత్తాంతమును గ్రహించి తిమ్మకవి, కాలనేమి యుద్ధములో పక్షిరూపము, సింహరూపము ధరించి హనుమంతునితో పోరాడి ఓడిపోయి, సుగ్రీవునిరూపము ధరించివచ్చి 'లక్ష్మణుడు జీవించెను రమ్ము' అని

చెప్ప ఆంజనేయుడు విశ్వసింపక శతశృంగుడైన ఆ కాలనేమితో యుద్ధముచేసి చంపెను, అని వ్రాసెను. ఇట్లు తిమ్మకవి అచ్చటచ్చట కొలది మార్పులను జేయుచు రామాయణము రచించెను.

వర్ణనలు : ఈ కావ్యమున అయోధ్యాపుర, దశరథరాజ వర్ణనలు, వన, అరణ్య, వివాహ, యుద్ధ, గజ, అశ్వ, దశావతార, స్వయంవర, చంద్రోదయ, సూర్యోదయ, విరహ, ఋతు వర్ణనాదులు కలవు.

ఉ: శ్రీరామచంద్రుని విరహ వర్ణన.

క॥ తొవలార కొదమ జక్కవ
కవలార కడింది పోయగపుఁ దుమ్మెద కూ
టువలార మీరిపుడు మా
నవలాదతనంబుఁ జూచినారే చెప్పుడా. ( అరణ్య-87వ )

పూర్వకవి అనుసరణలు : యుద్ధకాండమున 597వ పద్యము "పులికళాసము పాఁప ప్రోఁగులు క్రొన్నెలపూవు ..." అను పద్యము పాల్కురికి సోమనాథుని వృషాధిప శతకమునందలి "బలుపొడతోలు సీరయు ..." అను పద్యమునకు అనుసరణము.

ఆంధ్రమహాభారతములో "అభిమన్యువధ" ఘట్టమున ధర్మరాజు విలాపమును వర్ణించుచు తిక్కన వ్రాసిన "హాయను ధర్మరాజ తనయాయను" అను పద్యమును అనుసరించుచు తిమ్మకవి కరుణరస ఘట్టములందెల్లెడల రెండేసి పద్యములు చెప్పెను. కవి ఆయా తావులందు శబ్దాలంకారములను ఎక్కువగా ఉపయోగించెను. ఈ శబ్దాడంబరము తిక్కన పద్యమున లేదు. దండకారణ్యమున సీత నిమిత్తము రాముడు దుఃఖించుట, యుద్ధరంగమున మూర్ఛిల్లిన లక్ష్మణునికొఱకై రాముడు దుఃఖించుట మొదలగుచోట్ల ఇటువంటి పద్యములను తిమ్మకవి ఉత్పలమాలికలో రచించెను.

ఉ. రా యనఁగా యనుం దొగలరాయనిఁ గేరు నిగారపుం గుఁడా
రాయను మేటివాఁడెపు దొరాయను గిన్కయొనర్చెదేమి మే
రాయను నింత నీకుఁ గనరాయను దయ్యము పాటిదప్పె నా
రాయనుఁ గన్నవారు నగరాయను నిప్పని మానురాయనున్.

ఇట్టి సమయములందు ఆలంకారికులు చెప్పినట్లు "ప్రాయశో యమకాదౌతు రసపుష్టి ర్నవిద్యతే" అని రసభావములకు స్థానము కాదగిన ఘట్టములందు యమకము శబ్దాడంబరమే యగును.

వ్యా క ర ణ ము : వ్యాకరణదృష్ట్యా పరికించినచో తిమ్మకవి అచ్చటచట క్త్వార్థకేకార సంధి, యాంత థాతువులకు 'త' కారాదేశము విధించుట మున్నగు దోషములు చేసినను, తిమ్మకవి వ్యాకరణమున నిష్ణాతుడనిపించగల ప్రయోగము లెన్నియో ఈ కావ్యమున గలవు యుద్ధకాండలో పదిహేనవ పద్యమున.

ఉ. కొండలు పిండిసేతుమొ ...... ప్రింగివైతుమో
... ... ... ... గలంతుమొ ... ... ... ...
... ... ... ... ... ... ... ... ... ...
... ... ... ... జేటొదవింతుమొ

ఇచట చేయు, వేయు మున్నగు యాంత ధాతువులకు 'చ' కారాంత ధాతువులకు వలెనె తిమ్మన 'త' కారాదేశము విధించెను 'ప్రింగివైచుదుము', 'ఒదవించుదుము', 'కలంచుదుము' - అను మూడు క్రియలయందును 'చు' వర్ణము చివరనుండుటచేత 'చుద్' నకు 'త' కారాదేశము వచ్చి వైతుమొ, ఒదవింతుమో, కలంతుమో అను రూపములు సిద్ధించెను. 'పిండిచేయుదుమొ' అనుచోట నది 'చు' వర్ణాంతధాతువు కాకపోవుటచేత 'త' కారము చేయుటకు వీలులేదని లాక్షణికమతము. కాని తిమ్మన తన వాఙ్మయమున నెన్నియో తావుల యాంతధాతువులకు 'త' కారాదేశము చేసెను. అతడిట్లు ధారాళముగా 'త' కారాదేశము చేయుటకొక కారణము గలదు. విరాటపర్వము ద్వితీయాశ్వాసమున 29వ పద్యములో "మండపము సంక్షోభింపగానేతు"

అని ప్రయోగము కలదు. కీచకుడు నర్తనశాలలో ప్రవేశించి తనను జూచి ఆందోళన చెందగా తానెట్లు ప్రవర్తించునో భీముడు సైరంధ్రికి చెప్పినపుడు 'ఏఁతు' అని ప్రయోగించెను. ఇందు 'ఏతున్' అను పదము 'ఏయు' ధాతువుమీద వచ్చిన రూపమును భ్రాంతిచేత నిటీవలి కర్తలు ఇట్టి యాంత ధాతువులకు 'త' కారాదేశము చేయుచు వచ్చిరి. ఆ ప్రకరణమున పాఠాంతరముగా నిచ్చిన 'లేతు' అను ప్రయోగము 'చ' కారాంతమగుటవలన 'త' కారాదేశము వచ్చుటకు గాని, "కట్టలుకం బెబ్బులి కోల వేసినట్లు" అను ఉపమానము సరి పోవుటకుగాని లోపములేదు. కావున 'లేతున్' అను పాఠాంతరము స్వీకరింపవచ్చును. లేదా "విజృంభించు" అను అర్థమున "ఏచు" ధాతువును దిక్కన ప్రయోగించెనని భావించినచో "ఏచు" ధాతువు యాంతము కాకపోవుటచే 'త' కారాదేశము వచ్చెననుచో నీరూపము సాధువే యగును.

ఇటులనే క్త్వార్థకసంధి ఒకటి రెండు తావుల కన్పట్టుచున్నది. అధర్వణుడు "క్త్వార్థేతో న భవేత్సదా" అని క్త్వార్థేకారమునకు సంధి నిషేధించుటవలన అతనికి పూర్వము క్త్వార్థేకారసంధి లేదని తెలియుచున్నది. అట్లుండగా నిటీవలి కవులు అట్టి సంధి చేయుచు వచ్చిరి. భారతము–విరాటపర్వము 4వ ఆశ్వాసము 112వ పద్యమున "అందిమ్ము" అను పద ప్రయోగమును అంది+ఇమ్ము లో 'అంది' అను క్త్వార్థేకారమునకు తిక్కన సంధిచేసెనని భ్రాంతిపడిన అర్వాచీనులు ఇట్లు క్త్వార్థేకారసంధి చేసిరని భావించవచ్చును. ఈ ప్రయోగములను జూచి అడిదము సూరన తన "కవి సంశయ విచ్ఛేదము"న "కోరిందు శేఖరుఁడనఁగ" అని లక్ష్యసహితముగా క్త్వార్థేకారసంధి చెప్పి, వికల్పముగా నంగీకరించెను. అందువలనవేకాబోలు తిమ్మకవి సుందరకాండ 140వ పద్యమున క్త్వార్థేకారసంధి చేసెను.

క॥ కావరమున నారాముని
దేవేరిన్నీవు పట్టి తెచ్చిన వెదుకం

గావలసి కడలి దాఁటి
ద్దీవి గంపెసఁగ నరుగుదెంచిన వాడన్.

దాటి + ఇద్దీవి = దాటిద్దీవి అనియు

క॥ అదె కొలను తూర్పుదెసఁ జె
న్నొందవెడు నటకేఁగి ... ... నీ
రు దగ గ్రోలిటురమ్మా
... ... ... ... ...

గ్రోలి + ఇటు అనియు అచ్చతెనుఁగు రామాయణమున క్వాచిత్కేకార ప్రయోగములు కలవు.

" అందిమ్ము " అను భారత ప్రయోగము శబ్దపల్లవమనియు, అట్టి శబ్దపల్లవములు పుట్టునప్పుడు ఆగమాదేశ లోపాదులు పలు విధములుగా నుండుననియు, కనుక " అందిమ్ము " క్వాచిత్కేకారము కాదని కొందరు పండితులు చెప్పుదురు. ఏది యెట్లున్నను తిమ్మకవి యిట్టి ప్రయోగములు ధారాళముగా చేసెను.

' మొనగాడు ' అను శబ్దమునకు బహువచన రూపము ' మొనగాండ్రు ' దానిపై మరల బహువచనము వచ్చుట విశేషము చిన్నయసూరి బాలవ్యాకరణము ఆచ్ఛికపరచ్ఛేదము 17వ సూత్రమున – " ఒకానొకచో నామంబు సంశ్లిష్ట బహువచనాంత తుల్యంబయి బహువచనంబున నెసఁగు " అని సూత్రీకరించెను. దానినే తిమ్మన సర్వలక్షణసార సంగ్రహమున

"...సురలుఋులు పొల్లులగుచున్
దిరముగ బైపల్లు గదిసి ద్విత్వముఁ జెందున్ "

అని వ్రాసెను దీనిపై "–మొనగాండ్రు " అను రూపము సాధించెను. మొనగాండ్రు + లు అని మరియొక బహువచన ప్రత్యయము రాగా ఆ బహువచన 'ల' కారము రేఫమై " మొనగాండ్రురు " అయ్యెను. బాలకాండ 177వ పద్యమున తిమ్మన

" క॥ ఎట్టి మొనగాండ్రురేనియు "

అని ప్రయోగించెను ఈ [illegible]గా చర్చించినచో తిమ్మకవి ఆంధ్ర వ్యాకరణ విశేషములనన్నిటిని ఆకళించుకొనిన మహాపండితుడని తెలియును. పై పద్యముననే "పటుతుక్" అను ప్రయోగము కలదు. ఇట రేఫమీది 'ఉ' కారము లోపించి "పటుతుక్" అయ్యెను. ఇది బాలవ్యాకరణము ప్రకీర్ణకపరిచ్ఛేదము 16 న సూత్రముచే సాధింపబడును. ఇట్టి ప్రయోగములరుదు

సీతాదేవి అశోకవనమున విలపించు ఘట్టములో లక్ష్మణుని తలచి "మఱది కట్టు!" అని వాత్సల్య పూరితముగా సంబోధించును. ఇట్లే శ్రీనాథుడు "తల్లి కాన" అని ప్రయోగించెను. శ్రీనాథ ప్రయోగమును గాంచియేకాబోలు తరువాత కవులు "కొడుకుఁగుట్టు" "మఱది కట్టు" ఇత్యాదిగా ప్రయోగించిరి. "వజీరు" అను ఉరుదూ పద ప్రయోగము నిందు గలదు.

ఈ కావ్యమున "గుడిమ్రింగెడు వానికి లో, నడరెడు వేల్పుట్ర వడియగు దలపన్", "నేలయీనినట్లు", తానొక్కటి తలఁచిన దయ్యం బొక్కటి దలచు" మొదలైన తెలుగు సామెతలు, "నేతి కొరకు వెన్నపై నగ్గి సందెడు వ్రేయు జనుని", "నెయ్యిసోకిన యగ్గి వోలె మండిపడి", "క్రొవ్వెల్ల నడంచు" మున్నగు తెలుగు లోకోక్తులు తరచుగా ప్రయోగింపబడి అచ్చతెనుఁగు కావ్యము అచ్చపు తెనుఁగు కావ్యమై శోభించెను

## సర్వలక్షణసారసంగ్రహము

1927 లో ఏలూరు మంజువాణీ ముద్రాక్షరశాలయందు ముద్రితమై, శ్రీ నంది రాజు చలపతిరావుచేత ప్రకటింపబడిన లక్షణగ్రంథము సర్వలక్షణసార సంగ్రహము ఈ గ్రంథమును "లక్షణసారసంగ్రహము" అనుపేర సాహిత్య అకాడమీవారు ముద్రించి ప్రకటించిరి.

మూడు ఆశ్వాసములలో 432 పద్యములుగల ఈ లక్షణగ్రంథము కృత్యాదిని

క. జగదుపకారార్థము క్రొ
త్త్రగ, లక్షణ లక్ష్యములు వితర్కించి బుధుల్
వొగడఁగఁ గృతి సేసెద నెఱి
వగు లక్షణసార సంగ్రహాహ్వయ మొనరన్.

అని తిమ్మకవి చెప్పుటచే నిది "లక్షణసార సంగ్రహము" అనుపేర ప్రసిద్ధమైనట్లు కనబడుచున్నది. చిత్రకవి పెద్దన "లక్షణసారము" అను ఛందో గ్రంథమును రచించి వెల్లటూరి ఆంజనేయస్వామికి అంకితము చేసెను. తిమ్మకవి తనగ్రంథమును రసికజన మనోభిరామములో "సర్వలక్షణ సారసంగ్రహము" అని, శివలీలావిలాసమున "లక్షణ సారసంగ్రహము" అని పేర్కొనెను.

తొలి తెలుఁగు వ్యాకరణములగు నన్నయ, అథర్వణ, అహోబల పతుల గ్రంథములు సంస్కృత భాషయందే గలవు. వారు సంస్కృత వ్యాకరణమున సుశిక్షితులగుటచేత ఆ సాంప్రదాయములతోను, తెనుఁగు కొరకు ప్రాకృతము కూడ నేర్చిన వారగుట, ప్రాకృత వ్యాకరణ సాంప్రదాయములను గ్రహించి తమకాలమునాటికిగల వాఙ్మయమును లక్ష్యముగా నుంచుకొని గ్రంథరచన చేసిరి. కేతన, విన్నకోట పెద్దన మొదలగువారు సంస్కృత వ్యాకరణముతో సంబంధములేకుండ తెలుఁగు పరిభాషలనే సృజించి తెలుఁగు పద్యములలో చిన్న చిన్న వ్యాకరణ గ్రంథములు వ్రాసిరి. వీనితో తృప్తిపడని ముద్దరాజు రామన్న, కస్తూరి రంగకవి వంటివారు సంస్కృతాంధ్ర మార్గములు రెండింటిని కలిపి క్రొత్తపద్ధతిని వ్రాయదలచి గ్రంథరచన చేసియు భాష కంతకును సరిపడునట్టి సంపూర్ణమగు వ్యాకరణము నిర్మించలేకపోయిరి. కూచిమంచి తిమ్మన ఈ వ్యాకరణములను అధిగమించవలెనని తలచి "సర్వలక్షణ సారసంగ్రహము" (అనగా మునుపున్న లక్షణ గ్రంథముల సారము సంగ్రహముగా చూపునది) అను లక్షణ

గ్రంథమునకుపక్రమించెను గాని ఇదియు నసమగ్రమే.

నన్నయాదుల మార్గము నుల్లంఘించి అర్వాచీన కవులు కొందఱు విపరీత ప్రయోగములను చేయగా తిమ్మన అట్టివానినికూడ లక్ష్యములుగా గ్రహించి ప్రాచీన వ్యాకరణములను సవరించుచు లక్షణములు కూడ రచించుచు వచ్చెను. పర్యాలోచింపగా కవియనువాడు ఏది ప్రయోగించినను సాధువనియే ఈతని భావమైనట్లు గోచరించును.

ఉదా: ఉత్తమపురుషేతరములగు ప్రథమమధ్యమములలోని 'ఇ' కారమునకు సంధి నిత్యమను భావముతో నన్నయ సూత్రించగా అథర్వణుడు మధ్యమపురుషేకారమునకు మాత్రమే నిత్య సంధి కనుపించుటచేతను, ప్రథమేకారమునకు వికల్పముగా కనిపించుటచేతను నన్నయ సూత్రమును సవరించెను. అధర్వణుని సూత్రము ప్రకారము ప్రథమోత్తమముల 'ఇ' కారమునకు వికల్పసంధి, మధ్యమేకారమునకు నిత్యసంధి విధింపబడి, క్త్వార్థేకారమునకు సంధిరాకపోవుట నిర్ధారణ చేయబడెను. అహోబలపతి ఈ మార్గము నంగీకరించుచునే, ప్రథమపురుషేకారమునకు కూడ నిత్యసంధియని నన్నయభట్టు మతము ప్రకారము "కూర్చుండిరొండొరుంగదిసి" ఇత్యాది శ్రీనాథాదికవుల ప్రయోగముల నధిక్షేపించెను. అప్పకవియు నీమార్గమునే యనుసరించెను. కూచిమంచి తిమ్మకవి మాత్రము ప్రథమోత్తమపురుషేకారములకు మాత్రమేకాక పూర్వులెవ్వరు నంగీకరింపని మధ్యమపురుషేకారమునకు వికల్పసంధి నంగీకరించెను.

క. ధర ప్రథమ మధ్యమోత్తమ
పురుషల బహువచనములను బొదలెడు నచ్చుల్
తెరియుచు నెరయుచు నుండున్".

అని తిమ్మన బహువచనములందు 'ఇ' కారమునకు వికల్పసంధి చెప్పెను. ఏకవచనమునకు మాత్రము చెప్పలేదు. ఏలయన నతనికట్టి ప్రయోగము కనుపింపలేదు. ఈ బహువచన ప్రయోగమైనను "మీరిదె యమునాజ్ఞ ద్రోచితిరి" అను కవుల షష్ఠము యొక్క

ప్రయోగమును జూచి తిమ్మన ఈయనుశాసనము చేసెను. ఇట్లే యేకవియయినను మధ్యమపురుషైకవచనమున కూడ వికల్పముగా సంధి చేసినచో తిమ్మన దానికి కూడ వికల్పము చెప్పియుండును.

" సర్వలక్షణసార సంగ్రహము " న గల మూడాశ్వాసములలో వ్యాకరణము, యతిప్రాసలు, రేఫ, ఱ కార ప్రయోగములు పరిశీలింప బడెను. వ్యాకరణమున తత్సమ, తద్భవాది విభాగములు తొలుత చేయబడెను కేతన, విన్నకోట పెద్దనలవలె తిమ్మకవియు తత్సమ, తద్భవ, దేశ్య, ఆచ్ఛిక, గ్రామ్యములని భాషను ఐదు విధములుగా విభజించియు ఆచ్ఛిక, దేశ్యములు రెండును ఒక్కటియని నన్నయాదులు కాపించిన నాలుగు విభాగములతో సరిపుచ్చెను. 1వ ఆ. 63వ పద్యమున ఈ భావమే కలదు

క. సూరి జను ల్లోక వ్యవ
హారంబగు బాస దేశ్యమంద్రదియె హితం
బారగ నచ్చ తెనుంగని
యారూఢిగఁ గొందఱందు రగజాధీశా.

గ్రామ్య విభాగమున 'ఏడ, ఫలాలు, మల్లె' మొదలగు పదములు గ్రామ్యములని కేతనాదులు నిరసించిరి. కాని ఆయా పదములను కవుల ప్రయోగము లెన్నియో యుండుటవలన తిమ్మకవి అవి గ్రామ్యములు కావనుచు కవుల ప్రయోగములను జూపెను. చనియెన్, కనియెన్ మున్నగు రూపములకు చనెన్, కనెన్ అను వికల్పరూపములు నింద్యములని పూర్వులు కొందఱనగా తిమ్మన వానికికూడ గతి కల్పింప సంకల్పించి ఎన్నియో ప్రయోగములను జూపెను.

వర్ణ ప్రకరణము: ఈ ప్రకరణమున అచ్చు, హల్లు, ద్రుతము, కళ, పరుషము, సరళము అను సంజ్ఞలను ప్రాచీనులవలె తిమ్మనయు విధించెను, గాని విశేషము లేదు.

సంధి ప్రకరణము: వెనుక చెప్పిన క్రియా పదములలో

'ఇ' కార వికల్పసంధి తప్ప తక్కిన అచ్సంధులలో గాని హల్సంధు లలోగాని విశేషమేమియు లేదు వికల్ప సంధులకు మాత్రము వరుసగా భారతాదులనుండి ప్రయోగములు చూపబడెను విడి పదముల సంధులే కాక సమాసములలో వచ్చు నుగాగమ, రుగాగమాది సంధులను కూడ ప్రయోగములననుసరించి యుండెనేగాని వేర్వేరుగాలేవు. ద్రుతసంధులలో ద్రుతమునకు మకారాదేశమైనప్పుడు తిమ్మన మకారాదేశము విధింపకయే "కమ్మని లతాంతమ్ములకు మ్మొనసి" అను నిట్టి రెండు మూడు ప్రయోగములు చూపెను అది భారత ప్రయోగమగుటచేత ప్రాసములందు మాత్రమే అట్లగునని ప్రాచీనులు చెప్పినను దానిని విమర్శింపకయే సర్వత్ర నుండవచ్చునన్నట్లు తిమ్మన్న ప్రయోగములను జూపినై చెను.

రామునకున్ : అకారాంతములై మహద్వాచకములైన శబ్దములకు తృతీయ మొదలుగాగల విభక్తుల ఏకవచనంబులు పరంబులగునపుడు 'ని'గాగమము వికల్పముగా వచ్చును అప్పుడు రాముచే, రామునిచే మున్నగు రూపములు సప్తమి వఱకు సిద్ధించును కాని 'కు' వర్ణము పరమగునపుడు 'న'గాగమము నిత్యముగా కనబడుచున్నది అప్పుడు ' రామునకు ' అని యొక రూపము, 'ని'గాగమము రాగా 'కు' వర్ణమునకు మారు 'కి' వర్ణము వచ్చి 'రామునికిన్' అని మఱియొక రూపము సిద్ధించును. తక్కిన విభక్తులకు వలె 'ని' గాగమము వికల్పముగావున, 'ని' గాగమము రానట్టి రూపములు ప్రామాణిక కవులు ప్రయోగింపలేదు కనుక నది యప్రమాణముగా పెద్దలు భావించిరి కాని కొందఱు కవులు 'న' గాగమము విధింపకయే ప్రమాదవశమునకో, ఛందోనిర్బంధముననో అతి విరళముగా ప్రయోగించిరి. దానికి కూడ తిమ్మన గతి కల్పింపదలచి, 'న' 'ని' అను రెండును రాని ప్రయోగములు చూపించుటవలన అతనికి " రా ము కు న్ " వంటి ప్రయోగములు సమ్మతములనియే తోచుచున్నది ఉందురు – ఉంద్రు, ఉన్నారు – ఉన్నారరు, లేవనెత్తు – లేనెత్తు మొదలైనవి కారకము,

ము, అవ్యయములు తెలిపెడి ప్రకరణములో నుండవలసియుండగా స్మన సంధిపరిచ్ఛేదమున కలగలిపెను. విశేషణ విశేష్య భావము దు కొన్ని పదములకు వచ్చు ఆగమాదేశాదులు కూడ తిమ్మన ధి పరిచ్ఛేదమందే ప్రస్తావించెను. అస్మచ్ఛబ్ద విశేషణములకు రెండు వనములలో వచ్చు 'ను' 'ము' లును, యుష్మచ్ఛబ్ద విశేషణము కు వచ్చు 'ఉ' 'రు' లును ఇందే చెప్పబడెను. ఆంధ్రశబ్దచింతా ణి యందు అవి నిత్యములని చెప్పబడెను. కాని తిక్కనాది కవిప్ర యోగములు వికల్పముగా కనిపించుటచేత యుష్మదస్మచ్ఛబ్దముల కవచనములందు మాత్రమే వికల్పమని ఒకచోటను, బహువచనము ందు వికల్పమని మఱియొకచోటను తిమ్మన్న లక్ష్యములు చూపెను (సర్వ. ల. సా. సం 1ఆ 152, 162,). కాని ఈ విషయ మున నితడు చాల ప్రయోగములను చూపుట జిజ్ఞాసువులకు మేలు కలి గించెను. అందు యుష్మదర్థక బహువచనము మీద 'రు' వర్ణము వచ్చుట మిక్కిలి యరుదు.

ఇక క్రియాపరిచ్ఛేదమున చెప్పవలసిన చావక-చాక, వెఱవక-వెఱక, నొచ్చు-నో - అనునట్టువంటి క్రియలకు సంబంధించిన రూపాంతరములు సహితము సంధిపరిచ్ఛేదమునందే కానవచ్చుచున్నవి. తక్కిన క్రియలన్నియు నేకాక్షరములగునుగాని 'లేచు' ధాతువు తుమన్నంత రూపమున 'లే' యను నేకాక్షరరూపమందు పూర్వులు కాని, నవీనులుకాని చెప్పినదికాదు. 'కవుల షష్ఠము' న "లేవనెత్తి" యనుటకు 'లేనెత్తి' అని ఒక్క ప్రయోగము కనబడగా దాని నిమిత్తము తిమ్మకవి 'లేవనెత్తుట, చావకుండుట, వెఱవకుండుట, మఱవకుండుట, నొవ్వనేయుట - అను పదములలో 'వ' కారమునకు లోపము వచ్చును,' (సర్వ. ల. సా. సం, 1ఆ 172) అని ప్రత్యేకముగా లక్షణ నిర్దేశము చేసెను. 'లేనెత్తుట' వంటి ప్రయోగములు బహుళముగా కనిపించినచో అట్టి ప్రయోగము లాధారముగా సూత్రించుట సమంజసముకాని ఏక ప్రయోగమున కిట్లు సూత్రించుట శాస్త్ర

సాంప్రదాయముకాదు సూత్రలక్షణమున "సారవద్విశ్వతోముఖమ్" అనుటవలన ఏకైక ప్రయోగమునకు సూత్రరచన నిషిద్ధము. ఇట్లు అవ్యాప్త్యతివ్యాప్తులకు చోటు లేకుండ నిందలి లక్షణములున్నచో లక్ష్యసహితమగు నీ వ్యాకరణము తప్పక లోకోపకారకమయ్యెడిది.

వ్యాకరణ రచనయందు ఏ ప్రకరణమున కాప్రకరణము విడి విడిగా నుండుట పరిపాటి. ఒకే విధమగు కార్యము అన్ని భాషాభాగములకు వచ్చునెడల ప్రకృత ప్రకరణమునకు సంబంధించనివైనను ప్రసంగవశమున అన్నియు కలిపి ఆ ప్రకరణమున చెప్పుటయు కలదు. కాని తిమ్మకవి గ్రంథమునందీ నియమము కానరాదు.

వ్యాకరణము తరువాత యతిప్రాసల ప్రకరణములో తిమ్మకవి అప్పకవీయము ననుసరించియే ప్రయోగ సహితముగా లక్షణములను విపులపరచెను. శబ్ద ప్రకరణమున శబ్దము యొక్క రూపాంతరములు లక్షణములో చూపి, ఆయా రూపాంతరములకు వరుసగా ప్రయోగములు చూపెను.

ఉదా: పూవు పువు పువ్వు పూయన
మావిడి యనంగ మావి యనంగ
దౌవు దవు దవ్వు దౌ యనగా వె
లయున్ గృతులయందు వివరింపగా (సర్వ.ల.సా.సం. 2ఆ 176ప)

తిమ్మన ఇటువంటి శబ్దములు దాదాపు ముప్పది వఱకు స్వీకరించి, అందొక్కొకదానికి మూడు నాలుగు రూపాంతరములు చూపి, వానికన్నిటికిని ప్రాసాది స్థలములందు నిర్ధారకములగు ప్రయోగములను చూపెను

ప్రాసము: అప్పకవి ప్రాసమును పదునేడు విభాగములొనరించి, వానికన్నిటికిని వేర్వేరు సంజ్ఞలు చేసెను. తిమ్మన్న అట్టి

సంజ్ఞలు లేకుండగనే యించుమించుగ నవి యన్నియు తెలిపెను. ముందుగా ఆదేశ 'ఉ' కారమునకు 'న'కారమునకు ప్రాసమైత్రి చెప్పి, త్రిణయన, అణిమ – ఇత్యాది ప్రయోగములు చూపెను. పిదప ఆదేశ 'ణ'కారముతో 'న' కారమునకు గల ప్రాస చూపుటకై "ప్రాణా పానోవ్యానో దాన సమానములు" అని కాశీఖండ పద్యముద హరించెను. అటు పిమ్మట 'ఋ' కారమునకు రేఫకు ప్రాస చూపెను.

"స్వరగణమైన 'ఋ' కారము
పరికింపగ రేఫతోడ ప్రాసంబగుచున్"

అని చెప్పెను. 'ర' కారముతో కూడిన హల్లులు సంస్కృతాంధ్ర పదములలో దేనియందున్నను, ఆ రెండింటికిని పరస్పరము ప్రాస తగునని యెవ్వరు చెప్పని లక్షణము తిమ్మన్న చెప్పుట విశేషము.

"ఏ ప్రొద్దు శూద్రముని విగ
త ప్రాణుం జేసితి." (ఉత్తర రామాయణము)

ఇందు 'ప్రొద్దు' తెలుగు పదము; 'ప్రాణ' సంస్కృత శబ్దము. ఆ రెండు భాషలకు ప్రాసము కలదని చూపబడెను. సంస్కృతాంధ్రములందే కాక యే భాషలందైన హల్లులు సరిపోయినచో ప్రాసమున కర్హములగును. "అబ్రాసిథీర — ఇబ్రాము" అబ్రాసి పదములోన రేఫయుక్తమైన 'బ' కారమునకు, ఉరుదూపదములోని 'ర' కార యుక్త 'బ'కారమునకు ప్రాసము కలదు.

యతులు: అప్పకవికి వలె తిమ్మకవి విశేషము గలయతులకు వేర్వేరు సంజ్ఞలు కూర్చలేదు కాని, ఇంచుమించుగ నన్నిటిని చెప్పెను. అభేదయతులలో 'ప' 'బ'లకు, 'ల' 'డ'లకు, 'ల' 'ళ'లకు, 'న' 'ణ'లకు మైత్రి ప్రాచీనులంగీకరించిరి. కాని 'ర' 'ఱ'లకు మాత్రము నిషేధించిరి. దానివలన నేశబ్దములోనిది రేఫమో తెలిసికొనుటకు వేరుగా సూత్రములు లేవు. భాష యంతయు తెలిసికొనుట కెవ్వనికి సాధ్యమగును?

సాంప్రదాయముకాదు సూత్ర లక్షణమున "సారవద్వ్యశ్వతో ముఖమ్" అనుటవలన ఏకైక ప్రయోగమునకు సూత్ర రచన నిషిద్ధము. ఇట్లు అవాప్త్యతివ్యాప్తులకు చోటు లేకుండ నిందలి లక్షణ ములున్నచో లక్ష్యసహితమగు నీ వ్యాకరణము తప్పక లోకోపకారక మయ్యెడిది.

వ్యాకరణ రచనయందు ఏ ప్రకరణమున కాప్రకరణము విడి విడిగా నుండుట పరిపాటి. ఒకే విధమగు కార్యము అన్ని భాషాభాగ ములకు వచ్చునెడల ప్రకృత ప్రకరణమునకు సంబంధించనివైనను ప్రసం గవశమున అన్నియు కలిపి ఆ ప్రకరణమున చెప్పుటయు కలదు. కాని తిమ్మకవి గ్రంథమునందీ నియమము కానరాదు.

వ్యాకరణము తరువాత యతిప్రాసల ప్రకరణములో తిమ్మకవి అప్పకవీయము ననుసరించియే ప్రయోగ సహితముగా లక్షణములను విపులపరచెను. శబ్ద ప్రకరణమున శబ్దము యొక్క రూపాంతరములు లక్షణములో చూపి, ఆయా రూపాంతరములకు వరుసగా ప్రయోగ ములు చూపెను.

ఉదా: పూవు పువు పువ్వు పూయన
మావిడి యనంగ మావి యనంగ
దొవు దవు దవ్వు దొ యనగా వె
లయుఌ గృతులయందు వివరింపగా (సర్వ.ల.సా.సం. 2ఆ 176ప)

తిమ్మన ఇటువంటి శబ్దములు దాదాపు ముప్పది వఱకు స్వీకరించి, అందొక్కొకదానికి మూడు నాలుగు రూపాంతరములు చూపి, వాని కన్నిటికిని ప్రాసాది స్థలములందు నిర్ధారకములగు ప్రయోగములను చూపెను

ప్రాసము: అప్పకవి ప్రాసమును పదునేడు విభాగములొనన రించి, వానికన్నిటికిని వేర్వేరు సంజ్ఞలు చేసెను. తిమ్మన్న అట్టి

తము. రాజమహేంద్రవరాధీశుడు రాజరాజ నరేంద్రునికి పట్టపు రాణి రత్నాంగియందు సారంగధరుడు జన్మించెను. అతడు యౌవ్వనవంతుడయ్యెను. ఒకనాడు రాజు వేటకు వెడలినప్పుడు సారంగధరుడు పావురముల పందెము వేయగా ఒక పావురము రాజు యొక్క భోగకాంతయగు చిత్రాంగి చిలుకచేత నాకర్షింపబడి ఆమె మేడపై వ్రాలెను. మిత్రుడు మంత్రి పుత్రుడైన సుబుద్ధి వలదని వారించినను సారంగధరుడు పావురము కొఱకు చిత్రాంగి మేడకరిగెను. ఆమె కాముకురాలై సారంగధరునిపైఁబడగా అతడు తప్పించుకొని వెనుదిరిగి వచ్చెను. చిత్రాంగి అతనిపై పగఁబూని రాజు తిరిగివచ్చిన పిదప తాను చేసిన నేరము సారంగధరుడు చేసినట్లు ఆరోపించి, అతని కాలు సేతులు తీయించెను. కరచరణహీనుడైన సారంగధరుడు అరణ్యామున అలమటించుచుండగా నశరీరవాణి అతని పూర్వజన్మ వృత్తాంతమును వినిపించెను.

సారంగధరుని పూర్వజన్మ: ధవళచంద్రుడను వాడు గోళాంబపురాధీశుడు. జయంతుడు, సుమంతుడు అను నిరువురు మంత్రులలో సుమంతునిపట్ల అధికమైన విశ్వాసముంచిన ధవళచంద్రుడు రాజ్యభారము నతనిపై నుంచెను ఈర్ష్యాళువైన జయంతుడాతనిపై పగబూని, నృపుని భోగిని చెంత నూడిగము చేయు దాసిని వశపరచుకొని, సుమంతుని పాదరక్షలు భోగిని శయ్యకడ నుండునట్లు కావించెను. ఒకనాడు ధవళచంద్రుడా పాదరక్షలను జూచి సుమంతుని ద్రోహిగా తలచి అతని కాలు సేతులు నరికించి, తన భోగకాంతను సూతఁద్రోయించెను. చేయని నేరమునకు తనను శిక్షింపజేసినవాడు అట్లేయగునని శపించుచు సుమంతుడు అసువుల బాసెను. ఆ జయంతుడే సారంగధరుడు, సుమంతుడే రాజరాజనరేంద్రుడు.

పై విధముగా అశరీరవాణి వినిపించిన సారంగధరుని పూర్వ వృత్తాంతము చాటున నున్న రాజభటులు విని చింతించి రాజధానికేగి

రాజునకు విషయమెఱిగించిరి. రాజు శోకహృదయుడై చిత్రాంగిని దూషించెను. అది అంతయు రత్నాంగి పన్నాగమనియు, అశరీరి పల్కుట నిజమైనచో నిప్పుడు మరల పలుకుననియు చెప్పి చిత్రాంగి తప్పించుకొనుటకై యత్నించెను. అంతట నాకాశవాణి మరల చిత్రాంగి దోషమును, సారంగధరుని దోషరాహిత్యమును నిరూపించునట్లు పలికెను. రాజరాజు ఆ పాపాత్మురాలిని విడిచి, మంత్రిబాంధవ సమేతముగా నరణ్యమునకేగెను. అంతకుముందు సారంగధరుడు మీననాథుడను సిద్ధునివలన లబ్ధకరచరణుడై ఆ ప్రదేశమునుండి వెడలిపోయెను. అప్పటికి చేరిన రాజరాజు పుత్రుని జాడ తెలియగలేక విచారించుచుండగా మీననాథుడే తెంచి సారంగధరుని చూపెను. రాజరాజు సంతోష దుఃఖములతో దనయుని కౌగిలించుకొనెను. తరువాత సారంగధరుడు జనకుని అనునయించి సిద్ధులతో కలిసి 'చౌరంగి' అను పేర ప్రసిద్ధుడయ్యెను.

మూలము: ఈ సారంగధర చరిత్రము మాళవదేశమున జరిగినట్లును, ఆంధ్రదేశమున జరిగినట్లును పలువిధములైన కథలు - గాథలు ప్రచారములో నుండెను. సారంగధరుని కథ చేమకూర వేంకటకవి చేత పద్యప్రబంధముగా మలచబడెను. బాణాల శంభుదాసుడు దీనిని ద్విపద కావ్యముగా రచించెను.

'నవనాథ చరిత్రము' అను ద్విపదకావ్యమే తిమ్మకవి కావ్యమునకాధారము. చేమకూర వెంకన్నకును నీ గ్రంథమే ఆధారము. నామ భేదములు తప్ప తిమ్మన్న యథాతథముగా నవనాథ చరిత్రము నుండియే కథ గ్రహించెను. మూలమందలి యనౌచిత్యములను తిమ్మకవి పరిహరించలేదు. తన మందిరమునకు పావురము నిమిత్తము వచ్చిన సారంగధరుని చిత్రాంగి గౌరవించిన తీరు నవనాథ చరిత్రమున నిట్లు వర్ణింపబడెను.

"పద్దయుం(బ్రీతుమునఁదత్పాదములను
బసిడి కుంభములతోఁబన్నీటఁగడిగి

తిమ్మన్న గౌరన భావమునే యనుసరించెను. చిత్రాంగి సారంగధరుని "... ... పైడిగద్దియనునిచి, పసిడి గొప్పెరలతో బన్నీరు దెచ్చి, పొసగ నాతని పాదాంబుజములు గడిగి" సన్మానించినట్లు తిమ్మన్న వర్ణించెను. తాను పినతల్లిగా భావించు చిత్రాంగి తన పాదములు కడుగుచుండ నతడు మౌనము వహించునా? కనుకనే చేమకూర వేంకటకవి,

క. గంబూరఁ గులికి యనరా
గం బూర మనంబు చల్లగాఁ బన్నీటన్
బింబోష్ఠి యతని పాదా
బ్జంబులు గడిగించెఁ గూర్మి సకియలచేతన్

అని యనౌచిత్యమును బరిహరించెను. చిత్రాంగి సారంగధరునికి సుగంధ ద్రవ్యములనలది, బొడ్డుమల్లెలదండ కంఠమునవైచి తాంబూలాదుల నొసగినట్లు కూడ తిమ్మకవి వర్ణించెను, చిత్రాంగి బారినుండి తప్పించుకొనివచ్చిన సారంగధరుడు "అంతఃపురంబునకరిగి యత్యంత, చింతాసమేతుఁడై చెయివాంది నులక, కంకటిపైఁబడి" నట్లు తిమ్మన్న వ్రాయుటలో నుచితజ్ఞత లోపించిన దనక తప్పదు

సారంగధరుని కరచరణ ఖండనమునకు ముందు బలిపశువునువలె అలంకరించినట్లు నవనాధ చరిత్రమున వర్ణింపబడెను. (2ఆ. 73 పుట.) తిమ్మకవియు నిదేవిధముగా సారంగధరుని అలంకరింపజేసెను. (1ఆ. 35వ పుట.)

"చెదిరిన కురులు వాసిగ సిగవైచి, కుదురుగా మొగలిరేకులు నిండదూరిచి
నొసల కస్తురి బొట్టు నునుపారఁబెట్టి, కొసరు వెట్టకమేన కుంకుమంబలది
యలరు సంపెంగదండ యురుతగీలించి, బొలుపార తొడవులొప్పుగఁ బొందుపరచి".

గౌరన కలువపువ్వులదండ వేయగా, తిమ్మన్న సంపెంగదండ వైచెను. మిగిలిన యలంకరణమంతయు సమానమే.

**వర్ణనలు :** కవి యీ కావ్యమున కథకిచ్చిన ప్రాధాన్యము వర్ణనకిచ్చినట్లు లేదు. అయినను వర్ణనలు అటనట ఇంపుగలిగించుచుండెను. సూర్యాస్తమయమును వర్ణించుచు కవి కథతో నన్వయించిన తీరు గమనార్హము.

" ఆయెడ ద్రోహురాలైన జిత్రాంగిఁ, బాయక కన్గొన్న పాపంబు వోలఁగ
స్నానంబొనర్పఁ గ్రన్నన నేఁగె ననఁగఁ, బూని పశ్చిమమహాంబుధిఁ గ్రుంకె నినుడు "

ఇట్లే చంద్రోదయ వర్ణనము -

రూఢిమై దోషాకరుండగు రాజుఁ, జూడరాదని వీఁచు నొప్పునఁబద్మి
నీ సతి వదనమెత్తె మోడ్చుకొనియె ......... ...... ........

ఇచ్చట ప్రస్తుతము చంద్రోదయము, రాజరాజు చర్య అప్రస్తుతము. చంద్రోదయ వర్ణనమున కవి శబ్దశక్తిమూలకమగు ధ్వనితో రాజరాజు చర్యను విమర్శించుచుండెను ఇట ' దోషాకరుడు, రాజు, పద్మిని ' అను పదములు శ్లేషింపబడెను. మొదటి యర్థమున దోషాకరుడు = దోష + ఆకరుడు = రాత్రికి రాజు ; రాజు = చంద్రుడు. చంద్రుని రాకతో పద్మములు ముకుళించుకొనును గనుక దోషాకరుడైన చంద్రునిజూచి పద్మిని మోము వాల్చెను అని ప్రస్తుతార్థము. రెండవ యర్థము: దోషాకరుడు = చిత్రాంగి మాటలు నమ్మి పుత్రుని కరచరణ ఖండనమునకు ఆజ్ఞాపించిన వాడగుట రాజరాజు దోషాకరుడు. రాజు = ప్రభువైన రాజరాజు; పద్మిని పద్మినీజాతి స్త్రీయగు రత్నాంగి; దోషాకరుడైన రాజరాజు మోము చూడరాదని పద్మినీజాతి స్త్రీయగు రత్నాంగి తలవాల్చెను. ఇది ధ్వని.

**అంగిరసము :** ఈ కావ్యమున కరుణము అంగిరసము. సామాన్యముగా ప్రబంధములందు శృంగారము కాని వీరము కాని ప్రధాన రసముగా నుండుట పరిపాటి. ఇచ్చట మాత్రము కథావైలక్షణమును బట్టి కరుణరసము ప్రధానముగా పోషింపబడెను. సారంగధరుని నిర్దోషిత్వము, రత్నాంగి పుత్ర వాత్సల్యమున శోకించుట, రాజరాజు నిర్దయ

మున్నగు ఘట్టములు కరుణ రసస్ఫోరకములు. సారంగధరుని కరచరణ ఖండన సన్నివేశమున కరుణరసము పరాకాష్ఠనందెను. సారంగధరుని యెడల చిత్రాంగి ప్రదర్శించిన వలపు ఆమెయొక్క కాముక ప్రవృత్తిని తెల్పుచున్నదేగాని శృంగార రసానుభూతిని కలిగించదు ఇచట శృంగారము పుత్రతుల్యుడైన సారంగధరునిపట్ల ప్రదర్శింపబడుటవలన శృంగార రసాభాసముగ పరిణమించెను.

> "నెలలు తొమ్మిదియును నిండారమోచి, కులదీపకుడవని కోరికన్నట్టి
> పుత్రరత్నమ! పెనుభూతమైనట్టి, చిత్రాంగికి పుడెఱ్ఱజేసితి నిన్ను
> నా ముద్దుకుఱ్ఱడ! ననుగన్నతండ్రి! నీమోము గనలేక నేనెటులోర్తు
> కడలేని పుత్రశోక పయోధినెట్లు, గడతు నెవ్వరు దిక్కుగలరిక నాకు
> తండ్రి! యియ్యార్తి గుందగ ముందదేమొ, చంద్ర నిప్పుల పూజ సలిపితిగాక".

రత్నాంగి పుత్రశోకము ప్రతియెదలో కరుణరసమును ప్రవహింపజేయకమానదు. "చంద్ర నిప్పుల పూజ సలిపితిగాక" ఈ నూతన ప్రయోగము రత్నాంగి గుండెలలో రగిలే మంటలను చక్కగా ఆవిష్కరించుచున్నది. ప్రబంధకవులలో అల్లసాని పెద్దన, భట్టుమూర్తి, ముక్కు తిమ్మన్నలు తమ కావ్యనాయికలను వేర్వేరు రీతుల నేడ్పించిరి. అట్లే తిమ్మన్నయు చిత్రాంగి శోకమును క్రింది తీరున వర్ణించెను.

> ... ... ... ... ... ... ... ... ... ... ... వసంతాగమారంభ
> లలిత రసాల పల్లవ రసాస్వాద, కలనాకపాయిత కంఠసోత్కంఠ
> కలకంఠ కులవధూకాకలి ధ్వనులు, నెలుగెత్తి యేడ్చుచు ........

ఇందలి పదబంధము ముక్కుతిమ్మనార్యుని తలపింపజేయుచున్నది. కరచరణ ఖండనమైన పిదప సారంగధరుని దురవస్థ కన్నులకు కట్టించినాడు తిమ్మన.

చక్కని తెలుగు జాతీయములు, సంస్కృత జాతీయములు ఈ కావ్యమంతటను విరాజిల్లుచున్నవి. "పిల్లివట్టిన కోడిపిల్ల కైవడైన నల్లన

జడిగిపోనగునే" "కోతికి నచ్చిన కొబ్బరిపంటిరీతి", "రాయైన కరఁగు నటండ్రు", "వెన్నకన్న మెత్తన", "కన్నుల పండువుగా", "చల్లకుఁ బోయి ముంత దాచినయట్లు", "యతో ధర్మస్తతో జయమ్", "నానృతాత్ పాతకమ్ పరమ్" మొదలైనవి సందర్భోచితముగా నున్నవి.

ఈ కావ్యమున కథాసంవిధానము, రసపోషణ, పాత్ర చిత్రీకరణ సమర్థవంతముగా ఒప్పుచున్నవి. వైదర్భీరీతిలో ద్రాక్షాపాకముతో ఈ చిన్న ద్విపదకావ్యము అలరారుచున్నది.

## రసికజన మనోభిరామము

950 పద్యములు ఆఱాశ్వాసములుగల ఈ గ్రంథము క్రీ॥శ॥ 1927 లో చెన్నపురిలో వావిళ్ళవారి ముద్రణాలయమున ముద్రింపబడెను.

కథాసారము: కల్యాణపురమునకు అర్చిష్మంతుడు ప్రభువు ఈ రాజునకు ఋతుధ్వజుడు అను నామాంతరము గలదు. కిరాతులు కోరగా నర్చిష్మంతుడు క్రూరమృగ సంహారార్థము వేటకు వెడలి, వేట ముగిసిన తరువాత కుటీరమున విశ్రమించి, సఖునితో గలసి అరణ్యమున విహరించుచుండెను. ఆ సమయమున ఒక గంధర్వకాంత వీణావాదనము వారి వీనులబడెను. ఆమె పేరు సుశ్యామ. ఋతుధ్వజుడామెను వలచెను. అతని వయస్యుని మాటలకు మెత్తబడియు సుశ్యామ బింకము వహించి చెలులతో వెడలిపోయెను. సుశ్యామాఋతుధ్వజులు పరస్పరావలోకనమున అనురాగబద్ధులగుటచే వియోగమును సహింపలేకపోయిరి. సుశ్యామ పెంపుడు చిలుక ఆమె హారమును గుర్తుగా గ్రహించి ఋతుధ్వజుని కుటీరమున కరిగి సుశ్యామ హృదయము నతనికి తెలిపి హారము నొసగెను. ఋతుధ్వజుడమితానందమంది సుశ్యామకు ప్రణయలేఖ వ్రాసి చిలుకకొసగెను. సుశ్యామ కేళీవనమునకు రమ్మని చెప్పి చిలుక మరలి

పోయెను. ఋతుధ్వజుని లేఖ చదివిన సుశ్యామ లజ్జయు, సంతోషము పెనగొనగా శుకమును పొగడెను. సూర్యాస్తమయమగుటతోడనే సుశ్యామ సఖులతో గలసి కేళీవనమునకేగి అచట తనకై వేచియున్న ఋతుధ్వజునితో గలిసి యాతని కుటీరమును చేరెను. సుశ్యామా ఋతుధ్వజులచట కొన్ని దినములు సుఖముగా కాలము గడిపి యొకనాడు వనవిహారమునకేగగా నొక రక్కసుడు కనిపించెను. ఋతుధ్వజుడా రక్కసునితో యుద్ధము చేసి వానిని సంహరించెను. అంతట సుశ్యామ వినోదార్థమొక పొదరింట దాగెను. ఋతుధ్వజుడామె నిమిత్తము వెదకి విరహవేదన చెందిన పిమ్మట సుశ్యామ యతని యెదుట పడెను. అట్లు మరికొంతకాలము వారు శృంగారాబ్ధిలో నోలలాడిరి సుశ్యామకొక కుమార్తె జన్మించెను. ఒక గుహయందు ఆ శిశువునుంచి, ఆ గుహయందు తొలుత ప్రవేశించినవాడే ఆమె భర్త యగునని చెప్పి సుశ్యామ ఋతుధ్వజుని వీడ్కొని గంధర్వ లోకమునకు వెడలిపోయెను.

సుశ్యామ పుత్రి వనదేవతలచేత సంరక్షింపబడెను. యౌవనవంతురాలైన పిమ్మట నామె తల్లి పలుకులను స్మరించి గుహయందే తపస్సు చేయుచుండెను. ఆ విధముగా కొన్ని వేల యేండ్లు గతించిన పిమ్మట నాసాహీనుడు, విద్యారహితుడు నైన గౌతముడను విప్రుడు తపస్సు చేసికొను సంకల్పముతో ఆ గుహలో ప్రవేశించి వృద్ధ కన్యయు తాపసియునగు సుశ్యామ తనయనుగాంచి నమస్కరించెను. ఆ వృద్ధ కన్య ఆతని వారించి, అతడే తన పతి కనుక తనను వివాహమాడుమని గౌతముని కోరెను. తానామెకన్న తక్కువ వయస్సు కలవాడననియు, మీదు మిక్కిలి విద్యానాసారహితుడననియు గౌతముడు పలుకగా నామె తన జన్మవృత్తాంతము నతనికి తెలిపెను పిమ్మట నామె తన తపశ్శక్తిచేత గీర్వాణిని, వైశ్వానరుని ప్రార్థించి గౌతమునికి సద్విద్యయు, సురూపమును ఒనగూర్చెను గౌతముడామెను బరిణయమాడెను. కాని అసంఖ్యాకులగు జనులు వారి దాంపత్యమును

జూచి హేళన చేయుచుండిరి. వృద్ధా గౌతములు పిసిగిపోయి తిరలో పాయమునకై అగస్త్యాశ్రమమునకు వెడలిరి. అగస్త్య మహాముని వారికి గౌతమీ గంగను దర్శించవలసినదిగా ఉపదేశించెను. వారచటి కేగి తపస్సుచేయు గంగాదేవిని స్తుతించగా నామె సాక్షాత్కరించి తన జలమున పరస్పరము అభిషేకించుకొనిన వో నిరువురకు సమాన రూప యౌవ్వనములు కలుగునని తెలిపెను. వారటు చేసి నవయౌవనరూప లావణ్యముల పొందిరి. అగస్త్యుగు వశిష్ఠాది మునిగణ సమేతుడై అచ టికి వచ్చి వారికి మరల వివాహమొనరించెను.

మూలము : ఈ ప్రబంధమునకు మూలము బ్రహ్మపురాణ మని తిమ్మకవి 6వ ఆశ్వాసమున 207వ పద్యమున తెల్పెను.

సీ. రహిమీర బ్రహ్మ పురాణోక్తమగు గోదావరీ ఖండంబుఁ దనరు నందు
వృద్ధ ప్రవంతి సరిత్పతి సంగమ మాహాత్మ్య సన్మహిమ మదియెం
రసికజన మనోభిరామంబనెడు పేరఁ దెనుఁగున శాలివాహన శకాఖ్య
ములఁ గరగిరి రసభూ సంఖ్యఁ దద్దయుం వఱలు ప్రమోదూత వత్సరమున

గీ. నీ ప్రబంధంబు రచించి నీ కొసఁగితి
నిందు శేఖర నీ కృప నిది ధరిత్రి
నా సుధాకర తారార్కమగుచుఁ గవిజ
నోత్తముల యిండ్ల శ్రేప్రొద్దు నుండుఁగాత

రసికజన మనోభిరామమునందు ఆఱవ యాశ్వాసములో 126 నుండి 186 వఱకు గల 60 పద్యములలో గల కథకు బ్రహ్మ పురాణము 170వ అధ్యాయమునందలి గోదావరీ ఖండమునగల 38వ అధ్యాయములోని "వృద్ధాసంగమ తీర్థ వర్ణనమ్" అను వృత్తాంతము సరియగు మూలమగుచున్నది ప్రబంధమందలి యీ కథాభాగము మూలమునకు కేవలము అనువాదము. "వృద్ధాసంగమ తీర్థవర్ణనమ్"లో 9,10 శ్లోకములు, వానికి భావానువాద పద్యములు నిట నుదహరింప బడును

ఏతా వతా బ్రాహ్మణత్వమ్ గౌతమస్యాభవన్మనే!
ఉపాసత్వాగ్నిమ్ విధివద్గాయత్రీమ్ చ మహాత్మనః ॥

తస్యా యురిల్వర్ధే పుత్రగౌతమస్య చిరాయుషః ॥
నదార సంగ్రహమ్ లేభేనైవ దాతాస్తి కన్యకామ్ ॥

**అనువాదము:**

క॥ గాయత్ర్యభ్యసనంబును
వాయుసఖోపాసనంబు వదలక యెప్పుడున్
జేయుచునుండె ద్విజోత్తముఁ
డాయుర్వర్ధనమెసంగ నతనికి మిగులన్

తే॥ అగ్ని కార్యంబువలన గాయత్రివలన
బ్రాహ్మణుండను నామమంత్రింబుఁ బెరసెఁ
గాని విద్యావధూపరిగ్రహములబ్బ
వయ్యె నమ్మేదినీ నిర్జరాన్వయునకు

గౌతముడని పేర్కొనుట మాని తిమ్మకవి ద్విజోత్తముడు, మేదినీ నిర్జరాన్వయుడు అని వ్రాసెను. శ్లోకములలోని భావము లిందుగలవు స్వతంత్రభావ ప్రకటన గల పద్యములు సిందుగలవు

ఆ॥ పల్వలోదకంబు బాలాతపము శాని
శ్యామదధి సమన్వితాశనంబు
వృద్ధ భామినియును బ్రేతి ధూమంబును
బ్రతుకుఁదఱుఁగునంద్రు ప్రాజ్ఞులెల్ల

ఆయువు క్షీణించుటకు గల కారణములిందు చెప్పబడెను.

మూలమున సూచనప్రాయముగానున్న స్తోత్రములు, వర్ణనలు నీకావ్యమున విస్తరింపబడెను. వృద్ధకన్యక వాణీవైశ్వానరులను బ్రార్థించి గౌతమునికి విద్యయు, సుందరరూపమును గలిగించినట్లు బ్రహ్మపురాణమున నొక్క శ్లోకమునగలదు. రసికజన మనోభిరామమున వృద్ధకాంత ఆఱు పద్యములలో వాణిని, ఒక్క పద్యమున వైశ్వానరుని స్తోత్రము చేసినట్లు విస్తరింపబడెను.

సీ. శుకదండవల్లకీముకుర పుస్తకపాణి లాలిత నీలరోలంబవేణి
బహుళ విద్యాదాన పాలితాంతర్వాణి రుచిరావలోకన ప్రచలితైణి
కవిజన స్తుతిపాత్ర కలితగుణశ్రేణి తత్త్వవనప్రియ మంజువాణి
కటిభాగనిర్జితాఖండ మహాక్షోణి బాహుదండాగ్ర శుంభత్కృపాణి

గీ. పరమకల్యాణి కమలసంభవుని రాణి
పరమపద సౌధనిశ్రేణి ... ...
రాముఖాఖిల గీర్వాణి రాజమాన
ఘనకృపాదృష్టి మముఁబ్రోవఁగదవె వాణి.

ఆఱవయాశ్వాసమున 152 వ పద్యమిది. విపులీకరించబడిన గీర్వాణీ స్తోత్రములో రెండవ పద్యము.

మ. అనవద్యాగమ వేద్య సద్రుచిర కల్యాణ ప్రదున్దేవతా
జనచూడామణి నబ్జజాచ్యుత మహేశాన స్వరూపున్ ద్విజా
వన నైపుణ్యనిధిం గృశాను ననలు న్వహ్ని న్హుతాశిన్మఖిన్
నిను సేవించెద నెప్పుడున్నను గృప న్వీక్షింపు వైశ్వానరా

బ్రహ్మ పురాణమున గౌతముడు శివకేశవులను, గంగానదిని మూడు శ్లోకములలో స్తుతించెను. ఈ కావ్యమున గౌతముడు రెండు పద్యములలో శివుని, ఒక సుదీర్ఘమగు దండకమున విష్ణువును, మూడు పద్యములలో గంగాదేవిని కీర్తించెను.

క. పురదానవ మదహరణా
హరిహయనుత చరణ రాజతాచలశరణా
చిరకరుణాభరణా కి
న్నర పరివృఢ శరణ నీకు నతి శశిభరణా!

క. ఆదిత్య యక్షఫణి ర
క్షోదానవ సిద్ధసాధ్య సురనుత విలస
త్పాదారవింద యుగళీ
గోదావరి నను బవిత్రకుం జేయఁగదే.

ఇట్లు మూలమునందలి వర్ణనల విపులీకరించుచునే తిమ్మన్న ఇరువదియైదు పద్యములలో సాగర వర్ణనము కావించెను. వృద్ధా గౌతములు అగస్త్యుని దర్శనమునకు వెడలుచు సాగరమును గాంచుట కవి వర్ణించెను,

సీ. వృద్ధాంగనకు యువప్రియుఁడబ్బెఁబో యని నగియెడులీల ఫేనములు గ్రాల
నజు చెయ్యువ్వలిల్లెనో యని తద్ఘూర్ణిల్లు జాడల నిబిడఘోషములుమీఱ
ముని దంపతులఁగరంబులు చాఁచి డాయంగఁబిలుచు చందమున వీచులు దనర్ప
దగువారి కర్ఘ్యపాద్యము లిచ్చు వడువున శీకరాసారముల్చిందుచుండ

గీ. వినయగతి వారలకు నెమ్మి విశ్రమింపఁ
బీఠముల్పెట్టు చాడ్పునఁ బృథుల సైక
తములు రాజింప సొంపునఁ దనరుచున్న
యప్పయోరాశిఁ దడిసి రయ్యలఘు మతులు

సాగరమున కానవచ్చు నురుగు వృద్ధాగౌతముల నవహేళన మొనర్చెడి జనుల నవ్వువలెను, సాగరఘోషములు జనుల పరిహాసఘోషముల వలెను గలవని కవి వర్ణించుటలో నవ్యత్వము కలదు.

ఆఱవయాశ్వాసమున మొదటి నూటయిరువదియైదు పద్యములు మూలమందలి 19 నుండి 23 వఱకుగల ఐదు శ్లోకములాధారముగా పెంచి వ్రాయబడినవి. బ్రహ్మ పురాణమున ప్రధానమగు వృద్ధాగౌతముల వృత్తాంతమును స్వీకరించి మొదటి ఐదాశ్వాసములు, ఆఱవయాశ్వాసమున కొంతభాగమును తిమ్మకవి సృజించిన అవాంతర కథ తిమ్మన్న మూలమందలి అయిదు శ్లోకముల కథను పెంపొందించి ప్రధానమైన కథగా మలచెను. అట్లేమూలమందుగల ప్రధాన కథాభాగము నప్రధానముగ నతడు మలచెను. బ్రహ్మ పురాణమున గౌతమునికి తన కథ తెల్పుచు సుశ్యామ పుత్రిక తన తల్లిదండ్రులను గూర్చి యిట్లు తెల్పెను.

19) అర్ష్టి షేణ ప్రియః పుత్ర ఋతుధ్వజ ఇతిశ్రుతః ।
గుణవాన్మతి మాన్ధీరః క్షత్రధర్మ పరాయణః ॥

20) స కదా చిద్వనమ్ ప్రాయా న్మృగయా కృష్టచేతనః ।
విశ్రామ మకరో దస్యామ్ గుహాయామ్ స ఋతుధ్వజః ॥

21) యువా స మతిమా న్దక్షో బలేన మహతావృతః ।
తం విశ్రాన్తమ్ నృపవర మప్సరా దదృశే తతః ॥

22) గంధర్వ రాజస్య సుతా సుశ్యామా ఇతి విశ్రుతా।
తాం దృష్ట్వా చకమే రాజా రాజానమ్ చకమే చసా॥

23) రతిక్రీడా సమభవత్తయా రాజ్ఞో మహామతేః॥
నివృత్తకామో రాజేంద్రస్తయా పృష్టో గమద్గృహమ్॥

వర్ణనలు: తిమ్మకవి సృజనాత్మక శక్తివలన ఐదు శ్లోకములు ఐదున్నర ఆశ్వాసములయ్యెను. తన కావ్య కన్యక అఖిల రసికజన సంతత మనోభిరామము కావలెనని తిమ్మన యాకాంక్ష. తన కావ్యమున కతడు "రసికజన మనోభిరామము" అనియే పేరు పెట్టెను. ఇందు అష్టాదశ వర్ణనలు కాక మరియొక పదునెనిమిది వర్ణనముల నధికముగా చేసెను. రాజ, గజ, అశ్వ, కన్యాంగ, సౌందర్య, అరణ్య, మృగయా, దేహ్రద, ఆకాశగంగా, విలువిటీ, సభా, శాలిపాలికా, పుష్పలావికా, కిన్నర, మిథునక్రీడా, మణిహార, రాజసభా, పురకాంతా, శ్వాన, భృంగ వర్ణనములు ఇందు అధికముగా గలవు. రెండు అష్టాదశ వర్ణనలు "రసికజన మనోభిరామము" అను నీ కావ్యనామమును సార్థకము చేయుచున్నవి మరియు వివిధములగు ఛందోరీతులతో నిది పాఠకులకు ముదము గలిగించుచున్నది.

ఈ కావ్యమున కవి నవీనముగా చేసిన వర్ణనము రతిక్రీడా బంధ రీతులు. ఋతుధ్వజ మహారాజు సుశ్యామతో నొక భీకరారణ్యమున విహరించుచు నొక రమణీయ ప్రదేశమున గంధర్వులు సలిపిన మదనకేళి జాడలరసి ఆయా బంధములను గూర్చి సుశ్యామకు తెలిపెను. ఋతుధ్వజుడుచేసిన గంగానదీ వర్ణన:

తే. గీ. పరుసమిందుక సోకి యబ్రముగ నినుము
పసిఁడి యగునట్లు తావక ప్రవిమలాంబు
కణమొకించుక సోకిన ఖిల జనుండు
మిగులఁ బరిశుద్ధుఁడగు గదా గగన తటిని!    (2 ఆ. 36 ప.)

పరుసవేదిని స్పృశించిన ఇనుము బంగారమగునట్లు గంగాజలకణ

యొక్కటి సోకినను దుష్టుడు కూడ పరిశుద్ధుడగునని ఉపమింపబడెను.

ఋతుధ్వజుడు అరణ్యమున కావించిన శివ స్తోత్రమున కందాష్టకము, కందమణిగణనికర వృత్తము, సగర్భస్రగ్విణీభుజంగ ప్రయాత ద్రుతవిలంబిత వృత్తసీసము, సగర్భ, మత్తేభ, కంద, సీసము మున్నగు గర్భకవిత్వము తోఁ నలరారుచున్నది. ఇవి తిమ్మకవికి గల శబ్దాధికారమును, ఛందశ్శాస్త్ర పరిపూర్ణ జ్ఞానమును వ్యక్తీకరించుచున్నవి. మచ్చునకు కందాష్టకము నుండి యొక పద్యము ;

క నారద దర పారద శర
శారద శరదభ్ర కరితుషారాభ్ర ఝురీ
తారాహిత హీరామృత
ధారాసిత దేహా నీకు దండంబు శివా (2 ఆ. 49 ప)

శివ భక్తుడగుటచేత కథకు అవసరమైనను గాకున్నను శివస్తుతి చేసినట్లే షష్ఠాశ్వాసమున మహావిష్ణువును ఒక దండకమున స్తుతించెను. ఇది యాతని అద్వైత దృష్టిని తెల్పును.

వసంత ఋతు వర్ణన:

తే. గీ. పవన దుశ్శాసనుఁడు వనీ పాండవేయ
లలన జీర్ణచ్ఛదాంశుకంబులు హరింపఁ
గలికి శుకశుభోక్తిఁ జిరఁగిసలయ హేమ
మయ పటములీడె యయ్యెడ మాధవుండు (2 ఆ. 10 ప,)

వసంతావిర్భావమున వాయువు వృక్షాదుల జీర్ణ పత్రములడుల్చి వేయుగా, మాధవుడే తెంచినంతనే యవి కిసలయములతో ఒప్పును. ఈ వర్ణనలో తిమ్మన మహాభారతమునందలి ద్రౌపదీ వస్త్రాపహరణ ఘట్టమును నిపుణముగా నారోపించెను. పవనుడనెడి దుశ్శాసనుడు వనమందున్న పాండవేయపత్ని యొక్క జీర్ణ వస్త్రముల నపహరించగా, నా పాంచాలి చిలుకల పలుకులు అనెడి నెపమున పిలువగా మాధవుడు గిసలయములను బంగారు వస్త్రముల నిచ్చెనట. కమనీయమైన వర్ణనమిది.

తోట వర్ణన :

మ. పరిఘాంత ద్విలసద్భుజంగ యువతుల్ ప్రాకార శృంగాగ్రవి
స్ఫురద స్వప్న వధూమణీ జనులకున్ శుభ్రారవిందంబులం
పిరన న్మీఁదికి నేఁగు నంచల మరీచిబోష్ఠ లింద్రోపలోత్కర
మ్ములిమ్మటి వారి కంపిరన డిగ్గబాఱుఁదేటుల్ పురిన్ (1 ఆ. 37 ప)

ఆ పురమందు పరిఘలలోనుండు నాగకన్యకలు పట్టణ ప్రాకార శృంగముల అగ్రభాగముననున్న దేవకాంతలకు తెల్ల తామరపువ్వులను బంపరాయనునట్లు రాజహంసలు మీదికెగురుచుండెననియు, ఆ దేవ కాంతలు బదులుగా ఇంద్రనీలములను గానుకగా ఆ భుజంగ భామినులకు పంపిరాయనునట్లు భృంగములు క్రిందికి దిగుచుండెననియు ఉత్ప్రేక్షింపబడిన రమణీయ వర్ణనమిది. కావ్యములందు పుష్పలావికల యొక్కయు, విటులయొక్కయు వ్యంగోక్తుల వర్ణించుట పరిపాటి. అటులనే ఫలవిక్రేతలగు కన్నెల సరసోక్తులు వర్ణింపబడుచుండును. తిమ్మకవి ఈ కావ్యమున పుష్పలావికా వర్ణనముతో బాటు శాలిపాలీ వధూటీ వర్ణనము చేసి కావ్యమునకు నవ్యత్వమును గలిగించెను.

సీ. చామల కెందు నీ సరసతగలదె తొయ్యలి యన వరియింపు నిలిచి చూడు
పడతి నిన్నంటి వెల్వడమ కోర్కె ఫలించె నన రాజభోగమే యతికొయిల్లు
నారు గన్నను జిత్తమలరెడిఁజెలి యన్నమది కొప్పుగంటె వేమఱుఁ జెలంగుఁ
బలు కొట్టి చూపక నిలుమింతె యనిన నవ్వలఁగంది కైసైఁగ మెలఁపదగుసె
యనుచుఁ దముఁజేరి సెటిజాణతనము వెలయఁ
బలుకు సెల కోడె ప్రాయంపుఁబాంథ జనుల
కింపుఁదులకింప మాటామాట లిడుచు నుండు
శాలి పాలీ వధూటు లాప్రోలఁజాల. (1 ఆ 48 ప.)

పాంథులు శాలిపాలికలను 'చామలు' అను పేరు గల ధాన్యమునకు సరసత అనగా వెల యింతకలదా యని ప్రశ్నించిరి. శాలిపాలికలు వరి యొక్క ఇంపు చూచి మాటలాడుమనిరి. ఇందలి శ్లేష పరికింపుడు. చామలకు=కాంతలకు; ఎందును=ఎచటనైన; ఈ సరసత= మీచెంతనున్న సరసత్వముకలదా? అని పాంథజనుల ప్రశ్న. వరియింపు=

తనను వరించి నిలిచి చూడుమని సమాధానము. ప్రశ్నోత్తరములు రెండును వ్యంగ్యధోరణిని నడిచి, అర్థాంతరమును స్ఫురింపజేయుచున్నవి ఇట్లే మిగిలిన మూడు పాదములందును వెల్వడము, నారు, గంటెలు, కొఱ్ఱలు, కందులు - అను ధాన్య విశేషములను గూర్చి సాగిన ప్రశ్నోత్తరములలో రెండర్థములు వినిపించుచున్నవి. చక్కని వర్ణనమిది.

వసు చరిత్ర తరువాత నెందఱో కవులు రామరాజ భూషణుని యడుగు జాడలలో తమ కావ్య రచన చేయుచువచ్చిరి. అటువంటి కావ్యములకు 'పిల్ల వసు చరిత్రలు' అని పేరు వచ్చెను. మన తిమ్మన సృజించిన రసికజన మనోభిరామమునకు కూడ 'పిల్ల వసు చరిత్ర' అను ఖ్యాతి కలదు. పరిశీలించి చూడగా నీ కావ్యమునకు వసుచరిత్రతో సామ్యము చాల గలదు. కథాసంవిధానము నందేమి, శిల్పము నందేమి, శైలీవిన్యాసము నందేమి ఈ కావ్యము ముమ్మూర్తులా భట్టుమూర్తి కృతికి ప్రతికృతియే చంద్రోదయాది వర్ణన పర్యంతము వసుచరిత్రయే దీనికి మాతృక.

కథాసంవిధానము-సారూప్యము: వసుచరిత్రమున వసురాజు ఉద్యానవన పాలకుల కోర్కెపై వనమునకు వచ్చి గిరికాదేవి సంగీతముచేత నాకర్షింపబడి ఆమెను వలచెను. ఋతుధ్వజమహారాజు కిరాతుల కోర్కెపై క్రూరమృగముల వేటాడు నిమిత్తము అరణ్యమున కేగి, అచట సుశ్యామ సంగీతముచేత నాకర్షింపబడి అమెను వలచెను. వసురాజ ఋతుధ్వజు లిరువురు తొలుత తమ నర్మసచివులను నాయికల కడకంపి, తదుపరి తాము వెడలిరి. తరువాత నాయికా నాయకుల పరస్పర వీక్షణములు, అనురాగము, విరహము రెండు కావ్యములలో సమానముగా వర్ణింపబడెను.

భేదము: ఆ పైన కథలో కొలది మార్పులు గలవు. వసు

రాజుకడకు దూతగా గిరిక చెలికత్తెయగు మంజువాణి వెడలగా, ఋతుధ్వజుని చెంతకు దూతగా సుశ్యామ పెంపుడు చిలుక వెడలెను. తిమ్మన యిచ్చట మాత్రము ప్రభావతీప్రద్యుమ్నము, తపతీసంవరణోపాఖ్యానాది ప్రబంధములలో వలె చిలుకను రాయబారిగా చేసి, హారమొకటి గురుతుగా పంపినట్లు వ్రాసెను ఈ విధముగా కథను అనుసరించుటతో పాటు తిమ్మన వర్ణనములందు సహితము వసుచరిత్రకారుని అడుగు జాడలలో నడచెను. గిరికను వర్ణించుచు భట్టుమూర్తి తనకు సంగీతమందుగల అభిరుచిని తెలిపెను.

మ. పదమెత్తం గలహంసలీల యధరస్పందంబుసేయన్ శుభా
స్పదమౌ రాగకదంబకంబు శ్రుతి చూపన్ శ్రీ విలాసంబుకే
ల్గదలింపన్ సుకుమార పల్లవ నవైలాలక్ష్మీ వీక్షింప ప
ట్పదియుం బొల్చెఁదరంబె కన్నెఁగొనియాడన్ గేయ వాక్ప్రౌఢిమన్

వసుచరిత్ర తృతీయాశ్వాసములో 59వ పద్యమున గిరిక సౌందర్యమును, ఆమె గేయ వాక్ప్రౌఢిమను భట్టుమూర్తి కమనీయముగా, సహృదయ రంజకముగా వర్ణించినాడు. ఇందు కలహంసరాగము, శ్రీరాగము, రాగ కదంబకములు మొదలైన రాగములు పేర్కొనబడెను. ఈ పద్యమునందలి మక్కువచేత తిమ్మకవియు తన కథానాయిక సుశ్యామను సంగీత విద్యావిశారదగా తీర్చి దిద్దెను. మీదుమిక్కిలి సుశ్యామ గంధర్వకాంత కనుక గాంధర్వము ఆమె సొమ్ము వసుచరిత్ర పద్యము ననుసరించినను తిమ్మకవి స్వకీయమౌ ప్రతిభతో సుశ్యామ సౌందర్య వర్ణనము కావించెను.

సీ॥ సరస సారంగాతిశయరూఢిఁ దనర్చెఁబొలఁతి వాల్చూపులు పొలుపుమీఱి
లాలిత గతిని వరాళి వైఖరిఁ బొల్చెఁ బల్లవపాణి ధమ్మిల్లగరిమ
శంకరాభరణంబు సౌష్ఠవంబును మించె భామినీరత్నంబు రోమరాజి
రహిని బున్నాగాభిరామలీల నెసంగె నీల నీలాలక నిమ్ననాభి

తే. గీ. యహహా! యీ చాన గాన విద్యావిధాన
మునఁ జెలఁగి రాగమొనగూర్చుచొనరె దీనిఁ
గన్న మృగ ఖగ పన్నగాగమము లెలమి
నుల్ల సిల్లవె యవి సోలుచున్న యెడల.

రసికజనమనోభిరామమున 3వ ఆశ్వాసములో 5వ పద్యము తిమ్మకవి కల్పనా చమత్కృతికిది చక్కని యుదాహరణము. రామరాజ భూషణుడు గిరిక యొక్క గమనమును, పెదవుల కదలికను, వీనులను, హస్త చలనమును, చూపులను వర్ణించి ఉదాత్తవైఖరిని ప్రదర్శించెను. తిమ్మకవి సుశ్యామ వాలుచూపులను, ధమ్మిల్లమును, రోమరాజిని, నిమ్ననాభిని వర్ణించి రసికజనుల మనస్సులకు ఆనందమును గలిగించెను. తిమ్మన్నయిచట సారంగ, వరాళి, శంకరాభరణ, పున్నాగ రాగములను లేడి, నెమలి, సర్పము, వృక్షములను దృష్టియందుంచుకొని ప్రయోగించెను. రామరాజ భూషణుని పద్యము నాయిక సంగీత నైపుణ్యముతో బాటు నాట్య విలాసమును విశదీకరించుచున్నది. తిమ్మకవి పద్యము నాయిక అంగాంగ సౌందర్యమును వెలార్చుచున్నది.

వసుచరిత్రలో నాయిక విరహజ్వరముతో బాధపడుటవలన చెలికత్తెలు శీతలోపచారములను నిషేధించిరి. 3వ ఆశ్వాసము 180వ పద్యమున కవి శీతలోపచారములను పరిహరించెను.

సీ. మోహోపదేశ తమోముద్రితములైన కనుదమ్ముల హిమాంబులనుపరాదు
శ్రమదిందు తారకాగమ ఖిన్నకుచ కోకములఁ జంద్రనామంబుఁదలఁపరాదు
శిర్యదాశావృంత శిథిలితాసులతాంతమసియాడ వీవనల్వీసరాదు
పటు తాప పుటపాక పరిహీనతను హేమమింకఁ

తే॥ గీ॥ లలన కానంగ కేలి కీలాకలాప
సంతతాలీఢ హృదయ పాత్రాంతరాళ
పూరిత స్నేహపూరంబు పొంగి పొరలఁ
జల్లని పటీర సలిలంబు జల్లరాదు.

విరహార్తులకు శీతలోపచారములు పనిచేయకపోగా ఆ విరహతాపమును అధికము చేయును. హిమాంబువులు పడినంతనే కమలము ముకుళించుకొనును. అటులనే గిరిక కన్నులనెడి కమలములు హిమాంబువులు జల్లుటతోడనే ముకుళించుకొనును. కనుక నవి పరిహరింపబడెను. ఇట్లే మిగిలిన పాదములందును శిశిరోపచారములు నిషేధింపబడెను. తిమ్మకవి తన కావ్యనాయికయగు సుశ్యామ మదనజ్వరము

తొలగించుటకు కొన్ని ఆయుర్వేదౌషధములు సూచించి, మరల నవి వలదని చెప్పెను.

సీ॥ పూర్ణచంద్రోదయంబునఁ బోవదింతియు నెడప కంతంతకు హెచ్చుఁగాని
వాత రాక్షస యుక్తి వదలదు దద్దయు మించి యంగనలఁ గుదించు గాని
పసనెసంగు వసంతకుసుమాకరంబునఁ బాయదు మఱి మఱి ప్రబలుఁ గాని

తే॥ గీ॥ నీలకంఠరసంబున ప్రీతి చనక
లోఁగఁ జేయదు నవ యింక లోకనాథ
రస మహాయోగమునఁ గాని రమణిమేని
విరహతాప జ్వరంబెల్ల విడువదమ్మ. (4 ఆ 159 ప.)

సుశ్యామ జ్వరమునకు తగిన యౌషధము వాడవలెనని చెలులు అలోచింపనాగిరి. పూర్ణచంద్రోదయము, వాతరాక్షసము, వసంత కుసుమాకరము, మదనకామేశ్వరము అను ఔషధములను వాడుట వలన మదనజ్వరము మానకపోగా అధికమగును. అవి యన్నియు మదనోద్దీపకములు. కనుక చెలులు వానినన్నిటిని విడచి లోకనాథ రసమహాయోగమే సరియైన మందుగా భావించిరి. ఋతుధ్వజుడు లోకనాథుడు. ఆ లోకనాథునితోడి సంయోగమే సుశ్యామకు తగిన మందని వారు నిర్ణయించిరి. వసుచరిత్ర కర్త చెప్పిన నిషేధమును గ్రహించి తిమ్మకవి సరిక్రొత్త రీతిని ఈ పద్య రచన చేసెను. జ్వరమునకు ఔషధమును సేవించవలెను. కాని సుశ్యామ జ్వరము విరహసంబంధి యగుట చేత, ఆయౌషధ సేవనము నిషేధింపబడెను. వసుచరిత్ర ననుసరించియు స్వతంత్రమగురీతిని ప్రతిభావంతముగా రచియింపబడినదీ పద్యము.

వసుచరిత్రమున వసురాజు సచివుడు మిత్రుని పనుపున చెట్టు చాటునదాగి గిరికను చూచుట యిట్లు వర్ణింపబడెను.

చ. తరువుల పొంతఁ బొంచి వసుధావరమిత్రుఁడు గాంచె నచ్చట
దరుణిఁ దమో వినీలకచఁ దామరసోదర సోదర ప్రభం
దరళ విలోచనం దత నితంబఁ దటిన్నిభ గాత్రి వల్లరిం
దరుణ శశాంక ఫాలనొక తన్విఁ దరంగవళిం దలోదరిన్. (2 ఆ. 25 ప.)

ఈ పద్యమును ననుసరించి తిమ్మకవి తన కావ్యనాయికాని చెలికాడు సుశ్యామాదుల వీక్షించు ఘట్టమున నొక పద్యము వ్రాసెను. అది చంపకము. ఇది మత్తేభము.

మ. తరుమూలంబుల పొంతఁ బొంచి సచివోత్తంసంబు వీక్షించె భా
స్వరకార్తస్వర విగ్రహ న్సమద చంచచ్చంచరీకాలకన్
శరదిందు ప్రతిమాన చంద్రవదనం జక్రస్తని న్విస్ఫుర
త్సరసీజాతి దళాయతాక్షి నొక కాంతాలోక చూడామణిన్

అతడు వసుధావర మిత్రుడు; ఇతడు సచివోత్తంసంబు. ఆమె తరుణి; ఈమె కాంతాలోక చూడామణి. ఆమె తరళవిలోచన; ఈమె విస్ఫురత్సరసీజాతి దళాయతాక్షి. గిరికది తిమోవినీలకచభరము; సుశ్యామవి సమద చంచచ్చంచరీకాలకములు. ఆమెది తామరసోదర సోదర కాంతి సుశ్యామ వదనము శరదిందు ప్రతిమానచంద్రము. అట గిరిక నితంబము, తిటన్నిభగాత్రివల్లరి, శశాంకఫాలము, తరంగ సమమైనవళి, సమతలోదరము వర్ణితములు. ఇట సుశ్యామ భాస్వరకార్తస్వర విగ్రహము, చక్రస్తనములు వర్ణితములు. మొత్తముమీద తిమ్మన భట్టుమూర్తి పద్యమునను సరించియు, తన స్వీయ ప్రతిభావ్యుత్పత్తుల నిట ప్రదర్శించెను. మనుచరిత్రాది ప్రబంధములలో కవులు నాయికల ఏడ్పును ప్రత్యేకముగా వర్ణించిరి. వసుచరిత్రకారుడు 4 ఆ. 52 ప. న రాజీవాననయైన గిరిక జాబిలి వెలుంగు వెల్లికల డాయగలేక కిన్నర కాంత వీణపై మేళవించు కాంభోజిరాగమున నేడ్చినట్లు వర్ణింపగా తిమ్మకవి,

తే॥ వ్రీడవతి యేడ్చె నెలుఁగెత్తి వెక్కి వెక్కి
యశ్రుపూరంబు కుచగిరులంటి పాఱఁ
గిన్నరీపాణి పంకజాంకిత సువర్ణ
వల్లకీరావ సదృశ భాస్వద్గళమున (4 ఆ 183ప)

అని వర్ణించెను. సుశ్యామ వ్రీడవతియైనను ఎలుగెత్తి వెక్కి వెక్కి ఏడ్చెను. అనగా నామెకు విరహతాపము దుస్సహమై సహజమైన లజ్జకూడ వీడగా నెలుంగెత్తి యేడ్చెను గంధర్వులు గానమున, కిన్నరులు

వీణావాదనమున సిద్ధ హస్తులు. కనుక వసుచరిత్ర కర్త "కిన్నర వధూ రాజత్కరాంభోజ కాంభోజీ మేళవిపంచికారవము" న గిరిక నేడ్పించెను. తిమ్మకవియు సుశ్యామ ఏడ్పును "కిన్నరీ పాణి పంకజాంకిత వల్లకీరావ సదృశ"మని యుపమించెను.

తిమ్మన అద్దంకి గంగాధరకవి ననుసరించిన తావులును గలవు. గంగాధరుని 'తపతీ సంవరణోపాఖ్యానము'న నాయకుడు చిలుకను జూచిన తోడనే 'కాయా పండా?' యని యడిగినట్లు 2 ఆ. 97 వ పద్యమున కలదు.

ఉ. ఆ యవనీశు డీకరణి నంగభవానల బాధ్యమానుడై
ఆహాయని వెచ్చనూర్చు నకటా! యని దైవము దూఱుఁబచ్చపు
ల్గాయెడ నడ్డమైనఁ దన యుర్మిలి దూత యటంచుఁ గాయ పం
డాయని కార్యపద్ధతుల నొయ్యన వేడును భ్రాంత చిత్తుడై.

తిమ్మకవి కావ్యమున సుశ్యామ ఋతుధ్వజునికడ కంపిన పెంపుడు చిలుక వచ్చినతోడనే

క. అండజ సత్కుల మండన!
నిండారు ముదంబుతోడ నిక్కము చెపుమా
గుండియ లదరెడుఁ గాయో
పండో నీ వేగినట్టి పని వైళమునన్. ( 3 ఆ. 75 ప. )

అని ప్రశ్నించును. తపతీసంవరణమున నాయకుడు మదనవేదనచేత విభ్రాంతచిత్తుడై మార్గమున బోవుచిలుకను జూచి తన దూత యని భ్రాంతి చెంది 'కాయా పండా?' అని యడుగుటయు సమంజసమే. రసికజనమనోభిరామమున నాయిక సుశ్యామ మన్మథాగ్నిచేత దహింపబడియు ధీరయై భ్రాంతి చెందక పోయినను కార్య ఫలమును గూర్చి గుండియ లదరుచుండగా తన నెచ్చెలియగు చిలుకను జూచి కాయో పండో వేగముగా తెల్పుమని వేగిరపడెను.

తిమ్మకవి ఏ కవినీ అనుసరించక స్వతంత్రముగా రచియించిన పద్యములు ప్రతిభావంతములై యలరారుచున్నవి. సుశ్యామ విరహ వేదన సహింపలేకపోవుచున్నది. తుమ్మెదలు, చిలుకలు, హంసలు, చకోరములు ఆమెను మిగుల బాధించుచున్నవి. ఆయా పక్షులను వైదొలగించుటకు సుశ్యామ చెలులను ప్రయత్నించ మనుచున్నది.

సీ॥ కనకాభిషేకంబుఁగావించి గద్దఱి తేఁటిమూటువుల బ్రార్థించరమ్మ
సాంకవ గంధమంఛల్లీల నర్పించి కీరరాజముల నగ్గింపరమ్మ
ఘనవైభవోన్నతి నెనయించి కాదంబ వితతులఁబలుమఱు వేఁడరమ్మ
ధవళాంశుకస్ఫూర్తి దనరించి టక్కరి జక్కవగములకు మ్రొక్కరమ్మ

తే॥ గీ॥ కాకయుండిన కడలేని ధాక మెఱయ
మూకలుగఁగూడి దొసగుల ముంచుచుందు
నహహ చెలులార! తొంటినెయ్యంబు విడక
కనికరము మీఱ నివ్వేళ మనుపరమ్మ. ( 4 ఆ. 164వ ప. )

తుమ్మెదలకు కనకాభిషేకము చేసి సుశ్యామ చెంతకు రావలదని ప్రార్థింపవలెనట. ఇట నొక చమత్కారము కలదు. కనకము అనగా సంపెంగపువ్వు, ఆ సంపెంగ యొక్క వాసన తేటిని మూర్ఛిల్ల జేయును. అటులనే సంకుమదము వాసనచూచి చిలుకలు పిల్లి యను భ్రాంతితో తొలగిపోవును. మేఘముల వైభవము చూచిన హంసలు సమీపమునకు రావు. విరహోద్దీపకములగు తేంట్లు, చిలుకలు, హంసలు, చకోరములు మున్నగు వానిని తొలగించుటకు వాని శాత్రవ కోటిని దరిచేర్చవలెను. ఈ చమత్కృతి ప్రాచీన కవులలోను కానవగును.

రసికజనమనోభిరామమై అలరారు నీ కావ్యమున శృంగారము అంగిరసమనుట నిర్వివాదమైన అంశము. అద్భుత రౌద్ర రసచ్ఛాయలు నిందు గలవు. ద్వితీయాశ్వాసమున పరస్పర వీక్షణము తరు వాత నాయికా నాయకులు పంచమాశ్వాసమున చిలుక దౌత్యము

వఱకు విరహావస్థ యందుండిరి. నాయికా నాయకుల విరహావర్ణనము, వారి అంగాంగ వర్ణనము అతిగా కన్పట్టును.

ఇట్లీ కావ్యము అలంకార శోభ, వర్ణనా వైభవము, చమత్కార వైశిష్ట్యము, శయ్యావిన్యాసము, రసపోషణములతో ఒప్పుచు తిమ్మకవి పాండిత్యము వెల్లడి చేయుచు, రసికజనులకు మనోభిరామమై ప్రకాశించుచున్నది.

## శ్రీ సర్పపుర మాహాత్మ్యము

మూడాశ్వాసముల ఈ ముద్దు కావ్యము క్రీ॥ శ॥ 1949 లో కాకినాడ జార్జి ప్రెస్సున ముద్రితమై, సర్పవర దేవస్థానమువారిచే ప్రకటితమయ్యెను. ఈ కావ్యమున 335 పద్యములు గలవు. సర్పపుర మాహాత్మ్యము క్షేత్రజ్ఞుడైన శ్రీ భావనారాయణ స్వామివారి కంకితము చేయబడెను.

కథాసారము.

నాగమాతయగు కద్రువచే శపింపబడిన అనంతుడను సర్పరాజు తీర్థాటనము చేసి త్రిమూర్తులను గూర్చి ఘోర తపమాచరించి, నిత్యము శ్రీ మహావిష్ణువు శయ్య యగునట్లు వరమొందెను. అనంతుడు తపస్సు చేసిన సరోవరము అనంతసరసి అను పేర ప్రసిద్ధి చెందుననియు, ఆ ప్రదేశము దివ్యక్షేత్రమై సర్పపురమని పిలువబడుననియు, నారదుని అనుగ్రహించుటకై తానాతావున వెలసితిననియు చెప్పి శ్రీహరి అంతర్హితుడాయెను.

నారదమహాముని వృత్తాంతము :

నారదు డొకనాడు బ్రహ్మ చెంతకేగి తానొక్కడనే విష్ణుమాయకు లోబడనని అహంకారముతో పలికెను. నారదుని గర్వము

నకు కోపించిన బ్రహ్మదేవుడు విష్ణుమాయకు అతడు లోనగునట్లు శపించెను. నారదుడాపలుకులను గణింపక యథా ప్రకారము సంచరించుచు నొకనాడు భూలోకమున కేగెను. సర్వవర ప్రాంతమున నతడు సంచరించుచుండగా సంధ్యాసమయ మయ్యెను. సంధ్యావందన మాచరించుటకా బ్రహ్మమానస పుత్రుడు జలార్థము వెదకుచుండ, విష్ణుమాయచే నటనొక కొలను కానవచ్చెను. ఆ జలాశయము చూచి, సంతోషించిన నారదుడు తన వీణను తీరమున నుంచి, స్నానార్థము ఆ సరసిలో మునిగెను. అంత నతడత్యద్భుతముగా స్త్రీత్వమునంది, విష్ణుమాయచేత నాక్రమింపబడిన వాడగుట తనను తా మరచి సుదతి యను పేరుతో ఆ వనమున తిరుగాడుచుండెను. పిఠాపురము నేలుచున్న నికుండుడను రాజు వేటకై ఆ వనమునకు వచ్చి సుదతిని జూచి వలపుజనింప, ఆమెను పరిణయమాడి పిఠాపురమునకు తీసికొనివచ్చెను. వారు అన్యోన్య రాగబద్ధులై బహుకాలముండి నూరుగురు సుతులను గాంచిరి. నికుండమహారాజునకు రిపుంజయుడను రాజుతో యుద్ధము జరిగెను. ఆ రణరంగమున నికుండుడు శతపుత్ర సమేతుడై వీరోచితముగా పోరాడి వీరస్వర్గ మలంకరించెను. పతీసుతుల మరణమునకు అమితముగా శోకించిన సుదతి కొంతసేపటికి క్షుద్బాధాపీడితయయ్యెను. హరి సుదతీరూపమున నున్న నారదునికి తన మాయ చూపుటకై ఆ సమీపమున నొక ఫలవృక్షమును సృజించెను. క్షుత్పీడిత యగు సుదతి చెట్టు కొననున్న ఫలము నందుకొనుటకై ప్రయత్నించి, అందుకొనజాలక పోవుటచేత తనయుల శవములన్నిటిని ఒకదానిపై నొకటి పేర్చుచు యత్నము చేయుచునేయుండెను. అంత శ్రీమన్నారాయణుడు విప్రరూపముననేతెంచి, స్నానమొనరించి శుచియైన గాని ఫలము చేతికందదని ఆమెకు తెల్పి, సరోవరమునకు దారిచూపి వెడలిపోయెను. సుదతి సరస్సును జేరి అందు మునిగి పైకి లేచెను. ఆశ్చర్యకరముగా సుదతి నారదుడయ్యెను. నారదుడంతట జరిగిన వృత్తాంతము విష్ణుమాయయని గ్రహించి, తన గర్వమునకు పశ్చాత్తాపమం

దెను. వెంటనే ఆముని ఆర్తితో హరిని ప్రార్థింపగా నా భగవంతుడ తనిని కటాక్షించి, నారదుడు స్నానము చేసిన కొలను "ముక్తికా సారము" అను పేర ప్రసిద్ధిచెంది, అందు స్నాన మొనరించినవారి పాపములు నశించునట్లు వరమిచ్చెను. ఇదియే నారద గుండము. హరి యనుమతిపై నారదమునీంద్రుడుచట నమ్మహాదేవుని విగ్రహమును 'భావనారాయణస్వామి' అను పేరుతో ప్రతిష్ఠించెను.

తిమ్మకవి ఈ కథను బ్రహ్మకైవర్తనామక పురాణము నుండి గ్రహించితినని మూడవ యాశ్వాసము నూట పదునెనిమిదవ పద్య మున తెలిపెను. కాని ఆ పురాణమందీకథ లేదు.

వర్ణనలు :

ఈ కావ్యమునసర్పపుర ( 1 ఆ. 49_54 ప. ) ( 2ఆ. 3_5 ప. ), పీఠికాపుర ( 2 ఆ. 19, 20 ప. ), చంద్రోదయ ( 2 ఆ. 59 ప. ), ఉద్యానవన ( 2 ఆ 97, 98 ప ), శరదృతు ( 2 ఆ. 22, 23 ప. ), సరోవర ( 2 ఆ 8, 96ప ), యుద్ధ ( 2 ఆ. 66 ప. ), మృగయా ( 2 ఆ. 24_30 ప. ), రాజ ( 2 ఆ. 15_18 ప. ), కన్యాంగ సౌందర్య ( 2 ఆ. 34_42 ప. ) వర్ణనలుగలవు.

పీఠికాపుర వర్ణనము :

సీ॥ దేవ దేవుండు కుంతీమాధవస్వామి
దలఁగకేపురమున నిలిచియుండె
దివిజనాయక సంప్రతిష్ఠితుండై కుక్కు
టేశ్వరుడే వీట నిరవుకొనియెఁ
బృథుతరాష్టాదశ పీఠంబులకుఁ బెద్ద
పురుహూతికాంబ యేప్రోల వెలసెఁ
దను పావనమైన పాదగయాక్షేత్ర
మే రాజధాని యందేపుమీఱె

తే॥ గీ॥ సేతు కాశీ ప్రయాగాద్యశేష దివ్య
తీర్థరాజంబు లట్లు ప్రశస్తిగాంచె
నే మహా పట్టణంబది యెన్న నలరు
భువన సారంబు పీఠికాపుర వరంబు.

2వ యాశ్వాసము నందలి పందొమ్మిదవ పద్యమిది. ఇది శ్రీనాథుని భీమఖండము లోని "ఏ పట్టణము ప్రోల నేలేఱు ప్రవహించు......" అను పద్యమున కనుకృతిగా కన్పట్టినను స్వతంత్ర వర్ణనా ప్రావీణ్యము, కవి ప్రతిభయు నిందు గన్పట్టుచుండెను. భీమఖండమున ఏలేఱు, మున్నూట యరువది మూర్తి భేదములతో నుండు వేల్పుపిండు, కుంతీమహాదేవి కూర్మి మేనల్లుడు మాధవుండు, పీఠాంబ చెలియోగపీఠి హుంకృతి దుర్గ, వ్రీడా హీన జఘనుడైన భైరవుడు వర్ణింపబడగా, సర్వపురమాహాత్మ్యమున కుంతీమాధవస్వామి, పురుహూతికాంబలతో బాటు, కుక్కుటేశ్వర మహాదేవుడు, పాద గయా క్షేత్రములు వర్ణితములయ్యెను. ఇచట ఏలేటి వర్ణన, భైరవుని ప్రసక్తి విడువబడెను. ఇంతేకాక ఆ పద్య శిల్పమునందు భేదము కలదు. ఈ తీరున కవి సార్వభౌముడైన శ్రీనాథుని యందలి గౌరవముచేత అనుకరించుచునే తిమ్మన స్వీయప్రతిభను చాటుకొనినాడు.

సుదతి వర్ణన:

కావ్యములందు కన్యాంగ సౌందర్య వర్ణనము చేయుట పరిపాటి. సర్వవర ప్రాంతమున సంధ్యావందన మాచరించుటకై జలకములాడబోయిన నారదుడు స్త్రీత్వమునంది వనములో సంచరించుచుండుట. అట్టి సుదతి వర్ణన మిది.

సీ॥ కర కంకణంబులు ఘల్లు ఘల్లని మ్రోయ
బదముల నందియల్ రొదయొనర్పఁ
గాంచికా ఘంటికా ఘణ ఘణ ధ్వనులొప్ప
ముత్యాల చేర్చుక్క మొగినటింపఁ

దాటంక మణిరుచుల్ తళుకుఁ జెక్కులఁ బర్వఁ
గ్రొమ్ముడి వీపున గునిసియాడఁ
గులుకు గుబ్బలు పైటసెలసి పింపిసలాడ
నలఁతి చెమ్మటమేన నంకురింప
గీ॥ హారకేయూర రత్నాంగుళీయ
కారవమ్ము తద్దయు హరువు చూపఁ
గడిఁది కలపంబు సెత్తావిఁ గ్రమ్ముకొనఁగ
వనిఁ జరించుచుండె నవ్వనజ వదన.

రెండవ యాశ్వాసమున పదమూడవ పద్యమిది. ఇచట కన్యాంగ సౌందర్యముతో బాటు కొన్ని ఆభరణ విశేషములు వర్ణిత ములయ్యెను. కంకణములు, అందెలు, కాంచికాఘంటికలు, ముత్యాల చేర్చుక్క, తాటంకమణులు, హారములు, కేయూరములు, రత్నాం గుళీయకములు ఇత్యాది అలంకారములు ధరించిన సుదతి వాని మృదు మధురమైన ధ్వని సందడింపగా వనములో చరించుచుండెనని స్వభావ మధురముగా వర్ణింపబడెను. ఈ కావ్యమున అలంకార ప్రాభవము తక్కువ. అత్యధికభాగము స్వభావోక్తియు, మితముగా ఉపమాన క్రమ సందేహాలంకారములు నిందు గలవు. తిక్కన యితర కావ్య ములలో చంద్రోదయ వర్ణనము ఐదారు పద్యములలో చేసియుండెను. ఇందు మాత్రము అతడు ఒక్క పద్యమందే సూర్యుడస్తమించుట నుండి పండు వెన్నెలలు గాయువఱకు వర్ణించి అల్పాక్షరములలో ననల్పార్థ రచన చేసెను.

సీ॥ తరణి పశ్చిమ సముద్రపాంతమునఁ గ్రుంకె
గణితంపు సాంధ్యరాగంబు పర్వెఁ
గటిక చీఁకటులు దిక్తటుల గిరికొనెఁ
తార లంబర వీధి దళముకొనియెఁ
గొలఁకులఁ దొగలును గలువలు వికసించె
జలజాత విసరముల్ దలలు వాంచెఁ
గుముద బంధుఁడు తూర్పు గుబ్బలి నుదయించెఁ
గోక దంపతులార్తి గూడి పఱచెఁ

గీ॥ తెలcగి బలితంపుc బండు వెన్నెలలుcగాచె
విటవిటీ జను లెనలేని వేడ్కతోడc
దవిలి విహరింప సాగి రుద్దామ లీల
నఖిల జంతు సుఖావహంబయ్యెనపుడు.

సూర్యాస్తమయము, సాంధ్య రాగము, అంధకారవ్యాపనము, తారకలుదయించుట, కలువల వికాసము, కమలములు ముకుళించుట, చంద్రుడుదయించుట, కోక దంపతుల ఆర్తి తొలగుట, పండు వెన్నెలలు గాయుట-మున్నగునవి యీ సీ స ము న స్వభావ రమ్యముగా వర్ణింపబడెను. నారద గుండమున మునిగిన సుదతి యథాప్రకారము నారదత్వము నందుట మూడవ యాశ్వాసము నాల్గవ పద్యములో గలదు.

తే॥ గీ॥ జలధి లోపల వెడలిన శశియుc బోలె
నిలిచి యత్యద్భుతిం బాత్మ నివ్వటిల్ల
స్త్రీత్వ సంపత్సుతాది విస్తీర్ణ పూర్వ
వర్తనం బెల్ల స్వప్న కల్పముగ c దలచె.

చంద్రుని వలె ధవళ కాంతి గల నారద ముని కొలనులో నుండి వచ్చునపుడు సాగరము నుండి వెల్వడిన చంద్రునివలె నుండె నని తిమ్మకవి ఉపమించుట మనోజ్ఞముగా నున్నది. వి ష్ణు వు ను నారదుడు స్తోత్రము చేసిన సమయ మందలి దండకము, ఒ క టి రెండు సీస పద్యములు సంస్కృత భాషలో రచించి తి మ్మ న తనకు సంస్కృ భాషతో గల పరిచయమును వెల్లడించెను.

మూడవ యాశ్వాసమందలి పదునాల్గవ పద్యము చూడుడు.

సీ॥ సనకాది ముని మనస్సరసిజ భ్రమరాయ
వారణేంద్ర విపన్నివారణాయ
శతమఖ ప్రముఖ నిర్జరగణ ప్రణుతాయ
ఘోర సంసారాబ్ధి తారణాయ

నలిన గర్భాణ్డల బృహజ్జఠరాయ
　　ఘోరదైతేయ విదారణాయ
కమలా వధూ ముఖ కమలాబ్జ మిత్రాయ
　　దర సందర్శన శార్ఙ్గ ధారణాయ
గీ॥ ఘనతరాశేష భువనైక కారణాయ
సతత పాలితముని (సిద్ధ) చారణాయ
సర్వనగరానవరత ప్రచారణాయ
భావనారాయణాయ తుభ్యం నమోస్తు.

తిమ్మకవి తాను "సంస్కృతాంధ్ర లక్షణ కళా కౌశలాభిరాముడ" నని ఆశ్వాసాంత గద్యలో చెప్పిన దానికి తగినట్లుగానున్న దీపద్యము.

సర్వపుర మాహాత్మ్యము అడుగడుగునను భక్తి పూర్ణములగు దేవతా స్తోత్రములతో నిండియున్నను, నడుమ నారద మహర్షి స్త్రీ జన్మ కథనముతో నించుక ప్రబంధత్వము సంతరించుకొని క్షేత్ర మాహాత్మ్యమునకు ప్రబంధత్వము తోడగుచున్నది.

## శివలీలా విలాసము

శివలీలావిలాసము తిమ్మకవి కడపటి కావ్యము. మూడువందల యేబది ఎనిమిది పద్యములు రెండాశ్వాసములలో గల ఈకావ్యము వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్సువారిచేత వావిళ్ల ముద్రణా లయమున ముద్రింపబడి క్రీ॥శ॥ 1921లో ప్రకటితమయ్యెను. ఈచిన్న ప్రబంధమును ముప్పదియొక్క దినములలో వ్రాసితినని తిమ్మన తెలిపెను. కవిసార్వభౌముడు శ్రీనాథుడు చివరి కావ్యముగా హరవిలాసమను కావ్యము వ్రాసినట్లే, మన తిమ్మకవిసార్వభౌముడును శివలీలా విలాసము చివరగా వ్రాసెను. అయినను ఈగ్రంథము హరవిలాసము కంటె భిన్నముగా నుండును. ఇందు పరమశివుని లీలలను వర్ణించక తిమ్మన గంగాశివుల పరిణయగాథ మాత్రము తెలిపెను. కనుకనీకావ్యమునకు "గంగా పరిణయము" అని పేరిడిన సార్థకమయ్యెడిది. ఐనను

గంగను పరిణయమాడుటయు శివుని లీలయే గనుక ఒక్క లీలయైనను కావచ్చును. కావున "శివలీలావిలాసము" అను నామము కూడ అన్వర్థ మగుచున్నది.

కథాసారము:

సృష్ట్యాదిని బ్రహ్మ తొలుత ఉదకము సృజించి, అందు తన వీర్యమును విడువగా నది యండమై అందు సకల చరాచర జగతు నుద్భవించెను. మూషికాసురుడను సురద్వేషి ఆ యండమునకు బిల మొనర్పగా నందుండి జలము లోనికి ప్రవేశించి జగములను ముంచి వేయ నారంభించెను. అంత శంకరుడు జగశ్శాంతికై గంగను జటాజూటమున ధరించెను. గంగ అచట నిలువలేక యుప్పొంగెను. శ్రీ మహావిష్ణువు మూషికాసురుని వధించి, అండబిలమును తన పదాంగుష్ఠమున కప్పివేసెను. ఆ సందునుండి కొంచెము జలము ప్రవహించుచుండెను. అట్లు ప్రవహించుచున్న గంగ తనను మించినవారు లేరని గర్వించగా శివుడు కోపముతో భూలోకమున మత్స్యకన్యవై జన్మింపుమని గంగను శపించెను. హరుని వీడి జీవించలేననియు, కరుణించమనియు గంగ ప్రార్థించగా నా పరాత్పరుడు భూలోకమున జన్మించిన గంగను తాను పరిణయమాడుదునని చెప్పెను గంగ దాసకన్యా రూపముతో భూలోకమునకు వచ్చి సాగర తీరమున తాపసవృత్తి నవలంబించెను ఒకనాడు శంఖదేవుడు అను జాలరి ఆమెనుగాంచి తపస్సునకు కారణమడుగగోరెను. గంగ తన శాప వృత్తాంతము తెలిపి, తనను సుతగా గ్రహింపుమని శంఖదేవుని కోరెను. అపుత్రకుడగు నా జాలరియు ఆనందముతో అంగీకరించి, గంగను వెంటనిడుకొనిపోయి, తన భార్యయగు చక్రమదేవి కొసగెను. నారదునివలన గంగాదేవి వృత్తాంతము నెఱిగిన శివుడు జంగమవేషధారియై భూలోకమందలి శంఖదేవుని నివాసమగు ఏలూరు

పట్టణమందలి ఉద్యానవనమున ప్రవేశించెను. అదే సమయమున గంగాదేవి చెలికత్తెలతో నచటికి వచ్చెను. జంగమవేషధారి తనను వివాహ మాడవలసినదిగా ఆమెను కోరెను. శివుని గుర్తించలేని గంగాదేవి యాతని పరసతీలోలుడని నిందించి ఉద్యానవనమునుండి నిష్క్రమించెను. కాని గంగయు నాజంగమయ్యను వలచి విరహార్తితోనుండెను. చెలులు నిదురపోవు సమయమందామె జంగమదేవర కొఱకు ఏకాంతముగా శృంగారవనికి వెడలెను. ఆమెకచట జంగమదేవర కన్పించలేదు. అందుచేత నామె విరహవేదన పడుచుండగా మేల్కాంచిన చెలులు గంగ నిమిత్తము శృంగారవనికి వచ్చి ఆమెను శుద్ధాంతమునకు కొనిపోయిరి. చెలికత్తెలు గంగా జంగమయ్యల యుదంతము శంఖదేవునికి వినిపించిరి. జంగమదేవరను వలచుట తగదని చెప్పి శంఖదేవుడు తనయనెంతయు లాలించెను. ఆమె తాను జాహ్నవీ గంగనని, జంగమదేవుడాదిదేవుడైన శివుడని జనకునికి తెలిపి, తానాతనినే పరిణయము చేసికొందునని పలికెను. శంఖదేవుడు మిక్కిలి ఆనందము గలవాడై, జంగమయ్య నిజరూపమున దేవతా సమేతుడై వచ్చినచో గంగనొసగి వివాహము చేయుదునని పల్కెను. గంగ నిర్మలాంతఃకరణమున శివుని ప్రార్థింపగా, ఆ దేవదేవుడు బ్రహ్మ విష్ణు మహేంద్రులతో, సమస్త దేవతలతో శంఖదేవునికి సాక్షాత్కరించెను. అంతట శంఖదేవుడు పరవశమున మహేశుని స్తోత్రము చేసి, యథావిధిగా గంగా పరమేశులకు పెండ్లి గావించెను. కొన్ని దినముల తరువాత హరుడు గంగాసమేతుడై కైలాసమున కరిగెను. ఆ సమయమున నారదముని ఈ పరిణయ గాథను పార్వతికెఱింగించెను. శైలసుత కీ వృత్తాంతము తెలిసెనని శివుడు భయపడుచుండెను. అతడు పార్వతికి భయపడి గంగను జడలలోదాచి, ఏమియు నెఱుగనివానివలె అంతఃపురమునకు వెడలెను. పరిణయమునుగూర్చి గిరిజ ప్రశ్నింపగా, తనకు తెలియదని అతడు పలి

కెను. పార్వతి సమాధానపడి, పూర్వమువలె పతియెడల అనురాగము చూపుచుండెను. శివుడుకూడ అట్లే మెలగుచుండెను. అన్యోన్యాను రాగబద్ధులైయున్న శివపార్వతులిరువురు ఒకనాడు పాచికలాడుచుండగా శంకరునికి ఓటమి తటస్థించెను. పతి యోటమికి పార్వతి కిల కిల నవ్వగా సహింపలేని గంగ శివ జటా జూటమునుండి తొంగి చూచెను. గంగనుగాంచిన పార్వతి శివుని నిందించెను. గంగ శివుని శిరమునుండి క్రిందికి దూకెను. సపత్నులిర్వురును కొంత తడవు కలహించుకొనిన పిమ్మట శివుడు తనను క్షమించ వలసినదిగా శైలసుతను వేడుకొని, గంగాపార్వతులను సఖ్యముగా నుండుడని కోరి గంగాదేవికి ఉత్తమాంగమునను, పార్వతీదేవికి అర్ధాంగముునను స్థానమిచ్చెను.

## వర్ణనలు:

ఈ చిన్ని కావ్యమున తొమ్మిది వర్ణనలు గలవు. అవి – ఏలూరుపుర ఉద్యానవన వనవిహార చంద్రోదయ సూర్యోదయ విప్రలాభ పరిణయ రతోత్సవ కన్యాంగసౌందర్య నాయకాభ్యుదయ వర్ణనలు. ఇందలి వర్ణనలు అలంకార శోభితములు, మనోజ్ఞములునై అలరారుచున్నవి.

క॥ హరునకు గంగకు ( బెండిలి
పరగున వగునని నిలింప సతు లారతులీ
గరముల ( బట్టిన మేల్బం
గరు పళ్ళెంబన(గ( దుహిన కరు(డుదయించెన్.

రెండవ యాశ్వాస మందలి ఏడవ పద్యమిది. చంద్రుని బంగరు పళ్ళెరముతో పోల్చుట సామాన్యము. ఇచట తిమ్మన ఉదయించుచున్న చంద్రుని నిలింపసతులు గంగాహరులకు పట్టిన హారతిగా నుత్ప్రేక్షించుచున్నాడు. జరుగబోవు గంగా పరమేశ్వర కళ్యాణము నీ పద్యము సూచించుచున్నది. ఇట్లు కథావస్తువును ధ్వనింపజేయుచు వర్ణించు నేర్పు తిమ్మనకు కలదు.

గంగాదేవి సౌందర్యమును వర్ణించుచు తిమ్మన ప్రసిద్ధములైన తెలుగు జాతీయములను వాడెను.

క॥ బాలికామణి పెన్నెఱుల్ బారెఁడేసి
చేడియమిన్న కన్నులు చేరెఁడేసి
కలికి వలిగబ్బిగుబ్బలుఁ గాఱెడేసి
చేసి నడుమేల మాయంబు సేసె నజుఁడు.

1వ ఆశ్వాసము నూటయేడవ పద్యమిది. "చేరెడు కన్నులు" అను నది వ్యావహారిక ప్రయోగమే. అదే విధముగా కేశములు "బారెడేసి" అనుటయు ప్రసిద్ధమే. నాయిక కురులు, కనులు, వక్షోజములు మున్నగువాని పరిమాణమును సృష్టికర్త అధికముగాచేసి కౌను అసలు లేకుండ జేసెనని కవి అతిశయముగా చెప్పుచున్నాడు. నడుము సన్నము అని చెప్పుట కవి యుద్దేశము.

అందమైన అనుప్రాసము వేయుటలో తిమ్మకవి దిట్ట.

క॥ కొమ్మలను గూడి క్రొవ్విరి
కొమ్మలపై నిమ్ముమీఱఁ గూరిమి మరు నా
లమ్ముల నెమ్మదిఁ ద్రిమ్మరు
తుమ్మెదలఁ గలంచె దిట్టు దోసముఁగాదే.

ప్రథమాశ్వాసమందలి నూటపదమూడవ పద్యమిది. తుమ్మెదల ప్రణయము వర్ణించుచు కవి మకార ద్విత్వము పలుమార్లు ప్రయోగించి శ్రవణమాధుర్యమునకు తోడు అర్థమాధుర్యమును గలిగించుచున్నాడు. పుష్పాపచయముచేయుచు నందు ప్రణయపరిరంభణమున ఉన్న భ్రమర దంపతులను కలచివేయవలదని శివుడు గంగాదేవిని వారించుచున్నాడు.

"తుమ్మెదల కొమ్మలను గూడి నెమ్మది
మరునాలమ్ముల ద్రిమ్మరుచుండె"

నని తెల్పుచు ప్రియపత్నియగు గంగయందు మక్కువగొనియున్న తనను నిరాదరణ చేయవలదని వ్యంగ్యముగా సూచించుట మనోజ్ఞము.

నారదమహర్షి వలన గంగాశంకరుల వివాహవార్త వినియున్న గిరిజ పతి ఏతెంచు సమయమున కవాటములు బంధించెను. హరుడంత గంగను శిగలో దాచివచ్చి, తలుపు తీయుమని పార్వతిని వేడుకొనెను. గౌరియు వెనువెంటనే తలుపుతీయక శివుని ప్రతిమాటకు మాఱుమాట పల్కుచు గడసరితనము ప్రదర్శించెను. ఇటువంటి వాదప్రతివాదము లుపూర్వము వీధి నాటకములలో నుండెడివి. చెంచులక్ష్మి వీధినాటకములో నిట్లే లక్ష్మీనారాయణ సంవాదము కలదు. ఈనాడిట్టి వీధినాటకములు మిక్కిలి అరుదుగా నున్నవి ఈ కావ్యమందలి గౌరీశంకర సంవాదము నిదేరీతిగా తిమ్మకవి చమత్కారజనకముగా వర్ణించెను.

సీ॥ అబల! నేఁ బశుపతి నహహ ! నీవట్లైన వాలమందకు నంకెలడ రఁజనుము
స్థాణుడ నేను గంజాయతాక్షి! యబ్బబ్బ ! మోడు మాటాడుట చూడమెందుఁ
బురసంహరుడ నేను బొలఁతి! నీవట్లైన మా వీట నుండక మరలిపొమ్ము
పన్నగధరుఁడను బడఁతి! నే నట్లైనఁ బడిగెలెత్తుచు నూళ్లఁ బడి తిరుగుము

గీ॥ భూతనాథుఁడ నేను బూబోడి! యట్టు
లేని నల ప్రేతభూముల కేగు మిపుడె
కుటిలకుంతల! నే మహానటుఁడ నట్టు
లైన (బహు)భువుల కడ కేఁగి యాడు మెలమి. ( 2ఆ-133ప )

తాను 'పశుపతి' నని చెప్పగానే శంకరుని పోయి ఆవులనుగాచు కొమ్మనినది గిరిజ తాను 'స్థాణుడ' నని శివుడు పల్కగా మోడు మాటాడు టెందును గాంచలేదనినది గిరిరాజపుత్రి. 'పురసంహరుడ' నన్మనినాడు హరుడు. అట్లయిన మాపురమును హరింతువేమో! అవలకు బొమ్మని చమత్కరించినది హైమవతి. 'పన్నగధరుడ'నని పౌరుషము వెలార్చినాడు శివుడు. అటులైన పాములనెత్తి నిడికొని యూరేగుమన్నది హిమవత్పుత్రి. సకలప్రాణులకు పతియగుట పశుపతియు, ఎట్టి వికారములకు చలించక 'స్థాణుడ'నియు, త్రిపురాసురసంహారి యగుట 'పురసంహరుడ' నియు, పన్నగములనాభరణముగా ధరించుటచేత 'పన్నగధరుడ' నియు,

పృథివి, వాయువు, తేజస్సు, ఆకాశము, నీరు అను పంచభూతములకు అధినాథుడు గనుక 'భూతనాథుడ' నియు శివుడు ప్రసిద్ధిచెందెను. అట్లే ప్రపంచమను రంగస్థలమున శివుడు మహానటుడు. ప్రళయకాలమునాటి తాండవ నృత్యము కావించిన ఆ మహానటుని ఆంగికమే భువనము. ఆ పశుపతి వాక్కులే సర్వవాఙ్మయము. శివుడు తనకీర్తిని ప్రకటించు బిరుదములను పేర్కొనగా గౌరీదేవి పరిహాసముగా చెప్పిన ప్రత్యుత్తరములు వినోదమును గల్గించుచున్నది.

**రసము :**

ఈ కావ్యమున శృంగారము అంగిరసము. నాయికానాయకులు గంగాపరమేశ్వరులు. నాయికానాయకుల వియోగమున దశవిధ మన్మథావస్థలు వర్ణింపబడెను. నాయకుడు నాయికను జూచి కావించిన శృంగార చేష్టలిందు కైశికీవృత్తియందు వర్ణితములయ్యెను.

సీ॥ కిన్నెరమీటి కన్గీటి సన్నలుసేయుఁ బకపక నగి యేల పదములం పాడుఁ
గంగేల లాతంబు గిరగిర ద్రిప్పులోఁ జొక్కుచు వెడవెడ మెక్కుమెక్కు
లింగలింగ యటంచు చెంగున దాఁటు మీసలుగీటు గడ్డంబుఁ జక్కదువ్వు
గులుకును జిలిబిలి పలుకులఁ జెప్పఁ గామిడి యయి పైట కొంగొడిసి తిగుచు

గీ॥ తివిరి బతిమాలి దిక్కులుఁ దిరిగి చూచు
నవలి కరుగుచోఁ ద్రోవకడ్డుపడి నిలుచు
వలపు మీఱంగఁ జెలిమరుల్ గొలుపుకొనుచుఁ
గోడె ప్రాయంపు జంగమ కుల విభుండు.

ఈ పద్యమున గంగ ప్రణయమునకై శివుడు పడిన పాటులన్నియు కన్నులకు గట్టినట్లు వర్ణింపబడెను. తపోభంగము కావించుట వలన మన్మథుడు, హరునికి శత్రువు. అందువలన హరుడతనితో యుద్ధము చేయుట సహజము. కాని గంగాదేవి తోడి శృంగార కలాపమును మన్మథ యుద్ధమే. అందువలన శివుడు తన సంభోగ చిహ్నములను జూచి ప్రశ్నించిన గౌరికిట్లు సమాధాన మొసగుచున్నాడు.

గీ॥ కాలకంధర! నీ మోవి గంటులేమి
కారణంబునఁ బొడవె నా గౌరి! వినుము
మరునితోడ నెదిర్చి సంగర మొనర్చ
తతని గోపించి కీరంబు గఱచెఁ జుమ్ము.

శంకరుని మోవి గంటు కావించిన కీరము గంగయే కదా! చక్కని ధ్వనితో చమత్కార మొలికించుచు ఆలుమగల వలపు కయ్యమును వర్ణించినాడు తిమ్మన. గౌరీదేవి శివుని చిన్నెల ననుమానింపగా నతడు తాను సిరపరాధి ననుచు సతిపాదములంటినాడు. సతీపతు లిద్దరిలో నెవరపరాధ మొనరించిన వారు రెండవవారి చరణములంటి క్షమాభిక్ష కోరుట న్యాయమని కవి భావము కానోపు! ఆ సమయమున గంగ శివుని జటాజూటమున నణఁగి యుండెనే గాని వెలుపలికి రాలేదు. కాని శివపార్వతులు పాచికలాడుచుండ విజయగర్వమున నవ్విన సపత్నియగు గౌరిని చూడ కుతూహలము జనించినది గంగా దేవికి. కుతూహలము నకు ఈర్ష్య తోడుకాగా శివుని శిరము నుండి తొంగిచూచుచు గౌరి కంటబడి ఆమె హృదయమునకు కంటకమయినది గంగ. వెంటనే గౌరి

క॥ ... ... ... ... యెంతటి గ
య్యాళివే చేరినటు లుండకఱచెదవు కడుం
గూలికి వచ్చిన యాతఁడు
పాలికిఁబట్టిన క్రియవిపర్యాసముగన్.

ఆ॥వె॥ అడుగు నిలుపనీక వడి కొట్టు చూపుచు
నింగి ముట్టి మిగులఁ బొంగెదేమి
గట్టి వాతనంబుఁగనబడె నౌ నీ
నిలువు నీరు గాను నీచురాల!

గంగ : ఆ॥వె॥ పెద్దదాన ననుచు ఁబెళబెళ నార్చుచు
జగము లెల్ల ముంగఁజాలునట్టి
సత్తి రూపు పూని జడిపింప వచ్చెదు
కినుక నిగుడ నీవు గిరి తనూజ.

సపత్నీ మాత్సర్యమును దెల్పు నీ సంవాదము రెండవయాశ్వాసమున పదునాలుగు పద్యములలో సాగెను. గంగ విజృభించినచో వింగి నంటుచు నుప్పొంగును. గౌరి శక్తిస్వరూపిణిగనుక భయమును గలిగించును. ఈ తీరున వివాద సమయములలో యి ధార్థములు బయట పడును. ఎన్నెన్నియో చమత్కారములతో, చక్కని తెలుగు జాతీయములతో, తెలుగునానుడులతో, తెనుగు వాతావరణమును ప్రతిబింబింపజేయుచు తిమ్మకవి ఈ కావ్యమును రచించెను.

## శతకములు

## శ్రీ భర్గ శతకము :

భర్గశతకము క్రీ॥ శ॥ 1936 లో పిఠాపురము—శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాల యందు ముద్రితమై, అముద్రితాంధ్ర గీర్వాణ గ్రంధమాలా స్థాపకులును, గెద్దనాపల్లి వాస్తవ్యులును అగు శ్రీ కూచిమంచి శ్రీ రామమూర్తి గారి చేత ప్రకటింపబడెను. నూటొక్క పద్యములు శార్దూల మత్తేభ వృత్తములలో వ్రాయబడి, "భర్గా ! పార్వతీ వల్లభా !" యను మకుటము కలిగియున్నదీశతకము. తిమ్మకవి ఈ శతకమును క్రీ॥శ॥ 1729లో రచించెను. తిమ్మన భర్గ శతకములో నృపనింద 68_72, 74, 79, 80 పద్యములందు, లోభుల తత్త్వము 84, 88_90 పద్యములలోను, ముష్కరనింద 92_95 పద్యములలోను, కుకవినింద 85_87 పద్యముల లోను, గృహస్థధర్మము 97,98 పద్యములలోను తెలిపెను. సాంఘికమగు నీ విషయములు మాత్రమే గాక కవి శివభక్తియు, శివభక్తుల గాథలు సహితము ఈ శతకమున ఆవిష్కరింపబడెను.

మ॥ అమరం ద్వత్పద పంకజాత యుగళీ ధ్యాన క్రియాశాంతిసం
భ్రమలీలన్ విలసిల్లు డెందమొరులన్ బ్రార్థింపఁగా నేర్చునే
సుమనో నిర్ఝరిణీ సువర్ణకముల స్తోమాస వాలంపట
భ్రమరంబరుగునే తుమ్మకొమ్మలకు భర్గా! పార్వతీవల్లభా!

పోతన్నగారి " మందార మకరంద మాధుర్యమున దేలు మధుపంబు వోవునే మదనములకు" అను పద్యభావమిట మత్తేభవృత్తమున ప్రదర్శింపబడెను ప్రభులక్షణమును గూర్చి తిమ్మన దెబ్బది మూడవ పద్యమున తెలిపెను.

శా॥ ఆజిన్ వైరి వరూధినీ మదన దీక్షారూఢిఁ గ్రాలవలెన్
భోజుం బోలి సమస్త యాచక తతిం బోషించుచుండన్ వలెన్
తేజంబెప్పుడు సర్వలోకప్రజకుఁ జెందింపన్ వలెన్ గానిచో
రాజావాఁడు, తరాజుగాక భువి భర్గా! పార్వతీవల్లభా!

## చిరవిభవశతకము:

ఈ శతకము శ్రీ చెలికాని లచ్చారాయణింగారిచేత ప్రకటించబడిన "శతకముల ద్వితీయ సంపుటము" లోనిది. ఇది క్రీ॥ శ॥ 1923 లో చిత్రాడ శ్రీ రామవిలాస ముద్రాక్షరశాల యందు ముద్రింపబడెను చంపకమాలా సుగంధ సురభిళము లైన నూటొక్క పద్యములిందు గలవు ఐదు పద్యములు అలభ్యములు. "చిరవిభవా! భవా! విజిత చిత్తభవా!" అను మకుటమిందు గలదు. లోభులైన ప్రభువులు 'కవి యేమి యడుగునో'యని దర్శనమీయరను భావమొకచో కలదు.

చ॥ ఒకిమెఁ గవీంద్రుఁడే మెయిఁ కునో యని దర్శన మియ్యనోడి బ
ల్గొరలును మూల నీఁగుదురు లోభమున న్నిను నేమ కోమియు
న్వరములు వేఁడ నాకిపుడు వైళమ దర్శన మియ్యరాగదే
చిరవిభవా! భవా! విజిత చిత్తభవా! యభవా! మహాభవా!

## కుక్కుటేశ్వర శతకము

క్రీ॥ శ॥ 1920వ సం॥ న చెన్నపురి వావిళ్లవారి ముద్రణాలయమున ముద్రింపబడిన ఈ శతకము వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు వారిచేత ప్రకటితమయ్యెను. బ్రహ్మ శ్రీ పురాణం సూర్యనారాయణ తీర్థులవారు దీనిని పరిష్కరించిరి. ఇందు 92 సీస

పద్యములు ముద్రింపబడెను. తుది పద్యములు లభ్యము కాలేదని పరిశోధకులు తెల్పిరి.

"భూనుత విలాస! పీఠికాపుర నివాస!
కుముద హితకోటి సంకాశ! కుక్కుటేశ!"

అను మకుటముతో నీ శతకము అలరారు చుండును. పిఠాపురమున కుక్కుటేశ్వర స్వామివారి ఆలయము మిక్కిలి ప్రాచీనమైన చారిత్రక పౌరాణికతలను సంతరించుకొనెను ఈ యాలయప్రాంగణమున సుప్రసిద్ధమగు పాదగయాతీర్థము అశేష భక్తకోటికి ఆకర్షణీయమై ఒప్పును. అందలి శివలింగమును కుక్కుటేశ్వరుడని భావింతురు. పీఠికాపుర నివాసియగు కుక్కుటేశ్వరుడు భూనుతవిలాసుడు; కూచిమంచి తిమ్మ కవీంద్ర హృదయ సింహాసనాసీనుడు. భర్గ, చిరవిభవ శతకములందు వలెనే కుక్కుటేశ్వర శతకము నందును భక్తితత్వము, దుష్టులయొక్కయు, మూర్ఖులయొక్కయు స్వభావములు వివరింపబడెను.

సీ॥ అందలం బెక్కుట నవనిఁ బ్రశస్తమా! మఱియెక్కి నిక్కదే మర్కటంబు
తొడవులుఁ దొడుగుట దొడ్డ సౌభాగ్యమా! కడు సొమ్ములూనదే గంగిరెద్దు
విత్తంబుఁ గూర్చుట విమల పరిచారమా! బహునిధుల్ గావఁడే భైరవుండు
పరిజల దండించుట పరమ సంతోషమా! ప్రాణుల నెల్ల నేపఁడె జముండు
గీ॥ దొరతనంబున కివిగావు వరుస లరయ
సాహసౌదార్య ఘన పౌరుషములుఁ గాని
భూనుత విలాస! పీఠికాపుర నివాస!
కుముద హితకోటి సంకాశ! కుక్కుటేశ!

పరులకు సమకూడని అందలమెక్కుట వలన మానవునికి గర్వము కల్గును, అలంకార ధారణమున అహంకార మతిశయించును, సంపద సమకూరుట వలన యశస్సు కలుగును. పదవి వలన ప్రజలను దండించు అధికారమదమును పొందును. కాని ప్రభువైన వానికివి యన్నియు ముఖ్యములుగావు. ప్రభువునకు సాహసము, ఔదార్యము, ఘనమైన పౌరుషము ఉండవలెను. అని సందేశము నిచ్చు కవి

ఆయా సౌభాగ్యముల వలన అహంకార గర్వములను పొందరాదని, మర్కట గంగిరెద్దులను, కాలభైరవ యములను పోలికగా చెప్పుచు, ప్రజలకు ప్రజాపాలకునికి నీతి గరపుచున్నాడు.

మూర్ఖుల స్వభావమును గ్రామ్య భాషలో నిట్లు వర్ణించినాడు తిమ్మకవి.

సీ॥ బోలెడు గందంబు బొమలదాకా మెత్తి, మెంటెడీబూడిద ఒంటబామి
రుదురాక పేర్లు జన్నిదములు మోకాలి లావున దిగయేసి యావుపాస
నాళికి నేతిదారైనను దెమ్మంటఁ దాబల్కు నెడ నమేద్యాలటంట
పచ్చాలు మాలయ్యపచ్చాలు ననుకొంట సంకలో కబ్బాలు సప్పుకొంట

గీ॥ సెడుగు బాఁపడు నా బంటు కొడుక బబ్బ
రొంటఁబడెనను మూర్ఖుల నెన్నఁదరమె
భూనుత విలాస! పీఠికాపుర నివాస!
కుముద హితకోటి సంకాశ! కుక్కుటేశ!

పూజలు మొదలైన శుభసమయములలో వచ్చి శుభవాసర నక్షత్రాదులను దెల్పు బ్రాహ్మణులను జూచి వివేక శూన్యులు మూర్ఖులునైన గ్రామ్యజనులు నిందించుటను తిమ్మకవి గ్రామ్యభాషలో వర్ణించి పాత్రౌచిత్యమును పాటించెను.

| | | |
|---|---|---|
| రుద్రాక్షపేరులు | = | రుదురాకపేర్లు |
| ఔపోసనము | = | ఆవుపాసనము |
| నైవేద్యములు | = | నమేద్యములు |
| పక్షములు | = | పచ్చాలు |
| మహాలయపక్షములు | = | మాలయ్యపచ్చాలు |

తిమ్మకవి వృద్ధాప్యమున నీ శతకము వ్రాసినట్లు ఈ క్రింది పద్యము వలన భావింపవచ్చును.

సీ॥ నోరు చేదై కూడు కూరలు చవిదప్పు గడ గడ నొడలెల్ల వడఁకుచుండుఁ
జెవుఁడున నేమియుఁ జెవులకు వినరాదు తెగులును జింతయుందగులుకొను

కన్నులఁ బొరఁగప్పి కానరాదెద్దియు సిగ్గొకించుక యైన జేరఁబోదు
బాలురందరు గూడిఁ గేలి ఁగావింతురు ...............

గీ॥ మది తలంపఁగ ఁగల కటా! ముదిమి యంత
రోతలేదు గదా ధారుణీతలమున
బుధనుత విలాస! పీఠికాపుర నివాస!
కుముద హిత కోటి సంకాశ! కుక్కుటేశ!

ఇచట గీతపద్యము మూడవ పాదమున 'భూనుత' అనుటకు బదులు 'బుధనుత' అనికలదు. తిమ్మకవి సతిని గోల్పోయిన తరువాత ననుభవించిన మనఃస్థితి ఈ క్రిందిపద్యమున చిత్రీకరింపబడెను.

సీ॥ అన్నంబు నాలుక కరుచియై కనుపట్టు నిలచినచో నిల్వనలవిఁగాదు
మనుజేంద్రు తోనైన మాటలాడ సైపదు పనులయందేమియు మనసులేదు
నడచుచో నడుగులు తడబాటుఁగైకొను దగఁ బందువుల నైన నగవురాదు
తెపులు పుట్టినరీతి దేహంబు కృశియించు గలనైన నిద్దుర కలుగఁబోదు

గీ॥ శివశివా! ధాత్రిఁ దావలచిన వధూటిఁ
బాయువెత వద్దుసుమ్మెట్టి పలువకైన
భూనుత విలాస! పీఠికాపుర నివాస!
కుముద హితకోటి సంకాశ! కుక్కుటేశ!

ఇట్టి మనఃస్థితి చిత్రీకరణము అనుభవించిన వారికేగాని ఇతరులకుసాధ్య పడదు. సతిని గోల్పోయిన వారొక్కొక్కరొక్కొక్క విధమైన చింత ననుభవించెదరు. ఈ పద్యమును బట్టి తిమ్మకవి సతితోడిఅనన్యమైన ఆత్మీయతానుబంధము సువ్యక్తమగుచున్నది. శివలీలావిలాస కావ్య రచనానంతరము తిమ్మన భార్య మరణించెననియు, అటుపైన నతడీ కుక్కుటేశ శతకమును మాత్రము రచించెననియు తెలియుచున్నది. కనుక నీ శతకము తిమ్మకవి తుదికావ్యమని స్పష్టమగుచున్నది.

## ఉ ప సం హా ర ము

క్రీ॥ శ॥ 1759 నుండి క్రీ॥ శ॥ 1762 వఱకు పీఠపుర రాజ్య మేలిన శ్రీ రావు చినమాధవరావు గారివలన కవిసార్వభౌమ నవీన

శబ్దశాసన బిరుదములందిన శ్రీ కూచిమంచి తిమ్మకవి సుమారు పది పన్రెండు కావ్యములు వ్రాసి కవితారచన యందు, శబ్దము నందు గొప్ప అధికారము కలవాడై యున్నట్లు స్పష్టమగుచున్నది. తిమ్మకవి శివభక్తుడైనను శివకేశవ భేదము పాటింపక, శైవ వైష్ణవ పౌరాణిక గాథలను స్వీకరించి కావ్యరచన కావించెను. అందు అధికభాగము విష్ణుకథా బోధకములే యగుచున్నవి. రసికజన మనోహరమగు నితి వృత్తముతో రసికుల నలరించురీతిగా వర్ణనలు చేయుచు కావ్యరచన చేయు తిమ్మకవి, అచ్చ తెనుఁగునందు తనకుగల పాండిత్యము ప్రకటిత మగునట్లుగా రెండు కావ్యములను రచించెను.

శ్రీ రావు పెదమాధవరావు, నరసింహారావు, వెంకటరావు, వెంకట కృష్ణారావు, చిన మాధవరావు నను ఐదుగురు జమీందారుల పాలనము చూచిన తిమ్మకవిలోని ప్రతిభాపాండితీ ప్రకర్ష లను కూలంకషముగా నర్థము చేసికొని, అమ్మహాకవిసార్వభౌముని అన్వర్థములగు బిరుదులతో సమ్మానించి కవిపోషకులైన చినమాధవ రాయణింగారు, సహృదయుడైన ఆ ప్రభువు నలరించగల సత్కావ్య రచన చేసిన తిమ్మకవి ధన్యులు.





శ్రీరావు వేంకట మహీపతి గంగాధర రామారావు గారు

క్రీ॥ శ॥ 1842-1890

# కవి పండిత పోషణః

# శ్రీ రాజా రావు వేంకట మహీపతి గంగాధరరామారావు

( క్రీ॥ శ॥ 1862-1890 )

శ్రీ రావు చిన మాధవ రాయణం గారు, వేంకట కృష్ణారావు గార్ల, తరువాతి నాల్గుతరముల వరకు సాహిత్యపోషణ జరిగిన జాడ కనపట్టుటలేదు. ఐదవతరము వారగు శ్రీ రావు వేంకట నీలాద్రిరావు గారు గొప్ప సంస్కృతపండితులు. నీలాద్రిరాయణంగారు అపార మైన సాహిత్యపోషణ కావించినట్లు ఆధారములు కలవుగాని ఆ సాహిత్యము నేడు అలభ్యము.

నీలాద్రిరాయణం గారు క్రీ॥ శ॥ 1793 నుండి 1828 వరకు, అనగా ముప్పదియైదు వత్సరములు పిఠాపుర సంస్థానమును పాలించిరి. వీరి యాస్థానమున శ్రీమాన్ ప్రతివాదిభయంకర రాఘవాచార్యులు, శ్రీ దువ్వూరి విశ్వనాథశాస్త్రి, అవసరాల పద్మరాజు, దేవులపల్లి రామశాస్త్రి ప్రభృతి పండితశ్రేష్ఠులు గలరు. రాఘవాచార్యుల వారు సకల శాస్త్రకోవిదులు. ఆనాటి పండితులందరితో శాస్త్రవివాదములు గావించి, సర్వతోముఖము జయము సాధించిన ధీశాలురు ఆచార్యుల వారని విజ్ఞాన సర్వస్వము చాటుచున్నది. అంతటి ఉద్దండ పండితుడు కనుకనే వీరికి శ్రీ నీలాద్రిరాయణంగారు అర్ధసింహాసన మిచ్చి గౌరవించిరి. ఆ మహాపండితుని అంతగా సన్మానించుట వలన శ్రీ రాజా వారికి పండితుల యెడలగల ఆదరము వెల్లడియగుచున్నది. ఈ యాచార్యులవారు 'శాస్త్రము' నకు ప్రతిగా 'గీస్త్రము' అను సంస్కృత గ్రంథము వ్రాసిరట గాని అదియు నేడు అలభ్యము.

దువ్వూరి విశ్వనాథశాస్త్రిగారు సంస్కృతమున ' మాధవ విలాస భాణము ' అను రూపకమును రచియించిరి. అవసరాల పద్మరాజు గారు సంస్కృతములో చంపూ భాగవతమునకు వ్యాఖ్యానము విరచించిరి. దేవులపల్లి రామశాస్త్రిగారు ' రావు చంద్రోదయము ' అను 'చంపూ ప్రబంధము', ' సాహితీ దర్పణము ' అను అలంకారశాస్త్రము, ' బాల భాగవత వ్యాఖ్య ', అనేకములైన నాటకములు వ్రాసి, నీలాద్రిరాయణింగారి వలన ' సాహిత్య చక్రవర్తి ' అని బిరుదు నొందిరి.

దుగ్గుదుర్తిపుర వాసియగు శ్రీ రేమెళ్ళ వెంకటరాయ కవి నీలాద్రిరాయణింగారి యాదరమునకు పాత్రుడైనట్లు ఈ క్రింది పద్యము తెల్పుచున్నది.

శా॥ శ్రీ మీఱన్ ధర సద్గుణావళులచేఁ జెన్నొందుచున్నట్టి యా
శ్రీమద్వేంకట నీలశైలపతి వాసిం జూచి పోషింపఁగా
ధీమద్రాజిత దుగ్గుదుర్తిపురిం' నాత్రేయి సమాలోకనో
ద్దామత్వంబున నుంటి మిచ్చట సదా ధర్మార్జన వ్యాప్తిచే.

పిండిప్రోలు లక్ష్మణకవిని ఆదరించినట్లు చినలక్ష్మణకవి పద్యమువలన తెలియుచున్నది.

" శ్రీ నీలాద్రి విభువరుడు మున్నా లక్ష్మణ కవిని బ్రోచె
ననవరతం బాలీల నరనాథా ! వేగ నన్నేలు శ్రీ సూర్యరాయ నృపవర్యా !

నీలాద్రిరాయణింగారి తరువాత వారి తనయులు శ్రీ రాజా రావు వేంకట సూర్యారావుగారు కవితాపోషణమందాసక్తిగలవారయినట్లు తణికెళ్ళ సుబ్బన్న శాస్త్రిగారు రచించిన ' సూర్యరాయ తారావళి ' అను కృతి సంకితమందినట్లు తెలియుచున్నది. సూర్యారావుగారి యాస్థానమున ' సుదర్శన స్తవము ', ' తిరుపతి జగన్నాథ స్తవము ', ' రసమంజరీ వ్యాఖ్య ', ప్రసంగవశమున సూర్యారావు గారిపై కొన్ని పద్యములను కూర్చిన శ్రీమాన్ ప్రతివాదిభయంకర తిరువేంగళాచార్యులు అను కవిపండితశిఖామణియు నుండెను.

పైన పేర్కొనబడిన కవుల యొక్క చరిత్రకాని, వారి గ్రంథ ములవివరములుకాని లభించకపోవుట సాహిత్యమునకు తీరనికొరతయే యగుచున్నది. శ్రీ రావు వేంకట సూర్యారావు గారి పుత్రులలో శ్రీ రాజా రావు వేంకట మహీపతి గంగాధర రామారావుగారు స్వయముగా కవియు, కవి పండిత పోషకుడు, లలితకళాసక్తుడునై ప్రసిద్ధి నొందెను. ఈ ప్రభువునకు సంబంధించిన చిత్రవిచిత్రములైన కథలను శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు "కథలు-గాథలు" అను గ్రంథమున నిక్షిప్తపరచిరి.

శ్రీ రాజా రావు వేంకట మహీపతి గంగాధర రామారావుగారు స్వయముగా కవియు పండితుడు నగుట వలనను, లలితకళల యందాసక్తి కలవారగుట చేతను, ఉదారగుణ సంపన్నులగుట వలనను వారి ఆలంబమున సాహితీలత మూడుపువ్వులు-ఆరుకాయలుగా విలసిల్లెను. శ్రీ రాజా వారు వైష్ణవమతము నవలంబించినవారు. కాని వారియందు గంగాధరుని యంశ, రాముని యంశయు సరిసమానముగా నుండెడి వనియు, " నావిష్ణుః పృథివీపతిః " అనుమాట నూటికి నూరుపాళ్లు సార్థకమగుచున్నదనియు సువ్యక్తమగుచున్నది.

శ్రీ రాజావారి యాస్థానమున దేవులపల్లి సోదరకవులు, కనకదండి గోపాలకృష్ణశాస్త్రిగారు ఆస్థాన కవి పండితులుగా నుండిరి. ఆంధ్ర దేశమున ప్రఖ్యాతిగాంచిన శ్రీ బులుసు పాపయ్యశాస్త్రిగారి వేదార్థ మునకు రాజావారు ముచ్చటపడి, తమ సంస్థానములో గల వానపల్లి గ్రామమున పదునెనిమిదిపుట్ల భూమినిచ్చి శాశ్వత యశస్సు గాంచిరి. పాపయ్యశాస్త్రిగారు చమత్కారముగా మాటలాడి దేవమానము పరిమాణము ఎక్కువభూమిని కొలిపించుకొనగా శ్రీ రాజావారు తాణే దారుపై కోపించి పనినుండి తొలగించిరట. దానిపై శ్రీశాస్త్రిగారు రాజావారిని తమ చమత్కృతిచే సంప్రీతులను గావించి తాణేదారు

ఉద్యోగమును నిలబెట్టిరట. గంగాధర రామారావుగారి ఔదార్యము నకు సంబంధించిన ఇటువంటి చిత్ర విచిత్రము లైన కథలెన్నియో "కథలు-గాథలు"లో నిక్షిప్తమయ్యెను.

బొమ్మకంటి పట్కాము, చిలుకూరి చతుష్టయము మొదలగు ప్రసిద్ధిచెందిన పండితులు రాజావారి ఆదరము పొందిరి. శ్రీ రాజా వారు తమ పట్టాభిషేక సమయమున భాగవతుల హరిశాస్త్రి, ఇంద్ర గంటి విశ్వపతిశాస్త్రి, కట్టా నరసింహశాస్త్రి, ఉప్పులూరి భీమశంకరం, ఎడవిల్లి శ్రీ రామశాస్త్రి, పరవస్తు రంగాచార్యులు, పొక్కులూరి వేంకటశాస్త్రి-మున్నగు పండితశ్రేష్ఠులకు ఈనాము భూములనిచ్చి సన్మానించిరి. పండితులను తమ ఆస్థానమున కాహ్వానించి సన్మానిం చుట రాజావారికి వినోదము. అట్లే శ్రీ ప్రతివాదిభయంకర రాఘ వాచార్యుల వారిని సత్కరించుట కాహ్వానించగా ఆచార్యుల వారం దులకు నిరాకరించిరట. అందులకు కోపించక, ఉదారహృదయముతో శ్రీ రాజావారు మహా విద్వాంసుని చూచెడి కోర్కె నాపుకొనలేక తామే స్వయముగా ఆచార్యుల వారి నివాసస్థానమగు చామర్లకోటకు వెడలి వారిని దర్శించి సత్కరించిరట. పండితులయెడల, కవులయెడల శ్రీ రాజావారికి అంతటి గౌరవాదరములు గలవు. శ్రీ దేవులపల్లి బుచ్చయ్యశాస్త్రి గారిశిష్యులు కూచిమంచి వెంకటరాయకవి "సుకవి మనోరంజని" అను ఛందోగ్రంథమును వ్రాసి పీఠపురప్రభువు వలన "లాక్షణిక చక్రవర్తి" బిరుదు నందెను.

సర్వకామదాపరిణయ కర్త శ్రీ శిష్టు కృష్ణమూర్తి శాస్త్రి పాండిత్యమునకు, ధారణశక్తికి మెచ్చి గంగాధర రామారావు గారు వెయ్యినూటపదహార్లు, జోడు శాలువాలతో వారిని సత్కరించిరట. అట్లే నూజివీటి సంస్థానాస్థానకవి భరతాభ్యుదయకర్త శ్రీ మాన్ మాడభూషి వెంకటాచార్యుల వారు శ్రీ రాజావారి చేత సత్కరింప

బడిరి. గంగాధర రామారావుగారు పిఠాపురమున నెలకొల్పిన సంస్థానం ఉన్నతపాఠశాల సంస్కృత పండితులు శ్రీ టంగుటూరి సీతారామ దీక్షితులు, సంస్కృతాంధ్ర భాషాకోవిదులై, ఉభయ భాషలయందు బహు గ్రంథముల వెలయించిన శ్రీ శొంఠి భద్రాద్రి రామశాస్త్రి రాజావారిచేత వార్షికము లందెడి వారు. కూచిభొట్ల సూర్యనారాయణ శాస్త్రి, కవిశిరోమణి సోంభట్ల రామస్వామి శాస్త్రి మున్నగు పండితు లెందరో శ్రీ రాజావారినుండి వార్షికములు గ్రహించెడివారు.

శ్రీ రాజావారికి శాస్త్రార్థములను వినుట వినోదము. అంతే కాదు. వారు స్వయముగా పండితులతో శాస్త్రార్థములు చేసెడివారు. ఇతర సంస్థానములనుండి వచ్చిన పండితులకు వాదములు పెట్టి బహూకరించుట రాజావారికి అలవాటు. అందువలన శ్రీ రాజావారు ఒక మారు ఆస్థాన తర్కపండితుడు శ్రీ తణికెళ్ల సుబ్బన్న శాస్త్రి గారికి, షడ్దర్శన పారంగతుడు, మంత్రశాస్త్రవేత్త యునగు శ్రీ కొవ్వూరు గోపాలశాస్త్రిగారితో వినోదార్థము తర్కము ఏర్పాటు చేయగా, తర్క పాండిత్యమున ఓటమి సంభవించబోవు గోపాలశాస్త్రి గారు సుబ్బన్న శాస్త్రి గారిని భయపెట్టిరట. ఆ మంత్రశాస్త్ర పండితునికి భయపడి సుబ్బన్నశాస్త్రి గారు మరణించగా నాటి నుండి వికలమనస్కులైన గంగాధర రామారావు గారు శాస్త్రార్థమందలి తమ వేడుకకు తిలాంజలి నొసగిరి.

## వేదోద్ధరణము :

గంగాధరరామారావుగారికి వేదవాఙ్మయముపట్ల అభిమానము మెండు. శ్రీ రాజావారి కార్యదర్శి వింజమూరి లక్ష్మణమూర్తి గారు వ్రాసిన **'An Historical Account of the Rajahs of Pithapuram'** అను ఆంగ్ల గ్రంథమున రాజావారు వేదోద్ధరణకు చేసిన కృషి ఈ క్రిందివిధముగా వివరింపబడెను.

1) ప్రస్తుతము కాకినాడలో నొక పేటయగు సూర్యారావుపేటలో శ్రీ గంగాధర రామారావుగారు శుక్ల-కృష్ణ యజుర్వేద పాఠశాలను 1871లో స్థాపించిరి. అందు వేదాధ్యయన మొనరించెడి 20 మంది విద్యార్థులకూ రాజావారే ఉచిత భోజనవసతులను కల్పించిరి.

2, రాజమహేంద్రివరమున శుక్ల యజుర్వేదాభ్యాస మొనరించెడి ౫0 మంది అధ్యయనపరుల విద్యాపోషణల భారమును 1873 నుండి రాజా వారు వహించిరి.

3) శాస్త్రవిజ్ఞానమును అభివృద్ధి పరచుటకు కాకినాడలో 1876 వ సం॥న మధ్వశాస్త్రములను బోధించు పాఠశాలను స్థాపించిరి. తిరుచానూరులో మధ్వసిద్ధాంతోన్నత సభకు వార్షిక విరాళ మిచ్చుటయే గాక సభాభవన నిర్మాణార్థము 5,000 రూప్యములను దానము చేసిరి.

4) 1879 వ సం॥న పిఠాపురము నందొక వేదపాఠశాల నెలకొల్పబడెను.

5) సంస్కృతభాషాభిమాని యగుటవలన శ్రీరాజావారు మద్రాసులో ట్రిప్లికేను నందలి సంస్కృత పాఠశాలకు వార్షిక విరాళమిచ్చెడివారు

**విద్యాభిమానము : వితరణ :**

ఆంధ్రదేశమున విద్యాభివృద్ధి నిమిత్తము శ్రీ గంగాధర రామారావు విద్యాలయములను స్థాపించియు, పాఠశాలలకు విరాళములిచ్చియు పలువిధములుగా భాషా సేవ యొనరించిరి; స్త్రీ విద్యను ప్రోత్సహించిరి; అనాధ బాలుర విద్యాభ్యాసమునకు సహాయపడిరి.

క్రీ॥ శ॥ 1852 లో 'ప్రెండరుగాస్టు' అను కలెక్టరు, అతని శిరస్తదారు శ్రీ తులసింగం చెట్టియారుకలసి కాకినాడలో ప్రారంభించిన పాఠశాలలో బాల్యమున విద్యాభ్యాస మొనరించిన గంగాధర రామారావుగారు పీఠికాపుర సింహాసనము నధిష్ఠించిన వెంటనేక్రీ॥శ॥ 1862 వ

సం॥నుండి నెలకు 100 రూపాయిల చొ॥న విరాళ మొసగిరి 1867లో పాఠశాల అభివృద్ధికి 27,360 రూపాయిలు, విశాలమైన. స్థలము నిచ్చిరి. ఆ స్థలములో భవనము నిర్మించుటకై 2,647 రూప్యములను, కుర్చీలు, బల్లలు మొదలైన సామాగ్రి కొనుటకు 1,000 రూప్యములను రాజావారు ఉదారముగా నొసగిరి. తరువాత ఆనాటి జిల్లా కలెక్టరు సర్ ఆర్థరు పర్విస్ గారి యొక్క ప్రతిమను 1,366 రూపాయలు వ్యయపరచి ఇంగ్లండు నుండి తెప్పించి పాఠశాలలో నిల్పిరి. అదే కాకినాడలో శ్రీ గంగాధర రామారావు గారు క్రీ॥శ॥ 1868 వ సం॥నుండి బాలికల పాఠశాలను స్థాపించిరి. అందులకుఅవసరమైన పుస్తకములు,బల్లలు, కుర్చీలు మొదలగునవి సమకూర్చుటయేగాక, బాలికల విద్య నిమిత్తము ప్రత్యేకముగా నెలకు వందరూపాయల చొ॥న వ్యయపరచిరి. వార్షికోత్సవ సమయములలో బహుమతుల నిమిత్తము సం॥నకు రూ 300 వ్యయ పరచి రాజావారు పుస్తకములు, వస్త్రములు, నగలరూపము లో నొసగెడివారు. ఈబాలికల పాఠశాల మందిర నిర్మాణమునకు తొమ్మిది వేల రూపాయిలు, స్థలమును ఒసగిరి.

విద్యయందాదరముగల రాజావారు 1884లో తమ సంస్థానములో నొక గ్రామమగు 'ఉండూరు' నందు ఒక పాఠశాలను స్థాపించుటయే గాక, మద్రాసునందలి హిందూ ప్రైవేటరీ స్కూలునకు, మిషన్ స్కూలునకు వేయేసి రూపాయల విరాళమిచ్చిరి. ఇంకను మద్రాసు నందలి ఆర్ఫన్ స్కూలునకు, రాజమహేంద్రవరమునందలి టౌన్ స్కూలునకు, ధవళేశ్వరము నందలి పాఠశాలకు, కాకినాడలో జగన్నాథపుర మందలి మిషన్ స్కూలుకు రాజావారు వార్షిక విరాళము లిచ్చెడివారు.

కాపవరము, పవర. కొత్తపల్లి గ్రామములలో గ్రామపాఠశాలలను సహితము నెలకొల్పి శ్రీరాజావారు విద్యాభివృద్ధికి దోహద

మొనర్చిరి. రాజమహేంద్రవరము నందలి కళాశాలలో జూనియర్, సీనియర్ తరగతులలోని బి. ఏ. చదువు విద్యార్థుల కిద్దరకు నెలకు ఇరువది రూపాయల చొ॥న॥ ఉపకార వేతనములను సహితము శ్రీ రాజా వారు అనుగ్రహించిరి. వారు మెట్రిక్యులేషను చదువు విద్యార్థులకు, ఎఫ్. ఏ చదువు విద్యార్థులకు కూడా ముగ్గురకు నెలకు రూ. 38 చొ॥న ఉపకార వేతనముల నొసగిరి.

సర్వవిధముల విద్యాభివృద్ధికి కృషి చేయుటయే గాక శ్రీ గంగాధర రామారావుగారికి దైవభక్తి అధికముకావున సం॥నకు రూ. 1200 ఆదాయము కల ఈనాము నొకదానిని 1885లో తిరుమలలో వేంచేసి యున్న శ్రీ వెంకట రమణమూర్తికి కానుకగా నిచ్చిరి.

ఈ రీతిగా ఆ కాలమున రాజావారి సన్మానము పొందని కవులు, పండితులు గాని, విరాళములను స్వీకరించని విద్యాసంస్థలు కాని ఆంధ్ర దేశమున లేనట్లు చెప్పిన అతిశయోక్తి కాదు.

శ్రీ రాజా పెదమాధవరాయణిం గారి ఆస్థానకవి వక్కలంక వీరభద్ర కవి "వాసవదత్తా పరిణయము" న ం దు మాధవరాయణింగారి వరకు రావు వంశవర్ణన చేసెను శ్రీ గంగాధర రామారావు గారు శ్రీ వక్కలంక లక్ష్మీనారాయణ, ఎఱ్ఱమిల్లి లక్ష్మీనారాయణుల చేత నాటి నుండి తమకాలము వరకు వంశవర్ణన చేయించిరి. ఈ లక్ష్మీనారాయణ కవిద్వయము రావు వంశచరిత్రను గంగాధర రామారావుగారి వరకును వ్రాయుటయే గాక, దానికి అనుబంధముగా శ్రీమద్రామాయణకథను కూడ రచించిరి. శ్రీ గంగాధర రామారావుగారు, జనకులు సూర్యారావు గారు నిరంతర రామాయణ పఠనము చేయుట వలన జన్మించిరనియు, రామాయణమురాజావారికి మిగుల అభిమానపాత్రమగు కావ్యమగుటచేత వాసవదత్తా పరిణయ మధ్యమున క వు లీ రామాయణ గాథను చేర్చిరనియు చెప్పుదురు.

శ్రీ రాజా గంగాధర రామారావు గారు కళలయందాసక్తి కలవారు. లలితకళలలో నాట్యకళయందు వీరికి మక్కువ యెక్కువ. సిద్ధేంద్ర యోగి కృతమగు 'పారిజాతాపహరణము' అను కూచిపూడి నాట్యమును కోన వెంకటరత్నము అనునామె అభ్యసించునట్లు రాజావారే ప్రోత్సహించిరని కూచిపూడి భాగవతారిణియు వెంకటరత్నము వంశస్థురాలునగు శ్రీమతి కోనె చిట్టిరాజువలన తెలియవచ్చెను. వారి భాగవత గ్రంథచూర్ణికలో శ్రీ గంగాధర రామారావు గారి సంబోధన కలదు. రాజావారి కాలమున పెండ్యాల సత్యభామయను నాట్యకారిణి భామాకలాపము నభినయించుచు –

" శ్రీ రావు కులాంబుధి చంద్ర !
శ్రీ గంగాధర మహీపతి రాయ !
భోగవేవేంద్రా ! బహుపరాక్ ।

అని 'పరాకు' చెప్పి కలాప మారంభించెడిదట. ఆమె నాట్యమునకు ముగ్ధులై శ్రీ రాజావారు ఆమెకు మాన్యము లిచ్చిరి.

శ్రీ రాజా వెంకట మహీపతి గంగాధర రామారావు గారు ఆంధ్రాంగ్ల సంస్కృత భాషలలో నిష్ణాతులగుటయే గాక ఆయా భాషలలో గ్రంథములను రచించిరి. ఆంగ్లమున వీరు " సారంగధర చరిత్రము", "ఆనంద తారతమ్యము" అను గ్రంథములను, సంస్కృతాంధ్ర తమిళములలో "శ్రీ మద్వరవరముని చరిత్రము" ను వ్రాసిరి. తొలుత"శ్రీ మద్వరవరమునిచరిత్రము" పరిశీలింపబడును.

## శ్రీ మద్వర వరముని స్తోత్రమ్

మహత్తరమైన ఈ కావ్యము పీఠపుర ప్రభువు శ్రీ రావు వెంకట మహీపతి గంగాధర రామ రాయకృతము. ఈ సంస్కృతకృతి క్రీ॥శ॥ 1871 వ సం॥న వ్యవహార తరంగిణీ ప్రెస్సున ముద్రింపబడెను. ఈ వరవరముని స్తోత్రము తమిళ ఆంధ్రభాషలందు కూడ రాజావారి చేత రచియింపబడెను.

శ్రీ పెద మాధవరాయణింగారి కాలము నుండియు రావు వంశీయులు వైష్ణవ మతావలంబులగుట వలన శ్రీ రాజా గంగాధర రామారావు గారును వైష్ణవమత సాంప్రదాయములన్నియు బాగుగా ఆకళింపుఁజేసికొని ఈ 'వరవరముని స్తోత్రము' వ్రాసిరని కావ్య పరిశీలనమున స్పష్టమగుచున్నది. శ్రీమత్కాళాంబి గోపాల కృష్ణమాచార్యులు రచించిన పీఠికాపుర సంస్థాన చరిత్రమను గ్రంథమున 17వ శతాబ్దిలో శ్రీ మణవాళముని పెదమాధవ రాయణింగారికి వైష్ణవమత దీక్ష నొసగెనని, శ్రీ రాజా గంగాధర రామారావు సర్పవరములో శ్రీ భావనారాయణ స్వామి ఆలయమున శ్రీ మణవాళముని విగ్రహము ప్రతిష్ఠించెననియు కలదు. ఎఱ్ఱమిల్లి లక్ష్మీనారాయణ కవి వ్రాసిన 'వాసవదత్తాపరిణయ అనుబంధము' వలన "శ్రీమత్తిరుమల వేంకట రామానుజ గురువరుల' నుండి శ్రీ గంగాధర రామారావు వైష్ణవమంత్రోపదేశము పొంది గురువునకు సర్పవరమున ఘనసౌధము నిచ్చిరని, తెలియుచున్నది. శ్రీ రాజావారు మణవాళముని విగ్రహము సర్పవరములో ప్రతిష్ఠించుటకు కారణము లక్ష్మీనారాయణకవి ఈ విధముగా తెల్పెను.

సీ॥ కన కాంచలోల్లసత్కౌశేయ వస్త్రముల్పరిధాన సంవ్యాన సరళినొంద
రత్నకుండలకాంతి రమ్యకపోలుఁడై మణికిరీటాంచిత మస్తకుఁడయి
తారహారములురస్థలి గ్రాలుచుండగా మణిసూత్రసన్నద్ధ మధ్యుఁడగుచు
పద్మాక్షమాలికా పద్మహస్తుండయి పద్మాక్షకలిత హృద్పద్ముఁడగుచు

తే॥ గీ॥ నామహా మణవాళ మహామునిమణి
కనుల కరుణరసం బెల్ల కరము నొల్క
... ... ... ... ... ... ... ...
... ... ... ... ... ... ... ...

రాజావారికి సాక్షాత్కరించి, 'భావనారాయణస్వామి పజ్జ మాకు గుడిని కట్టించుము' అని ఆదేశించెను. మణవాళముని అనగా వరవర మునియే. ఈ యాదేశానుసారము శ్రీ రాజావారు సర్పవరమున

మణవాళముని విగ్రహము ప్రతిష్ఠించిరి.

సర్వపరములో భావనారాయణస్వామివారి ఆలయమునులో
వరవరముని ప్రక్కనున్న శాసనపాఠము.

"శ్రీమచ్ఛ్రీశైల వంశజ లగు శ్రీమద్వేంకట నరహరి రామానుజాచార్యులవారి శిష్యులునూ్న పద్మనాయక కులంబనియు వెలమకులమనియు ప్రసిద్ధమైన జాతమున నగ్రగణ్యమైయుండి శ్రీమత్సర్వజ్ఞసింగభూపాల తెనుంగురాయ తిరుమలమాధవరాయ ప్రముఖ రాజముఖ్యులకు జన్మవంశంబైన రావువంశంబున జన్మించిన వేంకట సూర్యమహీపతి రాయనింగారికి తద్ధర్మపత్నియగు లక్ష్మివేంకయమగారికిన్ని పుత్రులునైన త్రిలింగోత్కటదేశముల సంధినందు పీఠపురప్రధానమగు స్వీయ్యరాజ్యము పాలించుచున్న వేంకటమహీపతి గంగాధర రామారాయనింగారు నవాశీత్యుత్తర సప్తదశ శతమిత శాలివాహనశక వర్షంబులకు సమమగు ప్రభవ సంవత్సర వైశాఖశుక్లసప్తమీ శుక్రవారమునాటికి సర్వపురమున వేంచేసియున్న శ్రీభావనారాయణస్వామివారి యాలయప్రాకారమంటపములో శైథిల్యమున నిష్టకా శిలాబంధన సుధాలేపనాదులచే బాగు చేయించి యత్నట శ్రీ మణవాళమహామునులవారికి శ్రీరామానుజ స్వామివారికిన్నీ నూతన విమాన నిర్మాణములను చేయించి యచ్చట నుండు ముక్తికాసరస్సును మరల ద్రవ్వించి సోపానములను కట్టించి జలపూరమగునట్లు చక్కజేయించినారు. యీాయన ప్రభుత్వములోనే మణవాళమునులవైభవ మతిశయిల్లినది. యిప్పుడు నాలాయిరాధ్యేతలగు నలభైస్వాములు రాజభోగప్రసాదభాగాది నిబంధనోపాధికులయి యధ్యాపకత్వమును జేయుచున్నారు ... ....

శ్రీ రాజా గంగాధరరామారావు బహద్దరువారు ఈ "వరవర మునిస్తోత్రము"ను రచించినట్లు దేవులపల్లి తమ్మన్నశాస్త్రిగారిచేత

రచింపబడిన "శ్రీ రావువంశముక్తావళీ" కావ్యమునందలి పద్యము వలన తెలియుచున్నది.

చ. నవరసకావ్యభోజ సరసాంకుకుఁడౌ మన రామరాణ్నృపుం
డవిరళ వాక్యగుంఫనము లందము నొందఁగ సాంధ్రసంస్కృత
ద్రవిడ మనోజ్ఞభాషల దిరంబుగ వర్ణన చేసెఁ బ్రౌఢిమై
నవితథ భక్తితో వరవరాఖ్యమునీంద్రుఁ బ్రబంధశైలిగాన్.

వరవరముని స్తోత్రమును గురించి తెలిసికొనుటకుముందు వరవరముని చరిత్రను పరిశీలించవలెను. ఈ వైష్ణవోత్తమునకు (1) అళయగిరి మనవాళ్లప్పెరుమాళ్ నయనార్, (2) అభిరామవరాధీసులు, (3) మణవాళమహామునులు, (4) కాంతోపయంత్రులు, (5) సౌమ్యజామాతృలు, (6) రమ్యజామాతృలు, (7) యతీంద్రప్రవణులు, (8) వరవరమునులు అని యెనిమిది నామములు గలవు. ఈ మునీంద్రుడు పాండ్యదేశమున కుంతీపురములో గోమఠకులమున శేషాంశతో ఉడయవరులకు బదులుగా తిరువాళక్కళందాస్ తిరునాపుడయ పిరాన్ తాతరణ్ణంవలన శ్రీరంగనాయకీఅమ్మాళ్ కు తిరుకొమారులై అళ్లగియ మణవాళప్పెరుమాళ్ నైనార్ అను తిరునామముతో, శ్రీశైలనాథులే ఆచార్యులుగా సాంగోపాంగముగా వేదాధ్యయనముచేసి, చతుస్సహస్ర ద్రావిడ వేదాధ్యయనముంజేసి వాని వానికి తత్తద్వ్యాఖ్యానములతో శ్రీరంగమున కాలక్షేపము చేయుచుండెడివారు. ... .... రామానుజునియందు అతిప్రామాణిక దృష్టికలవారై యుండి పెక్కు మతగ్రంథములను రచించిరి.

శ్రీమద్వరవరముని స్తోత్రమందు తొలుత సంస్కృత వచనము, పిమ్మట అష్టోత్తర శతినామస్తోత్రము, తదుపరి అరువది సంస్కృతశ్లోకములు గలవు. సంస్కృతమునందలి స్తోత్రము తరువాత తెలుగులో 60 పద్యములు, తమిళములో 60 పద్యములు గలవు.

ఇందు విశిష్టాద్వైతసంప్రదాయము నిరూపించబడెను. ఇందు స్తోత్రము చేయబడిన మణవాళ మహామునులు తెంగలై, శ్రీవైష్ణవులకు మూల పురుషులు. ఈ స్తోత్రము ఆచార్య సమాశ్రయమే అంతిమోపాయ మను వైష్ణవమతసిద్ధాంతసారము ప్రతిపాదించుచు శరణాగతిగా రచింపబడెను.

నాల్గవ వచనము (పుట-7) : కామినీ కటాక్ష రూక్ష దంష్ట్రేణ పంచబాణ ఫణా పంచకేన - దుర్వార మార దర్వీకరేణ - సందష్టం విషమ విషయవ్యాప్తి గాఢమూర్ఛితమేనం మానవం చతురా చతురక్షరీతి గారుడ మంత్రేణ సంజీవయ. - ఈ వచనము శ్రీ గంగాధరరామారావుగారి భక్తితోపాటు వారి కవితారీతిని తెల్పుచున్నది. "రామానుజ" అను చతురమగు నీ చతురక్షరి దుర్వారమార దర్వీకరునిచే దంష్ట్రితునైన మానవునికి గారుడమంత్రము వంటిదని పోల్చుట మనోజ్ఞము.

ఎనిమిదవ వచనము : ఉపాయోపాంతర దర్శనానుష్ఠానయో రజ్ఞోహ మశక్తశ్చ .... ... ఆత్మీయ దివ్యాభిమానాంతర్భూతం కృత్వా మాముజ్జీవయ. (9వ పుట). ఈ వచనము విశిష్టాద్వైత సిద్ధాంతసారము. మణవాళ మహామునుల సంబంధమే వారి సంబంధ సంబంధుల సంబంధమే ఉజ్జీవన హేతుభూతము. వారిని శరణాగతి యొనర్చుటయే ఉపాయము. అన్యములగు కర్మజ్ఞానాదు లుపాయ ములు కావు. వరవరమునుల వారని వారికటాక్షమునకు పాత్రులగు టయే మోక్షకారకమని ఆచార్యులవా రుపదేశించిన మార్గమునే రాజావారు విశ్వసించిరి. రాజావారి పరిణతమైన వైష్ణవ సాంప్రదాయ నిష్ఠ ఈ వచనమున సుస్పష్టమగుచున్నది. వరవరముని ఎట్లు శ్రీమద్రామానుజులనుగూర్చి "యతిరాజ వింశతి" అను స్తోత్రము వ్రాసిరో, అట్లే శ్రీ గంగాధర ప్రభువరేణ్యులును వరవరమునులను

గూర్చి అనువది శ్లోకములలో స్తోత్రము వ్రాసిరి. ఈ స్తోత్రమున వారి సంప్రదాయ నిష్ఠ, కవితాసామర్థ్యము, సంస్కృతభాషాపాండిత్యము బరిపూర్ణములుగా తెలియుచున్నవి.

శ్లో॥ యదాత్మతస్కరస్య మె కృతం త్వయాభిరక్షణం
ధరాధిపేన కంఠలుంఠనోచితస్య కస్యచిత్
యతిక్షమాపతే నిరంకుశ స్వతంత్రితాబలా
దివాభిషేచనం సమున్నతె పదె భవద్విభో॥

దీని కాంధ్రీకృతి —

శా. వైషమ్యంబున నాత్మతస్కరుఁడనై వర్తిల్లు నన్నీవహో
శేషాంశోద్భవ! కాచుటెల్లను శిరచ్ఛేదోచితుండైన బల్
దోషిం దెచ్చి ధరావరుండు ప్రభుతన్ దుర్వారుడై భూరి సం
తోషం బొప్ప సమున్నతోజ్జ్వల పదస్థుం జేయునట్లోఁగదే.

ఈ26వపద్యమున కవి ఆత్మవిమర్శ చేసికొనుట కన్పట్టును. కవి ప్రభువగుటవలన ఆత్మకు వ్యతిరేకముగా ప్రవర్తింపవలసివచ్చును. అట్లు విషమభావముతో ఆత్మతస్కరుడైన తాను మహాపాపిననియు, అటువంటి తనను వరవరముని కాపాడుట శిరచ్ఛేదనము చేయదగిన దోషినితీసికొనివచ్చి రాజు అత్యున్నతపీఠమునకూర్చుండ జేసినట్లుండె ననియు గంగాధరరామప్రభువు తన ప్రభుత తేటపడునట్లు పలికెను. "రాజ్యాంతే నరకం ధ్రువం" అను ఆర్యోక్తిపై కవికి నమ్మక యున్నదని చెప్పవచ్చును. ఇట్లే 27వ పద్యమున "మతిసెడి నీచ వర్తన మగ్నుడనౌ నను నాదరించుటల్" ఇత్యాదిగా తనప్రవర్తన లోని నైచ్యమును సహితము బహిర్గతము గావింపగల్గిన కవి ఎంతటి ఉదారహృదయుడో! ఈ స్తోత్రము ఉపమా రూపకాద్యలంకార విశేషములతో విరాజిల్లుచున్నది.

శ్లో॥ యథా భువి ఘటాదకే ప్రతిఫల ద్రవేర్మణ్డలం
విలోకితు మపి క్షమం నహి భవేద్యతిక్ష్మాపతే

మమాంపిచ మనోఘటే విలసదార్తి నీరేచరే రసాం
తథా చరసి దుర్గ్రహం భవతి హంత తేజస్తవ॥

ఆంధ్రీకృతి :

చర్చింపం గలశోదకంబునఁ బ్రతిచ్ఛాయార్క బింబంబుదా
నర్చి ర్మండల మండితంబనుచు నిన్ ధ్యానింపరానట్లు నీ
యర్చారూపము నా మనఃకలశమం దవ్యాహతస్ఫూర్తి చేఁ
జేర్చున్ సంతత మూర్తి నీరమున దీప్తిం గాంత సౌమ్యవ్రతీ.

తన మనసనెడి కుండలో ఆర్తియనెడి నీటిలో ప్రతిబింబించు వరవరముని తేజోరూపము కాంచలేకుంటిననియు, ఘటస్థమగు నుదకమున ప్రతిఫలించిన సూర్యునివలె ఆమూర్తి దుర్గ్రహముగా నుండెననియు కవి తెల్పుచున్నారు. ఇట రూపక ఉపమాలంకారములు గలవు.

28 చ. కలియుగమందురాజు లతికర్కశులుం గలి పురుషాంశజుల్
మలిన మనస్కులంచుఁ బలుమారును బల్కుదు రార్యులెల్ల నేఁ
దలపఁగ నందు దుర్మదుఁడ దారుణ చిత్తుఁడనైన నన్ను నీ
వెలమి ననుగ్రహించుట యహేతుకమేకదా లోకవందితా!

53. మాధవరాయ వంశమున మాన్యతమీర జనించె వృత్తిచే
సాధుగుణాళిచే నితడు సర్వవిధంబులఁ దత్స్వముండటం
చా ధరణీతలిన్ విబుధులేఁ గొనియాడఁ జరింతునయ్య నే
శ్రీధర వ్యాధ్య యీకపట చేష్టలకు న్నను నేమనందగున్.

ఇట్లు రాజావారు కావ్యమంతటను తమ ఆర్తినే తెల్పుచు వచ్చిరి.

“శ్రీ .... ... శ్రీకర రావు వంశ కలశీజలరాశి సుధాంశుమూర్తి, నిర్వ్యాకులవర్తి వేంకట ధరారమణీపతి రామరాయ సుశ్లోకుని విన్నపంబు వరసుందర సౌమ్యమునీంద్ర! దాని నీవా కవితాదరంబు చెలువార ముదంబునఁ జేకొనం దగున్.” — ఇది ముగింపు.

ఈ స్తోత్రమున మొదట వరవరముని రామావతారమున రామానుజుడగు లక్ష్మణునిగను, కృష్ణావతారమున కృష్ణాగ్రజుడగు బలరామునిగను, రామానుజాచార్యునిగను స్తుతింపబడెను. బలరామావతారమున శేషుడు తనశిష్యుడగు సుయోధనుని ఢిల్లీకి ప్రభువై పుట్టుమని వరమిచ్చి, అతడు ఢిల్లీప్రభువైనపుడు తాను రామానుజుడై ఆ ఢిల్లీప్రభుతనూజ బీబినాంచారమ్మను రామదేవునితో వివాహమొనరించి, "చెల్వపిళ్లె" అని నామకరణమొనరించెను. ఇట్లు స్తోత్రమంతయు భక్తికవితలు పెనవేసుకొనియున్నవి. శ్రీరాజావారు తమ ఆచార్యులైన తిరుమల వేంకట నృసింహ రామానుజాచార్యుల వారివలన తమకు నిష్ఠ కల్గినట్లు తెల్పిరి.

56. "ద్రావిడ వేదసారతమతత్త్వము నీవలనం దిరంబుగాఁ
దావిని రంగశాయి విశదంబుగ శ్లోకమణిన్ రచించుఁగా
నీ విషయంబు గాఁగ ధరణీతలిఁ గావున నీప్రభావ మా
దేవుఁ డెఱుంగునయ్య పరదేవత వంచు గురైకసేవధీ!"

దీనికొక గాథకలదు. శ్రీరంగక్షేత్రమున రంగనాథుని కోవెలయందు ఆరంగశాయి పసిబాలుడై వచ్చి మహాత్ములగోష్ఠిలో వరవరముని ఉపన్యసించిన ద్రావిడ వేదసారము విని,

"శ్రీశైలేశ దయాపాత్రం ధీభక్త్యాది గుణార్ణవం
యతీంద్రప్రవరం వందే రమ్యజామాతరం మునిం"

అని స్తుతించెనట. శ్రీగంగాధరరామారావుగారు తమిళభాషయందు చక్కనిపాండిత్యము కలవారై ఈస్తోత్రమును తమిళభాషయందు కూడచేసిరి. నేటికీ అనర్ఘరత్నము లభ్యమగుటచేత, సాహితీప్రియుల జిజ్ఞాస తీర్చుటకై ఈ చిన్నికావ్యమును అనుబంధములో చేర్చుచున్నాను.

# దేవులపల్లి సోదరకవులు

శ్రీ దేవులపల్లి సుబ్బరాయశాస్త్రి, శ్రీ దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రి (తమ్మన్నశాస్త్రి) అను సోదర కవులు పీఠికాపుర సంస్థాన ఆస్థానవిద్వాంసులై వినుతికెక్కిరి. వీరు బాల్యమున శ్రీగంగాధర రామారావుగారి పినతండ్రి పుత్రులు సర్వారాయణింగారి చెంత, యౌవనమున శ్రీరాజావారి ఆస్థానమందును, వృద్ధాప్యమున గంగాధర రామారావుగారి కొమరులు సాహిత్యచక్రవర్తి డా॥రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుగారి ఆస్థానమందు నున్నట్లు తెలియుచున్నది. కాని వీరు అధికముగా సాహిత్యవ్యాసంగము చేసినది శ్రీరాజా రావు వేంకటమహీపతిగంగాధరరామారావు బహద్దరు వారి కాలమున కనుక వీరిని గంగాధరరామారావుగారి అధ్యాయమున చేర్చుట సమంజసము.

దేవులపల్లిసోదరకవుల తల్లిదండ్రులు శ్రీమతి వెంకమాంబ వేంకటకృష్ణశాస్త్రిగారలు. వీరి స్వగ్రామము కూచిమంచి తిమ్మకవి గ్రామమైన చంద్రమపాలెము. తిమ్మకవికి ప్రపౌత్రుడు, రాజా గంగాధరరామారావుగారి వలన లాక్షణికచక్రవర్తి బిరుదమందినవాడు నగు కూచిమంచి వేంకటరాయకవి ఈ సోదరద్వయమునకు ఆంధ్ర లక్షణోపదేశికుడు. దేవులపల్లి వారిది పండితవంశము: దేవులపల్లి వారి మూలపురుషుడు దేవులపల్లి వేంకటసూరి. కావ్యనాటకములను రచించిన ప్రతిభాశాలి (మహేంద్రవిజయము: 1ఆ.44). వేంకటసూరి తనయుడు రామసూరి పండితుడు. ఈతడు పూసపాటి విజయరామనృపాలునివలన వెలగవాడ అను అగ్రహారమును పొందెను. (మ. వి. 1ఆ. 55) రామసూరి తమ్ముడును సంగీతవిద్వాంసుడునైన వేంకటరామశాస్త్రి సుమారుడు బ్రహ్మసూరి "తారావళి" కావ్యమును వ్రాసి, పీఠపుర

ప్రభువులలో నొకరగు శ్రీ రావు మహీపతిరావునకు అంకితము చేసెను. ఆ ప్రభువు బ్రహ్మసూరికి ఫకర్దీనుపాలెము అను గ్రామములో సుక్షేత్రమును కానుకగా నొసగెను. (మ. వి. 1అ. 63 ప.) వీరి వంశములో జన్మించిన శ్రీ దేవులపల్లి రామశాస్త్రి "రామచంద్రోదయము" అను చంపువును, "సాహితీదర్పణము" అను నలంకారశాస్త్రము, బాలభాగవత వ్యాఖ్య, మరియు పెక్కునాటకములను రచించిన గొప్ప విద్వాంసుడు. ఈ పండిత కవి శ్రీ రావు నీలాద్రిరాయణింగారివలన "సరసతర సాహితీసారచక్రవర్తి" అను బిరుదు పొందెను. రామశాస్త్రిగారికి బుచ్చయ్యశాస్త్రి అను నామాంతరము కలదు. (మ. వి 1 అ. 72ప.) బుచ్చయ్యశాస్త్రి ద్వితీయపుత్రుడు వేంకటకృష్ణశాస్త్రి తమ్మన అనుపేర ప్రసిద్ధిపొంది "సకల పండితమండలచక్రవర్తి"అయ్యెను. తమ్మన ప్రథమపుత్రుడు బుచ్చయ్యశాస్త్రి పదియేండ్లకే పంచకావ్యములు, పండ్రెండేండ్లకు నాటకాలంకారములు, పదునారేండ్లకు శబ్దన్యాయశాస్త్రములు చదివెను. బుచ్చయ్యశాస్త్రి అనుజుడు రామరాణ్మహిపతిచేత బహుకృతుడయ్యెను. (మ.వి. 1అ. 89-92)

శ్రీరావునీలాద్రిరాయణింగారికాలమునవిద్వాంసుడుగా ప్రసిద్ధి కెక్కిన రామశాస్త్రి అనుజుడు వేంకటశాస్త్రి సర్వశాస్త్రములందు నిష్ణాతుడు. ఈతనిపుత్రుడు వేంకటకృష్ణశాస్త్రి మహాపండితుడు. అతడు రాజసభలలో ప్రసంగములు చేసి ప్రఖ్యాతిగాంచెను. ఈతని పితృవ్యుడగు సీతారామశాస్త్రి తనపాండిత్యముచేత శ్రీరావువేంకట నీలాద్రిరావు గారిని, వారిపుత్రులు శ్రీ వేంకట సూర్యారావుగారిని మెప్పించెను. సీతారామశాస్త్రి తనయుడు వేంకట కృష్ణశాస్త్రి శ్రీరాజా రావు గంగాధరరామారావుగారికి గురువై తారకబ్రహ్మ మంత్ర ముపదేశించి వినుతికెంటెను. (మ.వి. 1అ. 113-121). వేంకట

కృష్ణశాస్త్రి జనమంచి కృష్ణశాస్త్రిగారి పుత్రిక వేంకమాంబను వివాహమాడి, సీతారామశాస్త్రి, సుబ్బారాయశాస్త్రి, వేంకటకృష్ణశాస్త్రి అను ముగ్గురు సుతులను గాంచెను. (పు. 122-123.) ఈముగ్గురిలో శ్రీసుబ్బారాయశాస్త్రి వేంకటకృష్ణశాస్త్రిగారలు శ్రీపీఠాపురఆస్థాన విద్వాంసులు. శ్రీసుబ్బారాయశాస్త్రి జీవితకాలము క్రీ॥ శ॥ 1853_1909, శ్రీతమ్మన్నశాస్త్రిగారి వేంకటకృష్ణశాస్త్రి జీవితకాలము 1856-1912. వీరిరువురు ఏబదియారేండ్లు మాత్రము జీవించిరి. (విజ్ఞాన సర్వస్వము). సుబ్బారాయశాస్త్రిగారు మహారాజా సూర్యారావుగారికి సంస్కృత గురువులు.

సోదరకవులు : దేవులపల్లి సోదరకవులకు ప్రపితామహులు శ్రీ దేవులపల్లి సీతారామశాస్త్రిగారు అక్షరాభ్యాస మొనరించిరి. ఈ సోదరులు సీతారామశాస్త్రిగారి చెంత కాళిదాసత్రయము, తండ్రిగారి యొద్ద కావ్యద్వయము, నైషధము, కొన్నిచంపువులు, అలంకారశాస్త్రము, సిద్ధాంతకౌముది, తర్కప్రకరణములు, నాటకములు, కొలదిగా జ్యోతిషశాస్త్రము- అభ్యసించిరి. అమరము వీరికి కంఠస్థము. వీరి గ్రహణధారణములను గూర్చి, అవధాన విశేషములనుగూర్చి కొన్ని సంఘటనలు గలవు. క్రీ॥ శ॥ 1879వ సం॥ న శ్రీపిఠాపురం ప్రభువులు, విద్యాభోజులునగు గంగాధర రామారావుగారి ఆస్థానమున నూజివీటి సంస్థాన ఆస్థానకవియగు విద్వాన్ శ్రీ మాడభూషి వేంకటాచార్యులవారు అవధానము చేసి రాజావారిని మెప్పించిరి. రాజావారు తమ ఆస్థానమున అట్టి విద్వాంసులు కలరా యని విచారించి, సభికులలో నొకరు ఈసోదరులు అంతటి శక్తికల వారని తెలుపగా, వెంటనే చంద్రమపాలెం నుండి పిలిపించిరి. శ్రీసుబ్బరాయశాస్త్రిగారు తా మంతకుముందు అవధానప్రక్రియ చేయకున్నను, రాజావారి అనుజ్ఞపై శతావధానమును జయప్రద

ముగాచేసి రాజావారియొక్కయు, సభికులయొక్కయు మన్ననకు పాత్రులైరి (శశిరేఖ-24-2-1903). ఇట్లు వీరు ఎడనెడ అవధానములు చేయుచుండిరి. శ్రీగంగాధర రామారావుగారీ కవివరునిచేత తమ వంశచరిత్రను సంస్కృతమున "శ్రీరావువంశముక్తావళీ" కావ్యమను పేరిట రచింపజేసిరి. ఈకావ్యమును క్రీ॥ శ॥ 1882లో రాజావారు కృతినందిరి. ఈకావ్యమందలి అనల్ప కల్పనా శిల్పచాతుర్యమునకు కవితా మాధుర్యమునకు గంగాధరరామారావుగారు ఆనందపడి తమ సింహాసనమునే ఆమహాకవికి అర్పించినట్లు (శ్రీమహేంద్రవిజయము-కవిజీవితము 9వపుట), సుబ్బరాయకవిస్వారభౌముడును నిస్వార్థముతో వినయముతో "రాజ్యభారము వహింప దేవర భుజాదండంబె సమర్థంబు గాని నే వహింప సమర్థుండనే" అని వెనువెంటనే రాజావారి రాజ్యమును వారికే అర్పించిరట. మహేంద్రవిజయము 1ఆ. 134 పద్యమున ఈవిషయము తెలుపబడెను.

ఉ. "సాధుజనావన ప్రవణశస్త యశస్తవనీయ రావు గం
గాధర రామరాయ నృప గౌరవపూర్వక దత్తసింహ పీ
ఠీధన రత్నభూషణపటీ ప్రకటీకృత కావ్యకల్పనా
సాధనుఁడం దదాత్మభవ సంస్కృతదేశికతా ప్రసిద్ధుడన్."

అట్టిది ఆప్రభు నౌదార్యము; ఇట్టిది ఈ కవిప్రభుని సౌజన్యము.

శ్రీ సుబ్బరాయశాస్త్రి ఆశుకవితాధారను, శబ్దాధికారమును తెల్పెడి ఒకసంఘటన: శాస్త్రిగారి గురువులు శ్రీకూచిమంచి వేంకట్రాయకవి ఒకనాడు తిమ్మకవి "రసికజన మనోభిరామము" నందలి

కం॥ నదమా పొక్కలిజాఁబూ, నదమా మైచాయ కోకనదమా పరమా
పదమా జఘనదుము విధ్యు, త్పదమా నూగారు గూఢపదమా
చెలికిన్.

అను పద్యము చదివి, "ఇప్పటివారలీ సరణిని మృదుమధుర శైలిం గవిత రచియింపనోపుదురో?" అనిరట. అంతట శ్రీ శాస్త్రి వెంటనే ఆశువుగా,

కం. రసమా తనురుచి జితసా, రసమా వదనంబు వనధర సమాహిత
రసమా సమా కచము సా, రసమా నడుమున్న లమ్మృత రసమా
చెలికిన్."

అనుపద్యము తిమ్మకవికి దీటుగా కాదు మరియొకమెట్టు పైగానే చెప్పిరట. ఇట్లు ఆశుకవిత సహితము రసవంతముగా చెప్ప గల మేటి శ్రీ సుబ్బరాయశాస్త్రిగారు.

శ్రీ సుబ్బరాయ తమ్మనశాస్త్రిగారలిరువురు తమతమ కావ్యముల గద్యలలో ఒకరినొకరు పేర్కొనిరి. శ్రీ సుబ్బరాయ శాస్త్రి "..........శ్రీమద్రామనామ పారాయణాతిధన్య కౌండిన్య గోత్రపవిత్ర దేవులపల్లికుల పయః పయోనిధి కళానిధి సీతారామ శాస్త్రి పౌత్ర వేంకటశాస్త్రిపుత్ర తమ్మనాభిధానాంతర వేంకట కృష్ణశాస్త్రి నామాగ్రజన్మ త్రిలింగదేశాగ్రజన్మ సుధీవిధేయ సుబ్బ రాయ నామధేయ ప్రణీతంబైన........" అనియు, తమ్మనశాస్త్రి గారు "శ్రీ జానకీరమణ చరణారవింద మిళిందాయమాన మానస భావుక రావుకులతిలక సూర్యరాయ భూమండలాఖండల సమగ్రా నుగ్రహపాత్ర..............సుబ్బరాయసుధీవర సోదర తమ్మనశాస్త్రి ప్రసిద్ధాభిధానాంతర .............." అనియు పేర్కొనిరి. క్రీ॥ శ॥ 1890లో శ్రీ రాజా గంగాధర రామారావుగారు స్వర్గమలంకరింపగా శ్రీ సుబ్బరాయశాస్త్రి మిగుల పరితాపమంది, తమ తాపము నీ సీసపద్యమున వివరించిరి.

సీ. "శతలేఖినీ పద్య సంవిధాన మరసి
మా యల్లురటంచు నెయ్యమునఁ బలికె

నెఱమి వంశావళిఁ గృతిగాంచి నాగంబు
చిగిరించె ననుచు హర్షించి పొగడెఁ
బృథుల సింహాసనం బెక్కించు రాజ్యంబు
మీదే యటంచు నమ్మౌలి నొసంగెఁ
గోమఖ విద్యాభ్యాస గోష్ఠిఁ జిరంజీవి
మీ శిష్యుఁడంచుఁ జేర్నని వచించెఁ
ప్రథిత దేవులపల్లి సుబ్బరాయశాస్త్రి
యస్మదాస్థాన విద్వాంసుఁ డనుచుఁ బిలిచె
నట్టి శ్రీరావు రామరాయాఖ్యనాథు
నాకమునకన్న దైవ మేమందు నకట!"

శ్రీకృష్ణదేవరాయల మరణానంతరము అల్లసానిపెద్దన "ఎదురైనచో దన మదకరీంద్రము నిల్పి... " అని చెప్పిన పద్యము నిది స్ఫురింపజేయుచున్నది.

మహారాజా సూర్యారావుగారు దావాలో విజయ మొందుటకు వీరు బహుధా సహాయపడిరి. 2-11-1896 తేదీన సాయంసమయమున సుబ్బరాయశాస్త్రిగారు మదరాసులో పార్థసారథిస్వామి కోవెలకు వెడలి ఆలయద్వారము మూయబడుట చూచి యీ పద్యము చదివిరి.

ఉ. వచ్చినవేళ నెప్పుడుఁ గవాటము జాటుగ మూటుకొందువో
లచ్చిమగండ! నీకుగల లజ్జ తెలుంగు నెఱుంగలేక వి
వ్రచ్చుని నాటి లోటుఁ దలఁపంబడి యుపకడన్నయంబు మా
తచ్చు పటంగఁ దెచ్చియిడు నంతకుఁగావలెఁ బార్థసారథీ!

మఱునాఁడే న్యాయస్థానమున శ్రీ సూర్యారావుగారిపక్షమున తీర్పు చెప్పబడెను.

శ్రీ సుబ్బరాయశాస్త్రి సంస్కృతకృతులు :- శాస్త్రిగారు సంస్కృతమున "శ్రీరామ పంచాశత్తు", "శ్రీమద్రావువంశముక్తావళీ"

అనుకావ్యములు రచించిరి. ఇవి రెండును నేడు అలభ్యములు. శ్రీరామ పంచాశత్తు క్రీ॥ శ॥ 1875లో రచియింపబడిన అముద్రితకావ్యము. కవికృత ఆంధ్రకావ్యము "మహేంద్రవిజయము" పీఠికలో "పంచాశత్తు"నుండి రెండుశ్లోకము లుదహరించబడెను.

శ్లో॥ వదనే మృదు మందహాస లీలం వచనే సత్యకథాప్రసంగలోలం
నయనే సదయారసం ప్రసూనం చరణే చేతనితాత్మ
చూర్ణమీడే (మ. వి. 20 పుట)

శ్రీరామచంద్రుని వర్ణనతో నీశ్లోకము అలతి యలతి పదములతో మృదుమధురముగా సాగెను.

శ్రీ రావు వంశముక్తావళీ :- శ్రీ రాజా గంగాధరరామారావుగారికి అంకితము చేయబడిన ఈ చారిత్రకకావ్యము అముద్రితము. కాని యిది నవరసాత్మకమైన పదిసర్గల కావ్యమని మహేంద్రవిజయపీఠిక తెల్పుచున్నది. ఈ కావ్యముకూడ అలభ్యమగుటవలన మహేంద్రవిజయములో శ్లోకమొక్కటి యిట ఉదహరించుచున్నాను.

శ్లో॥ దూతాస్తే దదృశుః కిలాత్త వినయాపూపాండు గండద్వయీం
సాధ్వీం గర్భభరాలసాం నృపకులశ్రీ లక్షణైర్లక్షితాం
చింతా విక్లబమానసా మనితర ప్రేక్ష్యామపీ దృక్త్రయా
సంధృష్టా మివమైథిలీం భగవతః ప్రాచేతసస్యాశ్రమే.

రావువంశములో రెండవ తరము వాడైన అనపోతమనీడు పూసపాటి మాధవవర్మతోడి యుద్ధమున మరణించగా, ఆ నాటికి గర్భవతియైయున్న ఆతనిసతి వంశమును నిల్పుటకై అరణ్యమధ్యమున నడిచి భువనగిరి చెంతగల అగ్రహారమును చేరి వింజమూరి నరసన్నభట్టు అను బ్రాహ్మణు నాశ్రయించెను. ఆ రాజ్ఞీమతల్లిని సుబ్బరాయశాస్త్రిగారు, గర్భభారముచేత అలసి ప్రాచేతసాశ్రమమునకు వచ్చిన జనకాత్మజతో పోల్చిరి.

సుబ్బరాయకవికృత ఆంధ్రకావ్యములు :-

1. మహేంద్రవిజయము
2. రామరాయవిలాసము
— ప్రబంధములు

3. మల్హణ స్తవము
4. కుమారశతకము
— సంస్కృతమునుండి ఆంధ్రీకరింపబడినవి

5. మందేశ్వరశతకము — మందపల్లి శనీశ్వరు నుద్దేశించి చెప్పిన శతకము.

## మహేంద్రవిజయము

మహేంద్రవిజయము ఆఱాశ్వాసముల ప్రబంధము. ఇది క్రీ॥ శ॥ 1907వ సం॥న మద్రాసు లారెన్సు అస్సైలమ్ స్టీమ్ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడి శ్రీమత్కోట-లంక వీరవరములోనగు తాలూకాల జమీందారులైన మహారాజశ్రీ రాజారావు చెల్లయ్యమ్మారావు బహద్దరువారి గౌరవవశంబున ప్రకటితమయ్యెను. దేవులపల్లి వంశీయులు రామభక్తులగుటచే నీకవీంద్రుడీ కావ్యమును శ్రీరామచంద్రుని కర్పించెను. తానీ కావ్యమును క్రీ॥ శ॥ 1903వ సం॥న రచియించితినని కవి 6వ ఆ. 274వ పద్యములో తెల్పెను. కావ్యము మొత్తముమీద 1131 పద్యములు గలవు. మహేంద్రవిజయములో ప్రధానముగా వామనుడు బలి నణచుట - గరుడాద్రి మహిమ - బంధురతటాకమహిమలను దెల్పుకథలు కలవు.

కథాసారము మొదటిభాగము : ఇంద్రుడు దూర్వాసు డొసగిన సువర్ణాబ్జదామమును నిర్లక్ష్యముచేసి దూర్వాసునిచేత శప్తుడగును. ఆ శాపఫలితముగా ఇంద్రుడు పదవిచ్యుతుడై రాక్షస రాజగు బలిచక్రవర్తి స్వర్లోక సింహాసన మధిష్ఠించును. తరువాత శ్రీమన్నారాయణుడు అదితి కశ్యపులకు వామనుడై జన్మించి రసా

తలమునకు అణచివేయును. అంతట ఇంద్రుడు స్వర్గసింహాసనమున పునఃప్రతిష్ఠితుడై గరుడాచలమున, బంధురతటాకతీరమున శివలింగ మును ప్రతిష్ఠించెను. అదితి కశ్యపుల కోర్కెపై వామనుడు గరుడాద్రిపై అర్చాకృతిని నిలిచెను.

రెండవభాగము : నారదుడు తీర్థయాత్రలు చేయుచు కృష్ణ వేణీ నదీసమీపమునగల కనకదుర్గను సేవించి, ఆమె ఆజ్ఞపై తారక మంత్రమహిమను తెలిసికొనుటకు దక్షిణకాశియనదగిన భీమమండల మందలి పీఠికాపురనివాసియగు కుక్కుటదేవుని సేవించుటకై బయలు దేరును. అతడు మార్గమధ్యమున ఒక అరణ్యములో బ్రహ్మరాక్ష సునిచేత పీడింపబడుచున్న రాచకన్నెను రక్షించి బ్రహ్మరాక్షసుని యుదంత మడిగెను. బ్రహ్మరాక్షసుడు పూర్వజన్మలో తాను ధూర్జటిశర్మయను బ్రాహ్మణుడ ననియు, ధనార్జనాసక్తితో పుత్ర సమేతముగా పొరుగుగ్రామమునకు వెడలి, మరలివచ్చుచు బాట సారు లందఱు తనను ఆదరముగాచూచుటకై "సంధ్యావందనము కావించి వత్తును" అని పలికి నిలిచిపోగా నొక బెబ్బులి వచ్చి తనను సంహరించెననియు, నాటినుండియు తనకు పిశాచరూపము కల్గె ననియు నారదునికి తెలిపెను. ఆ ధూర్జటిశర్మ కుమారునికి ఆ దేశపు రాజు వార్షిక మొసగుచుండెనని చెప్పి నారదుడు బ్రహ్మరాక్షసుని సహచరులను పైశాచికత్వమునుండి తొలగించుటకై ఉపమాకకు కొనిపోయెను. నారదు డచట భగవంతుని స్తుతించగా నా శ్రీహరి ప్రత్యక్షమై ఒక గొల్లవానికథ చెప్పెను.

మూడవభాగము – గొల్లవానికథ : ఒక గొల్లవాడు భగ వంతుని సృష్టివైచిత్ర్యమునకు వింతపడి, వీనిని చేసిన దేవ్వరాయని యోచించుచుండెను. అచటికి వచ్చిన ఒకబ్రాహ్మణుని ఆ గొల్ల వాడు భగవంతునిగూర్చి ప్రశ్నించెను; ఆ దేవు డెట్లుండునో తెల్పు

మని యడిగెను. గిరి అగ్రభాగమున దేవు డుండుననియు నిత్యము బంధురతటాకమున స్నానమాడి పాలుమీగడలు నైవేద్యముగా పెట్టి పిలిచినచో స్వామి పలుకునని చెప్పి బ్రాహ్మణుడు తన దారిని పోయెను. ఆ గొల్లవాడు నిర్మలాంతఃకరణమున అట్లే పూజించి భగవంతుని దర్శింపగలిగెను. ఈ కథను చెప్పి పిశాచములు బంధురతటాకమున స్నానముచేసిన పిశాచజన్మము పోవునని చెప్పి శ్రీ వేంకటేశ్వరుడు అంతర్థానమయ్యెను. నారదు డట్లే పిశాచములచేత బంధుర తటాకమున స్నానముచేయింపగా వారా జన్మనుండి విముక్తులైరి.

గ్రంథనామము - ఔచిత్యము : "ఇంద్రవిజయంబు ముఖ్యగాథగా దోచెం గాన మహేంద్రవిజయమని దీనికి పేరిడుట మంచిద"ని కవి కృత్యాదిని తెల్పెను. (1ఆ. 28ప.). ఈ కావ్యమున ప్రధానమైనకథ ఇంద్రునివిజయము కనుక మిగిలిన కథలను అనగా వేదములను సోమకాసురు డపహరించుట, బ్రహ్మతపస్సు, బ్రహ్మరాక్షసునికథ, వానిచేత పీడింపబడిన రాజకుమారికథ, మూఢభక్తితో శ్రీహరిని సేవించి తరించిన గొల్లవానికథ - ఇవి యన్నియు ఆనుషంగికములని శాస్త్రిగారి అభిప్రాయము. బంధుర తటాక గరుడాచల వృత్తాంతములు భక్తికి ఉపబలకముగా చెప్పబడిన కథలు. ఈ ప్రబంధనామ సార్థక్యమును గూర్చి మహేంద్రవిజయ పీఠికలో 'భాషాభిమాని' (శ్రీ మొక్కపాటి సుబ్బారాయుడు) కొంతచర్చించి యున్నారు. (మ.వి. పీఠిక - 19, 20 పుటలు) ఇంద్రునిగర్వ మణచబడుటచేత దీనికి "మహేంద్రగర్వనిర్వాపనము" అని పేరుపెట్టుట సరియని 'భాషాభిమాని' అభిప్రాయము. కాని కథలన్నిటిని దృష్టి యందుంచుకొని చూచినచో మూలమునకు వలె "ఉపమాకామాహాత్మ్యము" అనియో, "నారాయణ కరుణామృతము" అనియో నామకరణముచేసిన అన్వర్థముగానుండును. ఇందలి కథలన్నియు

శ్రీమన్నారాయణుని మహిమను గానముచేసినది కనుక "నారాయణ కరుణామృతమ"నుట మిగుల సార్థకము. "ఉజ్జ్వలనీలమణి" ప్రకారము ఇందలి అంగిరసము భక్తిగా అంగీకరించిన శ్రీమన్నారాయణుడు కథానాయకు డగును. కాని కావ్యకర్త సామాన్యుడుకాడు. మహాపండితుడు సంస్కృతాద్యనేక కావ్యనిర్మాణకర్త, అనేకానేక కష్టక్లిష్టావధానములు కావించినవారు. కనుక నీ కావ్యమునకీ పేరిడుటలో కవి హృదయము నరగావాక చేసికొనవలెను. తొలుత చెప్పినట్లు బలిఅణచివేయబడి ఇంద్రుడు స్వర్గలోక సింహాసనమధిష్ఠించుట యొకటి. ఇక రెండవది కవిని ఈ గ్రంథరచనకు ప్రోత్సహించినది- నాటికి మైసరు రాజావారగు శ్రీరాజా రావు వేంకటకుమార మహీపతి సూర్యారావుగారి అభియోగ విజయము. "శ్రీమైసరు రాజావారి యభియోగ విజయవార్త నాకర్ణించి యమితానంద రసమగ్నులై, యత్యుత్సాహముగల తద్విజయోత్సవ వాసరంబుల నిక్కువిగా రీ మహేంద్రవిజయ ప్రబంధము విరచింప నారభించి ముగించిరి..." అని మహేంద్రవిజయ పీఠిక 19వ పుటలో కలదు.

మైసరు రాజావారిపై వారిదాయాదులగు శ్రీరాజా రావు రామకృష్ణారావు బహద్దర్ (వేంకటగిరి ప్రభుపుత్రుడు) అభియోగము తెచ్చిరి. ఆకారణమున మైసరు రాజావారు తాత్కాలికముగా పీఠపురరాజ్యపీఠము నుండి తొలగింపబడిరి. తదుపరి న్యాయస్థానమువారి తీర్పుతో రాజావారికే విజయము లభించి, పీఠపురరాజ్యమున పునః ప్రతిష్ఠితులైరి. అటులనే ఇంద్రుడు దాయాదులైన రాక్షసులవలన రాజ్యము కోల్పోయెను. మైసరు రాజావారి పక్షమున వారి యాశ్రితులందరు శ్రమపడినట్లు మహేంద్రుని పక్షమున బృహస్పతి మున్నుగాగల దేవగణమంతయు శ్రీమన్నారాయణుని ప్రార్థించి అభయము పొందిరి. శ్రీహరి బలిచక్రవర్తిని రసాతలమున కణచి స్వర్గసింహాసన

మున ఇంద్రుని పునఃప్రతిష్ఠితుని చేసెను. ఇట నింద్రుడు స్వర్లోక రాజ్యమున పునఃప్రతిష్ఠితుడగుటయే ప్రధానము. కనుకనే కవి తమ ప్రభువు విజయోత్సవవాసరములలో వారికథతో మిక్కిలి సామ్యము గల మహేంద్రుని కథ ప్రధాన ఇతివృత్తముగా నీ కావ్యము రచించి దానికి "మహేంద్ర విజయము" అని పేరుపెట్టిరి.

మూలము : ఈ కావ్యమునకు మూలము బ్రహ్మకైవర్త పురాణమందలి గరుడశైల మాహాత్మ్యమని కవి తెల్పెను(1ఆ 24ప.) గాని ఆ బ్రహ్మకైవర్తము (వైవర్తము)న మాత్రము ఆకథ లేదు. శ్రీసుబ్బరాయశాస్త్రి "అలిపిరాల లక్ష్మణ" నామధేయుడు స్పష్ట వర్ణ సమిష్టిగా వ్రాసికొనిన సంస్కృతగ్రంథము నొసగగా, అందలి గరుడాద్రి మాహాత్మ్యము తాను తెనిగించితినని కావ్యారంభమున తెల్పిరి. (1ఆ.-27 ప.) కాని గ్రంథపీఠికలో శ్రీభాషాభిమాని "మహేంద్రవిజయము"నకు మాతృకయైన ఉపమాకామాహాత్మ్యము సంస్కృతమున రమారమి నూరనుష్టుప్పు శ్లోకములు కలదై బ్రహ్మ కైవర్తపురాణమున ఒక భాగముగానున్నది. అనుటచేత-ఈకావ్యము నకు నూరనుష్టుప్ శ్లోకములు మూలమనియు, భాషాభిమాని కవి గారికి సమకాలికులగుటచేత వారును ఆప్రతి చూచియుండిరనియు భావింపవచ్చును. పీఠికలో కవి దాని నధికముగా పెంచి మూలమందలి కథతో నూతనగాథల జతగూర్చి వ్రాయబడెనని వారు తెల్పిరిగాని నూతనకథలేవియో చెప్పబడలేదు. "మూలమునందలి కథతో" అనుటచేత ఆకథ మహేంద్రుని కథయే అనియు, "మహేంద్ర విజ యము" నందలి ఇతరగాథలు నూతనము లనియు ఊహించుట కవ కాశము కలదు. అంతేకాక కవి ఈగ్రంథమున పేర్కొనిన గ్రామము లన్నియు పిఠాపురము సమీపము నందలివే. మునినివాసము "ఒంటి మామిడి" అనీ విప్రరాక్షసుడు ఆశ్రయించుకొనియున్న రావిచెట్టు

"రావికమునపాడు" అనీ, ధూర్జటిశర్మ వాస్తవ్యమైన గుంట "తేట
గుంట" అనీ, మహాభక్తితో శ్రీహరిని కొలిచిన గొల్లవాని పల్లె
గోపాలపట్టణమనీ, రాజకుమార్తె భద్రమతిని "పిఠాపురనాథుడు"
పెండిలియాడుననీ కావ్యాంతమున తెల్పెను. కనుక విప్రరాక్షసుని
కథ, ధూర్జటి కథ, రాకుమారి కథ, వల్లవుని కథ మొ॥నవి కల్పితము
లని భావింప వీలగుచున్నది. ఈ గ్రంథముయొక్క ముఖ్యోద్దేశము
గరుడశైల బంధురతటాకముల మహిమ వర్ణించుట. ఇది "ఉపమాకా
క్షేత్రమాహాత్మ్యము" అగుటచేత కథకు కథకు సంబంధము లేక
పోయినను, శ్రీ శాస్త్రిగారు శ్రీ హయగ్రీవుని మహిమలతెల్పు
ఆయాకథలను చక్కగా ముత్యాలపేరువలె ఈ కావ్యసూత్రమున
ఏర్చి కూర్చి ఆయాస్థలమాహాత్మ్యములను చదువరుల హృదయము
లకు హత్తుకొనజేసిరి.

ఇక గ్రంథనామముతో సంబంధముగల వామనావతార కథ-
కథా సంవిధానమున పోతనగారి భాగవతములో వామనావతార
ఘట్టముతో పోల్చిచూచిన కొన్నియెడలనైన భాగవతముకన్న
మిన్న యనిపించక మానదు. ముందు ఇందలి వామనావతార కథను
భాగవతమునందలి వామనావతార కథతో పోల్చి చూచెదము.

స్వర్గమును బలి ఆక్రమించగా అదితి, పుత్రుల పరాజయము
సహింపలేక, పతి నడిగి పయోభక్షణము అను వ్రతము పండ్రెండు
దినములాచరించి, శ్రీహరి ప్రత్యక్షముకాగా ఆమె తనపుత్రులస్థితిని
తెల్పి శరణు వేడెను. శ్రీమహావిష్ణువు అంతట తాను అదితి గర్భ
మున జన్మింతునని చెప్పినట్లు భాగవతములో కలదు. మహేంద్రవిజ
యములో అదితి కశ్యపులు బంధురతటాక సమీపమున నివసించుచు,
శ్రీహరిని తనయునిగా కోరి తపస్సుచేయగా కశ్యపుని ముంగల నొక
ఫలము కనిపించెననియు, కశ్యపుడా ఫలము సగము తాను తిని,

సగము అదితికివ్వగా నామె భుజించెనని యు, మాధవునికృపను వారి ద్దఱు యవ్వనవంతులై శ్రీహరిని పుత్రునిగా పొందిరనియు నిందు కలదు. ఈ మార్పును సవ్యతకోరి కవిచేసియుండును. వృద్ధులైన అదితి కశ్యపులకు కుమారుడు జన్మించుటకంటె, శ్రీహరి కటాక్ష మున వారు యౌవనులై తనయుని గాంచిరనుట ఉచితముగానుండు నని కవి ఈ మార్పు చేసియుండును.

ఉపనయనసంస్కారము ముగిసిన పిదప వామనుడు, దానవీరు డెవ్వరో తెల్పుడని అఖిలదేశముల విప్రులను అడుగగా వారు, బలి చక్రవర్తిని మించిన దానవీరుడు లేడనియు అతడు శతక్రతువు లొన రించెనని తెల్పిరనియు, అంతట వామనుడు బలిని దానమడుగబోయె ననియు భాగవతములో కలదు. కాని మహేంద్రవిజయకవి ఈ ఘట్ట మున నొక చిన్నమార్పు చేసెను. వామనుడు తనంతట తాను బలిని యాచింపవెడలెననుటకంటె, బలిచక్రవర్తి యాగదీక్షితుడై వచ్చిన వారికెల్ల లేదనకుండ దానమిచ్చెదనని ప్రకటించుట విని, అది తనకు ఉపకరింపగ నుండెనని తలచి బయలుదేరెననుట ఉచితమని కవి ఈ మార్పు చేసెను.

భాగవతమున, వామనుడు బలిచక్రవర్తి సభామంటపమునకు వెడలి, సభ్యులతో మాటలాడుచు సభలో నిటునటు నడయాడి చివ రకు రాజును సమీపించి అతనిని దీవించినట్లు కలదు. మహేంద్రవిజ యమున, బలిచక్రవర్తి యజ్ఞవాటికలో పలుతెరంగుల విహరించుచు అందరిని ఆకర్షించు వామనునిచూచి రాజు ఆంతరంగికులు ('చన వరులు' అని కావ్యమునకలదు) బలి కావార్త నెఱింగింప, అతడు వామనుని కెదురేగి ఆహ్వానించినట్లు కలదు. చక్రవర్తికడ ఆంతరం గికులుండుట, వారు వింతవర్తనలు పరికించి ప్రభువునకు విన్నవిం చుట, దానపరుడైన రాజు తనంతతాను అర్థులకెదురేగి గారవిం చుట- ఇవి చక్కని కథాసంవిధానమున కుదాహరణలు.

వామనుడు బలిని దానమడుగుటలోకూడ ఈ కావ్యము భాగవతముకంటె భేదించుచున్నది. వామనుడు ఒకటి రెండడుగుల భూమి నడుగుటమాత్రము భాగవతములో కలదు. మహేంద్రవిజయమున, బహువిధదానములలో కన్యాదానము, విద్యాదానము, భూదానము ప్రతిగ్రహమునకు అర్హములని చెప్పి, తాను వామనుడగుట కన్యాదానము అవసరము లేదనియు, విద్యాదానము గురుప్రసాదగరనియు ఇక మిగిలినది భూదానముకనుక అది కావలెనని అడిగినట్లు కలదు.

కం. బహువిధ దానములును ప్రతి
 గ్రహమున కర్హములు గదవె కన్యావిద్యా
 మహిదానములను నివి మూఁ
 డిహపర సాధనములుం ద్రయిూ సమ్మతముల్.

వామనుడు తాను అడుగదలచిన దానము సహేతుకమని నిరూపించుట సమంజసముగా నున్నది.

వామనుని సంభాషణాచాతుర్యమును, జన్మదేశనామాదుల నెఱింగించిన తీరును చూచి శుక్రాచార్యులతనిని శ్రీమన్నారాయణునిగా గ్రహించి ఆ భూదానము ఇచ్చుట తగదని బలిని వారించును. ఈ సందర్భమున భాగవతమునకు మహేంద్రవిజయమునకు చిన్న భేదము కలదు. తన హితోక్తులను పాటించని బలిని శుక్రాచార్యులు "శీఘ్రకాలంబునఁ బదవీభ్రష్టుడవు గమ్మ"ని శపించినట్లు భాగవతమున నుండగా, ఆ శాపవిషయము మహేంద్రవిజయమున విడువబడెను. అంతేగాక శుక్రుని సౌజన్యమును మహేంద్రవిజయకర్త ఇట్లు వర్ణించెను.

క. స్వామి ప్రియకాముఁడు తన
 కాములు గఱుతింప కధిప పని చెడకుండం

గా మెలఁగుఁ బతి నిరంకుశుఁ
డై మాటలు సరకుసేయఁ డనుకొనరెందున్.

శుక్రుని స్వామిభక్తి వ్యక్తమగునట్లు రచన సాగెను.

విపులీకరణము : శ్రీ సుబ్బరాయశాస్త్రి భాగవతమున క్లుప్తముగానున్న ఘట్టములను విపులీకరించినట్లు కావ్యపరిశీలమున స్పష్టమగును. వామనుని ఉపనయన ఘట్టమును వర్ణించుచు పోతన, ఋషులు సముచితమగు ఉపనయనకర్మ చేయించినట్లు సావిత్రి సవితను ఉపదేశించగా, బృహస్పతి యజ్ఞోపవీతము, కశ్యపుడు ముంజ, అదితి కౌపీనము, ధరణి కృష్ణాజినము, సోముడు దండము, గగనాధిష్ఠానదేవత ఛత్రము, సరస్వతి అక్షమాలిక, సప్తర్షులు కుశ పవిత్రము ఒసగినట్లు ఒక వచనమునమాత్రము తెలిపెను. సుబ్బరాయ శాస్త్రి తమకావ్యమున సుమారు ఇరువది పద్యములలో 4ఆ.స131–150 ప. వరకు సాంగముగా ఉపనయన మహోత్సవమును వర్ణించిరి. కవులు తమ కాలమునాటి ఆచారవ్యవహారములను కావ్యములలో వర్ణించుట పూర్వమునుండి పరిపాటి. దీనిని ప్రథమముగా ప్రారంభించిన మహాకవి తిక్కన. తిక్కన ఉత్తరాభిమన్యులవివాహసందర్భమున తెలుగుదేశమందలి వివాహమహోత్సవ కార్యక్రమమును ఆద్యంతము వర్ణించి ఆంధ్రావళికి మోదము కలిగించెను. నాటినుండి నేటివరకు కవులు ఈ విధముగా పరిణయోత్సవము వర్ణించుచుండిరి. కాని ఉపనయనవిధానమును ఏ కవియు శాస్త్రిగారివలె విపులముగా వర్ణించినట్లులేదు. శాస్త్రిగారు తమకాలమునాటి విధానమంతయు వరుసగా నాలుగుదినములు జరుగు తంతులను పూర్ణముగా వర్ణించి తమ కావ్యమునకొక నవ్యతను చేకూర్చిరి. వటుడు పీఠోపదేశమునకు సభానుమతి వేడుట, తాంబూలము పురోధసుని చేతనుంచి ఆసీనుడగుట, ఆచమనత్రయము, విఘ్నేశపూజ, పుణ్యాహవాచనము

చేయుట, సంకల్పము, పంచశిఖలుంచుట, ప్రసన్న శుభోదకస్నానము, వటుని సంభృతసూత్రుని చేయుట, వటుడు బ్రాహ్మచారులను పూజించుట, సదస్యులకు మణివస్త్రసువర్ణభూషణాదులను ఇచ్చుట, మేధాజననము మొదలైన కర్మములన్నియు ఈ ఘట్టమున వైదికపద్ధతిని క్రమముగ వర్ణింపబడెను. ఇట్లే 5వ ఆశ్వాసమున పదిపద్యములలో బలి యజ్ఞముచేయుట వర్ణింపబడెను.

భాగవతమునకు వన్నెపెట్టిన మఱియొకవిశేషము మహేంద్రవిజయమున కలదు. శుక్రుడు వామనునికి మూడడుగుల భూమి దానముగా నీయవలదని బలితో చెప్పుచున్నపుడు పలువిధములగు హితములను బోధించుట భాగవత మహేంద్రవిజయములలో సమానముగా నున్నది. దేవతలు గిరిదుర్గాద్రిని కొన్నిదినములుండుట, అదితి కశ్యపులు తపస్సుచేయగా వారికి వామనుడు జన్మించుట మున్నగు అంశములను చారులవలన తాను తెలిసికొంటినని శుక్రుడు బలికి నట్లు మహేంద్రవిజయమున కలదు. రాక్షసకులగురువైన శుక్రుడు, అనేకవేలయుగములుగ శ్రీమన్నారాయణుడు దేవతల హితము కోరి వివిధములైన అవతారములు ఎత్తి, రాక్షసరాజులను కపటోపాయముచేత సంహరించుట చూచినవాడు, కనుక దేవతల మాయలకు తనప్రభువు, రాక్షసోత్తముడునైన బలి బలికాకుండవలెనని శుక్రుడు చారులను నియమించి యెప్పటికప్పుడు శత్రువులవిషయము తెలిసికొనుచు జాగరూకుడై యున్నట్లు యిందుమూలముగా తేటపడును. బలిచక్రవర్తి "వచ్చినవాడు శ్రీహరియైనను దానమీయక మానను" అనుట విని శుక్రుడు "కొలమునకు వేరు విత్తని తెలిసి" ఇచ్చుట తగదనీ రాజనీతిని బోధించీ చక్రవర్తి వినకపోవుటచేత 'ఉస్సురని' నిట్టూర్చి ఆ ప్రదేశమును వీడెను. ఇన్నివిధముల రాజుశ్రేయస్సుకై పాటుపడిన శుక్రునిపాత్రకు ఒకప్రత్యేకత కల్పించి

నారు శ్రీ సుబ్బరాయశాస్త్రి. దానజలపాత్రిలో శుక్రుడు అడ్డు పడగా వటువు కుశాగ్రిమున పొడిచెను. దానమిచ్చుట నిరాటంక ముగా జరిగినపిమ్మట పోతన ఆ విషయము తెల్పి, అందువలన శుక్రుడు గ్రుడ్డివాడైనట్లు తెలిపెను. ఆ ఘట్టమును మహేంద్రవిజయకర్త రెండు పద్యములలో వర్ణించి దృశ్యమాన మొనరించెను.

కం. బంగారపు భృంగారువు
  నంగనవంప నొక బిందువైనను బడకు
  న్నం గని బలి యిది యేమను
  డుం గుశకాండమున నవ్వటువు వొడచుటయున్.

కం. సుడి వడి నిలబడె శు
  క్రుడు కన్నిడ్డునకుఁ గాఁడ గ్రుచ్చికొనఁగ న
  ప్పుడు కాణుండై కడు నె
  క్కుడు వడిగా లోహనాళగోళమువోలెన్.

క్లుప్తీకరించుట :- భాగవతమున విపులముగానుండి మహేంద్ర విజయమున క్లుప్తీకరించబడిన విషయము వామన విజృంభణము పోతనగారు "ఇంతింతై వటుడింతై", "రవిబింబం బుపమింప" మొదలుగాగల పద్యములతో తృప్తినందక ఒక సుదీర్ఘమైన వచనములో విశ్వరూపమును వర్ణించగా, శ్రీ శాస్త్రిగారు సంక్షేపముగా మూడు పద్యములలో తెలిపెను. కనుగొనునంతలో "సత్పురుషుని కీర్తివలె" మిన్నుముట్టినట్లు ఐదవ ఆశ్వాసములో తొంబదియవ పద్యమున తెల్పెను. వామనవిజృంభణ ఘట్టమున పోతనకు సాటి ఎవ్వరులేరు. అట్లు పోతనగారు లలితమైనశైలిలో ద్రాక్షాపాకమున సామాన్యునకు సహితము సులభగ్రాహ్యమగు రీతిని ఒకపద్యము, ప్రౌఢముగా అలంకారయుక్తముగా ఒకపద్యము, దీర్ఘవచనము రచించిరి. ఇట శాస్త్రిగారు ప్రౌఢమైనశైలిలో నారికేళపాకమున సాలంకారముగా వామనవిజృంభణము వర్ణించిరి.

శ్రీ శాస్త్రి కొన్నితావుల గ్రంథవిస్తరణభీతిచే సంక్షేపించినను, కొన్నియెడలమాత్రము నూతన విషయములను తెల్పుటలో ఉత్సాహము వహించి విపులీకరించిరి. బలిచక్రవర్తి వామనునికి దానమిచ్చుటకే నిశ్చయించుకొని,

గీ. అప్పుడందఱు నటు లరుదంది చూచు
 నంతలో నాతఁ డిల్లాలి నలయ నామె
 పాణి భృంగారువు నొకింత వంచునంత
 జలజల జలంబు ధారగా జాఱఁగాంచి."

ఈశ్వరార్పణబుద్ధితో దాన మొసగెనట.

వర్ణనలను రసవంతముగా చేయుటలో సుబ్బరాయశాస్త్రిగారు సర్వసమర్థులు. వీరు గీర్వాణాంధ్రభాషలలో కోవిదులగుట అవధానములలో ఆశువుగా చెప్పిన పద్యములు సహితము రసవంతములై యుండగా, ప్రభువిజయోత్సాహముతో రచించిన కావ్యమునందలి వర్ణనలు ఎంత రసవంతములుగా నుండునో ఊహించవచ్చును. ఈ మహాప్రబంధమున ఇరువదినాలుగు వర్ణనలు కలవు.

**వర్ణనలు :**

1. కవి వంశావతార వర్ణన (1ఆ. 31–135ప.), 2. ఉపమాకా మాహాత్మ్య వర్ణన (1ఆ. 150–156ప.), 3. బంధురతటాక వర్ణన (1ఆ. 157ప.), 4. గరుడశైల వర్ణన (1ఆ. 164–169 ప.), 5. కాసార వర్ణన (2ఆ. 62ప.), 6. గ్రీష్మవర్ష హేమంతఋతువర్ణన (2ఆ. 66–101ప.), 7. స్వర్గపురవర్ణన (3ఆ. 7–24ప.), 8. రాజ వర్ణన (3ఆ. 25, 26ప.), 9. దూర్వాసముని వర్ణన (3ఆ. 37ప.), 10. సురశూన్యమగు స్వర్గవర్ణన (3ఆ. 106–109ప.), 11. శ్రీమన్నారాయణ వర్ణన (4ఆ. 13–29ప.), 12. దౌహృద వర్ణన (4ఆ. 107–116ప.), 13. వామనోదయ వర్ణన (4ఆ. 117, 118ప.),

14. సూతికాగృహ వర్ణన (4ఆ. 124ప.), 15. ఉపనయనోత్సవ వర్ణన (4ఆ. 135-150ప.), 16. క్రతు వర్ణన (5ఆ. 13-15ప.), 17. వామనవిజృంభణ వర్ణన (5ఆ. 90-93ప.), 18. ఇంద్రపట్టాభిషేక వర్ణన (5ఆ. 116-131ప.), 19. నదీక్షేత్రాది వర్ణన (6ఆ. 18-38ప.), 20. కోటిఫలి భవళేశ్వరవర్ణన (6ఆ. 67ప.), 21. పీఠికాపురక్షేత్ర వర్ణన (6ఆ. 63-95ప.), 22. అశ్వత్థవృక్ష వర్ణన (6ఆ. 98ప.), 23. బ్రహ్మరాక్షస వర్ణన (60ఆ. 106ప.), 24. సూర్యోదయ వర్ణన (6ఆ. 233ప.).

బ్రహ్మ గరుడశైల విశేషముల తిలకించుచు అచ్చెరువందుటను శ్రీ సుబ్బరాయశాస్త్రి యిట్లు వర్ణించెను.

గీ. ఆత్మసృష్టికి నది లోనిదయ్యు విధికి
వింత యొనరించె నొక్కొక్కవేళ నొదవు
కవన లిపి శిల్ప గాన పాకముల గర్త
తెలుగని తెఱంగు మెఱుఁగుల నెనఁగుఁగాదె.

కవి చిత్రకారుడు శిల్పి గాయకుడు తమసృష్టిలోని గొప్పదనము నెఱుగనట్లు బ్రహ్మ తాను సృజించిన లోకమునే చూచి అచ్చెరువందుచుండెనట. కవి స్వీయానుభవములను కావ్యమందచ్చటచ్చట వ్యక్తపరచును.

ఉ. మంతన మంచుఁ గొన్ని మటుమాయలమాటలఁజెప్పి పుచ్చుట
య్యంతిపురంపు టూడిగపుటన్నుల నిన్నల నాశ్రయించుట
త్యంతముఁ గార్యసాధనములౌఁ గలికాలపుఁ బ్రాకృతావనీ
కాంతులపట్ల నట్లనే జగత్పతియే పరిపట్ల నెంచితో."

అని శారిక దేవేంద్రుని ప్రశ్నించుచున్నది. సంస్థానవిశేషములను పరిశీలించిన శాస్త్రిగారు శారికాముఖమున ఆయా విధానములు తెల్పిరి. రాజాస్థానమందుండియు నీకవి స్వేచ్ఛగా "కలి

కాలపు ప్రాకృతాపనీకాంతు." అని వివరించుట గంగాధర రామరాయేంద్రుని ఔదార్యమును తెలుపుచున్నది.

నదీక్షేత్రాదివర్ణనలు, ఉపమానాదిమాహాత్మ్యవిశిష్టతా కోటిఫలి ధవళేశ్వర పీఠికాపురాదిక్షేత్రవర్ణనలు శ్రీనాథుని కాశీఖండమును జ్ఞప్తికి తెచ్చుచున్నవి. ఇంద్రాదిదేవతలకు విష్ణువు ప్రత్యక్షము కాగా బృహస్పతి ఆ దేవదేవుని ఆపాదమస్తకము పది పద్యములలో వర్ణించును.

మ. "మృదులం బంబుజడంబరం బుపనిషన్మూర్ధాగ్ర్యంబు యోగిచ్ఛటా
హృదయాగార విహారధీరము మహర్షిశ్లాఘ్య సంవాహనా
స్పద మాకాశధునీజనిర్గృహ మజత్ప్రక్షిప్త సర్వోత్తమా
భ్యుదయ శ్రీదము శౌరి పాదమదిమ ముద్మీందు
మా కొందగన్."

అని 4ఆ. 13ప.న శ్రీమన్నారాయణుని పాదపద్మములను తొలుత చూడవలెననుచు వర్ణించి తరువాత జంఘలు, ఊరువులు, కటి, నాభి, ఉరస్సీమ, కౌస్తుభము, శ్రీదేవి, భుజములు, కంఠము, ముఖము, మస్తకము- వీనిని క్రమముగా వర్ణించెను. దేవవర్ణనము చరణాదిశిరః పర్యంతముచేయు సంప్రదాయమును కవి పాటించెను. భక్తి ప్రధానమగు క్షేత్రమాహాత్మ్యమగుటచేత వర్ణనయందు అడుగడుగు నను భక్తిభావము ప్రస్ఫుటమగుచున్నది.

పీఠికాపుర వర్ణనలో కాశికాపురమునకు పీఠికాపురమునకు సంజ్ఞా భేదమే కాని యితరభేదము లేదని కవి తెల్పెను. కాశిలో నది భాగీరథి, పీఠికాపురమందలి నది ఏలానది అని, అచట బిందుమాధవుడే ఇచట కుంతీమాధవుడని, ఆ మణికర్ణికయే పాదగయ అని, అచటి అన్నపూర్ణ ఇచటి రాజరాజేశ్వరి అని, కాశిలో శివుడు విశ్వేశ్వరుడు కాగా, పిఠాపురములో కుక్కుటేశ్వరు డయ్యెననియు కవి 6ఆ.

73 ప. లో వర్ణించెను. కావుననే యీ ప్రాంతమును దక్షిణకాశి యనుట పరిపాటి. ఈవిధముగా శ్రీ శాస్త్రిగారు తమకు ప్రియతమమైన పిఠాపురక్షేత్రమును ఇరువదియేడు పద్యములలో వర్ణించి –

శా. మున్నూటర్వది దేవతాయతనము ల్పొల్పొందు నవ్వీటిలోఁ
  జెన్నారు న్నలుతట్ల యూపముల వాసింజెందె యేలాతటిం
  గన్నారం గన సౌధయూధము లసంఖ్యాతంబు లవ్వీథులం
  దెన్నం దన్నగరీప్రభావముఁ దరంబే యేరికిన్నారదా!

అనుచు పీఠికాపురప్రభావము తెల్పుట ఎవ్వరికిని శక్యము కాదనెను. స్వర్గలోకవర్ణనమున దేవకాంతలు చంద్రుని గుజ్జనగూటి గిండియగా నుపయోగింతురని కవి చమత్కరించుట కమనీయముగా నున్నది. దేవతలు అమృతము భుజింతురని, చంద్రునిలోగల అమృతము దేవతల కాహారమగుటచేత చంద్రుడు క్షీణించునని పెద్దలు చెప్పుదురు. ఆ కథ నాధారముగా చేసికొని శాస్త్రిగారు చేసిన కల్పన చక్కగానున్నది.

పాత్రోచితమైన శైలిలో వర్ణనలుచేయుట కవి సామర్థ్యమును తెల్పును. ఎలప్రాయపు రాజకుమారైను వర్ణించు పట్టుల శాస్త్రిగారు లలితమగు అక్షరములను కూర్చినట్టే, బ్రహ్మరాక్షసుని పాత్రకు ఉచితమైన శబ్దములను ప్రయోగించిరి.

సీ॥ "కొఱవితో జగడించు కఱకు నల్లని మేను
      మిడిగ్రుడ్లు గడితంపు మిట్టనుదురు
    వెడద నోరును దుట్టపెదవులు గొగ్గికో
      అలు బుఱ్ఱముక్కు నిట్టలపుఁ జెవులు."

ఈ తీరున ఱ, డలు, పరుషాక్షరములు ఇందు ఆధిక్యము వహించి ఆయాకృతిని కట్టెదుట నిలుపును. ఇక విశ్వామిత్రరూపము తిలకింపుడు.

సీ॥ "సహజ రోషానల జ్వాలా కలాపంబు
పగిది జటాకలాపంబు దనర
నియత భస్మీకార నిపుణత్వమెఱిగించు
భాతి సర్వాంగీణ భస్మమమర
స్వాభావికా విమర్శ ప్రకర్షముఁజూపు
రీతి నిర్లక్ష్యదృక్స్థితి యొప్పఁ
బ్రకృతి సంలబ్ధ శీఘ్రప్రసాదముఁ దెల్పు
మాడ్కిని స్ఫటికాక్షమాలఁగ్రాల."

విశ్వామిత్రమహర్షి స్వభావమునకు తగినరీతిని వర్ణనచేయుచు కవి జటాకలాపము, విభూతి, దృక్కులు, అక్షమాలికలు– వీనిని ఆ ముని స్వభావముతోనే ఉపమించెను.

సాగరవర్ణన :- శ్రీమన్నారాయణుని దర్శనార్థము దేవతలు సాగరతీరమునకు వెడలగా, సాగరుడు తరంగములనెడి హస్తములతో వారిని పిలిచి, ఘోష అను కంఠముతో ముకుందుడు తనయందుగలడని ఆహ్వానించి పాద్యమిచ్చి ఆదరించినట్లు కవి వర్ణించెను. ఇట ఉత్తుంగతరంగములు పైకిఎత్తబడిన హస్తములుగా, సముద్రఘోష ఆహ్వానముగా, భంగమైన తరంగములు పాద్యముగా వర్ణింపబడెను.

వర్షర్తువర్ణన :- ఈ వర్ణనలో ఒక గొప్ప ఉత్ప్రేక్షాలంకారము కలదు.

శా. సారంగావళి మేఘలోలుప మనస్కం బౌట వెన్వెంట నే
తేరం బుష్కర శీకరంబులు ధరిత్రిం జింద మందంబుగా
నీరంధ్రస్థితిఁ ద్రిమ్మరం దొడఁగె సుస్నిగ్ధాంజన శ్యామలా
కారంబుల్దనరం గరేణు తతి నాఁ గాదంబినీ బృందముల్.

ఈ పద్యరచనలో కవి పాండితీగరిమ వ్యక్తమగును. ఇది శ్లేషానుప్రాణితమగు ఉత్ప్రేక్షాలంకారము. ఇందలి అర్థము వివ

రించవలసిన అవసరము కలదు. సారంగ, మేఘ, పుష్కరశబ్దములు శ్లేషింపబడెను. వానకోయిలలు అనెడి తుమ్మెదలు, మేఘము అనెడి మదజలమందు ఆసక్తి కలిగి అనుసరింపగా, తుంపురులు అనెడి మద జలమును వర్షించుచు, చిక్కని నల్లదనముతో కూడిన ఆకృతులతో మెల్లగా సంచరించు కరేణుసముదాయమూ అనునట్లు మేఘసమూ హము ఆకాశమున చరించుచుండెను.

సారంగము = (1) తుమ్మెద, (2) వానకోయిల.

మేఘ = ఏనుగుకాలినుండి స్రవించుమదజలము (2) మబ్బు.

పుష్కర = (1) ఏనుగు తొండమునుండి స్రవించుమదజలము, (2) ఆకాశమునుండి వర్షించు జలబిందువులు. వర్షజలమందు ఆసక్తి గల వానకోయిలలు వెనువెంట రాగా, జలబిందువులను వర్షించుచు మేఘములు ఆకాశమున మెల్లగా సంచరించుచుండెనని పిండితార్థము. శ్లేషానుప్రాణితమగు నీ యుత్ప్రేక్షాలంకారమేగాక "స్నిగ్ధాంజన శ్యామలాకారంబు" అనుచోట వాచకలుప్తోపమాలంకారము కలదు. ఈ యలంకారము ఉత్ప్రేక్షాలంకారమునకు అంగము. మొత్తము మీద ఈ వర్షర్తువర్ణనలో ఉపమాశ్లేషానుప్రాణిత ఉత్ప్రేక్షాలంకా రముల అంగాంగీభావ సమ్మేళనము కలదు. ఇంత భావనాశక్తి ఎంతటి మేధాసంపన్నులకో పండితులకోగాని అలవడదు.

ఈ కావ్యమున శబ్దాలంకారవైభవము అసమానము. ఈ క్రింది సర్వతః ప్రాససీసమొక ఉదాహరణగా స్వీకరింపవచ్చును.

సీ. "గోత్రవిఖ్యాతమై స్తోత్ర వాగ్విన్యాస
పాత్రమై పరమపవిత్రతాతి
మాత్రరీతి సరిత్కళత్రరోధః క్రోశ
మాత్ర దూరస్థమై యాత్రనీక

నేత్రపర్వంబుగా మిత్రశితాంగధృ
త్పత్ర మార్గాంతర్ధి చిత్రశృంగ
పత్ర రథాన్వయ నేత్రధిఖ్యాక స
గ్గోత్ర సన్నిధి జనస్తోత్ర సౌఖ్య

తే.గీ. దాత్రళి సుకీర్తి పద శత పత్రమాన
సత్రపాకర బంధుర సోత్రపసని
ధ్యాత్రఘముఁ బాపనో ప్రకోటు త్రపర్ణ్యా
గాత్ర శ్రీబాదరాయణ చ్ఛాత్రవర్య!"

"త్ర" ప్రాసము ఇరువదినాలుగు పర్యాయము లిచట ప్రయోగింపబడెను. బంధుర తటాకౌన్నత్యమంత వర్ణింపబడెను.

క. రాజీవనయనుఁ డాశ్రిత
రాజీవన చైత్రుఁ డప్పుడు ప్రాబల్యంబుకై
రాజీవ నవాకృతి తో
రాజీవనరాశిలోని రక్కసుఁ జెలమిన్.

ఈ కందమున "రాజీవన" అను శబ్దము నాల్గు పాదములందు ప్రారంభమున ఆవృత్తియైనది కనుక నిది పాదాది యమకము అను శబ్దాలంకారము.

గీ. జాత కర్మాఖ్య సంసార జాత శర్మ
శాలిఁ గావించె సుతు మునిశాలి పాళి
వీతవిచికిత్స యజ్ఞోపవీత మొసఁగి
నాభికృంతన విధివిధానాభికాంక్ష.

ఈ గీతపద్యమున 'జాత' శబ్దము మొదటి పాదాదిని, పాద మధ్యమున గలదు. మూడవపాదమున 'వీత' శబ్దము పాదాదిని, పాద మధ్యమున గలదు. కనుక నిది పాదాది పాదమధ్యవ్యపేతయమకము.

ప్రథమాశ్వాసమున నొక పాదాంత పాదాది అవ్యపేత చక్రవాళ యమకము కలదు.

కం. పారావార గభీరా
భీరాహిత్యప్రచార విజయాంధారా
ధారాళ కృపా పారా
సారామల వర్ణనీయ సద్యావపారా

'పారా' అను శబ్దముతో ఆరంభమైనపద్యము అదేశబ్దముతో ముగియుట ఈ శబ్దాలంకార విశేషము. భీరా, ధారా, సారా, పారా శబ్దములు అర్థభేదముతో అవ్యపేతముగా ఆవృత్తమై పద్యమునకొక వింతసొగసు కలిగించుచుండెను. ఈ రీతిగా పలువిధములైన అర్థాలంకార శబ్దాలంకారప్రాభవముతో నీ కావ్యమలరారుచున్నది.

**పాత్రోచిత సంభాషణ :** ఈ కావ్యము పాత్రోచితమగు సంభాషణతో ఒప్పుచున్నది.

క. అయ్యా! నాపున్నియ మే
మయ్యా! యిర్యేడకు మీార లరుదెంచుటచే
నియ్యెడ దొడ్డది యయ్యెం గ
దయ్యా! యియ్యెడవి మీార లడుగిడు కతనన్.

పామరజనోచితమైన శుద్ధాంధ్రపదములు గొల్లవాని మాటలకుపయోగించబడెను. సమకాలోచితమైన వేషభాషలు, ఆచార వ్యవహారము, సాంఘిక పరిస్థితులు నీకావ్యమున వర్ణితమయ్యెను. వర్షాభావ సమయమున విరాటపర్వము చదువుట శివునకు సహస్ర ఘటాభిషేకము చేయుట, ద్విజులు వారుణ జపదీక్షపూనుట, ఋశ్య శృంగుని స్తుతించుట, శాంతిజాతరల చేయుట, సూతికాగృహరక్షణార్థమై తీసుకొను జాగ్రత్తలు, ఉపనయన సంస్కారములు, యజ్ఞసం

విధానము, శీఘ్రప్రసవమునకు ఆరణ్యకోపనిషత్తు పఠించుట మొదలైన ఆచారములు వర్ణింపబడెను.

"ఉపమాకా మాహాత్మ్యము" వివరించుట కవి లక్ష్యము. 2వ ఆశ్వాసము న 118 నుండి 123వ. వఱకు ఉపమాకక్షేత్రవర్ణనము చేయబడెను.

మొత్తము మీద మహేంద్రవిజయ కావ్యము భావగాంభీర్యము, కల్పనాచమత్కృతి, వర్ణనానైపుణ్యము, పాత్రోచితమగు శైలితో విరాజిల్లుచు శ్రీ దేవులపల్లి సుబ్బరాయశాస్త్రిగారి ప్రబంధ నిర్మాణచాతుర్యమునకు గీటురాయిగా నిలిచినది. 'భాషాభిమాని' పీఠికలో అన్నట్లు వీరి కవితాధోరణి "గాంగనిర్ఝర సదృగ్ధారాళంబు" అనియు, ఈ కావ్యము సమకాలీన ప్రబంధములలో ఉత్కృష్టమైన దనియు నిర్ణయించుట అతిశయోక్తి కాదు.

## రామరాయవిలాసము

మూడాశ్వాసముల ఈ చారిత్రక కావ్యమును శ్రీసుబ్బరాయశాస్త్రిగారు మహారాజా సూర్యారావుగారి కోర్కెపై వారికి అంకితము చేసిరి. మహారాజావారి పరిణయగాథ అభివర్ణితమైన ఈ కావ్యము క్రీ॥శ॥ 1911లో కాకినాడ సుజనరంజనీ ముద్రాక్షరశాల యందు ముద్రింపబడెను.

కథాసారము : పిఠాపురము అను పట్టణమును శ్రీరావు సూర్యారావుగారు పరిపాలించుచుండిరి. వీరి సోదరి లక్ష్మీవేంకయాంబ, అనుజుడు కుమార మహీపతిరాయలు. సూర్యారావుగారి ధర్మపత్ని రాణీ లక్ష్మీవేంకయాంబ శ్రీ చింతపట్ల గంగాధరరామారావు పుత్రిక. సూర్యారావుగారికి ధర్మపత్నియందు 1. నీలాద్రిరాయలు 2. గంగాధరరామరాయలు 3. వేంకటరాయలు 4. సూర్య

నారాయణ ప్రకాశరాయలు అను నలుగురు తనయులు, భావయాంబ అను కుమార్తె జన్మించిరి. సూర్యారావుగారు మరణించిన తరువాత, ప్రథమపుత్రుడు నీలాద్రిరాయలు కూడా మరణించగా శ్రీగంగాధర రామరాయలు పీఠపురసింహాసనమధిష్ఠించెను. వీరి అనుజులలో సూర్యనారాయణ ప్రకాశరాయలు బొబ్బిలి సంస్థానాధిపతులకు దత్తుడయ్యెను. గంగాధర రామారావుగారు బీదసాదలయెడ ఆదరము, భ్రాతృప్రేమ, ద్విజసత్కవి సత్కారముల పట్ల మక్కువ కలవారై రాజ్యపాలనము చేయుచుండిరి.

ఒకనాడు తిరువూరు రాజధానిగా నూజివీడు సంస్థానముపాలించుచున్న వెల్లంకి జగన్నాథరాయల చెంతనుండి ఇద్దరు పురుషులు వచ్చి గంగాధర రామరాయని పినతండ్రియగు కుమారమహీపతి రాయలకు, వారిసోదరియు వెల్లంకివారి కోడలునైన లక్ష్మివెంకయాంబకు తమప్రభువు వ్రాసినలేఖ నొసగిరి. జగన్నాథరాయల పెద్దకుమార్తెను పిఠాపురమువారి సమీపబంధువునకు, మిగలిన ఇద్దరు కుమార్తెలను పిఠాపురము రాజకుమారులకు ఇచ్చి వివాహము చేయించవలెనని ఆలేఖలో జగన్నాథరాయలు కోరెను. వధువులు వెంకయాంబ మంగయాంబ చెల్లయాంబలు. కుమారమహీపతి తల్లి భావయాంబ వెంకయాంబను తనమేనల్లుడైన చెలికాని వెంకటరాయనికి, మంగయాంబను పౌత్రుడైన గంగాధర రామారాయణింగారికి చెల్లయాంబను సూర్యరాయునికి వధువులుగా నిర్ణయించి కుమార్తెకుమారుల పౌత్రుల సమ్మతి బడసెను.తదుపరి భావయాంబ లక్ష్మివెంకయాంబలు తీర్థయాత్రలకు వెడలుచు మధ్యేమార్గమున వెల్లంకివారి పిల్లలను చూచి వివాహవిషయము మాటలాడి భద్రాద్రికి వెడలిరి.

భద్రాద్రిరాముని సేవించి భావయాంబ లక్ష్మివెంకయాంబలు పిఠాపురమునకు తిరిగి వచ్చినంతనే వివాహసుముహూర్తముల నిశ్చ

యించి మంగళద్రవ్యసమేతముగా నిరువురు పురోహితులను, దాస దాసీలను తిరువూరు పంపిరి. ఆ పురోహితు లచటికి వెడలి ముహూర్తము తెల్పి పరిణయవేదిక పీఠికాపురమే యని జగన్నాథరాయనికి తెల్పి అంగీకారము పొంది మరలి వచ్చిరి. కుమారమహీపతి తమ కులాచారము ననుసరించి తొలుత రేచుని పెండ్లిచేయించి, తరువాత గంగాధరరామ సూర్యరాయల వివాహములు చేయించిరి. మంగయాంబ దానధర్మములలో పతిని మించినదని పేరుపొందెను. బహుకాలమునకు మంగయాంబా గంగాధరరామరాయలకు తనయుడు కలుగగా, వారు ఆ బాలునికి రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు అని నామకరణము చేసిరి. గంగాధరరామారావుగారి పినతండ్రి, తండ్రి పేరులు రెండును ఈ కుమారుని పేరులో గలవు.

**వర్ణనలు :** 1. పీఠికాపురవర్ణన (1ఆ. 62–80ప.) 2.ఏలానది వర్ణన (1ఆ. 66,69ప.) 3. రాజ 4. రాజ్ఞీవర్ణనలు (1ఆ. 81–90, 100–10 ప.) 5. కుమారాభ్యుదయము (1ఆ. 94ప.) 6. ఋతువర్ణన (3ఆ. 112–122) 7. వివాహవర్ణన (3ఆ. 123–173ప.)

కథ ప్రధానముగాగల కావ్యము కనుక నిందు వర్ణనాచమత్కృతికి అంతగా అవకాశములేదు. అయినను కవి శక్తి వంచన లేకుండా ఈ కావ్యమున ఎన్నియో కమనీయవర్ణనాచమత్కృతులు కావించెననుటలో సందేహములేదు. పీఠికాపురోపవనవర్ణన రామణీయకమును బరికింపుడు.

మ. ఉపశల్యంబుల నెల్లెడం దనరుఁ గుల్యౌఘ సంవర్ధితా
నుపమానేక్షువన ద్విరేఫలలితానూన ప్రసూన ప్రతా
న పరీతోపవనంబు లంగజుఁడుఁ గిన్కం గాముకాళీజయా
ర్థపరుండై ఘటియించు నక్షయధనుర్జ్యాబాణ గేహంబులై.

ఉపవనములు మన్మథుని అక్షయధనుర్జ్యాబాణగృహములనుట, ఆ వనములందలి పుష్పసంపద అతిశయము తెల్పుట.

సీ॥ "జలితంపు టాకుఁదోటలకు నీరెత్తు నే
తముఁదోడుజనుల గానములసొబగుఁ
బాలి హెచ్చి కోలకురాఁగోలుచు కళ్ళమునూర్చు
కాపుబిడ్డల గీతికాస్వనంబుఁ
బండిన పైరెత్తుఁ బసరుపై రేల గా
వలియున్నచెలుల గీతుల రవంబుఁ
జెఱకుగానుఁగు పెడ్లఁజుఱుకుగా నడిపించు
వైతనికులొనర్చు పాటనులివుఁ

గీ॥ గూడి చిఱుచలి నిద్దుర వీడలేని
పాంథజనముల మేల్కొలుపువైనములకు
హెచ్చరిక జేయుఁ గ్రామ బహిర్వితర్థి
కాతతులనుండి మాగధగీతు లగుచు."

ఈ పద్యము, 3 ఆ. 180 ప. సంగీతనృత్యకళలయందు కవికి గల అభిరుచి తెల్పుచున్నది. చంద్రమపాలెం వాస్తవ్యులైన శాస్త్రిగారు పల్లెపట్టులందలి పచ్చని దృశ్యములతోపాటు జానపద గీతముల సొగసు నాస్వాదించుచు, అవి వందిమాగధుల మేల్కొలుపులవలె నుండెనని వర్ణించిరి. కవి సంగీతాసక్తి ఈ క్రిందిపద్యమునను వ్యక్తమగుచున్నది.

ఉ. బురఖాలోని విపంచిక పోలిక మణిపుంజీవృతంబైన పం
జరమందున్న శుకీవతంసము గతిన్ సాంద్రాంబు భృన్మండలాం
తర మందొప్పు మెఱుంగుఁబోలె దళలీనంబైన పూగుత్తినాఁ
దెరతో నచ్చటికిచ్చెఁ దెచ్చెను బురంధ్రీశ్రేణి యక్కన్యకన్.

పరిణయ వేళ వధూవర్ణనమిది. వధువును బురఖాలోని హేణియ తోను, పంజరములోని చిలుకతోడను, దట్టమైన మేఘమాలమాటున గల మెఱుపుతీవతోడను, పత్రములచేత ఆవరింపబడియున్న పుష్ప గుచ్ఛముతోడను ఉపమించుట కవికి ప్రకృతిపట్లగల గాఢాను రాగమును స్పష్టీకరించుచున్నది.

వధూవరులు తలంబ్రాలు పోసికొను ఘట్టమును వర్ణించుచు కవి "జానక్యాః కమలామలాంజలి పుటేయాః" అను శ్లోకమును అనుసరించెను.

సీ. "పొడలపైనుంచి నప్పుడు జీమూత
జాత జాత ఖ్యాతి సంగ్రహించి
వేణీభరమునుండి వెలువడుచున్నప్పు
డహిసంభవత్వంబు రహివహించి
కనురెప్పలందుండి యనువొప్ప జాఱుచో
మత్స్యసంభూత సంపదవహించి
గళ సమీపమునుండి గళితంబు లగుతఱి
శంఖోద్భవఖ్యాతి సంతరించి
గీ. వరుఁడు దోయిళ్ళఁ గీలించి వడిగనించు
సేసముత్తెంబు లత్తన్వి శిరమునందు
క్రమమెలర్పఁగ జన్మదేశములనుండి
యవ్వుడప్పుడు వెలువడు చొప్పుఁదోచె."

వధువు శిరమున వరుడు నించు ముత్తెపుసేసలు వర్ణించుచు శిరమున పడినప్పుడు మేఘములలోపుట్టి క్రిందికి జారుచున్నట్లు, వేణినుండి జారునప్పుడు నల్లనిసర్పమునుండి పుట్టినట్లు, కనురెప్పల నుండి జారుచో చేపలనుండి పుట్టినట్లు, కంఠసీమనుండి జాలువారు నప్పుడు శంఖమునుండి ఉత్పన్నమైనట్లు కవి ఉత్ప్రేక్షించెను. ఈ రీతిగా వైవాహిక తంతునంతను కవి ఏబది పద్యములలో వర్ణించెను.

ఉ. వచ్చిన మిత్రబాంధవ నృపాలక జాలక మప్డు కానికల్
దెచ్చిన మత్తదంతు లెడలించెను దేటుల కామునీటిచే
హెచ్చగు తమ్మితేనియల మొద్దడిఁ దోఁగిన దప్పిదైవమే
యిచ్చుఁగదా యుపాధిగఁబవేమి యొనర్చు నదృష్టవంతులన్.

పరిణయమునకు వచ్చిన మిత్రబాంధవనృపాలురు కానుకగా మదగజములను దెచ్చిరి. తమ్మితేనెల మొద్దడికి దప్పికగొనియున్న తుమ్మెదలకు మదగజములు మదజలముతో దాహము తీర్చెను. అదృష్టవంతులను కలవేమి చేయును! దైవమే ఉపాధి కల్పించును గదా! అని చమత్కరించుచున్నాడు కవి. హృద్యమగు నీవర్ణన అర్థాలంకారశోభితమై ఒప్పుచున్నది.

ఉ. తమ్మ నితాంతము దనదు తమ్ముని వేంకటరావు బోలె చి
త్తమ్మున సమ్మదమ్ము నియతమ్ముగఁ గ్రమ్మఁగఁ జూడబంధుజా
తమ్ములు సంతసింప సతతమ్మును ధర్మనృపాను జన్యుపే
తమ్ముగ సూర్యనేత విదితమ్ముగ భక్తిభజించు నవ్విభున్.

చక్కని పాదాది పాదమధ్య యమకములిట్టి వనేకము గలవు.

ఈ కావ్యరచనాకాలమునాటికి ఆంధ్రసాహిత్యముపై ఆంగ్ల ఉర్దూభాషల ప్రభావము కలదు. అందువలన నీ కావ్యమున కొన్ని ఆంగ్లపదములు, ఉర్దూభాషాపదము లధికముగాను కలవు. సుర్వాలు, బురఖా, కైజారు, దేవిడీ, బీబీవంటి ఉరుదూపదము లధికముగా నున్నవి. "చల్లకు నేగుదెంచి కలశంబును దాపగనేల" వంటి సామెతలు జాతీయభావము సంతరించుచున్నవి. మొత్తముపై కవి అన్నట్లు "మకరంద లహరికా మాధుర్యరసపుష్టి", "సుకుమార పద గుంభనము", సుకరరార్థగుంభన ప్రౌఢిమ విజృంభణ"లతో నీ రామరాయ విలాసమలరారుచున్నది.

## మల్హణము — మందేశ్వరశతకము

మల్హణము-మందేశ్వరశతకములు రెండును గలిపి క్రీ॥ శ॥ 1949లో మద్రాసు శుభోదయ ముద్రణాలయములో ముద్రితమై, శ్రీ పిఠాపురము మహారాజావారిచేత ప్రకటితమయ్యెను.

మల్హణము :- మల్హణకవి సంస్కృతమున రచియించిన శివస్తోత్రమున కాంధ్రీకృతి ఈ మల్హణస్తవము. ఇందు మల్హణుని సంస్కృతశ్లోకము, వెంటనే అనువాదపద్యము ముద్రితమగుటవలన సరిపోల్చుకొని విమర్శించుకొనుట సులభసాధ్యము. మల్హణకవి దెంతప్రౌఢమైన శైలియో సుబ్బరాయకవీంద్రునిదంత ప్రౌఢమైన శైలి. మచ్చునకొక మల్హణకవిశ్లోకము, శాస్త్రిగారి పద్యము పరిశీలింతము.

శ్లో॥ కాంతా కచ ప్రచయ పుష్ప సుగంధి గంధ లుబ్ధ భ్రమద్భ్రమర కర్బుర కంధరాయ
గంధర్వయక్ష సుర సిద్ధ కిరీట కోటి సంఘట్ట ఘృష్ట చరణాయ నమశ్శివాయ."

సుబ్బరాయకవివరు అనువాదము :

"ఉ. శ్రీకర కామినీ కచపరీత సుమప్రచయోరు సౌరభ
స్వీకరణ భ్రమద్భ్రమర విభ్రమ కర్బుర కంఠకాంతికి
న్నాక సమస్త మూంగ మకుటాగ్ర విఘట్టన ఘట్టితాంఘ్రి పీ
ఠీ కమనీయమూర్తికి ఘటించెద వందన మిందుమౌళికిన్."

మూలమందలి పదములను ఆంధ్రీకరణమున యథాతథముగా స్వీకరించుటలో, మూలభావస్ఫురణ కలిగించుటలో శ్రీశాస్త్రిగారు శ్రీనాథుని తలపించిరి. కొన్ని పద్యములందు కవి మూలశబ్దములనే గ్రహించియు, సర్వతః ప్రాసతో తన ఆంధ్రీకరణపు వన్నె తెచ్చెను.

శ్లో॥ అన్యైర విందమకరంద హృతాలి బృందమందార కుంద దళ
దామభిరిందుపకాళే
పూజాం విధాయ భవతో విలసంతి దేవదేవేంద్రమందిరై
స్సహ సుందరీభిః॥

ఈ శ్లోకమున బిందుపూర్వక దకారము ఆరుమారు లావృత్తి యయ్యెను. శాస్త్రిగారు దానినే తమపద్యమున ప్రాసగా స్వీకరించి పాదాదినుండి పద్యాంతమువరకు 20 మారులు ఆవృత్తి చేయుటతో పద్యపునడక కమనీయముగా సాగినది.

ఉ. కొందరమంద భక్తి తమకుందుబకింప మరంద బిందు ని
ష్యంద మిళింద బృంద హరి చందన కుంద నవార విందకో
టిందగ నీదు పూజలు ఘటించి పురందర మందిరంబు లం
దుందురు సుందరీకలన మొందుచు నందుల నిందుశేఖరా!

ఈ సర్వతః ప్రాసము అభ్యాసవశమున అలవోకగా సాగనే గాని ప్రయత్నసాధ్యము కాదు.

ఉ. ఆటల పెంపునం దవిలి యైన భువిన్నిశువు ల్తృణాదులన్
సూటిగఁ గూర్చి పూవులనుచు న్జలమంచును గంధమంచుని
న్నాటముగా భజించెదరొ వారును బొందుదురీశ! మింటిపై
తేటగ వ్యోమ యానములఁ ద్రిమ్మరు వేలుపుటాండ్రప్రేమన్.

శివపూజ ఆటపాటలలో చేసినను స్వర్గలోకము ప్రాప్తించునని మల్హణుడు చెప్పెను.

శివుని యనుగ్రహము కలవారికి ఈ లోకమున దివ్యరసాయన ఔషధిరసంబులు, ధాతువాదము, యోగవశీకారములచేత జనష్ట ఘటికాఖడ్గములు, గారుడాది మంత్రవిద్యలు, పాతాళాది వాదములు ప్రాప్తించునని ఇరువది రెండవ పద్యమునను, మనోహారమైన దూర శ్రవణఖేచరతా ముక్తియుత క్రమణములు, అష్టైశ్వర్యము, పర

కాయ పరపుర ప్రవేశ సామర్థ్యము కాలత్రయీ స్ఫురితజ్ఞానము కలుగునని యిరువదిమూడవపద్యమున కలదు. మొత్తముమీద నీ స్తోత్రము భక్తివైరాగ్యభావ సమ్మిళితమై యున్నది. దేవులపల్లి వారందరు శ్రీరామచంద్ర చరణసేవాసక్తులు. శ్రీ శాస్త్రిగారు స్తోత్రాంతమున వ్రాసిన పద్యము వారి హరిహరాభేదతత్త్వమును దెల్పుచున్నది.

"చ. ఒనరిచినాడ దీనిఁ గొనుమో శివ! మల్హణ సంస్తవంబు నే
దెనుఁగున రామభక్తుఁడను దేవులపల్లి కులోద్భవుండ స
ద్వినుతకు వేంకమాంబకును వేంకటకృష్ణసుధీంద్రమౌళికిం
దనయుడ సుబ్బరాయకవిఁ దమ్మనశాస్త్రికినగ్రజన్ముఁడన్."

**మందేశ్వరశతకము** : ఇందు నూరు పద్యములు గలవు. రాజాగంగాధరరామప్రభువుతో మందపల్లిగ్రామమున శ్రీ మందేశ్వరుడని పిలువబడు శివుని దర్శించినపుడు కవి ఈ శతకము చెప్పెను. ఈ మందేశ్వరుడు శనిచేత ప్రతిష్ఠింపబడెను. "మందేశ్వరా!" అను మకుటముగల ఈ శతకము శివునికే అంకితము. కవుల కృతులప్రశంస, సద్విభుని స్తుతి, సచివవ్యాపారములు, రాజనీతి, పతివ్రతాధర్మములు, లోకప్రవృత్తి, అవినీతి, కన్యాశుల్కము, ధనమహిమ, ఋణరాహిత్యము మొదలైన ప్రాపంచికవిషయములెన్నియో ఇందు స్పృశింపబడెను. ఇంకను వైరాగ్యము, పరోపకారము, సత్యప్రశస్తి, వినయశీలత, భూతదయ ఉపదేశింపబడెను. కుంకుమ, పసుపు, హస్తాంఘ్రికంఠాద్యలంకారములు, కాటుక, తాంబూలము, గంధము, కీలుజడ, పుష్పాలంకృతి, నుదుట సింధూరము మున్నగునవి స్త్రీలకు మంగళకరములని, ఆయా అలంకారధారణవలన పతిదీర్ఘాయువు కలవాడగుననియు కవి వ్రాసెను. సుబ్బరాయసుధీమణికి జ్యోతిషమున ప్రవేశముకలదు.

"శా. శూరున్ భీరుత ధీరు బేలతనము న్మశ్లోకు దుష్కీర్తిసా
చారున్ నైష్ఠిక ధర్మహైన్యమును విజ్ఞానిందమోవృత్తి స్వా
కారాఢ్యున్ వికృతాకృతిత్వమును బ్రజ్ఞాశాలి మందత్వముం
జేరుమ్మీవు నిషిద్ధమై వెలయు రాశింజెంది మందేశ్వరా!"

అనుచు కవి నిషిద్ధమైన రాశిలో శని చేరుటవలన కలుగు తమోవృత్తిని తెల్పెను.

కలియుగంబె బుణబాహుళ్యము మేలనియు, బుణబాధ భరింప రానిదనియు లోకానుభవముగల కవి హితోక్తి.

"మ. బుణబాహుళ్య మనామయత్వ కాసన ప్రేష్యత్వముం గల్గినన్
మణిభూషాగణ నిష్కపుష్కల మహామంజూషలున్ సుప్రసి
ద్ధ్యాశినూద్యష్ట విభూతులు న్విపుల భృత్యేభాది పత్యంబులున్
గణింపన్ దృణలేశ తుల్యములుగాఁ గన్పట్టు మందేశ్వరా!"

గ్రహశాంతులు మున్నగునవి చేయజాలననియు, శనీశ్వర ప్రీత్యర్థ మీ శతకము కూర్చితినని కవి చివరగా తెల్పెను.

"మ. దయతో డంగొను మొక్క ప్రమొక్కదెసుమా తైలప్రదీపంబయో
మయభూషాళి శమీదళంబులు తిలల్మాషాన్నమున్ లోహమూ
ర్తియు భాగంబు మహేంద్రనీలమణియుం గృష్ణాంబరబుంద్విజా
స్యాయుఁ బూజించి యొసంగినట్లు మది నానందించి మందేశ్వరా!"

తైలప్రదీపము, అయోమయభూషాళి, శమీదళము, తిల మాషాన్నము, లోహమూర్తి, నీలమణి, కృష్ణాంబరములు శనికి ప్రీతికరములు కనుక వీనిని బ్రాహ్మణునకు దానమిచ్చిన శని నిషిద్ధ రాశియందుండు ఫలము తొలగునని ఒక విశ్వాసము. ఈ శతకము మానవునికి నైతికవర్తన బోధించుటచేత నీతిశతకము, పూజావిశేషా దులు తెల్పుటచే భక్తిశతకము, వైరాగ్యబోధకమగుట వైరాగ్య

శతకము వ్రాయుచున్నాడు. తన ప్రభువైన శ్రీ గంగాధర రామారావు గారు గాఢమగు భక్తితో తైలాభిషేకము చేయుచుండిరి. తమకు ఆ ప్రభువును మందేశ్వరుడు కాపాడవలెనని శ్రీ సుబ్బరాయశాస్త్రి ప్రార్థించిరి. అనర్ఘమైన కవితాధారతో నొప్పుచున్న ఈ శతకము శతకవాఙ్మయమున చిరస్థాయిగా నిలువగలదు.

## శ్రీ కుమారశతకము — ఆంధ్రీకరణము

శ్రీ కుమారశతకము సంస్కృతమున శ్రీ రావు భాస్కర రాయనింగారిచేత రచియింపబడి, దేవులపల్లి సుబ్బరాయశాస్త్రిగారి చేత ఆంధ్రీకరింపబడెను. ఇది క్రీ॥ శ॥ 190[illegible] ఆగస్టు 1వ తేదీన కోలంక పీరవరము జమీందారిణి శ్రీ రాజా చెల్లయ్యమ్మారావు బహద్దరువారి ఆజ్ఞానుసారము మద్రాసు లారెన్సు అసైలమ్ ప్రెస్సునందు క్రొత్తపల్లి పద్మనాభశాస్త్రిగారిచే ముద్రింపబడి ప్రకటితమయ్యెను.

ఈ శతకమున 101 శ్లోకములు, ప్రతిశ్లోకమునకు వెనువెంటనే ఆంధ్రీకృతపద్యము, శ్లోకమునకు వ్యాఖ్యానము, టీక కలవు. ఇందు రామధాటీసామకశ్లోకము లిరువదియేడు గలవు. రావు వంశపు ఔన్నత్యము, మహారాజావారి మాతాపితృ నగరమహిమ, మహారాజావారి విద్వత్తు మొదలైన విషయములనుగూర్చి శ్రీ రావు భాస్కర రాయణింగారీ శ్లోకములను రచియించిరి. భాస్కరరావుగారు రావు వంశజులు; పిఠాపురము తాలూకాలోని పండూరు గ్రామము వీరి స్వస్థలము. శ్రీమతి వెంకయ్యమ్మ శ్రీ రావు రామారాయణింగారు అను పుణ్యదంపతులకు వీరు క్రీ॥ శ॥ 1820 ప్రాంతమున జన్మించి యుందురు. శ్రీ భాస్కరరావుగారీ శతకము 1897లో 1898లో మహారాజా రావు వేంకటకుమార మహీపతి సూర్యారావుగారికి

13వత్సరముల ప్రాయమున అంకిత మిచ్చిరి. రావుకులవృద్ధులైన భాస్కరరాయణింగారు కుమారునికి నీతిబోధచేయుట ప్రధానోద్దేశముగా నీ శతకమును వ్రాసిరి.

"తే॥ ప్రభుని క్షేమంబుగోరు విశ్వాసపరుల
లోన మావలె ముఖ్యులుగాన శ్రీకు
మార శతకంబుఁ దెనుఁగింతు రీరలనుచు
నభిలషింతుము సుబ్బయార్యవర్య."

అని శ్రీచెలికాని చిన జగన్నాథరాయణింగారు దేవులపల్ల సుబ్బరాయశాస్త్రిగారిని కోరిరి. "కుమారా!" అను మకుటముగల ఈ శతకము రాజనీతి బోధకము. ఇందలి సంస్కృతాంధ్ర పద్యముల పరిశీలింతము.

శ్లో॥ "మాతామఙ్గామ్బికాయస్య, పితారామమహేశ్వరః
కుమారవత్కుమారోయం, ప్రాజ్ఞయత్వరి మణ్డలమ్॥"

తే. శ్రీ నెసఁగు మంగయాంబ యెవ్వాని జనని
యెవని జనకుండు రామమహేశ్వరుండొ
యా కుమారుండు వెసగెల్చుఁ గాకయల కు
మార విఖ్యాతగతి నరి మండలంబు.

శతకారంభమున కవి రాజకుమారుని తల్లిదండ్రులను పేర్కొనుచు, అటువంటి మాతాపితలు గల సూర్యరాయకుమారుడు శత్రువులను జయించుగాక యని అభిలషించుచున్నారు. అనువాదకులు శ్లోకమును గీతపద్యమున ఆంధ్రీకరించి వ్యాఖ్యానము ప్రారంభించుచు "ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశము"లలో ఒకటైన మంగళరూపమైన ఆశీస్సులను కవి కృతికర్తకు అందించుచున్నారని తెల్పెను. సూర్యారావుగారి జనని మంగయాంబ జనకుడు గంగాధర

రామరాయేంద్రుడు కనుక వారినామములోనే పార్వతీపరమేశ్వరు లను అర్థము మహారాజావారి పేరులో 'కుమార' శబ్దము కుమార స్వామిఅను అర్థము వ్యంగ్యీభూతమగుచున్నదని తెల్పుట వ్యాఖ్యాత ప్రతిభను నిరూపించుచున్నది.

**వ్యాఖ్యానము:** "మఙ్గామ్బికా = మఙ్గాయామ్బిగాభిదానా, అంబికేవ మఙ్గాచ; యస్యపితా రామమహేశ్వరః=శ్రీమద్వేఙ్కట మహీపతి గఙ్గాధరరామరాయ మహారాజః మహేశ్వర ఇవ రామశ్చ అభూతాం........ అత్రామ్బికా మహేశ్వరశబ్దయోః పార్వతీ పరమే శ్వరార్థ క్వతాత్తత్సుతః కుమారః యథాతారకాదీన్ జితవాన్ తథాయమపి సకల మరిమణ్డలం జయత్వితాత్యాశీర్వాదః" 'కుమారా' శబ్దమునకు శాస్త్రిగారొసగిన వ్యాఖ్య వారికి సంస్కృతభాషాశబ్దము మీదగల అధికారమును వివరించుచున్నది. "(కుశ్చమాచ రాచ తాసాం సమాహారః కుమారం)" కుః అనగా స్త్రీ; మా అనగా సం పత్తి, రా అనగా శాల; భూదేవి శ్రీదేవులకు నిలయమైనవాడని వ్యాఖ్యానించబడెను. కావ్యారంభమున 'మ' గణ ప్రయోగము 'మ' వర్ణ ప్రయోగము శుభదాయకములు. ఈ శ్లోకమందలి ప్రతి అక్షరమును ఛందోవ్యాకారణాలంకార సహితముగా వ్యాఖ్యానిం చిన సుబ్బరాయశాస్త్రి బహుముఖ శాస్త్రపరిచయము, పాండితీ గరిమము కొనియాడుట వేయిజిహ్వలుగలఆదిశేషునికైననుసాధ్యము కాదనుట అతిశయోక్తిగాదు. శాస్త్రిగారిని అభినవమల్లినాథసూరిగా పేర్కొనుట అన్వర్థము 16 శ్లోకములలో మంగళాశీస్సులను చెప్పిన కవి 17వశ్లోకమున రావువంశీయులకు మూలపురుషుడైన అనపోత ముని స్మరించెను.

"శ్లో. సర్వజ్ఞ మాధవౌతస్య, శైవ వైష్ణవ ధర్మిణౌ।
వంశాద్యావః కుమార! త్వం, భవ తాదృకుకుల స్థితి॥"

"తే॥ తత్త్రనృపాలులు సర్వజ్ఞ మాధవులనంగ
శైవవైష్ణవ ధర్మమ్ములై కీవి గనిరొ
మీాదయిన యన్వయంబున కాదిపురుషు
లట్టి వంశోచ్ఛ్రయముఁ బొందుమూ కుమార!"

అనపోతముని పుత్రులైన సర్వజ్ఞ మాధవు లిరువురు శైవ వైష్ణవమతధర్మములై రనియు, నీవు (మహారాజావారిని) ఆ రెండు మత ధర్మములను పొందుమని కవి ఆశీర్వదించెను.

ఆంధ్రాంగ్లములందు పాండిత్యము సంపాదించిన మహారాజా వారిని కీర్తించుచు కవి ఆంగ్లేయుల నెట్లు విమర్శించుచుండెనో పరి కింపుడు.

"శ్లో॥ భాషేయ మఖిలాస్మాకం, బాలేన మనితామునా
ఇత్యపత్ర పయానూనం, హూణాస్సర్వే సితాననాః"

"గీ॥ బాలుఁడగు నీతఁ డీ మన భాష నెల్లఁ
దెల్లముగ నేర్చికొనియెను దెలివినను చు
నెల్లహూణులుఁ బూనిరి వెల్లఁదనము
నానచే నిక్కువంబుగ నాననముల."

బాల్యమందే ఆంగ్లము నత్యద్భుతముగా నేర్చిన బాలుడని హూణులందరు మహారాజా వారిని తెల్లబోయిన మోములతో చూచుచుండిరని ఉత్ప్రేక్షించుట రమ్యముగా నున్నది 88వ శ్లోక మునకు ఆంధ్రానువాద మీాక్రిందిపద్యము

"తే॥ చేయఁదగినట్టి పనియును జేయరాని
పనియుఁ దెలియ నశక్యమై పరఁగుఁగాన
మహిని బండితులైన బ్రాహ్మణుల నీదు
సభల నిలుపంగఁ దగును నిచ్చలుఁ గుమార!"

ఈ శతకమిట్లే శుభోషకముగా రాజనీతిని బోధించుచున్నది. శ్లోకార్థముల రవంతయైన బిసువోని కీతి శాస్త్రిగారనువదించిరి. శతక మాద్యంతము తేటతెనుగు పదములతో హృదయరంజకముగా సుగ్రాహ్యముగా నుండెను.

## శ్రీ దేవులపల్లి తమ్మన్న శాస్త్రి

సుబ్బరాయశాస్త్రి అనుజులు శ్రీతమ్మన్నశాస్త్రి నామాంతరముగల కృష్ణశాస్త్రిగారు ఎనిమిది కావ్యముల నాంధ్రభాషలో రచియించిరి. 1. స్వప్నఫలదర్పణము 2. కవిప్రభునామ గుంఫిత విచిత్ర పద్యగర్భిత కందపద్యసకలేశ్వర శతకము 3. కుక్కుటేశ్వరాష్టకము 4. సత్యనారాయణ శతకము 5. కమలాదండకము 6. శ్రీ రావు వంశముక్తావళి 7. నయనోల్లాసము 8. యతిరాజవిజయము. వీనిలో స్వప్నఫలదర్పణము అముద్రిత ప్రకాశ్యాసకావ్యము. ఇందు 112 పద్యములు గలవు. శిథిలావస్థయందున్న ఈ గ్రంథపు వ్రాత ప్రతి ఆరుపద్యములు మినహా అన్నియు లభించెను. మహారాజా సూర్యారావుగారి బాల్యమున అవతారపురుషులుగా గుర్తింపబడిరి. ఆవృత్తాంతము నెఱిగిన శ్రీ తమ్మన్నశాస్త్రిగారు ఆచారిత్రిక సత్యమును గ్రంథస్థముచేసిరి. ఏకారణముచేతనో మహారాజావారీ కావ్యమణిని ముద్రించలేదు. మిగిలియున్న ఆవ్రాతప్రతియు ఖిలము కాకపోవుట సాహితీలోకము చేసుకొనిన అదృష్టము.

కథాసారము : తమ్మన్నశాస్త్రిగారు అగ్రజునితోకలసి పిఠాపురము కోటలో దర్బారుహాలున ఉన్నట్లు కలగాంచిరి. ఆస్వప్నమున అన్న మామగారు వింజమూరి వేంకటరామయ్య, శ్రీరాజా గంగాధర రామారావుగారు, వారి మామగారు రాజా వెల్లంకి వేంకట ధామూర్ధాములు, చెలికాని చినజగన్నాథరాయలు, మహారాజా

"తే॥ తత్తనూజులు సర్వజ్ఞ మాధవులనంగ
శైవవైష్ణవ ధర్మమ్ములై కీవి గనిరొ
మీదయిన యస్వయంబున కాదిపురుషు
లట్టి వంశోచ్ఛ్రయముఁ బొందుమీ కుమార!"

అనపోతముని పుత్రులైన సర్వజ్ఞ మాధవు లిరువురు శైవ వైష్ణవమతధర్మములైరనియు, నీవు (మహారాజావారిని) ఆ రెండు మత ధర్మములను పొందుమని కవి ఆశీర్వదించెను.

ఆంధ్రాంగ్లములందు పాండిత్యము సంపాదించిన మహారాజా వారిని కీర్తించుచు కవి ఆంగ్లేయుల నెట్లు విమర్శించుచుండెనో పరి కింపుడు.

"శ్లో॥ భాషేయ మఖిలాస్మాకం, బాలేన మనితామునా
ఇత్యపత్ర పయానూనం, హూణాస్స ర్వే సితాననాః"

"గీ॥ బాలుఁడగు నీతఁ డీ మన భాష నెల్లఁ
దెల్లముగ నేర్చికొనియెను దెలివినను చు
నెల్లహూణులుఁ బూనిరి వెల్లఁదనము
నానచే నిక్కువంబుగ నాననముల."

బాల్యమందే ఆంగ్లము నత్యద్భుతముగా నేర్చిన బాలుడని హూణులందరు మహారాజావారిని తెల్లబోయిన మోములతో చూచుచుండిరని ఉత్ప్రేక్షించుట రమ్యముగా నున్నది 88వ శ్లోక మునకు ఆంధ్రానువాద మీ క్రిందిపద్యము

"తే॥ చేయఁదగినట్టి పనియును జేయరాని
పనియుఁ దెలియ నశక్యమై పరఁగుఁగాన
మహిని బండితులైన బ్రాహ్మణుల నీదు
సభల నిలుపంగఁ దగును నిచ్చలుఁ గుమార!"

ఈ శతకమిట్లే సుబోధకముగా రాజసప్తిని పోషించుచున్నది. శ్లోకార్థముల రవంతయైన బీకువోని కీర్తి శాస్త్రిగారనువదించిరి. శతకమాద్యంతము తేటతెనుగు పదములతో హృదయరంజకముగా సుగ్రాహ్యముగా నుండెను.

# శ్రీ దేవులపల్లి తమ్మన్న శాస్త్రి

సుబ్బరాయశాస్త్రి అనుజులు శ్రీతమ్మన్నశాస్త్రి నామాంతరముగల కృష్ణశాస్త్రిగారు ఎనిమిది కావ్యముల నాంధ్రభాషలో రచియించిరి. 1. స్వప్నఫలదర్పణము 2. కవిప్రభునామ గుంఫిత విచిత్ర పద్యగర్భిత కందపద్యసకలేశ్వర శతకము 3. కుక్కుటేశ్వరాష్టకము 4. సత్యనారాయణ శతకము 5. కమలాదండకము 6. శ్రీరావు వంశముక్తావళి 7. నయనోల్లాసము 8. యతిరాజవిజయము. వీనిలో స్వప్నఫలదర్పణము అముద్రిత ఏకాశ్వాసకావ్యము. ఇందు 112 పద్యములు గలవు. శిథిలావస్థయందున్న ఈ గ్రంథపు వ్రాత ప్రతి ఆరుపద్యములు మినహా అన్నియు లభించెను. మహారాజా సూర్యారావుగారి బాల్యమున అవతారపురుషులుగా గుర్తింపబడిరి. ఆవృత్తాంతము నెఱిగిన శ్రీ తమ్మన్నశాస్త్రిగారు ఆచారిత్రిక సత్యమును గ్రంథస్థముచేసిరి. ఏకారణముచేతనో మహారాజావారీ కావ్యమణిని ముద్రించలేదు. మిగిలియున్న ఆ వ్రాతప్రతియు ఖిలము కాక పోవుట సాహితీలోకము చేసుకొనిన అదృష్టము.

**కథాసారము :** తమ్మన్నశాస్త్రిగారు అగ్రజునితోకలసి పిఠాపురము కోటలో దర్బారుహాలున ఉన్నట్లు కలగాంచిరి. ఆస్వప్నమున అన్న మామగారు వింజమూరి వేంకటరామయ్య, శ్రీరాజా గంగాధర రామారావుగారు, వారి మామగారు రాజా వెల్లంకి వేంకటరామార్యాయులు, చెలికాని చినజగన్నాథరాయలు, మహారాజా

వారితో సహా కొలువుతీర్చియుండిరి. రాజావారు తనయుని లాలించుచు, తమ్మనశాస్త్రిగారికి బహూకరించుటకై సొమ్ము తీసికొని రమ్మని సేవకుని లోనికంపిరి. విషయము నెఱింగిన జగన్నాథరాయణింగారు నూరార్లకు మారు వెయ్యార్లు తెప్పించిరి. శ్రీ గంగాధర రామారాయణింగారు సుతునికి శుభసంస్కారము చేయుటకై సిద్ధపడగా మంగళధ్వనులు వినవచ్చెను. అంతతో కవి మేల్కాంచెను. కవి స్వప్నవృత్తాంతము విని సంతోషించి జగన్నాథరావుగారు శ్రీ సూర్యారావుగారి బాల్యమునజరిగిన రెండు విశేషములు తెల్పిరి. పసితనమందు శ్రీ మహారాజావారు పినతల్లి భావయ్యమ్మగారితో తాను కారణజన్ముడనని తెల్పెను.

"కం. ఏను మునీశ్వరుఁడను జ
నిమ్మ నిజ ముదయించినాఁడ మీ కొమరుఁడనై
మానక భోగవధూకృత
మానస వైకల్య కలనమాత్రనఁ దల్లీ!"

జనకుని మరణానంతరము మహారాజావారు తమ తండ్రి, కృష్ణుడు కలిసి కనిపించినట్లు తెల్పి, శ్రీకృష్ణుని రూపురేఖలు వర్ణించి ఆ కృష్ణుడు తనతండ్రి వినుచుండగా ఆలపెయ్యపై నొక కేలూని మురళి వాయించుచుండెనని చెప్పిరి. ఈ రెండు విశేషములను విని కవి తన స్వప్నమూతో నీ విధముగా సమన్వయించెను. "శ్రీ గంగాధరరామారావుగారు మనవాళమునిభక్తులు కనుక భక్తునియెడల కృప కలిగిన ఆ మునీంద్రుడే పుత్రుడుగా అవతరించెను. కలలో విని పించిన మంగళతూర్యములు సూర్యారావుగారికి విద్యాభ్యాసము చేయించునాటి మంగళధ్వనులు. చినజగన్నాథరాయణింగారు నూరార్లకు బదులు వెయ్యార్లు తెమ్మనుట నీబాలుడు శత్రువుల జయించి విజయశ్రీని వరించిన తనకు దశగుణాధికముగ బహూకృతి లభించుట."

"స్వప్నఫలదర్పణము" అను కావ్యమును కవి ఒకనాటికవలె నడిపించెను. స్వప్నవిశేషములు చమత్కారముగా నొక దృశ్యరూపమున వర్ణింపబడెను. మహారాజావారి బాల్యము, తల్లులను వర్ణించి పిమ్మట కవి చెల్లయాంబా మంగయాంబా భావయాంబికల సంభాషణమును దృశ్యకావ్యమువలె స్ఫురింపజేసెను. చివర చిత్రాడ చెలికానివారి కొలువుకూటమును వర్ణించి మరల సంభాషణాత్మకముగా కావ్యము నడిపెను. ఇట్లు చిన్ని చిన్ని అంకములవలె కావ్యమును నడిపిన తీరు మెచ్చదగినది.

శ్రీ మహారాజావారు మునీశ్వరులనుటకు ఆధారముగా శ్రీ చెలికాని చినజగన్నాథరాయణింగారి "మోక్షమార్గదర్శి" యని పేరొకన వచ్చును. ఈ కావ్యపీఠికలో, మహారాజావారు జన్మించు సమయమున ఒక యోగి వచ్చి ఒకశ్లోకము వ్రాసి పేటికయందుంచి, ఏడు సంవత్సరముల అనంతరము తెరచి చూడుమని చెప్పెననియు, ఏడు సంవత్సరముల తర్వాత తెరచి చూడగా ఈ ప్రభువు మునీంద్రుడని శాపవశమున జన్మించెననియు అందు వ్రాసియున్నట్లు, శ్రీ జగన్నాథరావుగారు తెల్పియుండిరి. ఆనాటికే శ్రీ మహారాజావారు తాను మునీంద్రుడనని జనయిత్రులకు చెప్పెను.

కవితా విశేషములు : కథాప్రధానము కావ్యము కనుక వర్ణనలకు, అలంకారాది విశేషములకు ప్రాముఖ్యత లేదుకాని అటనట ఉపమాద్యలంకారములతో శబ్దాలంకారములతో కావ్య మలరారుచున్నది.

"క. తమ్ములు నందన సంఘా
తమ్ములు బంధుజన శతమ్ములు శ్రితజా
తమ్ములు బరివేష్టించి హి
తమ్ములుగా సరసభాషితమ్ములు పలుకన్."

ఇత్యాదియమకములతో బాటు చక్కని అనుప్రాసలు కలవు.

"క. ఉల్లము యదువల్లభు పద
పల్లవముల యందు నిల్పి పావనగుణ సం
పల్లీల నెల్లప్రజలను దల్లి వలెన్
చెల్లయాంబ దనుపుచు నుండెన్."

ద్వితీయుక్తమైన లకారానుప్రాసమిందు కన్పట్టుచున్నది. అచ్చ టచ్చట చక్కని ఉపమాలంకారములు గలవు.

ఈ కావ్యమున ఆశ్వాసాంతగద్యలేదు. ఈ పుస్తకపువ్రాత ప్రతిని దయతో నాకొసగిన శ్రీ చెలికాని శ్రీరామారావుగారివలన ఈ కావ్యశీర్షిక 'స్వప్నఫలదర్పణము' అని తెలిసెను. మహారాజా వారి శాల్యమందలి పలుకులు స్వప్నఫలదర్పణముతోపోల్చి చూచి నను, వారి జీవితచరిత్రను పరికించినను వరవరమునియే మహారాజా సూర్యారావుగారివలె అవతరించెననుటలో ఎంతమాత్రము సందే హాము లేదనిపించును.

## కవి ప్రభునామ గుంభిత విచిత్ర పద్యగర్భిత కందపద్య సకలేశ్వర శతకము.

క్రీ॥ శ॥ 1923లో చిత్రాడ శ్రీరామవిలాసముద్రాక్షరశాల యందు ముద్రితమై, శ్రీ చెలికాని లచ్చారావుగారిచే ప్రకటితమైన శతకముల ద్వితీయ సంపుటములో ఈ శతకము కలదు. ఇందు 107 పద్యములు గలవు. ఇవిగాక ఆయాపద్యములందు నిక్షిప్తమైన అం శము తెలిసికొనుటకు సూచనగా ఆయా తావుల తొమ్మిది పద్య ములు గలవు. పిఠాపురమునగల సకలేశ్వరుని సంబోధించుచు, "సక లేశా!" అను మకుటముతో శ్రీ తమ్మనశాస్త్రిగారీ శతకము వ్రాసిరి. శ్రీ గంగాధరరామారావుగారి పినతండ్రిపుత్రుడు ధర్మారా యణింగారు కొలువుతీర్చిగీర్వాణాంధ్ర శుద్ధాంధ్రములలో నెవ్వరైన నొక శతకము చెప్పుడని కోరగా తమ్మనశాస్త్రిగారీ శతకము

వ్రాసిరి. చివరి ఎనిమిది పద్యములలో ఆఱవ వర్ణముల కలిపి చదివిన “దిగ్బ్రహ్మేందు సంఖ్యాక నవరాత్రిషు సాఽబ్దే శాలివాహన శకే కృతం”అని శతకరచనాకాలము తెలియును. క్రీ.శ.1874లో కవి ఈ శతకము వ్రాసెను. మొత్తము 8 విభాగములుగా శతకమును విభజించి కవి తన భావమును తెలిపెను. 8వ విభాగమువలన కవి ధర్మారావుగారి ముఖ్యాశ్రితుడని, తరువాత పీఠికాపురాస్థానమున ప్రవేశించియుండునని తెలియును.

1. మొదటి నాల్గుపద్యములలో పంద్రెండవ అక్షరముల కలిపిన “కవి వయసు పదునెనిమిది వత్సరములు”అని కవి వయస్సు 2. తరువాత 25 పద్యములలో సమపాద పంచమవర్ణముల కలిపిన “సూర్యారావుగారిని సకలేశు డాశీర్వదించుగాక” అను ఆశీస్సులు 3. తరువాత 8 పద్యములలో ధర్మారావుగారిని సంబోధించుట 4. పై 25 పద్యముల అసమపాద చతుర్థవర్ణముల కలిపిన ధర్మారాయని ఆశీర్వదించు శుద్ధాంధ్రపదముల పద్యము 5. అటుపై 12 పద్యములలో ప్రతిచరణమున ఆఱవ వర్ణములు కలిపి “ప్రకటరావుకులాబ్ధి సుధాకరో,విజయతే భువి ధర్మరాజాధిపో”అని ధర్మారాయని కీర్తించుట 6. 12 పద్యములలో ప్రతిపాద చతుర్థవర్ణగర్భితాక్షర సమ్మేళనము సంస్కృతసమాసభూయిష్ఠమైన ధర్మారాయవర్ణన 7. తరువాత 8 పద్యముల సమచరణ అష్టమ వర్ణముల కలయిక “దేవరవారి యనుగ్రహమును గోరియున్నాను” అను భావము 8. తరువాత పది పద్యములలో ప్రతి పాద పంచమాక్షరముల కలయిక కవి నామము స్పష్టమగును. మొదటి 25 పద్యములు సకలేశ్వరుని సంబోధించుచు, ఆయావిశేషణములతో కీర్తించుట కన్పట్టును.

“పరకాంతా పరహాంతా, వరదాంతాదర నితాంత భవ్యక స్వాంతా
గరిహార సూర వార, స్థిరసారతర ప్రకాశ శ్రీసకలేశా!”

"గిరిధర్మా కరిచర్మాం, బర నర్మాలాప మునిత మహీ భృత్కన్యా
పర మానస పద్మా సు, స్థిర పీఠానగర సద్మ శ్రీ సకలేశా!

ఈపద్యములు చక్కని శబ్దాలంకారములతో లయాన్వితమ్మై యొప్పుటయేగాక అర్థవంతమై జటిలపద సంకలితమై అలరారుచున్నవి. శతకమందు ప్రధానముగా భక్తి, అటనట నీతిబోధయు కానవచ్చుచున్నది. దుర్జనులు సుజనుల సహవాసముచేసినచో, సత్కీర్తి కలిగి, సంపదలుపొంది నిర్మలమనస్కు లగుదురని కవి బోధించుచుచెప్పిన పద్యము కలదు. ఈ శతకమువలన తమ్మన్న శాస్త్రిగారి పాండితీగరిమ, బహువిధములైన పురాణపరిచయము, చిత్రబంధకవితలో అసర్గశత స్పష్టమగుచున్నవి.

## కుక్కుటేశ్వరాష్టక సత్యనారాయణ శతక కమలాదండకములు చాటు పద్యములు

అష్టకము, శతకము, దండకము, చాటుపద్యములు ప్రత్యేకముగా ముద్రింపదగినంత విపుల కావ్యములు కాకపోవుటచేత నివి తమ్మన్నశాస్త్రిగారి "నయనోల్లాస" పీఠికయందే ముద్రితమయ్యెను.

**కుక్కుటేశ్వరాష్టకము** : తమ్మన్నశాస్త్రిగారు ఎనిమిది శ్లోకములలో కుక్కుటేశ్వరుని స్తోత్రము చేసిరి. ఈ యష్టకములో "మనసి కుక్కుటేశం భజే" అను మకుటముతో పటిష్ఠమైనశైలితో విరాజిల్లుచున్నది.

ఉదా : "సురాసుర శిర స్ఫుర త్కుసుమ మంజరీ నిష్టత।
నృరంద లహరీ పరిస్నపిత పాద పంకేరుహాం
సరీకృత సరీసృప ప్రవర మీశ్వరం పీఠికా।
పురీవర నికేతనర మనసి కుక్కుటేశంభజే॥"

అష్టకాంతమున ఫలశ్రుతి చెప్పి కవి తననామము తెల్పెను.

సత్యనారాయణ శతకము : "సత్యనారాయణ" అను మకుటముగల ఈశతకమున రెండు పద్యములు మాత్రమే నయనోల్లాస పీఠిక యందు గలవు. మిగిలిన పద్యములు లభించలేదు.

"శా. ఏలా బ్రోవవు నమ్మియున్న మము నీవే బ్రోవవేనిం గృపా
శీలా! బ్రోచెడి వారలెవ్వరికక నీచిత్తంబునన్ వేడుగా
నాలోచింపక యార్తరక్షణ కళాఖ్యాతోన్నతిం జూపుమా
జాలంబున్ విడనాడి రత్నగిరివాసా! సత్యనారాయణా!"

కమలా దండకము : తమ్మన్నశాస్త్రిగారు కాళిదాసు విరచిత శ్యామలాదండకము బాణిలో కమలాదండకము రచియించిరి. దండకమునకు ముందు "మాణిక్యవీణాం" మొదలుగాగల నాల్గుశ్లోకములవలె నాల్గుశ్లోకములలో లక్ష్మీదేవిని స్తోత్రముచేసిరి.

మొదటిశ్లోకము :

"శ్లో. శ్రీ భాగ్యరేఖా ముపపాద యంతీం
శివం కరీం సింధుర మందయానాం
శీతాంశు బింబ ప్రతిమాన వక్త్రాం
క్షీరాబ్ధి కన్యాం శిరసా నమామి."

నాల్గవశ్లోకము :

"జయ వారాశితనయే! జయ చామీకరద్యుతే!
జయ దాతృత్వరసికే! జయ భద్రగజాదరే॥"

దండకము మిక్కిలికఠినమైన నారికేళపాకములో కొనసాగెను. నాల్గు శ్లోకముల తరువాత దండకము వ్రాయబడెను.

చాటుధార పద్యములు :- నయనోల్లాస ప్రబంధ పీఠికలో (115 పుట) ముద్రితమైన చాటుపద్యములలో మూడు కందములు నీతిహీనునిగూర్చి, ఒక సీసము మహారాజావారి విజయప్రాప్తిక

మంగళాశీస్సులతోడను, మరియొక సీసమున గులాబీవర్ణనము గలవు. మహారాజా సూర్యారావుగారికి గులాబీపుష్పముపై మక్కువ. కనుకనే వీరు మదరాసులో తమ మందిరమునకు 'గులాబి'యని పేరిడిరి. ప్రసంగవశమున రాజావారి కోర్కెపై తమ్మన్నశాస్త్రిగారు గులాబి పుష్పరామణీయకమును వర్ణించిరి.

"సీ॥ ప్రకృతి ప్రజాపరంపరకు దేవరమీఁదఁబొదలెడు ననురాగపుంజ
మనఁగ
వర భవన్మానసస్థిరత మెచ్చఁగ వచ్చినిలిచిన మారునియలుగనంగ
నీ తేజమున కోడి నెరిచెంత వసియించు కంజాప్తబింబార్భకంబనంగ
నేలికకాశ్రిత పాళిపై నెలకొన్న భూరికారుణ్య విస్ఫురణ మనంగ

తే॥ మేలిడాలును దావు లుద్వేలలీల
ఘుమఘుమ స్ఫూర్తినెల్లెడ గుబులు కొనఁగ
నెనఁగు నీశోణ కుబ్జాక కుసుమరాజ
మురుకళాభోజ! సూర్యభూవర బిడౌజ!"

మహారాజావారి యెడల ప్రజలకు గల అనురాగ పుంజమో, వారి స్థైర్యము మెచ్చుకొనుటకై వచ్చినిలిచిన మన్మథబాణమో, సూర్యరాయేంద్రు తేజస్సునకు ఓడి చెంతనిలుచుటకై వచ్చిన అర్భక సూర్యబింబమో, రాజావారు తన అశ్రితులపై చూపిన కారుణ్యమో అనునట్లు గులాబిపుష్పము విరాజిల్లుచుండెనని ఉత్ప్రేక్షించి తమ్మన్నశాస్త్రిగారు తమ భావమాధుర్యములోగల నవ్యతను రసజ్ఞుల కందించిరి.

## శ్రీ రావు వంశముక్తావళి

శ్రీ రాజా రావు వేంకటమహీపతి గంగాధర రామారావు బహద్దరువారి కాలమున తమ్మన్నశాస్త్రిగారిచేత రచియింపబడిన

ఆరాశ్వాసముల (679 ప.) చారిత్రిక కావ్యము రావు వంశముక్తా వళి. ఈకావ్యము మహారాజావారి సహాయకరణమున క్రీ॥ శ॥ 1950లో మద్రాసు శుభోదయా పబ్లికేషన్సు లిమిటెడ్ ప్రెస్సున ముద్రింప బడెను.

లలితార్థస్ఫోరకముగా సరస శబ్దాలంకార శోభితముగా గీర్వాణ భాషలో సుబ్బరాయశాస్త్రి రచించిన తన వంశచరిత్రను తెలుగులో వ్రాయుమని శ్రీ గంగాధర రామారావుగారు కోరగా తమ్మన్న శాస్త్రిగారు సంస్థానపు 'రికార్డులు' ఆధారముగా నీగ్రంథము వ్రాసిరి. రావు వంశీయులచరిత్ర పదునేను తరములవఱకు లభ్యమైన చారిత్ర కాధారములతో రెండవ అధ్యాయమున "పిఠాపురము జమీందా రుల వంశక్రమము"- అను పేరిట వ్రాసియుండుటవలన చర్వితచర్వణ మగునను భీతితో మరల కథాసారమంతయు సంపూర్ణముగా నిచట ప్రస్తావించలేదు. కాని చరిత్రలోగల విశేషాంశములమాత్ర మిట పొందుపరచుచున్నాను.

గృహనామము :- ఈ రావు వంశీయులు తొలుత కోసల దేశమునగల అయోధ్యానగర సమీప కళ్యాణగిరిలో నుండెడివారు. వారు దక్షిణదేశమునకు వలసవచ్చి కొంతకాలమునకు త్రిలింగదేశము నందలి మెతుకు కైలాసకోటలను వశపరచుకొనిరి. వీరిలో పిల్లల మఱ్ఱి బేతాళరావు మహాశౌర్యసంపన్నుడు. ఈ వీరుని సాహసోపేత మైన కార్యములవలన వీరికి రావు వారను గృహనామ మేర్పడెను. ఈతనికాలమున ప్రతాపరుద్ర చక్రవర్తికి ఢిల్లీ పాదుషాతో సమరము అనివార్యముకాగా బేతాళరావు యుద్ధమున పరాక్రమము చూపి, నాటి అర్ధరాత్రమున దిగంబరుడై యుద్ధభూమికేగి కపాలమున శత్రు రక్తముతో సన్నము వండి, మహామంత్రములతో భూతముల నా వాహనముచేసి, ఒక్కొక్క కబళమిచ్చి యుద్ధబలి సమర్పించెనట.

అట్టి వేతాళరావు ధైర్యమునకు గిరులు సరిరావు, బలిమికి సింహ ములు సరిరావు– అని జనులు కీర్తించుటవలన ఆతనికి రావు వారను గృహసంజ్ఞ ఏర్పడెనని 2వ ఆ. న 39వ పద్యము తెల్పుచున్నది.

గోత్రము : రావువారు రేచర్లగోత్రజులగుట కొక గాథ కలదు. అనపోతమనీడు భువనగిరిచెంత వ్యవసాయము చేయుచుండగా రేచుడు అను పరిచారకుడు పొలముకాపరిగా నుండెను. అనపోతమ భూమి దున్నుచుండ నాగలికేదోతగిలి "ఘల్లు"మని ధ్వనించెను. నాటిరేయి అనపోతమనీడు నిదురలో ఆధ్వని నిధికి సంబంధించిన దనియు, నరబలియొసగిన నిధిప్రాప్తించుననియు కలగాంచెను. స్వప్న వృత్తాంతము విని రేచుడు తానే నిధికి బలి అయ్యెదనని, దానికి ప్రతిఫలముగా అంతవఱకు వశిష్ఠగోత్రమని చెప్పబడుచున్న రావు వారు తనపేర రేచర్లగ్రోత్రముగా ప్రసిద్ధిచెందవలెనని కోరెను. రేచర్లగోత్రమువారు వివాహ సమయములలో ముందుగా తనవంశ మున జన్మించిన వారికి వివాహంమొనరించి,వారిఅనుమతిని పరిణయ మాడవలెనని రేచుడు పలెకెను. ఈ రెండు నిబంధనలకు అంగీక రించి అనపోతమనీడు రేచుని బలియిచ్చి నిధినిపొందెను. నాటినుండి రావు వంశీయులకు రేచర్లగ్రోత్రనామము స్థిరమయ్యెను. వివాహ సమయములలో రేచులకు వివాహము చేయుట నిన్నమొన్నటివఱకు ఆచారముగా జరిపెడివారు.

వెంకటగిరి బొబ్బిలి జటప్రోలు సంస్థానములు :

సర్వజ్ఞ సింగభూపాలానుజుడు రావు మాధవరాయశింగారు పన్నిద్దరాళ్వారులలో నొకడయ్యెను. మాధవరాయని పుత్రులే ఈ మూడు సంస్థానములకు అధిపతులైరి. 3వ ఆ. 31వ పద్యమున కవి 'జటప్రోలు' అనుపేరెట్లు వచ్చెనో తెల్పెను. జానకి నపహరించికొని పోవు రావణునితో యుద్ధముచేసి, రావణుని చంద్రహాసముచే మృతి నొందిన జటాయువునకు రాముడు నివాసమిచ్చిన చోటు "జటప్రోలు"

అని ప్రసిద్ధిగాంచెనట. ఆ జటప్రోలు రాజధానిగా సర్వసింహ కనుక జటప్రోలు సంస్థాన మయ్యెను.

వర్ణనలు : చారిత్రకకావ్యమైనను సమయానుకూలముగా తమ్మన్నశాస్త్రిగారు పుర అశ్వగజయుద్ధాదివర్ణన లనేకము కావించిరి. బొబ్బిలి పోరాడ యుద్ధము లిందు వర్ణింపబడెను. శ్రీ గంగాధర రామారావుగారు చేసిన తీర్థయాత్రల వర్ణించుచు కవి నీలశైలమున అల్లసానివారి "అటజని గాంచె భూసురుఁ డంబర"మను పద్యముతో సమానముగా వర్ణించెను.

"చ. అటఁజని కాంచె రామవసుధాధిపశేఖరుఁ డాపగాధరా
టటగత పాదమూలము సుధామయపుష్ప ద్రవపూర నిర్ఝరీ
పటులహరీ పయః ప్రసర పక్వఫల ప్రకర ప్రశస్తిలో
త్కట సహకార ముఖ్య వివిధ ద్రుమజాలము నీలశైలమున్."

ప్రవరుడు హిమాలయము చూచుట, రాజావారు నీలశైలము చూచుట- పద్యశిల్పముతోబాటు సందర్భముకూడ అనుకరింపబడెను. అట్లే శ్రీనాథుని భీమఖండములో "క్రముక రసాల" అను పీఠికాపుర వర్ణన పద్యప్రభావకడలో నొక పద్యము గలదు. గంగాధరరామారావుగారి తండ్రి శ్రీ రావు వెంకటసూర్యారావుగారి కాలమందు దేశస్థితితోబాటు వారు కావించిన వనవాటికాది నిర్మాణములను శాస్త్రిగారిట్లు వర్ణించిరి. 5వ ఆ. 78 ప. పీఠపుర వర్ణన :

"చ. క్రముక రసాలకాముక గంధఫలీ పనసామ్ర లాంగలీ
ప్రముఖ సుసాలజాలములఁ బాటిలు నొక్క వనంబు నర్మహా
ర్మ్యము జలాశయంబునమలాశయుడై తగు సూర్యరాట్ప్రభూ
త్తముఁడుఁ బ్రతిష్ఠఁజేసెను ముదంబున పీఠపురాంతిక స్థలిన్."

వసుచరిత్రలో "తటిగొప్ప నెటిగొప్ప జలదమాలికనొప్పు" అను పద్యపునడకలో తమ్మన్నశాస్త్రిగారు రాజావారిసౌధమును 1ఆ. 16ప.న చక్కగా వర్ణించిరి.

"సీ. పటికంపు గమిఁ బెంపు ఘటియించు రుచిసొంపు
నెగడుగోడల నిగన్నిగలతోడ
నల తారకల మీఱఁగల పీఠముల తోర
మగు కుట్టిమపు ధగద్ధగలతోడఁ
జెలువంపు జిగి నింపుఁ దులకింపుఁ బలుకెంపు
లలరు చూరుల తళత్తళలతోడ
ఘనలీల మనలీలఁ గను నీలమణిజాల
జాలకంబుల చకచ్చకలతోడ
గీ. నలుగడలఁ గాంచి పూరముల్వాల గొనంగ
వింత సంతసఁదగు వైజయంత మనఁగఁ
దనరు బలుసౌరు గలుగు పదారువన్నె
మేలిబంగారు జిగి మీఱు మేడలోన."

ఇటువంటి చక్కని అంత్యప్రాసలతో చాతుర్వర్ణ్యవ్యవస్థ వర్ణింపబడెను. సందర్భానుసారముగా శైలీభేదముపాటించుట ఈ కావ్యమున కలదు. యుద్ధవర్ణనమున కఠినమగుశైలి రాణివాసస్త్రీల వర్ణనలో మృదుశైలి పాటించుచు తమ్మన్నశాస్త్రిగారు ఇది కేవలము చరిత్రయేకాక హృద్యమగు కావ్యమనిపించునట్లు రచన చేసిరి. దండకములో యుద్ధవర్ణన మీ కావ్యమున కొక నవ్యత. సామాన్యముగా దండకములు దేవతాస్తోత్రములుగా నుండును. ఓజోగుణ ప్రధానమగు యుద్ధము దండకములో వర్ణించుట అరుదు. ఢిల్లీ సుల్తానుతో బేతాళరాయనియుద్ధము వర్ణించునప్పు డీ యుద్ధదండకము కలదు.

గంగాధరరామారావుగారు చేసిన దానధర్మములు, సత్రాది నిర్మాణములు, కవి పండితపోషణ, శాస్త్రార్థములు నిందు చక్కగా నభివర్ణితములు.

"సీ. ఒకచోట నధిక వైదిక వేదపఠనంబు లొకచెంత వేదాంత సూక్తిరచన
లొకయోర భూరి తార్కిక లోకవాదంబు లొకయెడ ధర్మ శాస్త్రోదితంబు
లొకప్రక్క శాబ్దిక ప్రకరప్రసంగంబు లొకవంక సుకవిగోష్ఠు
లొకసీమ పౌరాణికోపదేశంబులు నొకక్రేవ వైద్యశాస్త్రోక్త ఫణితు

గీ. లొక్కతావున జ్యౌతిషానూన వచన
రీతులొక దండ సరస సంగీత మధుర
కలరవంబులుఁ బొలుపొందఁ బలుకుఁ జెలికి
గాపురంబనఁదగుఁ బీఠికాపురంబు."

వైదిక వేదపఠనము, వేదాంతసూక్తిరచనలు, తార్కికవాదములు, ధర్మశాస్త్ర ప్రసంగములు, శబ్దశాస్త్రప్రసంగములు, సుకవిగోష్ఠులు, పురాణోపదేశములు, వైద్యశాస్త్రప్రసంగములు, జ్యౌతిష శాస్త్ర వాదములు, సంగీతము ఇట్లు వివిధములైన శాస్త్రములతో సరస్వతీదేవి నివాసయోగ్యమనునట్లు పీఠికాపురము విరాజిల్లుచుండెడిది. కనుకనే రావువంశము "సకల సంశ్రిత పండిత సత్కవీంద్ర రచిత సుకృతాయ ఫలంబ"ని తమ్మన్నశాస్త్రిగారొకచో వ్యాఖ్యానించిరి.

తెలుగు జాతీయములు : "పట్టినదియెల్ల పైడియు, ముట్టినది యదియెల్ల నాణిముత్తెమగుచు". (5ఆ. 313ప.) అని కృతిభర్త తాత గారగు నీలాద్రిరాయణింగారి పరిపాలన వర్ణించుచు వారి పాలనమున సిరి వర్ధిల్లెనని కవి చెప్పెను.

కవి కాలమునాటికి దేశమున ఆంగ్లభాష వ్యాపించియుండుట చేత కావ్యములో తరచుగ ఆంగ్లపదములు కనిపించును. ఈ తీరున శ్రీ తమ్మనశాస్త్రిగారు చారిత్రికాధారములతో శైలీవైవిధ్యము చూపుచు, శ్రవణోపేతములగు నలంకారములతో రమణీయమగు వర్ణనలతో తెలుగు జాతీయములతో నంగాళప్రాయమైన చారిత్రిక కావ్యశరీరమునకు రక్తమాంసములతో పుష్టి కలుగునట్లు చేసి 'రావు వంశముక్తావళి'ని సుందరాతి సుందరముగా తీర్చిదిద్దిరి.

## నయనోల్లాసము

శ్రీ దేవులపల్లి తమ్మనశాస్త్రి కృత నయనోల్లాసకావ్యము 1911లో మహారాజా సూర్యారావుగారి ఆజ్ఞానుసారము పిఠాపురము శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాలలో ముద్రింపబడి ప్రకటింపబడెను. ఇది మూడాశ్వాసముల చిన్నికావ్యము.

కథాసారము :– గుణవతీ శర్యాతులకు సుకన్యయనుకుమార్తె ఉదయించెను. ఒకనాడు శర్యాతిమహారాజు సకుటుంబ సపరివారముగా వేటకు వెడలెను. శర్యాతిసుత సుకన్య వనవిహారముచేయుచు, బహుకాలము సమాధిలోనుండి పుట్టలు పోసికొనియున్న చ్యవనముని కన్నులు మిణుగురులని తలచి బాల్యచాపల్యమున నొక పుడకతో పొడిచెను. అంధుడైన చ్యవనుడు క్రుద్ధుడై సుకన్యను పత్నిగానిమ్మని శర్యాతి నడిగెను. శర్యాతి తనయ నా చ్యవనునికిచ్చి పరిణయము చేసి, స్వీయరాజ్యమునకు వెడలెను. సుకన్యాచ్యవను లన్యోన్యతతో జీవనము సాగించుచుండిరి. ఇది యిట్లుండ అమరావతీపట్టణమున నింద్రుడు అశ్వనీదేవతలకు యజ్ఞభాగార్హత లేదని పలికెను. వారు చింతించి చ్యవనాశ్రమమునకు వెడలి, సుకన్య పత్నీధర్మమును పరీక్షించిరి. అటుపై వారు చ్యవనునికి దృష్టినొసగి యౌవనవంతుని

గావించిరి. చ్యవనుడు అశ్వనీదేవతలపట్ల సంతృప్తుడై శర్యాతి కావించిన యజ్ఞమున అశ్వనీదేవతలకు సోమపానమిచ్చి వారిని యజ్ఞభాగార్హులను జేసెను.

**మూలము :-** మహాభారతము ఆరణ్యపర్వ తృతీయాశ్వాసమున సౌకన్యోపాఖ్యానమను పేర నీకథ ఇరువదిరెండు పద్యములలో (3 ఆ. 174-197) కలదు. ఈ కథనే తమ్మన్నశాస్త్రిగారు నాల్గువందల పద్యములలో చక్కని ప్రబంధముగా మలచిరి. మహాభారత కథకు నీ కథకు స్వల్పమైన భేదములు గలవు.

**భేదములు :-** (1) అశ్వనీదేవతలు చ్యవనుని చెంతకేల వచ్చిరో భారతము తెలుపలేదు. తరువాతి కథవలన తెలియునని కాబోలు విడువబడెను. నయనోల్లాసము 4వ ఆశ్వాసమున 8-18 ప. లలో దేవేంద్ర అశ్వనీదేవతల యజ్ఞభాగార్హసంవాదము కలదు. స్నాన సంధ్యాద్యనుష్ఠానములు సమకాలమున జరుపకపోవుట, లోభము, రసవిషగంధకాది వస్తుగణైకపాకనిరూఢిని చొప్పడుట, నానావర్ణస్పర్శనాద్యనాచారము – వీనిమూలమున అశ్వనీదేవతలు దేవవైద్యులైనను యజ్ఞభాగార్హత లేదని వేదవిదులు తెల్పినట్లు ఇంద్రుడు చెప్పెను. ఆ మాటవిని వారు చింతించుచు చ్యవనాశ్రమమునకు వచ్చిరని నయనోల్లాసకర్త చిన్నమార్పు చేసెను. (2) భారతమున లేని మఱియొక అంశము సుకన్యా జన్మవృత్తాంతము. శర్యాతి చతుస్సహస్ర దేవీసమేతుడై వేటకు వెడలినట్లు మాత్రము భారతమున కలదు. నయనోల్లాసమున గుణవతి గర్భధారణమునుండి సుకన్య జన్మించుట, ఆటపాటలు, యౌవనావిర్భావము వఱకు సుమారు నలుబదియైదు పద్యములలో వర్ణింపబడెను. (3) నయనోల్లాసమున అశ్వనీదేవతలు సుకన్యను పరీక్షించుటకు, ఆమెకు చ్యవనునితోడి వివాహమగుటకు విచారించగా, ఆమె తగినట్లు

సమాధానము చెప్పి పాతివ్రత్యము నిరూపించుకొనుట, మరల అశ్వి నులు మంచివరుని పెండ్లాడుమని సుకన్యకు బోధించుట, సుకన్య నిరాకరించుట మొదలైన వివాదమునకు కాళిదాసు కుమారసంభవ కావ్యములో పార్వతీకపటువటు సంవాదమును పోలియుండెను. ఈ సంవాదము భారతమున లేదు. (4) ఈ కావ్యమున సుకన్య పాతి వ్రత్యము పరీక్షించుటకై చ్యవన సమేతముగా అశ్వినీదేవతలు నీటిలో మునిగి లేవగా, ముప్పురు చ్యవనులవలె కనిపించుట, సుకన్య ముందు కలతపడియు శివుని ప్రార్థించి పతిని గుర్తించుట (3 ఆ. 66-76 ప.) అను నంశములు నైషధములోని పంచనల ఘట్టమును జ్ఞప్తికి తెచ్చును. దేవేంద్రాదులు, అశ్వినీదేవతలు నాయకరూపము ధరించుటలో సామ్యము కలదు. నైషధమున దమయంతి సరస్వతీ దేవిని ప్రార్థించినట్లు నయనోల్లాసమున సుకన్య శివుని ప్రార్థించి పతిని గుర్తించెను. (5) చ్యవనుడు వేల్చగా యజ్ఞమునుండి మందుండను రాక్షసుడు పుట్టి దేవేంద్రుని వధించబోగా, శరణన్న ఇంద్రుని చ్యవనుడు రక్షించినట్లు భారతమున కలదు. ప్రధానకథ కనావశ్యక మైన ఈ ఘట్టమును శాస్త్రిగారు స్వీకరించలేదు. చ్యవను డశ్విను లను సోమపీథులనుచేయుట చూచి ఇంద్రుడు వజ్రాయుధ మెత్తగా, చ్యవనుడా హస్తమును స్తంభింపజేసి మరల రక్షించెననిమాత్రము ప్రబంధమున కలదు.

తమ్మన్నశాస్త్రిగారిట్లు ప్రబంధమున కవసరమైన తావుల ఔచితీపోషకముగా అల్పమగు మార్పులు చేసియు, భారతమున లేని విషయముల చేర్చియు, అనావశ్యకాంశములను విడచియు మార్పులు చేర్పులు చేసి ప్రబంధమునకు వన్నె తెచ్చిరి.

**నామసార్థక్యము** :- ఈ ప్రబంధమునకు నయనోల్లాస మను పేరెంతవఱకు తగియున్నదో పరిశీలింతము. భారతమున **దీనికి**

సౌకన్యోపాఖ్యానమనుపేరు కలదు. తమ్మనశాస్త్రిగారీ కావ్యమున రాజర్షి శర్యాతి, బ్రహ్మర్షిచ్యవనుని ప్రభావము, భిషగ్జన సామర్థ్యము, పతివ్రతామహిమలను ముఖ్యవిషయములుగా గ్రహించిరి. ఈ నాల్గంశములు సమానముగా నిందు వర్ణింపబడెను. కనుక కవి దీనికి భారతమునవలె "సౌకన్యోపాఖ్యానమ"ని గాని, "భిషగ్జన సామర్థ్యమ"ని గాని, చ్యవనోపాఖ్యానమనిగాని నామకరణము చేయక "నయనోల్లాసమ"నుటకు కారణ మేమో! ఈ కావ్యమున ఫల శ్రుతి నాయకుడగు చ్యవనుని లోచన ప్రాప్తి. పై నాల్గంశములు సమానముగా కవి వర్ణించినను ప్రాధాన్యత చ్యవనునికే. బ్రహ్మర్షి చ్యవనునిచేత శర్యాతి శపించబడెను. తర్వాత నతడు సుతయగు సుకన్య నతనికిచ్చి వివాహముచేసెను. అటుపిమ్మట సుకన్య పతి భక్తిని అశ్వనీదేవతలు పరీక్షించి చ్యవనునికి దృష్టి నొసగిరి. ఇది భిషగ్జనసామర్థ్యము ఇట్టి కావ్యములన్నియు నాయకుడగు చ్యవనుని చుట్టు కేంద్రీకృతమగుటను, కవి నయనోల్లాసమని పేరు పెట్టెను. ఈ కావ్యమును నయనోల్లాసమనుటకు వేఱొకకారణము కలదు. కావ్యారంభకాలమున కవికి నేత్రావరోధము కలిగి భగవదనుగ్రహ మున అవరోధము తొలగి, ఆ ఉల్లాసకరసమయమున కావ్యరచన ఆరంభించి కావ్యమున కీనామకరణము చేసిరని పీఠికలో భాషాభి మాని వివరించెను. కనుక నీ నామ మన్నివిధముల నన్వర్థమే.

వర్ణనలు : 1. నైమిశారణ్య (1ఆ. 39ప.), 2. శర్యాతిరాజ 3. రాజ్ఞీ (1ఆ. 45-57 ప.), 4. విప్రకాంత (1ఆ. 69ప.), 5. దౌహృద (1ఆ. 77-81 ప.), 6. కుమారోదయ (1ఆ. 82 ప.), 7. వేట (2ఆ. 5ప, 2ఆ. 22-30 ప.), 8. సరోవర (2ఆ. 31, 33 34 ప.), 9. వనవిహార (2ఆ. 43-56 ప.), 10. అమరీపుర సాకేత పుర (3ఆ. 3-7 ప.), 11. భిషగ్జన సామర్థ్య (3ఆ 13-16 ప.),

12. వసంతఋతు (3ఆ. 90-96 ప, 113-116), 13. సూర్యాస్తమయ (3ఆ. 99-101 ప.), 14. చంద్రోదయ (3ఆ. 100-105 ప), 15. ఉషోదయ (3ఆ. 107 ప.), 16. సుకన్యాబాల్యవర్ణనలు (1ఆ. 88-93 ప.). ఈ కావ్యమున గలవు.

ప్రబంధమున అష్టాదశ వర్ణన లుండవలెనను నియమమున్నను శాస్త్రిగారు సందర్భోచితమైన వర్ణనలుమాత్రము చేసి కావ్యమునకు సొగసు కలిగించిరి. దేవవైద్యులు సుకన్యను చూచి మృదు శైలి, స్వభావోక్తి, పదలాలిత్యము, ధీరపామరజనతా హృదయంగమ రచనయు ఆమె పలుకులలో కలవని కొనియాడిరి. ఈ లక్షణము లన్నియు శాస్త్రిగారి కావ్యకన్యకలో మనకు గోచరించును. చ్యవనునికి అంధత్వముకలిగినప్పుడు కవి స్వీయానుభవమును జోడించి స్వభావసిద్ధమైన వర్ణన కావించెను.

"సీ. తొలుదొల్త దూరానఁగల వస్తువిది
యదియని నిరూపించు దార్ఢ్యంబువిడుట
తెరవేసినట్లు లేడ్తెఱఁ జూడ్కి కటమీఁద
నావంత కొంత సంప్రాప్తమగుట
మసకొని మబ్బుగ్రమ్మిన మాడ్కిఁ
బిదప వస్తువులనొక్కింత యస్ఫుటత గనుట
పదపడి యతి సమీపములోనిదే
నియు విస్పష్టలీలఁ గాన్పింప కునికి
గీ. కంటి కడ్డంబుగా నిల్పి కలయఁ ద్రిప్పు
నంగుళుల సంఖ్యఁ దెలియంగ నలవి గామి
యను నవస్థలఁ బొరయక యంతలోన
హీనదశఁ గాంచె నొక్కెడ మౌనిదృష్టి."

చ్యవనునిదృష్టి ఆకస్మికముగా లోపించగా కవి చత్వార లక్షణములను క్రమముగా వర్ణించెను. చత్వారవర్ణన సహజముగా నున్నను చ్యవనుని విషయమున వర్ణించుట అనుచితము.

దేవులపల్లివారి పదలాలిత్యమునకు వసంతర్తు వర్ణనమొక మచ్చుతునక.

"చ. లలితరసాల కాండశకట ప్రకరంబులదార మాధురీ
కలనఁ బ్రసిద్ధిఁగాంచు సహకార మహీజఫలప్రకాండముల్
బలురుచిఁజొక్కమా పనసపండ్ల తొనల్మధురంపుఁబానకం
బులును జవుల్ఘటించుఁగద భోగులకున్ మధుమాసవేళలన్."

లలితమైన పదములకూర్పు పద్యమునకొక వింతయందము కలిగించెను.

ధీరజనతాహృదయంగమ రచనకు చ్యవనునికి దృష్టిలాభము కలిగినప్పుడు తమ్మన్నశాస్త్రిగారు చేసినవర్ణన నుదాహరణగా గ్రహింపవచ్చును.

"మ. అమితాజ్ఞాన తమోభరం బెడల నధ్యాత్మైక విద్యామహా
త్త్వమునం దెల్వి లభింపఁదోఁచెనె పరబ్రహ్మంబు గన్పట్టు చం
దమునం జీఁకు తనంబు చీకుపడ నుద్యద్దృష్టి ప్రాపించుటన్
విమల ప్రక్రియహాని కెల్లజగమున్ విస్పష్టమై కన్పడెన్."

మహత్తరమైన ఆధ్యాత్మికదృష్టిగల శాస్త్రిగారిచట వాని కనుగుణమైన ఉపమానములను వాడిరి. అజ్ఞానమనెడి చీకటితో అంధత్వము, అధ్యాత్మవిద్యామహత్త్వమున కలిగిన వివేకమున కలిగిన పరబ్రహ్మసాక్షాత్కారముతో ఉద్యద్దృష్టిప్రాప్తి ఉపమింపబడుట అధ్యాత్మవిదులకు హృదయాంగమముగా నుండును. ఇట్లు ధీరజనులకు, తాత్త్వికవేత్తలకు మహదానందము కలిగించిన రచన కవిభావనాశక్తికి గీటురాయి. ఇదేవిధముగావనవర్ణనచేయుచు తమ్మన్న శాస్త్రిగారు 2వ ఆ. 53ప.ను హృదయాహ్లాదకరముగా కూర్చెను. తుమ్మెదలు పూఁదేనెలో స్నానమాడి పుప్పొడి యనెడు విభూతిని అలదుకొని, ఝుంకారమే ఓంకారముగా తపస్సు చేయుచున్న ఋషుల

వలె నుండుట ధీరజనహృదయాహ్లాదముగా, కావ్యార్థసూచనముగా కవి వర్ణించెను.

శివ ఆ. 91ప. కవి ఊహాశక్తికి మఱియొక నిదర్శనము వసంత ఋతువర్ణనలో 91వ ప.

"మ. వనవీథిం బవనాహితుండికుఁడు శ్రావ్యంబైన భృంగావళీ
స్వనతుంభీరవమొప్ప గుచ్ఛఫణయుగ్వల్లీ భుజంగాళి నా
మని ప్రేంఖోలన్నటియింపఁజేయనిడె శుంభద్వ్రుమ శ్రేణికిం
దనకుం గల్గిన వెల్ల నిచ్చునుగదా త్యాగాభిరక్తుండిలన్"

వనములో చల్లని పిల్లతెమ్మెరవీచగా పుష్పగుళుచ్ఛములు మెల మెల్లగా నాట్యమాడుచుండెను. ఆ తెమ్మెర పవనపుతీవనుంచి పవడములను రాల్చుచుండెను. పవనుని పాములవానిగా, త్యాగాభిరక్తునిగా, తుమ్మెదలఝుంకారము పాములవాని నాదస్వరముగా, పుష్పగుచ్ఛసహితమైనలతలను ఫణమువిప్పిన సర్పములుగా ఉత్ప్రేక్షించి కవి చేసిన వర్ణనము అనన్యము. ఒకచెంత ఉద్యానవనదృశ్యముతోపాటు పాములవాడు పాములనాడించు దృశ్యమును కనులగట్టినట్లు వర్ణించిన కవి ప్రతిభ సామాన్యముకాదు. ముందు పేర్కొనిన వనవర్ణనలో తుమ్మెదఝుంకారము నోంకారముగాపోల్చి ఈపద్యమున నాదస్వరముగా భావించుట కవి బహుశాస్త్ర పరిచయమునకుదాహృతి.

వనవిహారమున మూడు పద్యములలో పుష్పదోహదక్రీడలు వర్ణింపబడెను. తరుణుల దోహదమునకాని తరువులు కుసుమించవని పూర్వకవుల భావన. కొన్నిచెట్లు కాంతల కౌగిళ్ళకు, కొన్ని జాణల గానమాధుర్యమునకు కొన్ని సుదతుల దరహాసమునకు, కొన్ని ఉవిదలు ఉమియుటవలన, కొన్ని పడతుల పాదాహతికి, మరికొన్ని తరుణుల దృగంచల దృష్టికిని వికసించునని కవిసమయము. నయ

నోల్లాసమున 2వ ఆ. 44, 50, 51. ప. లలో కాంతకౌగిలికి కొండ గోఁగు, పాదాహతికి అశోకము విరియుననియు కవివర్ణించెను.

ఇందు సూర్యోదయ సూర్యాస్తమయ చంద్రోదయాది వర్ణనలు తృతీయాశ్వాసము వరకు కానరావు. సమయానుకూలముగా ఔచితీపోషణార్థమే తమ్మన్నశాస్త్రిగారీ వర్ణనలుచేసిరి. శర్యాతి సుకన్యను చూచుటకై ప్రయాణసన్నాహమారంభించినపుడు వరుసగా సూర్యాస్తమయాదివర్ణనలు చేయుబడెను. కావ్యాదిని పురవర్ణన పరిపాటియై యుండగా, శాస్త్రిగారు శర్యాతియాగమునకు సుకన్య చ్యవనులను రాజధానికి తీసికొని పోవునపుడు సమయోచితముగా పురవర్ణన చేసిరి. ఆశ్రమవాసియైన చ్యవనునికి మార్గవిశేషముల తెల్పుచు సుకన్య సాకేతపురవర్ణనచేసినట్లు కవివర్ణించెను. ఈకావ్య వర్ణనలన్నియు కమనీయములై ఉపమాఉత్ప్రేక్షాద్యలంకారశోభితములై సమయోచితముగా నలరారుచున్నవి.

"పూసలలోని దారమును పోలిక", "ముక్కుమూఁగరగాదే" "ఓడలు బండ్లగును బండ్లు నోడలగునుగదా", "ముద్దులమూటగట్టి" "అడవిం గాసిన వెన్నెల", "కాకిముక్కునకు దొండపండువలె", "పిండియారబోసినకరణి" మొదలైన లోకోక్తులు సంస్కృతమున "ఏకస్స్వాదు నభుంజీత" వంటి సామెతలు నిందు విరళముగాగలవు. ఈరీతిని మధురఫణితిని సాగిన ఈకావ్యము కవికి, కావ్యనాయకునికి "నయనోల్లాసము"ను సాహితీప్రియులకు హృదయోల్లాసమును గలిగించినదని భావింపవచ్చును.

## యతిరాజవిజయము

803 పద్యములతో నాలుగాశ్వాసములతో నొప్పుచున్న యతిరాజవిజయమును తమ్మన్నశాస్త్రిగారు వ్రాయగా క్రీ॥ శ॥ 1941లో పీఠికాపట్టణమున శ్రీ విద్వజ్జనమనోరంజనీ ముద్రాక్షర

శాలయందు ముద్రితమై మహారాజావారిచేత ప్రకటింపబడెను. మహారాజావారి కంకితము చేయబడిన ఈ కావ్యమున ఆదిశేషుడు రామానుజుడుగా అవతరించుట, ఆ మహాత్ముని మహిమలు వర్ణింపబడెను.

కథాసారము : చోళదేశమున పెరుంబుదూరను గ్రామము భూతపురమనుపేర ప్రఖ్యాతమై యుండెను. అట కేశవసోమయాజి యను భూసురుడు గలడు. అతడు తిరుమలనంబి పుత్రికలలో నొకతె యగు కాంతిమతిని వివాహమాడగా, ఆమెసోదరి ద్యుతిమతిని కమలనయనభట్టారకుడు పెండ్లాడెను. కేశవసోమయాజి అపుత్రకుడై బహుకాలముండి, సతీసహితుడై సముద్రస్నానమునకు తిరువల్లిక్కేణి కేగి, పార్థసారథిస్వామివారిని స్తుతియించెను. ఆస్వామి స్వప్నమున సోమయాజికి కనిపించి, పుత్రుడు కల్గునని చెప్పెను. తదుపరి కాంతిమతి గర్భవతియై నవమాసములు నిండినవెనుక తనయుని గాంచెను. తల్లిదండ్రులు వానికి రామానుజుడని నామకరణము చేసిరి. ఆ బాలుడు చిన్ననాటినుండి హరిభక్తుడై యుండి క్రమముగా నఖిల వేదశాస్త్రము లభ్యసించెను. పదియారేండ్ల ప్రాయమున రామానుజునికి రక్షమాంబతో పరిణయ మయ్యెను. రామానుజుడు, యాదవప్రకాశకు డను పండితునికడ శాస్త్రాధ్యయనము చేయుచుండెను.

అది యట్లుండ, కాంచీపురరాజపుత్రిక నొక బ్రహ్మరాక్షసుడు పట్టి పీడించుచుండెను. వానిని వదలించుటకై మాంత్రికులు యత్నించి విఫలులైరి. రామానుజుని గురువు యాదవదేశికుడు రాజాహ్వానముపై నచటికేగగా బ్రహ్మరాక్షసుడు తనయొక్క యాదవదేశికునియొక్క పూర్వజన్మ వృత్తాంతములను తెలిపెను. రామానుజుడు వచ్చి తనను పాదమున తాకి, పాదోదక మిచ్చి

హామ్మని యాజ్ఞాపించినగాని ఆ రాచకన్నెను వీడనని బ్రహ్మరాక్షసుడు తెలిపెను. ఈ వృత్తాంతము విని రామానుజు డచటికి వచ్చి, బ్రహ్మరాక్షసుడు కోరినట్లు చేయగా వాడు బ్రహ్మరాక్షసజన్మనుండి విముక్తుడై, దివ్యశరీరముతో దివికేగెను. కాంచీపురప్రభువు సంతోషముతో రామానుజునికి కనకాభిషేకము చేసెను. నాటినుండి యాదవప్రకాశుడు రామానుజునియెడల ద్వేషముతో నుండెను. రామానుజుని పినతల్లిపుత్రుడు గోవిందమిశ్రుడు యాదవప్రకాశుని కడ శాస్త్రాధ్యయనమునకు వచ్చెను. ఒకనాడు యాదవప్రకాశుడు శ్రుతికి చెప్పిన అర్థము రామానుజుడు ఖండించగా, అతడవమానాగ్నిచే దహింపబడి రామానుజుని సంహరించుటకు శిష్యులతో నాలోచించెను. గురువు శిష్యసమేతుడై ప్రయాగస్నానార్థము వెడలుచుండెను. మార్గములో గోవిందమిశ్రుడు అన్నతో గురువు చేసిన మంత్రాంగము చెప్పెను. మిగిలినవారినుండి విడువడి అరణ్యములో నొక చెట్టుక్రింద నాసీనుడై హరిధ్యానము చేయుచున్న రామానుజునికి లక్ష్మీనారాయణులు కిరాతరూపమున కనిపించిరి. కిరాతదంపతులతో కలసి హస్తినాపురమున కేగుచు దాహమడిగిన కిరాతకాంతకు మున్మూడుసార్లు రామానుజుడు నీరము తెచ్చెను. నాల్గవపరి జలము తెచ్చుసరికి వా రదృశ్యులైరి. రామానుజుడు కాంచీపూర్ణునివలన ఆ కిరాతులు సాక్షాత్తు లక్ష్మీనారాయణులే యని గ్రహించి, వారికి దాహముతీర్చిన కొలనునుండి అనుదినము నీరము తెచ్చి స్వామినభిషేకించుచుండెను. యాదవప్రకాశుడు శిష్యు డడవిలో పులివాతబడియుండునని యెంచి సంతోషించెను.

గోవిందమిశ్రుని కొకనాడు అర్ఘ్యమున నొక శివలింగము సాక్షాత్కరించెను. అతడు గురువుచెంత సెలవుతీసికొని స్వగ్రామమగు మంగళాగ్రహారమున తనకు లభించిన శివలింగమును ప్రతిష్ఠిం

చెను. కాళహస్తీశ్వరుని ఆజ్ఞపై గోవిందమిశ్రుడు దక్షిణకాశికి వెడలెను. యాదవప్రకాశుడు రామానుజుని యుదంతమువిని లజ్జ భీతి ఆశ్చర్యములు ముప్పిరిగొనగా మరల అతని పిలిపించెను. కొంత కాలమునకు శ్రుతివిషయవాదమున శిష్యునితో కలహించి యాదవ గురువు రామానుజుని ఆవలకు పంపెను. రామానుజుడు కలహవిష యమును గోవిందదాసునికి తెల్పి, అతని సేవించుచుండెను.

శ్రీరంగపురమున యామునాచార్యుడను విష్ణుభక్తుడుండెను. అతడు రామానుజుని చూడ నభిలషించుచుండెను. అత డొకనాడు తాను వ్రాసిన నారాయణస్తోత్రమును ముఖ్యశిష్యుడైన పూర్ణా చార్యునిచే రామానుజుని చెంతకు పంపెను. పూర్ణాచార్యుడు గురువు ఆజ్ఞ ననుసరించి రామానుజునికడ నా స్తోత్రము చదివెను. వెంటనె రామానుజు డాతనిని యామునాచార్యదర్శనము చేయింపుమని ప్రార్థించెను. రామానుజ పూర్ణాచార్యులు శ్రీరంగము చేరుసరికి యామునాచార్యుడు మరణించెను. తాను చేయవలసిన కార్యము లను సూచించుచు మూడువ్రేళ్ళు మడిచియుంచెను. ఆ సంజను గ్రహించి రామానుజుడు ప్రజలలో భక్తి నెలకొల్పి పంచసంస్కార మగున్న లగునట్లు చేయుదునని, శ్రీభాష్యము లోకమున వ్యాపింప జేతునని, వ్యాసపరాశరనాముల నిరువురను భాగవతులుగా చేసెదనని యామునుడు క్రమముగా మూడువ్రేళ్ళు చాచెను.

రామానుజుడు గోష్ఠీపూర్ణునివలన తిరుమంత్రోపదేశము పొంది, తనశిష్యుల కుపదేశించెను. కొంతకాలమునకు యజ్ఞమూర్తి యను స్మార్తబ్రాహ్మణుడు వచ్చి రామానుజునితో శాస్త్రార్థము చేసి ఓడినచో వైష్ణవమతము స్వీకరింతునని పలికెను. రామానుజుడు తానోడినచో గ్రంథత్యాగము చేతునని ప్రతిజ్ఞచేసెను. రామానుజ యజ్ఞమూర్తు లిర్వురు పరస్పర జయకాంక్షతో పదునేనుదినములు

శాస్త్రార్థమును చేసిరి. ఒకనాటి రాత్రి రామానుజునికి కలలో నారాయణుడు కనిపించి, యామునాచార్యకృతమగు "మాయావాదఖండనము" అను గ్రంథము పఠించిన యజ్ఞమూర్తిని జయింపగలవని తెలిపెను. రామానుజు డా గ్రంథము పఠించి వాదమున యజ్ఞమూర్తి నోడించెను. యజ్ఞమూర్తి వైష్ణవము స్వీకరించెను. రామానుజు డాతనికి "అరుడాళప్పెరు మాళెం బెరుమానారు" అని నామకరణము చేసి మఠాధిపతిని కావించెను. రామానుజుడు శ్రీశైలపూర్ణునివలన రామాయణమున వైష్ణవపరముగా పదునెనిమిది తెరగుల అర్థముల నొక్క సంవత్సరములో గ్రహించెను. యామునాచార్యుని కిచ్చిన మాట చెల్లించుటకై రామానుజుడు బోధాయనవృత్తి పఠించి, శ్రీభాష్యరచన చేయవలెనని తలంచెను. కనుక నతడు కూరనాథునితో గలసి శారదాపీఠమున కేగి, అచటి పండితుల నందరను వాదములో జయించెను. సరస్వతీదేవి సంతోషించి రామానుజునికి బోధాయనవృత్తి నొసగెను. రామానుజు డా గ్రంథముతో శ్రీరంగమునకు వెడలెను. కాని శారదాపీఠ పండితులు ఆ గ్రంథమునకై వెదకి, శ్రీరంగమునకు వచ్చి రామానుజునిచెంతనుండి బలవంతముగా బోధాయనవృత్తిని తీసికొనిపోయిరి. రామానుజుడు విచారించుచుండ కూరనాథు డాతని నూరడించి తా నా పుస్తకము నాద్యంతమొక్క రాత్రిలో చదివి కంఠస్థ మయ్యెనని పల్కెను. శ్రీ రామానుజు డంతట శ్రీ భాష్యము రచించి, తరువాత వేదాంత దీప వేదాంతసార వేదార్థ సంగ్రహాది గ్రంథములెన్నియో రచియించెను. కొంతకాలమునకు శ్రీరంగేశుని ప్రసాదమున కూరనాథుని కిరువురు పుత్రులు జన్మించిరి. యామునాచార్యుని కిచ్చిన రెండవ మాట నిల్పుకొనుటకై రామానుజుడు ఆ బాలురకు పరాశరవ్యాసుల నామకరణములు చేయించెను.

యామునుని మూడవ అభిలాష తీర్చుటకై రామానుజుడు కావేరీ తీరములోని వెలిపల్లియ గ్రామములోగల భాగవతుడను పంచమునికి పంచసంస్కారములు కావించి తన ప్రియశిష్యునిగా చేసికొనెను. అట్లే ధనుర్దాసును అతని సతి పొన్నాచ్చిని కూడ రామానుజుడు తన శిష్యులుగా చేసికొనెను.

రామానుజుడిట్లు వైష్ణవమతప్రవక్తయై విరాజిల్లుచుండ, క్రిమికుండను రాజు శైవుడై విష్ణుదూషణ చేయుచు శైవమత వ్యాప్తికి ప్రయత్నించుచుండెను. ఆరాజు అధికారదర్పముతో "శివాత్పర తరంనాస్తి" అని ఒక పత్రముపై లిఖించి దాని నందరకు చూపి అంగీకరింపజేసి చేవ్రాలు చేయించుకొనునట్లు పరివారమున కాజ్ఞయిచ్చెను. రామానుజునిగూర్చి విని క్రిమికంఠుడు యతిరాజును బంధించి తెమ్మని ఆజ్ఞాపించెను ఆవార్త తెలిసిన కూరనాథుడు గురువు ఆశ్రమములో ప్రవేశించి రామానుజుని త్రిదండి కాషాయవస్త్రములధరించి పెరియనంచి సహితుడై భటులకుచిక్కెను. రామానుజుడు శిష్యసమేతుడై ఆదేశమువదలి పశ్చిమదిశగా ప్రయాణము చేయుచు, ఒకపల్లెలో "చేలాంచల" అను స్త్రీకి పంచసంస్కారములు చేసెను. ఒకనాడు స్వామి రామానుజునికి స్వప్నమున కనిపించి తాను ఢిల్లీనగరమున పాదుషా అంతఃపురమున నుంటినని తెల్పెను. యతిపతి వెంటనే శిష్యులతో ఆలోచించి ఢిల్లీనగరము చేరెను. వారి రాకకు కారణము తెలిసిన పాదుషా మంత్రులతో కలసి రామానుజుని కెదురేగి యుద్ధమెందులకు?మాస్వామి నామందిరమున నున్నచో తీసికొనుడు' అని పలికెను. పాదుషావారి మందిరమున కాని, పాదుషావారి పుత్రిక శయనమందిరమున స్వామి విగ్రహము కన్పించెను. ఆస్వామి ఉదయము విగ్రహరూపమున నుండి. రాత్రుల పురుషరూపము ధరించి పాదుషా పుత్రినలరించుచుండును.

రామానుజుడు తనస్వామిని "అస్మదీయ సంపత్కుమారా" యని పిలిచి వెంట కొనిపోవుచుండెను. పాదుషాపుత్రిక స్వామి వియోగము భరింపలేకుండెను. అంతట పాదుషా తన కుమార్తెను రామానుజునికి అప్పగించెను. ఆమె స్వామితో నైక్యమయ్యెను. రామానుజుడా విగ్రహమును యాదవాద్రిని నిల్పి ఉత్సవములు చేయించుచుండెను. కొంతకాలమునకు తాను తలచినపనులు నెరవేరుటచేత రామానుజుడు శిష్యుల కుపదేశవాక్యములు చెప్పి యోగమార్గమున అవతారము చాలించెను.

వర్ణనలు : ఈ చారిత్రక కావ్యమున ప్రధానముగా నైదు వర్ణనలు మాత్రము గలవు. 1. వైకుంఠపుర (1ఆ. 50-55 ప.), పెరుంబుదూరు (1ఆ.79-84ప.), తిరువల్లిక్కేణి (1ఆ.114-117ప.) వర్ణనలు, 2. పార్థసారథిస్వామి వర్ణన (1ఆ. 121ప.), 3. జాహ్నవద (1ఆ. 142-144ప.), 4. కుమారోదయ (1ఆ. 145ప.), 5. సూర్యో దయ (1ఆ. 164ప.) వర్ణనలు.

పురవర్ణన : (1ఆ. 116ప.)

"సీ. పట్టణం బెయ్యది పార్థసారథి దివ్య
సారంగమున కబ్జకోరకంబు
పుటభేదనం బెద్ది భూరితైర్థికహంస
సంఘంబులకు మానసహ్రదంబు
పురవరం బెయ్యది పరమ భాగవతోత్త
మామూల్యమణులకు నాకరంబు
నగరమేయది నిరంతర వైభవ స్ఫుర
ణాతిరేకంబున కాటపట్టు
గీ. దాని విబుధ సద్వాస్పదం బైన దాని
నరయు మాత్రాన నఘముల నడచు దాని

మహిమమున రంగనగర సామ్యంబు గలిగి
నెగడు దానిని దీని వర్ణింప దరమె?"

తిరువల్లిక్కేణిపట్టణమున పార్థసారథిస్వామి వెలసియున్నాడు. ఆ పట్టణము తామరమొగ్గగా పార్థసారథి యనెడు దివ్యమైన తుమ్మెదకు ప్రీతికరమై నివాసయోగ్యమయ్యెనట. వైదికు లనెడి హంసముల కా పురము మానససరోవరము. ఈ రీతిగా కమనీయమైన కల్పన ఈ పురవర్ణనలో కన్పట్టుచున్నది.

దౌహృదవర్ణన :- (1 ఆ. 142 ప.) కాంతిమతి గర్భవతియై యుండగా సామాన్యగర్భిణీ లక్షణములు కానవచ్చినవి. ఆ లక్షణములను విలక్షణార్థమున కవి ఊహించిచేసిన ఈవర్ణన రమణీయము.

"సీ॥ శేషాంశముదర సంస్థితమౌటఁదెల్పుటకై
వడి నాననము దెల్లఁబాఱఁజొచ్చె
హరిమతంబిట మీఁద సంతతంతకును వ
ర్ధిల్లునాఁగ నడుము పెంపలరఁబూనె
కుటిలవాదుల మోము లిటులుండఁగలవనాఁ
జనుమొనల్ నలుపెక్కి తనరఁజొడఁగె
ప్రజకిట్టులిక భక్తిపారవశ్యముతోఁచు
ననుమాడ్కిఁ గూర్కుడార్కొనఁ గడంగె
గీ॥ నఖిల లోకైకవినుత దివ్యప్రభావ
శాలియగు పార్థసారథి స్వామివారి
వరము సఫలత నెసయ గర్భమునుదాల్చి
రహిని బొల్చెడు భూమిపిరాట్టి కపుడు."

ఆదిశేషుడు శ్వేతవర్ణుడు. ఆ శేషాంశము నుదరమందు ధరించెనని తెల్పువిధముగా కాంతిమతి ముఖము తెల్లనయ్యెను. శ్రీవైష్ణవ మతమును వర్ధిల్లజేయుటకై రామానుజు డవతరించుచుండెను. కనుక

వైష్ణవమతమును [illegible] అను [illegible] వర్ణించెను. [illegible] స్త్రీలకు మోహము తెల్పకుంటు, [illegible] లావణ్యము సహజము. సహజలక్షణమును వర్ణించుచు కవి ఉపకారంమున్నది శేషాంశమగు రామానుజుడని తెల్పుటకై ఈ విధాన వర్ణించుట ముదావహము. ఇటులనే మిగిలిన పాదములును.

వైకుంఠనగర వర్ణన: (1. ఆ. 54 ప.) యతిరాజగు రామానుజుని చరిత్రము కనుక వర్ణనలలో సహితము ఆధ్యాత్మిక భావము గోచరమగును.

"సీ॥ ఆత్మభూముఖ్యుల కప్రాప్యమయ్యు భ
క్తులకు సుప్రాప్యమై యలరునెద్ది
పరయోగితతి కగోచరమయ్యు సుజ్ఞాను
లకు గోచరంబై చెలంగునెద్ది
యతివరేణ్యుల కదృశ్యంబయ్యు నధ్యాత్మ
విదులకు దృశ్యమై పొదలునెద్ది
యఖిలసూరుల కగమ్యంబయ్యు నిత్యసూ
రులకు సుగమ్యమై వెలయునెద్ది
గీ॥ స్వప్రకాశాభిరామమై పరగునెద్ది
మఱియు నాద్యంతరహితమై వఱలునెద్ది
యట్టి వైకుంఠనగర మాహాత్మ్యగరిమ
మలవియె నుతింప నీశ్వరాదులకునైన."

యోగులకు కనిపించనిది అధ్యాత్మమనెడి సుజ్ఞానము కలవారికి కనిపించునది వైకుంఠము; పండితులకు ప్రవేశింపరానిది నిత్యజ్ఞాన సంపన్నులకు సుగమ్యమైనది, స్వయంప్రకాశక శక్తికలిగి, ఆద్యంత రహితమై వైకుంఠనగరము విరాజిల్లుచుండె నని తమ్మంన్నశాస్త్రిగారు కథ కుచితమైన వర్ణన కావించిరి. నయనోల్లాస కావ్యమందే చ్యవను

నునికి లోచనప్రాప్తి కలిగినపుడు శాస్త్రిగారిటువంటి వర్ణన చేసి యుండగా నీకావ్యమున ఏల అధ్యాత్మభావవర్ణనలు చేయకుందురు? ఇటువంటి వర్ణన లీకావ్యమున కోకొల్లలు.

చక్కని ఉపమారూపకాది అర్థాలంకారములు, యమకాది శబ్దాలంకారములు నిందు గలవు. 2ఆ. 4ప.న శాస్త్రిగారు రాజ పుత్రిని పీడించు బ్రహ్మరాక్షసునికి చక్కని ఉపమానములను చెప్పిరి. బ్రహ్మరాక్షసుడు గొప్ప తపస్సును అహంకారమువలె రాకుమారి నాశ్రయించెనట. ఇట తపస్సు రాకుమారి. అహంకారము రాక్షసుడు అగుచున్నారు. అటులనే సంపన్నతను అసూయవలె, శ్రేష్ఠమైన గౌరవమును పరుషవాక్కువలె, సరసమైన విద్యను గర్వమువలె, వైరాగ్యమును భేదభావమువలె, రాజ్యలక్ష్మిని దుర్నీతివలె, యోగ్యశీలతను అసత్యమువలె రాకుమారిని బ్రహ్మరాక్షసుడు పట్టి పీడించుచుండెను. ఇచట రాకుమారికి రాక్షసునికి చెప్పిన పోలిక లన్నియు ఉదారములై యొప్పుచున్నవి.

ప్రాసస్థానమున దుష్కరప్రాసను వేసి ప్రాసనియమము పాటించుటయు నిందు కలదు. 'ర్జ', 'ష్ఠ' ప్రాసస్థానముల చూడుడు.

"క. ధూర్జటి గతి ఁదగు యాదవుఁ
 డూర్జితమతి యైన లక్షణోర్వీసురునిన్."

"క. గోష్ఠీపురమున భగవ
 ద్గోష్ఠీరత మానసుండు గుణనిధియుఁ దపో."

ఈ విధముగా నెన్నియో దుష్కరప్రాసము లీకావ్యమున గలవు. శాస్త్రిగారొకటి రెండు తావుల 'ఱ, ర', లకు భేదము పాటించక ప్రాసస్థానములందు వాడుట కానవచ్చును. (1 ఆ. 59 ప.)

ఈ కావ్యమున కవి హృదయము అడుగడుగునను గన్పట్టును. వరుసగా మూడాశ్వాసములలో కవి ఋణబాధను ప్రస్తావించెను.

రామానుజుని వివాహ సమయమున తల్లిదండ్రులు ఋణముచేయకయే వేడుక జరిపించవలెనని ఆలోచనచేయునప్పుడు అప్పులు, శత్రువులు, నిప్పులు నిశ్శేషముగా నిర్మూలించకపోయినచో మరింత అధికమగు నని పలికిరి. ఇవి కవి పఠితలకు సాహిత్యముద్వారా బోధించిన హితము. బ్రహ్మరాక్షసుడు రాజపుత్రిని విడిచినతరువాత ఆమె ఎట్లుండెనో కవి ఒక ఉపమామాలికలో వర్ణించుచు "ఋణబాధ దొలఁగిన గృహమేధి తెఱఁగున" అని ఉపమించెను. ఋణబాధ తొలగిన గృహస్థుడెంత హాయిగానుండునో అట్లే రాకుమారియు బ్రహ్మరాక్షసునిచేత విడువబడి హాయిగా నుండెనట. 3వ ఆ. 79 వ పద్యములో రామానుజుని కడకొక అన్నార్తుడు రాగా "ఆకలి గొని యున్నవానిని, ఆర్తితోనున్నవానిని, దారిద్ర్యదుఃఖముచేత పీడింప బడువానిని, ఋణనిమగ్నుడైనవానిని వెంటనే రక్షించుటవలన ఎంతటి సత్ఫలము కలుగునో తెల్పనలవికాదు" అని పలికెను. ఈ ఋణబాధ దేవులపల్లి సోదరకవులు స్వాయముగా ననుభవించి అట్టి బాధ ఎవ్వరికి కలుగరాదని ఈ కావ్యముఖమున హిత ముపదేశించుచున్నారు. సోదరకవులు కష్టసమయములో సుమారు డెబ్బది యైదువేల రూప్యములు ఋణమొనరించి తీర్చలేక బాధపడుచుండగా, పిఠాపురము మహారాజావారు వారిఋణమునంతను తీర్చివేసి మడులు మాన్యములతో నా కవిశ్రేష్ఠులను సత్కరించిరి.

ఏ కావ్యమందైన సమకాలిక సాంఘికవ్యవస్థలోగల ఆచార వ్యవహారములు చోటు చేసికొనుచుండును. ఈ కావ్యమందును క్రొత్తయల్లుడత్తవారింట చూపించు దర్పములు వర్ణింపబడెను. అల్లుడన్నంతనే అత్తవారింట భక్ష్యభోజ్యంబులు తనకు రుచిగా నున్నను రుచిగా లేవనును; మేలువస్త్రములు కట్నముగా నిచ్చిన నిరాదరము చూపును; అత్తవారింట ప్రేమతో సాంత్వనముగా

మాటలాడినను ప్రతికూలముగా కఠినభాషణములు పల్కినను; చాలకాలమందున్నను పండుగలు దగ్గరలో నుండగా వెడలిపోవుటకు ప్రయాణమగును. ఈరీతిగా అనుగడుగున కోపించుట, అత్త మామలచేత బ్రతిమాలించుకొనుట సాంప్రదాయముగా మారెను. ఆంధ్రదేశమున అట్టి సాంప్రదాయమున్నను కేశవసోమయాజి నయన భట్టారకులు మాత్ర మట్లు ప్రవర్తించక నిర్మలులై యుండి రని శ్రీ తమ్మన్నశాస్త్రి వర్ణించెను. (1ఆ. 94ప.)

**పూర్వకవుల ననుసరించుట :** శ్రీనాథుడు పోతన పెద్దనల నాదర్శముగా కవి కొన్ని పద్యములు వ్రాసెను. శ్రీనాథుడు తన కావ్యములను గూర్చి "చిన్నారి పొన్నారి చిఱుత కూకటినాడు రచియించితి మరుత్తరాట్చరిత్ర" అని చెప్పినట్లు శాస్త్రిగారు మహా రాజు అడిగినట్లొక పద్యము వ్రాసెను.

"బదునెన్మిదవయేట వ్రాక్రుచ్చితివి గదా
సకలేశశతక మాశ్చర్య ఫణితి
నిరువదైదవ యేట విరచించితి గదా
రావు సత్కులచరిత్ర ప్రబంధ"

ఈవిధముగా శ్రీనాథు పద్యము ననుసరించెను. అట్లే పోతన్న "పలికెడిది భాగవతమట" అని వ్రాసినట్లు ఒక పద్యము వీరు వ్రాసిరి.

"యతిపతి చరితంబట కృతి
క్షితిపతి యానతిఁ గడంగి చెల్లించుటయే
హితమగు పనియట! దానం
గృతకృత్యుఁడ నగుట యబ్రమే? మహిలోనన్"

పోతన్న "కమలాక్షు నర్చించు కరములు కరములు" అన్నట్లు శాస్త్రిగారు—

"శాశ్వతంబుగనుండు సత్కీర్తి సత్కీర్తి
సత్కీర్తి నార్జించు శక్తి శక్తి
శ్రమమైన విడువని సత్యంబు సత్యంబు
సత్యంబు పలికెడు జనుడు జనుడు
పండితుల్గానియాడు ప్రాజ్ఞత ప్రాజ్ఞత
ప్రాజ్ఞతగలయట్టి ప్రభువు ప్రభువు
సర్వజ్ఞు దిలకించు జ్ఞానంబు జ్ఞానంబు
జ్ఞానంబు గలిగించు చదువు చదువు"

అను సీసము వ్రాసిరి. 2వ ఆ. 176వ ప.న శాస్త్రిగారు విద్య యనగ నేమో తెల్పిరి. మానవునికి కీర్తి, శక్తి, సత్యము, ప్రాజ్ఞత, జ్ఞానము, విద్య కావలెనని తెల్పుచు, శాశ్వతమైన సత్కీర్తి సంపాదించు శక్తియే శక్తి అని సర్వజ్ఞు చూడగల జ్ఞానమే జ్ఞానమని అట్టి జ్ఞానమిచ్చు విద్యయే విద్యయని లౌకికధర్మమును బోధించెను కవిరచనారీతిలో పోతన్న ననుసరించియు భావమున స్వతంత్రుడై ప్రవర్తించెను. ఇట్లు తమ్మన్న శాస్త్రిగారు పూర్వకవుల పట్లగలగౌరవము తోడను, ఆయాపద్యశిల్పములు హృద్యములగుటను కొన్నిట పద్యభావములను, కొన్నిట శిల్పమును, కొన్నిట సమాసములను గ్రహించి కావ్యరచన చేసిరి. ఇక ప్రథమాశ్వాసమున కేశవ సోమయాజి పార్థసారథి స్వామిని స్తుతియించుట 124 నుండి 133 వఱకు పది పద్యములలో కలదు. ఇది ఉటంకించదగియున్నది. ఇందొక్క పద్యముతప్ప మిగిలిన తొమ్మిదిటికిని "స్థిరకరుణానిధీ! విమలధీసుగుణోదధి! పార్థసారథీ!" అను పాదముమకుటముగానున్నది. ఈతొమ్మిది పద్యములు చంపకమాలలో 'ర' ప్రాసముతో వ్రాయబడెను. నాల్గు పద్యములలో మాత్రమే 'ర ఱ' కూడ ప్రాసస్థానమున వాడబడెను.

"ఆకలి రుచి సొంపు, నిద్దుర సుఖస్ఫురణం బెఱుంగ నేర్చునే" "శుభస్య శీఘ్రమన్", "నిండుకుండ తొణకునే" మొదలైన లోకోక్తులు, 'సాపడు' వంటి తమిళ పదములు గలవు.

రసము : విశిష్టాద్వైత సిద్ధాంత ప్రతిపాదకులగు శ్రీరామానుజాచార్యులవారి మహిమను భక్తిని వెల్లడిచేయుచారిత్రకాంశము లిందు పొందుపరచబడుటచేత భక్తిప్రధానముగా కన్పట్టును. 'ఉజ్జ్వల నీలమణి ప్రకారము భక్తిని రసముగా గ్రహించిన ఇందు అంగి రసము భక్తియని చెప్పవచ్చును. యతిరాజ విజయము చారిత్రిక కావ్యమైనను అలతియలతి వర్ణనలు, చక్కని శబ్దాలంకారములు, తెనుగుజాతీయములతో అలరారుచున్నది.

దేవులపల్లి సోదరకవులలో సుబ్బరాయశాస్త్రిగారు సంస్కృత భాషాపాండిత్య మధికముగా కలవారై సంస్కృత వ్యాఖ్యానములు, కావ్యములు వ్రాసి, ప్రభుభక్తిపరాయణులై విరాజిల్లిరి. తమ్మన్న శాస్త్రిగారు సంస్కృతభాషలో కావ్యములు వ్రాయకపోయినను సంస్కృతవ్యాఖ్యాతమల్లినాథునితో అన్నగారుతులతూగగా, దండక రచనలో తాను కాళిదాసునితో సమానుడ ననిపించుకొనినారు. మొత్తము మీద నిర్వురుసంస్కృతాంధ్రములలో సమానప్రతిభకల వారై కావ్యముల ప్రసాదగుణభరితముకావించి, ప్రభువుధారవోసిన సింహాసనము తృణప్రాయముగానెంచి అధ్యాత్మవీధులలో విహరించి మహా మనీషులై, పదప్రయోగమున దేవులపల్లివారి దొక ప్రత్యేక శాణి యనిపించుకొని "నిరంకుశాః కవయః" అనుమాట సార్థకమగు నట్లు కొన్నియెడల ఛందోబంధము విడనాడి విశృంఖల కవిమత్తేభ ముల వలె విరాజిల్లిరి. రాజాస్థానమందున్నను కావ్యముల సంకితము చేయుటపట్ల నీ సోదరులు స్వేచ్ఛగా ప్రవర్తించిరి. ఇది దేవులపల్లి పండిత ద్వయమునకే చెల్లినది; స్వేచ్ఛనొసగిన ఔదార్యమూ రావు గారి మహేంద్రునికే తగినది,

# ప్రతివాది భయంకర రాఘవాచార్యులు

(1842-1889)

శ్రీగంగాధర రామారావుగారిచేత ఆదరింపబడిన కవులలో ప్రతివాది భయంకర రాఘవాచార్యులు II ప్రముఖులు. వీరిజీవిత కాలము నలుబదియేడువత్సరములే యైనను సంస్కృతభాషలో ఉద్దండ పండితులై "ఐత్వభాష్యభంజని" అను సంస్కృతగ్రంథ మును, సంస్కృతహయగ్రీవశతకమును తెలుగున సాహితీకల్పవల్లీ యను ప్రబంధమును, పూర్వాచార్య చరిత్ర సంగ్రహము రచించిరి. ఇవికాక అప్పుడప్పుడు వ్రాయుచువచ్చిన పద్యములు "బాల్యకవితా భ్యాసశైలికవిత" అను పేర్లగలవు. ఆచార్యులవారి చెంత ప్రసిద్ధ పండితులు దంతుర్తి సుబ్బరాయశాస్త్రి, కాశీభట్ల సుబ్బరాయ శాస్త్రి, దర్భా బైరాగిశాస్త్రి, చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి మొదలైన వారు విద్యాభ్యాస మొనరించిరి. రాఘవాచార్యులవారు రాజప్రాప కమునొల్లక చామర్లకోటలోనుండి శిష్యులకు విద్యగరపుచు గ్రంథా వలోకన మొనర్చుచుండగా శ్రీగంగాధర రామారావుగారు స్వయ ముగా ఆచార్యుల వారి దర్శనమునకు వెడలిరి. అంతటవారు-

"పాయా దపాయాదయి రాయరాయ త్వాం యో
హయాస్యోదయమే ప్రాక్।
కాయా దపాయాస నివారణాయ మాయా మయం
మానుషసైంహరూపం॥

అని రాజావారి నాశీర్వదించిరట. రాఘవాచార్యులుగారు సిద్ధాంతకౌముది మాత్రమభ్యసించిరి. వింజమూరి రామావతారము గారు వ్యాకరణములోను, వింజమూరి తిరువెంగళాచార్యులు వేదాంత శాస్త్రములోను వీరికి గురువులు. రాఘవాచార్యులవారు శిష్యులకు

మహాభాష్యం పాఠము చెప్పుచుండ నొకనాడు వ్యాకరణ చతురాన నులు చిలుకూరి చతుష్టయమువచ్చి వీరి పాఠము విని

"శ్రీమద్రామావతారాఖ్య గురువిందేయ వందనాత్
యత్ప్రసాదోడు పాత్తూర్ణం తీర్ణం వ్యాకరణార్ణవమ్"

అని అచ్చెరు వందిరట. ఆచార్యులవారి తల్లిదండ్రులు కన కమ్మ వేంకట దేశికులు. గంగాధరరామారావుగారి తండ్రి సూర్యా రావుగారి కాలమందున్న ప్రతివాది భయంకరతిరువెంగళాచార్యులు వీరి పెదతండ్రి. వీరివలననే రాఘవాచార్యులవారికి సాహిత్యప్రాభవ మబ్బెను.

**సాహితీకల్పవల్లి** : రాఘవాచార్యకృతమగు నీప్రబంధము రాజావారి కంకితము చేయబడెను. ఏడుగుచ్ఛముల ఈ కావ్యము అముద్రితము. ఇందునాలుగాశ్వాసములు మాత్రము లభించెను.

ఈకావ్యము ప్రథమ గుచ్ఛమున ఉపోద్ఘాతమున కవి "సాహితీ కల్పవల్లి"యను కావ్యకన్యకారత్నంబు నతిప్రయత్నంబున నిర్మా ణంబుచేసి, యిందుకు దగిన రసికునిం జింతింపుచుండ" అనిప్రారం భించి, "శ్రీమత్కుంతీమాధవచరణారవింద మరందబిందు సందో హాతుందిలాయమాన మిళన్మిళింద మానసుండును...అగు శ్రీగంగా ధర రామరాయ వరుండీ కృతికిందగిన వరుండని యెంచి" కృతిపతి నాశీర్వదించిరి.

"మ॥ వనజాతామల గానపల్లవిత భాస్వద్వేణుకాగంధ గం
ధ నటద్భృంగ దభంగ భృంగ బహుళోద్యద్గాన నిస్వాన మి
శ్రిత వైణికవేణుగాన కలనా శానిశ్చల స్వాంతతన్
మనుపుంగావుత లక్ష్మిరావుకుల రామారాయ రాజేంద్రునిన్"

అని యాశీర్వదించి కవి కృతిభర్త నిట్లు వర్ణించిరి.

"క. ఆజాను బాహు విగ్రహ
రాజ మహారాజ రాజ రంజిత విద్యా
భోజాయమాన నిజగుణ
రాజిత గుణ సాంద్రరామరాయ మహేంద్రా!"

వ్రాతప్రతి మిగుల శిథిలావస్థయందుండుట చేత, అసంపూర్ణ మగుటచేత విశేషవర్ణనాత్మక వివరణనిచ్చుటకుగాని, పూర్తికథాంశము తెల్పుటకుగాని సాధ్యముకాలేదు. ఈప్రతిని కవివంశస్థులైన శ్రీమాన్ ప్రతివాది భయంకరాచార్యులచెంత చదివితిని.

కథాసారము : కాళిందీ శ్రీకృష్ణుల వివాహమందు ప్రధానేతివృత్తము శ్రీకృష్ణార్జునులు వేటకువెడలగా నచటవారికి మధురమైన గీతారావము వినిపించెను. అర్జునుడాదిక్కునపోయి సూర్యనందన యగు కాళిందిని చూచివచ్చి, ఆమె సౌందర్యము కృష్ణునెదుట వర్ణించెను. కృష్ణుని కోర్కెపై మరల నర్జునుడచటికేగి, వారిచేత సత్కృతుడై చిలుకవలన కాళిందీ కన్యావృత్తాంతము తెలిసికొని వచ్చెను. తరువాత కృష్ణార్జునులామెను చూచి హాస్తినాపురికి వెడలిరి. ముకుందు గాంచిన సూర్యనందన వారి వియోగమున కృశించుచుండెను. కాళింది పెంపుడు చిలుక మణిపంజరము "శ్రీకృష్ణునికి లేఖ వ్రాసియిచ్చినచో హాస్తినకు వెడలెద"నని కాళిందిని ప్రోత్సహించెను. కాళింది వ్రాసినలేఖ గైకొని చిలుక కృష్ణుని కడకేగి, అతడును కాళిందీ వియోగమున విరహాకులుడగుటచూచి ఆనందించి జాబు నొసగెను. కృష్ణుడును మరల జాబువ్రాసి చిలుకకొసగెను.

లభించిన వ్రాతప్రతిలో నింతమాత్రమే కథకలదు. ఇతర ప్రబంధములను బట్టి యూహించిన, కాళిందీ స్వయంవరమున కృష్ణుని వరించగా నితరరాజులు కృష్ణునియెడల నసూయతో అత

సిపై దండెత్తుట, కృష్ణు డర్జునుని సహాయమున వారి నోడించి సూర్యతనయను వివాహమాడుటతో కథ ముగియును.

కాళిందీ శ్రీకృష్ణుల లేఖలు సంస్కృతమున నుండుట యొక విశేషము. కాళింది లేఖలో చివరిభాగము "కిం కరోమ త్వచ్ఛరణ మగమం కుత్ర గచ్ఛామి కృష్ణ" "శ్రీమన్ముఖారవిందా కాళిందీ జయతు ... శైవాలకేశపాశా సముదాక్షీ సైకతశ్రోణీ ... " ఇది కృష్ణుని లేఖ ప్రారంభము.

కవి మణిపంజరము నొకపరి కీరమనియు నొకపరి శారిక అనియు ననుట గమనార్హము. కీరశారిక లేఖార్థకములు కావు. కవి కీరమనియో శారికయనియో చివరకు నిర్ణయించుకొను తలంపుతో నొక్కొక్కచోట నొక్కొక్కరీతిని పేర్కొని యుండవచ్చును.

రాఘవాచార్యులుగారు సమస్త శాస్త్రములలో సముచిత ప్రవేశ ముండుటయే సాహిత్యమను భావముతో, అట్టి సాహిత్యమును సాహితీపిపాసువుల కందించుటకు తర్కవ్యాకరణ వేదాంత భూగోళ ఖగోళ సంగీతాది శాస్త్రములలో తమకుగల పాండిత్యమును ప్రదర్శించుచు నీ గ్రంథము వ్రాసి, "సాహితీకల్పవల్లి" అని పేరిడిరి. లభించినంతలో కవికిగల ఆయా శాస్త్రపాండిత్యమున కుదాహరణలు గైకొందము.

"చిద చిదీశ్వర సంజ్ఞ చిత్తాన జీవాత్మ
జ్ఞాన స్వరూపుండు జ్ఞాన గుణకుఁ
డజడాను డశేషనిత్యానంద గుణుఁడీశ్వ
రా పృథిక్సిద్ధాంగుఁడై వెలుంగు."

ఇది తర్కశాస్త్రజ్ఞానమున కుదాహృతి. ఇక సంగీతమునకు

"సీ. ధైవతి ఋషభ గాంధార నిషాద పం
చమ షడ్జమాదిక స్వరవితాన

ముసు మేళగింపుచు మూర్ఛనల్ జెలఁగ సం
వాది వివాద్యనువాదగతిని
మందర తారక మధ్యమ రీతులు
కళలు జాతులు సుల్కగరిమతోడ
నాలాపతానము లందంద నెరయంగ
దశవిధ గమకముల్ దనరుచుండ
గీ. షాడవౌడవ సంపూర్ణ సరసరీతి
శుద్ధసాళగ సంకీర్ణ శుద్ధి దనర
మనుజ కర్ణరసాయన మహిమ జెంది
రాగమొక్కటి యనురాగరసము నించె."

సంగీతశాస్త్రమున నిష్ణాతులైనవారు తప్ప నితరు లింతటి లోతు తరచి వ్రాయలేరు. ఇక కవి పూర్వకవుల ననుసరించుచు నెన్నియో చక్కని పద్యములను చెప్పెను. అల్లసాని పెద్దనాదుల వలె నాయిక ఏడ్పును కవి చక్కగా వర్ణించెను.

"శా. ఆ రామామణి యిట్లసంగక సవ్యచ్చాప టంకార వ
ద్ఘోరాసార శరప్రసారముల నార్తుల్ జెంది నిస్తార వి
స్తారాయాసముచే నురోజముల హాస్తంబొత్తి కాదంబరీ
సారోన్మత్తసుమాస్త్రభంభరచమూస్వానంబుగానేడ్చుచున్."

కాదంబరీపుష్ప మకరందాస్వాదనముచేత మత్తెక్కినతుమ్మెదల రొదవంటి ధ్వనితో కాళింది యేడ్చెనట. పోతన్న "ఎవ్వనిచే జనించు" పద్యపుటెత్తుగడ భావములను గ్రహించి రాఘవాచార్యుల వారీపద్యము వ్రాసిరి.

"ఉ. ఎవ్వని వల్లలోకము జనించు మనోహరరీతి నంత యం
దెవ్వనివల్ల వృద్ధిగని యెంతయు ప్రీతిగనుండు వేడ్కతో
నెవ్వఁడు నాశముం బరపు నెవ్వనియందు జగంబు లీనమౌ
నెవ్వఁడు ధ్యేయుఁడౌ మనకు సిద్ధచరిత్ర యెఱుఁగఁజెప్పవే.

అని చిలుక ప్రశ్నించును. పోతన్న పద్యములో పాదపూరణ ములు లేవు.

ఈపద్యములో అటనట పాదపూరణ పూరణపదములుగలవు. మురారి "అనర్ఘ రాఘవము"లోని "భూయన్తరాణి యదమూని తమస్వినీషు" అను శ్లోకమును జ్ఞప్తికి తెచ్చు పద్యమొకటి ఆచార్యు లవారు వ్రాసిరి.

"మ॥ కుసుమాస్త్రుండను భర్మకారుఁడు మనఃకోశోల్లసత్స్వర్ణమున్
పసగాజేయ వియోగవహ్నిని తప్తంబై కరంగి ప్రభా
విసరభ్రాంతి మహానురాగ కలనావేషంబుచే నచ్యుత
ప్రసర స్వచ్ఛగుణంబు చేకొనియె చిత్రఖ్యాధి నాయింతికిన్".

కుసుమాస్త్రుడను భర్మకారుడు మనఃకోశ మనెడు స్వర్ణము, వియోగమనెడు వహ్నిలో తప్తమై కరిగెననుటచే నిటరూపకాలంకారము కలదు.

"జవరాలి నీలనయన శ్రవదంజన దృగ్విలాస ముదమంతన్
ప్రవహించి యంగమెల్లను గవయగ సన్వర్థమయ్యె కృష్ణత
యపుడున్"

చక్కని తద్గుణాలంకారమట కలదు. తేటతెనుగు పదముల కలయిక యెంత సరళముగా సాగునో సంస్కృత పదముల కూర్పు అంతలలితముగా సాగును.

"అభ్రంకషోత్తుంగ శుభ్రగాంగ తరంగ
కలితవారిధి యెంతకాలముండు
పాదసహస్ర సంపన్న త్వరత ఖమార్గ
మున సూర్యుం డెంతకాలముండు
భుజగేంద్ర మృదుసాంద్రభూరి
తల్పంబున కాంచనాంబరుఁ డెంతకాలముండు

సకల చరాచర స్రష్టయై రాజసఖ్యాతుఁడౌ
విధి యెంత గాలముండు"

అంతకాలము భూమి వసుగర్భయై యుండగా శాశ్వతైశ్వర్య ముతో శ్రీరామరాయప్రభువు ప్రకాశించవలెనని కోరుచు కవి కావ్య మంకితమిచ్చెను.

అంగిరసము :- ఈ కావ్యమున అంగిరసము శృంగారము. సందర్భోచితముగా నితరరసము లంగములుగా పోషింపబడెను.

కవి వంశవర్ణనలో ప్రచండపండితులై విష్ణుపరత్వస్థాపనమున ప్రతివాది భయంకరులని బిరుదు వహించిన హస్తిగిరినాథర్ అణ్ణన్ తమకు 12 తరములపై వారని, శాస్త్రమునకు ప్రతిగా 'సీస్త్రము' చెప్పి నీలాద్రిరాయణింగారి మన్ననకు పాత్రులైన ప్రతివాది భయంకర రాఘవాచార్యులుI తమకు పితామహ వర్గమువారని కవి తెల్పెను.

ఆశ్వాసాంతగద్య :- శ్రీ మద్హయగ్రీవ భగవచ్చరణార విందవందన కందళాయమాన మనస్సమాసాదితానవద్య సంపద్య మానా శ్రీమత్ప్రతివాది భయంకర రాఘవాచార్య విరచితంబైన సాహితీకల్పవల్లియను ప్రబంధరాజంబు... .... ...సంపూర్ణము.

## శ్రీ కనకదండి గోపాలకృష్ణశాస్త్రి

కనకదండి గోపాలకృష్ణశాస్త్రి గంగాధరరామారావుగారి ఆస్థానవిద్వాంసులు. వీరు రాజావారిపై కొన్ని సంస్కృతశ్లోకము లను, తెలుగుపద్యములను రచియించిరి. వీరితల్లిదండ్రులు బ్రహ్మాక్క-వెంకటసోమయాజిగారలు. తెలగాణ్యులు భరద్వాజసగోత్రులునైన వీరి స్వస్థలము కొత్తపేట తాలూకా 'పనుగుల మహాల్' గ్రామము. శాస్త్రిగారి మాతామహుడు శ్రీ ఇంద్రగంటి విశ్వపతిశాస్త్రి ధర్మ శాస్త్రపండితుడై, 'విస్సన్న చెప్పిన వేదం' అను కీర్తి నార్జించిరి; గంగాధర రామారావుగారు వీరికి భూమి నొసగి సత్కరించిరి.

గోపాలకృష్ణశాస్త్రి అనర్ఘరాఘవమునకు వ్యాఖ్యానము వ్రాసిరి. 'నవరత్నమాలికాస్తోత్రమ్' అను తొమ్మిది శ్లోకముల సంస్కృత కావ్యము వ్యాఖ్యానసహితముగా రచియించిరి; పిఠాపురం రాజావారిని కొనియాడుచు పదునెనిమిది పద్యములతో తెలుగున నొక చిత్రప్రబంధము వ్రాసిరి. వీరు నలుబదియేండ్లు దాటిన పిమ్మట సంగీతములో కృషిచేసిరి; జ్యోతిషమున ప్రవేశము కలదు; సంస్కృతాంధ్రములలో మంచి పాండిత్యము కలదు.

"నవరత్నమాలికాస్తోత్రమ్" — ఈ తొమ్మిది శ్లోకములు లిఖితప్రతిలో వ్యాఖ్యానసహితముగా 81 పుటలుగలిగిన అముద్రిత గ్రంథము. ప్రారంభశ్లోకము, వ్యాఖ్యానము పరిశీలించిన శ్రీ కనకదండివారి పాండిత్యము ప్రస్ఫుటమగును.

"శ్లో॥ శ్రీవశ్యత్వే వినివ్నావాయ రచితం దృష్ట్వాక్షిభాసాసితం
నేదం తత్త్వితి పారిజాత సుమనోమాల్యాం లలామీకృతం
స్వేర్ష్యాం మేచకవేణి యోజితమథాదర్శేపి తచ్ఛంకినీం
సత్యాం లాలయతో హరే రవతు వశ్శ్రీరామరాయ స్మితం॥"

"సత్యభామ పారిజాతపుష్పముపై దృష్టినుంచగా నామె చూపులలోని నల్లదన మా పూవుపై ప్రసరించి నల్లగా కనిపించెను. అది నిజమగు పారిజాతము కాదని భావించుచు సత్యభామ నీలకచభరమున తురుముకొని ముకురమున చూడగా కేశకాంతివలన సుమము నల్లగా కనిపించెను. అది పారిజాతమే కాదని శంకించు సత్యభామను లాలించు శ్రీకృష్ణుని చిఱునగవు శ్రీ గంగాధరరామరాయని కాపాడుగాక" అని పిండితార్థము. ఇందు "శ్రీ వశ్యత్వేన" అను పదములో 'శ్రీ' శబ్దమునుండి ప్రతిశబ్దమునకు సాధికారమైన అర్థవివరణ తార్కికముగా చేసిన శాస్త్రిగారి పాండిత్యమునకు ఎల్లలు లేవు. ఈవ్యాఖ్యానమందే అలంకారములను, వ్యాకరణఛందోవిశేషములను

కవి వివరించెను. ఇందలి అలంకారములను గూర్చి యిట ప్రస్తా వింతును.

అతిశయోక్త్యలంకారము: సత్యభామ నేత్రమాలిన్యముచేత పారిజాతము నల్లగా కనిపించెనను భావము అతిశయోక్త్యలంకారము అని కవి వ్యాఖ్యానించెను. సత్యభామ స్వభావము అతిశయోక్తి చేత అనుప్రాణితమగుట అతిశయోక్త్యలంకారానుప్రాణిత భ్రాంతిమద లంకారమయ్యెను.

విషమాలంకారము : శ్రీకృష్ణుడు కోపించిన సత్యభామను ప్రసన్నురాలిని చేసికొనుటకై పారిజాతము సమర్పించినను, ఆమె ప్రసన్నురాలగుటకు విరుద్ధముగా కుపితయైనందున నిట విషమాలం కారము చెప్పవలెను.

ఏడవశ్లోకమున కవి గంగాధరరామారావుగారికిని విష్ణువు పరశురామ బలరాములతో పోలిక చెప్పెను.

"హరిరూపాయుగభూపారామాఖ్యాఃపరశురామహలముఖ్యాః ప్రఖ్యాతా కతౌ రావుకులే చక్రపాణిరయమజని 'హరిరూపా' అను టను వ్యాఖ్యానమున" అధునా నావిష్ణుః పృథ్వీపతిరితి వచన మనుస్మరన్ అస్యప్రభువరం తస్యనారాయణాంశత్వం తావదావిష్క రోతి హరిరూపాఇతి." అని శాస్త్రిగారు వివరించిరి. తరువాత ఆ హరియే రావుకులమున గంగాధరరామరాయ ప్రభువుగా నవతరించె ననియు చెప్పబడెను. వ్యాఖ్యలో కవి "పరిత్రాణాయ సాధూనాం" అను గీతాశ్లోకము నుదహరించెను. "చక్రపాణిః చక్రసాధనః చక్రా కార మహాభాగ్యవత్తాద్యోతక రేఖాంకితహస్తశ్చ హరిరూపఇత్య నువర్తతే" అని చక్రపాణి శబ్దమున కర్థవివరణము కలదు. తదుపరి ఛందోవ్యాకరణాలంకారాదుల వివరణ కలదు. కావ్యాంతమున "నవరత్నమాలికైషా సుగుణాకృష్ణేన, రామభూమివిభోః గ్రథితా

........ఇతి శ్రీకనకదండోపాభిధాన గోపాలకృష్ణశాస్త్రి విరచితా సటీకా నవరత్నమాలికా సంపూర్ణశ్రీః అని గద్యకలదు.

చిత్రకవిత్వము : పదునెన్మిది పుటల తెలుగు చిత్రకవిత్వమును అముద్రితముగానున్నది. ఈ పద్యములను రెండు భాగములుగా విభజింపవచ్చును. మొదటి యారు పద్యములు 'రామ' శబ్ద సామ్యముచేత రాజావారికి శ్రీరామునితో అభేదము చెప్పుచున్నవి. ఈ యారుపద్యములకు చివర "వరమృదు స్వాంత శ్రీరామ ధరణి కాంత" యను మకుటము కలదు. తరువాత పంద్రెండు పద్యములు 'గంగాధర' నామసామ్యముచేత శివునికి గంగాధర రామారావు గారికి అభేధము చెప్పుచున్నవి. వీనికి "జయ జయ మహేశ! గంగాధర యచలేశ!" అనునది మకుటము.

"సీ. ఘన శంఖ చక్రలక్షణ మహాశయభోగి
వరులు సోదరులు నిన్నరసి గొలువ
బహుళ సామ్రాజ్య సంపత్తి గురుపురంబు
నందలి పౌరులానంద మొంద."

ఇది రాజావారిపరముగా రామపరముగా నర్థము వచ్చునని. ఇక గంగాధరరామరాయప్రభుని స్వభావమును దెల్పుచు నీక్రిందిపద్యము వ్రాయబడెను.

"సీ. కృప పుట్టెనేని నీకపకార మొనరించు
నే నరునైన మన్నింతు వీవు
మన్యుపొందిన నేని మాన్యత నున్న నే
దక్షునైనను దలందరుగు దీవు
మతిఁబుట్టెనేని మిన్నుదగులు రాజును
త్రుంనైన నీక్రిందద్రొక్కు దీవు

వలపుఁ బుట్టిననేని వసంతి దనయంత
దానవే నినుజేర దగుదువీవు

గీ. దేవ! నీవిట్లనుగ్రహ దివ్యనిగ్ర
హముల మెలంగుదు నీకు దుర్గములు గలరె
హర్షద మహాయశోభిరామాభిధేయ
జయజయ మహేశ! గంగాధర యచలేశ!"

సాక్షాత్తు భగవంతుని లక్షణములివి. సాక్షాద్భగవత్స్వరూపులైన శ్రీ గంగాధరరామారావుగారియందు నీలక్షణములు సంపూర్ణములుగా నుండి ఆ నామమును సార్థక మొనరించుచున్నవి. నిగ్రహానుగ్రహ సమర్థుడైనవాడే రాజ్యపరిపాలనకు యోగ్యుడు. గంగాధరునిలో హాలాహలము అమృతము లున్నట్లు గంగాధరరామారావుగారి యందును గలవు. తప్పుచేసినవానికి శిరచ్ఛేద మొనరించునంత కోపమురాగా వీరు కేశఖండనముమాత్రముచేసి, వెంటనే వానికి కలిగించిన అవమానమునకు చింతిల్లి దయార్ద్రహృదయులై కొంత ధనము నొసగెడివారనీ, ధనసంపాదనకు కొందరు పరిచారకులు రాజావారికి కోపము కలిగించుటకై తప్పుపనులుచేసి శిక్షతోబాటు సొమ్ముకూడ సంపాదించెడివారని ఒకగాథ. సాక్షాత్తు వారియాస్థానమున పండితులై రాజావారి కోపతాపములను, కరుణను కనులార గాంచిన కవి వారి గుణగణములను యథార్థముగా వర్ణించుచు శివునితో పోల్చుట ప్రశంసనీయము. రెండవపాదములో "తలఁదరుగుదీవు" అనగా నురిదీయుట కాదు. మూడవపాదములో "రాజమిత్రునైన" అనుటకు మరియొక గాథయు గలదు. గంగాధరరామరాయ ప్రభువు శ్రీ వైష్ణవమతస్థుడు కనుక ఒక పీఠాధిపతి పీఠికాపురమునకు విచ్చేసిన సందర్భమున ఏబదివేలరూప్యములు భిక్షగా నొసగబోగా నయ్యాచార్యుడు లక్షరూప్యము లిచ్చినగాని భిక్ష స్వీకరింపనని

భీష్మించెను. వైష్ణవమతపారమ్యము నర్థముచేసికొనినవారు కనుక రాజావారు ఆచార్యుని అత్యాశకు ఏవగించుకొని, పైకి కనిపించ నీయక ఇప్పుడే వత్తునని చెప్పి లోపలికేగి వైష్ణవనామములను తుడిచి వేసి, విభూతిధారణము కావించి, ఆచార్యునికడకు వచ్చి 'స్వామీ! మీరుకోరిన భిక్ష స్వీకరింపుడ''ని పలికెను. వైష్ణవులు శైవునిచెంత భిక్ష స్వీకరించరు. అందువలన పాప మాచార్యుడు తన దురాశకు నిందించుకొని రిక్తహస్తములతో వెడలిపోయెను. ఇటువంటి అత్యద్భుతమైన పరిపాలనాదక్షతకలవారు శ్రీ గంగాధరరామారావుగారు. ఇటువంటి గాథలెన్నియో శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి 'కథలు-గాథలు' వలన, స్థానికులవలన తెలియుచున్నవి.

చిత్రప్రబంధము :– ఏబదిమూడు పద్యముల ఈయముద్రిత కావ్యము మొదటి రెండుపద్యములలో శ్రీ గంగాధరరామారావు గారిపేర షష్ఠ్యంతములుచెప్పి కవి "అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాచే జేయఁబడిన చిత్రప్రబంధంబు నాదరించి" అని మొదలిడెను. ఐదునుండి పదునొకండవ పద్యమువరకు రాజావారి దానవిభవము, ధర్మపరత, కవిపండితపోషణములగూర్చి వర్ణింపబడెను. ఇందు సాంగ మహారథబంధము, మహారథబంధము, కూర్మబంధము, రథబంధము, ఖడ్గబంధము కలవు. తరువాత సంస్కృతములో 1. ధనుర్బంధః, 2. చతుష్షష్టికోష్ఠచతురస్రచక్రబంధః, 3. అష్టచత్వారింశద్దళపద్మబంధః, 4. సక్రమద్విఫణిబంధః, 5. వ్యుత్క్రమఫణిబంధః, 6. శరబంధః, 7. ధ్వజబంధః, 8. అశ్వబంధః, 9. షోడశదళపుష్పబంధః, 10. పుష్పబంధః, 11. రథబంధః, 12, సకూర్మపద్మబంధః, 13. హలబంధః, 14. మత్స్యబంధః, 15. పుష్పమాలికాబంధః, 16. ఛురికాబంధః, 17. అర్థరథబంధః, 18. హయగతిబంధః, 19. చక్రబంధః, 20. ఖడ్గబంధః, 21. గోమూత్రికాబంధః, 22. గుచ్ఛమ్, 23. ఆందో

ళికాబంధః – అను నిరువది చిత్రబంధభేదములు కూర్పబడెను. ఈ పద్యములను కవి శ్రీ గంగాధరరామరాయని స్తోత్రపూర్వకముగా నాశీర్వదించుచు చెప్పెను.

పుష్పబంధః :– "సుహృద్విధేయం సుభగాభిధేయమ్
సుదృక్ప్రగేయం సుగుణాప్రమేయమ్
కటాక్షదాయం కమలేనపాయం
నలోపమేయం నయరామరాయం"

ఈ స్తోత్రము లన్నియు నొకొక్కపద్యము లేదా శ్లోకము పుట కొక్కటి చొప్పున వ్రాయబడి, సగభాగము వ్యాఖ్యానము వ్రాయునిమిత్తముగాబోలు స్థలము విడువబడెను. కొన్నిశ్లోకములు వ్రాతప్రతి శిథిలావస్థలోనుండుటచేత పాదాంతాక్షరములు ఖిలమైనవి. చివరిపుటలో "భోభో విభో విద్యావిద్యా విభవ భోజరాజా నిరుపమ సంప్రదాజరాజ జయ జయ జయ" అని ముగింపు చెప్పబడెను. శాస్త్రిగారికి సంస్కృతభాషపట్ల ప్రభువువారిపట్లగల అపరిమితమైన అనురాగమిందు వ్యక్తమగుచున్నది. శ్రీ గంగాధరరామారావుగారికిని సంస్కృతభాషాభిమాన మధికము. పండితులతో సంస్కృతభాషలో సంభాషించెడివారని వినికిడి.

## అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి

అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి క్రీ॥ శ॥ 1831లో జన్మించెను; తలిదండ్రులు గంగమాంబారంగధామార్యులు. రంగధామార్యుడు "నారాయణాచలమాహాత్మ్యము"ను రచియించెను; కవిసోదరుడు రామకృష్ణకవి కవిచకోరచంద్రోదయము,సత్యభామావిలాసాదిప్రబంధములను రచియించెను. ఇట్టి పండితవంశమున జన్మించిన సుబ్రహ్మణ్యకవి నాగాభట్ల నరసకవి గురువుగా నుభయభాషాపండితుడయ్యెను. వీరి నివాసగ్రామము చేబ్రోలు.

తొలుత సుబ్రహ్మణ్యకవి మూడుగుల సంస్థానాధిపతి శ్రీకృష్ణ భూపతివద్ద క్రీ॥ శ॥ 1853 నుండి 1859 వరకు నుండి వార్షికమును పొందెను; 1869లో పీఠికాపుర సంస్థానాధిపతియు, సాహితీబంధువు నగు శ్రీ రాజా గంగాధరరామారావు బహద్దరువారి నాశ్రయించి, మాసవేతనము పొందెను. ఆ కాలమందే భద్రాపరిణయము అను కావ్యము రచియించి సుబ్రహ్మణ్యకవి రాజావారి కంకితముచేసెను. ఈ కవి రచించిన ఇతరకావ్యములు :- (శ్రీ)కృష్ణభూపతిలలామ శతకము, 2. శేషధర్మములు (1867), 3. పాపయమంత్రిశతకము (1853) 4. ఆత్మబోధము, 5. మణిధ్వజచరిత్రము, 6. సింహాద్రిరామాధిప శతకము, 7. శ్రీకృష్ణకల్యాణము (1878), 8. చాటుధారా చమత్కారసారః. చాటుపద్యములు కొన్ని భద్రాపరిణయ పీఠికలో నుదహరింపబడెను. ఒక గృహస్థుని కోర్కెపై కాట్రావులపల్లి నూతి నీరును కవి ఇట్లు వర్ణించెను.

"క. దేవాసురు లబ్ధిఁదరువ
నావిర్భూతమయి హాలాహలమపుడు మహా
దేవునకున్ భీతిలి కా
ట్రావులపలి నూతులందు డాగెను జుండీ."

**భద్రాపరిణయము** : సుబ్రహ్మణ్యకవి గంగాధర రామారావుగారి ప్రాపున పదిసంవత్సరములుండి క్రీ॥ శ॥ 1879 లో భద్రాపరిణయ కావ్యము నంకితము చేసెను. రాజావారు కవిని మడులు మాన్యములతో సత్కరించిరి. భద్రాపరిణయము క్రీ॥ శ॥ 1912 లో మహారాజా సూర్యారావుగారి యాజ్ఞానుసారము, పిఠాపురమందలి శ్రీవిద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షర శాలయందు ముద్రింపబడెను. దీనికి బ్రహ్మశ్రీ పురాణపండ మల్లయ్యశాస్త్రిగారు వ్యాఖ్యానము వ్రాసిరి. ఈభద్రాపరిణయము కాణాదము పెద్దన సోమయాజి **కృత**

మగు "ముకుంద విలాసము" అను ప్రబంధ మాధారముగా రచింప బడినను సుబ్రహ్మణ్యకవి తన కావ్యమందెచటను సోమయాజిని స్మరింపలేదు. పెద్దన సోమయాజి గద్వాల సంస్థానాస్థాన కవి; 17వ శతాబ్దికి చెందినవాడు, భద్రాపరిణయమునకు ముకుంద విలాసమునకు పెక్కు సాదృశ్యములుండుటచేత, భేదసాదృశ్యము ను కూలంకష ముగా విమర్శించుట అనివార్యము.

కథాసారము: శ్రీకృష్ణుడు ఇంద్రప్రస్థమునకు వెడలుచు మార్గమధ్యమున రోహణపర్వతముపై విశ్రమించెను. శ్రుతిరంజని యను యోగిని వచ్చి కేకయదేశపురాజు కథ తెల్పి, అతని కుమార్తె భద్రాదేవికి లక్ష్మీదేవి యాజ్ఞానుసారము, తాను సకల విద్యలను నేర్పితినని చెప్పి, భద్రాసౌందర్యము కొనియాడెను. తరువాత భద్ర శ్రీకృష్ణుని వలచినట్లు చెప్పి, ఆమెను వివాహమాడుమని శ్రీకృష్ణు ని ప్రబోధించెను. కృష్ణుడింద్రప్రస్థమునుండి భద్రా స్వయంవర వృత్తాంతమువిని కేకయపురమునకు ప్రయాణమయ్యెను. కేకయపుర మున కృతకాద్రి సమీపములోనున్న వనమునుండి వీణానాదము విని పించగా శ్రీకృష్ణుడచ్చటనాగి, వీణవాయించుచున్న భద్రను చూచెను. భద్రాదేవి కృష్ణునిగాంచి లజ్జతో నాచోటు విడిచెను. కేకయరాజపత్ని శ్రుతకీర్తి కృష్ణుని మేనత్తయగుట నతడామెను చూచి కుశల వృత్తాంతమును తెలిపెను. భద్ర విరహార్తయై యుం డెను. శ్రీకృష్ణుడు భద్ర సోదరునితో సల్లాపమాడు చుండ నార దుడు వచ్చి "భద్రాప్తిరస్తు" అని దీవించి స్తోత్రము చేసి వెడ లిపోయెను. మార్గమధ్యమున విందాను విందులను రాజులెదురై భద్ర తమ యిరువురిలో నెవ్వరిని వరించునని నారదుని ప్రశ్నించిరి. "భద్ర రమాంశ సంభూత, కృష్ణునే వరించును" అని నారదుడు చెప్పెను.స్వయంవర మంటపమునకు వచ్చుచున్న భద్రను విందాను

వింధు లపహరించుకొని పోవుచుండ, శ్రీకృష్ణుడు వారితో యుద్ధము చేసి జయించి, భద్రాదేవిని వివాహమాడి ద్వారక కేగి సుఖముగా నుండెను.

ముకుందవిలాస భద్రాపరిణయములకు గల భేదములు:

కథాంశమున నీరెండుకావ్యములకు నత్యల్పమగు భేదములు గలవు. కథ అంతయు రెండింట సమానమే. ముకుంద విలాసమున, ఖాండవదహనము, మయుడు పాండవులకు సభ నిర్మించుట, తన రక్షణకు మూలమైన ముకుందునికొక సభనిర్మించదలచి, ద్వారక యందుగల వింతలను చూచి సిగ్గుపడుట, తనకోర్కెను కృష్ణునికి తెల్పి రైవతకాద్రి సమీపమున కేళీవనము నిర్మించుట, ఇంద్రుడు మయనిర్మిత కేళీవనిలో దివ్యలతాదులనుంచుట-శ్రీకృష్ణుడు దేవీ సహితుడై అందు విహరించుట అను నంశములుగలవు. కాని భద్రా పరిణయమున నివి లేవు. భద్రాపరిణయములో రోహణగిరి కలదు. కాని రైవతకము లేదు. శ్రీకృష్ణుడిచటనే విశ్రమించి శ్రుతిరంజని వలన భద్రవృత్తాంతమును తెలిసికొనెను. శ్రుతికీర్తి వసుదేవుని సోదరియగుటచేత వసుదేవుని యాజ్ఞపై గదుడు కేకయ నగరమున కేగి క్షేమసమాచారము తెలుసుకొని వచ్చినట్లు, గదునివలన కృష్ణుడు తొలుత భద్రా సౌందర్యకథనము విన్నట్లు ముకుంద విలాసమున కలదు. సుబ్రహ్మణ్యకవి ఏలనో ఈఘట్టము విడిచెను. మేనత్త మేన మామల బిడ్డలగు భద్రాకృష్ణులు ముందే ఒకరిని గూర్చి యొకరు తెలిసికొనిరనుట ఉచితము. అటువంటి ఘట్టమును విడుచుట కవి ఔచితీరాహిత్యమును తెల్పుచున్నది. ముకుంద విలాసమున, శ్రీకృష్ణుడు మయనిర్మితకేళీవనిలో చిలుకవలన భద్రాదేవినిగూర్చి మరియొక పరి తెలుసుకొనుట, చిలుక భద్రచిత్రపటము కృష్ణుని కిచ్చుట, చిలుక శ్రీకృష్ణుని దేవేరులను ధిక్కరించి మాట్లాడుట,

భద్రాకృష్ణుల విరహము, స్వయంవరములో భద్రకు చిలుక రాకుమారులను పరిచయము చేయుట, భద్ర కృష్ణుని వరించుట, సుయోధనాదులు కృష్ణునితో యుద్ధము చేసి ఓడిపోవుట, భద్రాశ్రీకృష్ణుల పరిణయము కలవు. భద్రాపరిణయమున చిలుక లేదు. ప్రతిరంజని అను యోగిని కలదు. ముకుందవిలాసమున చిలుక రాణివాసముచుట్టిక్కరించినట్లు వ్రాయుట అనుచితము. చిలుక రాకుమారులను పరిచయము చేయుట శృంగారనైషధము పద్ధతిలోనున్నది. భద్ర స్వయంవరమునకు వచ్చు సమయమునుండి భద్రా పరిణయకర్త అద్భుతమైన మార్పు చేసెను. విందానువిందులా మెనపహరించగా, శ్రీకృష్ణుడు వారి నోడించి భద్రను పరిణయమాడుట సహజముగా నున్నది కాని ముకుందవిలాసమున భద్ర కృష్ణుని వరించగా సుయోధనాదులు యుద్ధమునకు వచ్చుట ఉచితముగా లేదు. ఐనను ఇది స్వయంవరములలో ఈర్ష్యాపరులైన రాకుమారులపట్ల సహజమే.

**రెండుకావ్యములకుగల సామ్యము:** ముకుందవిలాసము ప్రథమాశ్వాసములో 4, 111, 120, 122, 123, 124, 135, 136, 139, 159, 160, 165, సంఖ్యగల పద్యములనాధారముగా చేసికొని సుబ్రహ్మణ్యకవి కొన్ని పద్యములు వ్రాసెను. అవి వరుసగా 1 . 5,ఆ 107, 108, 110, 112, 117, 118, 119, 120, 123, 127 సంఖ్యగలవి. అట్లే ముకుందవిలాసము 1ఆ. 173, 174, 235, 286, పద్యములు భద్రాపరిణయము ద్వితీయాశ్వాసములో క్రమముగా 55, 56, 58, 82. పద్యాలుగా పరిణమించెను.

ముకుందవిలాసమును భద్రా పరిణయములో అనుసరించుట నాల్గువిధములుగా విభజించవచ్చును.

1. పద్యశిల్పమును భావమును గ్రహించి పదములను, క్రమమును మార్చుట. ముకుందవిలాసమున లక్ష్మీదేవి కృతిభర్తకు భా

గ్యములొసగుగాత యని పెద్దన చెప్పిన పద్యమువలె భద్రాపరిణయ మున కృతి భర్తకు గౌరీదేవి సర్వమంగళములొసగుగాత యని ఆశీర్వ దించిన పద్యము కలదు. ముకుంద విలాస భద్రా పరిణయ పద్యభా గములను క్రమముగా పరికింపుడు.

"సీ. ఏనాతి సాకాశ భూనాథ సుతయౌటఁ
దెలుపు నంచిత మధ్యదేశకలన
నేరామ ధరణీకుమారియౌ టెఱిఁగించుఁ
బృథు విశంబ నితంబ బింబగరిమ."

"సీ. ఏరామ హిమవత్కుమారియౌ టెఱిగించుఁ
దెల్లమౌ నుల్లంపుఁజల్లదనము
ఏలేమ తెలివేల్పు నిల్లాలగుటఁ దెల్పుఁ
జిలుగు వెన్నెల నవ్వుమొలకనవ్వు
ఏసాధ్వి శ్రిత జనాభీష్టదాయిని యౌటఁ
జాటించు దను పారిజాతవల్లి
ఏ తన్వి భువనైక మాతయౌటఁ గరంబు
ప్రకటించుచుండు నంబాసమాఖ్య."

రెండు కావ్యముల ప్రథమాశ్వాసమున క్రమముగా 4,5 పద్యము లీసీసములు. పరిశీలించినచో ముకుందవిలాసమునకు సుబ్రహ్మణ్య కవి మెఱుగులు దిద్దెననక తప్పదు. ముకుందవిలాసమున కవి దేవతా స్తోత్రమని కూడ తలపక లక్ష్మీదేవి నడుము, నితంబము, రోమరాజి ఇత్యాది అంగాంగవర్ణన చేసెను. భద్రాపరిణయకర్త మూడవపాద ములో పారిజాతముతో పోల్చుటలోమాత్రము "పార్వతీదేవి తను పారిజాతవల్లి" యని వర్ణించెను. 2. కొన్నియెడల సీసపద్యమునగల భావమును గ్రహించి సుబ్రహ్మణ్యకవి వృత్తముగా మార్చెను. ముకుందవిలాసములో 1 ఆ. 118 ప. నిందు కుదహరింపవచ్చును. ఇది భద్రాపరిణయమున 106వ పద్యము.

"సీ. శ్రుతిపద క్రమలీలఁజూపనేరఁడటంచు
శేషుని గ్రిందుగాఁజేయఁగలరు
కావ్యసంపద నించుకయు నెఱుఁగఁడటంచు
గురునాది వికృతిగా నెఱపఁగలరు
కడు ప్రభాకరయుక్తిఁగని యడుగఁడటంచు
ద్విజరాజు నొకటఁగుందింపఁగలరు."

భద్రాపరిణయము :—

"చ. తగవున శేషునిన్ శ్రుతిపదక్రమలీలలు నేరఁడంచు ది
వ్యగురుని గావ్యగోష్ఠి నిసుమంత యెఱుఁగఁడటంచు సద్వ్రతుం
డగు ద్విజరాజునుంగడుఁ బ్రభాకరు ముక్కలఁజిక్కెనంచు నెం
చఁగఁగల రప్పురిన్ నిగమశాస్త్రకళాచతురుల్ మహీసురుల్."

సీసమును చంపకమాలగా మార్చి, భావముతో పదములను కూడ భద్రాపరిణయకర్త గ్రహించెను. 3. కొంతభావమును మార్చి, కొంత ముకుందవిలాసమునుండి గ్రహించి, అందలి పదములనే అటునిటు జరిపి క్రొత్తచేర్పులు వ్రాసిన సీసపద్యములు గలవు.

"సీ. వసుదేవ చిరభాగ్యవాసనా సారంబు
దేవకీకృత పుణ్యజీవనంబు
నందయశోదా జననసంచిత ఫలంబు
బలదేవసుకృత సంబంధసీమ."

ఈ రెండుపాదములను గ్రహించి భద్రాపరిణయకర్త ఒకటిన్నరపాదములకు క్లుప్తీకరించి శ్రీకృష్ణుని వర్ణించెను.

"సీ. దేవకీవసుదేవ దివ్యతపఃఫలం
బఖిల యశోదానంద హర్షసీమ
బలదేవ చిరపుణ్య పరిపాక సమయంబు."

తరువాత ముకుందవిలాసమున గల "రమ్యబృందావనారామ లిపికంబు" అనుభాగమును "రాధికాయూథికా శ్రావణంబు"గా గార్చి, "కంసాది ఖలతనూమరీచి"ని "కంసాది ఖలమత్తగజసింహ బంబు"గా చేసి, "రుక్మిణీముఖ పయోరుహ సరోహంస" ను రుక్మిణీహృదయ సరోవరహంసంబు" గావించి, దానికి "సత్య భామా ముఖాబ్జాత తరణి" ని కూర్చినాడు సుబ్రహ్మణ్యకవి. పూర్తిగా ముకుందవిలాసపద్యములనే స్వీకరించిన తావులును భద్రాపరిణయమున గలవు.

ముకుందవిలాసము :-

'క. ఈరీతి నీతిదైతే
యారాతి నిరీతిగా జనావన భూతిన్
మీఱి శుభాస్థితి నొక నాఁ
డారూఢ ప్రీతిమతి సమాదృతినెఱయన్."

1వ ఆ. 160 పద్యమునే భద్రాపరిణయకర్త రెండవపాదాంతమున రెండక్షరములను మార్చెను; మూడవపాదప్రారంభమున "మీఱి శుభస్థితి" అను పదములను "కోరియొనర్పగ" అనియు, నాల్గవపాదమున 'సమా, నెఱయన్'శబ్దములను "హితా నెగసెన్"గా మార్చెను.

ఈ విధముగా ముకుందవిలాసపద్యముల నెన్నిటినో యథాతథముగా గ్రహించి, మార్చి తనగ్రంథమున నుపయోగించునంత దుస్థితి భద్రాపరిణయకర్తకేల కలిగెను? ఒకవేళ పెద్దనసోమయాజి వర్ణనల రామణీయకతనుజూచి ముచ్చటపడెనందమా? అట్లైన ఆ కవినేల స్మరింపకుండెను?

భద్రాపరిణయవర్ణనలు : 1. ద్వారకా (1ఆ. 98-116) కేకయపుర (2ఆ. 18, 19), 2. ప్రయాణ (1ఆ. 125-129), 3

రోహణగిరి (1ఆ. 130-136), 4. వన (2ఆ. 76, 77), 5. హ్రద (2ఆ. 25-28), 6. కుమారోదయ (2ఆ. 29), 7. మధూదయ (2ఆ. 58-72), 8. వనవిహార (3ఆ. 64-70), 9. పుష్పాపచయ (3ఆ.72), 10 సరోవర (3ఆ. 74-77), 11. జలక్రీడా (3ఆ. 78-82), 12. అనంగపూజా (3ఆ. 85, 86), 13. సూర్యాస్తమయ (3ఆ.83-92), 14. సంధ్యా (3ఆ. 93), 15. చంద్రోదయ (3ఆ. 95-103), 16. సూర్యోదయ (4ఆ. 4-11), 17. యుద్ధ (4ఆ. 34-49), 18. వైవాహిక (4ఆ. 82), 19. కన్యాంగ సౌందర్య (2ఆ. 38, 87-113), 20. శ్రీకృష్ణ (1ఆ. 117-123, 3ఆ. 8, 15,16) 21. ధృష్టకేతురాజ వర్ణనలు (2ఆ. 20-22) చూచుట, చింతించుట మున్నగు దశవిధ శృంగారావస్థలు నీకావ్యమున గలవు. వర్ణనలలో సుబ్రహ్మణ్యకవి తనప్రతిభ ప్రదర్శించెను.

**కన్యాంగసౌందర్య వర్ణనము** : ద్వితీయాశ్వాసము : 108, 113 పద్యములలో సుబ్రహ్మణ్యకవి భద్రను వర్ణించిన తీరు హృదయంగమము.

"గీ. మూడులోకంబుల జయింప మూఁడువిండ్లు
దర్పకుఁడు దెచ్చి యొక్కటి దానుబూని
యువిదకడ రెండుదాఁచెఁ గాకున్న వంగి
దృక్సితశరాళి నీనునే దీనిబొమలు!"

అనంగుని విండ్లు అనునట్లుగా వక్రములైన కనుబొమలు, తీక్ష్ణములైన చూపులనెడి బాణములు భద్ర కలిగియున్నదని రూపకముతో కూడిన ఉత్ప్రేక్షాలంకారముతో భద్రాముఖసౌందర్యమును కవి వర్ణించెను.

"మ. గతిమత్తేభము, నాసచంపక, మొగిఁగైశ్యంబు కందంబు, సరి
గతవాక్యంబులు మత్తకోకిలలు, దృగ్వ్యాపారమయ్యుత్పల

ద్యుతి మోమంబు సహాంబు, దేహరుచి విద్యున్మాల, యీ మానినీ
తత వృత్తస్థితులెన్నఁగాఁ దరమె తద్వాగ్జాని కైనన్ ధరన్."

భద్రనడక, ముక్కు, కేశపాశము, పలుకులు, చూపులు, మోము, లావణ్యములు మదించిన ఏనుగు, సంపెంగ, మేఘము, కోకిల, పద్మము, విద్యుల్లతలతో సమానముగా నుండెను. ఈ పద్యమున కవి వ్యంగ్యముగా మత్తేభ, చంపక ఉత్పల మత్తకోకిలముల విద్యున్మాలామానినీవృత్తములు, కందపద్యములను తన కిష్టమైన ఛందస్సులుగా సూచించెను. ఇటువంటి చమత్కార పద్యములను వసుచరిత్రకారుడు వ్రాసెను. ఆ రామరాజభూషణుడు "పద మెత్తం గలహంస లీల" యనుచు గిరికను వర్ణించుపట్ల ప్రస్తుతార్థమునకు సంగీతశాస్త్రరాగములను జోడించి తన సంగీతప్రియత్వమును వెల్లడిచేయగా, సుబ్రహ్మణ్యకవి భద్రావర్ణనకు ఛందోరీతులను బేర్కొని తనకు ఛందస్సుపట్లగల యభిమానమును వ్యక్తముచేసెను. తరువాత భ, సగ, నల, నగ గణములను పేర్కొనుచు, భద్రగోరులు, నుదురు, మోము, కుచములు వరుసగా నక్షత్ర సముదాయము, అర్థ చంద్రుడు, పద్మము, గిరులతో పోల్చెను. గోరులు=భగణము, నిటలంబున్=సగ, వచనము=నల; కుచములున్=నగ- అని గురు లఘు విభజనమున ఆయాగణములగుట విశేషము; కవి ప్రతిభ, పాండిత్యములను తెల్పుచున్నవి. ఇట్టి చమత్కారవంతములైన వర్ణనలెన్నో ఇందు గలవు. 3వ ఆ. 2 పద్యమున నిట్లే చక్కని అలంకారయుక్తమగు వర్ణన కలదు. నక్షత్రమార్గగతుడైన సూర్యుడు మకరందసహితమగు పద్మమును కలియుటవలన కలిగిన దోషము పోగొట్టుకొనుటకై స్నానార్థము నీటమునిగెనా యనునట్లు సాగరమున మునిగెను. ఒకరాజు పద్మినీజాతిస్త్రీ సంగమమువలన కలిగిన దోషము తొలగించు

కొనుటకై పడమటిసముద్రమున మునిగెనా యన్నట్లు సూర్యాస్త మయ ముండెనట; ఇందువలన శ్లేషమూలకమైన అతిశయోక్త్యను ప్రాణితమైన ఉత్ప్రేక్షాలంకారమిట కలదు.

సుబ్రహ్మణ్యకవి పద్యములలో నధికభాగము శ్లేషయో, ధ్వనియో కలిగియుండును. ఇట్టి చక్కని శబ్దాలంకారము లిందు గలవు.

"ఉ. రాజకళావతంస, సురరాజ, ముఖస్తవనీయుఁ డబ్జినీ
రాజ నిభప్రభుండు, ఘనరాజమరాళరథుండు, వాహినీ
రాజగభీరమూర్తి, ఖగరాజగ, నాభిభవుండు భారతీ
రాజు చిరాయుఁజేయుఁ గవిరాజ విధేయుని రామరాయనిన్."

'రాజ' శబ్దము ప్రతిపాదమునను పాదాదిని పాదమధ్యమునను ఆవృత్తియగుటచేత నిది పాదాది పాదమధ్య యమకమగుచున్నది. రాజకళావతంసుడగు నీశ్వరుడు, సురరాజను నింద్రుడు మొదలైన వారిచే స్తుతియింపబడదగినవాడు, అబ్జినీరాజగుసూర్యునితో సమాన మగు శరీరకాంతి గలవాడు, రాజహంసలు రథముగా గలవాడు; వాహినీపతివలె గంభీరమైన యాకృతి గలవాడు, విష్ణువుయొక్క నాభినుండి జన్మించినవాఁడు భారతీపతియునగు బ్రహ్మ గంగాధర రామరాజేంద్రునికి చిరాయువు కలిగించుగాక! యని కృతిభర్తను కవి యాశీర్వదించుచున్నాడు. యమకమను శబ్దాలంకారముగాక యిందు ఉపమానిదర్శనములను నర్థాలంకారములు గలవు. 'అబ్జినీ రాజనిభప్రభుండు' అనుచో నుపమాలంకారమును, వాహినీరాజగభీర మూర్తియనుచో నిదర్శనాలంకారమును గలవు. భద్రాదేవి శ్రీ కృష్ణుని వియోగమును సహింపలేక కృశించెను. విరహతాపమున కృశించిన భద్రకు కృష్ణవేణినదికి కవి 3ఆ. న- 47 పద్యములో నభేదము చెప్పుచుండెను.

ఉ. వారకదస్రుక్కై బాహుబిసవల్లులు వాడేఁగు చాబ్జకోశముల్
తోరపుఁగంకణావళులతోడనె జాఱె సమంచితోర్మికల్
సారెఁగలంగె జీవనము శ్వాస మహోష్మసమీరవార వి
స్ఫారగతిన్ వియోగపుఁ దశద్దినంబుఁ గృష్ణవేణికిన్.

3వ ఆ. 75 ప. న కవి, సఖీసమేతముగా జలక్రీడలాడుటకై సరసి చెంతకు వచ్చినపుడు హంసలు తుమ్మెదల కలకలము వర్ణించుట రమణీయముగా నున్నది. వారు ఒడ్డున కూర్చొని యుండగా హంసలు క్రేంకారము చేసెను. ఆధ్వనివిని కొలనిలో కెందామరల మరందమానుచున్న తుమ్మెద లదరిపాటున లేచి ఎగురదొడగెను. ఆక్రేంకారము భద్రాదులను జూడవచ్చు జలాధిదేవతల కాలియందెల సవ్వడి వలెను, పద్మములనుండి ఎగురుచున్న అళులు ఆదేవతల చంచలమైన చూపులవలెను ఉండెనని కవి యుత్ప్రేక్షించెను. సుబ్రహ్మణ్యకవి ప్రతిభావంతముగా రచియించిన అనేకములైన వర్ణనలు చక్కని ముక్తపదగ్రస్తములు, వివిధములైన అర్థాలంకారాదులతోడ ఒప్పునవెన్నియో గలవు. 3ఆ.60వ. పద్యము కవికి ఉభయ భాషాలయందుగల పాండిత్యమును దెల్పును.

"ఉభయ భాషాకందము :
నీలాగారయనగవే
నాలియ మాదాని పాలనాతి బలారే
మేలా నీలా వరయుఁ
వాలాయము నేన కావ వారక పదమా"

తెలుగు : నీలాగు, ఆరయన్, నగవు, ఏ, నాలి, అ, మాదాని పాలన్, నాతి, బలారే, మేలు, ఆ, నీలావు, అరయుము, వాలాయము, నేను, అ, కావన, వారక, పదమా- మాదానిపాలన్ = మాదియగు పని విషయమై.

సంస్కృతము : నీలాగారయ : నీల + అగార = నీలాచలమను గృహమును, య = పొందినస్వామీ , నగవ = గోవర్ధనమను పర్వతమును వహించిన గోపాలా, ఇన + ఆలియ = సూర్యుల వరుసను పొందినవాడా! (ఆదిత్యరూపమైన నారాయణా) దానిపాలన = గజము రక్షించినవాడు, అతిబలాకే = ఇంద్రునతిక్రమించిన బలవంతుడా! ఇత్యాది అర్థవివరణము వ్యాఖ్యాత చేసెను. ఉభయభాషా కందమగుట వలన పదభంగము అర్థవంతముగా చేయుటయే గాక, కొన్ని పదముల కర్థము చెప్పుట కష్టమైనను మహాపండితు డగు వ్యాఖ్యాత శ్రీమల్లయ్యశాస్త్రిగారు చక్కని వివరణమిచ్చి అర్థవంతముకావించిరి. ఉదా: దాని = దానముకలది దాని (మదజలము కలదిఅనుట) = ఏనుగు ఇత్యాది వివరణము క్లిష్టమైనది.

అంగిరసము : కావ్యనామమును బట్టియే యిందలి అంగిరసముశృంగారమని చెప్పవచ్చును. భద్రాకృష్ణుల అన్యోన్యానురాగమువియోగము విరహము లిందు సంపూర్ణముగా వర్ణింపబడెను. శృంగారరసము ప్రధానమగు రసమనియు, విందానువిందులతోడి యుద్ధము వలన వీరరసము అంగమనియు స్పష్టము.

## శ్రీ గంగాధర రామారావు బహద్దరువారికి అంకితము చేయ బడిన గ్రంధములు

1. దండకము: ఈదండకము భైరంపల్లి తిరుమలరాయఁడను కవి రచియించి రాజావారికంకితమిచ్చెను. ఇది చెన్నపట్టణము ప్రభాకర ముద్రాక్షరశాలయందు ముద్రింపబడెను. క్రీ॥ శ॥ 1870 లో శ్రీ భైరంపల్లి తిర్మలరాయకవి శ్రీ గంగాధరరామారావు గారి నాశ్రయించుటకై హైదరాబాదు నుండి పిఠాపురము వచ్చి శ్రీ ప్రభువు వారిపై నీదండకము చెప్పెను. కొందరుకవులు "నావిష్ణుః పృథివీపతిః"

అను వాక్కు ననుసరించి రాజుల వైభవములను స్తోత్రముచేయుచు దండకములు వ్రాయు చుండిరి. శ్రీ రాజావారు, దత్తపుత్రులగు వేంకటరామకృష్ణారావుగారు వారి పుత్రుడు గంగాధర రామారావులతో కలిసి విజయదశమినాడు శమీవృక్షమును పూజించి భేతాళుని నిల్పి ఊరేగుచు వచ్చి కుంతిమాధవుని పూజించి ఆస్థానమునకేగి కొలువుతీర్చి శాస్త్రప్రసంగములు చేయుట సంక్షిప్తముగ తెలుపబడెను. శ్రీ రాజావారు సర్పవరమున మణవాళమునిని ప్రతిష్ఠించి నట్లు పిఠాపురము, సామర్లకోట, కాకినాడ, రాజమండ్రి మున్నగు చోట్ల హార్మ్యములు నిర్మించినట్లు కవి వ్రాసెను. చారిత్రక దండకమనదగిన ఈస్తోత్రము ప్రభువుదయ సంపాదించుటకై చెప్పబడెను. కావున నిందు కవితా విశేషములు కానరావు.

**2. గోపాల శతకము :** శ్రీ సత్యవోలు సోమసుందర కవి కృతమైన ఈ శతకము గంగాధర రామారావుగారి కంకితము చేయబడెను. క్రీ॥శ॥ 1923లో శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాలయందు శ్రీమహారాజా సూర్యారావుగారి చేత నీశతకము ముద్రింపబడి ప్రకటితమయ్యెను. ఇది 'కవివర విశ్వంభరారమణనామ గుంభిత సరసవచనరచనావిచిత్ర పద్యగర్భిత కందపద్యశతకము. గోపాలా యను మకుటముతో భక్తిప్రధానముగా ధారాళమగు శైలిలో వ్రాయబడిన ఈశతకమున కవి రాజావారిని మాన్యమిమ్మనికోరెను. ఇది చిత్రకవిత్వము. గర్భితపద్యములమాత్ర మిట నుదహరింతును. 1. మొదటి యిరువది నాలుగు పద్యములలో సమపాదములందలి నాల్గవయక్షరముగలిపి చదివిన రాజావారిని కవి యాశీర్వదించినట్లు తెలియును. ఆయక్షరముల కూర్పు క్రిందికందము.

"క. శ్రితకాంక్షిత ప్రదాయక
సతతమ రేచర్లగోత్రజలధి శశాంకా

పతగాధిపవాహు డనా
రతమును మిముబ్రోచు రామరాయ మహీంద్రా!"

2. రెండవపుటలో ఇరువది పద్యములలో ప్రతిపాదమునందు ఆరవ యక్షరము తీసి కలిపిన పండితులను పోషింపుమని కవి రాజావారిని కోరినట్లర్థము వచ్చు నుత్పలమాల యగును.

"ఉ. శ్రీరహిమీఱు రావుకులసింధు సుధాకర హారహీర మం
దార శతార తార దర నారద పారద కీర్తిసార స
త్కార మొసంగి పండితులకాంక్షితముల్సమకూర్చుమా లస
ద్ధీరత రామరాయ నృపతీ నవమన్మధాకృతీ."

చివరిపాదమున 5వ గణము భగణము మాత్రము లోపించినను గర్భితవృత్తము చక్కనిశైలితో నలంకారవైభవముతో నలరారుచున్నది. 3. మూడవపుటలోని యిరువది యొక్క పద్యములలో ప్రతిపాదమునను ఆరవవర్ణముకలిపిన కవి హృదయము వ్యక్తమగును.

"చ. వనజములంచునెంచి యెడబాయక తావక నేత్రయుగ్మమం
దనవరతంబు బ్రీతి దనరార రమాసరసీరుహాక్షి దా
ఘనతరలీల నిల్చెనది గాన భవత్కరుణాకటాక్ష వీ
క్షణముల నెల్లెడం సిరులజల్లెదు ఝల్లున రామరాట్ప్రభూ!"

రామరాయప్రభు వైశ్వర్యవంతుడై పండితాదిపోషణ చేయుటకు కారణము కవి యిట్లూహించుచున్నాడు. విశాలమైన రాజావారి నేత్రములను పద్మములనుకొని పద్మనిలయయగు లక్ష్మీదేవి అందు నిల్చెను. కనుకనే రామరాయ ప్రభునికటాక్ష వీక్షణములు సిరులను వెదజల్లుచుండెను. గంగాధర రామారావుగారి లోచనములను లక్ష్మీదేవి కమలములనుకొనుటలో భ్రాంతిమదలంకారము, ఆ ప్రభువు కరుణాకటాక్షములు సిరులను వెదజల్లుట అతిశయోక్త్యలంకారము నగుచున్నవి. లక్ష్మీదేవి ప్రభువుకన్నులలో నివసించుట

యను విషయము ఆకరుణావీక్షణములు సిరులను వెదజల్లుటయను విషయముచేత సమర్థింపబడుటచేత నిది అర్థాంతరన్యాసాలంకారము నగుచున్నది. కమనీయమగు నీకల్పన గర్భితచంపకమునచేయుట కవి ప్రతిభను చాటుచున్నది. ఇందు న, ణ లు ప్రాసస్థానమున వేయ బడెను. 4. నాల్గవపుటయందుగల 20 పద్యములలో ప్రతిపాదపంచ మాక్షరములను గలిపి చూచినచో తనను పోషింపుమని రాజావారిని వేడుచు కవి ప్రభువునకు శ్రీ రంగనాయకులు శుభము కల్గించుగాక యని యాశీర్వదించిన భావము వచ్చును 5. ఐదవపుటలోని పద్యము లలో కవి తననామము తెల్పును. 6. శతకాంతమందలి ఐదుపద్యము లలో గర్భితార్థము "దీనజనపోషకా మాన్యం దయచేసి పోషింపు మని కోరిక" అని కలదు. కవికిగల సంగీతశాస్త్రాభిమానము నీక్రింది పద్యము తెల్పుచున్నది.

"క. శాంతా షడ్జ స్వరను
స్వాంతా దగురీతి గీత సరస కవితలన్
సంతోషించి నుతింతు ని
తాంత రిమపథ ససమేళ తతి గోపాలా!"

భిషగ్వర **పాపయలింగకవి జీవితము** : పేరూరి వేంకట సుబ్బారావు కృతమగు నీగ్రంథము క్రీ॥శ॥ 1898లో కాకినాడ సుజన రంజనీ ముద్రాక్షరశాలయందు ముద్రితము. కామఋషి పాపయ లింగకవి యను వైద్యుని చరిత్రమిది. పాపయలింగకవివైద్యవిజ్ఞాన మునకు మెచ్చి తనకుఆరోగ్యము కలిగించినందులకు గంగాధరరామా రావుగారు వేయినూటపదార్లు బహుమతియు; 'భిషగ్వరుడ'ని బిరు దము నిచ్చి సత్కరించిరి. తరువాత నీపాపయలింగకవి నాలుగు పర్యాయము లీ ప్రభువువలన నూటపదార్లను కానుకగా పొందెను. క్షత్రియవంశజుడైన ఈ కవి క్రీ॥శ॥ 1813లో జన్మించి 1883లో

మరణించెను. తల్లిదండ్రులు గౌరమాంబ వీరనాగయ్యలు; జన్మస్థలము పిఠాపురము. ఈ భిషగ్వరునకు తొలుత కిర్లంపూడి ఆస్థానవైద్యునిగా నుండి తరువాత వీరవరంజమీందార్లయాస్థానమును చేరి తదుపరి శ్రీ గంగాధరరామరాయని ఆశ్రయించి మాన్యములను పొందెను. పీఠికాపురాస్థానకవిగా నితడు పేర్కొనబడలేదు. కాని పాపయలింగకవి ఉభయభాషాప్రవీణుడై 1. మార్కండేయపురాణమును, కుక్కుటలింగ, 1. మాక్తికాభ్యుదయము, 2. ముక్తవంశాను వర్ణనము, 3. వైద్యనాథశతకము, 4. గణేశశతకము, 5. కుక్కుటలింగశతకము, 6. యుక్తిగణితచాటుధార, 7. వైద్యనాథ స్తవము మొదలైన గ్రంథములను రచించెను. ఈగ్రంథములన్నియు శిథిలమైనవి. ఈకవిని రాజావారొకనాడు వైకుంఠపటము వ్రాయుమనగా నితడు శాస్త్రోక్తముగా లిఖించెనట. రాజావారాతని చిత్రలేఖన శాస్త్రవిజ్ఞానములకు సంతసమంది నూటపదియార్లు మాన్యము నిచ్చిరట. అంత నీపాపయలింగకవి రాజావారినిట్లు స్తుతియించెను.

"ఉ. భూతిఘటింప మానవుల పుణ్యవశంబున ఫాలసీమల
న్వాత లిఖించెనా యొకరినాటి దదేమిటి రావువంశజుం
డై తగురామరాయ వసుధాధిపుఁ డెవ్వరికైన లిఖించు నా
వ్రాత తదాత్మజాత్మజ పరంపరలకెల్ల ఫలించునెప్పుడున్."

బ్రహ్మవ్రాతకంటె రాజావారివ్రాత అధికతరమనుచు కవి, గంగాధరరామరాయలు ఒకరికి వ్రాసియిచ్చిన మాన్యములు వారికి తరతరములుగా ననుభవయోగ్యములగు ననుట సత్యదూరముకాదు. అలనాడీ ప్రభువుచేత మాన్యాదుల స్వీకరించినవారికి ఆ సంపద వారివారి వంశజు లీనాడును అనుభవించుచు సుఖజీవనము గడుపువా రెందరో గలరు.

4. **రామరాజీయము :-** చంద్రమపాలెం కాపురస్థులయిన శ్రీ చెలికాని వేంకటరాయనింగారు క్రీ॥ శ॥ 1879లో రచించిన ఈ

గణితశాస్త్రము క్రీ॥ శ॥ 1884 జూలై నెలలో పిఠాపురము సంస్థాన ముద్రాక్షరశాలలో ముద్రితమై ప్రకటింపబడెను. ఇది శ్రీగంగాధర రామారావుగారి కంకితము చేయబడెను.

"శ్రీమన్మహీమండల మండనాయమాన పీఠికాపుర రాజ్య ధురంధరులును, ధైర్యగాంభీర్యచాతుర్యౌదార్యాది సకలసద్గుణవిశిష్టులును వేదశాస్త్రపురాణాది సకలవిద్యాప్రవీణులును. నవరసరసికులును, శ్రీమద్రమారమణీకటాక్షవీక్షణాలంకృతులును, దివ్యజ్ఞానపరిపూర్ణాంతరంగులునగు మహారాజశ్రీ శ్రీ రాజారావు వేంకటమహీపతి గంగాధరరామారావు బహద్దర్ రాజా ఆఫ్ పీఠికాపురము వగైరాగారి యాజ్ఞాప్రకారముగ" నిది ముద్రింపబడెను. 56 పుటల ఈ కావ్యారంభమున కవి ఇష్టదేవతాస్తుతి ప్రాచీనకవి స్మరణము చేసినతరువాతనిజగురువు శ్రీదేవులపల్లి బుచ్చయ్యశాస్త్రిగారికి మాతామహులు శ్రీ కందిమళ్ళ ధర్మారావుగారికి తండ్రి చెలికాని సూరరాయనికి తల్లి శ్రీమతి చిన్నమ్మగారికి నమస్కరించి పద్మనాయక వెలమవంశము నభివర్ణించెను; తరువాత రావు వంశమును వర్ణించి శ్రీ గంగాధరరామారావుగారి సత్కార్యములను దెల్పుచు చామర్లకోట, రాజమండ్రి,కడియము,చెన్నపట్టణము కాకినాడ, పీఠికాపురములలో మందిరములు,గృహములు కట్టించెనని చెప్పెను. అట్టి గంగాధరరామారావుగారు గణితశాస్త్రమును కావ్యముగా వ్రాయుమని సకలవిద్యాపారంగతుడైన కవి నడిగెను. అంతట కవి –

"క. ఏవం విధచరితునకు
నేవక జనరక్షణునకు జితశత్రునకు
న్దేవేంద్ర వైభవునకు
న్భావజ సమరూపునకును భయరహితునకున్."

అని షష్ఠ్యంతములు చెప్పి గణితశాస్త్రము ప్రారంభించెను. ఇందిరువదియైదు సూత్రములును, కొన్నిసూత్రములకు గణితమొక్కటియు, కొన్నిటి కధికముగను గలవు. ప్రతిగణితము సీసపద్యమందు, సూత్రముఇతరపద్యములందువ్రాయబడెను.ఉదా“దానకర్ణుండనఁదనరి రామారావు బులుసు పాపయ్యశాస్త్రి కెలమితోడ। నిచ్చిన భూమికి హెచ్చైన లెక్కయు నెనబదియొకటిగా నెసఁగు భుజలు। భుజకుఁ దొమ్మిదిగాఁగఁబొసగంగ గడలుండు గడయన నెనిమిదిగజములౌను। గడ చతురంబును గట్టిగాకుఁటగు యవి నూటపన్నెండు నరయ తూము। లవియు నిరువదియైనేని నగును పుట్టి। కాన నాభూమి యెంతయ్యె గణకతోడ। గణకశేఖరయదియును గణనఁజేసి। చెప్ప వలయు మాకిది యొప్పుగాను.” తరువాత నొక చంపకమాలలో సూత్రము, వచనమున వివరణము నీయబడెను. శ్రీ బులుసుపాపయ్య శాస్త్రి దేవమానములో భూమిని ఎక్కువ కొలిపించుకొనగా రాజావారాయుద్యోగిని తొలగించుట, మహాపండితుడైన శాస్త్రిగారి యుక్తియుక్తమైన వాదమున కానందపడి ఉద్యోగిని కరుణించుట జగద్విదితమైనగాథ. రామరాజీయమునందలి గణితములన్నియు గంగాధర రామారావుగారి వ్యవహారములకు సంబంధించి యొసగబడినవి. మల్లవరంలో రాజావారు త్రవ్వించిన చెఱువునకు ఖాసు చెఱువని పేరు కలదని యిందలి గణితమువలన తెలియవచ్చెను. అట్లే ఖాసు తోటయును. గణితశాస్త్రాంతమున కవి రాజావారినిట్లుసన్నుతిచేసెను.

“మాలిని :- అమలకమలనేత్రా! యార్యలోకైకమిత్రా!
సుమశర సమగాత్రా! సూర్యరాజేంద్రపుత్రా!
అమితశుభచరిత్రా! యాంధ్రగోత్రా కళత్రా!
శమదమగుణపాత్రా! స్వస్తి రేచర్లగోత్రా।”

వాసవదత్తాపరిణయము :- పెదమాధవరావుగారి కాలమున వక్కలంక వీరభద్రకవిచే వ్రాయబడిన వాసవదత్తాపరిణయమను

ప్రబంధమున పీఠపురరాజవంశవర్ణన కలదు. గంగాధరరామారావు గారు వంశవర్ణన మాధవరాయణింగారినుండి తమవరకు పెంచి వ్రాయుటకు శ్రీయుతులు వక్కలంక ఎఱ్ఱమిల్లి లక్ష్మీనారాయణకవుల నాజ్ఞాపించి, ఆగ్రంథమును క్రీ॥ శ॥ 1879లో భువనగిరి సూర్యోదయ ముద్రాక్షరశాలలో ముద్రింపించిరి. రాజావారి కోర్కెపై నీకవులు కావ్యమధ్యమున రామకథ చెప్పిరి. ఇందు తొలుత అయోధ్యాపుర అశ్వాదివర్ణనలు తదుపరి రాజావారి దానవిభావాని వర్ణనలు గలవు. పిఠాపురముకోట యుద్యానవనమున 'చిన్నిపూవు' అను పేరుగల పుష్పమునుండి తేనె తీసెడివారట. అది శర్కరఖండములవలెనుండి అతిమధురముగా నుండెడిదట. దానికి 'చిన్నిపూఁదేనె' యని పేరు. ఆ విషయ మీకావ్యమున గవర్నరుచేత కొనియాడబడెను; "మీ జమీలోనున్నట్టి మేలుతీపి చిన్నిపూఁదేనెమాత్ర మీశిఖరి లేదు" అని కొనియాడెనట.

ముగింపు : శ్రీ గంగాధరరామారావుగారు చతుర్విధ భాష లలో ప్రవీణు లగుటయేగాక ఆంధ్రాంగ్ల సంస్కృతముల ప్రోత్స హించియు, నాట్యకళ నుత్సాహపరచియు కళామతల్లిని పలురీతుల సేవించిరి. పెండ్యాల సత్యభామ నాట్యమును రాజావా రెంతయో ఉత్సాహపరచిరి. రాజావారు నాల్గుభాషలలో కవనము చెప్పియు, కవి పండితశ్రేష్ఠుల నాదరించియు, మాన్యము లిచ్చియు, తమ వంశావళి మాధవరాయనితో అంతముకానీయక పెంపొందిం చియు, ఆస్థానకవులచేత సంస్కృతాంధ్రములలో 'రావువంశముక్తా వళి' పేరిట వ్రాయించియు తృప్తినందక వంశవృక్షమును సిద్ధము చేసి ముద్రింపించిరి; తరువాత ఆంగ్లభాషలో మూడుపర్యాయములు **An Historical Account of the Rajahs of Pithapur** అను గ్రంథమును మువ్వూరు ముద్రింపించిరి. కాగితముల ఉత్పత్తి తక్కు

వగా నున్న రోజులలో ముద్రణావకాశము లంతగా లేకున్నను శ్రీ రాజావారు ధనవ్యయమునకు వెనుదీయక వేలరూపాయల ఖర్చుతో సాధ్యమైనన్ని గ్రంథములను ముద్రింపించిరి. అట్టివానిలో దిట్టకవి నారాయణకవి కృతమగు రంగరాయచరిత్ర, దానశాసనపత్రిక, వక్కలంక, ఎఱ్ఱమిల్లి లక్ష్మీనారాయణ కవుల వాసవదత్తా పరిణయము, స్వీయకృత వరవరముని స్తోత్రమ్, రామరాజీయము, గోదావరి పుష్కర స్నాన విధానము, An Historical account of the Rajahs of Pithapur మొదలైనవి కలవు. శ్రీరాజావారు సాధ్యమైనన్ని గ్రంథములముద్రించు తలంపుతో కాబోలు సంస్థానముద్రణాలయమును స్థాపించిరి. ఇది బహుశః 1881 తరువాతనే స్థాపించబడియుండును. ఈముద్రణాలయమున ముద్రితమైన గ్రంథములు మూడుమాత్రము కనిపించుచున్నవి. రామరాజీయము, గోదావరి పుష్కరస్నానవిధానములు వరుసగా జూలై ఆగష్టు నెలలో 1884 వ సం॥న ముద్రింపబడెను. ఆంగ్లవంశావళి తొలిముద్రణ 1881 కాకినాడ విద్వన్మోదిని ప్రెస్‌లో కాగా మూడవముద్రణము 1889లో సంస్థాన ముద్రణాలయమున జరిగెను. రెండవముద్రణ మెచ్చట జరిగెనో ప్రతి లభ్యము కాకుండుటవలన తెలియదు. మొత్తముమీద సంస్థానముద్రాక్షరశాల 1884–1889 మధ్యకాలమున మాత్రమే నడచినట్లు కన్పట్టుచున్నది. 1890 లో శ్రీ గంగాధర రామారావు గారిమరణానంతర మీ ముద్రణాలయమున ముద్రితమైన గ్రంథము కాన్పింపదు. బహుశః సంస్థానము 'కోర్టాఫ్ వార్డ్సు'న ఉండుట చేత నిది ఎత్తివేయబడియుండును. ముద్రణాలయము స్థాపించిన వెనుక రాజావారు అత్యల్పకాలము జీవించుటచేత ఆస్థానకవుల గ్రంథము లేవియు ఆదినములలో ముద్రణభాగ్యమందలేదు. మహారాజా

వారు సింహాసన మధిష్ఠించిన పిమ్మట దేవులపల్లి సోదరు లుండుటచే వారి గ్రంథములు ముద్రింపబడెను. కనకదండి, ప్రతివాది భయంకరా చార్యులవారు మరణించుటచేత నాయా కావ్యము లలక్షితము లయ్యెను. శ్రీ గంగాధర రామారావుగారికిగల సంస్కృతభాషా ప్రీతిని తెలుపు చక్కనిగద్యమొకటి ఓరుగంటి సోమశేఖరకవి కృత మగు ప్రభావతీ పరిణయమున గలదు. అందు ప్రథమాశ్వాసమున 62వసంఖ్యయగు చూర్ణికలో రాజావారు సంస్కృతభాషలో వర్ణింప బడిరి. తండ్రిగారి పేరు కవి 'నీలాద్రిరామమహీపాలు' డని పెర్కొనెను. కాని వీరి జనకులు శ్రీ వేంకట సూర్యారావుగారు చూర్ణిక తరువాత 3 శ్లోకములు ఒక శార్దూలవృత్తములలో రాజావారిని కవి వర్ణించెను. 65 వ పద్యమున "తస్యబాల్యసఖః ప్రీతః రామకృష్ణాంశసంభవః పైడాన్వయాబ్ధి పూర్ణేందుః రామకృష్ణోవిరాజితే" అని చెప్పి 66వ పద్యమున రాజావారు "సౌహార్దతతో భోగార్థముగా రామకృష్ణునకుఁ గోపూర్వాగ్రామమున్నాన్కగా" నిచ్చిరని కవి తెలిపెను. వీరిద్దులమైత్రిని గూర్చి 60-66 పద్యములలో వర్ణింపబడెను. శ్రీ పైండా రామకృష్ణయ్యగారు కాకినాడ విద్యాలయమున గంగాధరరామారావుగారి సహాధ్యాయి యని భావింప బడుచున్నది. మొత్తముమీద రావు సర్వజ్ఞసింగమహీపాల మాధవరాయ నీలాద్రిరాయ వేంకటసూర్యరాయ ప్రముఖుల పోలికను మహోదారులు దానకర్ణులు సాహితీపోషకులు స్రష్టలునై ఉత్తమపరిపాలకులు వైష్ణవోత్తములునై బహుముఖ ప్రతిభావంతులై చరిత్ర ప్రసిద్ధిఁగందిన శ్రీ రాజా రావు వేంకట మహీపతి గంగాధర రామారావు బహద్దరువారి కాలమున సాహితీలత సర్వతోముఖవికాసము నందెననుటలో విప్రతిపత్తి లేదు.



కళాప్రపూర్ణ
డా॥ శ్రీ రావు వేంకట కుమార మహీపతి సూర్యారావు గారు
క్రీ॥ శ॥ 1885-1964

## సాహిత్యచక్రవర్తి, డాక్టర్ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావుబహద్దర్, డి. లిట్.

మహారాజా సూర్యారావు బహద్దరువారి జననము 1885వ సం॥ మరణము మార్చి 1964. తలిదండ్రులు శ్రీమతి మంగయాంబా గంగాధర రామరాయప్రభువర్యులు. పీఠికాపుర రాజ్యపాలకులలో వీరు కడపటివారు. శ్రీ సూర్యారావుగారు మదరాసు 'న్యూయింగ్టన్' కళాశాలలో విద్యాభ్యాస మొనరించి మరలివచ్చినవెన్క నూజివీటి వారి యాడపడుచు శ్రీమతి ఆండాళ్ళమ్మగారిని 2-4-1906వ తేదీన వివాహమాడిరి. వంశాచారమునుబట్టి శ్రీమతి ఆండాళ్ళమ్మగారు అత్తింటికి వచ్చినతోడనే 'చిన్నమాంబాదేవి' యను నామము ధరించిరి. వివాహానంతరము మహారాజావారు దాయాదులతోడి వివాదమున విజయమంది 19-2-1907వ తేదీన పీఠపురసింహాసన మధిష్ఠించిరి. గంగాధరరామారావుగారి తనయులనుటకు దగినట్లు మహారాజావారు సాహిత్యమం దత్యంతాసక్తి కలిగినవారు. వీరు వ్రాసిన 6 వ్యాసముల వ్రాతప్రతులు లభించెను. 1. శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు- 12 పుటలు. 2. పోతన-భాగవతము:- ఆంధ్ర భాషౌన్నత్యము కవిస్థానము, సర్వజ్ఞసింగమహీపతి, తాదాత్మ్యము, పాత్రౌచిత్యము- 30 పుటలు, 3. సత్యము 10 పుటలు, 4. ఉత్తర హరివంశము 25 పుటలు, 5. నయనోల్లాసము, 6. చిలుకల ప్రదర్శనము. ఈ వ్యాసములలో నొక్కటి తణికెళ్ళ సత్యనారాయణగారి వలన మిగిలినవి కీ॥ శే॥ కోకా శివనాథశాస్త్రిగారివలనను లభించెను.

1. ఆంగ్లభాషయందు పాండిత్యముగల సూర్యారావుగారు శ్రీ టేకుమళ్ల అచ్యుతరావుగారు ఆంగ్లమున రచియించిన 'The Life of Pingali Suranarya' అను గ్రంథమునకు ఆంగ్లములో 'తొలిపలుకు' (Foreward) వ్రాసిరి. శ్రీ టేకుమళ్లవారి

గ్రంథమును పింగళి సూరన్న కవిత్వముపట్ల అత్యంతమగు నభిమానము గల మహారాజా వారి కంకితమిచ్చిరి. తెనుగున చిత్రకవిత్వము వలె ఆంగ్లమున నొక కవితలో ప్రతిపాదాద్యక్షరములను కలిపి చదివిన 'SURYA RAO BAHADUR' అని మహారాజా వారిపేరు వచ్చునట్లు అచ్యుతరావుగారు కూర్చిరి. ఈవిమర్శనగ్రంథము పింగళి సూరన జీవితవిశేషములను, రచనలను గూర్చి చేసిన సమగ్రమగు వ్యాఖ్య. 2. ఓకుమళ్ల అచ్యుతరావు రచియించిన విజయనగర సామ్రాజ్యమందలి ఆంధ్రవాఙ్మయచరిత్రము రెండవభాగమునకు మహారాజావా రాంగ్లపీఠిక వ్రాసిరి. ఈ గ్రంథము మహారాజావారి కంకితము. 3. కళాపూర్ణోదయ పీఠిక : "సూరన రచన సురుచిరమైనది. మృదుమధురపద గుంఫితము, సాధు జాతీయ దేశీయపద తేజో విరాజితము; అవర్గళధారాశుద్ధికలదై శోభిల్లుచుండును. 4. క్షేత్రయ్య పదములకు పీఠిక. 5. మహేంద్రవిజయమునకు తొలిపలుకు వ్రాయుచు "వీరి రసవత్తరములగురచనలకు తొలిపలుకు లిఖింపగలుగుభాగ్యము లభించుటచేతను కృతకృత్యుడ నైతిని" అని తమ గురుదేవులయెడల గల భక్తివినయములను మహారాజావారు ప్రకటించిరి. 6. ఆంధ్ర సాహిత్యపరిషత్తు రజతోత్సవ సంచికలో వ్రాసిన "ఆంధ్రసారస్వత ప్రశస్తి" అను వ్యాసము. 7. పిఠాపురమున 1922లో జరిగిన పరిషత్తు స్వాగతోపన్యాసము రసార్ణవ సుధాకరాదిగ్రంథముల తొలిపలుకులు మహారాజావారి పాండిత్యమునకు భాషాభిమానమునకు నుదాహరణములు. మహారాజా వారియౌదార్యమున నాడు తెలుగుదేశమందలి ప్రతిసాహితీసంస్థయు అభ్యుదయమునుసాధించెను. ఆంధ్రభాషాభివర్ధనీ సంఘము, విజ్ఞానచంద్రికామండలి, ఆంధ్రప్రచారిణీగ్రంథమాలలు విశేషధనసహాయమున పొందెను. ఆంధ్రసాహిత్యపరిషత్తును స్థాపించిన మహారాజావారు జయంతిరామయ్యగారి ప్రోత్సాహమున

శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటు నిర్మాణమునకు కారకు లగుటయే గాక ఎన్నియో ప్రాచీన గ్రంథములను లక్షల రూప్యముల వ్యయ మొనరించి తెప్పించి పరిషత్తుద్వారా ముద్రించిరి. వావిలికొలను సుబ్బారావుగారి ఆంధ్ర వాల్మీకిరామాయణము, వేదము వేంకట రాయశాస్త్రిగారి ఆంధ్రనైషధవ్యాఖ్య, ఆముక్తమాల్యద వ్యాఖ్య వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రి రాఘవపాండవీయ, కళాపూర్ణోద యాది గ్రంథప్రచురణలకు వేలకొలది ధనమిచ్చిరి. ఆదిపూడి సోమ నాథరావు, పానుగంటి లక్ష్మీనరసింహారావు, వేంకట రామకృష్ణ కవులు, చిలకమర్తి, కందుకూరి వీరేశలింగముగారి తెలుగుకవుల చరిత్ర పునర్ముద్రణమునకు వేలకొలది రూప్యముల నొసగి మహా రాజావారు తమ వితరణశీలమును కన్పరచిరి. కలకత్తానగర కళాశాల రవీంద్రుని శాంతినికేతనమునకు మహారాజావారు భూరివిరాళము లొసగిరి. మహారాజావారి భాషోద్ధరణము, వితరణములనుగూర్చి శ్రీరామ్ వీరబ్రహ్మకవి శ్రీ పీఠికాపుర సంస్థానచరిత్రములో 295 నుండి 317 వఱకు గల పుటలలో క్లుప్తముగా తెలుపబడెను. పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారి మాటలలో మహారాజావా రొన ర్చిన "మహాసాహాయ్యము నెన్నుట పసిఫిక్ మహాసముద్రములోని ద్వీపముల నెన్నుటవంటిది." జనకస్థాపితములగు విద్యాలయముల నన్నిటిని లక్షలకొలది ధనవ్యయముచేసి అభివృద్ధిలోనికి తీసికొని వచ్చిన మహారాజావారు తండ్రికినిమించిన తనయునిగా ఖ్యాతి నొందిరి. కాకినాడ 'పిఠాపురం రాజావారి కళాశాల'లో మహిళల కుచిత విద్యాదానముచేసిన రాజావారు స్త్రీజాతికి చిరస్మరణీయులు.

**శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు** :- మహారాజా సూర్యా రావుగారు సాహిత్యప్రపంచమునకు చేసిన సేవయంతయు నొకయెత్తు నిఘంటునిర్మాణమునకు, ప్రచురణకు పాటుపడుట ఒకయెత్తు. పరిష

త్సభలో 12-5-11 సం॥న జయంతి రామయ్యగారు నిఘంటునిర్మాణ మునకు చేసిన ప్రతిపాదన విని సభాధ్యక్షులైన సూర్యరాయప్రభువు నిఘంటువునకగు సమస్తవ్యయము తామే భరింతుమని యొక చీటి వ్రాసి సభనుండి వెడలిపోయిరి. తరువాత సభలో చేసిన ప్రకటనకు సభ్యులెల్ల రానందమందిరి. ఆభిజాత్యము అత్యుత్తమ గుణసంపదలు కలవారెన్నడు సభలో స్తోత్రపాఠములు వినుట కిష్టపడరు. జయంతి వారి ఆధ్వర్యములో ప్రారంభమైన నిఘంటువునకు 'శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువని నామకరణము చేయబడెను. నిఘంటు నిర్మాణ మున కృషిచేసిన పండితులు. శ్రీయుతులు జయంతి రామయ్య, కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి, తంజనగరము తేవప్పెరుమాళ్ళయ్య, పురాణపండ మల్లయ్యశాస్త్రి, పేరి పాపయ్యశాస్త్రి, శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రి, పాపయ్యశాస్త్రి, కూచి నరసింహం, చర్ల నారాయణ శాస్త్రి, పిసుపాటి చిదంబరశాస్త్రి, వెంపరాల సూర్యనారాయణ శాస్త్రి, దర్భా సర్వేశ్వరశాస్త్రి, పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రి, ప్రయాగ వేంకటరామశాస్త్రి, అమలాపురపు విశ్వేశ్వరశాస్త్రి, బులుసు వేంకటేశ్వర్లు, చిలుకూరి వీరభద్రశాస్త్రి, దువ్వూరి సూర్యనారాయణశాస్త్రి, మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి, చెఱుకుపల్లి అప్పారాయశాస్త్రి, ఇంద్రగంటి సూర్యనారాయణశాస్త్రి, చిలుకూరి విశ్వనాధశాస్త్రి, పాపయ్యశాస్త్రి, ఆకుండి వేంకట శాస్త్రి, ఓలేటి సూర్యనారాయణశాస్త్రి, పాలెపు వెంకటరత్నం, సామవేదం శ్రీరామమూర్తిశాస్త్రి, పన్నాల వెంకటాద్రిభట్టశర్మ, దివాకర్ల వేంకటావధాని ప్రభృతి ఉద్దండపండితులు నిఘంటుకార్యాలయమున నియమితులై నిర్మాణము పూర్తి చేసిరి.

ఈ రీతిగా మహారాజావారు చేసిన సాహితీసేవను ఆంధ్రవిశ్వవిద్యాలయము ఆదరించి 1-10-1938లో మహారాజావారికి గౌరవ 'డాక్టరేటు' పట్టమిచ్చి సత్కరించెను.

మహారాజావారి పండితపోషణము :- పీఠికాపుర సంస్థాన సాహిత్యచరిత్రలో మహారాజావారి కాలము స్వర్ణయుగమనదగి యున్నది. శ్రీకృష్ణదేవరాయ లాంధ్రదేశమున వివిధప్రాంతముల నుండి కవిరత్నములను తెచ్చి తన సభాంగణమున నిల్పినట్లు, ఈఅభినవ కృష్ణరాయలును దిగ్దంతులవంటి పండితశ్రేష్ఠులచేత తన సభాస్థలి నలంకరించుకొనెను. తర్కశాస్త్రమున శ్రీయుతులు శ్రీపాద లక్ష్మీనరసింహశాస్త్రి, వ్యాకరణమున మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రి, చిలుకూరి నారాయణశాస్త్రి, వేదుల సూర్యనారాయణశాస్త్రి, విశిష్టాద్వైతమున గుదిమెళ్ళ వేంకట రంగాచార్యులు, వేదమున ఆమ్నాయార్థవాచస్పతి వడలి లక్ష్మీనారాయణశాస్త్రి, వేదాంతమున దెందుకూరి నరసింహశాస్త్రి, సంగీతమున తుమురాడ సంగమేశ్వరశాస్త్రిగార్లు ఆస్థానపండితులుగా నుండిరి. మహారాజావారి పండితులసహకారమున "పీఠికాపురసంస్థాన విద్వత్పరీక్షలు" అనుపేరిట ప్రతివత్సరము విజయదశమి నవరాత్ర్యుత్సవములలో శాస్త్రపరీక్షలు నిర్వహించి ఉత్తీర్ణులైనవారిని కానుకలతో సత్కరించెడివారు. ప్రబంధరచనలో పోటీలుకూడ నుండెడివి. నేడాంధ్రదేశమున సుప్రసిద్ధపండితులెందరో నాటి విద్వత్పరీక్షలలో బహూకృతులైనవారు వారిశిష్యులునై యున్నారు.

మహారాజావారి కవిపోషణము :- శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు, వేంకటరామకృష్ణకవులు వీరియాస్థానకవులుగా నుండెడివారు. వీరుగాక ప్రభుపోషణమున చిలకమర్తి, కందుకూరి, జేకుమళ్ళ అచ్యుతరావు, దేవగుప్తాపు భరద్వాజము, పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి, వారణాశి సుబ్రహ్మణ్యశాస్త్రి, శొంఠి భద్రాద్రి రామశాస్త్రి, దాసరి లక్ష్మణకవి, వేదుల రామచంద్రకీర్తి, వేంకట పార్వతీశకవులు, శ్రీరామ్ వీరబ్రహ్మకవి, మధునాపంతులవారు,

కూచి నరసింహం, పురాణపండ, నడకుదుటి వీరరాజకవి, మున్నగు కవులెందరో మహారాజావారివలన వార్షికాది సన్మానము లందిన వారే. సూర్యారావుగారి సాహచర్యమున కవిత్వమం దభిరుచి అభినివేశముగల ఇల్లాలు చిన్నమాంబాదేవి.

## మహారాణి చిన్నమాంబాదేవి

చిన్నమాంబాదేవి నూజీవీటి ప్రభువులలో నొకరగు రంగయ్యప్పారావుగారికి 1895లో జన్మించి 1916లో మహారాజావారి ధర్మపత్నియయ్యెను. ఈమె బాల్యమందే సంస్కృతాంధ్రములు నభ్యసించెను. వివాహమైన తరువాత మహారాజావారామెకు ఆంగ్ల ఉపాధ్యాయినిచేత ఆంగ్లభాష నభ్యసింపజేసిరి. రాజకుటుంబము విదేశ పర్యటనచేసినప్పుడీ మహారాజ్ఞి ఆంగ్లభాషాపరిజ్ఞానమునకు వాగ్ధోరణికి నచటి విద్యావంతు లచ్చెరువందిరట. ఈమె ఆంగ్లమున పెక్కు పర్యాయములు స్త్రీసమాజములలో ధారాళముగా నుపన్యసించెడివారు. చిన్నమాంబాదేవి స్త్రీవిద్యను ప్రోత్సహించుచు ఘోషాస్కూలు స్థాపించెను. ఘోషాస్కూలులో విద్య నేర్చుకొనుటకు పిఠాపురములో అన్నితరగతుల వారు ఆబాలవృద్ధము రాణీగారే ర్పాటుచేయించిన ఘోషాబండిలో వెడలెడివారు. పిఠాపురములోని అమెరికన్ వైద్యశాలభవనమునకు రాజదంపతులు స్థలమును కొన్ని వేలరూప్యముల నొసగిరి. కృతజ్ఞతాసూచకముగా వారు ఒకవిభాగమునకు 'చిన్నమాంబవార్డు' అని పేరిడిరి. కాకినాడలో 'లేడిస్ క్లబ్బు'కు రాణిగారు స్థలమిచ్చినందులకు ఆమె సంస్మరణార్థ మచట మహారాణివారి వర్ణచిత్రమును క్లబ్బువారు నెలకొల్పిరి. ఆంధ్ర మహిళాసభ మద్రాసువారికి కూడా రాణీగారు భవననిర్మాణమునకు ధనమొసగిరి.

చిన్నమాంబాదేవికి సంగీతముపట్ల మంచి అభిరుచి వీణావాదనమున అభినివేశముకలదు. ఆమె తనపుత్రికలందరకు వీణనేర్పించెను.

బాల్యమునుండి ఆమె విష్ణుభక్తికలవారగుటచేత మహారాజుతో నెన్ని దేశములు పర్యటించినను దేవతారాధనము విడువలేదు. 12-3-'33 తేదీన దేవునిచెంత దీపారాధన చేయుచు చీరకొంగు అంటుకొనగా ఈ మహారాజ్ఞి మరణించెను. ఈమె స్వార్థరాహిత్యము కారుణ్య స్వభావములనుగూర్చి సాక్షి ఆరవ సంపుటమున పేరు తెలుపకయే వర్ణించుచు పానుగంటివారు ఆకారుణ్యమూర్తిని స్మరించినయుత్సాహముతో "జయచిన్నమతల్లికి జయజయ ఆండాళ్మహాదేవికి" అని వ్యాసమును ముగించిరి. తమగ్రంథాలయమునగల సంస్కృత కావ్య నాటక చంపువులెన్నో ఆమె చదివి వానిపై పేరు వ్రాసికొనిరని వానిని తాము చూచితిమని నిఘంటుకార్యాలయపండితులు తెల్పిరి. రాణీగారు తమబిడ్డలతో గలసి సంస్కృతపాఠములను చదివెడివారు. యువరాజు గంగాధరరామారావుగారిఉపాధ్యాయునివలన తెలిసికొని ఛందోవిశేషములను వినియు, కుమారు నడిగి తెలిసికొనియు చిన్నమాంబాదేవి తెలుఁగులో సరళమైన కవిత్వము చెప్పెడివారు. శబ్దమంజరిలోనున్న సంగ్రిహ సంస్కృత రామాయణమును మహారాణీగారు తెలుఁగులోనికి లలితమైనశైలితో ననువదించిరని ఆమె మరణానంతరము శ్రీ ఓలేటి రామశాస్త్రిగారు సభలో వెల్లడించిరి. దీనినే 'రామాయణసంగ్రహము'ను పేరిట చిన్నమాంబాదేవి వ్రాసెనని 'ఆంధ్రరచయిత్రుల'ను గ్రంథము తెల్పుచున్నది. వీరి ఔదార్యమున ఆంధ్రగ్రంథములెన్నియో ముద్రణభాగ్యము నందియుండ, మన దురదృష్టమున నీ'రామాయణసంగ్రహము' అముద్రితగ్రాత ప్రతియైన లభించలేదు. ఆస్థానమున విశిష్టాద్వైతపండితులు గుదిమెళ్ళ వేంకటరంగాచార్యులు ఈశావాస్యము, ఐతరేయము, ఆనందవల్లి మున్నగు ఉపనిషత్తులను బోధించగా రాణీగారు విని తరువాత మననముచేసికొని పుస్తకముపై వ్రాసి ఆచార్యులవారికివినిపించి

సవరణలున్న చేసికొనెడివారు. ఆవిధముగా వ్రాసికొనిన ఉపనిషత్సారమునే రాణీగారిమరణానంతరము పెద్దకుమార్తె రాణీమంజులాదేవి "ఉపనిషత్కాలక్షేప సారములు" అను పేర ముద్రింపించిరి. చిన్నమాంబాదేవి అంతఃపురమున జూలూరు తులశమ్మ, ఉప్పలూరి అగ్గమ్మ, వింజమూరి వెంకటరత్నమ్మ, కోటికలపూడి సీతమ్మ ప్రభృతి కవయిత్రులతో సభ జరిపెడివారు. మహిళల సమస్యలపై రచయిత్రులచేత వ్యాసములు వ్రాయించి, ఉపన్యాసములిప్పించి తానుపన్యసించియు మహారాణిగారు అనేకవిధముల స్త్రీజాత్యుద్ధరణకు సహాయపడిరి. ఆమెద్వితీయపుత్రుడు సూర్యారావురాజకుమారుడు తాను పరిశోధనచేసి నూతనముగా కనుగొనిన తెలుఁగుటైపురైటరునకు 'చిన్నమాంబాటైపురైటరు'అని జనని పేరుంచిరి. తెలుఁగులో మొదటి టైపురైటరు ఇదియే. ఇటీవల నీటైపురైటరు ఆధునికీకరణముకావించబడెను. చిన్నమాంబాదేవి జ్యేష్ఠపుత్రుడు, యువరాజునగు **R.V.M.G.** రామారావుగారు 'స్వార్థత్యాగము'ను నాటకమును జనయిత్రి కంకితముచేసి కృతార్థులైరి. రాజబంధువులు చెలికాని చినజగన్నాథరాయణింగారు 'మహాలక్ష్మీమానసపూజ' అను కావ్యమాయుత్తమరాజ్ఞీమతల్లి కంకితమిచ్చిరి. ఈమె పేదసాదలను దయతో చూచెననుటకొకసంఘటన ముదహరింపబడును. మద్రాసులో 'ధనోమ్కో' మందిరమున నాసీనులై యుండగా నొకనాడు యాచనచేయు పాములవనితను పిలిపించి, మహారాణీవారు తమిళములో నామెకష్టసుఖములడిగి, కొంతసొమ్ము, చీరలునిచ్చి, ప్రసవమైనవెనుక రమ్మని చెప్పిరట. కొంతకాలమునకా స్త్రీ బిడ్డనెత్తుకొని రాగా రాణీగారామె నాదరించి పరిచారికలచేత బిడ్డకు స్నానము చేయించి తాను స్వయముగా కుట్టియుంచిన దుస్తులను వేయించి యెత్తుకొని లాలించిరట! రాణీగారిదయార్ద్రహృదయము భేదరాహిత్య

శీలము నీసంఘటన వ్యక్తముచేయుచున్నది. ఇట్టివెన్నియో గాథలు గలవని, ఆమెచేసిన సప్తదానములకు లెక్కలేదని నిఘంటుపండితులు వెంపరాల సూర్యనారాయణశాస్త్రిలుగారు వ్రాసిచ్చిరి. ఇప్పుడు రాణీవారి "ఉపనిషత్కాలక్షేపముల"ను గూర్చి తెలిసికొందము.

**ఉపనిషత్కాలక్షేపసారములు :** ఈగ్రంథము మద్రాసు 'కళా ప్రింటర్సు'న ముద్రింపబడి సిడ్లీరాణియగు మంజులాదేవిగారిచేత ప్రకటింపబడెను. గ్రంథముద్రణకాల మిందులేదు. ఇది 300 పుటల గ్రంథము. ఉపోద్ఘాతముతరువాత ఈశావాస్య, ముండక, మాండూక్య, ఐతరేయ, తైత్తిరీయ,ఆనందవల్లి, నారాయణీయ,రహస్య, వజ్రసూచిక, ఛాందోగ్య, బృహదారణ్యకోపనిషత్తులు, అగ్ని, ఇంద్ర, వినాయక, గరుడగాయత్రి, దుర్గా, విష్ణుగాయత్రీమంత్రముల సారము, స్నానవిధియగు మృత్తికనుగూర్చిన మంత్రిసారము, జల దేవతాప్రార్థన, జలాంతరవర్తి దేవతామంత్రసారము, పరమాత్మకు గల విభూతి ద్వాయ మంత్రపుష్పము, "ఋతగ్ం సత్యం" అను మంత్రసారము, అరుణ, రుద్ర, పృథ్వీ, మధ్యాహ్న, సంధ్యామంత్ర సారములు, భోజనసమయ మంత్రసారము, త్రిసుపర్ణమంత్రసారము, విశిష్టాద్వైత శిరస్థానీయమగు ప్రపత్తియు నీగ్రంథమున గలవు. ఇందుపనిషత్తులలోగాని, ఇతరమంత్రానువాకములలోగాని మూల క్రమము లేదు. కనుక మహారాణీగారీ గ్రంథమును తమ చిత్తశుద్ధి కొఱకు సోపానమార్గమున వ్రాసికొనినట్లు తోచుచున్నది.

ఉపోద్ఘాతమున తొలుత వేదవిభాగము వివరింపబడెను. అందు యజుర్వేదము కృష్ణశుక్ల భేదములచే రెండైనట్లు, శుక్లయజుర్వేదము శాపవశమున ప్రసిద్ధి పొందలేదని ఒక ఇతిహాసము సూచింపబడెను. కర్మకాండ కర్మవిధులను, బ్రహ్మకాండ బ్రహ్మోపాసనా

విధులను బోధించునని తెలుపబడెను. ఆరణ్యకములనగా నరణ్యమున చదువదగినవని, ఆయా మంత్రముల కాయా నియతమైన కర్మలు, మంత్రోపాసనా రీతులు బ్రాహ్మణములు తెల్పునని, ఈశాఖలన్నియు గలిసి వేదములనబడునని యిందుకలదు. పరిశీలింపగా మహారాణి గారికి వేదవిభాగము హృద్గతమై యుండుననిపించుచున్నది. వేదాంత ములని చెప్పబడు బ్రహ్మకాండాంతర్గతమగు ఉపనిషత్తులీ శాఖల నన్నిటిని వివరించునని చెప్పి రాణీగారు ముందున కుపక్రమించిరి.
ఈశావాస్యోపనిషత్తు: ఇది గురుశిష్యసంవాదరూపమున గలదు. "జ్ఞానమభిలషించు జీవుడే శిష్యుడు. అతడు రజస్తమోగుణ నివృత్తికి గురువును సేవించును" అని విద్యప్రయోజనము ముందు తెల్పి తరు వాత బ్రహ్మోపాసనకు భక్తికర్మప్రపత్తియోగములు సాధనములని ఈమె తెల్పెను. తదుపరి జీవునికిగల లోపములు, ప్రపంచము సుఖ దుఃఖములతోనుండుట మొదలగు విషయములు, జీవుడు, అహింస, అస్తేయము, సత్యము, సహనము, నిష్కామకర్మ అనువాని స్వరూ పము రేఖామాత్రముగ స్పృశింపబడెను. పరమాత్మ స్వరూపమవా జ్మనస గోచరమైనను శాస్త్రమువలన గ్రహింపవచ్చుననుచు నందుల కుపాయములు కవయిత్రి తెలిపెను. సూర్యమండల మధ్యవర్తి నారాయణు నుపాసించుట, 'ఓమ్' విభజించుట (అ-ఉ-మ్) ఆ ప్రణ వాక్షరముల నుపాసించువిధము నిందుగలదు.

ముండకోపనిషత్తు :- "యజ్ఞాదికామ్యకర్మలు, తటాకాది నిర్మాణములు మోక్షమును గలిగించవు. తత్త్వజ్ఞానమే మోక్షమార్గ దర్శిని. పుణ్యకర్మాచరణమువలన స్వర్గసుఖము లభించినను పుణ్య శేషముండగనే మిశ్రలోకమో మర్త్యలోకమో పొందుదుర"ని దీని సారము. తత్త్వవేత్తలు వేదశ్రవణమననములవలన శాంతచిత్తులై, భిక్షావృత్తిని తపశ్శబ్దవాచ్యుడగు పరబ్రహ్మ నుపాసించి, పాప

దూరులై అర్చనాదిమార్గమునుండి సూర్యకిరణములద్వారా బ్రహ్మలోకము పొందుదురు. కావున బ్రహ్మప్రాప్తికోరువారు శాస్త్రమున చెప్పినవిధమున సమిధలు కానుకగా గురువును జేరి గురూపదేశమున బ్రహ్మవిద్యను గ్రహించి జ్ఞాని కావలయునని ప్రథమఖండమున సూచింపబడెను. ద్వితీయమున, ప్రథమఖండములో నగ్నినుండి నిప్పుకణములు పుట్టినట్లు పరబ్రహ్మమునుండి చరాచరములు సృజింపబడి, ఆ పరమాత్మయందే లీనమగుచుండెనని, ప్రకృతికంటె శ్రేష్ఠుడగు జీవునికంటె పరమాత్మ ఉత్కృష్టుడని, అట్టి అక్షరబ్రహ్మమునుండియే ఆకాశాదిభూతములు, ప్రాణము, సర్వేంద్రియములు, విశ్వమును ధరించుపృథ్వియు పుట్టెనని అక్షర విద్యాస్వరూపము విశదీకరింపబడెను. ద్వితీయఖండమున అక్షరబ్రహ్మమునుచేరు నుపాయము చెప్పబడెను. "అక్షరబ్రహ్మమనగా నుపనిషదర్థమగు ప్రణవము. ఆ ప్రణవము ధనస్సుగా జీవరూపమగు శరమును మంత్రయుక్తమగు నస్త్రముతో సంధించి విడువవలెను. ఇచట ప్రణవమే మనస్సు, జీవాత్మశరము, బ్రహ్మమే లక్ష్యము. ఏవిధమైన ప్రమాదము లేని పురుషునిచేత నాబాణము సంధింపబడగా నది లక్ష్యమును పొంది అందు లీనమైనట్లు ముక్తాత్మ పరమాత్మనుచేరి, తచ్ఛరీరమై శేషభూతుడగును." అని విశిష్టాద్వైతమున చెప్పబడెను. పరమాత్మను పొందుటకు హృదయపుండరీకమందలి పరమాత్మను ధ్యానించుటకై రాగద్వేషాది సకలకర్మలను విడువగలరని, అట్టివారు పరబ్రహ్మము నుపాసింతురని ఇందు కలదు. పరబ్రహ్మమందే సూర్యచంద్రమండలములు, నక్షత్రములు, అగ్ని, విద్యుల్లత మొదలగునవి ప్రకాశించునని తెలుపబడెను. వానికి తేజమిచ్చువాడు పరమాత్మ. ఆ పరమాత్మలేని వస్తువులేదు. కనుక సమస్తము పరమాత్మమయము. సంసారవృక్షమున సఖ్యతగల్గియుండు జీవాత్మ పరమాత్మ యను

రెండు పక్షులు గలవు. వానిలో జీవుడను పక్షి కర్మసంబంధమైన సుఖము లనుభవించుచుండగా, రెండవపక్షియగు నీశ్వరుడు తటస్థుడై నియంతయై కర్మసంబంధములేక, కారాగృహాధికారియైన వాడు ఖైదీయైనట్లుండును. జీవుడు సంసారవృక్షమున లీనమై తన ప్రకృతిని మరచి, అజ్ఞానావరణముచేత ప్రకృతిని జయింపలేక, మోహాంధుడై, అహంభావముచేత సుఖదుఃఖముల ననుభవించును. ఆ జీవుడు వర్ణాశ్రమధర్మముల నాచరించుచు, భగవదుపాసనచేత భగవంతునికి ప్రీతిపాత్రుడై, ఆ మహిమ నెఱిగి దుఃఖములను విడనాడును. సంసారపంకమగ్నుడగు జీవుని పరమాత్మ ఉద్ధరించును. ఆ బ్రహ్మజ్ఞానికి పాపము లంటవు. లక్ష్మీపతిత్వము, సృష్టిసామర్థ్యముతప్ప ముక్తుడైన జీవుడు సర్వసామర్థ్యములు కలిగియుండును. బ్రహ్మచర్యము, శాస్త్రజ్ఞానము, తపస్సు, బ్రహ్మోపాసనలవలన పరబ్రహ్మను పొందవచ్చును. భక్తుడు పరిశుద్ధాంతరంగుడై భగవంతు నుపాసించవలెనని, ఏయేలోకములం దేయేకోరికలనుభవింప గోరెదరో ఆయాలోకములను స్వాధీనమున నుంచుకొని వాని ననుభవింపవచ్చునని తృతీయముండక ప్రథమఖండమున గలదు. "బ్రహ్మవేత్తకు మరుజన్మము లేదు. రాగాదిరూపమగు హృదయగ్రంథులు విడిపోయి అతడుత్కృష్టమగు మోక్షమును పొందును," అని ఫలితార్థము. ఈ ముండకోపనిషత్తు మోక్షముకోరి శ్రద్ధగా నగ్నినారాధించువారికే బోధింపబడును. అగ్నిని శిరస్సున నిడికొనిచేయు వ్రతము శిరోవ్రతమని ఈ వ్రతము చేసినవారికే దీని నుపదేశింపవలెనని బ్రహ్మమునుగూర్చిన ఈవిద్యను అంగిరసమహర్షి శౌనకునకు చెప్పెనట. **మాండూక్యోపనిషత్తున** ప్రణవోపాసనావైభవము చెప్పబడెను.

"ఓంకారమునందుగల యంగములగు అహంకారాదులు ప్రద్యుమ్నాది వ్యూహములుగా భావించి యా ప్రద్యుమ్న సంకర్షణవాసు

దేవయనువాని నామాంతరములే ఆ యంగములని గ్రహించి యుపాసన" చేయవలెనట. ప్రణవము ప్రపంచమంతట నెట్లువ్యాపించెనో, అది ప్రపంచమున కెట్లాధారభూతమయ్యెనో వివరింపబడెను. ఒక దీపమునుండి పలుదీపము లుద్భవించినట్లు పరమాత్ము నంశమునుండి యనిరుద్ధాదులగు నాలుగువ్యూహము లుద్భవించెను. రామకృష్ణాద్యవతారములుకూడ నాతనినుండియే కలిగెనని చెప్పి, సర్వమునకు ప్రణవమే కారణమైనట్లు తురీయుడగు వాసుదేవుని ప్రణవనాదస్వరూపునిగ నుపాసించు వా రతనిని పొందుదురని ఫలితార్థము నిర్ణయింపబడెను. ఈవిధముగా నుపనిషత్సారమును మహారాణీగారు విశిష్టాద్వైతభాష్యానుసారముగా వ్రాసికొనుచు వచ్చిరి. వీనిలో మేటివనదగు ఛాందోగ్యబృహదారణ్యకోపనిషత్తులనుగూర్చి దాదాపు 200 పుటలలో గలదు. ఛాందోగ్యోపనిషత్తున ఆరవ యధ్యాయములో "ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞానం"అను వాక్యమున కొక ఇతిహాసము చెప్పబడెను. ఉద్దాలకునిపుత్రుడు శ్వేతకేతుడు జనకు నాజ్ఞచేత సద్గురువు నాశ్రయించి బ్రహ్మచర్యమున పండ్రెండేడులు వేదముల నభ్యసించి గర్వముతో తండ్రియొద్దకురాగా నత డిట్లు ప్రశ్నించెను. "నీవు జగత్తును తృణీకరించునట్లు గర్వముతో వచ్చితివి. పరమాత్ముని తెలిసికొనినవారట్లుండ వచ్చునుగాని దేనిని తెలిసికొనక సకలము తెలిసినట్లగునో అట్టి జగదుపాసనకారణమై అంతరాత్మయైయున్న యాపరమాత్మను నీవు తెలిసికొంటివా?" అని యడుగ "ఒక్క వస్తుజ్ఞానమున నన్నివస్తువు లెట్లు తెలియును? ఏవస్తువును తెలిసిన నదియే తెలియునుగాని యితరము తెలియబడదుకదా! కావున ఆవివరము నీవు తెల్పుమ"ని తనయుడడిగెను. అపు డుద్దాలకుడు ఏకవిజ్ఞానమున సర్వవిజ్ఞానముకలుగువిధముచెప్పెదనని మృత్పిండము నినుపముక్కల నుదాహరణగా తీసికొనెను. మట్టితో చేయబడినకుండ, ముంత మొద

లైనవి రూపమున వేరైనను, నామము వేరైనను మట్టియొక్కటే యనుట సత్యముకదా! మట్టిగుణములు దానివికృతులగు ఘటాదుల కున్నట్లు, పరమాత్మవలనపుట్టినజగత్తు నామరూపములచేత భిన్నముగా కన్పట్టినను, ఆత్మగుణయుక్తమేయని ఉద్ధాలకుడు స్పష్టీకరించెను. లవణము నీటగలిపి చూపి, నీటియందు లవణరూపము లేకున్నను తీయనినీరు దానికలయికచేత ఉప్పన యగుటవలన లవణము నీటియం దంతర్వ్యాపకంగా నుండుటను దృష్టాంతముగాతీసికొని అతడు జగత్తునం దాత్మలీనమై విడదీయరానిదై పరమాణువునం దంతర్లీనమై పరమాత్మ యున్నట్లు నిరూపించెను. ఇట్లు తత్వము లన్నిటి గూర్చి చెప్పి యుద్ధాలకుడు సుతుని గర్వమణచగా శ్వేతకేతుడు గురుశుశ్రూషచేత జ్ఞాని యయ్యెను.

బృహదారణ్యకమున యాజ్ఞవల్క్యమహర్షి వివిధ సందర్భములలో శాకల్యుడు, గార్గి మున్నగువారితో చేసిన వాదోపవాదములలో బ్రహ్మతత్త్వము బహుముఖములని నిరూపించెను. ఇట్టి యైతిహ్యములను శాస్త్రజ్ఞులు అర్థవాదము లందురు. అనగా నొకసత్యమునో ధర్మమునో నిర్ణయింప నుద్దేశింపబడిన కథలేగాని యన్యములు కావని తాత్పర్యము. బ్రహ్మమును తెలిసికొనినవాడు తక్కినవారి కంటె తాను గొప్పవాడనని గర్వపడడని చెప్పుటకొక యైతిహ్యము వ్రాయబడెను. ఇతిహాసము : జనకమహారాజు బహుధనములు దక్షిణముగా నిచ్చుచు చేయు యజ్ఞమునకు కురుపాంచాలదేశములనుండి బ్రాహ్మణు లనేకులు వచ్చిరి. వీరిలో బ్రహ్మవిద్య నుపదేశింపగలవా రెవ్వరో తెలిసికొన నభిలషించి జనకుడు, వేయిగోవులను బంగారముతో కొమ్ముల నలంకరింపజేసి తెచ్చి "మహానుభావులార! మీలో నెవ్వరు బ్రహ్మిష్ఠులో వారీగోవులను స్వీకరింపుడ"ని పలికెను. వారిలో నొక్కడును తాను బ్రహ్మిష్ఠుడనని చెప్ప సాహసించ

లేదు. యాజ్ఞవల్క్యమహర్షి తనశిష్యుడైన సామశ్రవునితో గోవు
లను తన యాశ్రమమునకు తోలుకొనిపొమ్మనిచెప్పగా నత డట్లు
చేయుచుండెను. మిగిలిన ఋషులు యాజ్ఞవల్క్యునిపై కోపించిరి.
వారిలో జనకుని హోతయగు అశ్వలుడు "యాజ్ఞవల్క్యా! మా
యందఱిలో నీవు బ్రహ్మిష్ఠుడవా?" అని ప్రశ్నింప నాతడు "న
వయం బ్రహ్మిష్ఠాః కింతు గోకామాః" అని సమాధాన మిచ్చెను.
బ్రహ్మిష్ఠుడు తాను బ్రహ్మిష్ఠినని తెలుపడు; గర్వింపడు. యాజ్ఞ
వల్క్యుని పలుకులలోని ఈధ్వని గ్రహింపని అశ్వలుడు "బ్రహ్మ
విద్యకు సాధనమగు సత్కర్మలుచేయు యజమానుడే కర్మానుష్ఠాన
ముచేత సంసారముక్తుడై చిత్తశుద్ధిగలిగి బ్రహ్మజ్ఞానము పొందును?"
అనుచు మరికొన్నిప్రశ్న లడిగి తగిన ప్రత్యుత్తరములను పొంది
ప్రశ్నింపదగినవి లేక మౌనము వహించెను. పిమ్మట ఆర్తభాగుడు,
భుజ్యుడు, ఉపస్తుడు, కహోళకుడు మున్నగువారు యాజ్ఞవల్క్యుని
ప్రశ్నించి సదుత్తరములుపొంది యోడిపోగా, వచక్రుని కుమార్తె
గార్గి యిట్లు ప్రశ్నించెను. "ఋషీంద్రా! ఈ పృథివ్యాది పంచ
భూతములు తమకు కారణమైన యుదకమందు హోతప్రోతముగా
నున్నవికదా! ఈయుదకము దేనియందు హోతప్రోతముగా నున్నది?"
అనగా "వాయువునందు గలదని యాజ్ఞవల్క్యుడు సమాధాన
మిచ్చెను. ప్రశ్న : వాయువు దేనియందున్నది? జవాబు : అంతరిక్ష
మున. ప్రశ్న : అంతరిక్ష మెచ్చట గలదు? జ : గంధర్వలోక
మున. ఈవిధముగా గార్గి బ్రహ్మలోకపర్యంతము ప్రశ్నించగా
యాజ్ఞవల్క్యుడు ప్రశ్నింపదగని విషయములగూర్చి ప్రశ్నింపవద్దని
పలికెను. "వాదనసమయములందు ఆక్షేపణపూర్వకముగా పరదే
వతా విషయ మడుగరాదు. నీవు శుశ్రూషచేతనే పరదేవతను
గూర్చి తెలిసికొనవలెనను నియమము విడిచి ప్రశ్నించుచున్నావు.

నీ శిరస్సు పడిపోవును జాగ్రత్త!" అని యాజ్ఞవల్క్యుడు శపించెను. గార్గి మౌనము వహించెను. ఉద్దాలకు డొకప్రశ్న యడిగి యోడినవెనుక గార్గి తిరిగి "నేను రెండుప్రశ్నలడిగెదను. ఈ ప్రశ్నలకుత్తరమిచ్చినచో నీతని జయించువారులేరు. ఉత్తరమీయనిచో నీతని శిరస్సు క్రిందపడును. బ్రహ్మలోకమునుగూర్చి నేను ప్రశ్నింప నన్ను అజ్ఞురాలినివలె అవమానించి ఆ ప్రశ్నయడుగరాదని శపించెనుగదా?" అని పలికెను. బ్రాహ్మణుల యనుమతినొంది గార్గి యిట్లు ప్రశ్నించెను, "ద్యులోకమునకు పైభాగమునను, పృథ్వికి క్రిందిభాగమునను, ద్యులోక భూలోకమధ్యభాగమున నేవస్తువున్నదో, ఏవస్తువు పృథివ్యాదిలోకముల లోపలనున్నదో, కాలత్రయము నందంతయు నేమేమికలదో, అవి యన్నియు నెవరియందు హోతప్రోతముగా నున్నవో చెప్పుము"ని యాజ్ఞవల్క్య నడిగెను. యాజ్ఞవల్క్యు డిదియంతయు మూలప్రకృతియందున్నదని, ప్రకృతి యన సూక్ష్మావస్థగానున్న అవ్యాకృతాకాశమని, ఆ యాకాశమునకు నామరూపములు లేవని, అది ప్రకృతికి కారణమగు తత్త్వమని బదులిచ్చెను. అంతట గార్గి "మహానుభావా! నా ప్రశ్నకు సదుత్తరమిచ్చితివి. నమస్కారము. మరిరెండుప్రశ్నలు మాత్రము గలవు" అని యిట్లడిగెను. "సర్వము హోతప్రోతముగానున్న యవ్యాకృతాకాశము దేనియందున్నది" అని ప్రశ్న. "బ్రహ్మజ్ఞానులైన బ్రాహ్మణులు ప్రసిద్ధవేదాంతముల ననుసరించి చెప్పెడి బ్రహ్మమందే యున్నది. ఆ బ్రహ్మము స్థూలము సూక్ష్మముకాక, హ్రస్వము దీర్ఘముకాక, రంగు చమురు నీడలేనిది, అంధకారములేనిది వాయ్వాధీనము కానిది, భూతములతోగాని ఇంద్రియములతోగాని సంపర్కము లేనిది, ఆది మధ్యాంతరహితము, దేనిని భుజింపనిది, తననెవ్వరు భుజింపనిదియగు అక్షరబ్రహ్మమందే అవ్యాకృతాకాశము కలదు,"

అని యాజ్ఞవల్క్యుని సమాధానము. "అక్షరబ్రహ్మము ఆజ్ఞచేతనే అణువులు మొదలైన మహాపదార్థములు నడచుచున్నవి. కనుక యజ్ఞాదులు భగవన్నియామకములు. ఇట్టి యక్షరబ్రహ్మము నెఱుగనివాడు నిరర్థకుడు, మరణించియు శోచనీయుడు. అక్షరబ్రహ్మమును తెలుసుకొనినవారు బ్రహ్మమును చేరుకొందురు. ఇతరులు తనను చూడలేరు, వినలేరులేరు, తలంచలేరు. కాని తాను సర్వమును చూచును, వినును, తలంచును. కనుక ఆపరబ్రహ్మముతో సమానులు లేరు. ఇట్టిమహిమగల పరమాత్మయందే అవ్యాకృతాకాశములు ఓతప్రోతముగ నున్నది." అని యాజ్ఞవల్క్యుడు స్పష్టపరచెను. అంతట గార్గి తృప్తి చెంది "ఓ బ్రాహ్మణులారా! ఈయాజ్ఞవల్క్యుని కొక్క నమస్కారముచేసి తొలగుట శ్రేయస్కరము. మీలో నొక్కరైననీతని బ్రహ్మవాదములో గెలుచువారు లేర"ని పల్కెను. బ్రహ్మజ్ఞానులైనవారు నిండుకుండల వలె ఎట్లు తొణకకుందురో అంటే మహారాణీవారును విశేషజ్ఞానము కలిగియు నిగర్వముగా స్వార్థ రహితముగా నుండెడివారు. ఆమె పుత్రిక శ్రీమతి మంజులాదేవి ఈ యుపనిషత్కాలక్షేపసారమునైన ముద్రించనిచో నిటువంటి మహత్తరగ్రంథము పఠించునవకాశము మనము కోల్పోయెడివారము ఇందలి ప్రతి అధ్యాయము నిట్లే సారవంతమై జ్ఞానప్రదాయకమై యున్నది. ఇంతటి వైదికజ్ఞానవైరాగ్యసంపన్నయగు మహనీయురాలిని చేపట్టిన మహారాజావారు, ఆమెను మాతృమూర్తిగ పొందగలిగిన బిడ్డలు, మహారాజ్ఞిగా సేవించుకొనగల్గిన ప్రజలు ధన్యులు.

**మహాలక్ష్మీ మానసపూజ:** శ్రీ చెలికాని చినజగన్నాథరాయణింగారు మహాలక్ష్మీమానసపూజ యనుగ్రంథము వ్రాసి చిన్నమదేవి కంకితమిచ్చిరి. వీరువ్రాసిన "రామమానసపూజ"నుచదివి మహారాణీగారు లక్ష్మీమానసపూజ నిట్లే వ్రాసిన బాగుగ నుండునని సెలవీయగా

తాసీగ్రంథమును వ్రాసి ఆమెమరణానంతరము ప్రతినివ్వగలిగెనని కవి పీఠికలో తెల్పెను. ప్రతి దేవతకు షోడశోపచారములు చేసినట్లే లక్ష్మీ దేవికిని ధ్యానఆవాహనాదుల నీగ్రంథమున కవి చెప్పెను. ఇచ్చట విశేషమేమనగా, వేదాధికారముగలవారు శ్రీసూక్తము ప్రకారము గాను, ఆయధికారము లేనివారు పురాణోక్తముగాను పూజచేసికొన వచ్చును. ఆ రెండింటికితోడు పురాణోక్తశ్లోకములకు తెలుగుపద్యములు కూడా ఓలేటి వేంకటరామశాస్త్రిగారిచేత రచింపజేసి జగన్నాథరాయణింగారిందు చేర్చిరి. మచ్చున కిందుచెప్పిన ఉపచారవిధానము వివరింతును. "గంధద్వారాందురాధర్షాం" అను వేదమంత్రముచేతను, పురాణోక్తముగా "శ్రీఖండ చందనం దివ్యం గంధాఢ్యం, సుమనోహారం, విలేపనం, మహాలక్ష్మీప్రీత్యర్థం ప్రతిగృహ్యతామ్" అను శ్లోకమునకు శాస్త్రిగారు "పద్మకేళీనివాసంబు బయలువెడలునట్టి సురభిళమూర్తి ఓయంబ! నీకు చందనములందు టాచారచర్యగాని గంధమేటికి మాయమ్మ కమల! లక్ష్మి!" అని పద్యరూపమిచ్చిరి. ఈగ్రంథమువలన దేవికి ఏయాశయముతో పూజ చేయుచున్నామో ఆ దేవి మహిమ ఎట్టిదో స్పష్టముగా తెలిసికొని పూజచేసినచో భక్తులు లక్ష్మీదేవిని ఏకాగ్రచిత్తమున పూజచేయగలరనియు, అట్టి పూజ సార్థకమగుననియు తెలియుచున్నది. "జ్ఞాత్వాకర్మాణికుర్వీత" అను శాస్త్రవచనముచేత కర్మస్వరూపము తెలిసికొనుట విధియనిచెప్పి గ్రంథకర్త ఆచరణలోనికి తెచ్చిరి. ఈవిశేషమంతకుముందు ఏ పూజా విధానమునను లేదు. ఇట్టిసత్కావ్యమునురచించిన గ్రంథకర్త, స్వీకృతి భాగ్యమందిన మహారాణివారు కృతార్థులు. గీతాసారము : మహారాణీవారి అభ్యంతర మందిరగోష్ఠులలో పాల్గొనెడి శ్రీమతి కొటికలపూడి సీతమ్మగారు బహుగ్రంథకర్త్రి. వీరు "గీతాసారము" ను మహారాణీగారికి, "వీరేశలింగచరిత్ర" మహారాజావారికి అంకితము

చ్చిరి. మహారాణీగారి ప్రోత్సాహమున సీతమ్మగారు గీతాసారము వ్రాసిరి. గీతాసారము క్రీ॥ శ॥ 1933లో పిఠాపురము విద్వజ్జనమనో రంజనీ ముద్రాక్షరశాలలో ముద్రింపడి చిన్నమాంబాదేవి స్థాపించిన "స్త్రీసమాజము" వారిచేత ప్రచురింపబడెను. ఈ గ్రంథమున మొత్తము 200 గీతపద్యములలో భగవద్గీతాసారము సరళమగు శైలిలో రచియింపబడెను. వీరేశలింగచరిత్ర : మహారాజావారి ధనసహాయమున కాకినాడ సావిత్రీముద్రాక్షరశాలలో ముద్రితమై ప్రచురింపబడెను. సీతమ్మగారు కందుకూరివారి శిష్యురాలు. పంతులుగారిపట్లగల భక్తి గౌరవములతో నీమె వీరేశలింగంగారి జీవితచరిత్రను పద్యకావ్యముగా సృజించెను. ఇందధికముగా వృత్తములు, అందందు సీసపద్యములు గీతములు కలవు. చిలకమర్తివారి మాటలలో సీతమ్మగారిది భారతశైలి. వీరియితరగ్రంథములు: లేడీ జేన్‌గ్రె, అహల్యాబాయి, సాధురక్షకశతకములు, పద్యకృతులు; ఉపన్యాసకుసుమమాలిక వచన రచన.

## శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు

పానుగంటివారు పీఠికాపురాస్థానకవులు; ఆస్థాననాటకకర్తలు. వీరి ప్రతిభావ్యుత్పత్తులకు, శాస్త్రపాండిత్యమునకు, అశేషప్రాపంచిక జ్ఞానమునకు "సాక్షి"యే సాక్షి. ఈ మహాకవినిగూర్చి శ్రీ ముదిగొండ వీరభద్రశాస్త్రిగారు పరిశోధనచేసి, జీవితవిశేషములను, సాహిత్యసృష్టిని సమగ్రముగా పరిశోధనవ్యాసములో పొందుపరచి ముద్రించిరి. కనుక శ్రీ పానుగంటి పిఠాపురాస్థానకవియైనను చర్విత చర్వణము కాకుండుటకై అచ్చటచ్చట కొన్నివిశేషములమాత్రము వ్రాయుదును. వీరు 11-2-1865వ తేదీన రాజమండ్రి తాలూకాలో సీతానగరమునజన్మించి, 1-1-1940లో పీఠికాపురమున పరమపదించిరి. పానుగంటివారు తొలుత ఉర్లాము, ఆనెగొంది, లక్ష్మీనరసా

పురము సంస్థానములలో 'దివాను'గా పనిచేసి తరువాత పీఠపురసంస్థానాస్థానకవులుగా వచ్చిరి. ఆస్థానకవులుగా మాసమునకు 120 రూ, దసరాఉత్సవములలో 116రూ, మహారాజావారికుటుంబమునజరిగెడి శుభకార్యములలో 1,116 రూ, పానుగంటివారి కందెడివి. వీరి రచనల నన్నిటిని మహారాజా సూర్యారావుగా రచ్చువేయించి వేయి ప్రతులలో వందప్రతులనుమాత్రమే తాము స్వీకరించెడివారు. అయినను పంతులుగారి నొక్క-కావ్యమైన అంకితమిమ్మని వీరు కోరలేదు. అది పిఠాపురప్రభువుల ఔదార్యము, ప్రతిఫలాపేక్షారహితమైన వితరణస్వభావము, సహృదయతయేగాని అన్యము కాదు. అందువలననే వీరి నిస్వార్థమైన సాహితీసేవ ప్రశంసాపాత్రమయ్యెను. ఆస్థానకవిగా నుండియు 'మాలతీమాల'యను నాటకముతప్ప మరి యేకావ్యమును పానుగంటివారు సంస్థానాధిపతుల కంకితము చేయకపోవుట వారి వ్యక్తిగత స్వాతంత్ర్య మని చెప్పవచ్చును. 'మాలతీమాల' ను మాత్రము వీరు యువరాజావారిని దృష్టియందుంచుకొని వ్రాసి, యువరాజావారి వివాహసమయమున వారి కంకితము చేసిరి.

మహారాజావారితో పానుగంటివారు అతిసన్నిహితముగా మెలగెడివారు. అనుదినము సాయంసమయములలో వారు కోటకు వెడలి రాజావారితో ఉద్యానవనమునకేగి అచట సాహితీప్రసంగములు కావించునభ్యాసముకలదు. రాజ కవిరాజులట్లు గంటలతరబడి ఏకాంతముగా కాలము గడిపెడివారు. పంతులుగారువ్రాసిన ప్రతి గ్రంథము మహారాజావారికి వినిపించెడివారు. సూర్యారావుగారు వీరిని "పంతులుగారూ!"అని ఆప్యాయముగా పిలిచెడివారు. ఇది ఆ సాహితీచక్రవర్తి సాహితీవేత్తల సన్నిహితఅనుబంధమును తెల్పుచున్నది. మరణశయ్యనున్న పంతులుగారు "నే నింతకాలము జీవించుటకు, కొంతకాలమైన సాహిత్యసేవచేయుటకు పిఠాపురముప్రభు

వులే కారణం" అని చెప్పిరట. పీఠికాపురాస్థానవైణిక విద్వాంసులు సంగమేశ్వరశాస్త్రిగారొకనాడు వీణవాయింపగా సంగీతప్రియులు, సంగీతమున ప్రవేశముగలవారునగు పంతులుగారు ప్రభువునుద్దేశించి యొకచక్కని సీసపద్యము చెప్పిరి.

సీ. స్వజనుల నరసితి బరిపాలనమొనర్తు,
వాశ్రితు నెవ్వాని నాదరింతు
వాదాయమున నెంత యర్థాళికిచ్చెద
వదేటు చేసిన భృత్యునెవగణింతు
వవనిపాలన నేది యార్జించినాడవు
కవిత గానంబు నేపగిది విందు
వెట్లుగా ప్రభుశౌఖ్యమీక్షింపగానుంటి
వాత్మసంస్తుతుల కేమందువయ్య

గీ. సరిగ, ధని, సగమ, పనిని సరిగ, గరిమ,
మరిమరిగ, పాపనినిగ, సరిసరి యను
వీణకాని, 'మా' వెన్క నీవీణవరుస
మీద? 'నీ' వెన్క 'మా' సూక్తమేదినీశ!

సీసపద్యమందలి నాల్గుపాదములలోగల ఎనిమిది ప్రశ్నలకు గీతమున క్రమముగా సప్తస్వరములలో నుత్తరముండుట పానుగంటివారి పాండిత్యము ప్రతిభ సంగీతవిద్యాపాటవములనుటలో సందేహము లేదు. వీణవరుస అవరోహణమునుండి ఆరోహణమునకు వచ్చునపుడు 'మా' అను స్వరము తరువాత 'నీ' అను స్వరము పలుకును. కాని మహారాజావారి విషయమున 'నీ' వెన్క అనగా ప్రభువు వెనుక 'మా' అనగా లక్ష్మీదేవి వచ్చునని యర్థము. ఈపద్యము చమత్కారవంతమేకాదు అద్భుతము అనన్యమునై పానుగంటివారికి మహారాజావారిపట్లగల ఆత్మీయతను వ్యక్తము చేయుచున్నది.

శ్రీ పానుగంటికి ఆంధ్రా ఎడిసన్, ఆంధ్రా షేక్స్పియర్, అభినవకాళిదాసు అను బిరుదులు గలవు. ఆంగ్లమున ఎడిసన్ మహాకవి రచించిన 'స్పెక్టేటర్' అను విమర్శనాత్మకవ్యాసములు పంతులుగారి 'సాక్షి' వ్యాసముల కాధారములు. ఆ గ్రంథమును దృష్టియందుంచుకొని 'సాక్షి' యనుపేరుపెట్టి సంఘములోని దురాచారములను ఖండించి తెలుగు సాహితీమతల్లికి అమూల్యాలంకారము నర్పించిరి. కనుక వీరికి 'ఆంధ్రాఎడిసన్' అను బిరుదువచ్చెను. షేక్స్పియర్ వలె నాటకములు రచించుటచేత 'ఆంధ్రా షేక్స్పియర్' అని పేరువచ్చెను. ఇక కాళిదాసువలె రమ్యములైన ఉపమానములను ప్రయోగించుట వలన పానుగంటికి అభినవకాళిదాసను ఖ్యాతి కలిగెను. 'రాధాకృష్ణ' నాటకమున రాధ ప్రణయతత్త్వమాధ్యాత్మసంబంధియని నిరూపించుట పానుగంటివారి ముఖ్యోద్దేశము. అందుల కనుగుణ్యమైన ఉపమానములను వీరు స్వీకరించిరి. శ్రీకృష్ణునిరాకకు వేచియున్న రాధ "ఇష్టభవ్యసాక్షాత్కృతికి తపఃప్రతిభవోలె వేచియుండున"నును. ఈ యుపమ రాధ శీలచిత్రణమున కుపాధి. ఇట్టివి సందర్భోచితములు, పాత్రోచితములైన ఉపమానములెన్నియో వీరిరచనలలో గలవు. ఉపమానములను వ్యవహారమందున్నవానినే స్వీకరించుట పంతులుగారి ప్రత్యేకత. పాదుకాపట్టాభిషేక నాటకమున వీరు "రోదనారబ్దకార్యములు కొన్ని తుదకు సుఖమిచ్చు బాలురచదువువోలె" అని దశరథునిచే పలికించిరి. బాలురు చదువుకొననారంభించినపుడు వారికావిద్య కష్టముగా తోచును. కొందరేడ్చెదరు. అయిన విద్యాభ్యాసము ముగిసినతరువాత కష్టమనుకొనిన ఆకార్యము వారికి సుఖమనిపించును. చక్కని లౌకికోపమయిది. శ్రీరాముడు అరణ్యవాసమునకు వెడలుట. తల్లిదండ్రులకు ప్రజలకు దుఃఖము కలిగించినను, రావణసంహారమువలన దుఃఖముతో మొదలైనకార్యము లోకకల్యాణహేతువై సుఖముగా పరిణమించెనుకదా!

పంతులుగారికి ఆధునికవాఙ్మయముపట్ల చిన్నచూపు. సాక్షిలో వీరు ఆధునిక కవిత్వమును, గ్రామ్యభాషావాదమును ఖండించుచునే యుండిరి. అంతతో తృప్తిపందక తన నాటకములలోకూడ ప్రదర్శించిరి. 'ముద్రిక'లో చతుర్థాంకమున సుందరియను పరిచారిక "పొల్లు కవిత్వపుటిచ్చకములతో ప్రేమగీతములు పాడలేనివాడెవ్వడు!" అనును. అట్లే "రాతిస్తంభము"లో నారాయణరావు వేశ్యమాతను "గ్రామ్యభాషాసరస్వతివి"అని వెక్కిరించును. "విజయరాఘవము"న రావణపురోహితుడు ద్విజిహ్వుడు ఆధునికకవులు, కవిత్వము ఎట్టి అసంబద్ధపు విమర్శలకు లోనగుదురో ఉపన్యసించెను. ఇటువంటి ద్విజిహ్వులు పిఠాపుర ఆస్థానమునకలరని కవి సూచించెను. 'చూడామణి'లో పంచమాంకమున చపలయనుపాత్ర "ఏడుప్రశుతిలో గలిపి కవితాగాన మొనర్చువాడే కవి, కన్నీటిమంచులో కవిత్వపు గులాబుల నెవడలంకరించునో వాడే కవి" అనుటలోను, "కడుపుమంటచే జనుల యజ్ఞానము నెవరుకాల్చునో వాడే కవి" అనుటలోను పానుగంటివారు భావకవిత్వమును అభ్యుదయకవిత్వమును తలచెనని భావింపవచ్చును. వీరిట్లే పాశ్చాత్యనాగరికత మున్నగు అనేకవిషయములను 'సాక్షి'లోను నాటకములలోను తీవ్రముగా విమర్శించుటయేగాక ఆత్మవిమర్శ చేసికొనుట "కంఠాభరణము"న కన్పట్టును. వీరి నిశితవిమర్శలకు భయపడి ప్రజలు వీరిని 'వెక్కిరింపు పంతులు' అనెడి వారు. కంఠాభరణము' లో సుబ్బిశెట్టి కృష్ణారావుపంతులును "వేపారిపంతులు వెక్కిరింపుపంతులు" అనుటలో కవి ప్రజలు తన కిచ్చిన బిరుదును స్మరించెను. సుందరిచేత "వీధిగుమ్మమునుండి పంతులు, ప్రక్కగుమ్మమునుండి పందులు—ఇంతే మా సౌభాగ్యము" అనిపించుటలో పంతులుగారు తన వేశ్యాలోలత్వమును విమర్శించుకొనుచున్నారని వారితో పరిచయమున్న పెద్దలు తెల్పిరి.

పానుగంటివారు లక్ష్మీనరసాపురసంస్థానమున దివానుగానున్న పుడు వ్రాసిన నర్మదాపురుకుత్సీయము, సారంగధరనాటకములు సంస్థానాధికారిణియగు శ్రీమతి చెల్లయ్యమ్మారావుగారి కంకిత మిచ్చిరి. పిఠాపురసంస్థానమునకువచ్చిన పిమ్మట వీరుసంస్థానమున జరిగిన శుభకార్యముల సందర్భములలో కొన్ని నాటకములు ప్రత్యేకముగా రచియించిరి. మహారాజావారి వివాహసమయమున "కోకిల," వారికి యువరాజావారు జన్మించినపుడు "సరస్వతి" జ్యేష్ఠపుత్రికా జననసందర్భమున "వీరమతి," నాటకములు పానుగంటివారు రచించిరి. కొన్నిలోకోక్తులు, సంఘనియమములు పంతులుగారి నాటకములలో చోటుచేసికొనెను. నాటిసంఘములో ఎదిగినపిల్లకు పెండ్లిచేయని తలిదండ్రులను వెలివేయునంత తీవ్రముగా చూచెడివారు. నర్మదా పురుకుత్సీయమున నర్మదతండ్రి సర్పరాజు మందారుడు "ఎదిగిన యాడుపిల్లకేదోవిధముగా త్వరలో వివాహముచేయనితండ్రి ముక్కుచెవులు గోయవలయును" అని పల్కెను. ఎవరిమీదనైన పగతీర్చుకొందుననుటకు'శంకరగిరిమన్నెము'లకు పట్టింతుమని శపథముచేయుట ఆంధ్రదేశమున కొన్ని ప్రాంతములలో పరిపాటి. ఈ లోకోక్తిని పానుగంటివారు "సరోజిని"యను సాంఘికనాటకములో నుపయోగించిరి. సరోజిని తనకు సంతానము లేకపోవుటవలన భర్త పద్మనాభ శాస్త్రికి బలవంతముగా మేనగోడలినిచ్చి వివాహముచేసెను. తదుపరి వారిఅన్యోన్యత సహింపలేక, మేనగోడలు పార్వతిని పలువిధముల బాధించియు, అసూయతో భర్తనిట్లు ప్రశ్నించుచున్నది. "నీవు నదియు (పార్వతి) నేమైన నన్ను శంకరగిరిమన్నెములకు సాగనంప దలచితిరా?"అని, "రాతిస్తంభము"న తమకాలమునజరిగిన అమ్మవారి జాతరనుగూర్చి కవి తెల్పెను. ఈనాటకమున నాయకుడు నారాయణరావు వేశ్యమాతను "అమ్మవారిజాతరకు సిరిడిబొమ్మను

ద్రిప్పినట్లు గిరగిర త్రిప్పిన" అనును. ఈజాతర పీఠపురమున "మరిడమ్మ" గుడివద్ద జరుగును. అప్పుడు మనిషియెత్తున స్త్రీవిగ్రహము తయారుచేయించి, స్తంభమునకుకట్టి యూరేగింతురు. ఆ బొమ్మనే "సిరిబొమ్మ" అందురు. ఊరేగింపులో సిరిబొమ్మను గిరగిర త్రిప్పు చుండగా ప్రజ లా బొమ్మను జూచు, అరటిపండ్లతో కొట్టెడివారు. అల్లరిబాలురు రాళ్లతో కొట్టుటయు కలదు. "కంఠాభరణము"న సుబ్బిశెట్టి కృష్ణారావును "గవలగంగమ్మహాస్తోదకమేమైన దగిలినదా ఏమి" అనును. పానుగంటివారికాలమున పిఠాపురమున గంగమ్మ యను స్త్రీ కల్లుఅమ్మెడిదట. ఈ నాటకమందలి పిచ్చిరామశాస్త్రి సజీవపాత్ర. వీరికాలమున అయ్యప్పశాస్త్రియను కవిపండితుడు పిచ్చివాడై యుండెను. ఆ శాస్త్రిని దృష్టియం దుంచుకొని పంతులుగారీ పిచ్చిరామశాస్త్రిని సృజించిరి. "కల్యాణరాఘవము"న గోటిబిళ్ల, కుండబంతియాటలు పేర్కొనబడెను. "ముద్రిక"లో రాణి ఇందుమతి "మాఘుడు రాజాగారితో మాటలాడి దిడ్డిగుమ్మమునుండి పోవుచున్నాడ"ని చెలికత్తెకు చెప్పెను. పిఠాపురముకోటకు వెనుక వైపునగలద్వారము "దిడ్డిపారా" యని పిలువబడెడిది. దానిని పంతులుగారిం దుపయోగించిరి. బంగారునగలను వరాహరోమముతో కుంకుడుకాయ రసముతో రుద్దిన అవి చక్కగా ప్రకాశించెడివి. వానిని పందికట్ట అనెడివారు. దీనికే "వరాహకట్ట" అనిపేరు.

**మాలతీమాల :-** పిఠాపురము యువరాజా గంగాధరరామా రావుగారికి అంకితముచేయబడిన నాటకమిది.

క. శ్రీధాముఁడు శ్రీరాముఁడు
బోధము నాయువును యశము పుత్రులు కరిరా
డ్వ్యాధములు మణులు శ్రీ గం

అని యాశీర్వదించుచు "ఆంధ్రభోజుండై సూర్యరాయని ప్రథమ పుత్రుడగు రామరాయని పరిణయవేళ నవ్యరచనలతో చేసిన నాటకము కృతినిచ్చుచుంటిని స్వీకరింపుమని నాటకమంకితముచేసిరి. ఈ నాటకము పూర్వప్రబంధములవలె నడిచెను. రామదుర్గాస్థాన రాజకుమారుడు చంద్రశేఖరరావు పట్టణమున విహరించుచు గుణవతి యను క్షత్రియకాంతగానమున నాకర్షితుడై యామెను వివాహమాడ సంకల్పించును. గుణవతీ చంద్రశేఖరుల అన్యోన్యానురాగబీజమునకు గుణవతిచేటి 'కురవక' దోహదముచేయును. తుద కుద్యానవనమున గుణవతి ప్రత్యక్షముగా చంద్రశేఖరునిచూచి యాతనిగళమున "మాలతీమాల" వైచును. మహారాణి మహారాజు లీ వివాహము నామోదింతురు. రాజు కుమారునికి గృహస్థధర్మములను బోధించును. నాటకరచనాపద్ధతి నవ్యముగానుండెను. కాని నాలుగంకముల యీ నాటకమున నాందీ, ప్రస్తావన, విష్కంభము, భరతవాక్యము మొదలైన ప్రాచీననాటక రచనాసాంప్రదాయముననే సాగెను. ఇక నీ నాటకమున నవ్యత ఎట్టిది? నాటకేతివృత్తము సంపూర్ణముగా సాంఘికమగుట, యువరాజు యువరాణీ మహారాజమహారాణీ పురోహితులే పాత్రలగుట విశేషము. ఈ పాత్రలలో మహారాజా జగన్నాథరావు సాక్షాత్తూ మహారాజావారే. జగత్తునకు నాథుండు సూర్యుడు కనుక సూర్యారావుగారి పేరు ధ్వనించునట్లే పేరుపెట్టినారు పంతులుగారు; అట్లే యువరాజావారి పేరు ధ్వనించునట్లు నాయకునికి చంద్రశేఖరరావని పేరిడిరి; మహారాణీగారి పూర్వనామము "ఆండాళ్ళు" అను పేరు సూచించుచు రాణిని మహాలక్ష్మి యనిరి. యువరాణీగారైన వేదవతీదేవిని గుణవతి యనిరి. పీఠికాపురాస్థాన పురోహితులు వింజమూరి వెంకన్నగారి పేరే నాటకమందుగలదు. ద్వితీయాంకమున నాయకునితండ్రిని "ఆయన నూటికి లక్షకు భేదము

తెలియని వదాన్యచక్రవర్తి” అని పానుగంటివారు మహారాజా వితరణము నిందుస్మరించిరి. రాజావారికి ప్రీతిపాత్రమైన గులాబీల పెంపకమునుగూర్చియు నిందుఁ వ్రాయుట గమనింపదగినది. సూర్యారావుగారు దూరదేశములనుండి పలువిధములైన గులాబీలను తెప్పించి యుద్యానవనముల నాటించెడివారు; చెన్నపట్టణములో నివాసభవనమునకు “గులాబి”యని పేరుపెట్టిరి. పంతులుగారికి నా యభిరుచి సంక్రమించుటచేత నీ నాటకమున నొకచో “సురభిళితయును రూపసుందరత గల్గు నమెరికను సుందరి గులాబి యట్టుగాఁగ” యనిరి. పేరయ్య యనుపాత్ర “మహారాజు బుద్ధికిఁ ద్యాగమునకు హద్దులేకుండనున్నదోయి” యని పల్కును. ఇటకవి, సూర్యారావుగారికి “అతి సర్వత్ర వర్జయేత్” అను విషయము బోధించుచున్నాఁడనిపించును. మహారాజా యువరాజావారిని “పెదనాయనా”యని పిలిచెడివారట. నాటకమందు సిల్లీ తనయుని “పెదనాయనా”యని సంబోధించును. యువరాజావారు వేదాంతగ్రంథముల నెన్నిటినో అధ్యయనము చేసినను భగవద్గీతపై వారికి మక్కువ. ఇట్లు నాయకునిలో యువరాజావారి గుణములను పంతులుగారు నిక్షేపించిరి. పంతులుగారికిని ‘గీత’ పట్ల నమితమగు అభిమానము కలదు. యువరాజా గంగాధరరామారావుగారి వివాహమహోత్సవ శుభసమయమున 23-2-1929వ తేదీన ఈ “మాలతీమాల”కోటలో పంతులుగారి సూత్రధారత్వమున ప్రదర్శింపబడెను.

**శ్రీ వేంకటరామకృష్ణకవులు :-** పిఠాపురాస్థానకవులీ జంటకవులు. వీరు తిరుపతి వేంకటకవులవలె జంటగాశవనమల్లి సంస్థానాధిపతులకు, సాహిత్యప్రియులకు ఆనందము కలిగించెడివారు. వీరిలో ఓలేటి వేంకటరామశాస్త్రి కాకినాడతాలూకా పల్లెపాలెము వాస్తవ్యులు. శ్రీ వేదుల రామకృష్ణకవి తణుకుతాలూకా కాకరపర్తి

గ్రామవాస్తవ్యులు. వీరు మేనమామ మేనత్తబిడ్డలు. శ్రీ వేంకట రామశాస్త్రి కామేశ్వరీనారాయణశాస్త్రి పుణ్యదంపతులకు క్రీ॥ శ॥ 1883లో జన్మించిరి. కవి పితామహులు శ్రీ చంద్రశేఖరశాస్త్రి సాహితీవేత్త.పితృవ్యులు దక్షిణామూర్తిశాస్త్రి వీరికి సాహిత్యపాఠము చెప్పెడివారు. శ్రీ చర్ల నారాయణశాస్త్రి సాహితీగురువు; రామడుగుల వీరేశ్వరశాస్త్రి శబ్దశాస్త్రము బోధించెడివారు. వీరి మేనత్త కుమారుడు శ్రీ రామకృష్ణశాస్త్రి క్రీ॥ శ॥ 1897లో జన్మించెను. వేంకటరామకృష్ణశాస్త్రి గారికి మేనమామలవలన కవిత్వముపట్ల ఆసక్తి కలిగెను. ఈకవిద్వయము శ్రీ దేవగుప్తాపు భరద్వాజమువలన మహారాజావారి సాహిత్యాభిరుచిని తెలిసికొని పద్యరూపముగా వారికొక దరఖాస్తును శ్రీ మొక్కపాటి సుబ్బారాయుడుద్వారా పంపిరి. మొక్కపాటివారి యాశీఃప్రభావమున నీయిద్దరకు 1909లో రాజావారి యాశ్రయము లభించెను. పిఠాపురఆస్థానకవులుగా స్థిరపడిన వేంకటరామకృష్ణు లత్యద్భుత శతావధాన, శతవిధాన, శతప్రాసాష్టావధానాదులచేత రాజావారిని రంజింపజేసిరి. వీరికి పండితాగ్రేసరులైన శ్రీ తిరుపతివేంకటకవులతో సాహితీవివాదములు తటస్థించినవి. పత్రికాముఖమునజరిగిన ఆ ఖండనమండనము లన్నియు సాహితీపిపాసువుల కానందమును గలిగించెడివి. ఆ వాదోపవాదములన్నియు భారతము–గీరతము, పాశుపతము–పస్పశము, అట్టహాసము మొదలైన గ్రంథములుగా వెలువడెను. వీరు ప్రద్యుమ్నోదవంశము, పుష్పబాణవిలాసము, రామాయణము, ఉత్తరరామచరిత్ర (నాటకము), కాత్యాయన చరిత్ర (పాణినిసూత్రములకు వార్తికములురచించిన వరరుచి), శకుంతల, దమయంతీకల్యాణము (నవలలు), ఆంధ్రకథాసరిత్సాగరము, విశ్వగుణాదర్శము, సువృత్తతిలకము, మదాలస నాటకము, మహారాజావారికి సి.బి.ఇ. బిరుదు వచ్చినప్పుడువ్రాసిన రాజాను

రంజనాదులు, అనేకసందర్భములలో చెప్పిన పద్యములు మొదలైన వన్నియు వేంకటరామకృష్ణగ్రంథమాలాముఖమున ప్రచురించిరి.

విశ్వగుణాదర్శము : ఈగ్రంథము వేంకటాధ్వరి సంస్కృత విశ్వగుణాదర్శమున కాంధ్రీకృతి. ఇది క్రీ॥శ॥ 1917లో చెన్నపురి ఆంధ్రపత్రికాముద్రణాలయమున ముద్రితమైన 148పుటల కావ్యము. ఇది మహారాజావారి కంకితము. ఇం దరువదియారు వర్ణనలు కలవు. స్తుతినిందాత్మకమగు నీకావ్యము నీకవులు మహారాజావారియాజ్ఞాను సార మాంధ్రీకరించిరి. ఆసమయమున మహారాజావారు వేయినూట పదియార్లు కానుకగా వీరికొసగిరి.

క. వీరునకు విదితకవితా
సారునకు వచోమృతప్రసారునకు మహో
దారునకు మేరుమందర
ధీరునకుం జిన్నమాంబాసతీదారునకున్.

క. నిరుపమ కృపామృతఝరీ
పరిపూరితమతికి హయాణభాషాకృతికిన్
గురుపాదరతికి గంగా
ధరరామారాయ సూర్యధరణీపతికిన్.

అని షష్ఠ్యంతములు చెప్పి కావ్యమారంభించిరి. ఇందు విశ్వావసుడు, కృశానుడు (పురోభాగి) అను నాకలోకవాసులు భూలోకమున పర్యటించుచు ఆయావిశేషములనుజూచి విశ్వావసుడు శ్లాఘించగా కృశానుడు ఖండించుట, విశ్వావసువు మరల వానిప్రాశస్త్యము నుగ్గడించుట వర్ణింపబడెను. చివర దివ్యక్షేత్రాదివర్ణన ఉపసంహారమున విశ్వావసువు కృశానునితో "మిత్రమా! సంక్షేపముగా చెప్పబడు నీసారాంశమును గ్రహింపుము. సుమతియైనవాడు నరులను, దేవతలను, పశువులను, పక్షులను నిందించుట ధర్మముకాదు. కవి

కాలమందైన నందరు గుణహీనులుగ నుండరు" అని పలికెను. కృశాను డతనితో నేకీభవించుచు నిట్లు పలికెను.

గీ. గుణసమృద్ధికి దార్ఢ్యము గూర్చిపొంటె
సకలవస్తువులకును వాస్తవముగాని
దూషణనిబంధనం బస్మదుక్తమయ్యె
పూర్వపక్షోక్తిసిద్ధాంతమునకు వోలె.

అనుచు కృశానునిదూషణమునే చదువరు లనుసరింతురేమో యని ఆ దూషణము పూర్వపక్షోక్తిసిద్ధాంతమువలె కల్పింపబడెనే గాని సత్యముకాదని కవి చెప్పెను.

'మంచి'ని ఖండించుచు కృశానువు 'చెడు' చెప్పెనను విశ్వావసువు తిరిగి 'మంచి'ని నెలకొల్పుచున్నాడు. కావ్యమంతయు నీ యిరువురసంభాషణతో నడుచుటవలన సహృదయమున కిది దృశ్య కావ్యమువలె భాసించును. మొదట విశ్వావసువు సూర్యవర్ణన చేయుచు ప్రవేశించి సూర్యభగవానునికి నమస్కరించును. వెంటనే కృశానువు "సమస్తభువన సంశోషణకరుడగు తపనునికి నమస్కరించు చుంటివా! చూడు" అనుచు నిందించగా, విశ్వావసువు "పురో భాగా! భగవానుఁడగు నరవింద బాంధవునిసైతము నిందించు చుంటివా? విను.

"ఉ. ఘృష్టులఁ బైరుపంటలకు వృష్టినొసంగి సమస్తలోక సం
తుష్టిని గూర్చుఁ జీకటులఁ దోలి ఫలంబటియున్న దృష్టికిం
బుష్టినొసర్చుఁ బ్రాజ్ఞులకు మోక్షపథంబునొసంగు శ్రీనివా
సేష్టముఁజేయు వేరు నుతియింపరు పూషు నభోవిభూషణున్.

అని నాల్గు పద్యములలో సూర్యప్రాశస్త్యము వర్ణించుచు ఇట్లించుమించు ప్రతివర్ణనయందలి దోషములు ప్రతిపాదింపబడి తదు పరి గుణములు స్థాపింపబడెను. దేశ, నదీ, దేవతా, సేతు, వేదాంతి,

జ్యోతిష, భిషక్క, కవి, తార్కిక, మీమాంసక, వైయ్యాకరణ, వైదిక, రాజసేవాదికవర్ణనములు వేనికవి ప్రత్యేకములయ్యు నీ గంధర్వులసాహాయ్యమున నొక్కదారమందలి పూసలవలె నున్నవి. అట్లే మూలమందలి విషయ మున్నదున్నట్లు వేంకటరామకృష్ణకవు లనువదించినను స్వతంత్రకావ్యమువలె భాసిల్లుచున్నది. కావ్యము మొత్తము మీద 184 పద్యములు గలవు. కావేరీనదీవర్ణన మొదలగు చోట్ల దీర్ఘవచనములుగలవు. వర్ణనలుచేయుచు విశ్వావసుకృశాను లొకరిమాట లొకరు ఖండించుటకు చిన్నచిన్నవచనములు గలవు.

**సువృత్తతిలకము :-** సువృత్తతిలకము మూడు విన్యాసము లతో రచియింపబడిన ఛందస్సంబంధమగు చిన్నపద్యకృతి. వేంకట రామకృష్ణులు తొలివిన్యాసమున కవులు తరచుగా వాడని పంక్తి ఛందస్సు మొదలుకొని ఇరువదియారవదగు ఉత్కృతిచ్ఛందము వరకుగల వృత్తములకు లక్షణములు రచియించి కవిత్రయమునుండి బహువిధవృత్తములను లక్ష్యములుగా నొసంగిరి. మలివిన్యాసమున జాతులలో ఇంద్రచంద్రసూర్యగణనిబద్ధములగు పద్యములనుభారతము నుండి లక్ష్యములుగా నిచ్చుచు, వానిలో యతిప్రాసవిశేషములను వివరించిరి. చివరక్షేమేంద్రుఁడు తన "సువృత్తతిలకమున సకలకావ్య ములందు విశేషముల పరికించి, యేవియుండవలెనని చెప్పెనో, అట్లే తాము, భారతమందలి శ్రేష్ఠములగు వివిధవృత్తములను, సకలకావ్య ముల కనుకూలమగు వానిని, సరళముగా నుండువానిని, కవులంద రంగీకరించినవానిని, శ్రుతిహితములైనవానిని కవులుపయోగింపవలె నని తెల్పుచున్నాము"నిరి. అష్టావధానాదులలో పృచ్ఛకులు వీని కన్న అన్యవృత్తము కోరరాదని, కోరినచో విశ్రాంతి స్థానముల సొగసుచెడిపోవునని సూచించిరి. ఉక్తాదులగు నిరువదియారు ఛంద ములనే కాక మాలికావృత్తములను పేరిట నసంఖ్యాకమగు గణము

లతో నుండు దండకము పర్యంతము వాని స్వరూపములను వీరు చూపిరి. పొడుగువృత్తములు సమాసములు లేకున్న సొగసుగా నుండు నని, చిన్నవృత్తములు సమష్టిపదములతోనున్న సొగసుగానుండుననిని, చెప్పి, "పండిత కవీంద్రులుపయోగపరతఁ జేసి ఏగతి రచియింని రేనియునింపుపుట్టు" అనియూనియ మంచుక సడలించిరి.

ఉపజాతి వృత్తములలో ప్రథమపాఠమందు పూర్వాక్షరము లఘువైన హృద్యముగా నుండునని చెప్పబడెను. అట్లుగాక గుర్వక్షరము ముందున్నసొగసుగ నుండదు. లఘువుతో మొదలగు పద్యము వాడి కొనగల దారమువలె సుండునని ఉపమింపబడెను. ఇట్లే యే పద్యము లేయేయక్షరముతో నారంభింపవలెనో వివరింపబడెను. సమాసముల విషయమై పూర్వార్థముల పాదములు వేరుగానుండుట ఉత్తరార్థమున దీర్ఘసమాసములై యుండుట శార్దూల విక్రీడితమునకు శోభావహమనిరి. దీనికి విపరీతమగు ప్రయోగమునకు విరాటపర్వమున "దుర్వారోద్యమ" అనుపద్యము లక్ష్యముగా చూపబడెను. దోషరహితములు గుణసహితములైన సువృత్తములను ముత్యాలవలె తిగిన పట్టుల కూర్పవలెననిమూడవవిన్యాసమున గలదు. శాస్త్రము, కావ్యము, శాస్త్రకావ్యము, కావ్యశాస్త్రముఅని వాఙ్మయమునాల్గు భాగములుగా విభజింపబడెను. "సర్వకావ్యలక్షణములు తెల్పునది శాస్త్రము. రసాలంకారయుక్తము కావ్యము; ఎల్ల పురుషార్థములుప దేశించునది శాస్త్రకావ్యము. కావ్యశాస్త్రములురసాలంకారయుక్తముగా పురుషార్థముప దేశించును. కావ్య, కావ్యశాస్త్రములలో రస వర్ణన కనుకూలమగు వృత్తముప యోగింపవలెను. శాస్త్రకావ్యము లలో అతిదీర్ఘవృత్తములనావశ్యకము'' అని యేయే వృత్తములెక్క డెక్కడ నుండవలెనో లక్ష్యసహితముగా నీ విన్యాసమున నిరూపింప బడెను. సంస్కృతకవులు సర్గమంత నొక్కవృత్తమున నడుపుదురు. తెలుఁగు కవులు సీస, గీత, శార్దూలాది ఎనిమిది వృత్తములతో నడు

పుదురు. వీరు శతకములకు మాత్రము నియమము పాటించి కందము, గీతము, సీసములలో దేనితో నారభించినదానితోనే పూర్తి చేయుదురని, తుల్యజాతులగు చంపకోత్పలములు, శార్దూలమత్తేభములు మాత్రము కలిపి చెప్పెదరని వివరింపబడెను. నన్నయ చంపకోత్పలములు, తిక్కనకందము, శ్రీనాథునిసీసము రమ్యములని చివరకలదు. శాస్త్రమొక న్యాయము ననుసరించునేగాని, సొగసులు చమత్కారములు దాని కనావశ్యకములు. కవిత్వమునకు రెండును కావలెను. గనుక శాస్త్రనియమ ముల్లంఘించకుండ సొగసులెట్లువచ్చునో అన్ని విధముల పరిశీలించి యుదాహరణలతో నిర్వచించుట వాఙ్మయమున కెంతయు నుపయోగకరము. రామకృష్ణకవుల సువృత్తతిలకము వాఙ్మయమున కెంతయు నుపయోగకారియగును.

**మదాలస :–** పీఠికాపురాస్థాన దసరా ఉత్సవములలో విజయదశమినాటి రాత్రి శ్రీ మహారాజావారి సభాంగణమున ప్రదర్శించుటకు వేంకటరామకృష్ణులచే వ్రాయబడిన ఐదంకముల 'మదాలస' పౌరాణికనాటకము కాకినాడ సుజనరంజనీముద్రాక్షరశాలలో 1911లో ముద్రితమై గ్రంథకర్తలచేత ప్రకటింపబడెను. ఈ నాటకమునకు మార్కండేయపురాణము మూలము. నాటకారంభమున పీఠపురాధీశులకాశీస్సులు, సభావర్ణనము ప్రస్తావింపబడెను. ప్రబోధచంద్రోదయము మొదలైనకొన్నిరూపకములలోకూడ ఆయాసభాంగణప్రస్తావన కలదు. రావు సర్వజ్ఞ సింగభూపాలరచిత "కువలయావళీ" నాటికయందు కవి తనరాజధాని'రాచకొండ'నుకూడ అభివర్ణించుచు ప్రస్తావన నడిపెను.

**కథ :–** శత్రుజిత్తు కుమారుడైన ఋతుధ్వజుని యౌవరాజ్య పట్టాభిషేకమునకువచ్చిన రాజులను బ్రాహ్మణులను యథోచితముగా సత్కరించి పంపినపిమ్మట గాలవుఁడను ఋషి వచ్చి, పాతాళకేతుఁ

డను రాక్షసునివలన తపోభంగము సంచుండెనని తెలిపెను. ఋతు ధ్వజుడను యువరాజా రాక్షసుని సంహరించునని అశరీరవాణి ఆ ఋషికి చెప్పియుండుటవలన నతడు శత్రుజిత్తు నర్థించుటకు వచ్చెను. ఋతుధ్వజు డామునిని వెంటనేగి, అడవిపందిరూపమున ఆశ్రమవాసుల బాధించు రాక్షసునిపై బాణమువేసెను. ఆ రాక్షసుడొక బిలములో ప్రవేశింప వెంటవెడలిన యువరాజు గంధర్వరాజపుత్రి మదాలస నచట చూచెను. ఆమె రాక్షసునిచేత బంధింపబడి దీనావస్థనుండెను. పాతాళకేతువును శరపాతమున బాధించువాడు ఆమెకు పతియగునని కామధేనువొకనాడు చెప్పెను. మదాలస చెలికత్తె 'కుండల' తొన్నట్టి వానిని చూచితినని ఆమెకు తెల్పెను. కుండలా మదాలసల సంభాషణ విని ఋతుధ్వజుడు వారియెదుటికిరాగా ఆ మనోహరాకృతి చూచి మదాలస ఆనందమున మూర్ఛిల్లెను. ఆమె సేదదేరిన పిమ్మట ఋతుధ్వజుడు తనవృత్తాంతము తెల్పెను. అంతలో తుంబురుడట కేతెంచి మదాలసాఋతుధ్వజుల పాణిగ్రహణము చేయించెను. ఋతుధ్వజుడు కువలయాశ్వమను తనయశ్వముమీద నామెను తీసికొనిపోవుచు అడ్డువచ్చిన పాతాళకేతువును సంహరించెను. ఈవార్త తెలిసిన రాక్షసునిసోదరుడు తాళకేతువు సమయమునకై వేచి యుండెను. మంత్రి దుర్ముఖుడు మదాలసను హతమార్చుమని తాళకేతువునకు చెప్పెను. జనకుని యాజ్ఞానుసారము ఋతుధ్వజుడు రాక్షస సంహారము చేయుచు గోబ్రాహ్మణాదులను రక్షించుచుండ నొకనాడు తాళకేతువు కపటమునిరూపమున నాతనికి కనిపించెను. రాక్షసుని వంచన తెలియని ఋతుధ్వజుడతనికి నమస్కరించెను. వివాహ సమయమున మదాలస ఋతుధ్వజుని మెడనువైచిన రత్నమాలికను యజ్ఞదక్షిణగా తాళకేతువు కోరెను. రత్నమాలను తీసికొని తాళకేతువు తాను యమునలో స్నానమొనరించి, వరుణుని పూజించి

వచ్చువరకు ఆశ్రమము కాపాడుమని ఋతుధ్వజునికి చెప్పి మాయ మయ్యెను. దారుకుఁడను సేవకునిద్వారా ఋతుధ్వజుఁడీవార్త తండ్రికి పంపెను. ఇంతలో తాళకేతువు మునివేషమున శత్రజిత్తును చేరి, మునులను రక్షింపబోయి మాయావియగు రక్కసునిచేత చావ బోవుచు ఋతుధ్వజుడు తనకారత్నమాలిక నిచ్చెనని చెప్పి ఆ మాలి కను మదాలసపై పడవేసి వెడలిపోయెను. ఆ మాట వినినంతనే మదాలసప్రాణములు విడిచెను. శత్రజిత్తు, అతని రాణి మాల్యవతి దుఃఖించుచుండగా దారకుడేతెంచి ఋతుధ్వజుని క్షేమవార్త వారికి తెలిపెను. తరువాత రాజధానికి తిరిగివచ్చిన ఋతుధ్వజుడు మదా లసా మరణమునకు పరితపించి, పునర్వివాహమాడనని శపథము చేసెను.

నాగరాజగు అశ్వతరునిపుత్రులు మిత్రసాల, సుమిత్రులు ఋతుధ్వజునికి మిత్రులు. వారు మిత్రునికొరకు మదాలసను బ్రది కింపుమని తండ్రిని ప్రార్థించిరి. నాగరాజు సరస్వతి నుద్దేశించి తపస్సు చేసి తనసోదరుడగు కంబుళునికి మధురమైన సంగీతవిద్యను సంపా దించెను. కంబుళుడు తనగానమాధుర్యమున శివుని మెప్పించి మదా లస తొల్లిటి వయోరూపవిలాసములతో తనకు తనయగా జన్మించి జాతిస్మర, పరమయోగిని, యోగిమాతయు నగునట్లు వరమడిగెను. శివుని కారుణ్యమున అతనికి మదాలస జన్మించెను. ఋతు ధ్వజుడు తాను బ్రాహ్మణపుత్రులని భావించుచున్న మిత్రసాల, సుమిత్రులతో పాతాళమందలి భోగవతీపురమున కరిగి, వారు నాగ కుమారులని యెఱింగి, అశ్వతరుని దర్శించి, జాతిస్మరయైన కంబుళ పుత్రిని తనభార్య మదాలసగా నెఱిఁగి, ఆమెను స్వీకరించెను. ఈ నాటకమున ప్రాచీననాటక సాంప్రదాయము ననుసరించి నాందీప్రస్తా వనలు, విష్కంభము, భరతవాక్యము గలవు. ఉత్తమ, మధ్యమ,

నీచపాత్రలన్నియు సరళ గ్రాంధికమును మాటాడుటవలన రామ కృష్ణులు పాత్రోచితభాషనుపయోగించలేదని స్పష్టమగుచున్నది. సంభాషణల నడుమ గీతపద్యములధికముగా, ఆటవెలఁది, సీసము, కందపద్యము లచ్చటచ్చట కలవు. ప్రథమాంకమున కాలవుఁడు "తగు మాత్ర మృదుళవస్త్రములు గట్టునుగాని కడు హెచ్చు వెలబట్టఁ గట్టఁబోడు" అని శత్రుజిత్తుని శ్లాఘించుటలో మహారాజును స్మరించు చుండెనని తెలియును. మహారాజావారి వస్త్రధారణమట్లే యుండు నని పరిచయస్థులు తెల్పిరి.

**ఆంధ్రకథాసరిత్సాగరము :** పదునెనిమిది లంబకములుగా విభజింపబడిన కథాసరిత్సాగరమును గుణాఢ్యమహాముని పైశాచిక భాషయందు వ్రాయగా సోమదేవకవి దానిని సంస్కృతీకరించెను. భారతమువలె వివిధధర్మబోధకమై యొప్పుచున్న ఈయుద్గ్రంథమును వేంకటరామకృష్ణు లాంధ్రీకరించి యువరాజు గంగాధర రామారావుగారి కంకితము చేసిరి.

ఉ. రాజకుమారకత్వమున రంజిలుచుండియుఁ దానొకింతయున్
రాజసవృత్తి లేక బుధరంజకుఁడై సముపాత్తవిద్యుఁడై
భూజన మాననీయ గుణభూషితుఁడై విలసిల్లుమామహా
రాజవరేణ్యసూనునకు రామనృపాలున కంకితంబుగాన్. (7ప)

అని కథాపీఠక లంబకము నారంభించిరి. కథాసరిత్సాగరము నాంధ్రీకరించి శ్రీవిద్వజ్జనమనోరంజనీ ముద్రాశాలయందు వీరు ముద్రింపించిరి. ఇది కథావతరణము, కథాముఖము, లావాణకము, నరవాహనదత్తాజననము, చతుర్దారికా, మదనమఞ్చుక, రత్నప్రభ, సూర్యప్రభ, అలంకారవతి, శక్తియశో, వేతాళపంచక, శశాంకవతీ, మదిరావతీ, పంచ, పంచదశ, మహాభిషేక, సురతమంజరి, పద్మావతీ, విషమశీలంబులని 18 విభాగములుగా నున్నది. కథా

సరిత్సాగరమందలి కథలే సాహితీప్రపంచమునందే కావ్యమునకైన నితివృత్తముగా నున్నవి. సుబంధమహాకవి 'వాసవదత్తా', బాణుని కాదంబరి, శ్రీహర్షుని రత్నావళీప్రియదర్శికాదులు, కళాపూర్ణోదయాది గ్రంథములకు ఈ మహాసాగరమే ఇతివృత్తము నందించెను. ఈ కథాసరిత్సాగరము సర్వవేదసారమని, ధర్మశాస్త్రమని, రాజనీతిశాస్త్రమని, మహాకావ్యమని, నవ్యతంత్రకల్పమని, చిత్రగాథయని ప్రఖ్యాతిగాంచెను. ఇట్టి మహత్తరగ్రంథముల నీరామకృష్ణులు మూలమును కొంచమైనను విడువక సంపూర్ణముగా తెనిగించిరి; ఔచితీపోషకముగా కొన్నిచోట్ల కథను పెంపొందించిరి. ఈ కావ్యమును శ్రీ ఓలేటి వేంకటరామశాస్త్రి, శ్రీ వేమల రామకృష్ణశాస్త్రి మరణానంతర మీ కావ్యాంధ్రీకరణమును ప్రారంభించి రామకృష్ణశాస్త్రి తోడులేకపోవుటచేత తానీ కావ్యసంపూర్తికి సరస్వతీ సహాకార మభిలషించితినని తెల్పిరి. వేమలవార పరసరస్వతీయంశమని ఓలేటివారి యభిప్రాయము.

చ. చనియెగదమ్మ నీయపరజన్మవిలాసము మాకుజూపవ
చ్చినగతివచ్చి, సత్కవితచేఁ గవికోటికి వన్నెదెచ్చి యం
తనె యతఁడట్లు నీతనువునన్ విలసిల్లఁగ; నెవ్వరింక నా
పొనరుచు నీకృతి క్రియకుఁ బూనికఁ దోడ్పడువారుభారతీ!

అని రామకృష్ణశాస్త్రిగారిని స్మరించుటయేగాక పుస్తకము నిరువురపేర ప్రచురించిరి. అనఁగు మేనత్తకుమారు డాశుకవితలో చేదోడువాదోడుగానుండెడి రామకృష్ణశాస్త్రియున్నచో సరస్వతీదేవి సహాయము తానర్థింపననుట వేంకటకవీంద్రునికి రామకృష్ణుని పట్లగల గాఢమైన అనురాగవిశ్వాసములను దెల్పుచున్నది. కథాసరిత్సాగరగాథలన్నియు పరమేశ్వరుడు పార్వతీదేవికి తెల్పెను. ఈ గ్రంథముద్రణకాలమును కవులు ప్రకటించలేదు. చతుర్థారికాలంబకము మాత్రము 1938లో ముద్రితమైనట్లు కలదు.

కథాపీఠక లంబకము 8తరంగములుగా విభజింపబడెను. ఇందలి శైలి మిగుల సరళమై ద్రాక్షాపాకమువలె యలరారుచుండెను. కథా సరిత్సాగరమునంతను తడవిచూచుటకై న ప్రత్యేకపరిశోధనగ్రంథము రచింపవచ్చును. కనుక మచ్చునకు కథాపీఠకలంబకమునుండి యొకటి రెండు పద్యములమాత్ర ముదహరింతును. షష్ఠతరంగమున నొక జల క్రీడా వర్ణన పరికింతము. సాతవాహనుడు,

చ. కిలకిల నవ్వుచుం బ్రియసఖీజనమండలిఁ గేళి దీర్ఘికా
జలముల నోలలార్చుచు వశాపరివేష్టితుఁడౌ గజేంద్రుఁడుం
బలె నిజవల్లభావితతి మధ్యమునన్ జలకేళిఁ జల్పె నె
చ్చెలువలు దన్ను హస్తసరసీరుహవారులముంచి యెత్తగాన్.

జలకేళిసల్పెను. ఇందన్వయకాఠిన్యము లవమైన లేక ప్రాసాద గుణశోభితమై, ఉపమాలంకారసమన్వితమై, ద్రాక్షాపాకసదృశమై పద్య మొప్పుచున్నది. గద్య మిట్లున్నది: ఇది శ్రీ భారతీకరుణా కటాక్షలబ్ధ కవితాభినివేశ సమాసాదిత శ్రీమత్పీఠికాపురీ మహాసం స్థాన కవీశ్వరత్వపదవీసమలంకరిష్ణులగు వేంకటరామకృష్ణులచే విర చితంబైన ... ... గద్యానంతరము వేంకటరామశాస్త్రిగారు సవినయముగా సహృదయుల కిట్లు విన్నవించిరి.

క. పలుకుల వెలంది యెట్టెటు
పలికించిన నట్టులేను బలికితి దోసంగుల్
గలిగిన మన్నింపుఁడు పె
ద్దలు రసవత్పదపదార్థ తాత్పర్యజ్ఞుల్.

మహారాజావారి కంకితముచేయబడిన గ్రంథములు :—
పీఠికాపుర సంస్థానాస్థానకవులు కాకపోయినను నెందరెందరో మహా కవు లాంధ్రభోజునికి కావ్యము లంకితముచేసి సత్కారములు పొం దిరి. అట్టికావ్యము లిట స్పృశింపబడును. 1. బ్రహ్మానందము ;

కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారి విరచిత బ్రహ్మనందకావ్యమను మూడాశ్వాసముల కావ్యము. ఈ అచ్చతెనుఁగు కావ్యము 394 గద్య పద్యములుగల్గి రాజమండ్రి కొండపల్లి ముద్రాక్షరశాలయందు ముద్రితమయ్యెను. కృష్ణమూర్తి శాస్త్రిగారు వెలనాటివైదికులు, కౌశికగోత్రులు; తల్లిదండ్రులు వేంకటసుబ్బ సోమిదమ్మ వేంకటసోమయాజి పుణ్యదంపతులు. వీరిస్వగ్రామము దేవరపల్లి. కవి గురువు ఇవటూరి నాగలింగమయ్యంగారు. శ్రీశాస్త్రి గారికి మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిరాజ, కవిసార్వభౌమ బిరుదులుగలవు. 29-10-1866లో నీ మహాకవి జన్మించెను. అవధాన సరస్వతులైన శ్రీ శాస్త్రి శ్రీకృష్ణభారతాది పెక్కు యుద్గ్రంథములరచించి కీర్తిగాంచిరి. పిఠాపురము మహారాజావారి కంకిత మీయబడిన ఈయచ్చతెనుగు కావ్యాదిని పంచరత్నములలో కవి కృతిపతి వర్ణనముచేసెను; ఏఁబదిపద్యములలో కృతిపతివంశ వర్ణన కలదు.

క. శ్్రీ పీఠికాపురీశ్వర
గోపాలకృపావిశేషగుణభూష ధరి
త్రీ పాలవినుత విభవ
వ్యాపక శ్రీసూర్యరాయ వరకవిగేయా!

కథాసారము : స్వాయంభువమనువు వంశమున శ్రీమహావిష్ణువు ఋషభుఁడను రాజుగా జన్మించి జయఁతియను కన్నెను వివాహమాడి భరతాది శతపుత్రుల బడసెను. ఋషభుని యనంతరము రాజ్యమేలిన భరతునిపేర మనదేశము భరతదేశమని. భారతదేశమని ఖ్యాతినొందెను. భరతుడు రాజ్యపాలనచేసి దిగ్విజయములు పొంది రాజ్యము నిజపుత్రునకొసగి పులహాశ్రమమునకు వెడలిపోయెను. ఒకనాడొక లేడి సింహగర్జనకు భీతిచెంది శిశువునుగని వెంటనే మర

ణించగా భరతుడా లేడికూన సంరక్షణ భారము వహించెను. భర తుడా లేడిపిల్లను కూర్మినిపెంచి తనకు మృత్యువాసన్నమగుటతో లేడికూనయందే ప్రేమనుంచి మరణించెను. అందువలననతఁడులేడిగా జన్మించి పూర్వజన్మజ్ఞానముతో నుండి తనజన్మమునకు పరితపించుచు నొకనాడు లేళ్ళకుమ్ములాటలో మరణించెను. తరువాత జన్మలో భరతుఁడాంగిరసుని పుత్రుడై జన్మించి మంద బుద్ధివలెనుండి జడభర తుడని పిలువబడుచుండెను. జడభరతుడెవ్వరేపని చెప్పినను మారా డక చేయుచుండెను. క్రూరసత్త్వములైన నతని బాధింపకుండెను. ఒకనాడొక కిరాతుడు భరతుని కాళికాదేవికి బలియివ్వబోగా కాళి భరతుని తప్పనందరిని తినుటకారంభించెను. భరతుడావిధమున రక్షింప బడెను. కపిలుడను మునిచెంత జ్ఞానోపదేశమునకై వెడలుచుండ, వాహకులలో నొక్కడస్వస్థుడుకాగా, మార్గమున కన్పించిన భర తుని వారు వాహకునిగా పిలిచిరి. కర్మఫలమనుభవింపవలెనని తలచి భరతుడు పల్లకి మోయుచుండెను. పల్లకీకుదుపులను సహింపలేని రాజు భరతుని నిందింపగా నతఁడు మారాడకుండెను. కొంత తడవు నకతడు ఎట్టి బరువైనమేనికేగాని యాత్మకు కలుగదని, ప్రాపంచిక విషయములన్ని మేనితో పుట్టి మేనితో నశించునుగాని ఆత్మకంట వని రాజునకు ప్రత్యుత్తరమిచ్చెను. రాజంతట భరతుని మహాత్ము నిగా భావించి పల్లకదిగి అతనిపాదములబడి క్షమింపవేడెను. రాజు కోర్కెపై జడభరతుడు జ్ఞానోపదేశముచేసి, అతని సందేహములను దీర్చెను. రాజు భరతునికి భక్తితో మ్రొక్కి తనదేశమునకు మరలి పోయెను. భరతుడు గండకినదియొద్దున ధ్యానమునమగ్నుడయ్యెను.

**మూలము** : ఈ కథకు మూలము భాగవతము. భాగవతము పంచమస్కంధము ప్రథమాశ్వాసమున భరతునికథ నూటయెనుబది పద్యములలో కలదు. శాస్త్రిగారు ప్రబంధమున కనుకూలముగు వర్ణ నలతో 394 పద్యములలో మూడాశ్వాసములుగా రూపొందించిరి.

కన రెండింటను సమానమయినను అప్రభేదములుకలవు. 1. భాగవత మున, స్వాయంభువమను పుత్రుడు ప్రియవ్రతుడు నారదముని చరణ సేవాసక్తుడై రాజ్యపాలనపట్ల అనాసక్తుడైయుండ, బ్రహ్మవచ్చి తత్త్వోపదేశముచేసి పరిపాలనపట్లసుముఖుడగునట్లు చేసెనని వ్రాయబడెను. బ్రహ్మానందమున ప్రియవ్రతుడు రాజ్యమేలెనని మాత్రము కలదు. ప్రస్తుతకథకనావశ్యకమనితలచి ఈభాగమును సంక్షిప్తముచేసెను. 2. భాగవతమున ప్రియవ్రతుని పుత్రులు పదుగురి పేర్లు తెల్పగా బ్రహ్మానందమున ఆగ్నీధ్రాది పుత్రులు అని మాత్రము కలదు. 3. పూర్వచిత్తియను భార్యవలన ఆగ్నీధ్రునికి కలిగిన తొమ్మండుగురు పుత్రులు భాగవతమున పేర్కొనబడగా బ్రహ్మానందమున ఆగ్నీధ్రుని తర్వాత రాజ్యమేలిన 'నాభి' మాత్రము పేర్కొనబడెను. అట్లే భాగవతమున మేరుపుత్రికలపేర్లు, వారిని నాభిసోదరులు వరుసగా వివాహమాడుట. నాభి మేరుపుత్రి మేరుదేవిని వివాహమాడుట ఉండగా, బ్రహ్మానందమున మేరుపుత్రికలపేర్లుగాని నాభిసోదరుల, వివాహప్రసక్తిగాని లేదు. శ్రీ శాస్త్రిగారిట్లు భరతునికి ముందు రాజ్యమేలినవారినిమాత్రము పేర్కొనుచు, అనావశ్యకములవిడిచిరి. భాగవతము పురాణమగుటచేత అన్నివివరములునుండవలెను. బ్రహ్మానందము ప్రబంధమగుట కవి ప్రధానేతివృత్తమునకు సంబంధించి నంతవరకుమాత్రమే స్వీకరించుటయుసమంజసము. **బ్రహ్మానందమున కథలో అల్పమైన మార్పులుగలవు.** 1. నాభిచేసిన యజ్ఞమున ఋత్విగాదులు నాభిపక్షమున శ్రీమన్నారాయణునితో "నీతో సరిదూగు కొమరుని కోరుచున్నాడ"ని ప్రార్థించినట్లు భాగవతముననుండ, ఆ వరము నాభి యడిగినట్లు బ్రహ్మానందమున మార్పుచేయబడెను. ఈ మార్పుచితముగానున్నది. కథాపోషకములుకాని విషయములుశాస్త్రి గారు విడిచిపెట్టిరి. 1. ఋషభుని మహిమలకీసుచెందిన పురుహూతుడనావృష్టి వ్యాపింపజేయగా, ఋషభుడు యోగబలమున రాజ్య

మును సుభిక్షము గావించిన విషయము విశదపఱచెను. 2. భరతునికి పూర్వము మనదేశమునకు 'అజనాభము' అని పేరుండెనను విషయ మిందు లేదు.

కూర్పులు : భాగవతమున లేనివి కథకుఁ పరిపుష్టి కలిగించునవి యగు విశేషములు శాస్త్రిగారు చేర్చిరి. జడభరతునిచేత రాజభృత్యులు పల్లకి మోయించుటకు కారణము భాగవతమున లేదు. "శిబిక మోపింత మతనిచేత" అనినట్లుమాత్రము కలదు. బ్రహ్మానందమున, "మోతగాండ్రు తమయందొక్కరుండు తెవులు గొంటచే నడువజాలకుంటం దెలిసి, చేనికడనున్న భరతునిం బట్టుకొనిపోయి, వీనిచే మోయింతమని పట్టి మూపునం బల్లకి దండిపెట్టి తోలి నడిపింరి"నట్లు కలదు. వాహకులలో నొకడు వ్యాధిగ్రస్తుడగుటచేత, వారు భరతుని వాహకునిగా కొనిపోయిరని కవి చెప్పిన కారణ ముచితముగా నున్నది. ఈరీతిగా కవి మూలమును సంక్షేపించియు, మార్పులు చేసియు, కొన్ని విషయములను విడిచియు, నౌచితీపోషకముగా బ్రహ్మానందమును తీర్చిదిద్దెను.

వర్ణనలు : 1. కృతిపతివంశవర్ణన (పీఠిక 23-74), 2. వసంతర్తు (1ఆ. 24-32), 3. పూర్వచిత్తివనవిహార (1ఆ.34-40), 4. సౌందర్య (1ఆ. 42-54), 5. హరిణశాబక (2ఆ. 31-34), 6. భరతుడు లేడికై తపించు వర్ణనలు (2ఆ. 36-47), 7. లేళ్ళుకుమ్ములాడుట (2ఆ. 77-82), 8. పులహాశ్రమ (2ఆ. 15-19), 9. జడభరతుని బాల్య (2ఆ. 109-112), 10. గృహకృత్య (3ఆ. 6-9) వర్ణన లిందు గలవు. ఇందు కొన్ని అష్టాదశవర్ణనలలోనివి, మరికొన్ని శాస్త్రిగారు సందర్భము ననుసరించి స్వతంత్రముగాచేసిన వర్ణనలు గలవు. మొత్తముమీద నిందలి వర్ణన లతిగా, అనావశ్యకములుగానుండక, మితముగా నౌచితీపోషకముగా నున్నవి.

వసంతఋతువర్ణన : అగ్నిధ్రుడు తపస్సు చేయుచుండ, అత నికి పూర్వచిత్తితో కలుగబోవు సమాగమము సూచించుటకు కవి వసంతఋతువర్ణన చేసెను. సామాన్యముగా నెవ్వరైన తపస్సు చేయునపుడు కావ్యములలో షడృతువులను వర్ణింతురు. కాని శాస్త్రి గారట్లు చేయక భావ్యర్థసూచనకు వసంతవర్ణనము మాత్రము చేసిరి. ఉదాహరణ కొక్క పద్యము చూతము.

చ. పొలుపుగ నొక్కటన్విరియఁబూచిన మల్లెపొదంగడంగి తేఁ
టులు గలయంగ వ్రాలి మెఱుఁగుల్విడకుండఁగ నొప్పెనప్డు పెం
పలరఁగఁ బెండ్లియాడి యట నామని వెన్నుఁడు తోటలచ్చియుం
దొలి కటిరాలుముత్తెములునుం దలఁబ్రాలుగఁగొన్న ప్రోవనన్.

సరళమైన అచ్చతెనుఁగుపదములకూర్పు. కటిరా లనగా నీలములు. ఈ పదముతప్ప మిగిలిన వన్నియు సులభముగా బోధ పడును. తెల్లగావిరఁబూచిన మల్లెపొదలమీద నల్లనితుమ్మెదలు వ్రాలియుండెనని పిండితార్థము. ఆ మల్లెలు, తుమ్మెదలు వసంత మను విష్ణుమూర్తి, వనమనెడి లక్ష్మీదేవిని వివాహమాడినీలములు ముత్యములు తలఁబ్రాలుగా పోసికొనిన ప్రోవాయనునట్లున్నవని యుత్ప్రేక్షించి కవి కమనీయమగు కల్పన చేసెను. ఇది "జానక్యాః కమలామలాంజలిపుటేయాః" అను శ్లోకమును జ్ఞప్తికి తెచ్చుచు న్నను, శ్రీ శాస్త్రిగారివర్ణన స్వతంత్రమై అలరారుచున్నది. వర్ణ నాంశము వేరైనను సీతారాముల తలఁబ్రాలఘట్టమిట స్ఫురింపక మానదు. వివాహసమయమున బూజంబంతి పెట్టుకొను నాచారము కలదు. ఆమనివెన్నుడు తోటలచ్చి వివాహమైనతరి బూజంబంతి పెట్టవలెనుగదా! అంతేకాదు ఆ యామని లతలకు గున్నమామిళ్లకు వివాహముచేసి, తేంట్లకు ప్రియమార గొజ్జంగి పూఁదేనె విందు గావించెనట". ఆవిధముగా బూజంబంతి సాగించినట్లు పూర్వచిత్తి చెలి పల్కుచున్నది.

మ. చెలియా! యమామని పేవకూనఙకం జెల్వొందు లేమావిగు
న్నలకుంగూరిమి బెండ్లిచేసి యిదె చెంతం బొల్చు గోజ్జంగి పూ
వులలో బుజ్జవమూరఁ దేటుల కిడుఁ జోనంబుఁ బూజంపుబం
తులు సాగించుచుఁ జూడుమంచుకత యెంతో సంతసంబందెడున్.

ప్రశంసనీయమగు వర్ణన మిది. అచ్చతెనుగుకూర్పు యెంత మనోజ్ఞముగా నుండునో శ్రీ శాస్త్రిగారు తెల్పిరి. వీరేవర్ణన చేసినను హృద్యముగా నుండును. 2ఆ. ౧౩ పద్యమున హారిణశాబకమును దృశ్యమాన మొనరించినాడు కవి. లేడిపిల్ల మూడుకాళ్లపై నిలిచి మోమటు త్రిప్పి వెనుకకాలి గొరిజ పైకెత్తి కన్ను గోకికొనుట కన్నులపండువుగా నున్నదికదా! కాళిదాసు "గ్రీవాభంగాభిరామం" ప్రభావముగల పద్యము మరియొకటి గలదు.

ఉ. సోయగమేర్పడన్నిలిచి చూచుచు మేనుఁగదల్పకున్నచోఁ
బాయక చెంతఁ జేరి కనువారును నిక్కమెఱుంగలేక మేల్
చాయనెసంగు సొన్నమున సల్పిన రూపిది ముట్టెయుం గనుం
దోయియు వేల్పురాఅవలతో నగుసంచుఁ దలంతు రెంతయున్.

నిశ్చలమైనిలిచిన, మేలిమిబంగారముతో నాలేడి చేయబడి యుండుననియు, మెరయుచున్నముట్టె, కన్నులు దేవతాసంబంధమైన మణులతో చేసియుండురనియు చూచువారు భ్రాంతిపడిరట! శాస్త్రిగారే వర్ణనచేసినను నిట్లే నవ్యతతో నలరారుచుండునుగాని, ప్రాఁతపద్యభావమునే తిరిగి క్రొత్తపదములతో కూర్చినట్లుండదు. వీరు శ్రీకారముతో కావ్యమారంభించుచు "ఆదితశ్శ్రీశబ్దప్రయోగాద్వర్ణగణాది శుద్ధేరభ్యుదయశ్చ" యనుటచేత తాము శ్రీకారముతో ప్రారంభించితిమని తెల్పిరి. శ్రీకారము అచ్చతెనుగుకాదను విమర్శ కల్గుటకుముందే శాస్త్రిగారిట్లు వివరించిరి. శాస్త్రిగారు తొలిపలుకులో చెప్పినట్లు పూర్వులవలె తద్భవ, అన్యదేశ్యాది పదము

లతో నీయచ్చ తెనుఁగుకావ్య మల్లబడెను. ప్రజలు, దైవము,సంధ్య, స్నానము, స్వర్ణము మొదలగు పదములకు వాని వికృతరూపములు ప్రయోగింపబడెను. అచ్చటచ్చట పదకల్పనము కలదు. మందర పర్వతము కవ్వపుకొండగా, పుత్రులు-పుత్తురులుగా రూపాంతరమొందుట నీ కావ్యమున గమనింపవచ్చును. మహారాజావారే కేశ్వరుని పాసింతురనుటకు కవి "ఒక్క బమ్మను గొల్చుచుండెడివాడు" అని ప్రయోగింపబడెను. తద్భవాది పదరహితముగా పూర్తి దేశ్యపదముల కూర్పునిందు కలదు. భరతుని మరణమిట్లు వర్ణింపబడెను.

ఉ. కండెను గాజువాతెను మొగంబు కనుంగవ, కంసలోయనం
 గ్రిందికిఁ బానవలెఁ గ్రీఁగడుపయ్యెను మూయరాక నోర్
 కందకమట్లు కానఁబడె, గాళ్లును జేతులుఁగొయ్యలయ్యె మే
 నందుగుర్రమాఁకురానా బిగిసె నాతనిలో నుసురేగినంతటన్.

"క్రీఁగంటం గనంబోరమో", "కన్నుబండువై" "తేట తెల్లమా", "వాకిటఁగ్రిక్కిరియఁగ," "జట్టువికాళ్లు జారిపడులాగునఁ గాలువగట్టె" "పడరానిపాట్లు పడియె," ఇత్యాది తెలుఁగు నానుడు లేకాక, "దునియాఁమె నహిరాజ" యనుహిందీనానుడి నిందుగలదు. "స్లైపుమిషనువంటి యాంగ్ల పదములు నిందుగలవు. ఇట్లు కమనీయ మగు వర్ణనలతో, ఆహ్లాదకరమైన తెలుగు నానుడులతో, అలఁతి యలఁతి అచ్చ తెనుఁగు పదములకూర్పుతో "బ్రహ్మానందము" బ్రహ్మానందము కలిగించును

**2. భక్తజన మనోరంజనము** : మహారాజావారి "శునక పర్యవేక్షకుడు" శ్రీ దాసరి లక్ష్మణస్వామి "అచట పుట్టిన చిగురు కొమ్మైనచేవ"యను మాట సార్థకముచేయుచు పీఠికాపుర సంస్థానా శ్రితుడగుట కవియయ్యెను. లక్ష్మణ కవి కృతమగు భక్తమనోరంజనము 1919లో పిఠాపుర విద్వజ్జన మనోరంజన ముద్రాశాలయందు

ముద్రితమయ్యెను. రాజా గంగాధరరామారావుగారి మైదవరాణి శ్రీమతి రాణీభావయాంబ కిది యంకితము. ఇందు నలుబది భగవత్కీర్తనలు గలవు. ఇవి తొలుత "ధర్మసాధన"లో ప్రకటింపబడెను. ఆ కీర్తనలకు శ్రీ తుమురాడ సంగమేశ్వరశాస్త్రి రాగతాళములు నిర్ణయించిరి. బిలహరి, జింగ్లా, బేహాగ్, హిందూస్థాని భైరవి, శహానా, ఖరహరప్రియ, శంకరాభరణము, జంఝూటి, భైరవి, ఫీల్వా, ముఖారి, సింధు, కమాచ్, నాదనామక్రియ, సురట, హిందూస్థాని కాఫీ, మాండు, శ్రీకన్నడరాగములు దీనికి నిర్ణయింపబడెను. కొన్నికీర్తనలు స్వరసహితముగా నుండెను.

కమాచ్ రాగం ఏకతాళం:

ఎంతని మా చింతల విన్నవింతు మీశ్వరా!
పంతమేల నీదు సుతుల, వంతదీర్పరా.

కవి తన కష్టసుఖములు భగవంతునికి విన్నవించుకొనుచు, అపరాధములు సైపుమని దైన్యముగా ప్రార్థించును; విన్నపమాలింపుమని స్వామిని వేడుకొనును; దరిశనమియ్యగదే యని పలవించును; "కనుగొన లోకేశ్వరుఁడొక్కఁడె యని ఘనముగ నెంచవె మనసా" యనును. ప్రతికీర్తన లలితమైనశైలిలో, కవిహృదయమును స్పష్టముగా నావిష్కరించుచు, ఆర్తిని తెల్పుచు ద్రాక్షాపాకముతో నలరారుచుండును. చివరికీర్తన సంస్కృతమున రచింపబడెను.

40. సురటరాగం-చాపుతాళం :

1. సత్యస్వరూపాయ సకల సౌఖ్యదాయ
మంగళం శుభమంగళం
నిఖిలానురాగాయ నిఖిల సజ్జనగేయ ॥మం॥
2. కైవల్యనాథాయ దేవాధిదేవాయ
భావాతీత పరబ్రహ్మస్వరూపాయ ॥మం॥

ఇవిగాక చివర ఉదయ, సాయంకాల, భోజనసమయ వందనములు సర్వదాపఠింపదగినపద్యములు మొత్తము నాల్గుపద్యములిందు గలవు.

3. అమృతకలశము : ఈ చిన్నిపొత్తము దాసరి లక్ష్మణ కవి రచియించి 1941 సం॥న పిఠాపురము శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాలయందు ముద్రితమైన యేబదియారు పద్యముల కావ్యము. లక్ష్మణకవి యీ కృతిని మహారాణీ చిన్నమాంబాదేవి కంకితమిచ్చెను.

సీ. స్థిరయశోనిధి పీఠపురనాధుడౌ సూర్య
ధరణీతలేంద్రుని ధర్మపత్ని
ఆణిముత్తెములంచు నభినుతిఁగని మించు
నార్వురుబిడ్డల యనుఁగుఁ దల్లి
అమల వెంకటరంగయ్యప్పరావ్వాభిమాశ
నారయాంబికలకుఁ గూరిమి సుత
శ్రీమహయ్యార్య పురీధరారమణారమణాది
జనవల్లభుల సహజన్మురాలు
స్వర్గనిలయ సుశీల విశాలహృదయ
వినుతగుణవల్లి మాదు ప్రభ్వీమతల్లి
శిష్టమార్గావలంబ శ్రీ చిన్నమాంబ
కమృతకలశమర్పించెద నమితభక్తి.

నలుబదియెన్మిదిపద్యములలో దేవదేవుడు స్తుతియింపబడెను. 49 వ పద్యము సీసమాలిక. ఇందు కవి, దీనపోషకశతకము, విజయ విలాసనాటకము, భర్తృహరిప్రబోధము, వర్ణనరత్నాకరము, నీతి పద్యరత్నాకరము, నాల్గుభాషల నిఘంటువు, లుబ్ధధనావస్థ, భక్తి కీర్తనలు, స్వీయచరిత్ర, చాటువులు, వ్యాసములు, నీతికథలు, సీతా

విజయము, ముక్తిసాధనము అను గ్రంథములను భగవత్కటాక్ష మున రచియించితినని చెప్పెను. 51వ పద్యమున స్వవిషయము తెల్పెను. 55న అమృతకలశము చనివినందులకు ఫలశ్రుతి వ్రాసెను. మొత్తముమీద నివియన్నియు భక్తిరసపూరితములై, రసగుళికలై లలితమైనశైలితో, భావగాంభీర్యముతో నలరారుచున్నవి.

4. వర్ణనరత్నాకరము : లక్ష్మణకవి ఈ సంకలనగ్రంథమును మహారాజావారి కంకితమిచ్చెను. ఒకటి, రెండు భాగములు క్రీ॥ శ॥ 1926లో పిఠాపురము విద్వజ్జనమనోరంజనీ ముద్రాక్షరశాలయందు ముద్రితమయ్యెను. 3, 4 భాగములు 1930లోను ముద్రింపబడెను. నన్నయమొదలు వీరేశలింగకవి వరకుగల గ్రంథములన్నిటిని కూలం కషముగా చదివి, వర్ణనలను చక్కగా నేర్చికూర్చిన కవి నేర్పు, ఓర్పు ప్రశంసనీయములు. అమితకష్టసాధ్యమైన ఈ గ్రంథము పరి శోధకులకు మిగుల నుపయోగకారియగును. కవి తొలుత కవులు రచి యించిన గ్రంథములు, వారిపేర్లు, వారేశతాబ్దమున జన్మించిరో యను విషయము మూడు వరుసలలో నొకపట్టికగా నిచ్చెను. తరు వాత వర్ణనాంశములను అకారాదిక్రమమున కూర్చెను. ఉదా : అంగళ్ళ-వీధులు, అడవిపందులు, అద్భుతరసము, అనపత్యత, అను రూపదాంపత్యము, అన్నసత్రము ఇత్యాదిగా వర్ణనలు కూర్పబడెను. అంగళ్ళవర్ణన, విక్రమసేనము, ఆముక్తమాల్యద, కవికర్ణరసాయ నము, షట్చక్రవర్తిచరిత్ర, చెన్నపురీవిలాసము, భద్రాపరిణయము లలో కలదు. కనుక నాయాకావ్యముల పద్యముఁను కవి క్రమ ముగా నుదహరించెను. కవులు భిన్నమార్గములలో చేసిన వర్ణనలను స్వీకరించుచు, పూర్వగ్రంథానుసరణములనుమాత్రము లక్ష్మణకవి విడిచెను. ఉత్తమవర్ణనలనుకూర్చుట కుదాహరణ :

శ్రీకారము : క. శ్రీకారము శుభకరమగు
శ్రీకారము సకలకార్యసిద్ధినొసంగున్

శ్రీకారము గీర్తిదము సు
శ్రీకారము గృతులనాదిఁజేకూర్పదగున్.
(చాటుధార)

ఇట్లే యితరకవులనుండి శ్రీకారవర్ణనలు స్వీకరింపబడెను. విద్వత్కవి వరేణ్యులు శతావధానులు నగు ఓలేటి వెంకటరామ శాస్త్రిగారు,

గీ. ఆంధ్రకావ్యప్రపంచంబునందుఁ గల్గు
వర్ణనములెల్ల నలయంగవలయునన్న
నరయఁగావలయు నీదు రత్నాకరమున
గరతల సమర్పితామలకంబు పగిది.

గీ. తెలుఁగుబాసను బెంపునొందింపజేయ
వలయుపనులెన్నొయున్నవి వానిలోన
నొకటిగావించి నీవు ధన్యుండవైతి
సూక్ష్మబుద్ధివి దాసరి లక్ష్మణకవి.

అని లక్ష్మణకవిని ప్రశంసించిరి. నిజముగా నీవర్ణన రత్నాకరము సాహిత్యపఠనాసక్తులకు కరతలామలకమే. లక్ష్మణకవి క్రీ॥ శ॥ 1-4-1889న జన్మించి, 1965 జనవరిలో మరణించెను.

**5. శ్రీరామజననము** : ఓలేటి పార్వతీశకవి అనుజులు ఓలేటి భాస్కరరామమూర్తిగారు 'శ్రీరామ జననము' నాటకము ప్రభు కుమారసంభవోత్సవమునకు రచియించితినని తెల్పిరి. ఐదంకముల యీనాటకము కాకినాడ శ్రీపతిముద్రణాలయమున 1943లో ముద్రింపబడి 'శ్రీ వేంకటపార్వతీశ గ్రంథమాల ప్రొప్రయిటరు' ఓలేటి అచ్యుత రామచంద్రమూర్తిగారిచేత ప్రచురింపబడెను. భాస్కరరామమూర్తిగారి కృతిని 1910కి పూర్వమే రచియించి, మహారాజావారి ప్రథమ పుత్రులు శ్రీ గంగాధర రామారావుగారు జన్మించిన సమయమున, 1910లో మహారాజావారి కంకితముచేసిరి. నాటకారంభమునచేసిన

ప్రభుస్తుతిలో సూర్యనామసామ్యముచేత మహారాజావారికి సూర్యునికి గలభేదములను పరిశీలించి, సూర్యునికంటె సూర్యారావుగారే ఉన్నతులని చెప్పుట కవిప్రభుభక్తికి, సూక్ష్మపరిశీలనకు తార్కాణము.

సీ॥ జీవనంబు హరించి చింత గూర్చు నతండు
జీవనం బిచ్చి రక్షించు నితఁడు
సరసుల మాయించు సతతంబు నతండు
సరసుల నలరించు స్వామి యితఁడు
సత్పథంబుననుండి జనులనేచు నతండు
సత్పథంబునఁ బ్రజసాఁకు నితఁడు
ఘనులెదురైనచో వెనుకఁజేరు నతండు
ఘనుని ముందరఁ బేరుఁగను నితండు
ఆదిదేవుఁడంతర్వీధి నమరి యుంట
నిరువురును సరియనఁదగునేమొ కాని
యుగ్రుఁడగు సూర్యుఁడెటులైన నుద్దియగునె
శాంతమూర్తి యీసూర్యభూకాంతు తోడ.

జీవనము, సరసులు, సత్పథము, ఘనులు అనుపదములు శ్లేషింపబడెను. ఘనులనగా సూర్యునిపరముగా మేఘములు. సూర్యుడు మేఘముల మాటున నుండును. ఘనులనగా గొప్పవారని మహారాజ పరమైన యర్థము. ఉన్నతులయెదుట మహారాజు పేరు గాంతురు. ఇట్లే మిగిలిన పాదములును.

కథ : లక్ష్మీనారాయణులు తమ ఔన్నత్యమును గురించి వాదించుకొనుచు, దేవతల కోర్కెపై రావణవధార్థము దశరథ తనయుడుగా నారాయణుడు, మైథిలిగా లక్ష్మియు నవతరించుటకు నిశ్చయించుకొనిన కథ ప్రథమాంకమున కలదు. రెండవయంకమున, రోమపాదుడు తన రాజ్యమున క్షామము నివారించుటకు అలౌకికుడు సత్య

సంధుడునగు ఋష్యశృంగుడు సమర్థుడని యెంచి,అతనినిరప్పించుటకు మధురయను వేశ్యను విభండకు నాశ్రమమునకు పంపగా నామె ఋష్యశృంగుని తనవిలాసముచేత వశమొనరించుకొనిన వృత్తాంత మున్నది. తృతీయాంకమున, ఋష్యశృంగుడు దేశములో నడుగిడినం తనే ఆకాశము మేఘావృతమై వర్షారంభమగుట, రోమపాదుడు సగౌరవముగా ఋష్యశృంగునాహ్వానించుట కలదు. శాంతాఋష్య శృంగులవివాహము, శాంతసాహచర్యమున ఋష్యశృంగుడు లౌకిక జ్ఞాన సంపన్నుడగుట మొదలగు వృత్తాంతముకలదు. చతుర్థాంకమున లలితాసుమతులు కౌసల్యాదశరథులవేషము ధరించుట,వారుసంతాన రాహిత్యమునకు పరితాపమందుట మొదలగురూపకాంశములనుజూచి ఋష్యశృంగుడు జాలిపడి,తనతపశ్శక్తిని ధారపోసి వారికిసంతానము కలుగునట్లు చేయుదుననుట, అతడు కౌసల్యాదశరథులే శాంతాదేవి జననీజనకులని తెలిసికొనుట, దశరథుడు పుత్రకామేష్టి చేయుటవలన పుత్రులను బడయగలడని ఋష్యశృంగుడు చెప్పుట, కలదు. పంచ మాంకమున, శ్రీరామజననము, నారదుడువచ్చి భగవంతుడవతరిం చెనని యానందించుట, ఋష్యశృంగుడచటికి వచ్చినంతనే దశరథు డతనిని కౌగిలించుకొని, తనసంతోషము తెల్పుట, ఋష్యశృంగుడు రామాదుల జాతకములు వ్రాయుటతో పంచమాంక ఇతివృత్తము, రూపకము సమాప్తమగును.

"శ్రీరామజననము" నాటకమున ప్రాచీన నాటక లక్షణము లన్నియు గలవు. నాందీ, ప్రస్తావనకలిగి, నాటకమైదంకములుగా విభజింపబడి,విష్కంభాది అర్థోపక్షేపకములు, పంచసంధులు, భరత వాక్యములతో సహా నిది సర్వనాటక లక్షణములను గల్గియున్నది. నాంది యందాశీర్నమస్క్రియా కథావస్తు నిర్దేశములతోపాటు,కవి భాస్కరరామమూర్తిగారి పేరు సూచింపబడెను. పంచమాంకమున ఋష్యశృంగుడు రామ జాతకము సక్షేపముగా తెల్పుచు

క. పరధర్మజ్ఞుఁడు భయగతి
నిరుపమమై యమరరాజనియతిని గంగా
ధరరామరాజ నందనుఁ
డురుగుణ సంతతుల నొప్పుచుండు సతతంబుల్.

అని యువరాజు శ్రీ గంగాధరరామారావుగారి పేరును కలిపి చెప్పుట కవికి ప్రభుపుత్రునిపట్లగల భక్తి, అనురాగములకు దార్కాణముగా భావింపనగును. ఈ నాటకమున సంభాషణలు ప్రధానముగా వచనములో నున్నను, 84 పద్యములును గలవు. ఒకశ్లోకము,మూఁడు పాటలు గలవు. ఇందలిశైలి లలితమైయొప్పుచున్నది. ఋష్యశృంగుడు మధురతో "నూనూఁగు మీసంబు గానుపింపదుసఖా, మీ యాశ్రమపాపథ మాయయేమొ!" ఇత్యాదిగా పల్కుటలో నాతని అమాయకత వ్యక్తమగును. లలితమైనపదముల కూర్పిందు గలదు. లలితకవులైన ఓలేటి పార్వతీశముగారి యనుజులు శ్రీ భాస్కర రామమూర్తిగారును లలితకవులే యనిపించునట్లీరచన సాగెను. ఇందలి అంతర్నాటకము "అనపత్యదాంపత్యము" వాల్మీకముకంటె భిన్నమై, ఉత్తరరామచరిత్రలోని అంతర్నాటకమును దలపింపజేయుచున్నది. శాంతగంభీరహృదయయగు శాంత తన తల్లిదండ్రులకు పుత్రసంతానప్రాప్తికలిగించుమని పతిని నోరువిప్పి యడుగకయే దశరథుని స్థితిని కన్నులకుకట్టించునట్లు అంతర్నాటకమువ్రాసి ప్రదర్శింపజేసి చూపెను. కరుణోద్దీపకములగు కౌసల్యాదశరథులవాక్కులువిని నంతనే సహజముగా జాలిగుండెగల ఋష్యశృంగుడు మరింత కరుణార్ద్రహృదయుడై, ఆ పుణ్యదంపతులకొరకు పుత్రకామేష్టి చేయ సంకల్పించెను. ఇట్లు శాంత రచియించిన అంతర్నాటకము ఫలించెను. ఈనాటకమున ప్రథమాంక ప్రారంభమందలి లక్ష్మీనారాయణ సంవాదమున నారాయణుఁడు. లక్ష్మీదేవి కటాక్షమున సోకిన వాని

కన్నులు నెత్తికెక్కునని, ఆమెపల్కు చెవిని బడినంతనే శివమెత్తి నట్లు చెవుడు ప్రాప్తించునని, లక్ష్మీదేవిసమీపమునకు వచ్చుచుండ గనే గర్వముపెరిగి, మతిమరపు తోచునని, ఆమెదయ అధికమైనం తనే పొగరెక్కి తల బిఱ్ఱబిగియునని, లక్ష్మీదేవి మనుజుల మేలు కోరి చేరగా, నది యాతనికి కీడగుచుండుటకు ఆమె చాంచల్యమే కారణమని, పల్కినపల్కులు యథార్థము. నారాయణుడట్లు హేళన చేయగా లక్ష్మీదేవి, ఐశ్వర్యవంతులు కళాశాలలనిర్మించి, వికలాం గులకు, పేదలకు, బాటసారులకు, అన్నసత్రములుస్థాపించి. అబలలకు జీవనాధారముకల్గించి, పేదసాదలకు సహాయపడుట వారు చేయదగిన పను లని చెప్పెను. కవి అవకాశమున్నంతలో తనకాలమునాటి సాం ఘిక పరిస్థితులు వర్ణించెను. జనులు జాతివైరములకులోనై, దురాచా రములపాలై, అసూయాపిశాచములచే పీడింపబడి ఇహపరములకు దూరమగుచుండు.

ఈ నాటకమున ప్రతిఘట్టము దృశ్యమానమగుటలో కవినేర్పు కనిపించును. మధురా ఋష్యశృంగులసంభాషణమున హాస్యరసము చిప్పిలుచుండును. అంతర్నాటకము తిలకించుచు శాంతాఋష్య శృంగులు చేసిన సంభాషణ ప్రేక్షకులకు ఉత్సుకత కలిగించును. ఇట్లీ శ్రీరామజననము నాటకము తొలిపుటనుండి తుదివరకు నిరాఘాట ముగా పఠితలచేత చదివింపజేయు ఉత్తమనాటిక.

బ్రహ్మర్షిరఘుపతి వేంకటరత్నం జీవితసంగ్రహం- ఉపదే శాలు- కథలు : ఈగ్రంథము డా. రఘుపతి వెంకటరత్నం నాయుడు శతజయంతి ఉత్సవసంఘమువారిచే 1970లో ప్రకటితమయ్యెను. 107 పుటల ఈగ్రంథము ఐదువ్యాసముల సంకలనముగా కూర్పబడి, నాయుడుగారి శిష్యులు పిఠాపురం మహారాజు సూర్యారావు బహ

ద్దరు వారికి, వారి ధర్మపత్ని మహారాణీ రావు చిన్నమాంబాదేవి పుణ్యదంపతుల దివ్యాత్మలకు అంకితమీయబడెను. ఇందు బ్రహ్మర్షి జీవితసంగ్రహము 15 పుటలలో శ్రీ తారకం బ్రహ్మర్షి పసంగములు-ఉపదేశములు 44 పుటలలో శ్రీ ఎమ్. ఎర్. అప్పారావు, బ్రహ్మర్షిపరతత్త్వకథా కథనసుధాస్రవంతి 12పుటలలో శ్రీ తారకం, శ్రీ ఓలేటి శ్రీరామచంద్రమూర్తి, బ్రహ్మర్షిగాథలు 14 పుటలలో శ్రీ తారకం, రత్నహారం 23పుటలలో శ్రీ వేంకటపార్వతీశ్వరకవులు రచియించిరి. ఈ సంకలన గ్రంథమున నాయుడుగారి ఉపన్యాసాలు ఉపదేశాలు అను వ్యాసమున శ్రీ ఎమ్. ఎర్. అప్పారావుగారు నాయుడుగారేయే విషయములలో అభ్యుదయమును సాధించిరో అతి క్లుప్తముగను, అతివిస్తృతముగను వివరించిరి. ఇందు సాంఘిక పవిత్రత, మద్యపానము, ప్రేమమార్గం, మహిళాభ్యుదయం, అనాథలు-అస్పృశ్యులు, విద్యవిజ్ఞానం, జీవం-శివం, వివాహఅనుష్ఠానం, ఓం! జయవిశ్వపిత! భగవాన్! దయానిధి! ఆరాధన, ధన్యవాదసమర్పణ మతము ఆరాధన అను విభాగములలో అప్పారావుగారు నాయుడుగారి భావములను యథాతథముగా నావిష్కరించిరి. చివరిపుటలలో 'పంతులుగారు- నాయుడుగారు' అనుశీర్షికలో శ్రీ వీరేశలింగం రఘుపతి వేంకటరత్నంగార్ల భేదసాదృశాలు చక్కగా వివరింపబడెను. "బాహ్యప్రకృతిని బట్టిచూస్తే నాయుడుగారు పంతులుగారు విరోధిగ్రహాలలాగ ఉండేవారు. ఆంతరంగికదృష్టితో పరిశీలిస్తే ఇద్దరూ ఒక్కపీఠందగ్గరే ఆరాధకులు బ్రహ్మోపాసకులు," పంతులుగారు మార్తాండ తేజము నాయుడుగారు దివ్యజ్యోత్స్న, పంతులుగారు ఝంఝామారుతము, నాయుడుగారు మలయవాచిక, పంతులుగారు పరిశుద్ధఆస్తికవిశ్వాసి, నాయడుగారు కృపాభిక్షుకొరకునిరంతర ఆరాధకులు". 106, 107, పుటలు. ఈరీతిగానిరువురి స్వభావములలో తారతమ్యమున్నను గమ్యమొక్కటేయని చక్కగా వివరింపబడెను.

విజయేంద్ర విజయము : ఈ ప్రబంధము ఆదిపూడి సోమనాథకవికృతము. ఇదిమహారాజావారి కంకితము. ఆదిపూడివారి యితరరచనలు, జపానుయాత్ర, దయానందుల చరిత్ర-వచనములు, కృష్ణదేవరాయచరిత్ర, ఆంధ్రరఘువంశము, సర్వమాన్యశతకము, లోకపావనశతకము, గీతాంజలి, రామమోహననాటకము మున్నగునవి. సోమనాథకవి పిఠాపురము సంస్థానమున "రికార్డుకీపరు" గా నుండిరని ఆధునిక కవిజీవితములు గ్రంథమున గలదు. కాని కవి కుమార్తె శ్రీమతి తెలికిచెర్ల వసుంధరాదేవి పిఠాపురము ఆస్థానములో మానాయనగారు హరికథలు చెప్పేవారు. వారు హరికథల ద్వారా ప్రజలలో చైతన్యముకలిగించి శిశుపోషణ మాతృసంరక్షణ స్త్రీవిద్య మొదలగువాటి గురించి హరికథలో ప్రస్తావించేవారు. సంఘములోని దురాచారములు నిర్మూలించుటకు హరికథలుపయోగించేవారు. సత్యహరిశ్చంద్ర, సావిత్రీసత్యవంతము, రామాయణము, రామమోహనరాయలచరిత్ర హరికథలుగా చెప్పేవారు. దయాకర విజయమను పేరిట తాము కల్పించిన కథను హరికథగా చెప్పేవారు. వారికాలములో ఆంధ్రదేశములోవారి నెరుగనివారు లేరు" అని తమ లేఖలో ఉటంకించిరి. శ్రీసోమనాథకవి బ్రహ్మమతావలంబి. సంఘ దురాచారముల నిర్మూలించు ధ్యేయముతో వీరీగ్రంథము వ్రాసిరి. విజయేంద్రవిజయము 383పద్యములు నాలుగాశ్వాసములలోగల 72 పుటల చిన్నికావ్యము. ఇది 1911లో కాకినాడ సుజనరంజనీ ముద్రాక్షరశాలయందు ముద్రితమయ్యెను. పిఠాపురం మహారాజావారు నూతనముగా ప్రవేశపెట్టిన ప్రబంధముల పోటీ నిమిత్తము వారీ కావ్యము వ్రాసినను సమయమునకు పంపించలేదు. కావ్యమును మహారాజావారి కంకితమిచ్చిరి. 1వ ఆ. 6పద్యమున "దీనసంతాపశమన ప్రహసనదంబ, సూర్యరాయా! పిఠాపురీ శుభఫలంబ!" అని సంబోధించి, కృతిపతిగా సంభావించి కవి కావ్యారంభము చేసెను.

**కథ** : పాటలీపుత్రప్రభువు మందారునికి రాణి సర్వమంగళకు హర్షలత యను సుత ఉదయించెను. తరువాత మూడుమాసములకు సర్వమంగళ మరణించగా, మందారుడు సోదరి భద్ర సహాయమున కుమార్తె నల్లారుముద్దుగా పెంచుచుండెను. భద్ర సత్యవాదుడను రాజును వలచి, అతడొకయుద్ధమున మరణింపగా నామె బ్రహ్మచర్య మవలంబించెను. కళింగాధిపతి భద్రను వివాహమాడుదుమని వార్త పంపెను. మందారుడెంత ప్రయత్నించినను భద్ర ఆతనిని పరిణయమాడ నంగీకరింపలేదు. సోదరుని ఆగ్రహమునకుగురియై భద్ర స్వదేశమునుండి మాళవదేశమున కరిగెను. పరమేశ్వరభక్తుడగు మాళవాధిపతి యామె కాశ్రయమిచ్చెను. మాళవాధిపతి ధర్మపాలుడు తన సార్వభౌమత్వమునులెక్కింపక భద్ర కాశ్రయమిచ్చుట సహింపలేని మందారుడు భద్రను తనకు అప్పగింపుమని ధర్మపాలునికి కబురుచేసెను. ఆశ్రయమిచ్చినతరువాత తిరిగిఅర్పించుటధర్మము కాదని ధర్మపాలు డందులకంగీకరింపలేదు. మందారుడు కుపితుడై మాళవముపై దండెత్తి ధర్మపాలుని బంధించెను. ధర్మపాలుని సతి సరళ, పదునాలేండ్లపుత్రుడు విజయేంద్రుని, భద్రను తీసికొని హారావళీపర్వతప్రాంతమునకు వెడలిపోయెను. భద్రకై రాజమందిరమున వెదకిన మందారు డాగ్రహమున ప్రజలను క్రూరముగా శాసింపదొడగెను. మందారునిపుత్రి హర్షలత, అశోకునివలె ప్రవర్తించి తన మేనత్తను మన్నింపుమని తండ్రినివేడగా నతడు సుముఖుడైనను భద్రజాడ వారికి తెలియలేదు.

గ్రామములో వ్యాఘ్రబాధ మిక్కుటమయ్యెనని తెలిసి హర్షలతామందారులు వేటకై అరణ్యమునకు వెడలిరి. హర్షలత వేటాడుచు నొంటరిగా దూరమేగి, తనయశ్వము పులినిచూచి భయపడి క్రిందికిత్రోయగా నామె మూర్ఛిల్లెను. అశ్వ మామాసమున

కూలబడెను. పులి అశ్వమును నోళ్ళనొక్కిపట్టి రక్తపానముచేయుచుం డెను. తల్లిశిక్షణలో పెరుగడైన విజయేంద్రుడు తల్లి ప్రబోధమున తండ్రిని చెఱనుండి విడిపించుటకు అరణ్యమార్గముగ వెడలుచు, వివశయైన హర్షలతను, గుఱ్ఱమునెక్కు సుద్దాపుడుగ పులినిచూచి పులిని సంహరించెను. తదుపరి యతడు సుశీలాభద్రలను తోడ్కొనివచ్చెను. వారిరువురు హర్షలతనుదీసికొని నిజనివాసమునకరిగిరి. విజయేంద్రుడు తన మేనమామయగు వంగదేశాధిపతి సహాయార్థ మచటి కేగెను. భద్ర హర్షలతను గుర్తించి తగినజాగరూకతతో కాపాడుచుండెను. హర్షలత జాడ కనరాక మందారుడు దురపిల్లుచు పాటలీపుత్రమున కరిగెను.

మేనమామశౌరితో కలసి చక్రవర్తిపై దండెత్తిన విజయేంద్రుని విజయలక్ష్మి వరించెను. యుద్ధమధ్యమున బంధితుడైన వంగదేశాధిపతిని, తండ్రి ధర్మపాలుని విజయేంద్రుడు కారాగృహముక్తులను గావించెను. విజయేంద్రునివలన భద్రవృత్తాంతము విని మందారుడు భద్రా సరళా హర్షలతలకు పల్లకీల నంపెను. వారు వచ్చిన పిమ్మట మందారు డమందానందమంది హర్షలతను విజయేంద్రున కిచ్చి వివాహము గావించెను.

ఇందలి కథాగమనము నవలాకావ్యమనుటకు తగియున్నది. ఇదియొక నవ్యత. ప్రాచీనప్రబంధములలోవలె అష్టాదశవర్ణన లిందు లేవుగాని సమయోచితమైన వర్ణనలు కలవు. భారతదేశ (1ఆ. 9), పాటలీపుత్ర (1ఆ. 11), హారావళీపర్వత (2ఆ. 105–107), శ్యామలానదీ (2ఆ. 101), అరణ్య (3ఆ.32–35), సూర్యోదయ (4ఆ.87), సూర్యాస్తమయ (2ఆ. 60), వేగుచుక్క (ఆ. 69, 70) వర్ణనలు, రాజరాజ్ఞీ (1ఆ. 10, 12), కన్యాంగ సౌందర్యవిద్యాది వర్ణనలు (3ఆ. 4–6), విజయేంద్రవర్ణన (3ఆ. 53), యుద్ధవర్ణన (2ఆ.49–59,

4ఆ. 43-53) ఇందు గలవు. కావ్యములందు పురవర్ణన సామాన్యమే కాని భ్రాంత దేశమును వర్ణించుటలో కవి జాతీయాభిమానము ప్రస్ఫుట మగుచుండెను. ఈ వర్ణన లన్నియు కవి వర్ణనాచమత్కృతిని తేట పరచును. వేటవర్ణనమున ఆరుఋతువుల నిముడ్చుట కమనీయముగ నున్నది. వనలక్ష్మి నొక కాంతగను ఆరుఋతువు లామెచర్యలుగను వర్ణింపబడెను.

సీ. ఒడలినెంతయు వడగాలి సోకుచు
దుమ్ముపైఁ గ్రమ్మ గ్రీష్మమ్మునందుఁ
గాన నభ్యంగస్నానము నొనరించె
వనలక్ష్మి చక్కగా వర్షమందు
నెమ్మితోఁగూర్చుండి నీరెండలోపలఁ
దడి యార్చుకొనె శరత్సమయమందు
గమగమవాసనల్ గ్రమ్ముచుండెడునట్లు
హిమకాలమందు ధూపమునుబట్టెఁ

గీ. దలను నంటినపొట్టు దులిపి దులిపియు
చిక్కు లెడలించుకొనియెను శిశిరమందు
నెల్లనగలనుదాల్చి సర్వేశుకరుణ
నెంత మెఱసెనో కనుఁడీ వసంతమందు.

వనలక్ష్మి గ్రీష్మమున వడగాలిసోకి దుమ్ము శరీరమున గ్రమ్ము కొనుటచే వర్షసమయమున అభ్యంగన మాచరించెనట. అభ్యంగన స్నానమువలన కేశములు తడిగానుండునుగాన శరత్సమయమందు నీరెండలో తడియార్చుకొనెను. హేమంతకాలమున పొగమంచనెడి ధూపమును సువాసన వెదజల్లుటకు పట్టెను. శిశిరఋతువు ఆకురాల్చు కాలము గనుక, తలనంటిన ఆకులనెడి పొట్టునుదులిపి చిక్కు లెడ లించుకొనెను. వసంతమున తరులతాదులు సుమభరితములై యొప్పెను.

కాన వనలక్ష్మి సుమములను నగలనుదాల్చి ప్రకాశించుచుండెనని ఆదిపూడి సోమనాథకవి చేసిన వర్ణనమంతయు మనోహరముగా, సాలంకారముగా ప్రాచీన నవీనతలను సంతరించుకొనెను. ఆ సందర్భమునందే గుండ్రముగానున్నభూమి విశ్వేశుని మందిరమున గల గుండ్రనిబల్ల అనియు, వసంతుడను తోటమాలి ఆ బల్లపై నలంకరించిన పుష్పగుచ్ఛమువలె వనము కలదని కవిచేసిన వర్ణన ఆధునికమై అలరారుచుండెను. అత్యంత ఆధునికమైన యుపమాన మిది. మరియొక నూత్నమైన యుపమాన మిందు కలదు.

తే. అంతనాయస్తగిరి యను నరుగుమీద
సౌమ్యభావమ్ము పూని యీజగతి కెల్ల
శాంతిపాఠమ్ము సంగెడు సాధువోలె
భాసిలుచునుండె నాలోకబాంధవుండు.

సాయంసమయమున సూర్యుడు కాషాయరంగుతో ప్రకాశించును. అప్పుడతడు శాంతిపాఠములను బోధించు సాధువువలె నుండి, అస్తగిరి యను అరుగుమీద కూర్చుండెనట. పడమటికొండయనెడు అరుగు అనుట రూపకమగుచున్నది. ఇచట నీ రూపకోపమానములు వివేకానందుని శాంతిసందేశమును సూచించుచు నవ్యాతినవ్యములై నిత్యవ్యవహారమునగల అలతియలతి పదములతో భాసిల్లుచున్నవి. కావ్యమంతయు నిట్లే మధురముగా నున్నది. అచ్చటచ్చట ఆవశ్యకమగు తావుల దీర్ఘసమాసములుగల పద్యములు, పరుషమైనపదజాలము కనవచ్చును.

చ. నను నిర్వక్ర పరాక్రమక్రమచణు న్రాజన్యకోటీర నూ
తన రత్నాంశు విరాజమానపదపద్మ ద్వంద్వుఁదారేఁపెగా
కనదుగ్రాసిని నీచు కంఠతలముల్ ఖండించి మచ్ఛౌర్య సం
జనితానందము నందుఁదేలిన గదా జన్మంబు సాఫల్యమౌ.

ధర్మపాలునిపట్ల కోపించిన మందారునుయుద్ధమునకు సంసిద్ధుడగుట సూచించుటకై కవి పరాక్రమోచితములైన పదములను, దీర్ఘసమాసములను ప్రయోగించెను. ప్రాచీనకావ్యములలో నాయిక అంగాంగవర్ణనచేయుట పరిపాటి.కాని యీ కావ్యనాయిక హర్షలత ఆ తీరున వర్ణింపబడలేదు. అంతేకాక ఆమె విద్యాదివర్ణనముకూడ కలదు. నాయకుడైన విజయేంద్రుడు చక్కగా వర్ణింపబడెను. సామాన్యముగా నాయకుని విశాలమైన వక్షము, ముఖము, కన్నులు, బాహువులు, ఊరువులు వర్ణింపబడును. అదియు మిగుల నరుదుగానుండును. ఇందు, విజయేంద్రుని విశాలవక్షము వీరలక్ష్మికి నివాసమైన విపులమైన సభాస్థలి యనునట్లు, వదనము బ్రహ్మతేజస్సు కలిగి యుండుటచేత ఆ బ్రహ్మకు పీఠమైన పద్మమై యొప్పుచుండెను. ఆతని నయనములనెడు పద్మములు దయ అనెడి నాట్యరంగమై అంతులేని కాంతులనీనుచుండెను; బాహువులు శౌర్యమనెడి సముద్రమునుండి జనించిన పెద్ద అలలా యనునట్లును, వీరులుచూచియూరాయని తలంచునట్లూరువులుండెను. ఈరీతిగా నావిజయేంద్రుడు భవ్యయావనసామ్రాజ్యపట్టభద్రుడై మధ్యందిన మార్తాండునివలె విరాజిల్లుచుండెనని కవి వర్ణించెను. చక్కని యుత్ప్రేక్షలు, ఉపమాలంకారము నిందుగలవు. పోతన్నపద్యములనుబోలిన పద్యములనిందు సోమనాథకవి వ్రాయుటచేత అమ్మహాకవియెడల వీరికిగల గౌరవము వ్యక్తమగుచున్నది.

గీ. తల్లిదండ్రుల వెతఁదీర్పఁదలఁపఁడేని
దైవభక్తిని జిత్తమ్మునఁదడపఁడేని
నరుల నాడినిఁజీల్చి చెండాడఁడేనిఁ
గలుగనేటికి క్షత్రియకులమునందు.

అని విజయేంద్రునితల్లి సరళచేత కవిపలికించును. ఈ కావ్యమున వృత్తములకంటె గీతము, ఆటవెలఁది, సీసమువంటి ఛందము

లధికముగా కలవు. భద్ర పరమేశ్వరునిధ్యానించు సందర్భమున నొక చిన్న దండకము కలదు. కవి ఈ కావ్యముఖమున ధర్మమే సర్వదా ఆచరణీయమని, ధర్మమే జయించునని సందేశమిచ్చి, హితము బోధించునట్టి సాహిత్యమును మనకు పాటించిరి. న్యాయము తాత్కాలికముగా ఓడినట్లు కనిపించినను, చివరకు న్యాయమే జయించుననియు ధర్మపాలుని కథగా బోధించెను. మందాపుని చేత ధర్మపాలుడు బంధింపబడుట, సహా విజయేంద్రులు కష్టము పాలగుట ఇత్యాదులవలన న్యాయమునకు పరాజయము కలిగినట్లు కన్పించినను తుదకు సార్వభౌముడు విజయేంద్రునిచే జయింపబడి న్యాయమునకే అంతిమ విజయమను ధర్మోక్తి దృఢతరముగ నున్నది. అంతే కాక సార్వభౌము పట్టి విజయేంద్రుని ఇల్లాలయ్యెను. కనుకనే ధర్మపాలు డిట్లు పలికెను.

గీ. న్యాయమన్యాయమునకుఁ దా నణఁగినట్టు
కనఁబడినఁ బట్టిచివరకుఁగాంచు జయముఁ
గాన సహనమొందినఁ గలఁగ రెప్పుడు
ధర్మమార్గానువర్తులౌ ధరణిధవులు.

కథాంతమున కవి కృతిపతిని సంబోధించి,

గీ. ధర్మపాలుఁడవీవు నీధర్మపత్ని
యెన్న సరళయె యవ్విజయేంద్రుఁడనఁగ
నీదుపుత్రుండు గావున నిఖిలశుభము
లిచ్చి ప్రోచుత మిమ్ముఁ బరమేశ్వరుండు.

అని యాశీర్వదించెను. మహారాజావారికి దాయాదులతో రాజ్యాధికారము నిమిత్తము జరిగిన కలహమును దృష్టియందుంచుకొని కవి ఈ కావ్యము రచియించెను. సరళస్వభావముగల మహారాణి గారిట సరళగా భావింపబడిరి. ఈవిధముగా నీ నవీన నవలా ప్రబంధ

మును గమనీయమైన వర్ణనలతో చక్కని కథా సంవిధానముతో ప్రబంధ పరీక్షకు నిల్చునట్టిదిగా శ్రీ సోమనాథకవి రచియించిరి. అతిగా వర్ణించుట దివిటీతో వెదకినను కానరాదు. ఆధునిక కావ్యములోనిది యుత్తమస్థానమున నిలువదగినదని ఘంటాపథముగా చెప్పవచ్చును.

శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి రచనలు : మధునాపంతులవారు సూర్యారావు బహద్దరు ఆశ్రితులు. తూర్పుగోదావరి జిల్లా కాకినాడ తాలూకాలోని పల్లెపాలెము వీరి స్వగ్రామము. 5-3-1920వ తేదీన శ్రీమతి లక్ష్మీసత్యనారాయణ దంపతులకు జన్మించిన శాస్త్రిగారు మహేంద్రవాడ సుబ్బారాయశాస్త్రిల చెంత వ్యాకరణము, కావ్యనాటకములు అధ్యయనముచేసిరి. వీరి కవితావ్యాసంగాధ్యయనము పీఠికాపురాస్థానకవులైన ఓలేటి వేంకటరామశాస్త్రిగారి గురుత్వమున జరిగెను. శాస్త్రిగారు 1939 నుండి 41 వరకు 'ఆంధ్రి'యను సారస్వత మాసపత్రిక సంపాదకునిగను, 1941నుండి 46 వరకు శ్రీసూర్యరాయాంధ్రనిఘంటు కార్యస్థాన పండితునిగను, పనిచేసి 1946 నుండి రాజమండ్రిలో నుండిరి. వీరేశలింగ ఆస్తికోన్నత పాఠశాల ప్రధానాంధ్రాధ్యాపకునిగా పనిచేయనారంభించిరి. వీరి రచనలు ఆంధ్రపురాణము, ఆంధ్రరచయితలు, సూర్యసప్తతి, షడ్దర్శన సంగ్రహము, చరిత్రధన్యులు, బోధివృక్షము, కల్యాణతార, స్వప్నవాసవదత్తము, రత్నపాంచాలిక, పార్థివాభ్యుదయమ్ (సంస్కృతము) మొ॥నవి. శ్రీ శాస్త్రిగారు మహారాజావారి కంకితమిచ్చిన కృతులిట పరామర్శింపబడును.

1. పార్థివాభ్యుదయకావ్యమ్ ! మహారాజావారి స్మారక సంచిక యందీకావ్యము ప్రకటితమయ్యెను. షష్టిపూర్తి సంచికయందు కూడ వీరు "పార్థివషష్టిః" అను సంస్కృతకావ్యము నరువది శ్లోక

ములతో రచియించిరి. మహారాజావారు పార్థివనామసంవత్సరమున జన్మించిరి. పార్థివుండనగా రాజు. కనుక నీ పార్థివశబ్దముభయార్థము లందు ప్రయోగింపబడెను. పార్థివాభ్యుదయమున తొలుత పీఠపుర ప్రశస్తి సర్వజ్ఞసింగమహీపతి ప్రశస్తిచేయబడిన పిమ్మట శ్రీ రాజా గంగాధరరామారాయ మహారాజాసూర్యరాయలు వర్ణింపబడిరి. లలితమైన శైలితో చక్కని శబ్దార్థాలంకార శోభతో నిది యల రారుచున్నది. ఐదు సర్గలుగల యీ కావ్యమున మొదటిసర్గమున నెనిమిది శ్లోకములలో పీఠికాపురము వర్ణింపబడెను. రెండవసర్గలో పద్మనాయకకులము, సర్వజ్ఞ సింగమనీని సాహిత్యసృష్టి, శ్రీ గంగాధరరామరాయని జననము నెనిమిదిపద్యములలో వర్ణింపబడెను. తృతీయమున నెనిమిదిశ్లోకములలోగంగాధరరామారావుగారిసాహిత్య సేవ వితరణాదులు, ఆస్థానకవిపండితులు, సూర్యారావుగారి జన్మ వృత్తాంతము గలవు. చతుర్థమున ఆరుశ్లోకములలో చిన్నమాంబా దేవి పంచమసర్గలో తొమ్మిదిశ్లోకములు మహారాజావారి యాస్థాన కవులు, పండితులు, నిఘంటునిర్మాణము, ఆంధ్రసాహిత్యపరిషత్తు అనాధశరణాలయములనుగూర్చి తెల్పుచున్నవి. మచ్చునకొక్క శ్లోకము:

శ్లో॥ ధీమత్కవీశోత్కర వ్రజపేటీ
వేదప్రవాతప్రియ విప్రకోటీ
మహా వినిర్భర్త్సిత దేవవాటీ
పీఠపురీ రావునృపాలధాటీ॥

2. సూర్యసప్తతి : డెబ్బదిపద్యముల యీకృతి సూర్యభగ వానునిగూర్చి వ్రాయబడెను. ఇది మహారాజావారి కంకితము.

3. రత్నపాంచాలిక : సర్వజ్ఞ సింగమనీని రత్నపాంచాలికా నాటకము నాంధ్రీకరింపుడని సూర్యారావుగారు శాస్త్రిగారి నాజ్ఞాపిం

చిరి. అనువాదమును శాస్త్రిగారు మదరాసున "గులాబీ"లో నివాసము చేయుచున్న మహారాజావారికి వినిపించగా వారానందించి యీ నాటకము నాంధ్రీకరించిరి. ఇది యథానువాదము.

4. షడ్దర్శనసంగ్రహము : మధునాపంతులవారీ శాస్త్ర గ్రంథమును రచియించి సూర్యారావుగారిని దర్శించగా వారు తమతో కొంతసేపు 'సేశ్వర–నిరీశ్వర' వాదములనుగూర్చి ముచ్చటించిరని, శాస్త్రిగారు తెల్పిరి. మతవిషయకమగు మహారాజావారి విజ్ఞానమునకిది నిదర్శనము. సూర్యరాయని కర్పితమైన యీ గ్రంథము వి. యమ్. ఆర్. ముద్రాక్షరశాలలో ముద్రితమైన ఏబదిమూడు పుటల వచనకావ్యము. ఇందు బౌద్ధదర్శనము, నైయాయికదర్శనము, సాంఖ్యదర్శనము, వైశేషికదర్శనము, జైమినీయదర్శనము, జైనదర్శనము, చార్వాకదర్శనము అను నారుదర్శనములు గలవు. బౌద్ధదర్శనము బౌద్ధమతసంబంధి. నైయాయికమనగా న్యాయసంబంధమైన అని యర్థము. న్యాయసూత్రరచయిత గౌతముడు, సాంఖ్యప్రవర్తకుడు కపిలమహర్షి, వైశేషికకర్తకణాదుడు, జైమనిదర్శనకారుడు జైమని ముని. జైమని సామవేదమున వ్యాసుని శిష్యుడు. చార్వాకదర్శన ప్రణేత చార్వాకుడు. సుస్పష్టమైన రీతిలో శాస్త్రిగారు దర్శనములనగా నేమియో వివరించిరి.

శ్రీ సూర్యరాట్ప్రభు దర్శనము: 16 పుటల యీచిన్నికావ్యము సూర్యారావుబహద్దరు వారినిగూర్చి శ్రీకార్యమపూడి రాజమన్నారు కవిచేత రచియింపబడి కాకినాడ శ్రీ సావిత్రీముద్రాక్షరశాలలో 1914లో ముదింపబడెను. కవి తనను ఋణబాధనుండి విముక్తుని చేయుమని కోరెను. ఈతడు గుంటూరుజిల్లా బాపట్లతాలూకా పేరాలగ్రామవాసి. మొదట కవి 60 పద్యములలో మహారాజావారి దానధర్మములను వర్ణించెను. ఇరువదిపద్యములలో సూర్యరాయ

మహీంపతి! శుభగుణాలితీ! యను మకుటము కలదు. శతకప్రాయమగు నీ రచనలో చంపకోత్పలములు, శార్దూలమత్తేభములు ఐదేసిపాద ములలో గలవు.

సీ॥ సర్వసర్వంసహా నిర్వాహణ సమర్థ
భూపతీంద్రంబు పిఠాపురంబు
ద్వాత్రింశదంక విద్యాచతుష్షష్టిక
ళాపండితంబు పిఠాపురంబు
వారణస్యంతన వాహనసైన్య ధీ
శ్రీపట్టణంబు పిఠాపురంబు
వివిధదీనావన విఖ్యాత సత్ర ల
క్ష్మీపావనంబు పిఠాపురంబు.

అని పిఠాపురమును కీర్తించి, రాజావారి నార్థికసహాయము కోరినాడు కవి. తరువాత పద్యములలో గ్రాంథికభాషపట్ల మహా రాజావారికి గల అభిమానము వర్ణింపబడెను. మహారాజావారొసగిన విరాళాదులను కవి పేర్కొనెను. 1. వికలాంగులు ఏడమూకలకు సహాయము, 2. మద్రాసు జంతుబాధనివారణనిధికి వెయ్యిరూ॥లు, 3. బెంగుళూరు బాలల ఆశ్రమమునకు వెయ్యి, 4. బందరు ప్రార్థనా మందిరమునకై దువందలు, 5. రాజమండ్రి హితకారిణీసమాజమున కర్థలక్ష, 6. కాకినాడ లేడీస్‌క్లబ్బుకి చుట్టుగోడతోసహా విశాలమైన స్థలము, 7. కాకినాడ అన్నదానసమాజమున కర్థలక్ష, 8. కాకినాడ అనాథశరణాలయనిర్మాణము, 9. శ్రీ శిష్టావఝ్ఝల సీతారామయ్యకు ఋణవిముక్తి కలిగించి మందిరమిచ్చుట, 10. జర్మనీభారతప్రచురణ సమాజమునకైదువందలు, 11. పూనా వితంతుశరణాలయమునకు విరాళము, 12. శ్రీమతి కమలాకరము ఉన్నతవిద్యాభ్యాసమునకు కారు వేలు, 13. పిఠాపురములో పాఠశాలాభివృద్ధికర్థలక్ష, 14. పిఠాపురము

కాకినాడపట్టణములలో రాత్రిపాఠశాలల స్థాపనకు సహాయము, 15. కలకత్తా బ్రహ్మసమాజ బాలికాపాఠశాలకు వెయ్యి, 16. పిఠాపురము ఘోషాస్కూలు నిర్మాణమునకు పదివేలు, 17. వేటపాలెం ఆంగ్లాంధ్రపాఠశాలకు విరాళము, 18. కాకినాడ పిఠాపురం రాజా వారి కళాశాల"లో భవననిర్మాణము, 19. శ్రీ దేవులపల్లి తమ్మన్న శాస్త్రిగారి యౌదార్యమునకు మెచ్చి పదమూడు వేలు, 20. శ్రీ వేంకట రామకృష్ణులకు మణిభూషణాదులు, 21. వాల్మీకిరామాయణ శుద్ధ ప్రతులను వ్రాయించుటకు పదమూడు వేలు, 22. కొప్పరపు సోదర కవుల ఆశుధారకు మెచ్చి 1100 రూ॥లు- 1600 రూ॥లు, 23. ఆది పూడి సోమనాథకవికి 2,500 రూప్యములు, 24. బ్రహ్మసమాజ చరిత్ర ప్రకటనకు వెయ్యిరూ॥లు, 25. దేవగుప్తాపు భరద్వాజము గారికి 'గీతా' ముద్రణమునకు, 26. సీతానాథతత్త్వభూషణ గ్రంథ ముద్రణకు, 27. హేమచంద్రమిత్ర, 28. కమలానాథమిత్రులకొక్కొ క్కరికి మూడేసివేలు, 29. దండి విజ్ఞానభారత ప్రచురణసమాజమున కైదువందలు, 30. వావిళ్ళవారికి వెయ్యి, 31. ఆంధ్రభాషాభి వర్ధనీసమాజమునకు వెయ్యి, ఆంధ్రభాషాపరిషత్తు కిరువదివేలు, 32. కాకినాడ పట్టణమున కళామందిరమునకు రెండులక్షలరూప్య ములు, 33. రావల్పిండికి వెయ్యిరూ॥లు. ఈవిధముగా కవి తన శక్తివంచన లేకుండా మహారాజావారు కావించిన దానధర్మముల పట్టిక నిచ్చెను.

**శ్రీ సూర్యరాయశతకము** : 23 పుటలలో 100 పద్యములు గల శ్రీ సూర్యరాయశతకము శ్రీ దేవగుప్తాపు భరద్వాజముగారిచేత రచియింపబడి 1916లో చెన్నపురి ఆంధ్రపత్రికాలయమున ముద్రింప బడెను. సూర్యరాయేంద్రుని దాతృత్వమును వర్ణించి, కొన్నినీతులు బోధింపబడిన ఈశతకమునకు 'సూర్యనృపా' యను మకుటము కలదు.

ఇదికాక కవి "సూర్యరాయ విబుధవిధేయా!" "సూర్యరాయసజ్జన గేయా!" "సూర్యరూప! విభవదీపా!" "సూర్యరాయ భావజరూపా" "సూర్యభూప! చిత్తజరూపా!" యనియు సంబోధించెను. అపాత్ర దానము చేయరాదను నీతిని కవి బోధించుచున్నారు.

క. పండితున కొక్కడబ్బిడఁ
గొండగు, మఱి వేనవేలు కొండింద్రకిడన్
బెండగు పాత్రాపాత్రల్
ఖండితముగ నెంచి చూడ ఘనసూర్యనృపా!

అంతేకాక ప్రభువన్నడు తనకున్నదంతయు వెచ్చింపరాదని, వెనుక ముందు చూచి యివ్వవలెనని హితబోధ చేయుట కవియొక్క హితైకదృష్టిని తెల్పుచున్నది. "అతిసర్వత్ర వర్జయేత్" అనుట అన్నివిషయములందు పాటింపవలెను. ధనమమితముగా వ్యయమొనరించుటయు నొక వ్యసనమేకనుక కవి పలుకెంతయు సమంజసము. ఇటువంటి హితోక్తి పాటింపకుండుటనేమో మహారాజావారి వృద్ధాప్యము గడచినతీరు మిగుల శోచనీయమయ్యెను.

పీఠపురీవిజయము : శ్రీ కందాళ శఠగోపాచార్యులు వ్రాసిన 'పీఠపురీవిజయము' క్రీ. శ. 1906లో కాకినాడ సరస్వతీ ముద్రణాలయమున ముద్రింపబడి ప్రకటితమయ్యెను. మహారాజావారు వేంకటగిరివారితో కలిగిన వివాదమున గెలుపొందిన సందర్భమున 72 పుటల ఈ వచనకావ్యము వ్రాయబడెను. ఇందైదధ్యాయములు గలవు. ప్రథమాధ్యాయము : శ్రీ రాజా గంగాధరరామారావుగారికి శ్రీ సూర్యారావుగారు జన్మించుట, వారు ఐదేండ్ల ప్రాయమున నుండగా రాజావారనారోగ్యముతోనుండి కాశీమరణమున మోక్షము ప్రాప్తించునని కాశీకి వెడలుట, శ్రీ సూర్యారావుగారికి తిరుపతిలో చౌలము, కర్ణవేధము చేయుట, రాజావారు కాశిలో మరణింపక పీఠపుర

మున కేతెంచుట, 'వీలునామా' వ్రాసిన యనంతరము పాదగయా క్షేత్రమగు పుణ్యస్థలము పీఠికాపురమందే శ్రీ రాజాగంగాధరరామ రాయేంద్రులు స్వర్లోకగతులగుట, పీఠపురసింహాసన వారసులగు శ్రీ సూర్యారావుగారు బాలకుడగుట ఆంగ్లేయులు సంస్థానమును 'కోర్టాఫ్‌వార్డ్సు'లో నుంచుట యను నంశము లిందుగలవు.

ద్వితీయాధ్యాయము : శ్రీ రాజావారి దత్తపుత్రుడు శ్రీ రావు వేంకటరామకృష్ణారావుగారు ఔరసపుత్రుడైన సూర్యారాయనిపై దావావేసి గెల్చుట, సూర్యారావుగారు పినతల్లిగారగు శ్రీమతి భావయ్యమ్మారావుగారి సంరక్షణమున చిత్రాడలోనుండుట, వారి మేనమామలు శ్రీ వెల్లంకి వేంకట రామారాయనింగారు, శ్రీ చెలికాని చినజగన్నాధరాయణింగారు కలిసి, దేవులపల్లి సోదరులతో విచారించి, వారిని ధనసాహాయ్యమునకై కొన్నిప్రదేశములకు పంపించుట, ఆ ధనముతో సూర్యారావుగారిపక్షమున ఉన్నతన్యాయస్థానమున వాదించుటకు భాష్యంఅయ్యంగారిని న్యాయవాదిగా నియమించుట, భాష్యంఅయ్యంగారు రాజమహేంద్రవరపు తీర్పును ఖండించుచు ఉన్నతన్యాయస్థానమున వాదించుట యను విశేషములీ యధ్యాయమున గలవు. తృతీయాధ్యాయమున శ్రీ సూర్యారావుగారి పక్షమున తీర్పువచ్చుట, దత్తపుత్రుడుఇంగ్లండులో ప్రివి కౌన్సిలుకు తమ వివాదము విన్నవించుట, ఔరసులగు శ్రీ మహారాజా సూర్యారావుగారి పక్షమున తీర్పునిచ్చుట, సూర్యారావుగారి వివాహప్రయత్నము, వారి మేనమామ మరణించుట, సూర్యారావుగారు చెన్నపురిలో విద్యాభ్యాస మొనరించుటయు గలవు. చతుర్థాధ్యాయములో సూర్యారావుగారి వివాహనిశ్చయము, మదరాసునుండి పీఠికాపురమునకు మహారాజావారి యాగమనము, రాజ్యతంత్రములలో సూర్యారావుగారికి శిక్షణ యొసగుట, వివాహము

జరిపించుట వర్ణితమయ్యెను. పంచమాధ్యాయమున మహారాజా వారు మహారాణి చిన్నమాంబాదేవితో వినోదముగా కాలము గడపుట, పండిత చర్చలు, రాజ్యప్రాప్తియు నభివర్ణితములు.

ఈ వచనగ్రంథమున కవి ఆవశ్యకములు, అనావశ్యకములు నను భేదము పాటింపనితీరున వివిధములైన వర్ణనలు చేసెను.

మా మహారాజుతో దూరతీరాలు (లేఖావళి) : మహారాజా వారి యాశ్రితుడు శ్రీ కురుమెళ్ళ వెంకటరావుగారీ లేఖావళిని ప్రచురించిరి. ఇది మహారాజావారికి కృతిసేయబడిన 166 పుటల గ్రంథము. "పిఠాపురం మహారాజా శ్రీ రాజా రావు వేంకట కుమార మహీపతి సూర్యారావు బహద్దరుగారికి : బాబూ! ... ...స్వర్గంలో వున్న తమకు పూర్వస్మృతులు రేకెత్తించే ఈ పుస్తకం కృతజ్ఞతా పూర్వకంగా దాఖలు చేస్తున్నాను. స్వీకరించండి" అని కవి తన ప్రభువున కుపాయన మిచ్చిరి.

శ్రీ మహారాజావారు క్రీ॥ శ॥ 1930లో యూరోపు అమెరికా పర్యటనకు వెడలినపుడీ కవియు వెంట నేగెను. ఆ సమయమున కవి తాను విలకించిన ప్రదేశములను యథాతథముగా వర్ణించుచు మిత్రుడగు శ్రీ పెమ్మరాజు వెంకటరావుకి వ్రాసిన లేఖలే ఈ గ్రంథరూపమందెను. తాను వీక్షించిన రమ్యమైన చారిత్రక ప్రదేశములను చక్కని శైలిలో వ్రాసిన ఈ "చారిత్రక లేఖావళి" చదివినచో ఆయా ప్రదేశములను స్వయముగా చూచిన యనుభూతి కలుగును. అటువంటి అమూల్యనిధి యనదగిన లేఖావళిని భద్రపరచిన శ్రీ పెమ్మరాజువారు అశ్రద్ధచేయక వానిని ముద్రింపించి సహృదయుల కందించిన శ్రీ కురుమెళ్ళవారు ఉభయులు అభినందనీయులు. **కృష్ణపక్షము** : 187 పుటల యీ ఖండకావ్యము శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి కృతము. శ్రీ రాజా గంగాధరరామారావుగారి యాస్థాన

మును, వారిపుత్రులు మహారాజావారి యాస్థానమును అలంకరించిన దేవులపల్లి సోదరకవులలో శ్రీ దేవులపల్లి తమ్మన్నశాస్త్రిగారను వేంకటకృష్ణశాస్త్రి తనయులీ కృష్ణపక్షకర్త కృష్ణశాస్త్రి. భాషా సాహిత్యవిషయమైన వైషమ్యము కారణముగా శ్రీకృష్ణశాస్త్రి మహారాజావారికి దూరమైరి. మహారాజావారికి వ్యతిరేకమైన భావ కవితోద్యమసారధి శ్రీకృష్ణశాస్త్రి. ఆవిధముగా ఆస్థానమునకు దూరమైనతరువాత వీరీరచన చేసినను, తమవంశమును తరతరము లుగా పోషించుచున్న పీఠపురప్రభువులయెడ భక్తితో శ్రీకృష్ణ శాస్త్రి మహారాజావారి యనుమతిలేకయే తనకావ్యమును వారి కంకి తము చేసినట్లు తెలిపిరి.

"తరుణ శృంగార మధురమాధవుఁడ వీవు
కలికిపాటల కోయిల కొలము మాది
ఈ వకీన సభావన తరువితాన
శాఖికల నిత్యనూతన స్వాదుగాన
జీవసారముఁ గురియించి చివురులెత్తఁ
బాడుకొన్నారు మా కులము స్వాములెల్ల,
స్వచ్ఛకీర్తి! మనోజ్ఞవసంతమూర్తి!
పికకుమారకు నన్నుఁ బాడుకొననిమ్ము
మాలగాఁ దొలిపాటల పూలతోడ
హృదయమే కూర్చి నీ కొఱకెదురుచూతు."

అని శ్రీకృష్ణశాస్త్రి హృదయమునే పాటలుగా కూర్చి మహా రాజావారి కర్పించిరి. కరుణరసప్లావితమగు తన భావకవితలకు శాస్త్రి గారు "కృష్ణపక్షము" అని సార్థకనామధేయమొసగిరి. కృష్ణపక్షము ఆత్మాశ్రయకవిత్వము. ఈ కవిత్వము నధిక్షేపించుచు ఆ దినములలో "శుక్లపక్షము" అను కావ్యము సృజింపబడెను గాని యది చిర

కాలము నిలువలేదు. "ఆకాశవాణి" విజయవాడలో ఉద్యోగించుచు వీరు ఎన్నియో సంగీతరూపకములను రచియించిరి. వంశపారంపర్యముగా లభ్యమైన పాండిత్యము ప్రతిభలకు తోడు, చిన్ననాడు తండ్రి పెదతండ్రులతో కలిసి పీఠికాపురాస్థానమున తిరుగాడిన బాలకృష్ణునికి ఆ సభాంగణమందలి శుకశారికలతోపాటు గాంధర్వము లభ్యమయ్యేనేమో యన్నట్లు శాస్త్రిగార్కి సంగీతశాస్త్రజ్ఞానము కలదు. ఏ గీతమును వ్రాసినను వారు సంగీతసమ్మిళితమై యొప్పుటయేగాక, చలనచిత్రములకు పాటలు వ్రాసినపుడు ఆయాపాటల నేయేరాగములలో, ఏయేతాళములలో కూర్పవలయునో సంగీతదర్శకులను ఆదేశించుట నేను కనులార వీనులార గాంచిన వినినముచ్చట. శ్రీ శాస్త్రిగారు బాల్యమున చంద్రమపాలెంనుండి పెదతండిగారి భుజముపై కూర్చుండి పీఠికాపురమున కరుదెంచెడివారని, బాల్యమందే చిన్న చిన్న పద్యములను ఆశువుగా చెప్పెడివారని ప్రతీతి. శ్రీ దేవులపల్లి సుబ్బరాయశాస్త్రిగారు రచియించిన మహేంద్ర విజయ కావ్యమున దేవులపల్లి వంశవర్ణనలో వీరును పేర్కొనబడిరి. అందమైన పదముల పొందికగా కూర్చుట, పాదపూరణములు మచ్చునకైన కానరాకుండుట శ్రీకృష్ణశాస్త్రిగారి సొమ్ము. సినీగేయ రచనలో సహితము దేవులపల్లివారి బాణికి ప్రత్యేకముద్ర కలదు. సామాన్యముగా సుఖదుఃఖములు రెండు నొక్కమారు తటస్థించుట మానవజీవితమునకు పరిపాటి. ఆ స్థితి 'ఆశ' యను గీతమున నిట్లు కలదు. "కన్నీటి కెరటాల వెన్నెలేలా, నిట్టూర్పుగాడ్పులో నెత్తావి ఏలా, ప్రళయకాల మహోగ్ర భయద జీమూతోరు, గళఘోర గంభీర ఘెళఘెళార్భటులలో మెఱుపేలా!" కారుమేఘములనడుమ మెఱుపుతీవవలె శోకాతిశయమున సుఖము మెఱయునని కవి సమాధానము. ఈ తీరున శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి రచనలన్నిటా ప్రతి మాటా ప్రతిపాటా ఒక ముత్యాలపేట.

**సాహిత్యచింతామణి :** శ్రీ చావలి రామసుధి కృత సంస్కృతాలంకారశాస్త్రము "సాహిత్యచింతామణి" పీఠికాపురప్రభు వరేణ్యులు శ్రీ రావు వేంకటకుమారమహీపతి సూర్యారావు బహద్దరు వారి కంకితము.

శ్లో॥ శ్రీమచ్చావలి వంశరత్నజలధౌ రాకాసుధాంశోన్నత
శ్రీమద్వేంకట ధీమతస్తనుభవ శ్రీమన్నృసింహః కవిః
విద్వన్మత్తగజేంద్ర సింహబిరుద శ్రీరామ విద్వన్మణిం
యం ప్రాసూత కరోమి సోహ మధునా సాహిత్య చింతామణిం॥

నాయకప్రకరణమందలి ఈ 3వ శ్లోకము కవి పితామహుడు శ్రీ చావలి వేంకటశాస్త్రి, జనకుడు శ్రీ చావలి నృసింహకవి యని తెల్పుచున్నది. ఈ కవి విద్వన్మత్తగజేంద్రసింహ బిరుదాంకితుడనియు నీ శ్లోకమువలన తెలియుచున్నది. సాహిత్యచింతామణి యందు నాయకప్రకరణము, కావ్యప్రకరణము, దోషప్రకరణము, గుణాలంకారప్రకరణములు మాత్రము ఆంధ్రసాహిత్యపరిషత్పంచికలలో ముద్రింపబడెను. మిగిలిన ప్రకరణములు కాని వ్రాతప్రతికాని ఆంధ్రసాహిత్యపరిషత్తు పుస్తకభాండాగారమందైనను కానరావు. నాయక, కావ్యప్రకరణములు మహారాజావారి స్మారకసంచిక 52, 53, 54 సంపుటములలో 83 పుటలందును, తరువాతి సంపుటములలో 24 పుటలలో దోషప్రకరణము, 13 పుటలలో గుణాలంకారప్రకరణములు ముద్రితమయ్యెను. ముద్రితప్రతులను గాంచిన నీ సాహిత్యచింతామణి ప్రతాపరుద్రయశోభూషణమునకు ప్రతిబింబమనదగిన రచనగా కన్పట్టును. విద్యానాథుడు తన యలంకారశాస్త్రమునకు ప్రతాపరుద్రుని నాయకునిగా గ్రహించినట్లు, శ్రీ చావలి రామశాస్త్రి తన గ్రంథమునకు మహారాజావారిని నాయకునిగా గ్రహించిరి. ఈ కావ్యమునకు కవియే వ్యాఖ్యానము వ్రాసెను.

ప్రాచీనాలంకారగ్రంథము లుండగా నీగ్రంథమును మరల వ్రాయుట యేలయని ప్రశ్నించుకొని కవి, ప్రాచీనమగు వానికంటె "సరస కవితాస్వాద భరిత" మగు నవీనకావ్యము సహృదయ చమత్కారి యగునని, జలభరితమగు సముద్ర మున్నను, దానినుండి యావిర్భవించిన సరసమగు రాకా చంద్రబింబ మాహ్లాదజనకమగుట లేదా? యని సమర్థించుకొనెను. కవి, తన కావ్యము విద్వాంసులకు మాత్రమే యానందము గల్గించుట ఘనతయేగాని న్యూనత కాదనును. ఎట్లన, నాట్యకత్తె మొలనూలి మువ్వలసవ్వడి చెవిటివానికి సంతోషము కలిగించకపోవుట ఎట్లు ధ్వనిలోపముకాదో అట్లే తన కావ్యమునకు న్యూనత లేదనుచు రామసుధి తన కవితాప్రాభవ ముగ్గడించుకొనెను. ఐనను వినయముతో తన కవితాప్రాభవ మంతయు గురువర కృపాపాంగ ప్రసరఫలమని యంగీకరించుట కవి పాండితీపారమ్యమును దెల్పును.

సాహిత్యచింతామణిలో నాయకప్రకరణమున ప్రతాపరుద్రీయ లక్షణములు చాలగలవు. ఉదాహరణములు రామసుధి కల్పించినవి. ప్రతాపరుద్రీయమున "మహాసత్వోఽతి గంభీరః కృపావా నవికత్థనః" అని ధీరోదాత్తలక్షణము తెల్పగా, చింతామణియందు "మహాబలోఽతి గంభీరః కృపాళు రవికత్తనః" అని కలదు. కావ్యప్రకరణమున శబ్దశక్తివివేచనములో ప్రతాపరుద్రీయముకంటె విలక్షణమగు విశేషములను శ్రీ శాస్త్రిగారు చూపిరి. "అదోషౌ సగుణౌ సాలంకారౌ కావ్యమ్" అని ప్రతాపరుద్రీయ కావ్యలక్షణము. సాహిత్య చింతామణియందు "కావ్యమ్ పదార్థౌ నిర్దోషౌ గుణాలంకార సంయుతౌ" అని కావ్యలక్షణము వివరింపబడెను. ఇట్లు శ్రీ చావలి రామశాస్త్రి ప్రతాపరుద్రీయమునుండి కొంతగ్రహించియు, కొంత మార్పుచేసి, స్వతంత్రముగ రచించి ఈ గ్రంథమున లక్షణనిరూప

ణము కావించెను. వ్యాఖ్యానము, విషయచర్చ మున్నగునవన్నియు స్వతంత్రములు. వ్యాఖ్యానము వీరియొక్క తర్కవ్యాకరణ వేదాంతాది శాస్త్రపాండిత్యమును తెల్పుచున్నది. జహదజహల్లక్షణ మంగీకరింపవలెనా? యను చర్చవలన వీరి వేదాంతశాస్త్రపాండిత్యము ప్రస్ఫుటమగుచున్నది. శ్రీ చావలి రామసుధి భాష సౌష్టవము, చమత్కారము మాధుర్యము కలది. వైదర్భీరీతి లక్షణము తెల్పుచు కవి,

బంధపారుష్యరహితా శబ్దకాఠిన్యవర్జితా।
నాతి దీర్ఘసమాసా చ వైదర్భీరీతి రిష్యతే॥

"జితారి మండలస్యాస్య
సూర్యరాయ మహీపతేః
భాతి ప్రతాప కీర్తిభ్యామ్
పాటలీవ జగత్త్రయీ"

అని దోషప్రకరణమున లక్షణలక్ష్యములు వ్రాసిరి. లక్షణలక్ష్యములు లలితపదఘటితములై యలరారుచున్నవి. ఈ విధముగా పాండిత్యకవిత్వము లేకత్ర సన్నివిష్టమైన మహామనీషి శ్రీరామశాస్త్రి. ఆంధ్రులు రచియించిన యాలంకారిక గ్రంథములలో మిన్నయనదగిన "సాహిత్యచింతామణి" సంపూర్ణముద్రణ మందకపోవుట మన తెలుగువారి దురదృష్టము. కృతిపతి వంశావళి వర్ణించుశ్లోకముతో నీ గ్రంథ పరామర్శను ముగింతును.

శ్లో॥ శ్రీమద్రాజకుల ప్రతీత బిరుద శ్రీరావు వంశోత్తమ
శ్రీ గంగాధర రామరాడ్విభు సుత శ్రీ సూర్యరాయ ప్రభోః
రారాజద్గుణజాల మధుర శ్రీ భాసురామత్కృతి
ర్యావచ్చంద్రదివాకరం భువి బుధేంద్రామోదినీ దీప్యతు॥

## పరిశిష్టము

**శ్రీ పురాణపండ మల్లయ్యశాస్త్రి :** మల్లయ్యశాస్త్రిగారి నివాసము గోదావరిజిల్లాలో ఖండవల్లిగ్రామము, స్వస్థలము తాడేపల్లి. శ్రీ శాస్త్రి గీర్వాణాంధ్రభాషలలో మహావిద్వాంసులు. వీరు కొంతకాలము తండ్రిగారి కడ విద్యాభ్యాసము చేసి, తదుపరి విజయనగరమున సాహిత్య తర్క వ్యాకరణాదిశాస్త్రములను జదివి, మహాపండితుడైన శ్రీ వెంపరాల దక్షిణామూర్తి శాస్త్రిగారిచెంత శాంకరసూత్రభాష్యము కూలంకషముగా నభ్యసించిరి. "అనేక పాఠాంతరములతో సర్వమగు వ్యాఖ్యతో నాంధ్రభారతమందుఁ గొన్ని పర్వములీ పండితవర్యుని (పురాణపండ) చేతనే పరిరక్షింపబడియున్నవి" అని ఆంధ్రసాహిత్యపరిషత్తు పదునొకండవ వార్షికోత్సవోపన్యాసమున శ్రీ మహారాజావారు పల్కిరి. క్రీ॥ శ॥ 1906లో పిఠాపురము పాఠశాలలో తెలుఁగుపండితులుగా ప్రవేశించిననాటి నుండి శ్రీ మల్లయ్యశాస్త్రిగారు మహారాజావారి మన్ననకు పాత్రులైరి. వీరి రచనలలో ఆంధ్రసూత్రభాష్యము, శుక్రనీతిసారము ముఖ్యమైనవి.

**ఆంధ్రసూత్రభాష్యము:** శ్రీ శంకరాచార్యులవారి శ్రీ మచ్ఛారీరక మీమాంసాభాష్యమును మల్లయ్యశాస్త్రిగారు మహారాజావారి యాజ్ఞానుసార మాంధ్రీకరించిరి.

గీ॥ రావు వంశాబ్ధిచంద్రుడౌ రామరాయు
నౌరసుఁడగు సూర్యనృపాలు నాజ్ఞచేత
సూత్రభాష్యంబుఁ దెలుఁగున సూత్రపఱుతు
దప్పులున్నను దిద్దుఁడు దయదలిర్ప.

అనుట ఇమ్మహాపండితుని వినయసౌజన్యములను దెల్పును. ఆంధ్రసూత్రభాష్యము నాల్గుభాగములుగా ముద్రితమయ్యెను.

579 పుటల తొలిభాగము 1918లో, 492 పుటల రెండవభాగము 1919లో, 517 పుటల మూడవభాగము 1921లో, 98 పుటల చతుర్థ భాగము 1922లో చెన్నపురి ఆంధ్రపత్రికా కార్యాలయమున మహారాజావారి ఆదరణమున ముద్రింపబడి ప్రకటితమయ్యెను.

**శుక్రనీతిసారము :** శ్రీ మల్లయ్యశాస్త్రిగా రనువదించిన శుక్రనీతిసారము మహారాజావారి సమాదరణమున 1918లో చెన్నపురి ఆంధ్రపత్రికా కార్యాలయమున ముద్రింపబడెను. సంస్కృత శుక్రనీతిసారమున కిది ఆంధ్రీకృతి. యథామూలకముగా రచియింపబడిన శుక్రనీతిసారము ఐదధ్యాయముల గ్రంథము. నాల్గవయధ్యాయము ఏడుప్రకరణములుగా విభజింపబడెను. విద్యాస్వరూపము మాత్రము మూలముకంటె అధికముగా విపులీకరింపబడెను. మొదటి యధ్యాయమున రాజ్యాంగస్వరూపము, సత్ప్రభువు పద్ధతులు, రాజు గుణదోషములు, దేశమునకు రాజుయొక్క ఆవశ్యకత, ఆన్వీక్షిక్యాదుల స్వరూపము, రాజకర్తవ్యనిర్వహణ, పట్టణనిర్మాణము, ఆదాయ వ్యయములు, రాజ్యమున చేయవలసిన పనులు, వర్ణభేదములు వివరింపబడెను. ఉదా : "ఆన్వీక్షికి, త్రయి, వార్త, దండనీతి యను విద్యలను రాజవశ్యమభ్యసింపవలయు. ఇందాన్వీక్షికి తర్క వేదాంతముల వెల్లడించు. త్రయి ధర్మార్థకామంబుల వివరించు. అర్థానర్థంబుల వార్తయు, నయానయంబుల దండనీతియు బోధించు. వీనివలన వర్ణాశ్రమంబుల తెఱంగు తేటపడు . . ." (14వ పుట) అని ఆన్వీక్షిక్యాదుల స్వరూపము నిరూపింపబడెను.

రెండవ యధ్యాయమున యువరాజు కర్తవ్యము, రాజు సేవకులయెడ పాటింపవలసిన విధులు, పురోహితాదుల ఎన్నిక, సేవక ధర్మములు, దస్తావేజుల స్వరూపము (1. జ్ఞాపనపత్రము, 2. శాసనము, 3. ప్రసాదపత్రము, 4. భోగపత్రము, 5. భాగలేఖ్యము, 6.

దానపత్రము, 7. క్రయపత్రము,8. సాధ్యలేఖ్యము,9. సత్యలేఖ్యము, 10. ఋణపత్రము,శుద్ధిపత్రము,12. సామయికము,13.సమ్మతిపత్రము. 14. క్షేమపత్రము, 15. వేదనా (అభియోగ) పత్రము అను భేదములు గలవు.) లిఖితములు వ్రాయుపద్ధతి, కాలమాన స్వరూపము, భృతి, భృత్యుల సెలవులు, పురోహిత గ్రామాధికారుల జాతినిరూపణము తెలుపబడెను. పురోహితాదులనుగూర్చి గ్రంథకర్త ఇట్లు చెప్పెను. "పురోహితాది ... పది ప్రకృతులును బ్రాహ్మణులు కావలయును. వారు తగినవారు లభింపకున్న క్షత్రియులు, వైశ్యులు నా నియోగంబునకు దగుదురుగాని గుణవంతులయ్యు నితరులకార్యంబు సేయఁదగరు. గ్రామంబున భాగహారియు, సామాసాధిపతియు క్షత్రియుడు కావలయును. గ్రామణికత్వంబునకు విప్రుండు తగు. కాయస్థుండు లేఖకుండు గావలయు. సుంకంబు గొనువాడు వైశ్యుండు, ప్రతీహారుండు శూద్రుండు నుండవలయు, సేనాధిపతి బాహుజుండు కావలయు గాని సంభవింపనినాడు బ్రాహ్మణుండును గాదగు. ఈ యధికారంబునకు వైశ్యాదులు, భీరువులు నెప్పుడు దగరు మరియు నీ కొలువునకు నే కొలంబు వారయినను శూరులు తగుదురు." (పుట 72) మూడవ అధ్యాయమున రాజ్యమందలి సాంఘికవిధులు, మనుజుడు చేయవలసిన కార్యములు, మిత్రాది ప్రశంస, అతిథి పూజాదులు, స్త్రీల దుర్గుణములు, రక్షింపబడవలసిన వారు, ఉత్తముల స్వరూపము, వివిధ దానములు, నడవడులు,దుష్ట స్వరూప నిరూపణము, భార్యాదుల ప్రాశస్త్యము, బ్రాహ్మణప్రాశస్త్యము, సంసర్గమహిమ, అంతఃపుర సేవార్హులు, జరాకారణములు, వ్యవహారజ్ఞానము అను నంశములు గలవు.

చతుర్థాధ్యాయమున మిత్రామిత్రుల లక్షణములు, రాజు శత్రువులపట్ల, మిత్రులపట్ల ప్రవర్తించవలసిన విధానము, శిక్షా

ర్మాత, కోశస్వరూపాదులు, రత్నసంగ్రహణ స్వరూపము, చాతు ర్వర్ణ్య ధర్మములు, విద్యాకాలాదికములు, ఆశ్రమములు, స్త్రీ శూద్రసేవకాది లక్షణములు, కూపాది నిర్మాణము, రాజధర్మము, దండనములు, రాజనీతి, సభార్హత, దుర్గభేదములు, సేనాస్వరూపా దులు, యుద్ధస్వరూపభేదములు, వ్యూహరచనము, యుద్ధమున వధా ర్హులు, కూటయుద్ధములు వర్ణింపబడెను. పంచమాధ్యాయమున నీతి శేషము బోధింపబడెను.

శ్రీ నడకుదుటి వీరరాజు పంతులుగారు : మహారాజావారి యాస్థానమున విమర్శకులుగా నుండి "విభ్రమతరంగిణి" మొదలైన కృతులు, విమర్శలు వ్రాసిన నడకుదుటివారు 'విమర్శాదర్శ' బిరుదము పొందిరి. విభ్రమతరంగిణి రామాయణగాథ. ఇది వాల్మీకముకంటె భిన్నమై, అద్భుతమైన అంశములతో పఠితలకు విభ్రమము కలిగిం చును. ఇది వచన కావ్యము.

శ్రీ పసుపులేటి వెంకన్న : మహారాజావారిచేత స్థాపింప బడిన "గంగాధరరామరాయ అనాథశరణాలయమున పసుపులేటి వెంకన్నగారు పోషింపబడిరి. మహారాజావారి యాశ్రయమున పెరిగి విద్యాభ్యాస మొనరించిన వెంకన్నగారు కవియై "సీతావిజయము" అను నాటకము రచియించిరి. నాటకారంభమున కవి తన నాదరించి పోషించిన శ్రీ సూర్యరాయప్రభుని స్మరించెను. ఐదంకముల ఈ నాటకము 1917లో పిఠాపురము శ్రీ విద్వజ్జనమనోరంజనీ ముద్రా క్షరశాలలో ముద్రింపబడెను.

శ్రీ పడాల రామారెడ్డి, బి.ఎ.,బి.ఎల్. : వీరు ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయవాది. మహారాజావారి అనాథశరణాలయమున పెరిగి, వారిప్రాపున విద్యాబుద్ధులు నేర్చి అభ్యుదయము సాధించిన రామారెడ్డి "ఆంధ్రప్రదేశ్ విద్యావిషయిక శాసనములు" అను

పుస్తకము రచించి మహారాజావారి కంకితమిచ్చిరి. "నా బాల్యము నందే తల్లిదండ్రులు గతించి, యావదాస్తి పోయి, అనాథుడనైన నాకు కొరతలన్నియు తీర్చి, బాల్యావస్థలో కాకినాడ అనాథశరణాలయములో నన్ను పెంచి, పోషించి, విద్యాభిక్షపెట్టిన దయాస్వరూపులు, పీఠికాపురాధీశ్వరులైన స్వర్గీయ శ్రీ రాజా రావు వేంకట కుమార మహీపతి సూర్యారావు మహారాజా నాయనగారికే నిందు భక్తితో అంజలి ఘటించి, సంస్మరించుచూ ఈపుస్తకము విడుదల చేయుచున్నాను". ఈ గ్రంథము తొలిముద్రణ 1966, మలిముద్రణ 1967, తృతీయముద్రణ 1968 లోను జరిగెను. శ్రీ రామారెడ్డి ఆంగ్లాంధ్రభాషలలో పంచాయతీ చట్టములు, సహకారసంఘ చట్టములు, హిందూధర్మశాసనములు మున్నగు న్యాయశాస్త్రగ్రంథములనేకములు వ్రాసిరి. ఈ గ్రంథమున ఐదుపాదముల మత్తేభ విక్రీడిత మొకటి కలదు.

**ఉప్పలపు సుబ్బరాజకవి** : కాట్రేనికోనవాసుడు శ్రీ సుబ్బరాజకవి వ్రాసిన "శ్రీ సూర్యరాయ విజయము" 1915వ సం॥న రాయవరము శ్రీ మేరీముద్రాక్షరశాలలో ముద్రితమయ్యెను. ఒక దండకము,పదునేడుపద్యములు నిందుగలవు. సీసపద్యసంఖ్య ఎక్కువ. ముఖపత్రమున కాట్రేనికోనవాసుడని కలదు. కనుక నీకవి అమలాపురము తాలూకా 'కాట్రేనికోనవాసుడనియు' దండకమునుబట్టి తండ్రి ఉప్పలపు చలమరాజని తెలియుచున్నది. ఈ కావ్యమున మహారాజా సూర్యారావుగారు వేంకటగిరివారితో దావాయందు గెలుపొందుట అభివర్ణితము. కవి యీవృత్తాంతమునొక దండకములో తెలిపెను. పరమశివునికి నారదుడు భూలోకవార్తలు చెప్పునట్లుగా నిందు వర్ణింపబడెను. వేంకటగిరివారు 'సివిలుకోర్టు'లో గెలుచుట,

మైనరురాజా సూర్యారావుగారి పినతల్లి శ్రీమతి చెల్లయాంబాదేవి హైకోర్టునుండి మహాభాష్యజ్యోతిష నిరుక్త భాట్టమీమాంసాది శాస్త్రములలో నిష్ణాతులైన భాష్యం అయ్యంగారిని సూర్యారావు గారి పక్షమున వకీలుగా నియమించి, మద్రాసుకోర్టులో అప్పీలు చేయించుట, భాష్యం అయ్యంగారి వాదనైపుణ్యమున మైనరు రాజా వారు గెలువగా, దత్తుడు పార్లమెంటుకు అప్పీలు చేయుట, రికార్డు చూచిన పార్లమెంటువారు మైనరు రాజావారే రాజ్యార్హులని తీర్పు నిచ్చుట, నూజివీటివారి యాడుబిడ్డ ఆండాళ్‌గారిని సూర్యారావు గారు వివాహమాడుట, సత్సంతానముగాంచుట– పిఠాపురపాలనము మొదలైన వృత్తాంతమును హారుడు విని యానందించెను.

సామాన్యముగా దండకములు స్తోత్రప్రధానములు. కాని ఈ దండకము చారిత్రకతను సంతరించుకొనెను. తర్వాత 13 పద్యము లలో కవి పిఠాపురము కుంతిమాధవదేవుని స్తుతియించి, శ్రీ సూర్యా రావుగారికి ఆయురారోగ్యైశ్వర్యముల నొసఁగుమని కోరెను. పది పద్యములు కుంతిమాధవునిపై చెప్పినవి ఒకే మకుటము కల్గి దశక మనదగియుండెను. సీసపద్యానంతరగీతము మొత్తము మకుటమే. పిన్నల్లి, పట్టము, హాశ్చర్యము, పార్లమెంటాధికారులు ఇత్యాది క్రొత్తప్రయోగము లిందుగలవు. మొత్తముమీద నీ కృతి ధారాళ మగు శైలి కమనీయమగు కవిత్వముతో ఒప్పుచుండెను. కావ్య పరిశీలనమున కవి భద్రాజై యుండునని తోచును.

(శ్రీ) కాశీభట్ల సుబ్బయ్యశాస్త్రి: శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటు పండితులు శ్రీ సుబ్బయ్యశాస్త్రి ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక 27వ సంపుటిలో "శ్రీ రామోత్తరేతివృత్తము" అను విమర్శనాత్మక వ్యాసము ప్రకటించిరి. భవభూతి ఉత్తరరామచరిత్ర, దిఙ్నాగుని

కుందమాలలో సీతాపరిత్యాగరంగము లీ వ్యాసమున విమర్శింప బడెను. 'సాహిత్యకల' మున్నగు విమర్శలు వీరు వ్రాసిరి.

**శ్రీమాన్ కిళాంబి గోపాలకృష్ణమాచార్యులు :** వీరు నూజివీటి ఆస్థానకవి. "పిఠాపుర మహారాజచరితమ్" అను సంస్కృత కృతిని వీరు వ్రాసిరి. ఇది పదిసర్గలకావ్యము. 550 పద్యములుగల అముద్రిత కావ్యమిది. నరసాపురంలో వేంచేసియున్న రామానుజస్వామి, కేశవ స్వామి ఆలయమునకు పిఠాపురము సంస్థానాధిపతులు ఒక అగ్రహార మొసగియుండిరి. ఈ యగ్రహారమువలన ఆ దినములలో వచ్చుచున్న 540 రూ. రాబడి సరిపోవుటలేదనియు, నిత్యార్చనము జరిపించు ఏర్పాటు చేయవలయుననియు ఆచార్యులవారు నివేదించుకొనుచు పిఠాపుర ప్రభువులను ప్రశంసించుచు నీ కావ్యరచనచేసిరి.

కావ్యారంభమున పిఠాపురప్రభువుల పూర్వులలో నొకరైన మాధవరాయణింగారి దక్షిణదేశ దివ్యయాత్ర వర్ణనచేయబడెను. శ్రీ మాధవరాయణింగారు వరవరముని శిష్యులని నిరూపింపబడెను. మహీపతిరాయలు నర్సాపువమున 'గంగావరం' అను నగ్రహారము దేవుని కర్పించిరని తెలుపబడెను. తదుపరి శ్రీ గంగాధరరామా రావు బహద్దరువారి పరిపాలన, దివ్యదేశయాత్ర, మహారాజా సూర్యారావుగారి జననము, బాల్యము, పట్టాభిషేకము, సభలు సమా వేశములు, వీణావాదములు వర్ణింపబడెను. ఈకృతి కేవల చారిత్రక మగుటయేకాక శైలీసంవిధానమున చక్కని ప్రాచీన ప్రబంధధోర ణియు కన్పట్టును. ఉదా :- కుందాభదంతం కులిశాయుధాది వం దారు బృందారక వంద్యమానం, నందాత్మజాతం రమణీయమూర్తిం వందేయ కుంతీమాధవం కమలాధవేశం॥ అనిపిఠాపురమందలి కుంతి మాధవుని స్తోత్రముతో నీ గ్రంథము ప్రారంభమై, మహారాజావారి స్తోత్రముతో దేవాలయోద్ధరణకు ప్రార్థించుచు కవి కావ్యము ముగించెను.

## వీణాచార్య తుమురాడ సంగమేశ్వరశాస్త్రి
## (1873—1932)

పిఠాపురము మహారాజావారి ఆస్థాన సంగీత విద్వాంసులు శ్రీ తుమురాడ సంగమేశ్వరశాస్త్రిగారు సంగమవలసలో చిటివాడ అగ్రహారమున 1873లో శ్రీమతి గున్నమ్మ సోమయాజులు దంపతులకు జన్మించి 1932లో స్వర్గస్థులైరి. శాస్త్రిగారి బావగారు శ్రీ నందిగాన వెంకయ్యగారు మహారాజావారి జనకులు శ్రీ రాజా గంగాధరరామారావుగారి ఆస్థానసంగీతవిద్వాంసులు. వీరిచెంతనే సంగమేశ్వరశాస్త్రిగారు ఎనిమిదవయేట గాత్రసంగీమభ్యసింపనారంభించి నాలుగైదు సంవత్సరములకు వీణ వాయించుట నేర్చుకొనమొదలిడిరి. వీరు పిఠాపురాస్థాన సంగీత విద్వాంసులుగ జీవితమంతయు గడిపిరి. వీణావాదనమున నిష్ణాతులైన శ్రీ శాస్త్రిగారి పాండిత్యమునుగూర్చి అద్భుతమగు గాథలెన్నియో గలవు.

మైసూరు సంస్థానమున సంగీతవిద్వాంసులు మైసూర్ రాచప్ప గాత్రమునకు,కృష్ణప్పగారు వీణావాదనమునకు ప్రసిద్ధులు. శ్రీకృష్ణప్ప వీణకృష్ణప్పగా పేరొందినవారు. అట్లే పిఠాపుర సంస్థానములో శ్రీ సంగమేశ్వరశాస్త్రి వీణసంగయ్యగారని కీర్తిగాంచిరి. ఈ మహావైణికోత్తములుపరస్పరముచూచుకొనవలెననిచిరకాలముత్కంఠతోనుండిరి. దివాన్ శ్రీ మొక్కపాటి సుబ్బారాయుడుగారిని శ్రీ సంగమేశ్వరశాస్త్రిగారు కృష్ణప్పనెట్లైన పిలిపించవలెనని వేడుకొనిరట. పలుమార్లు శాస్త్రిగారు ప్రార్థింప నైదారేండ్ల యనంతరము కాకినాడలో సరసస్వతీ గానసభల వార్షికోత్సవములకు శ్రీ కృష్ణప్పగారాహ్వానింపబడిరి. శాస్త్రిగారిని తిలకించవలెనను కోర్కెతోనున్న శ్రీ కృష్ణప్ప కాకినాడ, తూర్పుగోదావరిజిల్లాలోనిదని తెలిసి, పిఠాపురమున కెంతదూరమున కలదని గానసభ కార్యకర్త శ్రీ కొమ్మి



వీణాచార్య

శ్రీ తుమురాడ సంగమేశ్వర శాస్త్రి గారు

(1873–1932)

రెడ్డి సూర్యనారాయణమూర్తిగారిని లేఖాముఖమున నడిగిరి. నాయుడు గారాలేఖకు సమాధానమిచ్చుచు, పిఠాపురమునుగూర్చి ఏల యడిగితిరని మరల యడుగగా "వీణాగానాభ్యాసము చేసినను, శ్రీ సంగమేశ్వరశాస్త్రిగారివంటి దిగ్గజమును చూడనైతిని వారిదర్శనము చేయవచ్చునని యడిగితిని" అని శ్రీ కృష్ణప్ప వ్రాసిరి. వెంటనే సూర్యనారాయణమూర్తినాయుడుగారు "మా మహారాజు మీవంటి పండితులను సత్కరించుటలో దీక్ష కలవారు. ఇది వారి యనుమతిగా భావించి, తప్పక రావలయును." అని ప్రత్యుత్తర మిచ్చిరి. వీణకృష్ణప్పగారు కాకినాడలో అడుగుపెట్టుచునే "నన్నిప్పుడే పిఠాపురము పంపించవలెను" అని నాయుడుగారిని బలవంతపెట్టిరి. భోజనమగుటతోడనే నాయుడుగారు తమ 'మోటారు'పై కృష్ణప్పగారిని పిఠాపురము తీసికొనివెడలిరి. కృష్ణప్పగారికి దివానుగారిని, మహారాజావారిని దర్శింపవలెననుటకంటె శ్రీ సంగమేశ్వర శాస్త్రిగారిని చూచుటకు త్వరపడిరి. నిరాడంబరమూర్తియైన శాస్త్రిగారిని కృష్ణప్పగారు గుర్తించలేదు. నాయుడుగారు పరస్పరము పరిచయము చేయగా నిరువురు ఆనందాశ్రువులతో పులకితగాత్రములతో గాఢముగా కౌగలించుకొనుట చూచిన నాయుడుగారా దృశ్యము కన్నులపండుగ చేయగా తన్మయులైరి. కృష్ణప్పగారి యాగమనవార్త విని శ్రీ మొక్కపాటివారు వెంటనే పిఠాపురము కోటలో గానసభకేర్పాటు గావించిరి. ప్రభు సచివులిరువ్వురు కోటలో ప్రవేశించిన ఈ మహాగాన విద్యావిశారదుల నిర్వురను చందన తాంబూలాదులచేత సన్మానించి, శ్రీ వీణకృష్ణప్ప తమ యాస్థానమునకు విచ్చేసినందుల కానందించి వీణావాదన మారంభింపుడని కోరిరి. శాస్త్రిగారును నీ వీణావాదనము వినవలెనని యేండ్లతరబడి తహతహలాడుచున్నాను. గోవింద ద్వాదశివలె నేటికి మా కతిథివైతివి. నీవు వీణ వాయించి ఆనందము కలిగింపుమని కృష్ణప్పగారి

నడిగిరి. కృష్ణప్పగారు "మీ వాదనము వినుటకే నేనంతదూరము నుండి ఏతెంచితినిగాని సరస్వతీ గానసభల నిమిత్తము కాదు. మీ దేశమునకు నే నతిథినైనపుడు మీరు నాకు గానాతిథ్యమీయ వలెను." అని శాస్త్రిగారినే వీణ వాయించవలసినదిగా అర్థించిరి. ఇట్లు స్నేహపూర్వకముగా నిర్వురు వాదులాడుకొని తుదకు శాస్త్రి గారు మహారాజావారి యాజ్ఞతో తామే సభ ప్రారంభించిరి. శాస్త్రి గారు తొలుత నేవో రాగము లాలపించి, తరువాత తమకు ప్రీతి దాయకములైన బిలహరి, ఆనందభైరవి, నీలాంబరి రాగములలో బిలహరి రాగము వాయింపనారంభించిరి. స్వరసంచారము నొక విచిత్రమగు రీతిని నడిపి, గమకముపట్టును క్రిందికి దింపుచున్న సమ యమున, ఆరంభమునుండి యానందబాష్పములతో వినుచున్న కృష్ణప్ప ఆనందాతిశయము పట్టజాలక వీణాసమేతముగా సంగమేశ్వర శాస్త్రిగారిని గాఢాలింగనము చేసికొనిరి. శాస్త్రిగారు ఇతరవైణి కులవలె వీణను పరుండబెట్టిగాని, ఏటవాలుగాకాని వాయింపక, పద్మాసనమున కూర్చుండి వీణముఖము సభాముఖముగా నుండునట్లు ఒడిలో నిలువున నిలిపి కనులు మూసికొని తన్మయత్వమున వాయించు నలవాటు కలవారు. కనుక కృష్ణప్పగారు కౌగిలించినంతనే వీణతీగలు తెగుట, శాస్త్రిగారులికిపడి కనులుతెరచి నిశ్చేష్టులగుట యొక్క మారుగా జరిగెను. తదుపరి శాస్త్రిగారు వీణ ఒడినుండి దింపిరి. సభ యంతయు నిరువది నిముషములపాటు నిశ్శబ్దమయ్యెను. తరువాత శాస్త్రిగారు కృష్ణప్పగారిని చూచి నవ్వుచు "ఇక నా వీణ ఉప యోగించి ప్రస్తుతము గానసభ చేయలేనుగదా! నీవిప్పుడైన వీణ వాయింపుము" అని పల్కిరట. కృష్ణప్పగారు మహారాజావారిని, ఇతర పెద్దలను జూచుచు, "ఇట్టి జగన్మోహనగానము జరిగినపిదప నేను కాదుగదా, సాక్షాత్తు సరస్వతీదేవియే వీణ వాయించినను రక్తి

కట్టడు. కావున నన్ను మన్నింపు''డని యూరకుండిరి. అంతటి పుంభావసరస్వతి మా యాస్థాన విద్వాంసులయ్యెనని ప్రభువులెంత యానందపడిరో వర్ణింపనలవికాదు.

శాస్త్రిగారి ఉత్తరదేశ దిగ్విజయము : విశ్వకవి రవీంద్రులు శ్రీ సూర్యరాయప్రభువుల యాహ్వానము పురస్కరించుకొని పిఠాపుర మేతెంచినపుడు సంగమేశ్వరశాస్త్రిగారి వీణాగానము విని, గానరసప్రియులగుట పీఠపురప్రభువుల యంగీకారముతో శాంతినికేతనమునకు కొనిపోయిరట. శాస్త్రిగా రచట కొంతకాలముండి విశ్వకవి కానందము కలిగించుచు, ఒకరిద్దరు విద్యార్థులకు వీణావాదనము నేర్పిరి. ఆ సమయమున సంగీతవిద్యలో ''ఛాంపియన్'' అని బిరుదు పొందిన ఒక జపాన్ దేశస్థుని సభ కలకత్తాలో జరిగెను. ఆ సభకు ఠాకూరు మన శాస్త్రిగారిని తీసికొనిపోయిరి. ఆ జపనీయుడు గజము స్వర పొడవుగల ఫిడేలు (వాయులీనము) సభలో ఆంగ్లసంగీతము (ట్యూన్సు) వాయించి, ''ఈ సభలో నెవ్వరేది పాడినను నేను దీనిపై వాయించెదను. లేదా నేను పాడినపాట తాము వాయింపగల్గినచో నే నోడిపోయినట్లంగీకరింతును'' అని పందెము వైచెను. ఠాగూరు వెంటనే మన సంగమేశ్వరుని బలవంతముగా వేదికపై కెక్కించెను. వారు వేదికపై నిలచి, ''నీవు చెప్పిన పనులు నేను చేయుదును. తరువాత నావీణమీద నీవు పాడినపాట వాయింతును. తర్వాత నీవు నావీణపై వాయింపవలెను'' అని ప్రతిజ్ఞచేసిరి. పిమ్మట శాస్త్రిగారాఫిడేలు చేతబూని, ఆంగ్లరాగము లన్నియు నతడు పాడినట్లు సునాయాసముగా వాయించి, ఫిడే లతని కిచ్చి, ''నేను పాడెదను, నీవు వాయింపుము'' అని త్యాగరాజకృతి నొకదాని నెత్తుకొనిరి. అత డించుకయు చేయి కదపలేక విస్మృతుడై యూరకుండెను. అనంతరము శాస్త్రిగారు ఫిడేలుపై త్యాగరాజ

కృతిని, వీణపై నాతడు పాడిన 'ట్యూన్సు' వరుసగా వాయించి, "నా వీణపై నీవు వాయింపుమని తమ వీణ నా ప్రముఖుని కోసగిరి. ఆ జపానీయుడేమియు పలుకలేక నిశ్చేష్టుడయ్యెను. తదుపరి విశ్వకవి ప్రేరణపై శ్రీ సంగమేశ్వరశాస్త్రిగారు సుమారొక గంటసేపు వీణ వాయించి, సభను తన్మయమొనరించిరి. పిదప సభానిర్వాహకులు సుమారు మూడుతులముల యెత్తుగల బంగారుపతకముమీద 'వీణాచార్య' అని నాగరలిపిలో బిరుదాక్షరములు చెక్కించి శాస్త్రిగారికి బహూకరించిరి. ఇటువంటి విజయగాథ లామహామనీషి జీవితములో నెన్నియో గలవు. శ్రీ శాస్త్రిగారు రచియించిన ఏకైకకృతి నిట వ్రాసి, ఈ ప్రకరణము ముగింతును.

### కల్యాణిరాగము - ఆదితాళము

పల్లవి : గణనాయకం - శుభదాయకం
గౌరీకుమారం - భజేహం ....

అను : గజవరాననం - శుభలాంఛనం
అజాదిసురనుతం - భజేహం ....

చరణం : దాసమాన సరసవేషం - పరమేశ్వరం - పావనకరం
పరమసుఖం - మమ దేహి వరమితి
దాసరామ హృదయ సంగమేశ్వరం
దయామయ మనవరతమాదరం ...

**సింహావలోకనము:** రావు వంశీయులకు జన్మసిద్ధముగా లభ్యమైన భాషాభిమానము, విద్యాభిమానము, పాండిత్యము, ఉదారగుణములు, దీనజనరక్షణము, లలితకళాభిమానము మొ॥ విశిష్టగుణములన్నియు మహారాజా రావు వెంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరువారిలో మూర్తీభవించెనని స్పష్టమగుచున్నది. గ్రాంధికభాషయందభిమానముగల సూర్యారావుగారు ప్రాచీన గ్రంథముద్రణలకు

ఎంతెంత ధనము వ్యయమొనరించిరో ఆంధ్రసాహిత్య పరిషన్ముఖ మున నెన్ని ఉత్తమ గ్రంథములను విమర్శలను ప్రకటించిరో, ఎంద రెందరు కవి పండితుల నాదరించిరో గణించుటకు వీలులేదు. వారు స్వయముగా రచియించిన గ్రంథపీఠికలు, ఇతర వ్యాసములు, వారికి ఆంధ్రాంగ్లములలోగల పాండితీప్రకర్షను తెల్పుచున్నవి. వీరిచేత ఆదరింపబడని కవిపండితు లాకాలమున ఆంధ్రదేశమున లేరనుట అతి శయోక్తి కాదు. సూర్యారావుగారికి గల విద్యావ్యసన మట్టిది. ఇం తటి మహారాజు తల్లిదండ్రుల మరణానంతరము దాయాదులవలన అష్టకష్టములపాలై చివరకు విజయలక్ష్మీవల్లభులై పీఠికాపుర సింహా సనాసీను లయినపిమ్మట అనాథల నాదరించి, పంచముల నుద్ధరించి విద్యాభివృద్ధికి సహాయపడుట తెలుగుజాతి భాగ్యము. 1909 నవం బరు 1శివ తేదీన మహారాజావారు తండ్రి రావు వేంకటమహీపతి గంగాధర రామారావు బహద్దరువారి పేరిట కాకినాడలో అనాథ శరణాలయము స్థాపించిరి. ఎన్నియో సాహితీసంస్థలకు విరాళము లిచ్చిరి. అన్నదానసమాజమువంటి జనకస్థాపిత సంస్థలను మరింత అభివృద్ధిలోనికి తెచ్చిరి; పీఠికాపురాధీశ కళాశాలను మొదటితరగతి కళాశాల యగుటకు కృషి చేసిరి. చిత్రలేఖనముపట్ల మహారాజా వారికి ఆదరముమెండు. నాడు చిత్రలేఖనమందభిరుచి గలిగిన చేమ కూర భావ్యకార్లరావునకు బొంబాయిలో చిత్రకళాశాలలో విద్యా భ్యాసమునకు తోడ్పడిరి. సంగీతాభిరుచిగల మహారాజావారి యాస్థా నమును దర్శించిన సంగీతవేత్తలు ప్యారాసాహేబు, మైసూరురాచప్ప, వీణ శేషయ్య, చెన్నపురి గోవిందస్వామిపిళ్లై, మైసూరువీణకృష్ణప్ప వంటి ప్రసిద్ధులు పీఠికాపుర ప్రభువు దర్బారున దసరా ఉత్సవములలో పాల్గొనిరి. వీరి యాస్థాన సంగీతవిద్వాంసులు వీణాచార్య శ్రీ సంగ మేశ్వరశాస్త్రిగారు సాక్షాత్తు గంధర్వలోకమునుండి దిగివచ్చిన

గంధర్వగాన శిరోమణి- సహజదయాగుణము, వితరణశీలము గలిగిన సూర్యారావు బహద్దరువంటి స్వార్థరహితముగా బహుముఖములుగా దేశసేవగావించిన మహనీయులు అరుదు. వీరి కీర్తి పతాకను దిగంతములకు వ్యాపింపజేయుటకు శ్రీ సూర్యారాయాంధ్ర నిఘంటువు చాలును. వీరొనరించిన మహత్కార్యములలో నొక్కొక్కటి ఒక్కొక్క పరిశోధనవ్యాసము వ్రాయుటకు తగినంతటిది. నేను స్వీకరించిన పీఠికాపురప్రభువుల కవిపండితపోషణలో 300 సం॥ చరిత్రను సమీక్షించుటవలన వీరియుగమునందలి కవిపండితపోషణ దిఙ్మాత్రముగా సూచించుటకు మాత్రము వీలుకలిగెను.

## శ్రీ రావు వెంకట మహీపతి గంగాధరరామారావు

మహారాజా సూర్యారావుబహద్దరువారి ప్రథమపుత్రులు శ్రీ గంగాధర రామారావుగారు యావరాజ్య పట్టాభిషిక్తులైన తర్వాత 1948లో జమీందారీలు రద్దైనవి. కనుక యువరాజావారి రాజ్యపాలనామాధుర్యము చవిచూచు భాగ్యము పీఠికాపురసంస్థాన ప్రజానీకమునకు కలుగలేదు. వీరు 1910లో అట్లతద్దినాడు మహారాణీ చిన్నమాంబాదేవి గర్భమున జన్మించిరి. సరస్వత్యారాధనమున తండ్రిని మించిన కొమరులై స్వయముగా కవియై పెక్కు ఆధునిక కృతులను రచియించి సరస్వతీదేవి నలంకరించిన యువరాజావారికి ఆంగ్లసాహిత్యముపట్ల మక్కువ ఎక్కువ. వీరు అధునాతనముగా కవిత్వము వెలయించినను ప్రాచీనాంధ్రకావ్యములను జదివిరి; మతగ్రంథముల నభ్యసించిరి. బాల్యమున తమ యాస్థాన కవిద్వయము శ్రీ వెంకటరామకృష్ణకవులు గురువులుగా గజేంద్రమోక్ష, ప్రహ్లాద చరితమాదిగాగల యుపాఖ్యానములను పఠించిరి. వీరివిశిష్టాద్వైతమత సిద్ధాంతసారమును శ్రీమాన్ గుదిమెళ్ళ రంగాచార్యులవారిశిష్యులై గ్రహించినవారు. ప్రాచీనకావ్యములలో వీరికి నాచనసోముని ఉత్తర



శ్రీరావు వేంకట మహీవతి గంగాధర రామారావు గారు

1910-1979

హరివంశము, పెద్దన్న మనుచరిత్రలపై ఆదరము మెండు. సంస్కృతములో వాల్మీకము, కాళిదాసకృతులు, భగవద్గీతల నధ్యయనము చేసిరి. ఆధునిక సాహిత్యమున యువరాజావారికి దేవులపల్లి కృష్ణ పక్షము, విశ్వనాథ కిన్నెరసానిపాటలు. శివశంకరుని జయదేవుడు, శ్రీశ్రీ మహాప్రస్థానములయెడల అభిమానము కలదు. ఆంగ్లమున రవీంద్రుడు, షేక్స్పియర్, వర్డ్సువర్తు, షెల్లీ, కీట్సు, బైరన్, వాల్ట్ విట్మన్. ఇ. ఇ. కమ్మింగ్సు, షా, గిబ్బన్, మకేమ్సన్, నోయల్ కవర్డు మొదలగువారి సాహిత్యమును యువరాజావారు కూలంకషముగా అధ్యయనము చేసిరి.

**యువరాజావారి తెలుగు రచనలు :** 1. నామరహితం, 2. సువిశాల మిదం విశ్వం, 3. చినుకుల చిందులు, 4. కంటికీ మనసుకీ కనిపించీ కనిపించని దృశ్యాలందామా? ఏమందాం? ఏదో అనాలనే అంటే? 5. తరంగములు, 6. స్వార్థత్యాగము, 8. తీరనికోరికలుతరువాత, 8. వరూధినీ ప్రవరాఖ్యం, 9. మూన్నాళ్ళముచ్చట్లు, 10. ఆ లోకమునుండి ఆహ్వానం, 11. వలపులు–అలపులు–తలపులు, 12. భువనవిజయము. చివరిది అముద్రితము.

ఆంగ్ల రచనలు : 1. Rain Drops, 2. No Name, 3. Miscellany, 4. Serious thoughts of a lay man, 5. The Sands Serenade the Snows, 6. The rainbows and the thunderbolts and the thesis of Man, 7. Irascible Iridescent Iridicum, 8. Of Men Matter and Me.

**1. నామరహితం :** 231 పుటల ఈ గ్రంథము 32 వచన గేయముల సంపుటి. విక్రమసంవత్సర మార్గశీర్షమాసమున మద్రాసు త్యాగరాయనగరు రామరాయ ముద్రణాలయమున నిది ముద్రితమయ్యెను. కవి నవీనధోరణిలో "ఆకాశంలో ఆవలింతలకు, గుండె

లోని పగుళ్ళకు, సుషుప్తిలోని సుడిగుండాలకు" అంకితమిచ్చెను. కావ్యపీఠిక "తొలిజాము"లో కవి పద్యము గద్యము కాకుండా, సంస్కృతాంధ్ర పదములను మేళవించి, పాతపదముల సంధులు విరిచి, కొత్తపదములు సంధులు కలిపి తన భావములను కొంత వ్యక్త పరచితినని తెల్పెను. తన క్రొత్తభావమును, క్రొత్తభాషను పాఠకు లంగీకరింపనూవచ్చును, తిరస్కరింపనూవచ్చును గాని మంచిదైన నిల్చునని, చెడ్డదైన నశించునని నిర్వికారముగా చెప్పెను. ఇందలి గీతములన్నియు నామరహితములే. తొలిగీతిలో తాను పాడినపాటకు ఆడినఆటకు నెందరో యాగ్రహించిరని, తనజోలి వారికెందుకని, అల్పజీవితకాలమున నీవిరోధములేల? యని కవి ప్రశ్నించుటలో వేదాంత దృక్పథము కన్పట్టును. ఫిరంగుల భయంకర జ్వాలలను జూచి మానవులుచేయు ఆర్తనాదములకు సూర్యచంద్రులు భీతిచెందిరని, పాపమునశించి ప్రపంచము శక్తిశాంతులతో విరాజిల్లుగాక యని మూడవగీతిలో వీరు కోరుచున్నారు. కవిత్వము పాలలోపాషాణము, వెన్నలో విషముకలిపి మ్రింగిపగలదు. ఊహాకందనిదిలేదు. పువ్వులలో తేనెచిందించి, మల్లెపువ్వుల పరిమళము వ్యాపింపజేయు శక్తి గానమునకు కలదు. కవిత్వగానము ఊహతో కలిపినచో కాంతిగాని కన్నీళ్ళుగాని యగునునుట యథార్థము. పేదల వేదన గ్రహించిన యువరాజావారు గంజి, గుడిసె, వస్త్రము, వ్యవసాయము లేవారికి చాలునని, మేడా మిద్దె చదువు అవసరములేదని తెల్పుటలో పేదల అవసరములను చక్కగా గుర్తించిరని తెలియుచున్నది. ప్రియుడు మరణించిన కోయిల కూజితములో, కుసుమములలో, గాలిలో కలిసిపోయివచ్చి ప్రేయసి శ్వాసలో చేరుదుననుట ఉదాత్తమగు భావము. అల్పజీవులైన క్రిమికీటకాదుల ఆవశ్యకత చర్చింపబడెను. కాలగమనమునుగూర్చి తెల్పుచు కవి ఒక తరమువారుచేసిన పని తరువాతి తరమువారు చేయరనుట సత్యదూరము కాదు.

మహారాజావారు గ్రాంధికవాదులు; ప్రాచీనసాహిత్యముపట్ల మక్కువగలవారు. యువరాజావారు వ్యావహారికమునందు నవ్య సాహిత్యమందు నభిరుచిగలవారు. తరముల తారతమ్య మిచటనే కలదు. కాలానుగుణమైన మార్పును ఎవ్వరైన స్వీకరింపవలెనను భావము పదవగీతమున కనిపించును. ఇట్లే వీరు పలురకములైన స్వభావములనుగూర్చి, వ్యక్తులనుగూర్చి వర్ణించిరి. జీవితములో కష్టసుఖములను సమానముగా ననుభవింపవలెనని కవి అభిప్రాయము. ఒక మహత్తరకార్యమునకు, అనేకుల జ్ఞానలాభమునకు సిద్ధార్థుని భార్య యశోధరవంటి ఒక్కరు బలియగుట అనావశ్యకమని, జమీందారీలు నశింపవలెనని కవి కోరుచున్నారు. జమీందారులు వీరాధివీరులై రక్తములు ధారవోసి శత్రువులను జయించి దేశస్వాతంత్ర్యము కాపాడిరి. కళలు శాస్త్రములు పోషించి, వ్యవసాయవాణిజ్యముల నభివృద్ధిచేసి, ప్రజాపాలన సాగించిరి. ఎంతకాలమునుండియో ఇట్లు చేయుచు వచ్చినను బ్రిటిషువారి పాలనను సమర్థించినది జమీందారులగుటచేత తామే నశించవలెనని ఈ నిస్స్వార్థపరుడైన యువరాజు వాంఛించుట ఆయన హృదయసంస్కారము వ్యక్తమగును. ప్రాపంచిక పరిశీలనా దృష్టిగల వీరు ఒకరి కానందము కలిగించువిషయములే వేఱొకరికి దుఃఖము కల్గించునని చెప్పిరి. స్వేచ్ఛాజీవికి జన్మము మరణసదృశమనుట, దివ్యలహరి, కార్చిచ్చు, ధైర్యస్థైర్యములు, పిరికితనము, సౌందర్యము, శక్తి, బుద్ధి, వికారము, నిర్వికారము, మాంద్యము మున్నగునవి మానవునిలోగల దేవదానవులనుట, కవి సంపూర్ణవిజ్ఞానమును దెల్పును. ప్రాపంచిక సుఖములను విసర్జించి సన్యసించుట కష్టము. కాని నిత్యభోగి హృదయసన్న్యాసము చేయుట ఆశ్చర్యము. శాంతింపుమనుట తేలికయేగాని శాంతించుట కష్టము. విశ్వములో లీనమై విశ్వపురుషుని సాన్నిధ్యము నొందిన

కవి తనలో అహంభావము నశించి, తాత్త్వికజ్ఞానము కలిగి, తత్త్వానందానుభవము కలిగెననుట అద్భుతము. ఏలయన మహారాజపుత్రుడై భోగజీవితము గడుపుచున్న కవి ఇట్టి తాత్త్వికానంద మందగల్గుట కేవల గురువుల యనుగ్రహము, పూర్వజన్మసుకృతము మాత్రమే. పీఠికలో చెప్పినట్లు ఈ గీతములు పద్యములు వచనములు కాక, సంస్కృతాంధ్ర మిశ్రితమైన వ్యవహారభాషలో వ్రాయబడెను. భావౌన్నత్యముతో నివి యలరారుచున్నవి.

2. సువిశాలమిదం విశ్వం : మద్రాసు ఆర్టుప్రెస్సున ముద్రితమై గుంటూరు నవ్యసాహిత్యపరిషత్తువారిచేత ప్రచురింపబడిన 132 పుటల ఈ గ్రంథమున పండ్రెండు వ్యాసములు గలవు.

1. ప్రయాణం : ప్రయాణమునుగూర్చి వ్యక్తీకరించిన అభిప్రాయము కవి పసిపాపమనస్తత్త్వముగలవాడని తెల్పును. ప్రయాణములో ఉద్రేకము, భావోత్సాహము, ఆనందము కల్గునని కవి ఉద్దేశ్యము. పనిలేకుండ టిక్కెట్టులేకుండ ప్రయాణించువాడుత్తమ ప్రయాణీకుడని, కోర్టువ్యవహారమునకో, ధనార్జనకో ప్రయాణించుచు, ఆనందమనుభవించలేని వాడధముడని కవి చమత్కరించెను. ప్రయాణము మానవత్వమును ద్విగుణీకృత మొనరించునని కవి యూహ. 2. ప్రేమ : ప్రేమవలన కలుగు పరిణామము లిందు తెల్పబడెను. ప్రేమకొరకు ఒక మహాసామ్రాట్టు తన సామ్రాజ్యమును త్యజింపగా నొకడా ప్రేమకొరకు మహారాజ్ఞిని హత్యచేసెను. తల్లీకొడుకుల ప్రేమ, అన్నాచెల్లెండ్ర ప్రేమ, భార్యాభర్తల ప్రేమ యని పలు విధములుగా నుండుటచేత కవి ప్రేమను నిర్వచించుట మానవుని కతీతమనెను. హృదయమున వివిధసన్నివేశములలో కలిగిన స్పందనను నిర్వచించుట సాధ్యము కాదనుట యథార్థము. 3. కొండలు-లోయలు : దూరపుకొండలు నునుపను భావమును కవి వ్యక్తము

చేయును. మానవుడు కొండపైనున్నప్పుడు లోయలోనికి దిగవలె నని, లోయలోనున్నప్పుడు కొండ ఎక్కవలెనని వాంఛించుచుండును గనుక పర్వతమున నున్నను లోయ నున్నను కష్టము సుఖము సమానమగుట అతడు సమ ప్రదేశమున నివశించుట మంచిదను భావమీ వ్యాసమున కలదు. మనిషి ఎక్కువకాలము ఆకాశమున గాని పాతాళమునగాని నిలువలేడు. అందరాని వస్తువుకై అఱ్ఱులు చాచు స్వభావముగల మానవునిగూర్చి ఈ వ్యాసము వ్రాయబడెను. 4. న వ్వు - ఏ డ్పు : భావప్రకటన కొరకనేక ధ్వనులు సృజింప బడెను. శబ్దముయొక్క అర్థమువలన భావప్రకటన చేయుటకుపయోగ పడు మాటలే ధ్వనులు. ఇందు మరియొక భేదమును కవి తెల్పెను. తుమ్ము, దగ్గు, నవ్వు, ఏడుపు మొదలగు శబ్దములచేత భావ ప్రకటన చేయుట. నవ్వు ఏడుపులను పూర్తిగా తొలగించుటకు వీలులేదు. సంతోషమునకు విచారమునకు కోపమునకు హాస్యమునకు నవ్వు కల్గు నని చెప్పి నవ్వు ఒక కళ యనుచున్నారు కవి. అట్లే ఏడుపును కళయే. భావప్రకటన వైశాల్యము సహజత్వములలో ఏడుపును మించినది లేదని, రోదన మనెడి కళలో స్త్రీలు సిద్ధహస్తులని, ఏడు పును ఏడుపుచేతనే ఖండించవలెనని కవి వివరించెను. 5. దు ర ద : దురదలేనిచో గోకుటవలన సుఖములేదు. దురదలేని జీవితము రస హీనము. ఈ దురద శారీరకము మానసికము నని రెండువిధములు. దురద లేనిచో కోరిక లేదు. కోరికలేక జీవించుట యనవసరము. గులాబీపువ్వును వాసన చూచుటకు, పిల్లలను ముద్దుకొనుటకు, ప్రేమ కామములకు నీ దురదయే కారణము. దురద మంచిదీ కాదు చెడ్డదీకాదు. సహజమగు సంఘటనమని కవి తేల్చెను. 6. ఆ ట లా డు కో ట ం : ఆటలాడుకొనుటకే మనము జన్మించితిమి. పలు రకముల ఆటలతో జీవితము తేలికగా గడచును. జీవితమే ఒక

ఆటగా గడపినచో జననమరణములు తేలికయగును. ఈశ్వరుడే సృష్టితో నాటలాడుకొనుచుండగా, మానవుడును ఆడుకొనినచో నది జీవితమున కపూర్వమైన కళ అనుటలో కవి తాత్త్వికభావము వ్యక్తమగును. 7. దేవుడు : దేవుడనగా గొప్పసత్యము లేదా అసత్యము. ఆస్తికుడనని చెప్పు జ్ఞానముకాని, నాస్తికుడనను శక్తి కాని మనకు లేదు. భగవంతు నుంచుటయా తీసివేయుటయా యను నది ఆలోచనలోనున్న ప్రశ్న. భగవంతుడు లేడని నిర్ధారణ కాలేదు కనుక భగవంతు డున్నాడని నమ్మవలెను. నమ్మనిచో శాంతిసౌఖ్య ములు లేవు. భగవంతు నేదియు కోరక, ప్రార్థనలతో విసిగింపక, తాను సుఖించుచు నితరుల సుఖింపజేయువాడు గొప్పవాడు. దేవు నితో నేవిధమైన సంబంధము కల్పించుకొనకుండుశక్తి తనకు లేదని, తనకు తోచినట్లు భగవంతు నూహించుకొని ప్రార్థింతునని కవి నిష్క ర్షగా చెప్పెను. 8. ప్రకృతి : ప్రకృతిని కవి నిర్వచించినతీరు విలక్ష ణము.అనేకములగు వస్తువులమొత్తము ప్రకృతి.ఇందున్నవస్తుసముదా యముయొక్క ప్రత్యేకతకంటె ప్రకృతికి వేరైనప్రత్యేకతలేదు. ప్రత్యే కత లేకపోవుటచేతనే ప్రకృతిఅసత్యము. "ప్రకృతికాంతా!"యనిపాడు కొను కవి పిచ్చివాడు. సాధారణముగా ప్రపంచములో నెందులకూ పనికిరానివాడు కవిగా పరిగణింపబడును. అతనియబద్ధములకు ఉన్మా దమునకు హద్దులేదు. కవిత్వము నిమిత్తములేని ప్రకృతిని ఊహా శక్తితో సృజింపనక్కరలేదు. ప్రకృతిలోనున్న పదార్థములు మనకై సిద్ధము చేయబడలేదు. కాని ప్రకృతిలోగల గాలి, నీరు, కొండలు, పువ్వులు, పండ్లు మొ॥ పదార్థములను మన ముపయోగించుచుం టిమి. సృష్టికార్యమునకు భగవంతు డుండవలసిన అగత్యము లేదు. ప్రకృతియే లేదు. దానిలో సౌందర్యము కట్టుబాట్లు లేవు. దానికి కర్తయనవసరమని చెప్పె, ఇది యంతయు తన అనుమానమేకాని

సిద్ధాంతముకాదని కవి తెల్పెను. ఇదియొక నూతనమైన భావము. ఈ వ్యాసభావము కవి తార్కికశక్తికి నిదర్శనము. 9. కవిత్వము-సంగీతం చిత్రలేఖన శిల్పం: ఈ నాల్గును కల్పనయే. వీనివలెనే కవిత్వము వట్టి బూటకము; కృత్రిమమైనసృష్టి. ముఖము చంద్రుడు, నేత్రములు పద్మములగుట అబద్ధము. కవిత్వముయొక్క నిర్వాచనము "అబద్ధాలవ్రాత." కవిత్వము వ్రాయువాడు తన అనుభవములను కలలను ఉన్నవియున్నట్లు చిత్రించినచో ప్రభుత్వమతనిని కారాగారమున నుంచును. ఆ కవి ఇతరుని భార్యనో, భర్తనో ఉద్దేశించి వారి వారి పేర్లను సహితము యథాతథముగా వ్రాసినచో దాని ఫలితమేమగును? మరి సంగీతమన్ననో లేనిభావములను గల్పించుట. రంగులతో ముగ్గుతీర్చుటయు చిత్రలేఖనమే యగును. చిత్రమునకు జీవము పోయుట అసత్యము. శిల్పమునట్టిదియే. రాతిని మట్టిని ఎంతతీర్చిదిద్ది చెక్కినను దానికి మాటయు మంతియు నుండవుకదా! మొత్తము మీద నీకళలు చాల చిన్నవనియు నీకళలను సృజించిన వారి గొప్పతనమేమియు లేదనియు వ్యాసకర్త యభిప్రాయము. 10. సంఘజీవమత్కారం: మానవుడు తన స్వార్థము కొరకు సంఘజీవి యగుచున్నాడు. విందుచేయువాడు, విందునకు వచ్చువాడును స్వార్థపరులే. ఏ లాభమునైన కోరియో, బిరుదులకోసమో-వీరు విందులు చేయుదురు. ఈ సంఘజీవులు పైకెంత ఆప్యాయముగా మాటలాడుకొన్నను లోపల పరస్పరము నిందించుకొందురు. స్వలాభాకాంక్షులు దేశోద్ధారకులవలె నటింతురు. ప్రభుత్వమువలన లాభముపొందినవాడు ప్రభుత్వము దేశాభివృద్ధికి కృషిచేయుచున్న దనును. ప్రభుత్వమువలన లాభము పొందనివాడు ప్రభుత్వము ధ్వంసము కావలెనని కోరును. ఇట్లే సంఘమంతయు మాయ మోసము. సాంఘిక జీవనమెంత కృత్రిమమో వ్యాసకర్త అతిసహజముగా వర్ణించినారు. 11. దొంగ:

మానవజీవితమున అధికభాగము దొంగలే. వస్తువులను విపరీతమగు ధరలతో నమ్మి కోటీశ్వరుడైన మోసగాడు, విశ్వోద్ధారకునిగా సంచరించు స్వలాభపరుడు, శిథిలావయవములకు రంగులు పూసి, వస్త్రములతో కప్పుకొనువాడు దొంగలే. అసలు సృష్టిలోనే దొంగతనమున్నది. ఉండియునుండనట్లు తోచు దేవుడే పెద్దదొంగ. 12. అభివృద్ధి : భిన్నమన స్తత్వములనుబట్టి అభివృద్ధి యుండును. ఆధునిక వేషభాషాదులు యువకునికభివృద్ధి యనిపించగా, వృద్ధునికి పతనమనిపించును. సాగిపోవుట అభివృద్ధియని కదలిక ప్రాణమని వ్యాసకర్త ఉద్దేశ్యము.

విశాలమైన విశ్వములో భిన్నమన స్తత్వములుగల వ్యక్తులు, భిన్నభావములుగల వనుటయే గంగాధర రామారావుగారి ముఖ్యోద్దేశము. కనుకనే "సువిశాల మిదం విశ్వం"అని పేరుపెట్టిరి.ఈ వ్యాసములలో యువరాజావారు తమ యభిప్రాయమును నిర్మొహమాటముగా నిర్భయముగా, సూటిగా తెల్పుట గమనింపదగినది. 3. చినుకుల చిందులు : ఈ కావ్యము మద్రాసు రామరాయ ముద్రణాలయమున ప్రమాది సంవత్సర భాద్రపద మాసమున ముద్రింపబడి ప్రకటితమయ్యెను. 63 పుటల యీ ఖండకావ్యమున నేడు గీతములు గలవు. 1. గు రు వు గా రు : విద్యాగురువు శ్రీ ఓలేటి వేంకటరామశాస్త్రిగారు మరణించిన పిమ్మట యువరాజావారావేదన చెందుచు నీ గీతము వ్రాసిరి. శ్రీ శాస్త్రి వీరిచేత కవితాభ్యాసముకూడ చేయించెడివారు. పిఠాపురము కోటలో నందరు శాస్త్రిగారిని గురువుగారనియే పిలిచెడివారు. కలకాలమున్న కాకికంటె వసంతమందే మధురధ్వని చేసిన కోయిల ఘనమైనదనుచు గంగాధర రామారావుగారు తమ గురుదేవుని కోయిలతో పోల్చిరి. 2. నీలగిరి శిఖరాగ్ర పార్శ్వప్రదేశ విహార సందేశము : నీలగిరి పర్యటనలో తనకు కలిగిన

అనుభూతిని కవి యీగీతమున వ్యక్తీకరించెను. ఈ లోకమున అసత్య పరులు దుర్మార్గులు అమితముగానున్నను కొందరు సన్మార్గుల కార ణమున ప్రళయము సంభవించలేదని, దైవాధీనం జగత్సర్వమ్మను భావము లిందు గోచరించును. 3 ప్రేమలేఖ: ఈగీతమున ప్రేమ తత్వము తెలుపబడెను. శృంగారరసభరితమగు నీ గీతమున ప్రేయసి సందేశగానము చిన్నిపూఁదెనెతోడను, పికరాజ్ఞికూజితముతోడను, గోదావరీ వాయుతరంగములతోను పోల్చబడెను. 4. శ్మశానస్వస్తి: ఈ గీతమున కవి కర్మకాండపట్ల తన అనాసక్తతను వివరించును. తనమరణమునూహించుకొని కవి ఈగీతము వ్రాసెను. తన శరీరము శ్మశానమున కాష్ఠములపై కాలునపుడు కవి లోకమునకు స్వస్తి చెప్పును. తాను జీవించి యుండగా బ్రదుకును దుఃఖభూయిష్ఠము చేసిన బంధుమిత్రులకు తన మరణమువలననైన తృప్తికలుగనిచో తన బూడిదను నీటకలిపి త్రాగవచ్చునని కవి చెప్పెను. అతడు తన అంతిమసమయమున నృరాక్షస సంస్థకు జీవనాసత్యగతికి దుఃఖవారి నిధికి శ్మశానస్వస్తి పలికెను. ఈగీతమున కవిహృదయము అంతర్లీ నముగానున్నట్లు తోచుచున్నది. భాషాసాహిత్యముల భేదభావముల వలన యువరాజావారు తండ్రికి దూరమైనట్లు చెప్పబడుచున్నది. దానినాధారముగా జేసికొని బంధుమిత్రులు కొందరు ఆయన జీవిత మును మరింత శోకమయము కావించియుందురు. అందువలన కలిగిన బాధ ఈగేయమున లీలగా గోచరించును. మానవుని విశ్వాసహీన తకు విరక్తి చెందిన కవి అటువంటి వారందరు తనను మరచుటయే వారు తనకుచేయు ఉపకారమని తలంచెను. 5. పొగమంటలు: మానవుని అమానుషత్వము, అందువలన ప్రజ్వరిల్లినమంటలు చల్లారి ప్రపంచమున శాంతి నెలకొనవలెనని కవివాంఛించుట ఈ గీతభావము. 6. దేవదేవ యేలతెలుపవయ్యా: ఒకపిన్నవాడు పెద్ద

కాపు పాంథుడు రాజు ఒక యువతిని గాంచి మనోవికారమునకు లోనగుట ఈగీతమున వర్ణితము. భర్త పొరుగూరిసంతలో దూడనమ్మి కాపునకు కాడియెడ్లను గొనితెచ్చుటకు వెడలి తిరిగిరాలేదని ఆ యువతి విచారించుచుండెను. అంతకు ముందామెను చూచిన నలుగురు పురుషులు వెడలిపోవుదురు. చెట్టునకు కట్టిన ఉయ్యాలలోని పాప మాయమగుటచూచి ఆమె దుఃఖించును. చిక్కి శల్యమైన ఆపడతి చిన్నికాపురము చితికిపోవుటకు కారణమేయని కవి ఆవేదనతో దేవుని ప్రశ్నించును. ఆకాముకుల దుష్టత్వమునకు ఆమెభర్త, పసిబిడ్డఆమెకు దూరమైన భావము సూచింపబడెను. కవి కరుణార్ద్రహృదయుడై ఆమెను గూర్చి చింతించెను. 7. ఆనాడు ఆవేళ: పూర్వము కాశ్మీరములో షాజహాను ముమ్తాజ్‌లు వన విహారము చేసిన నిషాదు తోటలోనికి ప్రవేశించిన కవికి కలిగిన భావపరంపర నీగీతమున పొదిగెను. ఆతోటలోనికి షాజహాన్ విషాదప్రేమగాథ కవికి వినిపించెను. షాజహాన్ తానామె వియోగము సహింపజాలనని ముమ్తాజ్‌తో చెప్పెను. ఆమె షాజహానును చెంతకు రమ్మని పిలువగా నతడాశ్చర్యమున పోయి ఆలింగనముచేసికొనబోగా వారిరువురి మధ్య దట్టముగా కురిసిన వర్షపరంపరతో వారి సంభాషణ సమసిపోవును. ఈ ఏడుగీతములు గ్రాంథికమున వ్రాయబడెను. కఠినపదములు, దీర్ఘ సమాసములుకల ఈగీతములన్నిటియందు ఉన్నత భావములు గోచరించును.

4. కంటికీ మనసుకీ కనిపించీ కనిపించని దృశ్యాలందమా! లేక మరి ఏమందాం? ఏదో అనాలనే అంటే! : 169 పుటల ఈ గ్రంథమున డెబ్బదినాల్గు దృశ్యములు కలవు. అధునాతనభావములతో వ్రాయబడిన ఒక్కొక్కదృశ్యము కవి భావమును సంగ్రహముగా తెల్పును. మానము స్వర్గలోకమునుగూర్చి కథలు చెప్పుకొం

దుము. కన్నులముందు జరుగుచున్న దృశ్యములను విడిచి స్వర్గలోక దృశ్యములు స్మరించుట అనవసరమని కవి అభిప్రాయము. భూలోకమునే స్వర్గం చేసికొందమనీ, స్వేచ్ఛాజీవనము సాగింతమని 11వ దృశ్యంలో కవి స్వేచ్ఛాప్రియత్వమును వ్యక్తము చేసినారు. 13వ దృశ్యం : "దేవాలయం-ఘంటానాదం - కర్పూరహారతి-ధూపం-గంధం-పుష్పాలు-ఫలాలు-పూజాసామగ్రి-పూజారులు- పూజ-గర్భగుడిలో చీకటి - మూలవిరాట్టు - విగ్రహానికి పెద్దపగులు బీట - ఆ బీటలో ఎలక దూరింది - విగ్రహం - వెనుక పిల్లి ఎలుకకోసం వేచి ఉంది-దేవాలయం ముందు కుక్క చచ్చిపడి ఉంది-పుణ్యగుండంలో యాత్రికులు వంటిమురికి కడిగేరు-ఊళ్లో పూజారిభార్య దేవతార్చన గదిలో పాలికాపు పక్కలో పడుకుంది - పాలికాపులేని పొలంలో కాకులు గింజలేరి తింటున్నాయి." ఒకానొక నగ్నసత్యాన్ని కవి ఈ దృశ్యంలో సూచించుచున్నారు. ఇట్లే ప్రతిదృశ్యమున అల్పాక్షరములలో అనల్పార్థమును వివరించుచు కవి ప్రాపంచిక విషయముల నెన్నిటినో వినూత్నపద్ధతి నావిష్కరించెను. సభ్యతకు దూరమైన భావములుకూడ నిందుగలవు. కొన్ని దృశ్యములలో ఒక్కొక్క భావము సూచించుటకు రెండు మూడు పదములను వ్యస్తముగా నిందు వ్రాయబడెను. ఉదా :- "అగ్నిజ్వాల - నీళ్ళజల్లు - భగ్గు." మరికొన్నిట వాక్యములుండును. ఉదా :- బీడుల్లో ఉన్న ఆవులు ఆకాశంవెంపు చూస్తున్నాయి-చెట్లమీదున్న పిట్టలు ఆకాశంవెంపే చూస్తున్నాయి- ఇలా కొన్నివాక్యములుండును. వీనిని సహృదయుడే సమన్వయము చేసికొని ఒక దృశ్య మూహించుకొనగలడు. 25, 28 దృశ్యములు సంభాషణరూపమున కూర్చబడెను. చివరిదృశ్యమున నొక పూర్ణానుసారము మాత్రము కలదు. ప్రపంచమంతయు మిథ్యయను వైరాగ్యభావమును కవి ఈదృశ్యముద్వారా సూచించెను

తరంగములు : 38 పుటల ఈ ఖండకావ్యము పిఠాపురము విద్వజ్జన మనోరంజనీముద్రాక్షరశాలలో 1938వ సం॥న ముద్రింపబడెను. ఇందారుగీతములు కలవు. "సముద్రతరంగముల రీతి భావ తరంగము లనంతములు.అమావాస్యాంధకారపూరముననుపూర్ణిమా శుభ్రజ్యోత్స్నోత్సవముునను తరంగము లుద్ఘోషించును. ఈ తరంగ ఘోషతరంగ కర్తకానందకారి. ఈ యానందమున మరియొక్క వ్యక్తియైనను పాల్గొనదా?" అని తొలిపలుకులో కవి తన తరంగ ఘోష నర్థము చేసికొను మరియొక్క సహృదయుడైన యుండునని ఆశించుచున్నారు.

1. నిదురపోవేమి : సాంసారిక జీవనమున కలతలతో బాధ పడువారికి నిదురయందైనను దుఃఖమయ జీవనమే స్ఫురించునని భావ మిందు గన్పట్టును. 2. అభాగ్యుడు : సూర్యాస్తమయమున తోటలో ప్రవేశించి ప్రకృతిసౌందర్యము నాస్వాదించు పాంథుడు అభాగ్యుడగుటచేత వెంటనే మేఘగర్జనలతో వర్షజలధారలతో వన మంధకారమయమగును. దారీతెన్ను కానలేని, ఇల్లులేని పాంథు డాత్మహత్య చేసికొనును.తర్వాత మేఘగర్జనలతోవర్షధారలునశించి అంధకార మంతరించెను. పాంథు డభాగ్యుడగుటవలన ప్రకృతిసహిత మతనిపట్ల సుముఖత చూపలేదని కవి భావము. భాగ్యహీను నెవ్వరు రక్షింపలేరనుట గీత పిండితార్థము. 3. ఇట్టి సంబంధ మెచ్చటనేనిఁ గలదే? ప్రేయసీ ప్రియుల శృంగారమిందు వర్ణితము. ఏకాత్మతగల నీ యిరువుర ప్రేమ విశ్వపర్యంతము వ్యాపించును. 4. రాధామాధవము : రాధామాధవ ప్రణయ మిందు వర్ణింపబడెను. రాధ ప్రణయమును జ్ఞప్తికి తెచ్చుకొని మాధవు డామెకొఱకు విచారించుట ఇందలి విషయము. 5. మెఱపురాణి : ఆకసముననున్న మెఱుపు రాణి భువికి దిగివచ్చినచో భూలోకపు వింతలను చూపి, తన కవిత

వినిపించి వలపింతునని కవి పలుకుటలో అందరానివాని నందుకొనుట కతడు ప్రయత్నించినట్లు తెలియును. 6. అవ్యక్తుని గానము : నవ్వినను, పాడినను, ఆడినను, చూచినను, చెప్పినను తప్పగనుక ఆయా పనులు చేయవలదని కవి చెప్పెను. ఈ గీతము కవి విశేషలోకానుభవ పరిజ్ఞానమున కుదాహృతి. "సూర్యు డుత్తరమున నుదయించెనని, గదలు కత్తులయ్యెనని, నదులు కొండమీదికి ప్రవహించెనని చండి రుద్రుని దండించెనని, చెఱకురసములో చేదు బుట్టెనని, మేఘములందు దావాగ్ని బుట్టెనని, భూనభంబుల బూడిద గప్పెనని, మేడపై గాడిదపిల్ల యరచెనని అవ్యక్తుడు గానము చేసెను. ఇత డవ్యక్తుడు గనుక అసంభవములను సంభవించిన ట్లూహించుకొనెను. ఈగీతము వ్యావహారికమున, మిగిలినవి గ్రాంధికమున వ్రాయబడెను.

స్వార్థత్యాగము : నాలుగంకముల యీ నాటకము యువరాజావారి తొలి నాటకము. ఇది 1937లో పిఠాపురము శ్రీవిద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాలయందు ముద్రిత మయ్యెను.

బాష్పజల తరంగంబులc బాద్యమిచ్చి
యాత్మభక్తిరసంబున నర్ఘ్యమొసcగి
మాతృదేవతాపాద సమ్మానమొదవc
బూజసేయుదు నిదియొక్క పూవుc జేసి.

అని మరణించిన మాతృదేవిని కన్నీటితో ఆత్మభక్తితో, స్వార్థత్యాగమను పుష్పముతో యువరాజావారు అర్చించిరి. స్వార్థరహితురాలిగా ఖ్యాతిగాంచిన మహారాణీచిన్నమాంబాదేవికి "స్వార్థత్యాగము" అంకితమిచ్చుట యెంతయు తగియున్నది.

కథ : విద్యుల్లత సంపన్నుడగు వినయభూషణుని తనయ. ఆ మెమిత్రుడు శశాంకుడు మాయాస్వరూపిణియగు స్త్రీకి స్వాతంత్ర్య

మిచ్చినచో పురుషునిస్వాతంత్ర్యము కొంత తగ్గునని, సంసారమను యుద్ధమున నేడ్చియైన విజయము సాధించు వనిత సబలయే నని స్వార్థమును త్యాగముచేయు పురుషు డరుదుగా నుండుననియు విద్యుల్లత చెంత నుపన్యసించుచుండును. నవనాగరక శిరోమణి తుషారకణ వీరి స్నేహితురాలు. ఈ యిరువురు స్నేహితురాండ్ర నడుమ రెండు సూదంటు రాళ్ల నడుమ యినుపముక్కవలె నైతి నని తుషారకణ చెంత శశాంకుడు వాపోవును. విద్యుల్లత తల్లి చిన్ననాటనే మరణించుటచేత ఆమె వివాహమును గూర్చి వినయభూషణుడు విచారించుచుండును. "పారిస్" పట్టణములో వీరికి చారుదత్తుడు పరిచయ మయ్యెను. చారుదత్తుని తల్లి విద్యుల్లతను తనకుమారుని కిచ్చి పరిణయము చేయుమని వినయ భూషణునికి కబురుచేసెను. చారుదత్తుని పరిణయమాడుటకు విద్యు ల్లత అంగీకరింపలేదు. ఒకనాడు శశాంకుడు తాను విద్యుల్లత ఆకర్ష ణకు లొంగిపోయితినని, వివాహమును మాత్రము విశ్వసింపనని పల్కెను. "మీరు స్వేచ్ఛానురాగ మతోపాసకులా?" అని విద్యు ల్లత ఆతనిని ప్రశ్నించెను. అత డౌననెను. ఆమె వెడలిపోయిన పిమ్మట తుషారకణా శశాంకు లొకరియందొకరు అనురాగము ప్రక టించుకొనిరి. శశాంకుడు తుషారకణను ప్రేమించునేమోయని విద్యు ల్లత బాధపడును. తర్వాత తుషారకణ "ఫోను"లో తనకు శశాంకు నితో వివాహమని చెప్పినంతనే విద్యుల్లత పిడుగుపడినట్లేడ్చును. చారుదత్తుడు విద్యుల్లతతో సాన్నిహిత్య మభిలషించును. ఒకనా డతడు తాను విద్యుల్లతను వివాహమాడగోరుచున్నానని విద్యుల్లతా వినయభూషణులకు చెరియొక లేఖ వ్రాయగా, విద్యుల్లత శశాంకుని మరువలేకున్నను, చారుదత్తుని నిష్కళంకప్రణయమునకు లోబడి ఆతనిని సుఖింపచేయుటకు, తండ్రిని సంతోషపెట్టుటకు వివాహమ్మున

కంగీకరించెను. తుషారకణా శశాంకులు మూడేండ్ల తరువాత "షికాగో"లో విడాకులు తీసికొందురు. విద్యుల్లతాచారుదత్తులు వినయభూషణుడు యూరపు ప్రయాణమునకు సిద్ధమగుచుండగా, చారుదత్తు డింటలేని సమయమున శశాంకుడు వచ్చి పూర్వము విద్యుల్లత తన కిచ్చిన యుంగర మామెకొసగి, ఆమె పవిత్రమైన ప్రేమకు తా నన్హుడనని, తనను క్షమింపుమని వేడెను. ప్రపంచము నకు భయపడకుండా విద్యుల్లత ప్రేమ వెల్లడిచేయవలెనని శశాంకుడు అడిగెను. విద్యుల్లత తాను గృహిణీధర్మమునకు విరుద్ధముగా ప్రవర్తించనని, స్వార్థత్యాగమే మానవధర్మమని పల్కుచుండగా నప్పుడే యింటికి వచ్చిన చారుదత్తుడు అప్రియత్నముగా విని విద్యుల్లతను కొనియాడెను. ఆమె శశాంకుని వలచినది కనుక ఆమె సుఖముకొరకు విడాకు లిచ్చెదనని చారుదత్తుడు చెప్పి స్వార్థము త్యజించి వెడలిపోవుచుండగా నాతనిని పోవలదని యేడ్చుచు విద్యుల్లత పడిపోయెను.

ఈ యాధునిక నాటకమున నాందీప్రస్తావనాది నాటకలక్షణములు లేవు. నాటకారంభమున నాటకకర్త "జగన్నాటక సూత్రధారి ప్రపంచనాటకమును దివ్యముగ నడిపించుచుండగా, ఆ నాటకములో పాత్రయగు తానొక యంతర్నాటకము వ్రాయుచుంటిన"ని చెప్పెను. ఇందొక్క పాట కలదు. పద్యములు లేవు. సంభాషణలు శిష్టవ్యావహారికభాషలో సాగెను. సంభాషణలు భావోద్రేకముతో చురుకుగా నడిచెను. అచ్చటచ్చట దీర్ఘమైన స్వగతములు గలవు. కథావస్తువు ఉన్నతవర్గమునకు చెంది సంవిధానము పటిష్ఠముగా తీర్చబడెను. పాత్రలు : 1. విద్యుల్లత : ఈమె నాగరికయువతియైనను భగవద్గీతాపఠనమం దాసక్తి కలది. శశాంకుని వలచినను, తుషారకణాశశాంకుల దాంపత్యముపట్ల ద్వేషము ప్రదర్శింపదు;

శశాంకుని యందలి అనురాగమును వీడదు. కాని తండ్రి సంతోష మునకు, నిష్కళంకుడైన చారుదత్తుని సౌఖ్యమునకు స్వార్థము త్యజించి చారుదత్తుని పెండ్లాడెను. నాటినుండి గృహిణీధర్మములను పాటించుచు, చారుదత్తునికి సుఖసంతోషములను కల్గించుచు పత్నీ ధర్మము నెరవేర్చిన పవిత్రమూర్తిగా విద్యుల్లత కన్పట్టును. శశాం కుడు వచ్చి పూర్వప్రణయమును ప్రకటించుమని కోరినను అంగీకరిం పక, చారుదత్తుడు తన సుఖమునిమిత్తమే స్వార్థత్యాగముచేసిపోవుట సహింపలేక మూర్ఛిల్లిన విద్యుల్లత చారుదత్తునిపట్ల ఎంత అనుబం ధము, ఆత్మీయత పెంచుకొనినదో ఊహింపవచ్చును. 2. తుషార కణ : అధునాతన నాగరికత లక్షణములు పరిపూర్ణముగా కలిగిన స్త్రీ. 3. శశాంకుడు : స్వేచ్ఛానురాగవాదియైన యితడు, స్త్రీ యెందరు పురుషులనైన తృప్తిపరచవలెనను భావము కలవాడు. వివాహమున విశ్వాసములేని చపలచిత్తుడు. విద్యుల్లతను తుషార కణను వలచినట్లు యిరువురకుచెప్పి వంచింప యత్నించిన వంచకు డీ శశాంకుడు. తుషారకణకు విడాకులిచ్చి మరల విద్యుల్లతనుచేరి క్షమా భిక్షవేడి, ఆమెకు తనయందుగల ప్రేమ నిర్భయముగా వెల్లడింపు మని నిర్బంధించిన దుష్టవర్తను డీ శశాంకుడు. 4. చారుదత్తుడు : నాటకమందు త్తమోత్తమమైన పాత్ర చారుదత్తుడు. విద్యుల్లతను నిర్మలానురాగమున వివాహమాడినవాడు. విద్యుల్లత శశాంకుని ప్రేమించెనని తెలిసి, తనను వివాహమాడుటచేత గృహిణీధర్మము నకు వ్యతిరేకముగా ప్రవర్తింపదని గ్రహించి, ఆమెను పతివ్రతగా కీర్తించి, ఆమె సౌఖ్యమునకు విడాకులిచ్చుటకు సిద్ధపడిన త్యాగ మూర్తి చారుదత్తుడు.

సన్నివేశకల్పనలో గంగాధర రామారావుగారు సిద్ధహస్తులు. ద్వితీయాంకమున విద్యుల్లతా చారుదత్తులు ఒక్కొక్క కారణమ్ము

చెప్పి వెడలిపోవుటతో తుషారకణాశశాంకుల ప్రేమకలాపమున కనువగు సన్నివేశమును కల్పించిరి. చతుర్థాంకమున విద్యుల్లతా చారుదత్తుల స్వార్థత్యాగము నిరూపించుట కనువైన సన్నివేశము కల్పింపబడెను. విద్యుల్లత తననిమిత్తము స్వార్థత్యాగము చేసెనను మాట అప్రయత్నముగా వెలుపలినుండి వచ్చిన చారుదత్తుడువినుట, వినుటవలననే ఆమెనిమిత్తము తానును స్వార్థమును విడిచిపెట్టి వెడలిపోవుటకు సిద్ధమగుట మొ॥ సన్నివేశములను నాటకకర్త చతురముగా కల్పించెను. ఇట్లు పాత్రచిత్రణ, సన్నివేశకల్పన, కథాసంవిధానము చక్కగా సమకూర్పబడెను. విద్యుల్లతా చారుదత్తులు స్వార్థత్యాగములో ఒకరినొకరు మించిరి. యువరాజావారికి భగవద్గీతపట్ల మక్కువ యెక్కువ. అందువలన విద్యుల్లతకు భగవద్గీతా పఠనాసక్తి యున్నట్లు వీరు చిత్రించిరి.

తీరని కోరిక– తరువాత : 1940లో మద్రాసు రామరాయ ముద్రణాలయమున ముద్రింపబడిన 166 పుటల ఈ నాటకమందు దారంకములు గలవు. ఇదియు ఆధునిక నాటకమే. తీరని కోరికలతో కాల చక్రమున నలిగిపోయెడి బ్రతుకులకీ నాటక మంకితము చేయబడెను.

కథ : వాగను శాసనుడను పేరుతో చెకుముకి యనువాడు దేశాటనము చేయుచుండును. తల్లిదండ్రులులేని బ్రహ్మచారి చెకుముకి గాంధీగారి సహాయ నిరాకరణోద్యమమున చేరి, కొందరివద్ద కవిత్వము, కొందరిచెంత వేదాంతము చెప్పి ఉపన్యాసములిచ్చి నిజముచెప్పి, అబద్ధముచెప్పి, నవ్వి, యేడ్చి ప్రజలనుండి ధనము సంగ్రహించెడివాడు. ఒక సామ్యవాద సభలో నితడు స్త్రీలు, పల్లె జనులు హేళనచేయుచున్నను ఉపన్యాసమిచ్చెను. ఆ యుపన్యాసమున, హిమాలయము, అట్లాంటిక్ సముద్రము, తాజ్ మహల్‌లోని రాళ్లూ కూడ నందరకు సమానముగా పంచి ట్టవలెనని చెకుముకి

పల్కెను. ఆ సమయమున కచటికిరక్షభటులు రాగా నతడు తాను వాగను శాసనుడనుగానని, శాంతిభద్రతలు రక్షించుటకు వచ్చితినని, యిటువంటిసభలలో నెప్పుడు పాల్గొననని వారికి వ్రాసి యిచ్చెను. ఒకనాడు చెకుముకి బాల్యమిత్రుడు నరేంద్రుడు వచ్చి, అతనిలోనున్న చెడుగుణముల పారద్రోలి, ఉత్తమగుణములను వెలికి తీసి సంఘమున కుపయోగపడునట్లు చేయుదునని పల్కెను. ఇట్లు ప్రతిమానవునిలో దుర్గుణములను తొలగించి, నిజమైన మానవులుగా సంఘసేవకులుగా వారిని తయారుచేయుట నరేంద్రుని ఆశయము. చెకుముకి నరేంద్రునికడ కొంతకాలముండి సంస్కరింపబడుట కంగీక రించెను. నరేంద్రుడు అబద్ధమాడవద్దనీ కోపించరాదనీ, చెడు ఆలో చనలు రానీయవద్దనీ చెకుముకికి బోధించెను. తిలోత్తమ యను రూపవతి కులటయై తిరిగి తుదకు వీధులబట్టి పోవు పరిస్థితిలోనుండగా నరేంద్రుడామెను తనయింటికి తీసికొనివచ్చి ఆశ్రయమిచ్చెను. పూర్వము నరేంద్రుడు పతితుడే. ఒకానొక ముహూర్తమున నతడొక స్త్రీని చూచెను. ఆమెతో పరిచయమైనా కాలేదు కాని, నరేంద్రు డామెను వలచి, ఆనాటినుంచి వ్యభిచారము మానివేసెను. నేడీ తిలోత్తమ నరేంద్రుని ప్రేమించి, తనకు కొంత ప్రేమ పంచిపెట్టుమని యడుగ నితడు నిరాకరించెను. తిలోత్తమ మాత్రమాతనినే ప్రేమింతునని ప్రతిజ్ఞచేసెను. నరేంద్రుడు దుష్టవర్తనులైన స్త్రీ పురుషులను చేరదీసి చేయరాని పనులు చేయుచున్నట్లు పత్రికలలో ప్రచురింప బడెను. నాటినుండి నరేంద్రుడు సంఘములో బాధితులైన స్త్రీల కాశ్రయమిచ్చుచుండెను. వేశ్యచేతులలో భర్తను జూచి భరింపలేక అతనిని హత్యచేసిన వాసంతి యను మహిళ నరేంద్రుని ఆశ్రమమును చేరెను. మంగళ యను మగువ బావచేత మోసగింపబడి సంఘము నకు భయపడి తనకు కలిగిన పాప నడవిలో విడుచును. సంఘు

యామెను వెలివేయగా నరేంద్రుడామె కాశ్రయమిచ్చెను. ఘటోత్కచుడనువాడు తిలోత్తమ వజ్రపుటుంగరము నపహరించి రక్షకభటులకు చిక్కెను. తిలోత్తమ తానే యుంగర మాతనికిచ్చితినని పల్కి అతనిని విడిపించి నరేంద్రు నాశ్రమమునకు చేర్చెను. భర్త చేత బాధల నొందుచున్న పల్లెటూరి అచ్చమ్మయు నచటికి చేరుకొనెను. ఈ స్త్రీల నందరను వాగనుశాసనుడు వాంఛించును. పిచ్చివాడొకడా యాశ్రమమున ప్రవేశించి నరేంద్రుని జూచి ఆసుపత్రిలో తననుకొట్టిన జవాననుకొని చంపబోయెను. తిలోత్తమ అడ్డునిలువగా పిచ్చివాని కత్తి తిలోత్తమభుజములోనికి దిగెను. ఘటోత్కచుడామెకు రక్తదానము చేసెను. తిలోత్తమచేసిన త్యాగమును నరేంద్రుడు కీర్తించగా, తనకు నరేంద్రునియెడలగల ప్రేమ యాపని చేయించెనుగాని తనది త్యాగము కాదని తిలోత్తమ పల్కెను. ఇది యిట్లుండ చెకుముకి తనను వివాహమాడుమని అచ్చమ్మను ఒత్తిడి చేసి ఒప్పించెను. కాని ఆమెభర్త తన తప్పు తెలిసికొనివచ్చి అచ్చమ్మను దీసికొనిపోయెను. నరేంద్రుని యాశ్రమవాసులు ప్రభుత్వవ్యతిరేకులని భావింపబడెను. వారందరిని యుద్ధార్థము తమకు వశమొనరింప ప్రభుత్వము నరేంద్రు నాజ్ఞాపించెను. నరేంద్రవాగనుశాసనులు కొండలలో మాటలాడుకొనుచుండ పోలీసులు నరేంద్రునిపై నరెస్టువారంటు తెచ్చుచుండిరి. వాగనుశాసనుడు బలవంతముగా నరేంద్రుని పాకలోనుంచి వెలుపలగొళ్లెము పెట్టెను. పోలీసులతో పాకయందు భల్లూకమున్నదని చెప్పి అతడు వారిని భయపెట్టగా వారు పలాయితులైరి. ఆ సమయమున నరేంద్రుని యాశ్రమములోని వారినందరను పోలీసులు బంధించగా తనను నమ్మిన వారిని పోలీసులకర్పించితినని నరేంద్రుడు విరక్తిచెందెను. నరేంద్రుడాశ్రమవాసులకు తన ఆస్తినొసగి లోకకల్యాణమునకు పాటుపడు

డని చెప్పి, తాను మంచుతుఫానులో ప్రవాహములో మునిగి పోయెను. నరేంద్రుని యాత్మ భూలోకముకంటె భిన్నమైన లోకములో వెనుకకు నడుచుచుండెను. నరేంద్రుడు మొదటిజన్మలో స్త్రీ రూపముస తనకు భిక్షపెట్టెనని ఒక వ్యక్తిచెప్పి అంతర్థానమయ్యెను. ఉత్తమలోకమునుండి తిలోత్తమ యచటికి వచ్చి అతనిని తనశక్తి చేత తన లోకమునకు కొనిపోయెను. నరేంద్రుడామెపట్ల కృతజ్ఞత చూపి, తాను ప్రేమించినవ్యక్తి తాను మొదటచేరిన లోకమునకు వచ్చెనని తెలిసి, అచటికి వెడలెను.

ఈ నాటకమున ఉత్తమ మధ్యమపాత్రలు శిష్టవ్యావహారిక మున, నీచపాత్రలు గ్రామ్యభాషయందు మాటాడుటవలన కవి పాత్రోచితమగు భాషనే వాడి ఔచిత్యము పోషించెనని చెప్ప వచ్చును. పాత్ర చిత్రణము. 1. న రేం ద్రు డు :– నరేంద్రుని పాత్రను కవి ఆదర్శప్రాయముగా ఉత్తమముగా తీర్చిదిద్దెను. నరేంద్రుడు వేదాంతి, సంఘసంస్కర్త, ఉన్నతాశయములుగలవాడు. ఆదర్శప్రేమికుడై పరమందుకూడా తనఅనురాగమునకు పాత్రురాలైన స్త్రీమూర్తికొరకే ఎదురుచూచినవాడు. తనను నమ్మినవారిని రక్షింపలేనందులకు ప్రాణత్యాగము చేయుచు ఆ స్త్రీని ఆశ్రమవాసులకు పంచిన త్యాగి ఉదారుడుగా నీనాటకమున చిత్రింపబడెను. 2. వా గ ను శా స ను డు : నీతి నియమములు లేని మోసగానిగా, ఉపన్యాసకునిగ, చిత్తశుద్ధి, ఋజువర్తనము లేనివానిగ, కాముకునిగ తీర్చబడెను. క్రమముగా నరేంద్రునివలన మారినతరువాత మిత్రుని రక్షించుట కత డబద్ధమాడుటకైన వెనుకాడడు. 3. తి లో త్త మ పాత్రను చిత్రించుటలో కవి ప్రత్యేక శ్రద్ధ వహించెను. వృత్తికి కులటయైనను నరేంద్రుని యాశ్రయములోనికివచ్చిన తర్వాత నామెలో పరివర్తన కలిగెను. తిలోత్తమది ప్రతిఫలాపేక్ష

రహితమైన అనురాగము. అటువంటి ఉదాత్తప్రణయమే పిచ్చివాని బారినుండి నరేంద్రుని రక్షింపజేసెను. నరేంద్రుని యాశయములను ఆదర్శములను సంపూర్ణముగా నర్థము చేసికొనిన దగుటచేత తిలోత్తమ తన వజ్రపుటుంగరము దొంగిలించిన ఘటోత్కచుని రక్షకభటుల బారినుండి రక్షించి నరేంద్రునాశ్రమమునకు చేర్చెను. వాసంతి సుమంగళి అచ్చమ్మ ఘటోత్కచులపాత్రలు సహజముగ చిత్రీకరింపబడెను.

చురుకుగా సాగిన సంభాషణలతో పటిష్ఠమైన కథాసంవిధానముతో నీ నాటకము భాసిల్లుచున్నది. పతనమగుచున్న ప్రజలను ఉత్తమమార్గమున నడిపించుటకు మార్గదర్శకు లుండవలెనని, ఆ మార్గదర్శకులుదారగుణము కలిగిన ధనికులైనచో అట్టి సంస్కరణ మున కనుకూలముగ నుండునని, సంస్కర్తలను ప్రభుత్వము ప్రోత్సహింపవలెనని, లేనిచో సంస్కరణ కష్టసాధ్యమై సంఘము దేశము క్రమముగా అవినీతిపాలై పతనమగుట కవకాశము కల్గునని శ్రీ గంగాధరరామారావు ప్రబోధించుచున్నారు.

వరూధినీ ప్రవరాఖ్యము : నాలుగంకముల యీ నాటకము మద్రాసు రినైజాన్స్ ముద్రణాలయమున 1947లో ముద్రింపబడెను. మహారాజా సూర్యారావు బహద్దరువారికి ప్రాచీనసాహిత్యమం దభిమానము మెండుకనుక వారిజ్యేష్ఠపుత్రులు పీఠికాపుర యువరాజు శ్రీ గంగాధరరామారావు పెద్దన్న ప్రబంధమందలి వరూధినీ ప్రవరుల వృత్తాంతము స్వీకరించి నాటకము మలచి, జనకుని కంకితమిచ్చిరి. నవ్యతయం దభిరుచిగల యువరాజావారీ నాటకము ప్రాచీన నాటకలక్షణములకు భిన్నముగా రచియించిరి. ప్రస్తావన శ్రీ గిడుగు సీతాపతిగారు నడిపిరి. నాటకకర్త, నాటక రచనా విధానమునుగూర్చి సామాన్య పఠితకుకూడ నర్థమగు

ధోరణిలో ప్రస్తావన నడిచెను. తరువాత ఆ ముఖములో కవి పెద్దన్నను సూత్రధారునిగ ప్రవేశపెట్టెను. అల్లసానిపెద్దన్న ఉయ్యాల మంచముపై నాసీనుడై దూతిక యిచ్చు తాంబూలము సేవించుచు కన్నులు మూసికొని "నిరుపహతి స్థలంబు......." అను పద్యము చెప్పుచుండ ఒక లేఖకుడు వ్రాయుచుండును. తరువాత స్వారోచిష మను సంభవములో ఇష్టదేవతాస్తుతిలోని "శ్రీ వక్షోజ కురంగ నార భా..." ఇత్యాది మూడు పద్యములు నాందిగా చెప్పబడెను. నాంది తరువాత పెద్దన్న గృహములో విఘ్నేశ సరస్వతీ స్తుతులు గావింపబడెను. పెద్దన్న పూర్వకవులను స్మరించి కథాప్రారంభము చేయుట ఈ దృశ్యమున కలదు.

ఇందుగల కొన్నివిశేషాంశములు : 1. మను చరిత్రమున సంభాషణ రూపములోనున్న పద్యముల నుపయోగించుకొనుట. 2. అరుణాస్పదము, ప్రవరవర్ణనము మొ॥ వర్ణనాపద్యములు శిష్యాది పాత్రలచేత పలికించుట. 3. వర్ణనాపరమయిన పద్యములు పలికించుటకు, శిష్యపాత్రలవలె వరూధినికి చెలికత్తెలను, మాయాప్రవరునికి చెలికానిని సృజించుట. 4. రెండుమూడు గద్యభాగములు పెద్దన్నవే స్వీకరించుట. 5. యువరాజాగారు రచియించిన సంభాషణలు శిష్ట జనవ్యావహారికమున నుండుట. 6. పెద్దన గ్రాంథికభాషాపద్యములను తన శిష్టవ్యావహారిక సంభాషణలను కలిపి ప్రయోగించుట. "శ్రవ్య కావ్యమును దృశ్యకావ్యముగా నిరూపింపగల ఈ రచనావిధానమునకు 'నిరూపక' మనుపేరు తగినదని నా అభిప్రాయము." అని గిడుగు సీతాపతిగారు ప్రస్తావించుట సమంజసముగానున్నది. వరూధినీప్రవరుల హావభావవిలాసములను వరూధిని చెలికత్తెలచేత పలికించెను. హిమాలయపర్వతమును చేరిన ప్రవరుని ప్రకృతి పరిశీలననుగురించి అల్లసానిపెద్దన వ్రాసిన "అటజని కాంచె భూమిసురుడ"ను ప్రసిద్ధ

పద్యమును గంగాధర రామారావుగారు ప్రవరునిచేతనే పల్కించుట యించుక అసమంజసముగా కనిపించినను శ్రీ సీతాపతిగారన్నట్లు తననుగూర్చి తాను చెప్పినపుడు ప్రథమపురుషలో చెప్పుటయు కలదు. కనుక యువరాజావారాయభిప్రాయముతోనే పద్యము స్వీకరించిరనుకొనవచ్చును. ఈవిధముగా పెద్దన శ్రవ్యకావ్యమును దృశ్యకావ్యముగామార్చి యువరాజావారు ప్రబంధము పఠించలేనివారికి చూచుటకు వీలుకల్పించిరి. మూన్నాళ్ల ముచ్చటలు: 76 పుటల ఈ నాటకము 1961 జూన్‌లో అడ్డేపల్లివారిచేత సరస్వతీ పవర్ ప్రెస్సున ముద్రితమై, సరస్వతీ గ్రంథమండలిచేత ప్రచురింపబడెను. నాల్గంకముల యీ నాటకమున యువరాజావారు సృష్ట్యాదినుండి నేటివరకుగల స్త్రీపురుష సంబంధమగు సామాజిక వ్యవస్థతో బాటు భవిష్యద్విశేషములనుకూడ ప్రదర్శించిరి.

వివాహవ్యవస్థలేని స్త్రీపురుష సంపర్కము, గృహనిర్మాణాదికము, ఇరువురు స్త్రీపురుషులు జంటగా జీవించుట, మరియొక జంటకనిపించినంతనే వీరు వారితో పరస్పరవినిమయము చేసికొనుట, ప్రకృతి బీభత్సమునకు వారడలి అవ్యక్తముగ మోకరిల్లుట, సంతతి గల్గుట– ఇది ఒక భాగమున గలదు. రెండవ భాగమున ఆశరంజన్‌లు సముద్రతీర విహారము, రంజన్‌కి ఆశ తన భర్తప్రకాశం విడాకులకు అంగీకరింపడని తెల్పుట, వీరు మరియొక గౌరవనీయులైన దంపతులను కలసికొనుట, వారిలో భర్తకు తనభార్య తోటమాలితోనో, వైమానికోద్యోగితోనో సంపర్కముకలిగి యుండెనేమో యని అనుమానించుట ఒక దృశ్యము. తరువాత స్వాహాయను స్త్రీ పలువురు పురుషులతో యథేచ్ఛగా సంచరించుట, ఒక డామెను వివాహమాడగోరుట, ఆమె తిరస్కరించి సర్వము త్యాగము చేయుటయే నిజమగు ప్రేమ నిజమగు వివాహమని చెప్పుట, ఆమె మధు

పానముచేసి ఐదుగురుపురుషులను చుంబించి ప్రేమలో ప్రజాస్వామ్యము కలదనుట మరియొక దృశ్యము. ఐక్యరాజ్యసమితిలో రాయబారిగానున్నఆశ భర్త ప్రకాశ్ గౌరవార్థము రంజన్ చేసిన విందులో ఆశ, నలిని, స్వాహా, ప్రకాశ్, రంజన్‌ల సంభాషణ, అచటి కేతెంచిన కవి మేధావి రాజకీయవేత్తనగు కామరూప్, ఎక్కువ కూలి నడిగిన కూలీలను కోటీశ్వరుడు కొట్టించి కొందరిని పనిలోనుండి తీసివేసి కాల్చి చంపెనని, ఆ యన్యాయము నరికట్టుటకు రమ్మని వారి నందరిని వేడును. వీరందరు శాంతియుతముగా కూలీలచేత సమ్మె చేయించుటకు వెడలుదురు. ఆ విప్లవము నణచుటకు జరిగిన కాల్పులతో కామరూప్ ఆశ రంజన్‌లు మరణింతురు. స్వాహా ఆత్మహత్య చేసికొనును. ఈ కథ నేటి సంఘవ్యవస్థ కుదాహరణగా చెప్పవచ్చును.

మూడవభాగములో మొదటిభాగమందలి జంటలు ప్రవేశించి, భార్యలను మార్చుకొందురు. రెండవస్త్రీ లైంగికవిషయమున పరిశోధనచేసి గ్రంథము వ్రాయుచుండును. ఆమె ముగ్గురు పిల్లలను ముగ్గురు గొప్ప పురుషులవలన పొంది పరిశోధనచేయు ప్రయత్నమున నుండెను. ఈ స్త్రీ పురుషులు నిద్రమాత్రలు భోజనము మాత్రలు ఆత్మహత్యమాత్రలు నుపయోగింతురు. ఆపాదమస్తక మాచ్ఛాదితులు, ఛాయామాత్రులునైన ముగ్గురు వ్యక్తులు సముద్రమునుండి భూలోకవాసుల స్నేహము కోరివత్తురు. వీరిలో స్త్రీపురుష వివక్షత లేదు. రెండుభావములు నొక్కవ్యక్తియందే యుండును. వారు కోరినప్పుడే కామము కలుగును, కోరినంతకాలమే జీవింతురు. ఈ ముగ్వురును రెండవస్త్రీని తమవెంట తీసికొనిపోవుదురు.

ఈ నాటకమున వస్త్వైక్యములు లేవు. నాల్గంకములలోని విషయమ్ములకు సంబంధములేదు. మొదటిఅంకమొక నాటికగా, రెండవ

మూడంకములు మరియొక నాటికగా, నాల్గవయంకమొక నాటికగా విభజింపవచ్చును. వ్యావహారికమున వచనములో వ్రాయబడిన యీ నాటకమందొక్కపాట కలదు. మూడుకాలములకు అనుగుణముగా మూడు విధములైన కథలను వ్రాసి కవి దీనికి "మూన్నాళ్ళ ముచ్చటలు" అని పేరిడుట ఉచితముగానున్నది. అంతేకాక ఏ జీవితమైనను మూన్నాళ్ళ ముచ్చటగా ముగియుననియు, క్రొత్తదనము కోసము వెదకి అనుభవించి పాతబడుటతోడనే మరియొక మార్పు కోరుట మానవసమాజమనియు నీగ్రంథనామము, విషయము సూచించుచున్నవి. ఇక మానవజీవితమే క్షణికమను భావమునుకూడ నీ నామము సూచించుచున్నది. ఏ సాంఘికవ్యవస్థయైనను నిరంతర పరిణామశీల యని తెల్పుటయే కవి ముఖ్యోద్దేశము. యువరాజావారి వేదాంతపరిజ్ఞానము నిది వ్యక్తము చేయుచున్నది.

**ఆలోకమునుండి ఆహ్వానము** : నాలుగంకముల యీనాటకము శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాలలో 1938వ సం॥న ముద్రితమయ్యెను. ఈ నాటకమును యువరాజావారు "ప్రేమమూర్తికి సౌందర్యమూర్తికి దివ్యమూర్తికి" అంకితమిచ్చిరి.

**కథ** :- ఆగర్భశ్రీమంతుడు విక్రమార్కుడు మానవుల దుర్మార్గ అవిశ్వాసవర్తనకు విరక్తుడై పొరుగూరిలోని శ్మశానమును చేరెను. అతడిని వలచిన వసంతసేనయు నతని విడువలేక యాతనిని వెదకుచు శ్మశానమున ప్రవేశించును. విక్రమార్కుడామెను గుర్తింపక తానింటినుండి వెడలగొట్టబడితినని, భార్య పరానురక్తయని, కుమారుడు దాయాదులచే హతుడయ్యెనని చెప్పి, గుర్తించినతరువాత తనను ప్రేమించవలదని చెప్పెను. వసంతసేన అతనిని తన కార్యదర్శిగానుండుట కంగీకరింపజేసి వెంట గొనిపోయెను. వసంతసేన భర్త అశోకుడు యూరపునుండి తిరిగివచ్చిన సందర్భమున

వసంతసేన స్నేహితులకు తేనేటివిందు చేయగా వచ్చినవారు వసంత సేనా విక్రమార్కుల ననుమానింతురు. అది చూచి అశోకుడు బాధ పడి విక్రమార్కుని పంపివేయుమని భార్యకు చెప్పెను. వసంతసేన భర్తపై కోపించి, విక్రమార్కునితో నిలువదలిపోవును. వసుమతి వసంతసేన చెంతకువచ్చి వసంతసేనను ఇంటికిరమ్మని కోరును. వసంతసేన తన ప్రేమ పవిత్రమైనదని చెప్పి, విక్రమార్కునితో కలసి తాను ప్రపంచయాత్రకు బయలుదేరులోపల తన పుత్రుని ఒకసారి చూపుమని వసుమతిని కోరును

వసంతసేనా విక్రమార్కులు భావనాప్రపంచమున తన్మయులై యుండ, మిత్రురాలు అనసూయ వచ్చును. విక్రమార్కునిభార్య సక్రమముగా నుండుననీ, ప్రధానమంత్రి విక్రమార్కునికే మంత్రి పదవి నిచ్చుననీ, తండ్రియు ఆస్తినంత నతనికే యిచ్చునని అన సూయ విక్రమార్కు డింటికి వచ్చుట కంగీకరింపజేయ ప్రయత్నించి విఫలురాలగును. అశోకుడు వసంతసేనా విక్రమార్కుల ప్రయాణ మున కాటంకములు కలుగజేయును. వారు స్టీమరు చేరుట కొకలాంచి నేర్పాటు చేసికొందురు. వసంతసేన తీరమున నిలిచి ఆకసములోని నక్షత్రమును విక్రమార్కునికి చూపి "ఆ లోకమునుండి యాహ్వా నము" వచ్చుచున్నదని పల్కును. భయంకరమైన గాలి వీచుటవలన పడవవారు వీరిని స్టీమరు చెంతకు తీసికొనిపోవుట కంగీకరింపరు. విక్ర మార్కుడా పడవవారికి చాల సొమ్మొసగి తానే పడవ నడుపుచుం డగా, వసుమతి వసంతసేనతనయుని తీరమునకు తీసికొనివచ్చును. ఆ పసివాడు "అమ్మా" అని యేడ్చుచుండ వసంతసేన వానిని చూచును. తీరమున అందరు నిలచియుండగా పెద్దకెరటము పడవను ముంచును. వసంతసేనా విక్రమార్కులు మరియొక లోకమున కేగుదురు.

ఈలోకమున పవిత్రమైన ప్రేమకు స్థానములేదని తెలుపబడెను. సంఘకాలుష్యమిందు చక్కగా చిత్రింపబడెను. ప్రథమాంకమున "నాతండ్రి నన్ను గెంటేశాడు. అతనిఅభిప్రాయాలూ, నా అభిప్రాయాలూ సరిపడలేదు" అను విక్రమార్కునిమాటలలో యువరాజా వారికి తండ్రి మహారాజావారికిగల అభిప్రాయభేదము, తండ్రినుండి దూరమగుట అను విషయములు ధ్వనించుచున్నవి. "వాళ్ళు (హరిజనులు) మట్టుకు మనుష్యులుకారూ?"అనుమాట యువరాజావారికి తండ్రి హరిజనోద్ధరణపైగల ఆదరము సూచించును. ద్వితీయాంకంలో వృద్ధసేవకుడు "ఏదోస్వరాజ్యంట సత్యాగ్రహంట"అనుటలో స్వాతంత్ర్యసంపాదనకు గాంధీజీ చేసిన సత్యాగ్రహోద్యమమును సూచించును. పెద్దలు భావకవులను విమర్శించుతీరీ నాటకమున వృద్ధసేవకుని మాటలలో కలదు. "గొత్తిపోతులాగ జుట్టు పెంచుకోవడం, ఆడముండాకొడుకులాగ పమిటలాగ ఏదో వేసుకోవడం." ఇది భావకవుల వేషధారణను విమర్శించుట. విక్రమార్కునిమించిన త్యాగశీలిగా వసంతసేనపాత్రను తీర్చిదిద్దారు కవి. తనప్రేమకై అపవాదును సరకుసేయక, ప్రాణాధికుడైన పుత్రుని, భర్తను విడిచి ఈ లోకమందైన పరలోకమందైన విక్రమార్కునితోడి జీవనమే పరమావధియని విశ్వసించి ప్రాణత్యాగమొనరించిన ధీశాలి, ప్రేమైకజీవి వసంతసేన. "ఆ లోకంనుండి ఆహ్వానం వస్తున్నట్టుంది" అనుటలో భావ్యర్థసూచనము కలదు.

"తొలిపలుకు"లో కవి "సముద్రుడు రత్నాకరుడగుటచేఁ బూజ్యుడా? లేక భయంకర జలచర సందోహములకు నిలయమగుటచేఁ దాజ్యుఁడా? వర్షాగమనమునకు హృదయానందమా? లేక అశనిపాతముల యలజడికి హృదయాందోళనమా? అనిలుడు ప్రాణదాతయని వాంఛనీయుడా? లేక ప్రళయకాల ఝంఝామారుత

స్వరూపుఁడని యవాంఛనీయుడా?" అని కవి ప్రశ్నించెను. సము ద్రము, వర్షము, అనిలము ప్రాణికోటి కవసరమైనను ప్రాణాంతకము నగునట్లే ప్రేమ ఉదాత్తము కంటకావృతము ననియు, అట్లే ప్రతి ప్రాణికి పైన పేర్కొనబడిన వెంతఅవసరమో ప్రేమయు అంత అవ సరమని కవి భావము.

**వలపులు-అలపులు-తలపులు** : 37 పుటల ఈ కావ్యము అద్దేపల్లి అండ్ కో వారిచే సరస్వతీపవర్ ప్రెస్సున 1960లో ముద్రింప బడి సరస్వతీగ్రంథమండలివారిచేత ప్రచురింపబడెను. ఇం దిరువది గేయములు గలవు. 1. "జుహూతీరము" అను గేయమును కవి జుహూతీరమున వర్షములో నారికేళము లగుట పడవల యాటలు చూచి తనకు కలిగిన ఆలోచనలు తెల్పెను. 2. "నా దేవుడు-నేను" లో మానవుడు వ్యర్థజీవనముతో కాలముగడిపి చివరివరకు భగవం తుని స్మరింపలేకుండెనను భావము కలదు. 3. "నవయుగము"లో దేశమందువచ్చిన మార్పులు తెలుపబడెను. 4. "ఏకోరసః కరుణ ఏవ"లో భవభూతి మహావాక్యమును గ్రహించి కవి తన కాల ముతో అన్వయించెను. ప్రపంచమున నెంతయో ఆహారము వ్యర్థ మగుచుండెను. పేదలకు కట్టించబడిన సత్రము లెత్తివేయబడగా, అధికారులు పూలమాలల ధరించి విఱ్ఱవీగుట, అందుమూలముగా దీనుడగు బిచ్చగా డాకలితో మరణించుట జరుగుచుండె నను ఆ కవి ఆవేదన యిందుగలదు. 5. 'సృష్టినృత్యం' ఒక చిత్రమైన గేయము. కవి మానవలోకమందలి బాధలను చూచి సహింపలేక ఆకసమునకెగిరి, అటు పిడుగులబాధకులోనై సాగరగర్భ మునుచేరి బడబాగ్నిబాధ భరింపలేక ఆత్మహత్య చేసికొనును. 6. "జీవుడు-జీవితం": ఇందు చల్లనమ్ము గొల్లపిల్లవలపునవ్వు ఎవ్వరి నైన పరవశింపజేయునను యభిప్రాయముగలదు. 7. "ఒక మానవ

చిత్రం"లో వయసువచ్చిన కన్యను చూడక కూడక తిరస్కరింప గలవాడు గొప్పవాడను ఉద్దేశ్యమును కవి వెల్లడిచేయును. 8. "ఒక చిన్న సంగతి" అను గేయమున రాజు పేదవాడైనచో నతనిస్థితి ఎట్లుండునో కథగా వ్రాయబడెను. పూర్వమొక చక్రవర్తి ఒక సన్యాసికి భక్తితో ప్రణమిల్లి తనరాజ్య మర్పించబోగా నాసన్యాసి అది తగదనిచెప్పి వెడలిపోయెను. కొంతకాలము తర్వాత పరిస్థితులు తారుమారై రాజు భిక్షుకుడుగామారి క్రొత్తప్రభువును "దండము ప్రభు, మనవిరాజా! అన్నము పెట్టుము" అని సిగ్గుతో నెమ్మదిగా యడుగ నతడీతని మెడబట్టి గెంటించెను. భాగ్యహీనుని నిర్భాగ్యము తొలగించుట ఎవ్వరికిని శక్యముకాదని ఈ కథ నిరూపించుచున్నది. 9. "పుంజు-పెట్ట"లో పక్షుల శృంగార మభివర్ణితము. 10. "అవి ఇవి"లో కవి ప్రపంచ పురోగమనము తెల్పును. ధనికులైన మహారాజులు కోటీశ్వరులు నశించి, పేదలు కూలీలు ప్రగతినందుదురని గేయ తాత్పర్యము. 11. "ఉరి-ఆత్మహత్య": ఒకఅనాథ ఆత్మహత్యచేసికొనబోగా ప్రభుత్వమామెను రక్షించి, ఆత్మహత్యా నేరమునకు ఉరిశిక్ష విధించును. జీవితేచ్ఛనశించి ఆత్మహత్యకు యత్నించిన వారిని రక్షించుటతోనాగక ఆత్మహత్య నేరమని ఉరితీయుట వలన ప్రయోజనమేమి? స్వేచ్ఛగా చచ్చుటకైన వీలులేదుకదా! 12. "ఆరోహణం": ఈగేయమున కవి తన హృదయము సత్యాన్వేషుడైన అరవిందుని వేంకటేశ్వరుని చేరెనని, ఆ యనుభవము భావాతీతమని చెప్పెను. 13. "కొత్త కార్యక్రమం"లో భూమిపై జన్మించి రాకెట్టులో నివసించి, వివిధ-లోకములలో వివిధ దిన కృత్యములు తీర్చికొని సూర్యలోకమున అంతమగుట మానవుని నూతన కార్యక్రమమని చెప్పబడెను. ప్రపంచములో క్షణక్షణము జరుగుచున్న మార్పులనుబట్టి కవి భవిష్యత్తు నీవిధముగా యూహిం

చెను. 14. "సారంగుపిట్ట"లో చిన్నపిట్ట చిన్నబ్రతుకు చిన్నపాట చిన్నగూడు చిన్నకోరికలు చిన్నయూహాలుండి చిన్నకాలములో చిన్నచావు చచ్చునని చెప్పబడెను. 15. "శబ్దార్థం" గేయమున కొన్నిపదము లర్థరహితములైనను ఆ పదముల యుచ్చారణ పటిమ కొలకు ధ్వనిపూర్వకముగా అర్థము స్ఫురింపజేయునని చెప్పబడెను. ఈవిధముగా యువరాజావారు ప్రతి అల్పవిషయముపై గేయము వ్రాసి, "కాదేదీ కవిత కనర్హం" అను అభ్యుదయ కవితాధోరణి నవలంబించిరి.

పరిశోధన చేయుచున్నకాలములో శ్రీ యువరాజా రావు వెంకటమహీపతి గంగాధరరామారావుగారితో వారి రచనలనుగురించి ప్రస్తావించగా వారు ఆంగ్లమున వెల్లడించిన యభిప్రాయము నిచట యథాతథముగా నిచ్చుచున్నాను.

"Most of my books are Pshyco-analytical. They are both subjective and objective. I record deep human emotions good, bad and indifferent. They may be born out of actual life or out of the life of imagnation in dreams. To me morality is a relative concept. Beauty seems to be much more comprehensible.

I essentially write for myself because many times I can't help giving expression to my sorrows and joys. If my readers incidentally care to share my feelings, they are welcomed to it. Otherwise, I leave them severally alone. Both classic and modern appeal to me. It depends upon my moods.

"Bhuvana Vijayamu" is the smallest and best of my works.

R. V. M. G. Rama Rao,

**శ్రీ వేంకట పార్వతీశ కవులు :** వేంకట పార్వతీశకవులు పీఠికాపురాధీశులైన మహారాజా సూర్యారావు బహద్దరువారి యాశ్రయమునుండి తమ సాహితీవ్యవసాయమును కొనసాగించిరి. కాని ఆస్థానకవులు కాదు. శ్రీ బాలాంత్రపు వేంకటరావు క్రీ॥శ॥ 1880లో జన్మించి 1972లో దివంగతులైరి. శ్రీ ఓలేటి పార్వతీశకవి 1882లో జన్మించి 1955లో పరమపదించిరి. శతాధికగ్రంథకర్తలగు నీ జంట కవులు పార్వతీశకవి మరణపర్యంతముగా జంటగానే కవన మల్లిరి. 1911లో వీరు ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాలను స్థాపించి, వంగభాషా నవలల నెన్నిటినో తెనిగించి ప్రచురించి భాషాసేవ యొనరించిరి. ఆంధ్రప్రచారిణీ గ్రంథమాల స్థాపనకు ఆర్థికముగా హార్దికముగా పీఠపురాధిపతులే తోడ్పడిరి. ఆంధ్రసారస్వత పరిషత్తు పార్వతీశముగారికి "కవిరాజహంస"అని బిరుద మొసగెను. సంస్కృతాంధ్ర వంగ భాషలలో నిష్ణాతులైన వీరు నవలలతోబాటు నాటకములు, గద్య పద్య గేయ కావ్యములను రచియించిరి. వేంకట పార్వతీశ్వరకవులు కొన్నికావ్యములను పిఠాపురజమీందారుల కంకితమిచ్చిరి. అందు యువరాజావారిపై మక్కువతో వారి కెక్కువ అంకిత మిచ్చుట వలన ఈ కవులను యువరాజావారి యధ్యాయమున పరిశీలించుట జరిగెను. వేంకటపార్వతీశ్వరుల రచనలలో "ఏకాంతసేవ", "మహారాజాభినందనము" మహారాజావారికి, "శ్రీరామరాజనీతి", "కావ్యకుసుమావళి", "బృందావనము". "ఆంధ్రవాల్మీకిరామాయణము" లను యువరాజావారికి కృతి సేసిరి. వీరు పీఠికాపురాస్థానకవులు కాక పోవుటచేత వారి కంకితముచేసిన కావ్యములుమాత్రము విమర్శింపబడును. మహారాజావారికి కృతినిచ్చిన కావ్యములు : 1. ఏకాంత సేవ : కాకినాడ సుజనరంజనీ ముద్రాశాలలో 1922లో ముద్రితమైన 79 పుటల ఈ "ఏకాంతసేవ"యందు 62 భావగీతములుగలవు.

"ఏకాంతసేవ" భావకవితకు నాంది యయ్యెను. భావకవితాయుగ మునకు ప్రాభాతగీతి పాడి ప్రజల మేల్కొల్పిన వైతాళికులు శ్రీ వేంకటపార్వతీశ్వరకవులుకాగా, భావకవితాయుగపురుషుడై వెలు గొందిన మనీషి శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి. ఏకాంతసేవను వీరు మహారాజావారికి కృతిచేయుచు సూర్యునితో అభేదము చెప్పుట గమనార్హము.

1. శ్రీవిలాసంబుతోఁ జిద్విలాసమున
కర్థతాత్పర్య సమాశ్లేషమయ్యె
సుకవి గీతములతో శ్రుతిగీతములకు
షడ్జ పంచమనాద సమ్మేళమయ్యె
నరుణరాగంబుతో నాత్మరాగమున
కనురాగ కరుణాసమాయోగమయ్యె
నిరుపమానానూన నిత్యకల్యాణ
శోభామయంబయ్యె సూర్యాభ్యుదయము.

కవు లీ కావ్యమున చేసిన అద్భుతము అనన్యము అపూర్వము నగు, గీతరచనయే భావకవితాసరణికి ప్రాతిపదిక యయ్యెను. వేంకట పార్వతీశ్వరు లీ గీతములను యథేచ్ఛగా పుంస్కోకిలలై గళమెత్తి గానము చేసిరి. ప్రశాంతచిత్తమున ఏకాంతముగా భగవంతునిసేవలో లీనమై వారు చేసిన గానమే "ఏకాంతసేవ". ఇందలి ప్రతిగీతము నొక్కొక్క ఆణిముత్తెము. ఈ కావ్యమున పరమేశ్వరుడు నాయ కుడు. కృష్ణైకధ్యానతత్పరురాలైన రాధవలె నీకవు లిరువు రొక్క స్త్రీమూర్తియై నాయకుడైన భగవంతు నారాధించుచు గానము చేసిరి. కనుక నిచట కవిద్వితయమే నాయిక. నాయిక కోకిలను "మధురముగ మార్దవముగ మంజులముగ మానసానందకరముగ, వరమనోహర పంచమస్వరమునెత్తి పాడమని కోరును. ఆ దేవదేవుని

పిలిచి "నినువీడి క్షణమైన నిలువగఁజాల, దరిసెన మీావయ్య తత్త్వ స్వరూప" అని తపియించి, ఆ వియోగమును సైపలేక,

"కల్యాణ మయుడున్న కందువ లరసి
పారిపోవక యుండఁ బట్టి తేవలయుఁ
బ్రణయ వనంబు లోపలి పుష్పరథము
తుమ్మెదా! వేవేగ తోలితేవమ్మ!"

అని ప్రార్థించిననాయిక హృదయమెంత లలితమో! ఆర్ద్రమో! ఆ ప్రణయవనమే తాను; తన హృదయమే పుష్పరథము, తన మనస్సే తుమ్మెద! ఎంత కమనీయ భావమిది! పోతన్న భాగవతములో గోపికలవలె నీమెయు తన హృదయాధినాథుని వర్ణించి, "విరిబోణి యీామాట విన్నావటమ్మ!, కనకాంగి నానాథు గన్నావటమ్మ!" అని కనిపించిన ప్రతి పువ్వును తన నాథుడెక్కడ యని ప్రశ్నించును. ఆ పరమాత్మ దర్శనమగుటతోడనే "హృదయేశ! నినుఁగోరి యిన్నాళ్ళకైన, సవతులందఱిలోనఁ జరితార్థనైతి." అనుచు "ప్రణమైక నిలయమా భవదాననమున, మలయుచుండిన శాంత మధుర తేజంబు ... ... తిలకించువారికే తెలియునుగాని, బుద్ధిమంతులకైనఁ, బోద్ధలకైనఁ,గవిశేఖరులకైన ఘనులకునైన" తెలియదను కవి పల్కులు యథార్థము. పరమేశ్వరుని తేజస్సును గాంచి ధన్యులైనవారా తేజమిట్టిదని వర్ణించుటకైన అవకాశము లేక నిత్యము ఆ ధ్యానమున లీనమైయుందురుగాని పోతన్న చెప్పినట్లు "అంబుజోదర దివ్యపాదారవింద చింతనామృత పానమత్త చిత్తమేరీతి యితరంబు" చేరదు. పరమాత్మ సాక్షాత్కరించిన క్షణమున భక్తుని హృదయమెట్లుండునో ఈ లలితకవులు స్పష్టీకరించిరి.

"కొనియాడవలె నన్న కోర్కియే కాని
భాషలోపల నట్టి పలుకులే లేవు,

తెలిసికోవలెనన్న దీక్షయే కాని
బుద్ధి కంతటిది ప్రబోధమే లేదు
వర్ణింపవలెనన్న వాంఛయే కాని
కవిత కంతటి భావగరిమయే లేదు."

పరమేశ్వరుని కాంచిన మరుక్షణమునసే కోరికలు, మాటలు, దీక్ష, భావము సర్వము నశించి ఆదివ్యరూపమునే కాంచుట భక్తునికి అనుభవైకవేద్యము. సకల భక్తిభావములు రాశీభూతమై వేంకట పార్వతీశ్వరుల "ఏకాంతసేవ"లో నిక్షిప్తమయ్యెను.

**మహారాజాభినందనము** : 30 పుటలు 36 పద్యములు గల యీ కృతి 1922లో శ్రీ సుజనరంజనీ ముద్రాక్షరశాలలో ముద్రిత మయ్యెను. దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రిగారీ కావ్యమునకు తొలి పలుకు వ్రాసిరి. వేంకట పార్వతీశ్వరు లీ కావ్యమును మహారాజావారి కంకితమిచ్చిరి.

సీ. తిన్నని నున్నని తెల్లని మొనలేని
మొగ్గలలోనుండి నిగ్గుఁదీసి
చక్కని చిక్కని సరిలేని కమ్మని
పూవులలోనుండి ప్రోవుజేసి
విఱుగని తఱుఁగని వెలలేని తీయని
తేనియలోనుండి తేటఁదీసి
నలఁగని తలఁగని నలిలేని తొలిలేని
చివురాకు దొన్నెల సేకరించి

గీ. సరసకవితావిలాస రసాయనంబుఁ
బ్రేమరసమునఁ గూర్చి యర్పించినార
మెలమిఁ బానీయముగ గ్రహియింపుమయ్య
రమ్యగుణసాంద్ర! శ్రీ మహారాజచంద్ర!

ఎల్లప్పుడు వీరి వీక్షణము భృంగమై సుందరతరోద్యాన వన సీమలలో విహరించి మనోజ్ఞ సుమమంజరుల మార్దవకమును. అందలి మకరంద మాధుర్యములను ఆస్వాదించును. అటువంటి సరసకవితా రసాయనమునే ప్రభువునకు కానుకగా నొసగిరి. ఈసీసమున కవిత్వ మెంత లలితముగా మధురముగా నుండవలెనో కవులు వర్ణించిరి. మొగ్గలలోని నిగ్గు, పూవులలోని కమ్మదనము, మకరందమునుండి తేటదీసి, చివురాకులలోని లాలిత్యమును గ్రహించి ప్రేమయను రసముతో రంగరించి మహారాజునకర్పించిన కవుల ఆత్మీయతకు విలువ కట్టలేము. ఆ కవితామాధుర్యమును వర్ణింపలేము. సూర్యారావు గారికి "మహారాజా" బిరుదము వచ్చినట్లు వినినంతనే వీరు "చెవు లలో అమృతరసము చిలకరించినట్లు" అనుభూతి చెంది ఈకావ్యము వ్రాసిరి. మహారాజు నాశీర్వదించుచు వీరి చెప్పిన గీతపద్యములో 'అక్షర' శబ్ద ప్రయోగము విలువ కట్టలేనిది.

గీ. కవులొసంగు నైశ్వర్యమక్షరము, తత్కృ
తాయువక్షర మారోగ్య మక్షరంబు
గాన నక్షరమైన యికానుక నంది
యాయురారోగ్య విభవంబు లందుమయ్య.

'తొలిపలుకు'లో శ్రీకృష్ణశాస్త్రి "మహారాజుగారు మాయిల వేల్పు. మన మహారాజు సాధారణ జననాథులకన్న మిన్న. వసంతుని గూర్చి గానము! కోకిలలు గాయకులు! ఆ పాటకు విసువుండునా? ప్రోడు ప్రూకులుకూడఁ జిగుర్పకుండునా?" అని సూర్యరాయని యెడల తమకుగల భక్తిని ప్రకటించుకొనిరి.

**శ్రీరామరాజనీతి** : ఈ చిన్నిపొత్తము యువరాజావారి 13వ జన్మదినోత్సవ సందర్భమున నీ లలితకవులచేత రచియింపబడి 1923లో కాకినాడ స్కేప్ అండ్ కో ముద్రణాలయమున ముద్రితమై

యువరాజా గంగాధరరామారావుగారి కంకితము చేయబడెను. 55 పుటల ఈ కావ్యమున 147 పద్యములు గలవు.

ఆగ్నేయ పురాణమున నింద్రజిత్సంహారార్థ మేగుచున్న సౌమిత్రికి శ్రీరాముడుపదేశించిన రాజనీతి ఈకావ్యమునకాధారము.

సీ. మారాజుకొమరుండు మన్నింపకుండునే
వలపులనీను చెంగలువదండ
మావిభుసూతి సమ్మతినందకుండునే
కమనీయ నవమల్లికా స్రజంబు
మాయినతనయుండు మదిమెచ్చకుండునే
పరువంపుఁ గెందమ్మివిరిసరంబు
మామహీంద్రసుతుండు ప్రేమింపకుండునే
సురభిళ కల్పప్రసూనమాల
గీ. యనుచు భావించి యామోదమతిశయించి
రామచంద్రుని నీతిసూత్రముగ్రహించి
రమ్యకావ్య ప్రసూనహారము రచించి
చిన్నియువరాజునకుఁ గానుకగాచేసినాము.

ఈ పద్యమునకొక చమత్కారము కలదు. రాజనీతిని ప్రసూన హారముగా కవులు వర్ణించిరి. మొదట రాజకొమరుండనగా మహా రాజపుత్రుడైన గంగాధర రామారావుగారు అని యర్థము వచ్చును. రాజు అనగా చంద్రుడనియు నర్థము. చంద్రతనయుడగుట చేత చెంగలువలదండ మెచ్చునను శ్లేషయునిందగలదు. విభుసూతి యనగా మహారాజపుత్రుడు; పరమేశ్వరపుత్రుడగు కుమారస్వామియు నని చెప్పవలెను. విభుడు అనగా రాజని శివుడని అర్థములు గలవు. శివునికి మల్లెపూవులు ప్రీతికరము. కావున శివతనయునకును ప్రీతి కరములేయనుట. అట్లే ఇన, మహీంద్ర శబ్దములకు రాజు, సూర్యుడు

అని, రాజు దేవేంద్రుడు అని యర్థములు గలవు. కనుక సూర్యునికి తమ్మిపూవుల హారమిష్టమైనట్లే సూర్యతనయునికి యిష్టమగును. దేవేంద్రునికి, జయంతునికి కల్పప్రసూనము లాహ్లాదకరములు. చెంగలువదండ, నవమల్లికాస్రజము, తమ్మివిరిసరము, కల్పప్రసూన మాలలతో సమానమైన రామచంద్రుని నీతిసూత్రమనెడి రమ్య కావ్యప్రసూనహారము తమ రాజపుత్రుడైన గంగాధర రామారావు గారి కానందమును గలిగించునని ఈ లలిత కవులు కవితా మాధుర్య మొలికించినారు.

కావ్యకుసుమావళి : ఈ కావ్యము 1924లో శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాలలో ముద్రితమై ఆంధ్రప్రచారిణీ గ్రంథ మాలవారిచేత ప్రకటితమయ్యెను. యువరాజావారికి పదునాల్గేండ్లు నిండిన తరుణమున నీ 'కుసుమావళి' అంకితమివ్వబడెను. కుమారుని ఆశీర్వదించుచు చెప్పిన పంచరత్నములలో ఐదవసీసము :

సీ. కవితామృతాబ్ధిలోఁ గల్పప్రసూనమొల్
          తేనెచిందకయుండఁ దేల్చితెచ్చి
    జ్ఞానవల్లికలలో స్వర్ణపుష్పంబులు
          చెలువు గందకయుండఁ జేర్చితెచ్చి
    గానస్రవంతిలోఁ గనకార విందముల్
          పుప్పొడి చెడకుండఁ బొదవితెచ్చి
    ఆనంద వనములో నమృత లతాంతముల్
          దళములొత్తకయుండ దాఁచితెచ్చి

యిచ్చుచుండగా దేవదేవుని కరుణచేత వర్థిల్లుమనుచు నీ కవికోకిలములు యువరాజు నాశీర్వదించిరి. వేంకటపార్వతీశుల కవిత జ్ఞానమును దీపించుచు గానపూర్వమై రసజ్ఞుల నానందవనమున విహ రింపజేయును. ఆ కవిత అమృతసమానము. ఈ కావ్యకుసుమావళిలో

చాటువులు గురుభక్తివంటి ఉన్నతవిషయములు, కపోతాది అల్ప ప్రాణులనుగూర్చి చక్కని వర్ణనలు గలవు. నాల్గవకుసుమములో సాంధ్యరాగ నారికేళాది ఆరు పద్యదళములు గలవు. కొబ్బరికాయకు గల మూడుకన్నులు శివుని త్రినేత్రములుగా పేర్కొనుట లోక పరిపాటి. ఆ సామాన్యవిషయమునే వీరు గ్రహించి అనన్యమైన కల్పన కావించిరి.

మ. పునుకం బెంకొనరించి, యందుఁదనువుం బొందించి లోఁజిన్నిగం
గను వర్తించి, కలంబరాశి జడలంగావించి, పైఁజర్మము
బొనరం జేసి, సతీవియోగమున మున్ ముక్కంటి జన్మించె నీ
కనువొందన్, భళి! నారికేళమ! త్వదీయౌన్నత్య మేమందునే!

మహేశ్వరుడు సతీవియోగము భరింపలేక పుర్రెను నారికేళపు పెంకుగాను, గంగను అందలి జలముగాను, శరీరమును కొబ్బరగాను, జటాజూటమును ముచ్చికగాను అమర్చి నారికేళముగా నవతరించెనట! అత్యద్భుతము అపూర్వమునైన వర్ణన మిది. ప్రాభాత సమయ సమీరము వర్ణింపబడిన తీరు మనోజ్ఞము. సమీరబాలుడు అలలపై నూయెలలూగుచు సమయము జూచి చలువ వస్త్రములను దొంగిలించును; విరిసీ విరియని మొగ్గలను సంతోషింపచేయుచునే పుష్పాడి నపహరించును; తీవలచెంత నిలిచి నిలిచి కేశములను సడలించును; లేతకొమ్మ నటునిటు ఊయలలూపుచునే కొంటెగా తావుల నపహరించు. అనిలచాలనము సహజముగా వర్ణించుచునే కవులు అనిలుని దక్షిణనాయకునిగా జేసి శృంగారభరిత సన్నివేశమునిందు ధ్వనింపజేసిరి. 28వ కుసుమములో వీరు ప్రేమతత్వమును వివరించుచు, చివరికి "కొంచెమూహించి చూడ ప్రేమమయుఁడీశ్వరుడు" అని నిర్ధారించిరి. ప్రేమయున్నచోట భగవంతుడున్నట్లే భావింపవలెను గాన ప్రేమతో లోకము వెలుగవలెనను సర్వమానవ

సౌభ్రాత్రము, లోకకల్యాణమును కవులాకాంక్షించుచున్నారు. 43వ కుసుమములో 'లక్ష్మీవిలాసము'ను చిన్నినాటిక కలదు. అపరిశుభ్రత, లోభితనముగల యిల్లు లక్ష్మికి నివాసయోగ్యము కాదని తాత్పర్యము. లక్ష్మీదేవి శుక్రవారమున నిల్లిల్లు పరిశీలించి తాను ప్రవేశింప దగిన గృహమును వెదకును. సోమరిగానుండు పడుచులున్నచోట, శుభ్రత తెలియని మూఢులుండు తావు,శుచి శుభ్రతలేని స్త్రీలున్న యింట, ఎంగిలాకులపై నీగలు ముసురుకొనుప్రదేశము, ఆత్మీయత లభింపని గృహము, అనాధలకు సహాయముచేయని యిల్లు, ఐశ్వర్యము దారిద్ర్యముగ, సుఖమును దుఃఖముగ మార్పగలవారున్న యిల్లు, తనకు నిముషమైన నివాసయోగ్యము కాదని వెడలిపోవును. కమ్మని కవితామృతముతోపాటు, చక్కని హితమునుకూడ నుపదేశించుచు జ్ఞానముకలిగించు ఈ కావ్యకుసుమావళి తెలుగుపాఠకుల హృదయములపై మకరందపు వెల్లువను, వెలుగును విరియజేయును. ఇది యొక్క యువరాజునకే గాదు, సహృదయులైన ప్రజలందరికి హితముపదేశించును.

బృందావనము : పీఠపురయువరాజు గంగాధరరామారావు గారి కంకితము చేయబడిన బృందావనకావ్యము 1935లో కాకినాడ ముద్రాక్షరశాలలో ముద్రింపబడెను. జంటకవులు అవతారికలో సంగీతసాహిత్యము లొండొంటితో పెనవై చికొని యుండుననియు, నందు తమకు కవితయందే మక్కువ గలదనియు తెల్పిరి. బృందావనము కధాకావ్యము.

కథ : కేదారచక్రవర్తి సుత బృందాదేవి బాల్యమునుండి భగవద్భక్తి కలది. కేదారుని కొలువుకూటమునకు వచ్చిన దూర్వాసుడా బృందను లక్ష్మీస్వరూపిణిగా నిరూపించి, ఆమెకు కృష్ణవిగ్రహముగల సాలగ్రామమును బహూకరించెను. బృందకానాటినుండి

కృష్ణభక్తితోబాటు కృష్ణానురక్తియు వర్ధిల్లెను. ఒకనాడామె తల్లి దండ్రుల యనుమతితో మాధవి, శారదయను చెలులు తోడురాగా యమునాతీరోద్యానమునకు వెడలెను. బృంద అచట ఏకాంతసేవలో నిమగ్నయై, కృష్ణుని వియోగము సహింపలేక ఆర్తిచెందుచుండగా ధర్ముడు విప్రరూపమున వచ్చి ఆమెను పరీక్షించెను. వశ్యవాక్కు గల బృందప్రభావమున ధర్ముడు బాలుడయ్యెను. దేవతలతో కలసి బ్రహ్మ యచటికి వచ్చి ధర్ముడు ధర్మమూర్తియని, అతనిని యథా రూపమున నిల్పుమని వేడెను. బృందాదేవి తపోబలమున ధర్మునికి స్వస్వరూపము ప్రాప్తించెను. తరువాత శ్రీకృష్ణుఁడామె యారాధ నకు మెచ్చి సాక్షాత్కరించి కేదారుని కోర్కెపై బృందాదేవిని వివాహమాడెను. బృందాకృష్ణుల పరిణయము జరిగిన ప్రదేశము బృందావనమయ్యెను.

"బృందావనము"లో ఆశ్వాసవిభాగములు లేవు. 1. అవతా రిక, 2. ఆశీర్వాదము, 3. అంకురారోపణము, 4. అమృతసేచనము, 5. ఆర్ద్రపల్లవము, 6. అగ్రవిస్తరము, 7. అంగసౌందర్యము, 8. అభి నవకోరకము, 9. ఆమోదప్రసూనము, 10. ఆనందఫలము అని ఈ కావ్యమున పది విభాగములు గలవు. కథావస్తువునుబట్టి ఆయా అధ్యాయములందలి భావము స్ఫురింపజేయుచు నామకరణములు చేయబడెను. గ్రంథస్థవిషయమునుబట్టి, కావ్యవిభజనచేసి ఆయా విభజన కనుకూలమైన పేరు పెట్టు సాంప్రదాయము సంస్కృత కావ్యములలో కలదు. కిరాతార్జునీయము, శిశుపాలవధ మున్నగు కావ్యములు సర్గలుగా విభజింపబడి ఆయాసర్గలందలి కథాను గుణమైన నామము లుంచబడెను. ఇట్లే పింగళి - కాటూరికవుల "సౌందరనందము"న శ్రీ పాటిబండ మాధవశర్మ విరచితమైన 'ఛారుణి' కావ్యమున నీపద్ధతి కలదు. బృందావన కావ్యమందు

కథానుగుణమైన నామములాయా అధ్యాయముల కుంచబడెను. బృందావనమనగా తులసీవనము. కనుక వృక్షమునకు సంబంధించిన వివిధ దశల పేర్లతో వేంకటపార్వతీశ్వరు లాయా విభాగములను పిలిచిరి. 1. 'అవతారిక' కావ్యప్రారంభము గనుక యథావిధిగా ఇష్ట దేవతాస్తుతి కలదు. 2. 'ఆశీర్వాదము'న కవులు కృతిభర్త శ్రీ గంగాధరరామారావుగారిని, వారిసతీమణిని ఆశీర్వదించిరి. మూడవ విభాగము. 3. 'అంకురారోపణము' ఇందు కావ్యమునకు అంకురారోపణ జరిగెను. ఇందు కేదారచక్రవర్తికి బృంద జన్మించెను. కేదారమనగా క్షేత్రము. క్షేత్రమునఅంకురారోపణము జరిగెను. 4. 'అమృత సేచనము'న బృంద కృష్ణభక్తికి దూర్వాసుడు సాలగ్రామమిచ్చుట ద్వారా అమృతము చిలికెను. 5. ఆర్ద్రపల్లవములో కృష్ణప్రేమలో తడిసిన బృందయను అంకురము పల్లవించెను. బృంద అనురాగ లతయు నిండు చిగురించెను. 6. "అగ్రవిస్తరము"న బృంద యౌవనవతియై, భక్తి శాఖోపశాఖలుగ విస్తరించెను. 7. "అంగసౌందర్యము" కథకు ప్రధానాంగము. కృష్ణుని యందనురాగమున బృందా దేవి ఏకాంతసేవ చేయుచు కృష్ణధ్యానమున మునిగియుండుటతో నీకథ పరాకాష్ఠనందెను. ఇది గర్భసంధివంటిది. ఇందు బృంద మధుర భక్తి, నిర్మలప్రణయము సువ్యక్తమగును. 8. "అభినవకోరకము"న బృంద ధర్మని పరీక్షకునిలబడి కృష్ణుని వివాహ మాడవలెననుకోరిక మొగ్గతొడిగెను. 9. "ఆమోదప్రసూనము"న బ్రహ్మాదిదేవతల ఆమోదమున ఆమెలో మొగ్గతొడిగినకోర్కె పుష్పించెను. 10. "ఆనందఫలము"న శ్రీకృష్ణుడామెను బరిణయమాడుటయను ఆనంద ఫలము లభించెను. వర్ణనలు : (7- 9), కుమారాభ్యుదయ (23) బాల్య (32-45), బాల్యక్రీడా (64-72), ఏకాంతసేవా (110-126) బృందావిరహ (150-173; (180-185), వసంతర్తు (175-176)

వివాహవర్ణనలు (288-323) అను నెన్నదగిన వర్ణనలీకావ్యమున గలవు. ఈ వర్ణనలలో కవుల ప్రతిభ చమత్కారములుకన్పట్టును. 2వ పద్యమున కృతిభర్త నాశీర్వదించుటకో చక్కని క్రమాలంకారమున సీసము నలంకరించిరి వేంకట పార్వతీశ్వరులు. తండ్రితాతలవలె యువరాజును లక్ష్మీసరస్వతీసహితుడై విరాజిల్లవలెనని వీరియాకాంక్ష. బృందాదేవి బాల్యక్రీడలలోకూడ శ్రీకృష్ణునే తలచుకొనుట 66వ పద్యమున కలదు.

గీ. అలరి దాఁగిలిమూఁతల నాడువేళ
జెలువ కనుమూసి పేరులు చెప్పుమన్న
హరిణి శారద మాధవి యనుటమఱచి
చిన్నికృష్ణమ్మయని చెప్పుఁ జెలులునవ్వ.

బృందాజననముతో కేదారుని రాజధాని శిశిరాంతమున మధూదయమైన ఉద్యానవనమువలెను, గ్రీష్మాంతమున వర్షాసక్తమైన కాసారమువలెను, వర్షాంతమున శరత్సంపన్నమైనలతాకుంజము వలెను సకలసౌభాగ్యమై శుభప్రదమై యలరారు చుండెనని "అంకురారోపణమున" 25 వ పద్యమున ఉపమింపబడెను. రాజధాని వర్ణనలో ఋతువర్ణన మిళితమయ్యెను. రసజ్ఞుల నానందింపజేయు ప్రతిభావంతమైన వర్ణనలు ఉపమాలంకారములేగాక, సామాన్యుడు చదివినను సులభముగ నర్థమగు నిత్యజీవిత సంబంధములైన ఉపమాలంకారములు నిందుగలవు.

గీ. వెలుఁగుఁగని దీపశిఖఁ బడు
శలభమువలె, నామిషంబు చవిఁ గాలమునన్
మెలివడు మీనమువలెఁ బర
లలనలఁ గామించి చెడఁ దలంచుట లగ్గే.

బృంద నుద్దేశించి దుర్వాసుడుపల్కిన పల్కులలో చక్కని పాదాదియమకమును శబ్దాలంకారము గలదు. బృంద కమలాంశజ అనుట కవుల యభిప్రాయము.

క. కమలనిభ చరణ కోమల
కమల కుసుమపాణి, కనక కమలాసన, యీ
కమలదళనయన నిజముగఁ
గమలామలగేహమైన కమలయె సుమ్మా!

తద్గత, గాద్గద్య, చద్గతి, గద్గుదు– 'ద్గ' వంటి దుష్కరప్రాస ములతో నొప్పు పద్యములు నిందు గలవు.

"బృందావనము" కథ కాధారమేమియు కవులు చెప్పలేదు. కాని ఈ కథ పార్వతీకల్యాణముతో సరిపోల్చవచ్చును. రెండింటను నాయికా నాయకుల, ఇతరుల నామభేదములుతప్ప కథ సమానమే. ఇందు దుర్వాసుడు, అందు నారదుడు నాయికను దీవింతురు. బృందాగిరిజ లిర్వురు తల్లిదండ్రుల యనుమతితోడనే తపస్సు చేయుదురు. పార్వతీదేవిని పరీక్షించుటకు శివుడే కపటబ్రహ్మచారికాగా, బృందను పరీక్షించుటకు ధర్ముడు విప్రరూపమున వచ్చుట భేదము. ఈ భేదమువలన బృందాపాతివ్రత్యప్రభావము తెల్పుట కవులయుద్దేశ్యము. మాయావిప్రుడు ఎంతవారించినను వినక తన హస్తముఁ పట్టబోగా బృంద కోపముతో

క. ఎన్నిగతుల బోధించిన
నన్నా! నీ కన్నతల్లినని యెఱుఁగవుగా!
పున్నెముఁ బాపముఁ గానని
కన్నులుగల నీవు చిన్నకందువుగావే!

అని తీవ్రముగా పలికినంతనే, ఆ వాక్శుద్ధివలన నా వటుడు

గీ. పవన మెడలింప నణఁగిన బంతివోలెఁ
గొక్కె మెడలింప ముడిగిన గొడుగువోలె
మాటమాత్రాన నే యక్కుమారమూర్తి
క్రుంగి దిగజారి చిన్నారి కొమరుఁడయ్యె.

ధర్మరక్షణార్థము బ్రహ్మాదిదేవతలు వచ్చి వేడుకొనగా బృందాదేవి తన తపస్సు సత్యమైన, దేవుడు సత్యమైన ధర్మమూర్తి వర్ధిల్లుగావుత యని పల్కి యతనికి తొల్లిరూపు నిచ్చెను. పరమశివునిపక్షమున సప్తర్షు లేతెంచి హిమవత్పుత్త్రిని శివుని కిమ్మని యడిగినఘట్టమువంటిది మాత్రమిందు లేదు. బ్రహ్మ ముహూర్తము నిర్ణయించుటతో మిగిలిన పెండ్లివేడుక లన్నియు క్రమముగా వర్ణింపబడెను. బృందాకృష్ణులు చంద్రికాచంద్రులు, సరోవరము, రాజహంస, విద్యుల్లతామేఘములు, మధువన మాధవులవలె పోల్చబడుట మనోజ్ఞముగా నుండి వారిరువురకు భేదము లేదనిపించును. ఈ కావ్యము చక్కని నాటకీయశైలితో నలరారుచున్నది. 'అగ్రవిస్తరము'న బృంద జననీజనకులతో సంభాషించుఘట్టము, "అంగసౌందర్యము"న మాధవీశారదలసంభాషణ, బృందాధర్ముల బ్రహ్మదుల సంభాషణలు మెండుగా నాటకీయతను సంతరించుకొనినవి. మధురభక్తి రసప్లావితమై, నాటకీయశైలీ సమన్వితమైన యీ బృందావనకావ్యము ప్రణయాబ్ధిలో ముంచి యొక అలౌకికమగు తన్మయత్వము కలిగించి, అమందానంద కందళిత హృదయారవిందులను జేయుననుటలో సందేహము లేదు.

**రామాయణాంధ్రీకరణము :** వాల్మీకిరామాయణము నెందరో ఆంధ్రీకరించిరి. కొందరు స్వతంత్రముగా, కొందరు వాల్మీకము నుండి కొంత గ్రహించి స్వీయరచనాప్రాభవమును జోడించి అనేక రీతుల రచియించుచుండిరి. యథావాల్మీకములును, అద్భుత రామా

యణాదుల వంటి పూర్తి కల్పితములును గలవు. కొంద రేకావ్యము వ్రాసినను రామకథవ్రాసిన పుణ్యమువచ్చునని మధ్య చేర్చుచుం దురు. తెలుఁగున అన్ని ప్రక్రియలలో సీరామకథ వెలసినను, మరి మరి రామాయణగాన మాలపించుచునే యుందురు; మన మాస్వా దించుచునే యుందుము. అటులనే మన వేంకట పార్వతీశ్వరకవులు రామాయణము నాంధ్రీకరించిరి. పిఠాపురముయువరాజా శ్రీ గంగా ధర రామారావుగా రీ లలితకవులను లలితమైన ఫణితిని వాల్మీకి రామాయణము ననువదింపుడని యాజ్ఞాపించిరి. వీ రనువదించిరి. యువరాజా వారు,

రామనామ సుధారస రాజవీధి
దేవ భాషను దేలితి దివ్యగీతి
నాంధ్ర భాష నాగానము నాలకింపఁ
గోరి కోరితి నీకవి కోకిలలను.

వల్లెయంచును వారలు పాడినారు
ఆంధ్రకుశలవుల మరల నాదికవియె
క్రొఁతపాటను గొత్తగా పాడినటుల
పారిజాతపు తావులు పరగినటులు.

అని తేటగీతులలో తమ భావము పొందుపరచిరి. వాల్మీకి అనుష్టుప్ఛందమున రామాయణము వ్రాసినట్లు తెలుఁగున గీతపద్యము లలో ఎక్కువగా వ్రాయుడని యువరాజాగారు కవికోకిలలను కోరిరి. వీరట్లే గీతములను, ఆటవెలఁది, కందముల నెక్కువగాను, సమయో చితముగా వృత్తములను వ్రాసి, కావ్యము యువరాజున కంకితమిత్తు మని తెల్పిరి. గంగాధరరామారావుగారు తామందుల కనర్హులమని, అంకితమందుట కంగీకరింపలేదు. ఈ కుశలవులంతట యువరాజు నామమునకు శ్రీరామనామమునకు కొంత సామ్యముండుటచేత

'రామప్రభూ!' యను సంబోధనతో తమ ప్రభువునే భావించుకొని కృతిపద్యములు వ్రాసిరని పార్వతీశ కవిపుత్రులు శ్రీ వోలేటి అచ్యుత రామచంద్రమూర్తిగారు తెల్పిరి.

వేంకట పార్వతీశ్వరకవులు సుందరకాండమువరకు తెనిగించిన తరువాత 1955లో పార్వతీశకవి మరణించగా (శ్రీ) వేంకటరావు జంట కవి వియోగము సహింపలేక అనువాదము ప్రసక్తి మరల తలపెట్ట లేదు. వీరు బాలకాండ– 1476 ప. అయోధ్య– 3405 ప. అరణ్య– 122. ప. కిష్కింధ– 1764 ప. సుందర– 554 ప. వ్రాసిరి. సుందర కాండ 17వ సర్గ 2వ పద్యమునుండి పార్వతీశకవి తనయులు అనువాద భారము చేపట్టిరి. జంటకవులు అరణ్యకాండ వ్రాయుసమయమున సాంసారిక క్లేశములు తటస్థించుటతో అంతతో విడిచిపెట్టిరి. సుందర కాండ 17వ సర్గలో తొలిపద్యము శరద్రాత్రివర్ణనతో వీరి ఆంధ్రీక రణ మాగిపోయెను.

క. తెలిగలువ గుత్తివలె ని
ర్మలుఁడగు శశియిపుడు గగనమధ్యగతుండై
వెలుఁగుచు నీలోదకమగు
చలువకొలని నడుమహంస చాడ్పున దోఁచెన్.

నన్నయ భారతాంధ్రీకరణమున శరద్రాత్రివర్ణనతో (అరణ్య– 4 ఆ. 1425) ముగిసెను. "శారదరాత్రులుజ్జ్వల..." అను పద్య ముతో నన్నయ రచన ఆగినట్లు వేంకట పార్వతీశ్వరుల రచనకు శర ద్వర్ణన విఘ్నకారి యయ్యెను. కిష్కింధకాండలో సుగ్రీవ పట్టాభి షేకానంతరము వర్షకాలము గతించువరకు రామలక్ష్మణులు ప్రస్ర వణశైలగుహాలలోనుండి శరత్సమయ మాసన్నమగుటతో సీతాన్వే షణకు కపివీరుల పంపించుటకై సుగ్రీవున కాజ్ఞ యొసగిరి. సుగ్రీవు నాజ్ఞపై నెల్లదిశలకేగిన కపులలో నాంజనేయుడు లంకానగరముచేర్చి

సీతాదేవిని వెదకుట సుందరకాండ 16వ సర్గలో కలదు. అప్పటికి సూర్యాస్తమయ మయ్యెను. 17వ సర్గ తొలుత చంద్రోదయవర్ణన కలదు. కనుక శరత్కాల చంద్రుడని వేంకటపార్వతీశ్వరకవులు పేర్కొనకున్నను నితడు శరత్కాల చంద్రుడే. ఈ శరచ్చంద్రుడు నన్నయ్యకువలె పార్వతీశకవికి; సూరుకుడగుట దైవయోగమని ప్రాజ్ఞులందురు.

గీ. లలిత వాల్మీకి కోకిలాలాప మహిమ
నవగతము చేసికొని కుశలవులమగుచు
నాలపింతు మూరామ సభాంగణమున
మధు మధురగీత కలన రామాయణంబు.

క. తేనిఁ గించితి మనిగాని
యనువాదము చేసినారమనిగానీ మే
మనమూముని నుడుల ప్రతి
ధ్వని మా యెడ నొదవి యిట్లు వాకొన వెడలెన్.

అని వీరు కుశలవులమని సగర్వముగా ముందు పల్కియు, రెండవపద్యమున వాల్మీకి నుడుల ప్రతిధ్వని తమనుండి వెలువడెనని వినయముతో విన్నవించిరి. వాల్మీకిరామాయణమే కుశలవులు గానము చేసిరి గనుక వారే తామని రెండవపద్యములో ధ్వనింపజేసి ఈ కవికోకిలలు గడుసుదనము చూపిరి.

ఆంధ్రీకరణము : అముద్రితమైన ఈ రామాయణాంధ్రీకరణమునుగూర్చి కొంత పరికింతము. దశరథుడు పుత్రకామేష్టి చేసి, పాయసాన్నమును సతులకు పంచుటలో వివిధకవులు వాల్మీకిని భిన్నార్థములలో గ్రహించిరి.

శ్లో॥ కౌసల్యాయై నరపతిః పాయసార్థం దదౌ తదా।
అర్థాదర్థం దదౌ చాఽపి సుమిత్రాయై నరాధిపః॥

శ్లో॥ కైకేయ్యై చాఽవశిష్టార్ధం దదౌ పుత్రార్థకారణాత్।
ప్రదదౌ చాఽవశిష్టార్ధం పాయసస్యామృతోపమమ్॥

శ్లో॥ అనుజంచ సుమిత్రాయై పునరేవ మహామతిః।
ఏవం తాసాం దదౌ రాజా భార్యాణాం పాయసం పృథక్॥

దశరథుడు ప్రాజాపత్యపురుషు డిచ్చిన పాయసము రెండు భాగములు చేసి, ఒకభాగము కౌసల్యకు, రెండవభాగములో సగము సుమిత్రకు నొసగి, మిగిలిన సగభాగము మరల రెండు భాగములు చేసి ఒకదానిని కైకకు, రెండవభాగము మరల సుమిత్రకు నిచ్చె నని వాల్మీకి వ్రాసెను. రెండవశ్లోకములో "అవశిష్టార్ధం" అను పదవిభాగమునుగూర్చి తర్జనభర్జనలు జరిగెను. ఆ పదమునకు మిగిలిన అర్ధభాగమని యర్థము చెప్పిన (అవశిష్టమైన అర్ధభాగము), ఆ భాగము, దశరథుడు కైక కిచ్చిన, మరల సుమిత్ర కెట్లివ్వగలిగెను? అను సంశయము కలుగును. భాస్కరరామాయణకర్తయు నీ సంశయముతోడనే వాల్మీకిశ్లోకము తెలిగించుపట్లు అవశిష్టార్థము కైక కిచ్చి, మిగిలినది మరల సుమిత్ర కిచ్చెనని వ్రాసి యూరకుండెను. సంస్కృత కవులు భోజకాళిదాసు లిర్వురు తమ కావ్యములలో పాయసవిభాగమున క్రొత్తత్రోవ త్రొక్కిరి.

భోజుడు : శ్లో॥ కౌసల్యాయై ప్రథమ మదిశద్భూపతిః పాయసార్ధం
ప్రాదాదర్ధం ప్రణయమధురం కేకయేంద్రస్యపుత్ర్యై।
ఏతేదేవ్యౌ తరళమనసః పత్యురాలోచ్య భావం।
స్వార్ధాంశాభ్యాన్వయ మకురుతాం పూర్ణకామాం
సుమిత్రా॥

"చరోరర్ధార్థ భాగాభ్యాః తామయోజయతామునే" అని కాని కాళిదాసు వ్రాసినదానినిబట్టి, దశరథుడు పాయసము రెండు భాగములుచేసి కౌసల్యా కైకలకు చెరియొకభాగ మీయగా వారిద్దరు

తమ భాగములనుండి చెరికొంత పాయసము సుమిత్రకిచ్చిరని స్పష్టమగుచున్నది. ఆంధ్రకుశలవులు "అవశిష్టార్ధం" అను వాల్మీకి వాక్యము చక్కగా నవగతము చేసికొని "అవశిష్టమందలి అర్ధభాగము" అను భావము వ్యక్తముచేసిరి.

సీ. ఆ పంక్తిరథుఁడు పాయసము విభాగించి
సగపాలు ముందు కౌసల్యకొసఁగి
మిగులు నర్ధమున సుమిత్రకు సగమిచ్చి
కడమభాగము కైక కిడదలంచి
మది సమాలోచించి యది సగంబుగ జేసి
కైకేయి కొక్కభాగం బొసంగి
యవశిష్టమగు పాయసాన్నంబు క్రమ్మర
పాత్రయుక్తముగ సుమిత్రకిచ్చె.

ఇట్లు కవిరాజహంస లా వాల్మీకి కోకిలాలాపమాధుర్యము నర్థవంతముగ రసజ్ఞులకందించిరి.

**వాల్మీకి పదప్రయోగము యథాతథముగ స్వీకరించుట :**

రామలక్ష్మణుల సౌభ్రాత్రము వర్ణనలో "బాల్యాత్ప్రభృతి సుస్నిగ్ధో లక్ష్మణో లక్ష్మివర్ధనః" అను వాల్మీకి ప్రయోగములో 'లక్ష్మివర్ధన' అను పదము వీరు యథాతథముగా నుపయోగించిరి.

ఆ.వె. చిన్నతనము నుండి యన్న రామునకు లో
కాభిరామునకుఁ బ్రియాప్తుఁ డగుచు
సతత సన్నిధాన సంతృప్తుఁ డగుచుండె
లక్ష్మివర్ధనుండు లక్ష్మణుండు.

ఈ పదానుకరణము తెలుఁగున నిసర్గముగా స్ఫురింపజేసిన కవిరాజహంసల ప్రతిభ కొనియాడదగినది.

**భావానువాదము :** వాల్మీకి శ్లోకార్థమెంత భావార్థసంపన్నమో లలితకవుల యనువాదమంత లలితభావ సంపన్నము.

శ్లో॥ యథాహి వాయ మారుతో మృగయూం యాతి రాఘవః
అద్వైవం పృష్ఠతోఽభ్యేతి సధనుః పరిపాలయన్॥

కం. ఆరామమూర్తి వరతుర
గారూఢుం డగుచుచు వేట కరుగునెడ ధను
ర్ధారియయి భద్రమతి నను
చారియగుచు లక్ష్మణుండు చను వెనువెంటన్.

**భావస్వాతంత్ర్యము** : ఈ రామాయణము యథా వాల్మీకమయ్యు కవులు భావస్వాతంత్ర్యము వహించుట కొన్నియెడల కానవగును.

శ్లో॥ తేషాం కేతురివ జ్యేష్ఠో రామో రతికరః పితుః
బభూవ భూయో భూతానాం స్వయంభూరివ సమ్మతః.

అను శ్లోకములో "పితుః రతికరః" అను దళమునెత్తుకొని వీరు తెలుఁగు జాతీయత స్ఫురించునట్లు చిన్న వ్యాఖ్యానమువలె రచించి మూలమునకు వన్నెపెట్టిరి.

గీ॥ తనయులం దగ్రజుఁడు కులధ్వజనిభుండు
ప్రేమమయమూర్తి యైన శ్రీరామునందె
తండ్రిప్రాణపంచకమును దవిలియుండె
యాస్వయంభువు నందె భూతాళియట్లు.

ఇట్లు స్వేచ్ఛానువాదము చేయుటవలన వీరి రామాయణము మనోజ్ఞమై యలరుచున్నది.

**మూలమునకు ప్రతిబింబమనదగినరచన** : వాల్మీకమునకు ప్రతిబింబముగా రచియించిన సన్నివేశములలో అహల్యా వృత్తాంత మొకటి. ఇట్టి తావులందు కొన్ని గ్రంథానువాదములు 'మక్కికి మక్కి' యనునట్లుండి కృతకముగా తోచును. వేంకట పార్వతీశ్వరుల యనువాదమట్లుగాక తెలుగుపద్యమే మాతృక యనిపింపజేయును.

శ్లో॥ మునివేషం సహస్రాక్షం విజ్ఞాయ రఘునందన।
మతిం చకార దుర్మేధా దేవరాజ కుతూహలాత్॥

గీ॥ అతఁడు మునివేషియగు నింద్రుఁడని గ్రహించి
దుర్మతి యహల్యయపుడు కుతూహలమున
నమరవిభుఁడు లభించెగదా యటంచు
నన్యమెంచక యతని పొందాసఁజేసె.

అట్లే గౌతమునిశాపము సహజముగానుండి మూలమునకు ప్రతిబింబమువోలె నొప్పుచున్నది. – మూలమందలి రెండు శ్లోకముల భావము నొక్క యాటవెలఁదిలో పొదిగి కవులు అల్పాక్షరములలో ననల్పార్థరచన చూపిరి.

ఆ.వె. అపు డహల్యగాంచి యమహాత్ముని శపియించె
యిందె వేలకొలఁది యేండ్లదాక
తిండిలేక గాలిఁ దిని బూదిలో బండి
యొరులకంటఁ బడకయుండుఁ గాక.

ఇట్లే మూలమున మూడనుష్టుప్పుల భావము నొక సీసపద్యమున రమ్యముగా మలచుట గ్రహింపవచ్చును.

సీ. విమల తపః ప్రభావిలసిత యగుదాని
నవఘ మహాభాగయైన దాని
దేవదానవ లోకదృష్టి కందనిదాని
నజసృష్టిఁ బ్రత్యేకమైన దాని
దివ్యమోహన రూపదీపిత యగుదానిఁ
బొగనున్న శుచికీలఁ బోలుదాని
ఘనహిమావృత శశికళలీల గనుదాని
జలగతార్క ప్రభ వెలుఁగుదాని

నచలభక్తి పరాయణ యైనదాని
నాత్మవిజ్ఞాన సంపన్న యైనదాని
నాయహల్యను గౌతమార్ధాంగి నప్పు
డామహాశ్రమమున గాంచె రామవిభుఁడు.

మూలవిశేషణములతో తృప్తిచెందక "అచల భక్తపరాయణ ఆత్మ విజ్ఞాన సంపన్న" అని మరిరెండు విశేషణములు వేసి అహల్యలో కలిగిన పరివర్తనను స్పష్టీకరించినారు వేంకట పార్వతీశ్వరకవులు. గౌతమాశ్రమముననే అదృశ్య రూపమున నుండునట్లు అహల్య శపింపబడెను. ఆశ్రమమున శ్రీరాముడు అడుగుపెట్టినప్పుడు శాపవిమోచనమగునని గౌతముడు తెల్పెను. వాల్మీకమున, భోజుని చంపువున అహల్యను శిలవగుమని గౌతముడు శపించలేదు. భోజుడు "భార్యామదృశ్యాం చ మునిశ్చ కార" అని చెప్పి, రామచరణ రజము సోకినంత అహల్యకు శాప విమోచన మగునని వ్రాసెను. గోపీనాథ రామాయణమందు "ప్రభాతజ భూరి రజః పరీతవై పాయుక పెక్కువర్షంబులుండుమ"నెను. అధ్యాత్మరామాయణము, రఘువంశము, అనర్ఘరాఘవము, విశ్వగుణాదర్శము, భాస్కరరామాయణము, రామాభ్యుదయము మున్నగు కావ్యములలో మాత్రము అహల్య శిలయగునట్లు శపింపబడెను. జనశ్రుతియందు నిట్టిశాప మహల్యకు గలదు. ఆదికావ్యమున లేని ఈ విషయమిన్నిగ్రంథములలో చోటు చేసికొనుటకు కల్పాంతర భేదమేనని భావింపవచ్చును. రావణ కుంభకర్ణులు రామునిచే హతులైనట్లు వాల్మీకమున నుండగా, రావణుడు రామునిచేత, కుంభకర్ణుడు లక్ష్మణునిచేతను హతులైరని భారతారణ్య పర్వశేషమున గల రామకథలో చెప్పబడెను. నీలకంఠపండితు డీ విషయము పరిశీలించి తన వ్యాఖ్యానమున 'కల్పాంతర భేదమున నిట్టి మార్పు జరిగె

సని ఇరుపక్షములను సమర్థించెను. అహల్యాశాపము నిట్లే యూహింప వీలగుచున్నది.

ఇక మన లలితకవులు, కవిరాజహంసలు నగు శ్రీ వేంకట పార్వతీశ్వరకవులు అద్దములో ప్రతిబింబమువలె వాల్మీకమును లలితమైన శైలిలో తెనుఁగున కనువదించిరనుట సువ్యక్తము. వీరి రామాయణామృతము నాస్వాదించు భాగ్యము సహృదయ రసజ్ఞులకు కల్గకుండుటకు కారణమిది యముద్రితమగుటయే. వేంకట పార్వతీశ్వరుల రామాయణశేషము వోలేటిఅచ్యుతరామచంద్రమూర్తిగారు వారితో సమానమైన శైలిలో పూర్తిచేయుటయందు కృతార్థులైనను నిన్నటి దాక హార్దికార్థికాభావమున ముద్రింపబడకపోవుటయే. ఇటీవల నీ మహత్తరగ్రంథము ముద్రించుటకు శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారు బాధ్యత వహించిరని వినుట ఆనందదాయకము. కాని యింత దనుక ముద్రణ ప్రారంభింపకుండుట శోచనీయము. సత్వర మీ గ్రంథము ముద్రితమై సహృదయోల్లాసకారియగు గాక యని యాశించుచున్నాను.

**ముక్తధార :** విశ్వకవి రవీంద్రనాథఠాకూరు 'ముక్తధార'ను శ్రీ సి. వి. యస్. నారాయణదాసుగారు రచియించి, తమ ప్రియ మిత్రులు యువరాజులునైన శ్రీ గంగాధర రామారావుగారి కంకిత మిచ్చిరి. ఈనాటకము 1961లో విజయవాడ దేశీ ప్రెస్‌న ముద్రితమై, రవీంద్రగ్రంథమాలచేత ప్రకటింపబడెను. నాటక కర్త 5-3-1911లో పిఠాపురమున జన్మించి, మదరాసులో **M. A. L. T.** వరకూ విద్యనభ్యసించి కాకినాడ శ్రీ పీఠికాపురాధీశ ప్రభుత్వోన్నత పాఠశాలలో నుపాధ్యాయులుగా నుద్యోగించి కాకినాడలో ప్రస్తుతము విశ్రాంతి గైకొనుచుండిరి. వీరుటాల్‌స్టాయ్ **Live Cropse**ను అనువదించిరి, అనసూయ మాసపత్రికలో ముద్రింపబడిన 'కళాభి

మానం', 'భగ్నహృదయాలు', 'ప్రేమ బలం'- అను నాటికలు నారాయణదాసుగారి స్వీయరచనలు.

కథ : హిమాలయ ప్రాంత ఉత్తరకూట రాజ్యాధిపతి రణజిత్తు. ఈతని 'ఇంజనీరు' విభూతి తన ఉక్కు యంత్రశక్తితో ముక్త ధారావాహినికొక ఆనకట్ట నిర్మించెను. ఈ నిర్మాణమున నసేకులు మరణించిరి. అంబపుత్రుడు సుమనుని ఆనకట్టవద్ద పనిచేయుటకు విభూతి మనుష్యులు బలవంతముగా కొనిపోయిరి. అతడక్కడ మరణించగా తల్లి అంబ విలపించెను. ఈ యానకట్టవలన శివతరాయి గ్రామప్రజలకు ముక్తధార నదినుండి వచ్చు నీరు ఆగిపోవును. ఉత్తరకూట యువరాజు అభిజిత్తు శివతరాయి ప్రజల శ్రేయస్సు కోరి, ఆనకట్ట పడగొట్టుమని విభూతి నాజ్ఞాపించెను. తన యాజ్ఞ నమలుజరుపనియెడల తానే ఆపని చేయగలనని అభిజిత్తు వార్త పంపెను. కాని విభూతి కావించిన అద్భుత కట్టడమున కానందించి ఉత్తరకూటవాసు లతనిని భుజములపై శివాలయమునకు తీసికొని పోవుదురు.

రాజు పినతండ్రి విశ్వజిత్తువలన అభిజిత్తు తాను రాజపుత్రుడను కానని, ముక్తధారప్రాంతమున దొరికిన తనను రణజిత్తు పెంచుచుండెనని తెలిసికొనెను. రణజిత్తు పుత్రుడైన అభిజిత్తును శివతరాయి పాలకునిగా నియమించెను. అభిజిత్తు జాలిగుండె వాడగుట ప్రజల నుండి బలవంతముగా పన్నులు వసూలు చేయకుండెను. రెండు సంవత్సరములనుండి ఈ గ్రామప్రజలనుండి పన్నులు బకాయి పడెను. విదేశములతో ఉన్నివర్తకము చేయుటకు వీలులేకుండ శివతరాయికి నందికనుమరోడ్డు మూసివేయబడియుండెను. అభిజిత్తు తన ప్రజల రక్షణార్థ మాకనుమను తెరచెను. దీనివలన ఉత్తరకూటమున ఆహార

పదార్థముల వస్త్రముల ధరలు పెరిగెను. కారణము గ్రహించిన రణజిత్తు కుమారుని శివతరాయినుండి ఉత్తర కూటమునకు రప్పించెను. ముక్త ధారకు కట్టిన ఆనకట్టవలన తన శత్రువులైన శివతరాయి వాసులణచి వేయబడిరని రణజిత్తు సంతోషించి విభూతి గౌరవార్థము వేడుకలు జరిపించుచుండెను. ఆ వేడుకలలో విద్యార్థులు ఉపాధ్యాయులు పాల్గొందురు. శివతరాయి ప్రజలు దుర్మార్గులు కనుక వారికి త్రాగుటకు నీరులేకుండ విభూతి ఆనకట్ట కట్టెనని విద్యార్థులు భావించుచుండిరి. శివాలయ గోపురముకంటె యంత్రశిఖరమెత్తుగా ధిక్కరించినట్లుండుట రణజిత్తునకు నచ్చలేదు.

యువరాజు అభిజిత్తు కుమారునితో నాట్యముచేయు ముక్త ధారచరణముల నినుపసంకెళ్ళతో విభూతి బంధించినట్లు తన జీవిత ప్రవాహమునుకూడ ఉత్తరకూట సింహాసనము బంధించెనని, దాని సత్వమున్నచోట తనకు విశ్రాంతి లేదని సోదరుడు సంజయ కుమారునితో చెప్పెను. ఆ బంధమునుండి విముక్తుడగుట కతడు యత్నించెను.

ఉత్తరకూట సేనాధిపతి విజయపాలుడు రాజాజ్ఞపై యువ రాజును కుటీరమందు బంధింపగా నుత్తరకూట ప్రజలానందింతురు.

శివతరాయి ప్రజలు, శివతరాయి బైరాగి ధనంజయునికడకు వచ్చి రాజు చండపాలుడు తమను కొట్టెననియు, తామాతని తిరిగి కొట్టుదుమనియు చెప్పిరి. ధనంజయుడు వారిని వారించి ఇతరులను బాధించుకోరిక తనకు లేకపోవుటచేత రాజనిన తనకు భయము లేద నియు, ద్వేషించువారినే భయము పీడించుననియు చెప్పెను. మరియు నాతడు భగవంతుడు శివతరాయి ప్రజలకిచ్చిన ప్రజా ప్రభుత్వపు హక్కు రాజు నిరాకరించినచో రాజునే తొలగించి, రాజు దౌర్జన్యము నంతరింప జేయవలెనని ప్రజలకు బోధించెను. శివతరాయి పౌరుడొక

డు త్తరకూటమువారు శివతరాయణుల శరీరముల నాయుధముల తోడను, ఆత్మలను గ్రంథములతోడను జంపుదురనెను. శివతరాయణులు యువరాజును తిరిగి శివతరాయికి పంపవలసినదిగా రాజునడుగ, నతడు నిరాకరించెను. శివతరాయణులు పన్నులు కట్టరని ధనంజయుడు రాజుతో చెప్పగా రాజా తనిని బంధించెను.

యువరాజభిజిత్తు తాను తన దానియగు ముక్తధారకు బంధ విముక్తి కలిగింతునని విశ్వజిత్తుతో చెప్పెను. రాజుపహారావాడగు నుద్ధవుడు, తాను విశ్వజిత్తునకిచ్చిన మాటప్రకారము వంటగుడారమునకు నిప్పంటించిన సమయమున, అభిజిత్తు ధనంజయులను విడిచిపెట్టెను. అభిజిత్తును తిరిగి బంధించుటలో నాలస్యమగుటవలన నుత్తరకూటప్రజలు కుపితులై, తామే యువరాజును శిక్షింప నుద్యుక్తులగుదురు. అభిజిత్తును శివతరాయిరాజుగా చేసికొనుట కతని వెదకికొనుచు శివతరాయణులు బయలుదేరుదురు. ఉత్తరకూట ప్రజలు యువరాజు నేమిచేయుదురోయని రాజు భయమందెను.

అభిజిత్తు ఆనకట్టకున్న పగులుద్వారా దానిని పగులకొట్టి, ముక్తధార బంధములు విడగొట్టెను. ముక్తధార స్వేచ్ఛతో అభిజిత్తు స్వేచ్ఛపొందును. ముక్తధారా ప్రవాహమున నాతనిశరీరము కొట్టుకొనిపోయెను. కన్నతల్లివలె ముక్తధార అభిజిత్తును తన యొడియందుంచుకొని సాగిపోయెను.

ఈ విషాదాంతనాటక మాధునిక పద్ధతిలో వ్రాయబడెను. దీనియందు నాందీప్రస్తావనలుగాని, భరతవాక్యముగాని లేవు. అంక విభజనలేదు. నాటకమంతయు నొకే రంగమున వ్రాయబడియుండుట యొక విశిష్టత. వివిధ పాత్రలు రంగము మీదికి వచ్చుచు పోవుచుండును,

ఈ నాటకమంతయు వ్యావహారిక భాషయందు వ్రాయబడెను. రచయిత రవీంద్రుని గీతములను వచనములోని కనువదింపగా, వారిమిత్రులు, వాగ్గేయ కారులునగు శ్రీ పాలెపు వెంకటరత్నం గారు వానికి గేయకల్పన మొనరించిరి.

ఈ నాటకమును రవీంద్రుడు నాటి భారతదేశ పరిస్థితులను దృష్టియందుంచుకొని రచించెను.

బ్రిటిషువారు నిరంకుశులై భారతదేశము నార్థికముగా, రాజకీయముగా పీడించుట దృష్టియందుంచుకొని, రవీంద్రుడు, ఉత్తరకూటరాజు శివతరాయి ప్రజలను పీడించినట్లు వ్రాసెను. శివతరాయి బైరాగి ధనంజయునిపాత్ర గాంధీమహాత్ము నుద్దేశించి చిత్రింపబడెను. గాంధీమహాత్ముడు భారతీయులకు బోధించినట్లుగ, ధనంజయుడు శివతరాయణులకు దేవుని యెడల నచంచలమగు విశ్వాసము, అహింసలను బోధించెను.

## ఉపసంహృతి

పిఠాపుర సంస్థానమున వర్ధిల్లిన విస్తృతమైన సాహిత్యము గూర్చి నేను పరిశ్రమించి పరిశోధనచేయుటకు, నాజన్మస్థలముపైగల అభిమానము, ఆ ప్రభువులయందుగల గౌరవభావము ముఖ్యకారణములు. ఆ కారణములవలననే నేను, ఎడనెడ ఆరోగ్యము భంగమగుచు వచ్చినను, లక్ష్యపెట్టక నిరంతరముగా కృషిసాగించి పరిశోధన వ్యాసమును పూర్తి చేసితిని. ఈ విధముగా నాజన్మస్థలమునందు పీఠపుర ప్రభువులయందుగల భక్తి ప్రపత్తులను వ్యక్తము చేసికొంటిని. ఈ నాకృషిఫలముయొక్క గుణదోష నిర్ణయమున సహృదయ విద్వాంసులే ప్రమాణములు.

# ఉపయుక్త గ్రంథ సూచి

తెలుగు గ్రంథములు :


1. అష్టమహిషీ కల్యాణము
2. ఆంధ్రకవుల చరిత్ర
3. ఆంధ్రకవి తరంగిణి
4. ఆంధ్రపురాణము
5. ఆంధ్రమహాభాగవతము
6. ఆంధ్రమహాభారతము
7. ఆంధ్ర రచయితలు
8. ఆంధ్ర రచయిత్రులు
9. ఆంధ్ర సంస్థానములు-సాహిత్యసేవ
10. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలు
11. కథలు - గాథలు
12. కవి జీవితములు
13. కవి సంశయవిచ్ఛేదము
14. చామర్లకోట కైఫీయతు
15. దోమాడ యుద్ధము
16. ధర్మఖండము
17. నారదీయ పురాణము
18. నృసింహపురాణము
19. పాండురంగమాహాత్మ్యము
20. పానుగంటి కృతి సమీక్ష
21. పిఠాపురం కైఫీయతు
22. పిఠాపుర సంస్థాన చరిత్ర

23. పీఠికాపుర సంస్థానపు దావా 'రికార్డు' సంగ్రహము
24. బసవ పురాణము
25. బాలవ్యాకరణము
26. భాస్కరరామాయణము
27. భీమఖండము
28. ముకుందవిలాసము
29. విష్ణుమాయా విలాసము
30. వృషాధిప శతకము
31. శాసనపద్య మంజరి
32. శ్రీకాళహస్తీశ్వర మాహాత్మ్యము
33. శ్రీ రాణీ రావు జగ్గమాంబ చరిత్ర
34. శ్రీ రావు వంశచరిత్ర తిలక
35. సారంగధర చరిత్ర

## సంస్కృతగ్రంథములు :

1. అధ్యాత్మరామాయణము
2. అనర్ఘ రాఘవమ్
3. ఆంధ్రశబ్ద చింతామణి
4. బ్రహ్మపురాణమ్
5. బ్రహ్మకైవర్తపురాణమ్
6. భోజ రామాయణమ్
7. రఘువంశమ్
8. వాల్మీకి రామాయణమ్
9. విశ్వగుణాదర్శమ్
10. శ్రీ పీఠికాపుర క్షేత్ర మాహాత్మ్యమ్ (స్థలపురాణమ్)

## ఆంగ్ల గ్రంథములు :


1. A History of the early Dynasties of Andhra Desa
2. Andhra Pradesh Government Archaelogical series
3. Epigraphia Indica Volumes
4. Godavari District Gazeteer
5. The Historical Account of the Honourable Rajahs of Pithapūr
6. Indian Antiuary
7. Jatakas


## దర్శించిన గ్రంథాలయములు

### పిఠాపురం :

1. శ్రీ సూర్యరాయ విద్యానంద పుస్తకభాండాగారము
2. ఆర్. ఆర్. బిహెచ్. ఆర్. ఉన్నత పాఠశాలా గ్రంథాలయము.
3. మహారాజావారి స్వీయగ్రంథాలయము
4. శ్రీ దాసరి లక్ష్మణకవిగారి స్వీయగ్రంథాలయము

### కాకినాడ :

5. ఆంధ్రసాహిత్య పరిషద్గ్రంథాలయము
6. కె. ఆర్. వి. కె. లైబ్రరీ
7. పి. ఆర్. కాలేజి లైబ్రరీ
8. పి. ఆర్. సి. స్కూలు లైబ్రరీ

### మద్రాసు

9. ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము

## తిరుపతి

10. ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము
(శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము)

## హైదరాబాద్

11. శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయము
12. స్టేట్ ఆర్కైవ్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయము
13. ఉస్మానియా విశ్వవిద్యాలయ గ్రంథాలయము
14. లైబ్రరీ - డైరెక్టర్ ఆఫ్ ఆర్కియాలజీ

## విశాఖపట్టణం

15. ఆంధ్ర విశ్వవిద్యాలయ గ్రంథాలయము.



# పిఠాపుర సంస్థానము నేలిన రావు వంశీయులు

తెనుగురావు

|

రామచంద్రారావు

(పీఠికాపుర సంస్థాన పీఠమధిష్ఠించిన మొదటి రావు వంశీయుడు)

1647 – 1671

|

కృష్ణారావు

(రామచంద్రారావు తమ్ముడు)

|

పెద మాధవరావు

(రామచంద్రారావు కుమారుడు)

|

నరసింహా రావు

(పెదమాధవరావు తమ్ముడు)

|

వెంకటరావు

|

వెంకట కృష్ణారావు

(మొదటి మాధవరావు పుత్రుని పుత్రుడు)

|

చిన మాధవరావు

(9వ తరములో నీలాద్రిరాయని పుత్రుడు బుచ్చన్న కుమారుడు)

|

పెద మహీపతిరావు

|

|

నీలాద్రిరావు

(చిన మాధవరావు పెదతండ్రి నరసన్న పుత్రుడు)

|

పెద వెంకట రావు

|

బుచ్చి వెంకట రావు

(పెద వెంకట రావు తమ్ముడు)

|

కుమార వెంకట మహీపతి రావు

(పెద వెంకటరావు పుత్రుడు

|

వేంకట నీలాద్రిరావు

(బుచ్చి వెంకటరాయని పుత్రుడు)

|

వేంకట సూర్యారావు

|

వేంకట మహీపతి గంగాధర రామారావు

|

వేంకట కుమార మహీపతి సూర్యారావు

1907 – 1948

